# ప్రసిద్ధి బోధ




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org





# ప్రసిద్ధి బోధ


రచయిత

**త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (82) దశ అష్టాధిక గ్రంథకర్త**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

## శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-38 ప్రథమ ముద్రణ : నవంబర్-2016

ప్రతులు : 1000 **వెల : 500/-**



త్రైత సిద్ధాంతం

www.thraithashakam.org

## 02 యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

### "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

త్రైతశకం

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
71) లు అంటే ఏమిటి? (తెలుగు)
72) ఆదిత్య.
73) చెట్టుముందా! విత్తుముందా?
74) ఒక్కడే ఇద్దరు.
75) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
76) దేవుని రాకకు ఇది సమయము కాదా!
77) సాయిబాబా దేవుడా! కాదా?
78) విశ్వ విద్యాలయము
79) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
80) గీటురాయి
81) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు
82) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు
83) భావము-భాష
84) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ
85) పరిశోధన-నిరూపణ
86) హిందూమతములోనే కులవివక్ష
87) దేవుని చిహ్నము (రెండవ భాగము)
88) యోహాను సువార్త (సమగ్రం)
**89) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**90) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**91) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**92) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**

# ఇతర సంఘముల ప్రచురణలు

## ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

## సువార్త క్రైస్తవ సంఘం

1. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
2. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము.
3. పాప క్షమాపణ ఎలా కలదు?
4. ముందు చూపు.

## రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (జ్ఞాన ధన శతకము)
5. బెర్మూడా ట్రయాంగిల్-సైంటిస్ట్‌లకు సవాల్
6. ట్విన్ టవర్స్ (9/11) ట్రూత్
7. తెలుగు-వెలుగు

## ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. త్రైత సిద్ధాంతము.

***DVD'S***

62. కర్మ లేని కృష్ణుడు–
కర్మ ఉన్న కృష్ణుడు.
63. సహజ మరణం–
తాత్కాలిక మరణం.
64. స్త్రీ–పు / లింగము.
65. దేశం మోసం–దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం–
రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు–
అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు–రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ – నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము–ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ–దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు–ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు–ఆరు–తొమ్మిది.
89. 6–3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి–భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము–అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి–శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము – బోధ.
110. ఆట – దోబూచులాట.
111. ప్రజలు – మానవులు.
112. ఆస్తి – దోస్తి.
113. దంతము–అంతము.
114. మాయ మర్మము– ఆత్మ ధర్మము
115. శ్రీకృష్ణుడు
చనిపోయాడా? చంపబడ్డాడా?
116. అంతిమ గ్రంథములో
ప్రథమ వాక్యములు.
117. అదురు–బెదురు.
118. శవము–శివము
119. ఆధ్యాత్మిక ప్రశ్నలు – జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

www.thraithashakam.org

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్స్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘుడియం. పెద్దరెడ్డి (ప్ర.సభ్యుడు)**
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా)
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

www.thraithashakam.org

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:7680065963, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది. త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము, పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు. త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది. త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి. త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము. త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు. త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి. అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము తెలియదు.

త్రైత శకం

# విషయ సూచిక



www.thraithashakam.org

## విషయ సూచిక



www.thraithashakam.org

# 1. ఆత్మకు వెంట్రుక గుర్తు

తేది : 16.02.2007

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవయే ప్రపద్యంతే మాయా మేతాం తరన్తితే ॥

**"ఈ భూమి మీద నేను రచించి పెట్టినటువంటి, అనగా నేను తయారుచేసి పెట్టినటువంటి మాయను దాటాలంటే చాలా కష్టము. కావున ఎవడైతే నన్ను శరణువేడునో వాడు నా మాయను తొందరగా దాటి పోగలడు".** మరి మాయను ఎవరూ దాటలేనంతగా ఎందుకున్నదంటే, ఆ మాయను నేను సృష్ఠించితిని కనుక దానికంత బలమున్నది. దానికి అలా నడవమని చెప్పినది నేనే! కానీ నేను చెప్పినట్లు విని నడుచుకొని శరణు వేడితే, నా మాయ నిన్ను విడిచిపెట్టును. తద్వారా నీవు మాయనుండి తప్పించుకొని నన్నే చేరగలవు అని దేవుడన్నాడు.

పరమాత్మయే మాయను నిర్మించాడు. అయితే మాయను దాటే విధానాన్ని కూడా వివరించాడు, కానీ అది ఎవ్వరికీ అర్థము కాలేదు. నీవు నెలలో ఒకరోజు దేవుని పని చేసి, మిగతా 29 రోజులు అలా చేయక పోతే నీవు మాయలో ఉన్నట్లే, మాయ నిన్ను పరీక్షించును. నీకు దేవుని మీద ఎంత శ్రద్ధయుందో తెలుసుకోవడం దాని ఉద్దేశ్యము. ఈ మాయ ఎక్కడ ఉంది? అంటే మన శరీరములోనే, మన తలలో గుణముల రూపములో ఉన్నది. అందుకే శ్రీకృష్ణుడు **"గుణమయి మమమాయా"** అన్నాడు. కనుక మాయను గూర్చి పూర్తిగా ముందు తెలుసుకోవలెను. లేనిచో ఏమగును? మాయ పెట్టిన పరీక్షలో ఓడిపోయి, దేవుని మార్గము నుండి ప్రక్కకు పోయే అవకాశము ఉన్నది. దేవుని నుండి ఏ విధముగా అయితే మాయ వచ్చినదో, అలాగే దేవుని నుండే ఆత్మ అనునది కూడా

వచ్చి, నీ శరీరములో అన్నింటినీ కదిలిస్తూ, పనులు చేయుచున్నది. ఆ ఆత్మను ఆధారము చేసుకొని జీవులమైన మనమంతా బ్రతకగలుగుచున్నాము. మాయ, గుణముల రూపములో జ్ఞాపకముల రూపములో వస్తూ ఉన్నది. అదే విధముగా మాయకు ధీటుగా మన శరీరములో ఇంకొకటి ఉంది, దానినే ఆత్మ అందురు. అదే నీ శరీరములో దేవుడు. అతనే సూర్యుడు ప్రపంచమంతా ఆవహించి ప్రకాశింపజేసినట్లు, ఆత్మయొక్క శక్తి శరీరమంతా వ్యాపించి శరీరాన్ని కదిలించి, నీ కర్మానుసారము పనులు చేయుచున్నది.

ఇప్పుడు మనము మాట్లాడుచున్నామంటే ఎవరి శక్తి వలన జరుగు చున్నది? ఆత్మశక్తి వలననే, నేనిప్పుడు చేయిని ఎత్తుచున్నానంటే, ఎవరి శక్తి వలన జరుగుచున్నది? ఆత్మశక్తి వలననే. ఈ విధముగా మన శరీరములో ఆత్మశక్తి లేకుండా ఏ పని చేయుటకు వీలుపడదు. మన శరీరములో ఏ అవయవమందైనా ఆత్మశక్తి పని చేయకపోతే ఆ శరీరము పని చేయక ఆగిపోవును.

అదే విధముగా ఒక తేలు కనిపించిందంటే ఆ విధముగా కనిపింప జేయుటకు నీకు కన్ను అవసరమైనది. దానిని కొట్టాలంటే, కర్రను తీసుకు నేందుకు చేయి అవసరమైనది. అదే విధముగా ఆ తేలు వేగంగా పోతూ ఉంటే, నీవు దానివెనుక పరుగెత్తేందుకు కాళ్ళు అవసరమైనవి. ఈ విధంగా ఎవరు చేశారు? నీ లోపలున్న ఆత్మశక్తి సహకరిస్తేనే నీవు చూడగలిగావు, కర్రను తీసుకోగలిగావు, పరుగెత్తగలిగావు.

ఇప్పుడు ఒక వ్యక్తి ఏ పనైనా చేయాలంటే ఐదు జ్ఞానేంద్రియములైన కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము మరియు ఐదు కర్మేంద్రియములైన కాళ్ళు, చేతులు, నోరు, గుదము, గుహ్యముల యొక్క సహకారము అవసరము. కానీ అవి ఆ విధంగా వాటి పనిని నిర్వర్తించాలంటే మాత్రము

వాటికి శక్తి నిచ్చేది లోపలున్న ఆత్మశక్తియే. మన శరీరములో బయటకు కనిపించేవి ఈ పది భాగాలు మాత్రమే, కనుక దీనినే స్థూలశరీరము అందురు. ఆత్మ అనేది కష్టసుఖములకు అతీతముగా మరియు నిమిత్త మాత్రముగా ఉండి, కర్మానుసారము పని చేస్తూ ఉన్నది. మరి అనుభవించే వాడెవడంటే జీవాత్మ.

కానీ జీవాత్మవయిన నీవు ఆ విధముగా అన్నీ ఆత్మే చేయిస్తున్నదని భావిస్తున్నావా అంటే లేదు. అన్నింటికీ నేనే కారణం అని అనుకుంటున్నావు. కానీ లోపల ఆత్మ అనేది ఒకటుంది అని చెప్పేందుకు శరీరముపైన గుర్తుంది, అది ఏమనగా! వెంట్రుక. మన శరీరములో ఈ వెంట్రుకలు ఆత్మకు గుర్తుగా ఉన్నవి. ఆత్మ అనేది కష్టసుఖములకు అతీతముగా ఉండునని చెప్పుకున్నాము కదా! కష్టసుఖములు అనుభవించువాడు జీవాత్మయేకానీ ఆత్మనైన నేను కాను అని తెలియజేసేందుకు నిరూపణగా, శరీరముపైన గుర్తుగానున్న వెంట్రుకలను కత్తిరించిననూ వాటికి నొప్పి మాత్రము లేదు. ఈ విషయము దేనికి సమాచారమై ఉన్నదని ఎవరయినా అడిగితే! ఆత్మ సమాచారమై ఉన్నదని చెప్పవచ్చును. అనగా ఈ ఆత్మ అనునది కష్టమునకు సుఖమునకు అతీతమై ఉన్నదనీ, మన శరీరముపై వెంట్రుకలు గుర్తుగా ఉన్నవని గట్టిగా చెప్పవచ్చును.

మరి ఇప్పుడు ఆత్మస్థానము మన శరీరములో ఎక్కడ ఉన్నది అనగా మన తలలో ఉన్నది. అక్కడ నుండి తనశక్తిని శరీరమంతా వ్యాపింప జేస్తున్నది. కనుక దాని నివాసస్థానం తల అని తెలిపేందుకుగాను, తలపైన వెంట్రుకలు ఎక్కువ జుట్టురూపములో కలవు. ఇది ఆత్మకు గుర్తు. అదే విధముగా ఆత్మ అనునది కష్టసుఖములకు అతీతముగా ఉందని తెలిపేందుకు గాను వాటిని మనం కత్తిరించినా, నొప్పిలేకుండా ఉన్నది. ఇప్పుడు

www.thraithashakam.org

మాయ అనేది ఒకటుందని చెప్పుకున్నాము కదా, మరి మాయస్థానం తలలోనే గుణరూపములో ఉన్నది. మాయ శరీరములో, తలలో ఉన్నది అనే విషయం మనం చేసే పనుల తీరు బట్టి మరియు గుణసమ్మేళనము పనినిబట్టి తెలియును. అనగా ఒక విషయము బయటపడిందీ అంటే దాని వెనుక గుణప్రభావం ఉన్నట్లే లెక్క, కానీ ఆత్మమాత్రము గుణములకు అతీతముగా ఉన్నది.

శరీరములో ఉన్న ఆత్మ పది ఇంద్రియములపైన దాని ప్రభావం చూపును అని మనము తెలుసుకున్నాము కదా! అనగా ఐదు జ్ఞానేంద్రియములపైన, ఐదు కర్మేంద్రియములపైన పనిచేస్తూ ఉన్నదని తెలిసినది. నీకు ఏదైనా వస్తువు కనిపించింది అంటే కన్ను ద్వారానే కనిపించాలి, కన్ను ఏ విధముగా చూడగలిగింది అనగా! ఆత్మ కన్నుకు ఆ శక్తినిచ్చింది కావున చూడగలిగింది, కనుక కన్ను ఆత్మశక్తి ద్వారానే చూడగల్గుతున్నదని ఎంతటి మూర్ఖునికైనా తెలిపే విధముగా కన్ను మీద వెంట్రుకలను రెప్పలపైన గుర్తుగా పెట్టడం జరిగింది.

అదే విధముగా కనుబొమ్మలపైన కూడా వెంట్రుకలు పెట్టి, ఆత్మ శక్తివలననే నీ కనులు చూడగల్గుతున్నవని తెలుసుకుంటావని లేకపోతే ఎవరైనా చెప్పినా, నీవు తెలుసుకోగలవని వెంట్రుకలను ఆత్మకు గుర్తుగా పెట్టడమైనది. ఈ విధముగా అందరి మనుష్యులకు కుల, మత, లింగ బేధములు లేకుండా ఉన్నదంటే, ఆత్మ అనేది అందరిలోనూ ఉన్నదని తెలిపేందుకు అందరిలోను కనులపైన, కనుబొమ్మలలో ఆత్మకు గుర్తుగా కల్గిన వెంట్రుకలను దేవుడు ఉంచెను.

అదే విధముగా వాసనను గ్రహిస్తున్న ముక్కులో కూడా వెంట్రుకలు ఉన్నవి. అనగా నీ ముక్కుకు వాసనను గ్రహించేశక్తిని కూడా ఆత్మే ఇస్తున్నదని

www.thraithashakam.org

తెలిపేందుకు ఆ విధముగా ముక్కులో వెంట్రుకలు ఆత్మకు గుర్తుగా పెట్టబడినవి. అదే విధముగా నాలుక పనిచేస్తున్నది ఆత్మ వలననే తెలిపే విధంగా మూతిమీద మీసాలుగా పెట్టాడు. అలాగే నోరు కూడా ఆత్మవలననే పనిచేస్తున్నదని గడ్డంమీద వెంట్రుకలున్నవి. వింటున్న చెవులు కూడా ఆత్మ వలననే వింటున్నవి కావున చెవుల మీద, చెవులప్రక్కన వెంట్రుకలు కలవు. అదే విధముగా చేయి పనిచేసేది ఆత్మవలననే అని తెలియుటకు చేయి క్రింది భాగమైన బాహుమూలలయందు (సంకలో) వెంట్రుకలు గలవు. అదే మిగతా కర్మేంద్రియములవద్ద కూడా ఆత్మ తన గుర్తులయిన వెంట్రుకలను పెట్టెను. ఈ విధముగా ఆత్మ అనునది కష్టసుఖ ద్వంద్వములకు అతీతముగా ఉన్నదని తెలియుటకు వాటిని కత్తిరించినా, అనగా వెంట్రుకలను కత్తిరించినా నొప్పిలేకుండా ఉండేటట్లు అమర్చబడినవి.

అందుకే వెంట్రుకను పెరికితే చర్మానికి నొప్పి వస్తుంది కానీ, కత్తిరిస్తే ఏ నొప్పిలేదు. మరి ఈ విషయములు ఎక్కడా చెప్పలేదే, ఏ గ్రంథములందు లేవంటే లేవు, కనకనే మేము క్రొత్తగా చెప్పవలసి వస్తున్నది. ఇటువంటి విషయమునే ఇంతకుముందు ఒకసారి చెప్పాము అదేమంటే, ఒక వ్యక్తి పూర్వము భక్తితో ఒక దేవాలయమునకు వెళ్ళి, నాలో ఏ కోరికలు లేవు, గుణములూ లేవు అని గుర్తింపుగా తలమీద వెంట్రుకలను గొరిగించెను, తలమీదవే ఎందుకు అంటే, తలలోనే కదా లెక్కలేనన్ని ఆలోచనలు, గుణముల రూపములో ఉన్నవి కనుక, ఆ విషయాల వాసనలు లేకుండా ఉంటానని, బాహ్యార్థంగా తలమీద వెంట్రుకలను గొరిగించి చూపించినాడు. అప్పుడు మాయ ఏమి చేసింది, ఆ రోజు ఆ వ్యక్తి జ్ఞానపరముగా ఆ పని చేస్తే, మాయ ఆ విషయమును బయటకు రానివ్వకుండా, ఈ రోజు కోరికలు నెరవేరిస్తే గుండు కొట్టిస్తాను అనే స్థాయికి దిగజారిపోయి, ఉండే కొంత

ఆత్మజ్ఞానము కూడా ఆత్మకు గుర్తయిన వెంట్రుకలను లేకుండా చేసుకొని, ఆత్మజ్ఞానము పూర్తిగా లేదు అని తెలియజేప్పే పనిలాగా ఆ వ్యవహారం తయారయింది.

ఇంకా పూర్వకాలమునకు వెళ్ళిచూచిన, ఈ వెంట్రుకలు ఆత్మకు గుర్తు అని తెలిసినవారై, జుట్టును తలమీద ఒక దగ్గరకు చేర్చి, ముడిగా కట్టి, దానిని శుభ్రంగా నీటితో కడిగి, పూలను కూడా దానిచుట్టూ కట్టేవారు, ఎందుకనగా తల అనేది ఆత్మస్థానం, తలమీద ఉండే వెంట్రుకలు ఆత్మకు చిహ్నములని, ముడికి పూలనుచుట్టినారు.  కనుక పూర్వపు ఆడవారు వాటిని గొరిగించక, కత్తిరించక, ఆడవారైనా, మగవారైనా ఆ తలమీద ముడిని వేసుకునేవారు.  దీనికి ఉదాహరణగా పౌరాణిక సినిమాలలో కొందరు పాత్రధారుల వేషముల వలన మనకు ఆ విషయము తెలియు చున్నది.  కానీ ఇప్పుడు ఎన్నో మార్పులు వచ్చి, క్రాఫ్‌గా జుట్టును కత్తిరించే స్థితికి కాలానుగుణంగా వచ్చినప్పటికీ, కొద్దిగానైనా తలమీద జుట్టు ఉంటున్నది కదా! మరి అవి ఆత్మకు గుర్తని ఇప్పటికైనా తెలుసుకుంటే చాలును.

అదే విధముగా జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ఆత్మ ఆధీనములోనే, ఆత్మశక్తి వలననే పనిచేయుచున్నవనీ, ప్రతీ అవయవము నందు వెంట్రుకలు పుట్టబడినవి, కానీ జీవాత్మవైన నీకు ఏమీ చేతకాదు. నీవేమీ చేయటం లేదు అని ఇప్పటికైనా తెలుసుకోవలెను.  ఇప్పుడు అందరికీ ఒక ప్రశ్న రావచ్చును, అది ఏమనగా! మూతిమీద మీసాలు, గడ్డములు మరి ఆడవారికి లేవు కదా! మరి వారికి ఆత్మ పనిచేయుట లేదా? అని అడుగవచ్చును.  అదే విధముగా కళ్ళమీద ఉన్నాయి, చెవులకు, ముక్కుకు ఆత్మకు గుర్తుగా వెంట్రుకలున్నాయి కదా! మరి మూతిమీద, గడ్డం మీద

www.thraithashakam.org

ఎందుకు లేవు? అని సందేహం రావచ్చును. మన తలలో గుణములు ఉన్నాయి, ఆత్మకూడా ఉన్నది. ఆత్మకు వెం(టుకలు చిహ్నాముగా చూపించితిమి, అయినా గుణాలకు చిహ్నాముగా ఏమీ చూపించలేదు. బాహ్యంగా గుణములకు (మాయకు) ఏ గుర్తును చూపించలేదు. మరి ఆత్మను, మాయను రెండిటినీ దేవుడే సృష్ఠించెను అని చెప్పి, ఆత్మకు గుర్తుగా వెం(టుకలను చూపించి, మరి గుణముల రూపములో ఉన్న మాయకు గుర్తింపు దేవుడు చూపించలేదా? అని ఆలోచిస్తే, మనకు ఒక విధానము తెలుస్తున్నది. అది ఏమంటే! గుణముల రూపములో ఉన్న మాయ బయటకు రావాలంటే మాటల వలననే రావలెను, అలా వచ్చిన తర్వాత ఒక దగ్గరనుండి ఇంకొక వైపు వ్యాపిస్తూ ఉంటుంది. కనుక మాయ మాట రూపములో ఉన్నదని మనకు అర్థమవుతున్నది. ఆత్మకు గుర్తయిన వెం(టుకలు కనిపించేవి, మాయకు గుర్తయిన మాట వినిపించేదే కానీ కనిపించేది కాదు అని చెప్పవచ్చును. కనుక మాయ, ఆత్మ రెండూ మన శరీరములోనే ఉన్నాయి అని మనకు తెలిపేందుకు గాను (పకృతికి గుర్తయిన స్త్రీ శరీరములో మాయకు గుర్తుగా చూపించుటకు, మాటవచ్చు మూతిమీద వెం(టుకలు లేకుండా చేసెను. ఎందుకనగా! (పకృతి లేదా మాయ అనునది స్త్రీ కనుక ఆ విధముగా చూపబడినది. పురుషుడు పరమాత్మకు గుర్తుగా, స్త్రీ (పకృతికి గుర్తుగా సృష్ఠించబడ్డారు అని మనకు తెలిసినదే. ఇది ఆధ్యాత్మిక విద్యలో తెలుస్తుంది. (పకృతికి గుర్తుగా స్త్రీ శరీరము ఉన్న మనుష్యులను, పరమాత్మకు గుర్తుగా పురుష శరీరమున్న మనుష్యులను దేవుడు సృష్ఠించెను. కనుక ఆత్మకు గుర్తుగా వెం(టుకలను ఇద్దరి శరీరములు అనగా స్త్రీ, పురుష శరీరములలో ఉంచిననూ, మాయ లేదా (పకృతికి గుర్తును ఎక్కడైనా పెట్టాలి కావున, (పకృతికి గుర్తుగా ఉన్న స్త్రీ శరీరములో మాయకు లేదా (పకృతికి

గుర్తుగా ఉన్న మాటవచ్చు మూతి మీద వెంట్రుకలను లేకుండా చేసి, ఇది మాయకు గుర్తు, **మాట మాయకు గుర్తు** కావున మాటకు స్థానము అయిన మూతిమీద మాత్రము వెంట్రుకలను స్త్రీలకు లేకుండా చేసెను. స్త్రీలకు మిగతా శరీర భాగములందు మాత్రము ఆత్మకు గుర్తుగా వెంట్రుకలను పురుష శరీరములో ఉన్నట్లుగానే పెట్టడం జరిగినది.

ఇప్పుడు మాయకు గుర్తు మాట కావున, మాయకు ఆత్మ వ్యతిరేఖము కావున, ఆ మాటలనుండే ఆత్మ, పరమాత్మలవంటి, మాటలనే ఇతరులైన స్వామీజీలు, బాబాలద్వారా వారి శరీరములో గుణముల రూపములో ఉన్న మాయ చెప్పించి వాస్తవమైన జ్ఞానాన్ని చెప్పకుండా, అదే అసలైన జ్ఞానము అని భ్రమింపచేసి, మాయా జ్ఞానమునే బోధిస్తూ జనులను వారిని కూడా ప్రక్కదోవ పట్టిస్తున్నది కావున మాయకు మాట గుర్తు అన్నది ఇప్పుడు సరిపోయింది కదా! ఇప్పుడు మాయ ఆత్మకు, నీ బలాన్నీ నేను తగ్గిస్తాను, నా బలాన్ని పెంచుకుంటాను అని మాయ చెప్పిన మాట నిరూపణగా, ఆత్మకు స్థానమైన తలయందు, అదియునూ తలయొక్క మధ్యస్థానములో వెంట్రుకలను లేకుండా చేసి బట్టతల వచ్చునట్లు చేయును. మరి ఆత్మకూడా మాయబలం తగ్గించగలను అని చెప్పి, మాయ బలాన్ని నేను కూడా తగ్గించగలను అని ఆత్మ చెప్పినట్లు నిరూపణగా, మేము చెప్పు జ్ఞానమున్నది కావున మేము అసలైన ఆత్మజ్ఞానమును చెప్పటమే కాకుండా మాయ యొక్క రహస్యాన్ని ఇంతవరకు ఎవ్వరూ చెప్పని విషయములను మేము ఇప్పుడు చెప్పుచున్నాము. తద్వారా మాయా బలము తగ్గినట్లు అవుతున్నది కదా! కనుక మాయా జ్ఞానములో మనము పడకుండా, ఉండమని ఇతరులు చెప్పిన మాటలు, మాయకు గుర్తు కావున అందులో పడిపోకుండా అసలైన ఆత్మజ్ఞానాన్ని తెలుసుకునేందుకు అవకాశము ఇప్పుడు ఉన్నది, కనుక ఆత్మకు

www.thraithashakam.org

గుర్తయిన వెంట్రుకలు చర్మంపైనంతా ఉండి, చర్మము కూడా ఆత్మవలననే పనిచేయుచున్నదని తెలియుచున్నది, అదే విధముగా ప్రత్యేకంగా ఈ అవయవం పని చేస్తున్నదని అక్కడ మాత్రమే పెట్టి, చర్మము అంతటా ఉంది కావున శరీరములో చర్మమంతా వెంట్రుకలు ఉన్నవి. జీవరాశు లలో కొన్నిటికి జ్ఞానము ఉన్నది, కొన్నిటికి లేదు అని చూపుటకు ఆవులకు వెంట్రుకలున్నవి, గేదెలకు వెంట్రుకలు లేవు. కనుకనే ఆత్మకు గుర్తుగా 'పావురాన్ని' పెట్టాము, మాయకు గుర్తుగా 'పామును' పెట్టాము. అందుకే పావురమునకు శరీరమంతా వెంట్రుకలు (ఈకలు) ఉంటాయి. అట్లే ఆత్మకు గుర్తు అయిన వెంట్రుకలు లేకుండా మాయకు గుర్తుగా పామ ఉన్నది.

## ౨. సంతకము

తేది : 31.07.2007

ఈ రోజు గురుపౌర్ణమి. ఈ దినమునకు అన్ని పౌర్ణమిలకంటే ఒక ప్రత్యేకత ఉన్నది. నేడు గురుపౌర్ణమి జరుపుకుంటున్నాము కానీ గురువు ఎవరు? తెలియదు. భగవద్గీతా శాస్త్రము ప్రకారము, మిగతా మత గ్రంథముల ప్రకారము గురువు ప్రపంచమునకంతటికీ ఒక్కడే ఉండును. అదియు ఎప్పుడో వస్తాడు. అన్ని కాలములందు శాశ్వతముగా ఉండడు. ఒక్కడే గురువని తెలిసినా ప్రపంచములో పదిమంది గురువులను పూజిస్తున్నాము. కనుక ఇందులో ఎవరు అసలైన గురువు? అని సందేహము వచ్చును. ఎవరు అసలైన గురువు? అని తెలుసుకుంటే సరిపోవును కదా!

మన అన్వేషణలో ప్రపంచమునకు జగద్గురువుగా ఉన్నవాడు శ్రీకృష్ణుడే కావున ఆయనని ఈ రోజు స్మరించుకొని, ఆయన చెప్పిన

జ్ఞానమును ఆచరించిన నిజమైన గురుపూజ చేసినట్లగును. ప్రత్యేకమైన ఈ దినమున ఒక క్రొత్త జ్ఞాన విషయమును తెలియజేయాలనుకుంటున్నాము. మేము ఇన్నేళ్ళుగా చెప్పుచున్న జ్ఞానము ఇంతకుముందు ఎవ్వరూ చెప్పలేదు, ఏ గ్రంథములలోనూ వ్రాయబడలేదని చాలాసార్లు చెప్పాము. అదే విధముగా ఈ రోజు కూడా ఒక క్రొత్త జ్ఞానమును తెలుసుకుందాము.

ఈ కాలములో చాలామంది గురువులమనీ, స్వాములమనీ చెప్పు కుంటూ, ఎన్నో గుడులను నిర్మించి, పూజలు చేయించారు తప్ప, ఏమైనా అసలైన పరమాత్మ జ్ఞానమును ప్రజలకు అందజేశారా? అని ప్రశ్నిస్తే "ఏ జ్ఞానము అందజేయలేదు" అని సమాధానము వచ్చును. ఆత్మ జ్ఞానము జన్మజన్మలకు పనికివచ్చేది. అయితే మనిషి ఈ జన్మకు మాత్రము సరిపడే ప్రపంచ సంబంధమైన డబ్బులు సంపాదించుకోవటం కొరకు ప్రాకులాడు చున్నాడు. అక్కడకు పోతే వ్యాపారము బాగా జరిగింది, ధనికులమైతిమి అనుకుని, మహత్యములకు లొంగిపోయి అక్కడే ఉండిపోతే, ఆ ధనము గాని, మిగతావన్నీగానీ మరుజన్మకు రావు. మరుజన్మకు వచ్చేది ఏది? అంటే జ్ఞానధనము మాత్రమే వస్తుంది. కనుక జ్ఞానధనమును చేకూర్చుకొనుట మంచిపని అగును. ప్రపంచ ధన సంపాదన కర్మమీద ఆధారపడి ఉంటుంది. కానీ జ్ఞానధన సంపాదన మాత్రము శ్రద్ధపైన ఆధారపడి ఉండును. మరి ప్రపంచ ధనమునకు విలువెక్కువుందా, జ్ఞాన ధనమునకువుందా? అని ఆలోచించిన, జ్ఞానమునకు విలువిచ్చిన వారికి జ్ఞానధనమే విలువైనదిగా కనిపించును.

మీరు ఇక్కడికి వచ్చినందుకు మీకు జ్ఞానధనమును ఇచ్చేందుకు మేము సిద్ధముగా ఉన్నాము. మేమెప్పుడు చెప్పినా క్రొత్త జ్ఞానమునే చెప్పెదము, అలాగని మేము చెప్పబోవు దానిని గూర్చి మేము ఎప్పుడూ

ముందుగా యోచింపము. ఇక్కడ కూర్చున్న తరువాత మాత్రమే మేము ఏదో క్రొత్త జ్ఞానమును ఇన్నేళ్ళుగా మీకు అందిస్తున్నాము. నేనైనా, మీరైనా మనము చేస్తున్న పనులను మూడు రకములుగా విభజించుకోవలెను. ఒకటి ప్రపంచము పని, రెండవది నీ పని, మూడవది దేవుని పని. నేను రోజూ ఆ విధముగా విభజించుకొని దేవుని పని ఎక్కువ చేసేందుకే ఇష్టపడెదను. మరి అలా మీరు కూడా విభజించుకొని పని చేయవలెనన్న, ఏది దేవుని పని, ఏది ప్రపంచము పని, ఏది నా పని అని తెలియవలెను కదా!

దేవుని విషయములను, భగవద్గీతలో ఉన్న విషయములను ఇతరులకు తెలియజేయటం దేవుని సేవ అగును. అయితే ఏమి చెప్పాలి అని యోచించి, మీరు తెలుసుకున్నది చెప్పవలెను. ఉదాహరణకు మనము సంతకము ఎందుకు పెట్టెదము? సంతకము అనగానేమి? అనే విషయం గూర్చి నీవు తెలుసుకొని ఇతరులకు తెలియజేయాలి. అయితే సంతకము అనే విషయములో దేవుని జ్ఞానము ఏమున్నది అని ఆలోచించినట్లయితే 'సంతకము' దేవుని జ్ఞానమే అగును.

మనము సంతకము ఎక్కడైనా పెట్టవలసిన చోట ఎవరైనా (×) ఇంటూ గుర్తును వేసి సంతకము అక్కడ పెట్టమంటారు. కానీ ఎవ్వరూ (√) రైట్ గుర్తు పెట్టి సంతకము పెట్టమని అడుగరు. సంతకము పెట్టిన తరువాత చూసుకొన్న నీ పేరు ఉదా॥ మహేష్ ఉంటే దానికి ముందు (×) ఇంటూ కనిపించును. అనగా మహేష్ అను నీ పేరు తప్పు అని పరోక్షముగా, ఒక విధముగా ప్రత్యక్షముగా తప్పు అని ఆ గుర్తు (×) తెలియజేయుచున్నది. సామాన్యముగా (×) గుర్తును తప్పు అని తెలియజేయుటకే వాడుదురు అనే విషయం అందరికీ తెలిసినదే.

మేము ఇప్పుడు చెప్పబోవు ఈ సమాచారము కొరకు మేము ఇంతకు ముందు ప్రిపేర్ అవ్వవలసిన అవసరము రాదు. ఎందుకంటే అలా తర్ఫీదు అయితే మేము ఉపాధ్యాయులమే అగుదుము. ఉపాధ్యాయునికి పాఠ్య పుస్తకము ఒకటుంటుంది. దానిని ముందు అతను బాగా చదివి, సిద్ధమై, తరగతి గదిలో దానినే చెప్పును.

కనుక మేము ఉపాధ్యాయులము కాము, అధ్యాయులమే. అధ్యాయులు అనగానేమి అంటే క్రొత్తగా ఒక విషయాన్ని మొట్టమొదట తెలియజేసేవాడు. అధ్యాయుడు ఇంతకుమునుపు ఎవరూ తెలియజేయని దానిని తెలియజేయును. 'ఉప' అనగా దగ్గరగా ఉన్న, ప్రక్కనున్న అని అర్థము కలదు. కనుక క్రొత్తగా తెలియజేసిన వ్యక్తి నుండి లేదా అతను ప్రపంచమునకు అందజేసిన జ్ఞానమును చదివి, తెలుసుకొని దానిని ఇతరులకు చెప్పేవాడే ఉపాధ్యాయుడు. అధ్యాయుడు, ఉపాధ్యాయుడు అనే పదములకు అర్థము ఇప్పుడే మీకు తెలిసినదని మేము అనుకుంటున్నాము. కనుక ఉపాధ్యాయున్ని 'బోధకుడు' అందుము. అనగా ఉన్న దానిని చదివి చెప్పేవాడు.

ఈ సంతకము అనుదానిని హిందీభాషలో దస్‌కత్ అంటారు. ఇంగ్లీషులో సిగ్నేచర్ అంటారు. నేనిప్పుడు చెప్పవలసినది మూడింటి గురించి మనము ముందు తెలుగు భాషలోనున్న 'సంతకము' అను దానిని గూర్చి తెలుసుకుందాము. 'సంతకము' అనే పదమును విడదీసిన స+అంతకము=సంతకము. ఏమిటీ అంతకము అంటే 'స' కు అంతకము. ఇక్కడ అంతము అనే దానిని తీసుకుంటే లేకుండా పోవటం. సంస్కృతములో 'సంత్' అనే పదముంది. దానికర్థము జ్ఞానము. దీనిని పరిశోధించిన తెలుగు భాషలో 'స' అనే అక్షరము జ్ఞానమును తెలిపేందుకు సూచికగా

www.thraithashakam.org

వాడవచ్చును. అనగా 'జ్ఞానములేనిది' అనే అర్థము 'సంతకము' అనే పదములో కలదు. నీ పేరు ఏదయితే ఉందో, ఏ పేరు నీవు అనుకుంటున్నావో అందులో ఏ జ్ఞానము లేదు. అనగా నీవు జ్ఞానమును తెలుసుకొనవలెనన్న నీ పేరులో ఏమీ లేదు. పేరులో ఏమాత్రము జ్ఞానము లేదంటే ఏమున్నట్టు ప్రకృతే ఉన్నట్లు, అనగా మాయా స్వపరూపమైన ప్రకృతే నీ పేరులో ఉంది, దేవుడు, దేవుని జ్ఞానము నీ పేరులో లేదు. ఇది తప్పు నీ పేరు నీకు సంబంధించినది కాదు అని, నీవు మహేశ్ కావు, విశ్వనాథం కావు అని పేరు ముందర ఇంటూ (×) మార్క్ పెట్టుకుంటున్నాము. 'సంతకము' అనగా జ్ఞానము అంత్యమైనది, జ్ఞానము లేదు అని అర్థము.

పూర్వపు పెద్దలు 'సంతకము' అనే పదమును ఎప్పటికైనా ఆలోచిస్తారని అలా తెలుసుకునేందుకుగాను నీవు అనేది జ్ఞానము లేనిది అని తెలుసుకునేందుకు ఏమి చేశారంటే 'సంతకము' అని పేరు పెట్టారు. ఆ విధముగా సంతకము ముందుగానీ, వెనుకగానీ పెడుతున్న (ఇంటూ) '×' గుర్తు ఎందుకో తెలిసినది కదా! అనగా ఈ పేరున్న వ్యక్తివి, జీవాత్మవైన నీవు కావు, ఇది తప్పు.

ఇక హిందీలో సంతకమును 'దశ్‌కత్' అంటారు. దశ్ అంటే పది అని, కత్ అంటే జాబు అని అర్థము. అయితే దీని అంతరార్థమేమి? అని ఆలోచించిన, కత్ అంటే విషయము అని అర్థము కదా! (జాబు అని కదా) విషయాన్ని ఒక దగ్గర క్షుణ్ణంగా వ్రాసివుంటే దానిని 'జాబు' అంటాము కదా! ఇంకా చెప్పాలంటే విషయకూడలి అంటాము. 'దశ్‌కత్' అంటే పది విషయములు ఉన్నట్లు తెలియుచున్నది, అనగా ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు నీకున్నవి. ఐదు జ్ఞానేంద్రియముల విషయములు లోపలికి పోవుచున్నవి. ఐదు కర్మేంద్రియముల విషయములు బయటకు

www.thraithashakam.org

వస్తున్నవి. ఈ పది తప్ప నీలో ఏమీ లేవు అని చెప్పటం కొరకు దశ్‌కత్ అని పేరు పెట్టెను. ఇదంతా నీ శరీరమునకు సంబంధించిన గుర్తే కానీ లోపలున్న ఆత్మకు సంబంధించినది కాదు. కనుక నీవు కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములతో కూడిన అజ్ఞానమే తప్ప నీలో ఏమీలేదు అని తెలియజేసేందుకుగాను 'దశ్‌కత్' అని పేరు పెట్టారు. ఇప్పుడు తెలుగులో అర్థము చేసుకుంటే సంతకము అనగా జ్ఞానసంబంధమైనది ఏమీ నీ పేరు అనే దానిలో లేదు అని తెలుపగా, హిందీలో పది ఇంద్రియముల విషయములు మినహా ఏమీ లేదని తెలియజేయటం జరిగినది. ఇంగ్లీష్‌లో 'సిగ్‌నేచర్' అనే పదముంది. అందులో 'నేచర్' అనే పదము ప్రకృతి అని అందరికీ తెలుసు. 'సిగ్' అంటే సిగ్నిఫికెన్స్‌కు సంక్షిప్త రూపం. సిగ్ అనగా గుర్తు. సిగ్‌నేచర్ అనగా 'ప్రకృతికి గుర్తు' అనే అర్థము కలదు. ఇక్కడ కూడా నీవు ప్రకృతికి సంబంధించినవాడివే అని అర్థము.

ఈ విధముగా మూడు భాషలలో సమానమైన అర్థమే ఉన్నది. మరి నీవు సంతకము ముందు ఇంటూ గుర్తును తీసివేసి, నువ్వు నిజంగా నువ్వే అనిపించుకోవలెనన్న ఏమి చేయవలెను? నీవు ఆత్మకు సంబంధించిన వాడివని, ఎప్పటికైనా నేను ప్రకృతిలో కాకుండా పరమాత్మలో ఐక్యమై పోవలెనని జ్ఞానము తెలిసినప్పుడు పరోక్షముగా ఇంటూ గుర్తును లేకుండా చేసుకున్నవాళ్ళమైతే ఇక సంతకముతోగానీ, దశ్‌కత్‌తోగానీ, సిగ్నేచర్‌తో గానీ మనకేమి సంబంధము ఉండదు. అంటే "ఇంటూ (×)" బెడద తప్పినట్లే కదా!

ఈ విధముగా ఈ జ్ఞానవిషయం తెలియజేసేందుకు అమర్చిన పదములలో మూడు భాషలలో ఉన్న మూడు పదములు అసలైన అర్థమును ఇప్పుడు మనము తెలుసుకున్నాము.

www.thraithashakam.org

# 3. సాంప్రదాయము

## (ములాజ్-ములాధి, మూలజ్-మూలధి)

తేది :04-09-2007

ప్రతీ సంవత్సరము మనము కృష్ణాష్టమిని జరుపుకుంటున్నాము. అయితే అందరూ అంటున్నట్లు "హరేరామ హరేరామ రామరామ హరే హరే, హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే" అనే దానిని అనుసరించి శ్రీరామ నవమిని చేయవచ్చును కదా! మరి మీరు కృష్ణాష్టమినే జరుపుచున్నారు ఎందుకు? రాముడు కృష్ణుడు ఒకటి కాదా! అని మీరు ప్రశ్నించవచ్చును. దానికి సమాధానము చెప్పినచో, రాముడు, కృష్ణుడు ప్రత్యేకమైన వ్యక్తులే అయిననూ, వారిలో కొన్ని తేడాలు కలవు. వాటి ప్రకారము వారిద్దరూ ఒకటికారు అని చెప్పవచ్చును. రాముడు పుట్టినది నవమి, కృష్ణుడు పుట్టినది అష్టమి. కృష్ణుడు పుట్టినది రాముడు పుట్టిన తిథికి ముందు రోజు, ఇద్దరు ప్రక్క ప్రక్కనే పుట్టినట్లు కనిపిస్తున్నది కానీ, కృష్ణుడు, రాముడు ఎప్పటికీ ఒక్కటికారు. ఇంతకుముందు చాలాసార్లు ఈ విషయమును మేము చెప్పి యుంటిమి.

రాముడు పుట్టినది నవమి రోజున, కృష్ణుడు పుట్టినది అష్టమి రోజున. "పాడ్యమి నుండి పౌర్ణమి వరకు పదిహేను రోజులగును. అనగా 15 తిథులగును. ఈ పదిహేను తిథులను రెండు భాగములను చేసినట్లైన ఒక భాగము ఏడు, రెండవ భాగము ఏడుగా విడదీసిన మొత్తము 14 అయితే ఇంకొక రోజు మిగులును అదియూ మధ్యలో మిగులును. పాడ్యమి నుండి సప్తమి వరకు ఏడు రోజులు అయితే, నవమి నుండి రెండవ భాగము మొదలై పౌర్ణమి వరకు ఏడు రోజులయితే మధ్యలో మిగిలినది అష్టమి అగును. ఇటు ముందర భాగానికి అటు వెనుక భాగానికి మధ్యలో

ఉండేది అనగా 8వ తిథిగా అష్టమి ఉంది కదా! ఇప్పుడు మొదటి భాగము ఏడు రోజులు, రెండవ భాగము ఏడు తిథులు (రోజులు) మనలో ఉన్న పాపపుణ్యములకు, సుఖదుఃఖములకు అనగా ద్వంద్వములకు సూచికగా ఉన్నవి. మధ్యలో ఉన్నది ఎటూకానిది, ద్వంద్వములు లేనిది, ద్వంద్వము లకు అతీతముగా ఉన్నది ఏది అనగా అష్టమి. ఎటూకాకుండా, ద్వంద్వా లకు అతీతముగా పుట్టినవాడు కృష్ణుడు అని తెలుస్తున్నది. ఆ అష్టమి తిథివలన ఇది రామునికి వర్తించదు, ఎందుకనగా! నవమి ఒక పక్షంలో (రెండవ భాగములో) చేరిపోయెను. ఇప్పుడు అష్టమికి ముందున్న తిథులన్నీ మంచివని, అష్టమి తరువాత ఉన్న తిథులన్నీ చెడ్డవని కాదు. జ్యోతిష్య శాస్త్రరీత్యా చూచిన, వాడి జాతక లగ్నమును అనుసరించి, ముందు తిథులు చెడ్డవైతే, రెండవ భాగములో ఉన్న తిథులు మంచివగును. అదే విధముగా ముందు తిథులు మంచివైతే రెండవ భాగములో ఉన్న తిథులు చెడ్డవగును. కనుక ఒక పక్షములో చేరిన రాముడు పుట్టిన తిథి నవమిని గమనించిన, రామునికి కూడా అదే షరతు వర్తించును. కానీ కృష్ణుడు పుట్టిన తిథి అయిన అష్టమి ఏమి సూచించుచున్నదనగా, కృష్ణుడు ఏ పక్షములోనికి చెందినవాడు కాదని తెలియజేయుచున్నది. ఆయన జన్మే ప్రత్యేకమైన జన్మ. పాపపుణ్యములకు సుఖదుఃఖములకు అన్నింటికీ అతీతమైన జన్మ కృష్ణునిది. ఏ కర్మలు అంటని జన్మ అతనిది (కృష్ణునిది). ఆయన జ్ఞానములో ఉన్నాడా, లేక అజ్ఞానములో ఉన్నాడా అని నీవు తెలుసుకోలేని జన్మ అతనిది. ఆ విధముగానే ఆయన ప్రచారమయినాడు. ప్రపంచ విషయములలో నయినా మీరెవరైనా తేల్చి చెప్పగలరా? ఒకరు ఆయనను మంచివాడంటే, ఇంకొకడు చెడ్డగా చెప్పును. అందుకే ఆయన అష్టమిలో పుట్టాడు. నీవు ఎలా అనుకుంటే అతను అలాగే కనిపించును. కానీ కృష్ణుడు మాత్రము

మంచికి, చెడుకు అతీతుడు. అందుకే ఆయన భగవద్గీతలో తామరాకుకు నీటి బిందువులంటనట్లు, నాకు పాప, పుణ్యములంటవు అని చెప్పెను. వీటన్నింటినీ తెలియజేసే నిమిత్తమే అతను భూమిమీద కేవలము అష్టమి రోజునే ఎంచుకొని పుట్టాడు. ఇంకెవరికైనా అట్లు ఎంచుకొని పుట్టేటట్లు స్వతంత్ర్యము ఉన్నదా? లేదు మనమందరమూ అస్వతంత్రులము ఎందుకనగా! మనమంతా ఒక గొడుగు క్రింద ఉన్నాము, నక్షత్రుడు (నఛత్రుడు) అనగా ఏ గొడుగూ లేనివాడు ఎవరు? దేవుడు, అనగా ఎవరికీ అతనిపై అధికారము లేదు కనుక నక్షత్రుడు అన్నారు. అదే మోక్షము కనుక మోక్షమునకు గుర్తుగా నక్షత్రమును చెప్పుచున్నాము. ఆ దేవుడినే రూప, నామ, క్రియారహితుడు అంటున్నాము. దానినే ముస్లీమ్స్ **"అల్లాహ్"** అంటున్నారు, క్రైస్తవులు **"యెహోవా"** అంటున్నారు. మనము **"పరమాత్మ"** అంటున్నాము. మిగతా వారందరూ ఒక్కటే అంటూ ఉండగా, మనము మాత్రము పరమాత్మ అంటూనే, దానితో సరిపెట్టక, ఇంకా ఎన్నో అంటున్నాము. అందుకే (ఇందూ) హిందూ మతములో దేవుడెవరు? అనే విషయాన్ని ఇంకా నిర్ధారించుకోలేక పోతున్నాము. భగవద్గీతలో దేవుడెవరు? అనే దానిని నిర్ధారణ చేసి చెప్పిననూ, ఈ విధముగా మీరు ప్రవర్తిస్తే నేను తెలియబడతాను అని చెప్పినా మనకు అర్థము కాకుండా పోయినది.

భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పిన యధార్థభావన మనకు అర్థం కాలేదు. ఇప్పుడు కృష్ణునికంటే, రామున్ని గొప్పగా లెక్కవేసుకుని, ప్రతీ పెండ్లిలోను రాముని చిత్రపటమును పెట్టుకుంటున్నారు కానీ, కృష్ణుని చిత్రమునెవరైనా పెట్టుకుంటున్నారా? ఏమంటే వీరు ఆదర్శ దంపతులు, సీతారాములు అంటున్నారు. ఎక్కడ ఆదర్శముందో, ఏమో అని దానిని

తోడుకుంటే మనకు కాలం వృథా అగును, కనుక దానిని విడిచిపెడు తున్నాము.

ఈ విధముగా మనము పరిశీలించిన శ్రీకృష్ణుడు మన మాదిరే అన్ని కార్యములు చేయుచున్నట్లు కనిపించిననూ, కానీ ఒకటి మాత్రము ప్రత్యేకత కలదు, అది ఏమనగా! మనమంతా కేవలము జీవులుగా బ్రతుకు చున్నాము. అన్ని పనులు జీవుడైన నీవు చేయకపోయినా, అన్ని పనులు కర్మప్రకారము లోపల (శరీరము) ఆత్మే చేయిస్తున్నా, అనుభవించుటకే నీవైన జీవాత్మ ఉన్ననూ, అన్ని పనులు నేనే చేస్తున్నానని జీవుడు భ్రమించు చున్నాడు. కానీ నేను వేరు, నా శరీరము వేరు అని ఎవరికీ తెలియకుండా పోయినది. శ్రీకృష్ణునికి మాత్రము నేను వేరు, నా శరీరము వేరు అనే ధ్యాస కలదు. నేనే కాకుండా, నా వెనుక ఇంకొకరున్నారు అనే విషయము కూడా అతనికి తెలుసు. అందుకే బైబిల్‌లో **"నీ పొరుగువాడిని ప్రేమింపుము (శ్రద్ధ వహింపుము)"** అనుమాట కలదు. అయితే పొరుగువాడు అంటే శరీరములో జీవాత్మవైన నీతోపాటు ఉండే ఆత్మ అని ఎవరూ అనుకోవటం లేదు. పొరుగువాడంటే ప్రక్కింటివాడని ప్రపంచపరముగా అర్థము చేసుకున్నారు. అది ఆధ్యాత్మికత అనగా, ఆత్మను అధ్యయనం చేయటమే అని అసలైన అర్థము ఉన్నది. కానీ శరీరమునకు సంబంధించిన అర్థమును తీసుకోకూడదు. ఇప్పుడు కృష్ణునునికి తనతో పాటు ఆత్మ అనేది ఒకటుందని తెలుసు, దానికంటే పరమాత్మ అనేది కూడా ఉందని తెలుసు. మరి మనకి మన విషయమే తెలియదు కానీ, శ్రీకృష్ణునికి అతని గూర్చి జీవాత్మ నని తెలుసు, అతనికంటే గొప్పవాడైన రెండవ ఆత్మ గురించి తెలుసు, ఆత్మకంటే గొప్పవాడైన పరమాత్మ గురించి తెలుసు.

www.thraithashakam.org

అతనిని గూర్చి ఇంకా చెప్పుకుంటే, అతను కొన్నిసార్లు జీవాత్మగా మాట్లాడెను, అతని శరీరములో కొన్నిసార్లు రెండవవాడైన ఆత్మగా మాట్లాడెను. అదే విధముగా సర్వప్రపంచమునకు ఎవరు అధిపతో వాడైన పరమాత్మ కూడా అతని శరీరమునుండి మాట్లాడెను. ఆనాటి ద్వాపర యుగములో, తరువాత కాలములో మరల అలాగ మాట్లాడినవారు వచ్చి ఉండవచ్చును. ఆ విధముగా సర్వప్రపంచమునకు అధిపతి, అణువణువునా వ్యాపించి, అన్నింటికీ పరముగా ఉన్నవాడై, పరమాత్మగా పేరుగాంచినవాడు, మనిషిగా జన్మ తీసుకొని, భూమిమీదకు వచ్చి, ధర్మములను తెలియజేసెను. జీవులైన మీరు ఏదో ఒక పక్షములో అనగా మంచి, చెడులు, పాప, పుణ్యములు, సుఖ, దుఃఖములు నడుమ ఉందురు, కానీ ద్వంద్వాతీతమైన మధ్యస్థానముకు మీరు రాలేరు. ఒకవేళ మీరు పరమాత్మలోనికి ఐక్యమై, మోక్షమార్గమునకు పోవాలంటే, నేను చెప్పిన మార్గమును మీరు అనుసరించి ఉండవలెను. ఆ మార్గమును నేనే మీకు చెప్పాలి, ఎందుకంటే దేవుని విషయములు (ధర్మములు) దేవునికే తెలియును.

ఈ విధముగా శ్రీకృష్ణుడు దేవున్ని తెలుసుకునే ధర్మములను అర్జునునికి జీవునిగాకాక, రెండవవాడైన ఆత్మగా కాకుండా, మూడవవాడైన పరమాత్మగా చెప్పెను. అప్పుడే, దేవుడే "నన్ను ఎవరూ ఇంతవరకు చూడలేదు" అని చెప్పెను, కానీ ప్రపంచములో నేనున్నానని నిరూపణగా తెలియజేసేందుకు నేను నా విషయములను నీకు తెలియజేస్తున్నాననీ, అర్జునుని ద్వారా తెలియజేసెను. ప్రపంచమంతా ఏ శక్తి అయితే ఆవహించి ఉన్నదో, ఆ శక్తే కృష్ణుని రూపములో వచ్చినది. కావున శ్రీకృష్ణుని జన్మ ఎంత మీకు గొప్పదో అర్థమయి ఉంటుంది.

www.thraithashakam.org

ఇప్పుడు రెండవ విషయమును చర్చించుకుందాము. ఇప్పుడు మీరు ఇక్కడ జరిగిన పెళ్ళిని చూసి ఉందురు. దానిని మేము ముందు కూడా ఎవరికీ తెలియజేయలేదు. పెళ్లి కుమారుడికి కూడా 10 నిమిషముల ముందు తన పెళ్లి విషయము తెలిసింది. పెళ్లి కుమార్తెకు కూడా వారు వచ్చేదానికి పది నిమిషముల ముందే తెలియజేసి, వారిని పెళ్ళికి వస్తున్నట్లుగా కాకుండా శ్రీకృష్ణాష్టమికి, దేవుని దగ్గరకు వస్తున్నామనే రావలెను అని చెప్పాము. పెళ్లి మా కుమారునిదే, మేము ఎవరినీ ఈ పెళ్లికి అనగా నా తరపు బంధువులను గానీ, నా భార్య తరపు బంధువులనుగానీ పిలువ కుండానే జ్ఞానయుక్తముగా ఈ పెళ్లి జరిపాము. అసలు పెళ్లి అనే పదమే దేవునికి సంకేత పదము. నేను ఈ పెళ్లికి మా బంధువులందరినీ పిలిచిన, వారు ధనమును, కానుకలను ఇచ్చెదరు. మా స్థాయికి మేము మా బంధువుల పెళ్లికి ఇచ్చిన సొమ్ములన్నీ రాగలవు. కానీ మాకు ఆ ఆర్భాటములు ఇష్టంలేవు కనుక మేము ఆ పని చేయలేదు.

ఈ మధ్య టీవీలో ఒక పెళ్లిని జరిపించటం మేము చూశాము. అందులో పెళ్లి చేయిస్తున్న బ్రాహ్మణులు "ఈ పెళ్లిని పూర్తి సాంప్రదాయ బద్ధముగా చేశాము. ఇందులో ఎటువంటి అసాంప్రదాయం లేదు" అని అన్నారు. అయితే మాకు ఒక ప్రశ్న వచ్చింది, అదేమంటే **సాంప్రదాయము అనగానేమి?** మేమే సాంప్రదాయంగా చేశామని మేమంటాము, మేమే చేశామని వారంటారు. కనుక అసలు సాంప్రదాయము అనగానేమి? అని చూస్తే, సాంప్రదాయములో **ఆదాయము** అను పదము అంతర్గతంగా ఆ పదములో ఇమిడి ఉన్నది. ఆదాయము అనగా వచ్చేది. అది ధనరూపములో ఉండవచ్చును, బంగారము రూపములో ఉండవచ్చు. ఈ విధముగా అందరూ దానికొరకే ప్రాకులాడుతున్నారని కూడా తెలుసు.

అయితే సాంప్రదాయములో ఏ ఆదాయము ఉంది అనగా **'స'** అంటే జ్ఞానముతో కూడుకొన్నది, **'ప్ర'** అనగా ముఖ్యమైనది లేదా విశేషమైనది అనగా **'జ్ఞానముతో ఉన్న ముఖ్యమైన ఆదాయమే'** సాంప్రదాయము. నీ తలకు దైవసంబంధమైన జ్ఞానము ఏదైనా తెలిస్తే, దానినే సాంప్రదాయము అనుకోవలెను. దైవజ్ఞానము ఏదీ తెలియకపోతే దైవజ్ఞానము లేకపోతే ఆ పని ఎంతటిదైనా సాంప్రదాయము కాదు. జ్ఞాన సంబంధమైన లాభం చేకూర్చే పనులనే సాంప్రదాయములందురు. కానీ ప్రపంచపరమైన లాభం చేకూర్చే పనులను సాంప్రదాయములు అనరాదు. ఒక గుడికి వెళ్ళి గంట కొడితే అది సాంప్రదాయమగును. అది ఏ విధముగా అర్థముతో యున్నదో తెలుసుకొని గంటను కొడితే సాంప్రదాయమవుతుంది లేకపోతే అసాంప్రదాయమగును. కనుక ఈ (టీవీలోని) పెళ్లిని సాంప్రదాయబద్దంగా చేశామని ఎవరన్ననూ, అది సాంప్రదాయము కాదు. ఎందుకంటే "జ్ఞానయుక్తమైన ముఖ్యమైన" దేవుని జ్ఞానము అందులో ఇమిడి ఉన్నదని ఎవరూ వివరించటం లేదు, ఎందుకంటే వారికి 'సాంప్రదాయము' అంటేనే అర్థము తెలియదు.

ఇంకొక సాంప్రదాయమైన విషయమును తెలుసుకుంటే 'ది' అనగా "బుద్ధి" అని అర్థము. 'పెద్దలమాట సద్దిమూట' అనే (పదం) వాక్యం ఒకటున్నది. అది రూపాంతరము చెంది 'పెద్దలమాట చద్దిమూటగా' మారిందనుకోండి. అయితే పెద్దలు అంటే జ్ఞానులు అని అర్థము. 'సద్దిమూట'లో 'స' అంటే జ్ఞానము 'ది' అంటే 'బుద్ధి' అని మనకు తెలుసు. 'సద్దిమూట' అంటే ఏమి? 'జ్ఞానపు మూట' అని అర్థము కదా! 'జ్ఞానముతో కూడిన బుద్ధి' అనగా నీ బుద్ధికి దైవజ్ఞానమును కలుగజేస్తారు కావున 'సద్దిమూట' అన్నారు. దానినే బియ్యంతో మూట కట్టిన ముడి కల్గిన

గుడ్డను వీపుమీద భుజం పైనుండి వేసి పెండ్లిలో 'ముడిబియ్యం' కట్టడం అనే సాంప్రదాయమును పెట్టినారు. కనుక నీ బుద్ధికి జ్ఞానమును తెలియజేశారు. కావున 'పెద్దలమాట సద్దిమూట' అని అన్నారు.

ఈ ప్రపంచమునంతటికీ మూలాధారము ఒకటున్నదని చెప్పాము. ఇచ్చట మూలము అనగా దైవము అని అర్థము. నిన్ను నడిపించే శక్తి ఒకటున్నదనీ, ఈ ప్రపంచాన్నంతటినీ నడిపించే శక్తి కూడా ఒకటున్నదనీ, అదే దైవమనీ ఎప్పుడైతే నీకు తెలుస్తూ ఉన్నదో, నీవు జ్ఞాన మార్గములో ఉన్నట్లే లెక్క. అలాగే జ్ఞాన విషయములను తెలియకుండా ఉన్నవారు కొందరున్నారు, అలాగే జ్ఞాన సంబంధ విషయములు తెలిసినవారు కొందరున్నారు. ఈ ప్రపంచములో మూల అనగా దైవమనీ, దైవజ్ఞానమనీ తెలిసినది. 'ధి' అంటే బుద్ధి అని కూడా తెలిసింది. ఈ దైవ జ్ఞానము కల్గిన బుద్ధి కొందరికి ఉంది, కొందరికి లేదు. మీరు తమిళనాడు ప్రాంతమునకు వెళ్ళినచో, అక్కడ వారు ఒకరిని ఉద్దేశించి "నీకు మూలఇరుకా?" అని అడుగుదురు. అనగా "దేవుని గూర్చి నీకు తెలుసునా?" అని దాని అర్థముండగా, వారు దానిని అలా ఉపయోగించక 'నీకు జ్ఞానముందా?" అని ప్రపంచవరముగా మందలించుటకు ఉపయోగిస్తున్నారనుకోండి. కనుక తమిళ, సంస్కృత, తెలుగుభాషలలో 'మూలం' అనగా జ్ఞానమనీ, దైవమనీ అర్థములు కలవు. 'మూల+ధి' ను కలిపితే ఏమవుతుంది. మూలధి అగును. వీడికేమో ములాధి లేదు అంటే ఏమి? "వీడికేమీ దైవజ్ఞాన బుద్ధిలేదు" అని అర్థము కదా! 'మూలధి' లేదా ఈ 'మూలాధి' గా ('ల' కు దీర్ఘము) వాడుకలో వచ్చి చేరినది. కానీ మూలాధి లేనివాడు అని పూర్వము పెద్దలు వాడిన అర్థము ఇప్పుడు లేక ప్రపంచ సంబంధమైన జ్ఞానము లేనివాడిని ఉద్దేశించే పదముగా మారినది.

"నేను పది రూపాయలు ఇస్తే, వీడు రూపాయి కూడా ఇవ్వలేదు, కనీసం వీడికి ములాధి లేదు" అని (ప్రపంచపరమైన అర్థముగా, సందర్భముగా వాడుచున్నారు.

ఈ మధ్య మేము హైదరాబాద్ వెళ్తూంటే, గుంతకల్‌లో పని చేస్తున్న ఒక లెక్చరర్ మమ్మల్ని పరిచయం చేసుకొని "నేను లెక్చరర్‌ని మరియు నేను పక్కా హేతువాదిని, దేవున్ని ఇంతవరకూ (మొక్కనే లేదు" అన్నాడు. నేను అందుకు "మంచిదే! నేనూ హేతువాదినే" అని సమాధానము చెప్పితిని. ఆ విధముగా చెప్పుచుండగా, **'నాస్తికులు-ఆస్తికులు'** అని (గ్రంథాన్ని తీసి అతనికి ఇచ్చాము. ఆ (గ్రంథాన్ని అటూ, ఇటూ చూసి "మీరేనా ఈ (గ్రంథాన్ని (వ్రాశారు" అని అడిగాడు. "నేనే (వ్రాసాను" అని సమాధానము చెప్పితిని. అతను దానిని చదివి, "హేతువాదులను గూర్చి మీరు చాలా విమర్శ చేశారు" అని అన్నాడు. నేనందుకు "నేనెక్కడ విమర్శించాను? హేతువాదులు చాలా బాగా వాదించాలి, సరిగ్గా వాదించాలి, మీరు బాగుండాలి" అని కదా! అందులో (వ్రాశాను. నేను హేతువాదిని కదా, నేనెందుకు హేతువాదులను విమర్శిస్తాను? అంటే, మరలా "ఈ (గ్రంథాన్ని మీరేనా (వ్రాశారు?" అని అడిగాడు, "నేనేనయ్యా! ఆ (గ్రంథములో ఉన్న ఫోటో నాదే కదా!" అంటే, "కోటు కూడా వేసుకున్నారు" అన్నాడు. అంటే మేమేదైనా వేసుకుంటాము. ఇది ఉండాలి, ఇది ఉండకూదని మాకేమీ నియమము లేనివాడిని అన్నాను. అంటే మీరు హేతువాదులని చెప్పి, మరలా దానినే విమర్శించారు అంటూ ఉంటే, మేమేమి చెప్పాము, హేతువాదులు అనేవారు ఖచ్చితముగా నిరూపణ చూపి విమర్శించాలి, కనుక ముందు హేతువాదులు అని పేరు పెట్టుకోవటం వలన (ప్రయోజనమైతే లేదు అని చెప్తూ, అతని భార్య పెట్టుకున్న కాలిమెట్టెలు

www.thraithashakam.org

గూర్చి నేను అడిగితిని. మీరేమో 'మూఢనమ్మకములను నమ్మను' అని మీరు మరీ చెప్తుంటారు కదా! కాలి మెట్టెలు నీ భార్య పెట్టుకొన్నది దాని అర్థము నీకు తెలుసునా! అవి ఎందుకు పెడ్తారో? ఏ సాంప్రదాయము అనుసరించి పెడతారో తెలుసునా? తెలియక పెట్టుకుంటే, మూఢనమ్మకమే కదా, అని అడుగగా "అందరూ పెట్టుకుంటుంటే మేము పెట్టుకోకపోతే బాగుండదు అని పెట్టుకుంటున్నాము" అని అన్నాడు. **"అయితే పూజలు, జపాలు చేసేవారిని దాని వివరము తెలిసి చేయాలని మీరంటారు. లేకపోతే అవన్నీ మూఢనమ్మకాలని కొట్టివేస్తారు కదా!** శాస్త్రము తెలిసి చేయాలి అంటారు కదా! మెట్టెలు పెట్టడములో ఏ శాస్త్రముందో చెప్పు, మీరు హేతువాదులు కదా!" అని అడిగాను. మేము కూడా హేతువాదులమే! కానీ మేము ఎందుకు మెట్టెలు ఆడవారు కాలివ్రేళ్ళకు పెడతారో చెప్తాము. మేము పెట్టాము, అర్థము చెప్పగలము, మేము ఏ పని చేసినా, అర్థము చెప్పగలము. శాస్త్రబద్ధతగా చెప్తాము, శాస్త్రబద్ధముగా చేస్తాము. మరి నువ్వు చెప్పేది శాస్త్రబద్ధత అయినప్పుడు, చేసేది కూడా శాస్త్రబద్ధతగా ఉండాలి కదా! మరి అలా లేకపోతే దానిని హేతువాదం అనరు, మూఢనమ్మకము అంటారు. మరి ఇప్పుడు నీవు మెట్టెలు గూర్చి వివరము తెలియదంటే మూఢనమ్మకం కాదా! అని అడగ్గా, మరి మాట రాలేదు అతనికి. కనుక సాంప్రదాయములను తెలిసి ఆచరించవలెను. అలాగే జ్యోతిష్యశాస్త్రము అనేది లేదని కొందరు అంటున్నారు, మేము ఉందని అంటున్నాము. కొందరు ఉందని చెప్తూనే, పెళ్ళిని జ్యోతిష్యశాస్త్ర ప్రకారము ఈ పెళ్లికి ముహూర్తం పెట్టాము అంటున్నారు. అసలు జ్యోతిష్య శాస్త్రము అంటే ఏమిటి? జా(ప)తకములో, ఏ రకంగా గ్రహముల సంచారముంటుందో, ఆ విధముగా వాడి జీవితము ఉండాలని, ఆ

సంచారము కూడా వాడి కర్మప్రకారము గ్రహముల సంచారంకల్గి వాడికి, లేదా ఒక స్త్రీ అయినా, పురుషుడైనా వాడి జీవితము అనేది ఉండును అనేది జ్యోతిష్యశాస్త్రము చెప్తున్నది. అది వాస్తవమైన జ్యోతిష్యం. నీవు ఎప్పుడు అన్నం తినాలి, ఎప్పుడు బాధపడాలి, ఎప్పుడు ఎవరితో పెళ్లి చేసుకోవలెనో కూడా అందులో నిర్ణయించబడి ముందే ఉండును. మరలా దానిని నీవు ముహూర్తం నిర్ణయించడములో గొప్పతనము ఏముంది? జ్యోతిష్యం నిజముగా తెలిసినటువంటి వాడు పెళ్లికి మూహూర్తం పెట్టరాదు. మరి బలమైన ముహూర్తం అంటే, జ్యోతిష్యం బలంలేనిదనా అర్థము. మరేమిటి అలాగే మీరు చెప్పేది ఉంది. తెలిసీ తెలియక చెప్పటం వలన జ్యోతిష్యశాస్త్రమునకు బలం లేకుండా చేశారు. కనుక **"జ్యోతిష్యము శాస్త్రము"** అనే గ్రంథాన్ని మేము వ్రాశాము. అది విప్లవాత్మకంగా ఉన్నది. అందులో రహస్యములన్నీ బయటకు వచ్చుచున్నవి.

## 4. కోడిపుంజు - పాదరసం

<u>తేది : 14.01.2008</u>

భోగి అనే పండుగను గూర్చి ఇంతకుమునుపు మనము తెలుసు కున్నాము. 'భోగి' అనగా భోగములను అనుభవించువాడు లేదా అనుభవించునది. భోగి నుండి మనము ఇప్పుడు యోగిగా మారవలెను. భోగి నుండి యోగిగా మారితే మోక్షము సిద్ధించును. భోగిగా మారిన తరువాతే యోగి అనవలెనని మేము ఇప్పుడు చెప్పుచున్నాము. భోగిగా మనిషి తయారై ఉన్నాడు కనుక అది నీకు మంచిదికాదు. యోగిగా మారవలెనని చెప్పుటమే పై సారాంశముగా గ్రహించవలెను. అందుకే భోగిమంటలు వేసి, జ్ఞానమనే అగ్నిలో నా భోగములను కట్టెలను

www.thraithashakam.org

కాల్చివేయుచున్నానని తెలియజేయుటయే దానిలో సందేశము. ఈ “భోగి” ని సంక్రాంతి పండుగ ముందురోజు జరుపుచున్నాము.

సంక్రాంతి దినము దక్షిణాయణము పూర్తయి ఉత్తరాయణం ప్రారంభమయినది. దక్షిణాయణము ఆరు నెలలు మేము యోగము గూర్చి తెలియలేక భోగిగా ఉండిపోయినాము. ఇప్పుడు ఉత్తరాయణ కాలం ప్రారంభమవుతున్న ఈ దినమునుండి యోగిగా మారుదునని బయటకు తెలిసే అర్థముగా మంటను వేసి, కట్టెలను భోగములుగా కాల్చివేసి యోగిగా మారుదును అని బాహ్యార్థముగా భోగిమంటలు వేస్తాము. క్రాంతి అనగా ‘తిరుగుబాటు’ అని అర్థము కలదు. దేనిమీద తిరుగుబాటు చేయాలి అన్నా అది మంచి తిరుగుబాటు అయివుండవలెను. ‘సం’ అనగా మంచి, ‘క్రాంతి’ అనగా తిరుగుబాటు, **సంక్రాంతి** అనగా **‘మంచి తిరుగుబాటు’** అని అర్థము కలదు.

భోగముల మీద తిరుగుబాటు చేస్తే సంక్రాంతి అగును. ప్రపంచములో మనకు అనేక విధములయిన పనులు గలవు. వాటియందే రుచి కల్గియుండటం వలన దాని నుండి మరలి రాలేకపోవటం వలన జ్ఞానము తెలుసుకోలేక పోతున్నాము. ఎందుకంటే జ్ఞానము చాలా చప్పగా ఉండును. ఎవరికీ రుచింపదు. ఎవరికైనా త్రాగవద్దని చెపితే అలాగే అనును, కానీ త్రాగక ఉండలేడు. ఎందుకంటే కర్మ బలీయమైనది. కానీ దానిని ఆత్మజ్ఞానము తెలుసుకోవటం వలన సులభముగా ఆ కర్మలనుండి తప్పించుకొనవచ్చును. ‘రసము’ అనగా రుచి అని అర్థము. అందుకే భగవద్గీతలో **‘నీటిలో ఉన్న రసమును నేనే’** అని దేవుడు అంటాడు. మనము ఆహారము దేనినైనా తీసుకొనిన అందులో రుచి ఉండును. కానీ రుచి లేనిదొకటే ‘జ్ఞానము’ అని చెప్పుకున్నాము. రుచి అనే రసమునే బాహ్యంగా

www.thraithashakam.org

ఒక వస్తువులో చూపాము. ఆ వస్తువు మొదట ఒక ఉంటగా ఉండును. అది క్రిందపడిన లేదా ముట్టుకున్నను పదింతలు అగును. ఇదేమి మాయ, మంత్రంవలె అనుకునేట్టు పదింతలను మరల ముట్టుకొనిన వేయి భాగాలవుతుంది. ఎన్ని భాగములైన అవి గుండ్రముగానే ఉండును. కనిపించని ఉంటగా కూడా మారగలదు. మరల అన్నియు కలిపితే కలుసుకుంటుంది. దానినే పాదరసము అందుము. దీనిని దేవుడు నమూనాగా ఈ ప్రపంచములో విడిచిపెట్టినాడు.

నీ తలలో కూడా ఇటువంటి రసమే ఒకటుంది. మాయ అనే రసం. ఎన్ని రూపములలోనైనా అది నీకు కనిపించును. ఎన్ని భాగములుగా కనిపించాలనుకుంటే అన్ని భాగములుగా కనిపించి నీకు అనుకూలముగా ఉండగలదు. కానీ జ్ఞానము అనునది చీల్చబడదు. మొదట ఏమి చెప్పితిమో చివరికి కూడా అదే ఉండును. జ్ఞానమనునది ఒకే పదార్థము. అనేక రకములుగా మారునది పాదరసము. అనేక రకములుగా, ఉల్లిగడ్డ పొరలుగా పాదరసమువలె అనేక రకములుగా మారునది మాయ. అది మన తలలో కలదు. ఈ మాయ అనేక రకములుగా మారుతూ మనల్ని మభ్యపెడు తున్నది. జ్ఞానము అనునది ఒకటుంది. అంటే మాయకంటే ఇది గొప్పది అని చూపించగలదు. అయితే 'పాదరసము' అనే పదములో రసము అంటే రుచి అని దానికి గుర్తు 'మాయ' అని తెలిసినది కానీ దానిముందు పాద అనే పదము కలదు. రసము అనేది కలదు అది నీ తలలో మాయ రూపములో ఉన్నది. దానిని భగవంతుని పాదముల వద్ద పెడితే అది పోతుంది. ఈ రసము అనగా రుచి, రసమునకు పోలికగా మాయ ఉన్నది. ఎక్కడున్నది అనగా నీ తలలో ఉన్నది. బలత్కారముగా నీ చేత పనులు చేయించును. అందువలన నీవేమి చేయవలెను, రసమును

www.thraithashakam.org

తీసుకుని ఎక్కడ వేయవలెను? గురుపాదములవద్ద వేయవలెను. అందుకే దానిని 'పాదరసము' అన్నారు. మరి నీ తలలో ఉన్న రసమును గురు పాదములవద్ద పెట్టవలెను అని అన్నాము కదా! మరి నీ తలను పెట్టిన పాదములు గురువువి కాకపోయిన అది వృథా అగును. కనుక మాయ కల్గిన మన తలను, గురుపాదముల వద్ద ఉంచిన అన్నాము, మరి ఆయనవీ పాదములే కదా అని అనవచ్చును. గురుపాదములవద్ద జ్ఞానము అనే అగ్ని ఉన్నది. గురుపాదములవద్ద మన శిరస్సును ఉంచిన, మన తలలో ఉన్న మాయ, జ్ఞానమనే అగ్ని వలన అది లేకుండా పోవును. అందువలన అది బాహ్యంగా కనిపించే ఒక వస్తువునకు పాదరసము అని పేరు పెట్టాము.

ఎవరైనా ఒక వ్యక్తికి తలలో మాయ ఉండును. కనుక ఆ మాయను వదిలించుకోవలెనని గురుపాదములచెంత తన శిరస్సును ఉంచవలెను. మన శిరస్సులో ఉన్న మాయ ఎన్ని విధములుగా అయినా మారును. అదే విధముగా బయట పాదరసము కూడా అన్ని విధములుగా మారగలదు. పాదరసమును మన చేతిలో వేసుకుని పట్టుకోవలెనని ప్రయత్నిస్తే అది నీకు దొరకదు. అదే విధముగా మాయ కూడా నీకు దొరకదు.

ఇంకను ఈ పాదరసము ఏమి చేయుననగా బంగారములో వేగంగా కలిసిపోవును. మాయ కూడా మనుషుల్లోనూ, అందునా జ్ఞానము ఇంతో, అంతో ఉన్నవారిలో మరికొంత వేగంగా కలిసిపోవును. మరి బంగారంలో ప్రవేశించిన పాదరసమును బయటకు మరల తెప్పించవలెనన్న బంగారమును వేడి చేయవలెను. అగ్నికి దూరముగా పాదరసము పోవును. ఈ విధానమును అనగా పాదరసము యొక్క పనితీరును మాంత్రికులు ఉపయోగించి ప్రజలను మోసపుచ్చుదురు. అది ఏ విధముగా అనిన ఒక నిమ్మకాయను తీసుకుని దానికి రంధ్రము చిన్నగా చేసి, అందులో కొద్దిగా

www.thraithashakam.org

పాదరసము పోసి, ఆ రంధ్రమును మైనపుపూతతో పూడ్చిపెట్టి, ఆ నిమ్మకాయను ఒక గుడ్డబొమ్మ యొక్క కడుపు భాగమున అమర్చి, దానిని ఒక వ్యక్తి ఎండలో ముందు కొద్దిసమయం ఉంచగా, బొమ్మలో అమర్చిన నిమ్మకాయలో ఉన్న పాదరసము వేడెక్కి, ఒక్క ఉదుటున ఆ బొమ్మ కొంత ఎత్తు ఎగిరిపడును. అప్పుడు అతను ఈ బొమ్మకు ప్రాణం వచ్చిందని చెప్పును. ఇదే మీ ఇంటిలో ఉన్న అందరినీ ఇబ్బంది పెట్టవలెనని చూస్తూవున్నది అని చెప్పి, దీనిని వదలగొడతాను అని చెప్పి వారినుండి ధనమును సంగ్రహించి, ఆ బొమ్మను నీడలో పెట్టగానే అది తర్వాత కదలదు. ఆ విధముగా పాదరసం పనితీరు ఉండును.

కనుక పాదరసమునకు, అగ్నికి పడదు అనే విషయం తెలిసినది కదా! అదే విధముగా మాయను పాదరసముతో పోల్చి, అది పోవాలంటే జ్ఞానమనే అగ్ని కలిగిన గురుపాదములవద్ద ఉంచవలెను. అందుకే పాదరసము ఒక ద్రవము కాదు, ఘనపదార్థము కాదు, లోహము కాదు. కనుక మాయకూడా ఇదే విధముగా ఉండును. బంగారమును సల్ఫ్యూరిక్ ఆమ్లంలో వేసినా ఏమీ కాదు కానీ పాదరసము వేస్తే మాత్రము బంగారము వ్యర్థమయిపోవును. బంగారము రంగుమారి, పొడిగామారును.

అదే విధముగా మరియొక విషయము చెప్పుకొనిన, అదేమనగా, 'కొక్కొరో' అనగా ఒక భాషలో 'అనేకమంది' అని అర్థము. 'కో' అనగా 'ఒక్కరే' అని అర్థమున్నది. 'కొక్కొరొకో' అనే పదములో కొక్కొరో అనగా అనేకమంది, 'కో అనగా ఒక్కరే. దీనిని కలిపి చూసిన **"అనేకమందికి ఒక్కడే"** అను అర్థము కలదు. అందరికీ ఒక్కడే అనేది ఎవరికి వర్తిస్తుంది అనగా కాలమునకే వర్తిస్తుంది అన్నట్లు, రాత్రిపూట ఝాముఝామున కోడి కూయును, కాలమును తెలియజేయును. కాలము అంటే ఎవరు?

దేవుడు. అందుకే భగవద్గీతలో **'కాలోస్మి'** అన్నాడు శ్రీకృష్ణుడు. కనుక దైవస్వరూపమైన కాలమును, ఆ కాలమే అందరికీ తెలియజేయుటకు ఝూముఝామున కోడి కూత కూస్తున్నది. మరి ఆ కాలమును తెలియ జేయటం మరియు 'అందరికీ ఒక్కడే' అన్నది తెలియజేయుట పురుషులకా? స్త్రీలకా? ఎవరికి వర్తిస్తుంది అని ఆలోచించుకోకుండా, మగకోడే ఎందుకు కూయవలెను? అని అనుకోకుండా, పరమాత్మ పురుషుడే, ఆ పురుషుడే అందరికీ పురుషుడే స్త్రీలకైనా, పురుషులకైనా అని తెలియజేయుటకు, పురుషునికి నమునాగా కోడిపుంజే కూత కూయుచున్నది.

అందుకే పూర్వము ప్రతి ఇంట ఒక కోడిపుంజును పెంచేవారు. ఎందుకనగా! **కోడి కాలజ్ఞాని**, మనిషి అజ్ఞాని. కనుక దైవస్వరూపమైన కాలమును గుర్తు చేస్తూ " అందరికీ ఒక్కడే" **(కొక్కొరోకో)** అని అరుస్తూ మనిషికి తెలియజేస్తూ ఉన్నది కోడిపుంజు.

# 5. త్రైత శకము

తేది : 22-01-2008

'విశ్వము' అనుదానిని రెండు భాగములుగా విభజించవచ్చును. అది 'ప్రపంచము' మరియు 'జగతి' అని విభజించవచ్చును. జగతి అనగా 'జ' అనగా పుట్టి, 'గతి' అనగా చనిపోయేవి అని అర్థములో 'జగతి' అయినది. ప్రపంచము అనగా ఐదు పంచ మహాభూతాలతో కూడుకున్నదని ప్రకృతిని అందురు. ఈ ప్రపంచములో జగతి ఉన్నది. అనగా చచ్చి, పుట్టే జీవరాశు లు ఉన్నవి కావున మొత్తము ప్రపంచము+జగతి=విశ్వము అంటున్నాము. జగతి అనే దానిని చూస్తే ఎలా ఉందంటే, అండము, పిండము, బ్రహ్మాండము

అనే వరుసలో ఉన్నదని చెప్పాము. సృష్ఠిలో మొట్టమొదట అండము అనే దానిని తీసుకుంటే, గ్రుడ్డు నుండే ఈ సృష్ఠి అంతా జరిగింది అనే దానికి సూచికగా గ్రుడ్డును (అండము) ముందు వచ్చినట్లు పెట్టినారు. మీరందరూ గ్రుడ్డును చూసే ఉందురు. గ్రుడ్డుపైన ఒక పెంకు ఉంటుంది, పెంకు తీస్తే తెల్లసొన ఒకటుంటుంది. తెల్లసొన తీసివేస్తే, పచ్చసొన ఒకటుంటుంది. మూడుంటాయి అని తెలిసింది అనగా అందులో త్రైతము ఇమిడి ఉన్నదని అర్థమయినది కదా! పిండము అనగా ప్రాణము పోసుకొనని శరీరమును పిండము అందుము. ప్రాణం పోసుకొనక ముందు పిండము కూడా మూడు భాగములుగానే ఉన్నది. చర్మము, కండలు, ఎముకలని మూడు భాగములుగా ఉన్నది. అనగా సృష్ఠి అంతా త్రైత సిద్ధాంతాన్ని ఆధారముగా చేసుకొని ఉంది, కానీ ఎవరూ తెలుసుకోలేదు, ఆ విషయము బయటకు రాలేదు.

ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము అనునవి ఉన్నవి కానీ త్రైతము అనేది ఇక్కడ నుండే ప్రారంభమయింది. ఇది ప్రారంభమయింది కావున ఇప్పటినుండి ఒక మార్పు, క్రొత్తదనము వచ్చును. ఈ మార్పు వచ్చినప్పటి ప్రతీసారీ గుర్తింపు వస్తుంది. మేము 1950లో జన్మించాము, ఇప్పటికి 58 సంవత్సరములు పూర్తయి 59నకు ప్రవేశించెదము. తరువాత సంవత్సరము 59 పూర్తయి 60వ సంవత్సరములో అడుగుపెట్టెదము. ఏదైనా 60 సంవత్సరములు పూర్తయితే 'షష్టిపూర్తి' అంటారు. ఏ వ్యక్తికైనా 60 సంవత్సరములు ఆయుష్షు పూర్తయితే మార్పు రావలెను. అనగా ఇప్పటి వరకు నీవు ఎలాగూ అసలైన జ్ఞానమార్గమును తెలుసుకోలేక పోయావు. అంటే (అంటే 60 సంవత్సరముల వరకు జ్ఞానము, దేవుని మార్గము తెలుసుకోనక్కరలేదు అని ఇక్కడ ఉద్దేశ్యము కాదు) ఇప్పటికైనా

దేవుని జ్ఞానము తెలుసుకొని, జ్ఞానపథములో అడుగుపెట్టు అని షష్ఠిపూర్తి అయిందని, క్రొత్త జన్మ మరలావచ్చినట్లు నీవు భావించాలి అని పెట్టారు. కానీ ఆ షష్ఠిపూర్తి అసలైన అర్థాన్ని ఎవరూ గ్రహించలేదు, ఒకవేళ గ్రహించామనినా, దానిని ఒక వేడుకగా చేసుకుంటున్నారు. కానీ జ్ఞానమును మాత్రము తెలుసుకోవటం లేదు.

ఇప్పుడు మాకు షష్ఠిపూర్తి అయితే కూడా ఒక మార్పు రావలెను కదా! మరి మేము షష్టిపూర్తికి పూర్వమే మేము జ్ఞానమును చెప్పుచుంటిమి కదా!, అంటే జ్ఞానము చెప్పే విషయములోనే ఇంకా క్రొత్త జ్ఞానాన్ని అందజేయాలనే మార్పురావాలి కనుక వచ్చే ఉగాది, అనగా క్రొత్త సంవత్సరములో ఆ మార్పును చూపించాలనుకుంటున్నాము. ఇంకా జ్ఞానమునకు గుర్తింపు రావాలంటే, ప్రత్యేకమైన పని చేయాల్సి వస్తున్నదన్న మాట. మేము ఇంతవరకు తెలియజేసిన దైవజ్ఞానమునకు మాకు సంతోషం గానే ఉన్నది కానీ, మీరు ఎంతవరకు దానిని అర్థము చేసుకున్నారంటే, ఎవరో కొద్దిమంది మాత్రము వాస్తవాన్ని విని అర్థము చేసుకొని, ఆచరిస్తున్నారు. మిగతావారు వినేంతవరకే పరిమితమైనారు గానీ, దానిని అనుభవములో పెట్టడం లేదు. ఆ విషయములో మాకు అసంతృప్తి ఉందని మీరు భావించడంలేదు. కొందరు మేము చెప్పే జ్ఞానమును ఆచరించే వారికి, మరికొంచెం ముందుకు ఆ జ్ఞానమార్గములో పోయేందుకు గాను క్రొత్తగా క్యాలెండర్‌ను ఒకటి తయారు చేశాము. అది **"త్రైత శక క్యాలెండర్"** అని పేరు పెట్టాము. అందులో సన్‌డే, మన్‌డే లు లేకుండా, ఆది, సోమ, మంగళ వారాల పేర్లు కూడా లేకుండా సూర్యుని దినము, చంద్రుని దినము, కుజుని దినము, బుధుని దినము, గురుని దినము,

www.thraithashakam.org

శుక్రుని దినము, శని దినము అని వారి పేర్లతో ఉండును. అది చూడంగానే ఇది ప్రత్యేకమైన క్యాలెండర్ అని తెలిసిపోవును.

ప్రపంచము పుట్టిన దగ్గరనుండి మొన్నమొన్నటి వరకు ఒక విధానము ఉండేది, మార్పు పెద్దగా ఏమీ జరుగలేదు. అది 1950 వరకు, అనగా ప్రపంచము పుట్టిన దగ్గరనుండి, 1950 వరకు కొంత మార్పే జరిగింది. మనుషుల సుఖములలో మార్పు ఏమీ అంతవరకు జరుగలేదు. నూతన ఆవిష్కరణలేమీ పెద్దగా జరుగలేదు. కానీ 1950 తరువాత సమాజములో కొంతమార్పు జరిగింది, 1960, 1970లలో కొంత వేగంగా సమాజము మారి, క్రొత్త క్రొత్తగా సౌకర్యవంతంగా బ్రతకటం నేర్చారు. ఆధునిక పరికరాలు కనిపెట్టారు. దానివలన విలాసవంతమైన సుఖమైన జీవితాన్ని మనిషి అనుభవించటము జరిగింది. ఇక 1990-2000 సం॥ మధ్య విపరీతమైన సౌకర్యములు, ఆవిష్కరణలు జరిగి, మనిషి సుఖముగా బ్రతకటానికి కావలసిన, ఫోన్లు, టీవీలు, వాహనములు, క్రొత్తక్రొత్త సాంకేతిక పరికరాలు ఆవిష్కరణలు, వినోదాత్మక సాంకేతికత అంతా పెరిగిపోయింది. అంతా మార్పు వచ్చేసింది. ప్రతీ రంగములో అభివృద్ధి జరిగింది. మరి ఇన్ని సుఖాలు ఎందుకు అభివృద్ధి చెందాయంటే నిన్ను సుఖాలవైపుకు మళ్ళించాలని మాయ చేసిన ప్రయత్నమది. ఒకప్పుడు చెప్పులు క్రొత్తవి కావాలంటే, చెప్పులు కుట్టే వాని దగ్గరకు వెళ్ళి వాడికి చెప్తే, మూడు, నాలుగు నెలలకు వాడు కుట్టి ఇచ్చేవాడు. అవి వేసుకుంటే, కాళ్ళకు వేళ్ళ సందుల్లో బొబ్బలు వచ్చేవి. ఆ చెప్పు రాపిడికి అలా జరిగేది. ఆ చెప్పులను చమురులో నానబెట్టి రెండు రోజుల తర్వాత వేసుకునే వారు. మరి ఇప్పుడో, దానిగూర్చి మాట్లాడలేని, సౌకర్యవంతమైన చెప్పులొచ్చేశాయి. కనుక మనిషికి ప్రపంచములో పూర్తి సౌకర్యవంతమైన జీవన విధానము

వచ్చినది. మరి 1950 వరకు రాని మార్పు, ఆ తరువాత మార్పు చాలా వేగవంతంగా జరిగింది అంటే, మనిషి సుఖాలవైపే పోవును, **"సుఖాలు జారుడుబళ్ళవంటివి"** అని, ఆ సుఖాలు విడిచిపెట్టి మనిషి ప్రక్కకు రాడని తెలిసింది. ఆ సుఖాలు పొందుటకొరకే రకరకాల దేవుళ్ళను మనిషే సృష్టించాడు. భక్తి అనేది ప్రపంచములో ఉన్నప్పటికీ, దానిని సుఖాలు పొందేందుకు ఒక పరికరంగానే వాడుచున్నారు. ఈ విధముగా ఇప్పుడున్న స్వామీజీలందరూ, మీరు ఈ దేవున్ని పూజించండి, మీకు అన్ని కోర్కెలు నెరవేరుతాయి అని చెప్పుచున్నారుగానీ, ప్రపంచానికంతటికీ మూల పురుషుడొకడున్నాడు, వాడినే 'పరమాత్మ' అంటాము. ప్రపంచపరమైన సుఖములన్నీ అశాశ్వతములు అని ఎవరూ చెప్పటం లేదు. ఏ స్వామీజీ ప్రసంగం విన్నా, ఆత్మ అని అంటారు. దైవం, జ్ఞానం అంటారుగానీ మరలా సుఖాలవైపునకే మాట్లాడుదురు.

సుఖాలగూర్చి దేవున్ని మీరేమీ అడగవద్దండి, **"దేవునికి ఏమి ఇవ్వాలో అది తెలుసు. ఏమి ఇవ్వకూడదో తెలుసు".** అనే ఆ విధానాన్ని మనమెవ్వరం జ్ఞాపకము చేసుకోవటం లేదు. పైగా "నేను స్వామీజీగా మారకముందు నావద్ద ఏమీ లేదు, ఫలానా దేవున్ని నమ్మాను ఈ రోజు చూడండి నా సౌఖ్యం. కనుక మీకూ అలాగే ఇవ్వబడతాయి" అని ఒక స్వామీజీ టీవీలో చెప్తున్నాడు. కానీ ఎవరి కర్మప్రకారము వారికది సంప్రాప్తమవుతుంది. కనుక కష్టసుఖాల అనుభవమునకు దేవునికి సంబంధము లేదని, ఎవరూ చెప్పటం లేదు. పైగా ఈ సౌకర్యవంతమైన ఈ ప్రపంచములో మనిషి తీరికలేకుండా అనుభవిస్తున్నాడు. ఇవన్నీ ఎందుకు జరుగుచున్నాయంటే, దేవునిమీద ధ్యాస లేకుండా మాయ వేసిన విధానమిది. ఎప్పుడూ అలా చేయక ఈ మధ్యకాలములోనే ఎందుకింత

www.thraithashakam.org

వేగంగా మార్పు జరిగింది, అంటే ఈ మధ్యకాలంలోనే **'త్రైత సిద్ధాంతము'** తెలియబడుతున్నది కావున, అటువైపు ఎవరూ వెళ్ళకుండా ఉండేందుకే ఈ సౌఖర్యవంతమైన జీవన విధానాన్ని మాయ రూపొందించింది.

త్రైత సిద్ధాంతములో ఏముంది అంటే! కేవలం ఆత్మ గురించే ఉన్నది. ఆధ్యాత్మికము సంపూర్ణముగా త్రైత సిద్ధాంతములో ఉన్నది. ఆధ్యాత్మికము మినహా ప్రపంచ విషయములేవీ ఇందులో ఉండవు. ప్రపంచ సంబంధముగా చూస్తే ఎవరి ప్రసంగములోనైనా ఈ సుఖాల కోర్కెల ప్రస్తావనలే ఉండును. ఆత్మను గూర్చి ఎవ్వరూ చెప్పటం లేదు. ఇప్పుడు మేము అసలైన ఆధ్యాత్మికమును గూర్చి వివరిస్తున్నాము. కానీ మీరిక్కడకు వస్తే మీ కర్మలు తొలగిపోతాయి అంటున్నాము అంటే, ఈ జ్ఞానము వలన వచ్చే కర్మలు తర్వాత జన్మలలో లేకుండా పోతాయి, ఆగామికర్మ రాదు. కానీ ఈ జన్మలో అనుభవిస్తున్న ప్రారబ్ధము అనే కర్మమాత్రము లేకుండా పోదు. అనుభవించవలసిందే. అయితే ఇదేమి జ్ఞానము వలన ప్రారబ్ధం రద్దవదా అంటే, ఏమో దేవుడు రద్దుచేస్తే అది జరుగకుండా ఆగవచ్చు. అది నీకు జ్ఞానంపైన ఉండే శ్రద్ధ, దేవుని ఇష్టం మీద ఆధారపడి ఉండును. ఆ విధముగా దేవుడు కనిపించే ప్రకృతి ద్వారా అన్ని సౌకర్యాలు కల్పించి, కనిపించని తనను గూర్చి తెలుసుకుంటావా లేదా అనే శ్రద్ధను మాత్రము నీకు విడిచిపెట్టాడు. అయితే మనిషి శ్రద్ధను ప్రపంచ సంబంధ విషయముల యందే ఉంచుతున్నాడు కానీ పరమాత్మయందు ఆ శ్రద్ధను ఉంచడం లేదు. ఎప్పుడూ లేనటువంటి స్వామీజీలు ఇప్పుడే ఎందుకు ఇందరు వచ్చారంటే, అసలైన దేవుని మార్గంనుండి ప్రక్క ద్రోవ పట్టించుటకు మాయ చేసిన ఆలోచనయది. ఈ మధ్య టీవీలో ఒక ధ్యానకేంద్రమని పేరు పెట్టుకున్న ఒక స్వామీజీ ధ్యానం చేసే పద్ధతిని చెప్తూ, ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తిముందర

కూర్చొనమని చెప్పి, మిగతావారిని కూడా అలాగే చేయమనగా, అక్కడున్న వారందరూ ఒకరి ఎదురుగా ఇంకొకరు పరిచయం లేకపోయినా కూర్చున్నారు. అప్పుడు "స్వామీజీ ఇప్పుడు మీ దగ్గర ఉన్న ఏదైనా వస్తువును, మీముందు కూర్చున్న వ్యక్తికి ఇచ్చి, అతనివద్దనుండి అలాగే అతని దగ్గర ఏదైనా వస్తువును తీసుకొని ఇద్దరూ కళ్ళు మూసుకోండి. ఇప్పుడు మీరు పట్టుకున్న వస్తువు, మీ ముందు కూర్చున్న వ్యక్తియొక్క ఇంటికి మిమ్మల్ని తీసుకువెళుతుంది, అలాగే మీరిచ్చిన వస్తువు, మీ ముందర కూర్చున్న వ్యక్తిని మీ ఇంటికి తీసుకువెళ్తుంది. జగమంతా చైతన్యస్వరూపమే ఆ వస్తువులు మీతో మాట్లాడుతాయి కూడా, కనుక మీరు సూక్ష్మముగా బయటకు వెళ్ళే అవకాశము ఉంటుంది, మరలా మీరు తిరిగి వచ్చినప్పుడు అక్కడ చూసిన దృశ్యాలను గుర్తుపెట్టుకోండి, మీ అనుభవాలను మీరిక్కడ కొద్ది నిమిషములు చెప్పండి" అని చెప్పి ముగించి, కొంత సమయం అయిన తరువాత కళ్ళు తెరవమన్నాడు. అందరూ కళ్ళు తెరిచారు. అప్పుడు మీ అనుభవాలు చెప్పమని ఒక వ్యక్తిని అడుగగా, అందుకు ఆ వ్యక్తి, నేను సూక్ష్మంగా నా ముందు కూర్చున్న వారి ఇంటికి ఈ పెన్ను ద్వారా వెళ్ళితిని, వీరి ఇంటిముందు ఒక పెద్ద ఎర్రని గేటుంది, లోపల మంచి మెత్తనైన సోఫా ఒకటుంది అని చెప్పగా అతని ముందు కూర్చున్న వ్యక్తి, నిజమే అంటున్నాడు. ఈ విధముగా ఎవరి అనుభవాలు వారు చెప్పుచున్నారు.

ఇంతలో ఒకామె ఇలా చెప్పటం మొదలు పెట్టింది. నేను ఈ దారపు ముక్కను పట్టుకొని కూర్చున్నాను. సూక్ష్మంగా బయటకు వెళ్ళేముందు, ఈ దారం నాతో మాట్లాడింది, నన్ను ఎందుకు తెంపావు అని అడిగింది, అప్పుడు నేను మరి నువ్వు ఎక్కడ ఉండదల్చావు అని అడుగగా, నేను యోగుల శరీరము మీదకానీ, చిన్నపిల్లల శరీరం మీదగాని

ఉండాలని ఉంది. అలాగే ఉంటాను కూడా అని అన్నదని ఆమె చెప్పుచూ, చూడండి ఈ ధ్యానం ఎంత గొప్పదో, సూక్ష్మంగా వెళ్ళగలిగాను, దారంతో మాట్లాడగల్గినాను అని ఆమె చెప్పిన విషయం మేము టీవీలో వినిన తరువాత అనిపించింది, పోనీ పైన వారు చెప్పినది అంతా అవాస్తవమే అనుకోండి, లేదా వాస్తవంగా జరిగింది అని అనుకుందాం అయిననూ అందులో దేవుని గూర్చి, దేవుని జ్ఞానము గూర్చి, దేవునిమార్గం గూర్చి ఏమైనా ఉందా? అంతా ప్రపంచవరమైన విషయములు చూసినట్టు వర్ణనే ఉంది కదా! దానిలో గొప్పతనం ఏముంది? అని మేము ప్రశ్నిస్తున్నాము.

ఈ మధ్య ఒక వ్యక్తి కనిపిస్తున్న ఏనుగును కాసేపు లేకుండా చేసెను. అది యోగం ధ్యానం అని పేరు పెడితే చాలా పెద్దయోగమే అగును. కానీ అది మంత్రం అగును. ఇందులో ప్రపంచ విషయమే ఉందికానీ, పరమాత్మ విషయం లేదుకదా! కానీ మేము చెప్పు జ్ఞాన విషయములో ఇటువంటివేమీ ఉండవు. కనుక ఇప్పుడు జ్ఞానప్రచారములో ఒక భాగంగా ఇప్పుడు **"త్రైత శకము"** అనే దానిని ప్రారంభిస్తున్నాము. శకము అనగా భాగము అని అర్థము. ఇంతవరకూ ఉన్న భాగం వేరు, ఇక తరువాత ఉండే భాగం వేరుగా ఉండును. కనుక ఇది త్రైతశకముగా ఆవిర్భవించును. అయితే దీనివలన ఏమి ప్రయోజనము అంటే, సృష్ఠి ఆది నుండీ ఉండేదంతా ఒక ఎత్తు, ఇప్పటి నుండి ప్రారంభమయ్యేది ఒక ఎత్తు. ఇదంతా జ్ఞానవరముగా మాత్రమే ఈ విధముగా ఉండునుగానీ ప్రపంచవరముగా కాదు. ఉదాహరణకు విక్రమార్కుని పరిపాలనానంతరం, శాలివాహన చక్రవర్తి పరిపాలించాడు. అప్పటినుండి శాలివాహన శకం ప్రారంభమయింది. కానీ వాటికి ఏ ప్రత్యేకత జరిగిందో ఇలాంటి శకముల వలన తెలియదు కానీ ఒకవేళ ఏదైనా మార్పు జరిగితే ప్రపంచవరముగా,

అతను ఒక సామాన్యుడు, శాలివాహనుడు ఒక చక్రవర్తిని ఎదిరించి రాజ్యాన్ని సంపాదించాడని గుర్తింపుగా ఆ శకాన్ని ఆయన ప్రారంభిచవచ్చు. కానీ అది ప్రపంచవరమైన ప్రత్యేకతే అగును, కానీ పరమాత్మ వరమైనది కాదు. కానీ మేము ప్రారంభించిన ఈ త్రైత శకము ప్రకృతి వరమైనది కాకుండా పరమాత్మ వరముగా ఉండును. మూడు ఆత్మల గూర్చి జీవాత్మ, ఆత్మ, పరమాత్మల గూర్చి చెప్పబడుచున్నది. ఇదేదో మేమిప్పుడు క్రొత్తగా చెప్పుచున్నది కాదు. ఈ విషయం సృష్ఠిలో అండజ, పిండజ, ఉద్భిజం లోనే ఉన్నది చూసుకోండి. అండము, పిండముల గూర్చి పైన త్రైత సిద్ధాంతము ఉన్నదని వివరించితిమి. ఇప్పుడు ఫలమును తీసుకుంటే త్రొక్క, గుజ్జు, విత్తనం మూడుగా ఉంది. ఈ విధముగా ఉద్భిజములకు ఉదాహరణగా చెప్పవచ్చు. కనుక మొత్తం సృష్ఠి అంతా త్రైత సిద్ధాంతముతో ఇమిడి ఉన్నది. కానీ ఇదివరకు గుర్తింపు రాలేదు ఇప్పుడు మరలా దానికి గుర్తింపు వచ్చింది. కనుక ఇప్పుడు మనమంతా త్రైత శకమునకు మొదటి వారమగుదుము. తరువాత వచ్చు వారంతా రెండవవారుగా ఉందురు. కనుక మేము ప్రారంభిస్తున్న త్రైత శకము అనునది మాకు గుర్తుగా ప్రారంభిస్తున్నాము అని అనుకోవద్దండి, ఇక పరమాత్మకు గుర్తుగా ప్రారంభిస్తున్నాము అని గ్రహించగలరు. ఇది ప్రపంచమంతా త్రైతశకమే, త్రైత సిద్ధాంతమే అమలుకు వచ్చును, దానినే అనుసరించుదురు. ఆ కాలమును మనమంతా ఈ శరీరములతో కాకుండా వేరే శరీరములతో చూడవచ్చును. కనుక ఈ త్రైత సిద్ధాంతమంతా ప్రపంచవ్యాప్తమై, ఏ మత సంఘములు లేక అంతా ఒకటే సిద్ధాంతమును అనుసరించుదురు. ఇప్పుడు నిప్పురవ్వ అంటుకుంది, జ్ఞానమనే నిప్పది, అజ్ఞానాన్ని భవిష్యత్తు కాల్చివేయును.

# ౬. నైజం-సహజం

తేది : 31.07.2007

జ్ఞానప్రచారములో భాగముగా **"సృష్ఠికర్తకోడ్-963"** అనే దానిని వివరముగా చెప్పి, దానిని గ్రంథరూపములో వ్రాసి దానిని ఉచితముగా అందరికీ పంచితిమి. ఆ విధముగా గ్రంథరూపములో తయారు చేయుటకు ముందే పోస్టర్స్ రూపములో చాలాచోట్ల సుమారు 30,000 వరకు వాటిని గోడలకు అంటించడము జరిగింది. వీటన్నిటికీ నిరూపణగా భగవద్గీతలో ఉన్న శ్లోకములను కూడా ప్రక్కనే వ్రాసి చూపాము. ఈ మధ్య కాలములో క్రైస్తవుల మత ప్రచారములో భాగముగా, "సృష్ఠికర్తకోడ్ 666" అని వ్రాయటం జరిగింది. అది చూస్తూనే, ఇది తప్పు, బైబిల్‌లో కూడా ఈ మాట లేదు. బైబిల్‌లో (యోహాన్ ప్రకటనల గ్రంథములో) సాతాన్ లేదా మాయ యొక్క కోడ్ 666 అని ఉన్నది. కనుక దానిని మనం సృష్ఠికర్తకోడ్‌గా వ్రాయటం తప్పు అనీ, 666 అను సంఖ్యకు బైబిల్‌నందు కూడా వివరము లేదనీ, అదే విధముగా 666 అనునది మాయకు గుర్తే అనీ భగవద్గీతలో ఒక అధ్యాయములో ఒక శ్లోకాన్ని గుర్తింపుగా చెప్పి, దానిని వివరముగా చెప్పటం జరిగింది. అదే విధముగా **"మాయకోడ్ 666 అయితే సృష్ఠికర్తకోడ్ 963"** అని, దానిని కూడా వ్రాయటం జరిగింది. దీనిని కూడా భగవద్గీతను అనుసరించియే వ్రాసాము.

ఈ విధముగా రాష్ట్రం మొత్తము మీద ఎన్నో వ్యయ ప్రయాసలకు ఓర్చుకుని వాటిని తెలియజేస్తే, అజ్ఞాన ప్రజలు, అదియూ ప్రత్యేకించి మన హిందువులు, విమర్శించటమే కాక, కేసులుపెట్టి, శిక్షను విధింపజేశారు. హంపి సమీప ప్రదేశంలో ఒక కాంపౌండ్ గోడ మీద మనవారు "సృష్ఠికర్తకోడ్ 963 అనీ సాతాన్ లేదా మాయకోడ్ 666" అనీ వ్రాసి, ప్రక్కనే భగవద్గీత

అని కూడా నిరూపణా నిమిత్తం వ్రాసిననూ, అది చూడక గమనించక, ఏదో చెడ్డపని చేసినట్లు, కోర్టుకువెళ్ళి, దాని కొరకు శిక్ష కూడా విధించారు. క్రిమినల్ తప్పుచేస్తే శిక్షవేసినట్లు, మనవారిలో కొందరికి జైలు శిక్ష విధించారు. అదే విధముగా జ్ఞానప్రచార నిమిత్తము మహానందిలో కూడా పోస్టర్స్ అంటిస్తే, మరునాడు ఆంధ్రభూమి పేపర్‌లో, అశ్లీలమైన పోస్టర్లు, మహానంది క్షేత్రపు గోడలపై కనిపించాయి. అటువంటి పేపర్లు మేము చించివేయటం జరిగింది. ఫలానా ప్రబోధ సేవాసమితి సభ్యులు అక్కడ కనిపించారు కనుక వారిని బంధించి, వారిమీద చట్టప్రకారము కేసును పెట్టితిమి అని వ్రాసినారు. అశ్లీలమనే పదము ఎందుకు వాడారు? భగవద్గీత అని వ్రాయటం అశ్లీలమా? సిగరెట్ల ప్రచారములున్నాయి, థమ్సప్ ప్రచారములు గోడలమీద ఉన్నవి. సినిమా పోస్టర్లు అశ్లీలముగా ఉన్ననూ, వాటిని చించకుండా అలాగే చూస్తున్నారు. సృష్టికర్తకోడ్ అనేది భగవద్గీతలో ఉన్నది అని చెప్పి, తెలియజేసే విధముగా గోడలమీద వ్రాస్తే అశ్లీలత కనిపించిందా? హిందూదేశానికి అధిపతులమనీ, రక్షకులమనీ చెప్పు కుంటున్న హిందువులు దేవాలయము దగ్గర వ్రాసిన **'భగవద్గీత'** అనే పదం వారికి అశ్లీలతగా కనిపించిందంటే హిందువులమనేవారు ఎంత గ్రుడ్డిగా ఉన్నారో తెలుస్తున్నది.

కనుక ఈ సమాజములో ఉన్న ప్రజలందరినీ మూడు మతములు ఉన్నవారిగా, హిందువులుగా, క్రైస్తవులుగా, ముస్లీమ్‌లుగా లెక్కవేసిన యెడల, మరీ ఘోరంగా ఉన్నది హిందూమతమే. ఇప్పుడు మేము సరిదిద్దిన విషయం క్రైస్తవులకు వ్యతిరేఖముగా కనిపించినా, వారు కొంత అర్థము చేసుకున్నారు. కేవలం హిందూమతములో ఉన్నవారికే, ఏమి అశ్లీలత కనిపించినదో ఏమో? ఇంకా లోతుగా చెప్పాలంటే, ఈ సమాజమును చూస్తుంటే చాలా విసుగ్గా

ఉంది, ఎందుకంటే, ఇంతటి సత్యమైన జ్ఞానమును చెపుతూవుంటే మమ్మల్ని నేరస్థునిగా చిత్రీకరిస్తున్నారు. ఇది మంచి పద్ధతేనా? అని ప్రశ్నిస్తూ ఒక గ్రంథమును వ్రాయుచున్నాము. అది **"హిందూ మతము×ఇందూ పథము√"** అని తప్పు, ఒప్పు గుర్తులను సంకేతముగా పెట్టి వ్రాసితిమి. ఈ విషయమును ఇంతకుముందు "ఇందూసాంప్రదాయములు" అనే గ్రంథాన్ని కూడా మేము వ్రాసితిమి. **'హిందూ'** అనేది తప్పనీ, **'ఇందూ'** అనే పదం ఒప్పనీ చెప్తూ వచ్చాము. పూర్వం "ఇందూ పథము"గా ఉన్నది ఇప్పుడు తప్పుగా "హిందూమతము"గా మార్పు చెందినది. హిందూదేశముగా మారినది. ఎక్కడో పాకిస్థాన్‌లో ప్రవహిస్తున్న సింధూనది వలన 'హిందూ' అని పేరొచ్చింది అని అంటున్నారు. "మరి అంతకంటే పెద్దదైన గంగానది, బ్రహ్మపుత్రలాంటి నదులు ఎన్నో మనదేశంలోనే ప్రవహిస్తుంటే, వాటి పేర్లు పెట్టక సింధూదేశం అని దానినే హిందూదేశమని పేరు పెట్టవలసిన పనేమి వచ్చింది?" అని మేము ప్రశ్నిస్తున్నాము.

ఇంకొక మాటేమంటే మీరు భగవద్గీతానుసారము జ్ఞానమార్గములో నడవండని మేము తెలియజేస్తున్నాము. దానినే "ఇందూ పథము" లేదా "జ్ఞానపథము" అని అంటున్నాము. 'పథము' అనగా దారి లేదా మార్గము అని అర్థము. మొట్టమొదట జ్ఞానము తెలిసినవారు ఎవరైనా ఇందూ పథములో ప్రయాణించే వారు. పూర్వం అందరూ ఆ విధంగా జ్ఞాన మార్గములో ఉండేవారు కావున అంతా ఇందూ పథములోనే ఉండేవారు కనుక దీనిని "ఇందూపథము'గా పూర్వము పిలిస్తే, తరువాత అది 'హిందూమతము'గా మారిపోయినది. అనగా "ఇందూ" అనునది పోయి "హిందూ" అయినది. "పథము" పోయి "మతము"గా మారెను. ఈ విధముగా మేము చెప్పే క్రొత్త జ్ఞాన విషయములలోనే రహస్యములన్నీ

బయటపడుతున్నవి. ఈ విషయాన్ని మనము ధైర్యంగా చెప్పుకొనవచ్చును. మరి ఇప్పుడు ఎవరైనా ఇందూ పథములోనే ఉన్నామని అనుకుంటున్నారా? లేదు! అంతా హిందూ మతములోనే ఉన్నామంటున్నారు.

'మతము' అనేది మాయతో కూడుకొని ఉన్నది. కనుక 'మాయ' అనునది 'పథము'ను 'మతము'గా, 'ఇందూ'ను 'హిందూ'గా మార్చివేసి ప్రజలను ప్రక్కదోవ పట్టించింది. ఇప్పుడు మేము ఆ విషయాలన్నింటినీ చెప్పి, దానికి భగవద్గీతను నిరూపణగా చూపించిననూ, కొందరు వినిపించుకునే పరిస్థితిలో లేకపోవడమే కాకుండా, అశ్లీలముగా ఉందనటం అజ్ఞానము కాక మరేమి? ఈ విషయములో ఒక న్యాయవాది, "ఏమయ్యా! మతము గూర్చి గోడలమీద వ్రాస్తున్నారంట, మీ వీపులమీద వ్రాసుకొన వచ్చును కదా!" అని మనవారిని ఉద్దేశించి అన్నారంట. "అన్నింటికీ అదే చట్టం తెమ్మనండి, వేటినైనా గోడలమీద వ్రాసుకోకుండా అన్ని రకాల వ్యాపార ప్రకటనలను వారివారి వీపులమీద వ్రాసుకునేటట్టు" అది చేయలేరు వీరు.

కనుక వీరందరికీ తెలియజేసే విధముగా "ఇందూ పథము" అనే గ్రంథాన్ని వ్రాయటం జరిగింది. కనుక మనమందరమూ హిందూ మతము వారిమి కాకుండా, ఇందూ పథము వారమని అంగీకరిద్దాం. మనందరిదీ దైవమార్గమని, దానినే ఇందూపథమని, జ్ఞానపథమని తెలుసుకుందాము. ఈ ఇందూ పథము అనునది కేవలము "హిందూమతము" అని పిలిపించు కునే వారికేనేమో అనుకుంటే పొరపాటు అగును. దైవమార్గము అనునది ముస్లీమ్ అయినా క్రైస్తవుడైనా ఎవరికైనా దైవజ్ఞానము అవసరమే కనుక వాడు "ఇందువే" అగును. అతని మార్గము ఇందూపథమే అగును.

కనుక ఎవరేమనుకొనినా మేము ఇందూ పథములో ఉన్నవారమే కనుక ఏ మతములో జ్ఞానమున్ననూ మేము తప్పక వాటిని అంగీకరించె

www.thraithashakam.org

దము, కానీ ఏ మతములో ఉన్న అజ్ఞానమునైనా మేము అంగీకరించము, దానిని ఖండించెదము. ఇది మా నైజము. ఇచ్చట "నైజము" అనగా స్వభావమని, ఉన్నదున్నట్లు చెప్పడమని అర్థం వస్తున్నదని చెప్పవచ్చును. దానినే నైజం అంటే, లేనిది ఉన్నట్లు చెప్పటం కూడా కొందరికి నైజమైతే దానికి ఏమి చెప్పెదము? కనుక అసలైన అర్థం తెలుసుకుందాము. అయితే హిందీలోగానీ, సంస్కృతంలోగానీ "నై, నై" అనగా "లేదు లేదు" అని అర్థము కదా! 'న' అనినా, నై అనినా 'లేదు' అని అర్థము వచ్చును కదా! 'నైజము' లో 'జము' లేదా 'జం' అనిన "పుట్టుట" అని అర్థము. నైజం లేదా నైజము అనగా 'పుట్టుక లేనిది' 'పుట్టకుండా ఉన్నది' అని అర్థము కలదు. పుట్టనిది కూడా ఒకటుంది అన్నమాట. నీవు పుట్టావంటే, నీతోపాటు పుట్టకుండానే ఉండేది కలదు అదే నైజం. దీనికి "సహజం" అనే పేరు వర్తించదు. 'నైజం' అనేది ఒకరు చెప్పితే వినేదికాదు. నేర్చుకునేది కాదు. ఒక వ్యక్తి వైద్యవృత్తిని అవలంబిస్తున్నాడంటే, అది అతను పుట్టి, పెరిగి, మధ్యలో నేర్చుకున్నదగునుకానీ నైజం కాదు. ఇంకొక వ్యక్తి ఎలక్ట్రీషియన్ పని చేస్తున్నాడు అది ఆ వ్యక్తి నైజం కాదు, అది మధ్యలో వచ్చినది. కనుక మధ్యలో నేర్చుకునేది కాదు. నేర్చుకోకుండానే నా దగ్గరున్నది, కనుక "జ్ఞానాన్ని ప్రశంసించి, అజ్ఞానమును ఖండించునది మా నైజం".

మీరిప్పుడు నేను చెప్పిన జ్ఞానమును తెలుసుకుని ఇది అసలైన జ్ఞానము అని మీరిప్పుడు చెప్పుచున్నారంటే, అది మీరు ఇప్పుడు మధ్యలో నేర్చుకున్నట్లగును కనుక మీది 'నైజం' కాదు. మేమిప్పుడు నేర్చుకొనలేదు, కానీ మేము జ్ఞానము చెప్పగలము ఎందుకంటే మాది 'నైజం', పుట్టకుండానే ఉన్నది. మీరిప్పుడు 'నైజం' అనే దానిని లోతుగా చూచిన మీకర్థమవుతుంది. ఈ విధముగా జ్ఞానం చెప్పటం అనేది ఒక ఇరవై ఏళ్ళకో, ముప్పైఏళ్ళకో

రాలేదు. ఇప్పుడున్న నా వయస్సు అరవైఏళ్ళకో రాలేదు, ఇది ముందునుండే ఉన్నది, అనగా ఆదినుండే ఉన్నది.

ఇప్పుడు ఎవరికైనా జ్ఞానము తెలియటం కానీ, మరేదైనా వృత్తికానీ పుట్టిన తరువాత కొన్నాళ్ళకు రావచ్చును. అది వారి 'నైజం' కాదు "సహజం" అనగా 'సహ' అనగా "వారితో పాటు కూడా" అని అర్థము కలదు. 'జం' అనగా పుట్టుక అనగా పుట్టుకతో వచ్చి, తరువాత అవి బయటపడేవి కనుక వాటిని 'సహజము' అందురు. నీతోపాటు పుట్టినది అని అర్థము కలదు. పుట్టిన తరువాత నేర్చుకున్నవి మరచిపోవచ్చును, మాన్పించవచ్చును. పుట్టిన తరువాత నేర్చుకున్న "బీడీ త్రాగటం" అనే దానిని మాన్పించవచ్చును. కానీ పుట్టక ముందునుండీ నీతోపాటు ఉన్న 'నైజం' ను మాన్పించలేము. అది మాకున్నది, మమ్మల్ని ఆ విషయమునుండి, అనగా **'జ్ఞానమును ప్రశంసించటం' 'అజ్ఞానమును ఖండించటం'** అనే మా నైజం నుండి ఎవరూ, ఏ విధముగానైనా మమ్మల్ని మరల్చలేరు, మార్చలేరు. ఎందుకంటే అది నైజం.

కనుక నీవు మాయమార్గమైన మతములోనికి వెళ్తావో, జ్ఞానమార్గము, దేవుని మార్గమైన పథములోనికి వెళ్ళెదవో నీ ఇష్టం. మాయ మార్గములోనికి పోకూడదు అనుకుంటూనే మాయమార్గములోనికే కొందరు పోవుచున్నారు. పైగా మేము నిజమైన దేవుని మార్గములో ఉన్నామనుకుంటు న్నారు. అదే జ్ఞానమార్గము అనుకుంటున్నారు. అది వారి భ్రమ అగును. అది మాయ పనే అగును. ఒక స్వామీజీ బట్టలు లేనివారికి బట్టలిస్తున్నాడు, అనారోగ్యం ఉన్నవారికోసం ఆసుపత్రులు కట్టాడు, వ్యాయామాలు, ఆసనాలు నేర్పుతాడు. ఇంకా జ్ఞానము కూడా చెప్తాడు, కానీ అది మాయాజ్ఞానమే చెప్పుచున్నాడు, కానీ దానిని అందరూ ప్రశంసిస్తున్నారు ఎందుకంటే అది

వారి నైజం కాదు సహజం కనుక. కాని అది మాయా జ్ఞానమని దానిని ఖండించటం మాకు సహజం కాదు నైజం.

కనుక నైజం, సహజం అనే పదాల్లో అసలైన అర్థము తెలిసింది కదూ! బహుశా 'నైజం' అనేది అసలైన అర్థం ప్రకారము అయితే ఎవరికీ ఉండదేమో! నేను మాత్రం క్రొత్త అర్థమేమీ చెప్పలేదు కదా! 'నై' అంటే లేదు 'జం' అంటే పుట్టునది అని ఆ పదమే అర్థము చెప్పుచున్నట్లు లేదా? మీకు అది తెలియనిదై ఇంకొక అర్థముతో వాడుచున్నారు కావున మేము దానినే చెప్పుచున్నాము, కానీ మేము క్రొత్తగా చెప్పునది ఏమీ లేదు.

కనుక ఏ మతములో జ్ఞానమున్నా స్వీకరించటం, ఏ మతములో ఉన్న అజ్ఞానమునైనా ఖండించటం అనేది మా నైజం. కనుక మీరందరూ మతం అనే దృష్టి పెట్టుకోకుండా, పథములోనికి రండి. నేను ఇస్లామ్ మతస్థుడిని అని అన్నావంటే సైతాన్ లేదా మాయమార్గములో ఉన్నట్లే లెక్క. క్రైస్తవ మతము అని చెప్పారంటే సాతాన్ లేదా మాయలో ఉన్నట్లే లెక్క. ఈ విధముగా అందరూ మతము అనే మాటను విడిచిపెట్టి **"ఇందూ పథము"**లోకి అడుగుపెట్టండి. అసలైన పరమాత్మ జ్ఞానమును తెలుసు కొనుటకు అవకాశం ఉంది. కనుక ఈ జ్ఞాన విషయములను మీరు తెలుసుకొని మిగతావారికి తెలియజేయండి. ఒక దీపముతో వంద దీపాలను వెలిగించినా, ముందు వెలిగించిన దీపానికి ఎంతమాత్రము వెలుగు తగ్గనట్లు, ఒక జ్ఞాని ఎంతమందికి తన జ్ఞానమును తెలియజేసినా, ఎంత మాత్రము జ్ఞానము చెప్పే వ్యక్తికి వెలుగు తగ్గదు కదా! కనుక మిగతావారిని కూడా జ్ఞానులుగా చేయుటకు ప్రయత్నం చెయ్యండి.

# 7. పైత్యం - సైత్యం

తేది : 18.05.2008

మనిషిని ఉదాహరణగా తీసుకొనిన యెడల అతనిని లేదా ఆమెను రెండు విభాగములుగా చెప్పవచ్చును. ఒక భాగము తల, ఒక భాగము శరీరము అనగా శరీరమంతా ఒకెత్తు, తలమాత్రము ఒకఎత్తు అగును. ఈ విధమైన విభజన ఎందుకు చేశామనగా! బయటకు సంబంధించిన విషయములను ఆలోచించి, చర్చించేది, అంతా తలయే అగును. దానికంతటికీ అనుగుణముగా నడిచేది శరీరము.

కొంతమందికి శరీరము దృఢముగా ఉండును. తల సరిగ్గా పనిచేయదు అనగా మెదడు పనిచేయదు. కొందరికి మెదడు బాగా పనిచేస్తుంది, శరీరము సరిగా పనిచేయదు. అనగా బలహీనముగా ఉండును. ఇంకనూ కొందరికి మెదడు పనిచేస్తుంది శరీరమూ బలంగా ఉంటుంది. ఈ విధముగా ప్రపంచములో మనుష్యులున్నారు. తల సక్రమముగా పనిచేయక, ఒకటి చెపితే ఇంకొక రకముగా అర్థము చేసుకొని, విషయం అర్థము కాకుండా పోయి, దానికి సంబంధించిన విషయం కాకుండా ఇంకొక విషయం గూర్చి మాట్లాడి ఉంటే, బుర్ర పనిచేయలేదనో, తల పనిచేయలేదనో అంటాముగానీ శరీరము పనిచేయటం లేదు అని అనము కదా!

ఈ విధముగా మెదడు పనిచేయని వారు చాలామంది ఉన్నారు. ఈ విధముగా మెదడు ఏ విషయంలో సరిగ్గా పనిచేయటం లేదనగా ఒక్క జ్ఞాన విషయములపైన మాత్రమే! ప్రపంచ విషయములలో వారి బుర్ర చాలా బాగా పనిచేస్తుంది. దీనికి ఉదాహరణగా మేము సనాతన విషయములు జ్ఞానవరముగా, ఇందూసాంప్రదాయ విషయములను

www.thraithashakam.org

చెప్పుతూ, వాస్తవ విషయములను ఇంతకుముందెవ్వరూ చెప్పని విషయములను చెప్పుచున్నామంటే, ఇందువులుగా పేరు పెట్టుకున్నవాళ్ళకు అసలు 'ఇందూ' అంటే ఏమిటో తెలియదు. వారి సాంప్రదాయములకు అర్థము తెలియదు, చెప్పినా వారికర్థము కాలేదంటే ఏమిటర్థము? వారి బుర్రలు పనిచేయలేదని అర్థము. దీన్ని పెద్దలు ఏమన్నారంటే పైత్యం అన్నారు. పైత్యం అనే పదములో 'పై' అనగా పైది అనగా బుర్ర 'త్యం' అనగా పనిచేయలేదని అర్థము. **'పైత్యం'** అనగా **'పైన ఉన్నది పనిచేయలేదు'** అని అర్థముగా ఉన్నది. 'త్యం' అనగా త్యజించటం అని అర్థము. ముందు ఆ పదము 'పైత్యజం'గా ఉండేది. కాలగమనములో 'పైత్యం'గా మారెను. ఈ పైత్యము అనే పదమును ఇప్పటి వాడుక భాషలో కూడా ఏదేదో మాట్లాడే వానిని ఉద్దేశించి 'వీడికి బాగా పైత్యం తలకెక్కింది' అనుమాట మనము వింటూ ఉన్నాము. కొందరికి గంజాయి త్రాగిన, సారాయి త్రాగిన పైత్యం వచ్చి ఏదేదో మాట్లాడుదురు. కానీ చాలామంది ఈ సారాయి, గంజాయి త్రాగకపోయినా సరే పైత్యం వలన మాట్లాడినవారు ఉన్నారు. ఈ పదవాడిక తమిళనాడులో కూడా కలదు. ఎంత చెప్పినా అర్థము చేసుకోలేని వ్యక్తిని వారు 'పైత్యకారి' అని సంబోధించుదురు.

ఈ విధముగా తల సరిగ్గా పనిచేయని పరిస్థితిని **'పైత్యం'** అందురు. అదే విధముగా శరీరము సరిగ్గా పనిచేయని పరిస్థితిని **'సైత్యం'** అందురు. శరీరము చల్లబడిపోయి, చమట్లుపట్టి, లోపలున్న వేడి తగ్గిపోయి, శరీరము నియంత్రణ పోయిన యెడల ఆ పరిస్థితిని 'సైత్యము' అని పిలిచెదము. అయితే ఈ సైత్యమును కొంతవరకు మరలా లేకుండా చేయవచ్చును. కానీ పైత్యమెక్కిన వ్యక్తిని మాత్రము ఆ పైత్యాన్ని లేకుండా చేయటం చాలా కష్టమగును.

మేము భగవద్గీతను అందులో ఉన్న విషయములను ప్రచారము గావిస్తూ ఉంటే కొందరు అన్యమత ప్రచారము చేస్తున్నారని మమ్మల్ని అన్నారు. సరే శ్రీకృష్ణుని చిత్రమును పెట్టుకొని, ప్రచారము చేస్తూ ఉంటే మమ్మల్ని హిందువులు కాదంటారేమిటని అడిగితే, "అవన్నీ ప్రక్కకు పెట్టండి, మీరు కావాలని ఆ విధముగా చిత్రములు పెట్టుకున్నారు" అని అన్నారంటే వారి బుర్రకు పైత్యం ఎక్కినట్లే కదా!

అదే విధముగా సైత్యము అనునది శరీరము నియంత్రణ తప్పి పోవటం అని తెలుసుకున్నాము కదా! మన శరీరము మూడు విషయములలో నియంత్రణ పోయిన సైత్యం వచ్చును. మన పెద్దలు **వాతము, పిత్తము, శ్లేష్మము.** అను మూడు దోషముల వలననే, అవి ప్రకోపించటం వలననే శరీరమునకు రోగాలు వచ్చును అని చెప్పారు. శరీరముపైన దద్దుర్లు లాంటివి వచ్చినవనుకో, కొందరు ఆ దద్దుర్లు పైత్యం వలన వచ్చాయంటారు, కానీ కాదు. పైత్యం వచ్చేది తలకు. శరీరమునకు పిత్తము ప్రకోపించింది కానీ పైత్యం కాదు. శ్లేష్మము ప్రకోపించిన, ఒళ్ళంతా చెమట్లు పట్టి, శరీరమంతా చల్లగా అగును. వాతము ప్రకోపించిన, ఒళ్ళంతా నొప్పులు కలుగును. అదే విధముగా ఒంటిపైన వచ్చు ఎలర్జీలాంటి దద్దుర్లు పిత్తము ప్రకోపించిన వచ్చును. ఈ విధముగా వాతము, పిత్తము, శ్లేష్మముల వలన కొన్ని వందల రోగములు, ఒక్కొక్క దానికి 10,000 రోగముల చొప్పున మొత్తము ముప్పైవేల రోగములు కలవు. ఈ ముప్పైవేల రోగములు దేనికి సంబంధించినవి అనగా శరీరమునకు సంబంధించినవే, దీనినే సైత్యముగా చెప్పవచ్చును.

అదే విధముగా పైత్యంతో బాధపడేవారిని కూడా రెండు రకములుగా విభజింపవచ్చును. ఒక రకమైన వారు అజ్ఞానము వలన పైత్యమెక్కి

మాట్లాడువారు. ఇంకొక రకమైనవారు జ్ఞానము ఎక్కువని భావించి పైత్య మెక్కి మాట్లాడువారు. అనగా జ్ఞానము, అజ్ఞానమని రెండు రకములయిన పైత్యకారులు ఉన్నారు. ఎప్పుడైతే సమయస్ఫూర్తి, విచక్షణాజ్ఞానము, ఆలోచనా శక్తి తక్కువైనదో వాడిని పైత్యకారి అనవచ్చును. ఇటువంటి వారు ఎంతమంది ఉన్నారంటే, అందరూ అని చెప్పవచ్చును.

మరి శరీరమునకు పట్టిన సైత్యం మందులు వాడటం వలన తగ్గును. కానీ పైత్యమునకు మందు జ్ఞానమే అగును. ఆత్మ జ్ఞానమును అసలైన పద్ధతిలో తెలుసుకుంటూ ఉంటే, అది నీ పైత్యమునకు మందై ఆ పైత్యం పోవును. ఒక వైద్యుడు సైత్యంనకు మందు ఇవ్వగలడు కానీ మెదడుకు, అందులో ఉన్న బుద్ధికి, మనస్సుకు, చిత్తమునకు, ఆలోచనలకు అతను మందు ఇవ్వటం జరుగదు. చెడు ఆలోచనలు రాకుండా, మంచి ఆలోచనలే వచ్చుటకు మందులు వైద్యుని వద్ద ఉన్నవా అంటే ఉండవు.

కనుక వైద్యులు వాతం, పిత్తం, శ్లేష్మంలకు మాత్రము మందులు ఇవ్వగలరు. ఇది పూర్వపు వైద్యులకు ఈ విషయము తెలుసుగానీ ఇప్పుడున్న నవీన వైద్యులకు వాతం అంటే ఏమో తెలియదు పిత్తం, శ్లేష్మం అంటే అసలు తెలియదు.

మరి ఈ పైత్యంను తగ్గించుకోవాలంటే అది మనకు ఉందా లేదా అని మనము పరీక్షించుకోవలెను. అలా పరీక్షించుకుంటే ఎంతో కొంత, కొందరికి, చాలా పైత్యం మరికొందరికి ఉన్నట్లు, మొత్తము మీద అందరికీ ఈ పైత్యం అనేక స్థాయిలలో ఉన్నట్లు తెలియును. ఒక విషయంలో పైత్యం లేకపోయినా, ఇంకొక విషయంలో ఉన్నా అతనిని పైత్యం ఎక్కినవాడిగనే పరిగణించవచ్చును. మరి దీనికి మందు ఏమి అనగా! ఒకటే చికిత్స ఒకటే మందు, కేవలము **ఆత్మజ్ఞానమే.** అందులో నీ గూర్చి

నీవు తెలుసుకునేందుకు ప్రయత్నం చేయాలి. తద్వారా నీవు చేసిన తప్పులు నీకు తెలియును. అప్పుడు నీకు పైత్యం ఉన్నదని తెలియును. అంతేగానీ నీకు పైత్యం వున్నదని ఇతరులు చెప్పినా నీవు తెలుసుకోలేవు.

ఆ విధముగా నీ తప్పులను తెలుసుకోవటం వలన వాటిని సవరించు కొనుటకు అవకాశము కలదు. అప్పుడు మనమందరమూ పైత్యం అనే రోగమునుండి బయటపడగలము. సైత్యం మాత్రము నీ కర్మలో ఏది ఉందో అది తప్పకుండా నీ శరీరమునకు వస్తుంది. సైత్యం నీ ఆధీనములో లేదు. మరి ఇప్పుడు కొందరికి "మరి పైత్యం కూడా ఒక రోగమే కదా! ఏ విధముగా మాట్లాడాలో, ఆలోచించవలసినది కూడా కర్మలో ఒక భాగమే కదా! మరి ఇది కూడా మన ఆధీనములో లేనట్లే కదా!" అని ప్రశ్నించవచ్చును.

పైత్యంగానీ, సైత్యంగానీ కర్మప్రకారమే ఉండును. అయితే మరింతగా ఎందుకు చెప్పాలని మరో ప్రశ్నవచ్చును. కర్మప్రకారమే వాస్తవముగా ఉన్ననూ, ఆ కర్మను సైతము నిరోధించే శక్తి, దేనికీ లేదు, కేవలము **ఆత్మజ్ఞానమునకు** మాత్రము కలదు. కనుక పైత్యం మీద దృష్ఠి పెట్టి, జ్ఞానము ద్వారా దీనిని మార్చువచ్చు అనే ధ్యాస కల్గిన యెడల దానిని మార్చువచ్చును.

ముందు నీవు పైత్యం గూర్చే ఆలోచింపవలెను. సైత్యం గూర్చి ఆలోచింపకూడదు ఎందుకనగా! నీవు జీవాత్మవు, నీవు ఉండేది తలలో గుణచక్రములో. ముందు నీవుండే చోటును శుభ్రము చేసుకొనవలెను. కనుక కేవలము తలకున్న పైత్యంను తగ్గించుకునేందుకు ప్రయత్నం చేయవలెను. సైత్యం అనగా శరీరమునకు వచ్చే రోగాల మీద ధ్యాస పెట్టవద్దు. కర్మలో ఏది జరగాలో అది జరుగును, మందులువాడితే తగ్గాలనే

కర్మ ఉంటే అలాగే తగ్గును. అదే విధముగా మందులు వాడినా తగ్గకూడదను కర్మ ఉంటే మందులు వాడినా తగ్గదు. కనుక కేవలము పైత్యం మీదనే శ్రద్ధ పెట్టుకొనవలెను. దానిని జ్ఞానము ద్వారా తగ్గించుకునే ప్రయత్నం చేయవలెను.

# 8. శైవము-వైష్ణవము

తేది :18-06-2008

ఆదిలో ప్రపంచము పుట్టినప్పుడే, మనుషులు పుట్టినప్పుడే అంటే వారి తలకాయలు, వారి తలకాయలలో ఉన్న మెదడు పుట్టింది. ఆ సమయంలో వారి మెదడులో గుణములు పుట్టాయి. ఆ గుణములనే మాయ అని చెప్పుకున్నాము. ఎప్పుడైతే దేవుడు ప్రకృతి లేదా మాయను పుట్టించాడో అప్పుడే దానికి వ్యతిరేఖమైన జ్ఞానము అనే దానిని కూడా పుట్టించినాడు. జ్ఞానము సృష్ఠి ఆదిలో మొట్టమొదట ఆకాశ వాణి ద్వారా సూర్యునికి చెప్పబడినది. సూర్యునికి చెప్పబడిన జ్ఞానము, సూర్యుని ద్వారా ఇక్ష్వాకునికి తెలిసింది, ఇక్ష్వాకుని ద్వారా అందరికీ అది తెలిసిపోయింది. ఈ విధముగా కొంతకాలము ఉన్న తరువాత మాయా ప్రభావముతో జ్ఞానము తెలియకుండా పోయి అజ్ఞానము తయారయిందని ముందే మనము చెప్పుకున్నాము **"మాయ దేవునికి వ్యతిరేఖమే, కానీ దేవునికి శత్రువుకాదు."** ఎందుకనగా మాయను ఆ విధముగా చేయమని దేవుడే శాసించాడు కనుక మాయ తన బాధ్యతను సక్రమముగా నిర్వర్తిస్తున్నది. మాయను తెలుసుకుని, దానిని దాటే ప్రయత్నమే జ్ఞానము తెలుసుకోవటము, జ్ఞానమును దేవుడే సృష్ఠి ఆదిలో చెప్పినాడు. అయితే మనము కొన్నాళ్ళకు జ్ఞానాన్ని విడిచి పెట్టి,

మాయ ప్రలోభాలకు లొంగిపోయాము. మాయ ఎక్కడుంది అంటే నీ శరీరములో, నీ తలలోనే గుణముల రూపములో ఉంది అని చెప్పవచ్చును.

ఇప్పుడు అందరూ యజ్ఞాలు చేస్తున్నారు, హోమాలు చేస్తున్నారు, గుడులు కడుతున్నారు. మీరేంటి అందరూ మాయలో పడ్డారు అంటున్నారు అని మీరు ప్రశ్నించవచ్చును. అసలు దేవుడేమి చెప్పాడంటే, ఈ రోజు మనము భక్తి అని చెప్పి చేస్తున్న యజ్ఞాలు, యాగాలు, ఆయన చెయ్యమని అసలు చెప్పలేదు. దేవున్ని చేరే విధానాన్ని సృష్ఠి ఆదిలో చెప్పాడు. తరువాత మరల భగవద్గీత రూపములో మరికొంత విశదముగా ఏమి చెయ్యకూడదో కూడా చెప్పాడు, కానీ ఈ రోజు ఎవరికీ అర్థముకాలేదు సరికదా! ఇ(హి)ందువుల పవిత్ర గ్రంథమేది అంటే, కొంతమంది వేదాలు అంటున్నారు. దేవుడు వేదాలు మాయకు సంబంధించినవని చెప్తే, లేదు అవే ప్రామాణిక గ్రంథాలు అంటున్నారు కానీ కాదు భగవద్గీత ప్రామాణిక, పవిత్ర గ్రంథమని, మనము **“ఇందూ పథము”** అనే గ్రంథములో వివరించటము జరిగింది.

సృష్టి తయారయిన దగ్గరనుండి మాయ కొనసాగుతూ ఉన్నది, జ్ఞానము కొనసాగుతూ ఉన్నది. కానీ కొన్నిసార్లు మాయా ప్రభావము పెరిగి, జ్ఞానము తగ్గిపోవటము జరుగుచున్నది. అప్పుడు పరమాత్మ దానిని సరిదిద్ది, మరలా ధర్మసంస్థాపన అనే జ్ఞానము తెలియజేయటం జరుగుతూ ఉన్నది. ఈ విధంగా మనము నాలుగు యుగములలో చివరి యుగములో ఉన్నాము, కలియుగము 4,32,000 ఇప్పటికి 5109 సం॥ కాలము మాత్రమే గడిచింది కనుక కలియుగము పూర్తి అగుటకు చాలా కాలమున్నది. మనకు ప్రామాణిక మైనటువంటి భగవద్గీత, ద్వాపరయుగము చివరిలో చెప్పబడింది.

www.thraithashakam.org

ద్వాపరయుగం చివరిలో ఇప్పటికి 5109 సం॥ కాలమునకు పూర్వము, భగవద్గీత చెప్పబడింది. మరి భగవద్గీత చెప్పిన రోజుల్లో కొంత జ్ఞానము ఉంది, అజ్ఞానము విచ్చలవిడిగా ఇప్పటిలాగా లేదు. అప్పటిలో అది పెరుగుతున్నదని తెలిసి 5109 పూర్వమే భగవద్గీతను చెప్పి, అసలైన ఆధ్యాత్మికత అంటే ఏమిటో చెప్పబడింది. కానీ కొన్ని వేల సంవత్సరములకు మరల అధర్మము, అజ్ఞానము పెరిగిపోయాయి. అప్పట్లో శ్రీకృష్ణుడు వాస్తవమైన జ్ఞానమును చెప్పినప్పటికీ, ఎవరికీ అది అర్థము కాలేదు. అయితే కృత, త్రేతా, ద్వాపరయుగములలో ఉన్న కనీస జ్ఞానము ఇప్పటి కలియుగములో లేకుండా పోయింది అని అనుటకు ఆధారమేమి అని ఆలోచిస్తే. కొంచెము కాలము వెనుకకు వెళ్ళి చూసిన, జ్ఞానము చెప్ప బడినప్పుడు నిరాకార జ్ఞానము చెప్పబడింది తరువాత సాకార జ్ఞానము చెప్పబడింది. నిరాకారమంటే కేవలము లింగమును శిలతో స్థాపించి, విభూతి రేఖలు దిద్ది, మధ్యలో బొట్టుపెట్టి, ఇది నిరాకారము దీని పరిస్థితి ఇది అని సమాచారమంతా తెలియజేశారు పెద్దలు.

తరువాత నిరాకారమైనవాడు మనతో సంబంధము ఏర్పరచు కోలేడు, మనకు జ్ఞానమును తెలియజేయలేడు కావున, జ్ఞానము చెప్పాల్సిన సమయం వచ్చినప్పుడు, సాకార రూపములో రావాల్సిన పని వచ్చింది. సాకార రూపం అంటే, ముక్కు, ముఖము ఉన్న ప్రతిమను పెట్టి చూపడము, నిరాకారంగా ముక్కు, మొఖం లేని దేవుడు, ఒక ఆకారముతో పుట్టి జ్ఞానమును చెప్పును అని మనము సాకార ప్రతిమను పెట్టుకున్నాము. సాకారం, నిరాకారము అనేవి రెండే రెండు విధానాలు కృతయుగము నుండి ఉన్నవి. ఆ విధంగానే అవి కొనసాగుతూ వచ్చాయి, తరువాత కొంత అజ్ఞానము ప్రభలినా కానీ, యజ్ఞయాగాది కర్మలు చేసినాగానీ, వేదపఠనాలు

www.thraithashakam.org

చేసినా కానీ, తపస్సులు చేస్తున్నాకానీ, వీటివల్ల దేవుడు తెలియబడడని భగవద్గీతలో చెప్పినాగానీ, అవన్నీ చేసినాసరే, అవన్నీ అజ్ఞానమే అయినా అప్పటి కాలములో అజ్ఞానమునకు కొంత ప్రాబల్యము తక్కువే అని చెప్పవచ్చును. అయితే ఇప్పుడే అధర్మములు ఇంకా చేరిపోయి పూర్తి అజ్ఞానమై తారాస్థాయికి చేరిపోయినదని చెప్పవచ్చును. 2500 సంవత్సరముల పూర్వము, ఆది శంకరాచార్యులు ఒక బ్రాహ్మణుడు, కేరళలో పుట్టి, అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించాడు. అనగా 2500 సం॥ ముందు ఈ సిద్ధాంతము లేదని గ్రహించగలరు. ఏమున్నా నిరాకారము, సాకారము అనీ రెండే ఉన్నాయి. మరి పరమాత్మ సృష్టి ఆదినుండి చెప్పుచున్న నిరాకార, సాకార జ్ఞానములలో త్రైతము ఇమిడి ఉన్నను దానిని ఎవ్వరూ గ్రహించ లేదు. ద్వాపరయుగపు చివర్లో శ్రీకృష్ణుడు భగవద్గీతలో అద్వైతమని, విశిష్టా ద్వైతమని, ద్వైతమని ఏమీ చెప్పలేదు కానీ నిగూఢముగా త్రైతమునే చెప్పినాడు. కాని దానిని ఎవ్వరూ ఇంతవరకు గ్రహించలేదు. సిద్ధాంతాలు ఏమీ లేని రోజులు ఎన్నో కలియుగములో గడిచిపోయిన తరువాత, శంకరాచార్యులు అద్వైత సిద్ధాంతాన్ని స్థాపించి, ఈ హిందూమతములోనే అద్వైత సిద్ధాంతాన్ని తీసుకొచ్చాడు, బోధించాడు. కొంతకాలము అయిన తరువాత అవే ద్వైతము, విశిష్టాద్వైతము అనునవి రెండు సిద్ధాంతములు వచ్చాయి.

ద్వైతము, విశిష్టాద్వైతము రెండూ సిద్ధాంతములే. ఒకటి ప్రత్యేక మైనది, రెండవది మామూలు ద్వైతము అని అర్థము వచ్చును. ఆ విధంగా పుట్టిన వాటి మధ్య అభిప్రాయ బేధాలు వచ్చాయి. ఆ తరువాత నాది వాస్తవం అంటే నాది వాస్తవం అని పోట్లాటలు మొదలు పెట్టారు. ఆ రోజు అనగా అద్వైతము అనేది లేని రోజుల్లో, నిరాకారము, సాకారము

www.thraithashakam.org

అనే విధానాలు ఉన్న రోజుల్లో ఈ పోట్లాటలు ఏమీ లేవు. ఈ రెండూ అనగా ద్వైతం, అద్వైతం రెండు వచ్చిన తరువాత, అంటే లింగంమీద విభూది రేఖలను ధరించేవారందరూ మేము 'శైవులము' అన్నారు, మిగతా వారందరూ 'వైష్ణవులు' అనే తెగ ఏర్పడింది. ఈ విధముగా ఒకరేమో అడ్డనామాలు, మరికొందరు దానినే తిరగవేసి నిలువనామాలను పెట్టారు. ఇదంతా కలియుగములో 2000 సం॥ లకు పూర్వము ఈ అద్వైతం, విశిష్టా ద్వైతం అనేవి సృష్ఠించబడెను. అక్కడనుండి అజ్ఞానదశ ప్రారంభమయింది. అయితే శైవులు, వైష్ణవులు ఈ విధముగా బొట్లు పెట్టుకొని అన్నీ చెప్పుచున్నారు. కదా! అంటే, వీరందరికంటే ముందే దేవుడు జ్ఞానాన్ని చెప్పెను. ఆ దేవున్ని పట్టుకుని ఊగిసలాడకుండ మరలా ఇదంతా ఏమిటి? నాది ఈ నామమంటే ఈ నామమని, పోనీ వాడు చెప్పిన జ్ఞానమేదో నేర్చుకుంటే సరిపోతుందా అంటే, లేదు ఆ అడ్డనామాల వారిని, నిలువునామాలవారు చంపాలంట. ఈ విషయము మీకు **"దశావతారం"** అనే సినిమాలో 12వ శతాబ్దంలో ఏ విధంగా శైవ, వైష్ణవులు ద్వేషించుకున్నారో చూస్తే తెలుస్తుంది. మరి దేవుడు చెప్పిన నిరాకార, సాకార విధానాలు ఈ రోజు నిరాకార విధానమంతా శైవుల వశమయింది, సాకార విధానము వక్రీకరించబడి వైష్ణవులు అని పేరు పెట్టుకున్న వారి వశమయి పోయింది. కనిపించకుండా ఉండేవాడైన నేను కనిపించే మనిషిగా వచ్చి మీకు వాస్తవ జ్ఞానము తెలియజేస్తానని, నిరాకార, సాకార విధానాలు తెలియజేస్తే, నిరాకారము వక్రీకరించబడి, నిరాకారాన్ని పూజించేవారు శైవులనీ, సాకార ప్రతిమను పూజించేవారంతా వైష్ణవులని అంటున్నారు. ఈ రోజు ఆ విధానమంతా వక్రీకరించబడింది. చూడండి వీరంతా ఎంత కక్షలు పెంచుకున్నారో! మరి ఆ రోజుల్లో క్రైస్తవ, ఇస్లామ్ మతాలు లేవు,

మరి ఆ రోజు వైష్ణవులు, శైవులు హిందువులు కాదా! కేవలము వారిలో వారే కొట్లాడుకొనలేదా? చంపుకోలేదా? మరి ఇది అజ్ఞానము కాదా? ఒకరినొకరు సంప్రదించుకుని జ్ఞానము తెలుసుకోవాలి, కానీ పోట్లాడు కున్నారు. ఆ రోజుల్లో ఉన్న శైవ, వైష్ణవులు ప్రజల్ని అమాయకులను చేసి, వైష్ణవ గుడులు, శైవుల గుడులని నిరాకారము ఉండే గుడులు కొన్ని, సాకార ప్రతిమలు పెట్టి కట్టినవి కొన్ని, ఇవి కాక వీరభద్రుడు, ఇది అని అదని వారికి విభూదిరేఖలు పెట్టారు. వైష్ణవులు చాలామందిని అప్పటికే తయారు చేశారు. రంగడు, రాముడు, కృష్ణుడు ఇలా అందరినీ కలిపేసారు. ఆంజనేయుడు కనుక వారు అంటే శైవులు కూడా, విఘ్నేశ్వరుడు, వీరభద్రుడు, మురుగన్, అని కాని అంతకు ముందు నిరాకారంగా లింగము పరమాత్మకు ప్రతిరూపముగా ఉండాలి, ఉండేది. తరువాత పురాణాన్ని తగిలించి, అతనికి పార్వతి అని భార్యను పెట్టి పిల్లలు పుట్టారని చెప్పి, వారి పిల్లలకు కూడా బొమ్మలను పెట్టి, ఈ విధముగా జ్ఞాన విషయమంతా మారిపోయి, సంసారాలు, బిడ్డలను పోషించే విధంగా తయారైపోయాము. కానీ ఈ శైవమతము అనేది పుట్టకముందు శివలింగము, శివలింగముగానే ఉండేది. దాని ప్రక్కన పార్వతి లేదు, మధ్యలనే ఇవన్నీ కల్పించబడ్డాయని, తరువాత నందిని తెచ్చిపెట్టారు, ఆ తరువాత వారి పిల్లలను, అనగా విఘ్నేశ్వరున్ని పెట్టారు. ముందే ఈ విషయాలను మేము మొదటి నుండే చెప్పుకుంటూ వస్తున్నాము. ఈ విషయములన్నిటినీ మా గ్రంథమైన **“దేవాలయ రహస్యములు”** లో వివరించాము.

తరువాత శైవులు, వైష్ణవులు రెండు పార్టీలుగా చీలిపోయినారని చెప్పుకున్నాము కదా! ఇప్పుడు రాజకీయ పార్టీలవలె అన్నమాట. పార్టీ పెడితే సరిపోదు దానికి మంత్రులు ఉండాలి కదా అందుకు పచ్చజెండా

తెలుగుదేశము అని, ఇంకో ఏదో జెండా ఇచ్చి కాంగ్రెస్ అని పేర్లు పెడతారు కదా! ఈ విధముగా శైవులు, వైష్ణవులు, మీ దేవుడెవరు ఆళ్వారు రంగనాయక స్వామి, నర్సింహస్వామి, అహోబిల స్వామి అని నామాల దేవుళ్ళ ని చెప్పి, ఈ దేవుడు నీ ఇంటి దేవుడు, నీవెక్కడున్నా సరే ఆ దేవుని దగ్గరకు పోయే మ్రొక్కాలి. ఈ విధముగా నీ ఇంటి దేవుడు అని కల్పించి చెప్పారు. మరలా మీరు మారిపోతారేమోనని, నామదార్లని, మోడుదార్లని అనగా వైష్ణవులని, శైవులని చెప్తూ, మీరు వారి మంత్రాలను వింటే పాపం చుట్టుకుంటుందని బెదిరించినారు. అంతేకాకుండా కర్ణాటకలాంటి కొన్ని ప్రాంతాలకు పోతే, శైవులు కొన్నాళ్ళకు వారు శైవులమని మర్చిపోతారేమో నని, మొలలకు లింగాన్నే తాడువేసి కట్టి, వారిని "లింగాయతులు" అంటారు, నీవు ఏ జాతివాడివైనా సరే అనవసరము నీవు లింగం కట్టుకుంటే చాలు లింగాయతులు అగుదురు. అంటే వీరు జీవితంలో నామాల్ని పెట్టుకొనుటకు వీలులేదు.

ఈ విధంగా జ్ఞానమనునది అజ్ఞానముగా మారిపోయి రాజకీయ పార్టీలవలె తయారయిపోయి, భక్తి అనేది వాస్తవమైనదిగా లేకుండా పోయింది, శైవులు విభూది రేఖలను తలయందు నుదుటిమీదకే పరిమితం కాకుండా, తరువాత రోజుల్లో వారు విభూది రేఖలను రెండు భుజములకు, పొట్ట మీద, బొడ్డభాగము వరకు వ్యాపింప చేస్తే, వైష్ణవులు ఊరుకున్నారా వారు నామాలను ఆ విధంగానే పెట్టారు. మద్రాస్ ప్రాంతములో ఒక వ్యక్తిని నేను చూశాను, ఆ వ్యక్తి ఏనుగు తలకాయమీద పెట్టిన నామంకంటే పెద్ద నామాన్ని అతని పొట్ట భాగమునుండి పైకి గుండెల మీద నుండి భుజములవరకు పెట్టాడు. ఈ విధముగా ముఖం వరకు మాత్రమే సూచికగా ఉండే బొట్టు ఎన్ని వెర్రితలలు వేస్తున్నదో చూడండి.

మరి ఇంత వెర్రిగా పాటిస్తున్న శైవ, వైష్ణవమును గూర్చి, భగవద్గీతలో ఒక్క శ్లోకములోనైనా చెప్పారా? ద్వాపరయుగము చివర్లో చెప్పిన భగవద్గీత లోనే శైవ, వైష్ణవములను గూర్చి లేదంటే, ఇది కల్పించుకున్నదే కదా! మరి ద్వాపరయుగములో లేని శైవ, వైష్ణవ ప్రసక్తి కలియుగమునందు ఏ విధంగా వచ్చింది. రావడమే కాక పూర్తి అజ్ఞానముగా మారిపోయి, ఒక వ్యక్తి విభూది రేఖలు పెట్టుకొని వాటి క్రింద ఒక బొట్టు పెట్టెను. మేము ఆయనను మీరు బొట్టుపెట్టు విధానము తప్పు, అని అసలైన విషయము చెప్పే లోపలనే, మీరు వ్రాసిన ఇందూ సాంప్రదాయములు చాలా తప్పు, హిందూ అనాలి, ఇందూ ఏమిటి? అని మమ్మల్ని ప్రశ్నించాడు. ఆ వ్యక్తికి బొట్టు ఎక్కడ పెట్టుకోవాలో తెలియదు, విభూది రేఖల్లో పైనుండి రెండవ రేఖకు ఆత్మకు గుర్తుగా పెట్టుకోవలెనని తెలియదు, మనల్ని మీరు వ్రాసినది తప్పు అనే స్థితికి వచ్చి మాట్లాడుచున్నాడు. వాడికేమైనా చెప్తే వినే పరిస్థితిలో లేడు. కలియుగము పుట్టకముందర పీఠాధిపతులు లేరు తరువాత వచ్చినారు. జీవుడు, దేవుడు ఇద్దరూ ఉన్నారని ద్వైతము చెప్తే, ఎవడూ లేడు దేవుడొక్కడే అని అద్వైతము చెప్పినది ద్వైతము అంతగా ప్రచారము కాలేకపోయింది, కానీ అద్వైతము అంతా వ్యాపించి పోయింది, చివరికి రెండుగా చీలిపోయి పోట్లాడుకున్నారు వారే శైవ, వైష్ణవులుగా చీలిపోయారని, మొన్న సినిమాలో చూపించినారు. ముందు ఒకటిగా ఉన్నదే రెండుగా విడిపోయి రెండు పీఠాలు స్థాపించుకుని, ఆదిశంకరాచార్యులు, రామానుజాచార్యులు అనేవారు పీఠాధిపతులుగా తయారయినారు. కానీ ఇదంతా దేవుడు చెప్పిన జ్ఞానములో ఉన్నదా? ఈ పీఠాధిపతుల పరంపర ఇప్పటికీ కొనసాగుతూ ఉన్నది. ఇప్పుడు వైష్ణవంలో చిన్నజీయర్‌స్వామి, శైవములో జయేంద్రసరస్వతి పీఠాధిపతులుగా ఉన్నారు. మరి 2000 సం॥ల పూర్వం ఏర్పడిన శైవ,

www.thraithashakam.org

వైష్ణవముల గూర్చి మనము పోట్లాడుకుని, దానిలోనే ప్రాకులాడుతామా, వీటన్నింటికంటే ముందు దేవుడు చెప్పిన వాస్తవ జ్ఞానాన్ని తెలుసుకునే ప్రయత్నం చేస్తున్నామా? మొన్న మొన్న ఏర్పడిన, శైవ, వైష్ణవులు మారి హిందూమతమును పారవిడుచుకుని చెప్పుచున్నారు, మరి అంతకు ముందే దేవుడు చెప్పింది హిందూమతము కాదా! సృష్ఠి ఆదినుండి ఉన్నది ఇందూ మతము (పథం) వాస్తవానికి ఇందూపథం, మతంగా మారినది అనుకోండి.

ఇక మేము చెప్పుచున్న జ్ఞానము నిజమో కాదో అనే విషయాన్ని, వారి పీఠాధిపతి ముందు చెప్తే తెలుస్తుందని ఒక వ్యక్తి మాతో అన్నాడు. మేము పీఠాధిపతుల పుట్టుపూర్వోత్తరాలు చెప్పుతున్నాము. "పీఠాధిపతో కాదో మేము చెప్పగలము. వారి జ్ఞానము వారికే తెలియదు మీరందరూ పీఠాధిపతులుగా తయారయి, జనాల్ని మీరు ఏ విధంగా ప్రక్క ద్రోవ పట్టించారో మేము చెప్తూ ఉంటే, అతను మా జ్ఞానాన్ని, జ్ఞానము అవునో కాదో అని తేల్చుటం, వేప ఆకును విస్తర ఆకు అన్నట్లున్నది. మీరంతా పీఠాధిపతులు ఏ విధంగా అగుదురు? పీఠాన్ని మొట్టమొదట ఎవరు స్థాపించారో వారిని పీఠాధిపతి అనవలెను, అతను పీఠాధిపతి అగును. ఆది శంకరాచార్యులు అద్వైత పీఠాధిపతి అంటే మేము ఒప్పుకుందుము. పరంపర అని అంటున్నారు, అంటే ఒకరి తర్వాత ఇంకొకరు అని అర్థము కదా! పరంపరగా ఉన్నవారు పీఠాధిపతులైతే మరి ఆది శంకరాచార్యులు సంగతేమి? మొదట ఎవరు స్థాపించారో వారే పీఠాధిపతిగానీ, తరువాత వచ్చినవారు పీఠాధిపతి ఎట్లగును? ఉదాహరణకు మనము ఒక ఇల్లు కట్టాము అనుకోండి, ఆ ఇంటిని కట్టడం పూర్తయిన తరువాత ఒక తేది ఆ ఇంటిపైన వేయుదుము. దానితో పాటు కొందరు ఆ ఇల్లు కట్టించినవారి పేరు కూడా వ్రాయించెదరు. అదే విధముగా ఏదైనా ఒక శంఖుస్థాపన

కార్యక్రమానికి ఒక ఎం.ఎల్.ఎ నో, మంత్రో అది ప్రారంభిస్తే, ఆయన పేరును శిలాఫలకంపైన వ్రాసెదము. కానీ ఆ మంత్రో, ముఖ్యమంత్రో మారిపోయిన తరువాత ఆ శిలాఫలకం పైన ముందు ప్రారంభించిన వాని పేరు చెరపరు కదా! అదే అద్వైతమును స్థాపించిన ఆదిశంకరాచార్యుల తరువాత ఎవరు? మేము దాని పీఠాధిపతులం అంటున్నారు. మరి వీరు పీఠాధిపతులా? కాదా! అనే ప్రశ్నకు వస్తే, వీరంతా పీఠాన్ని అనుసరించి ఉండేవారు, మొట్టమొదట ఒక పీఠాన్ని స్థాపించియుంటే, స్థాపించినవారి సిద్ధాంతము ప్రకారము ఆ పీఠాన్ని అనుసరించి ఉండేవారు. పీఠానుపతులే గానీ, పీఠాధిపతులుకారు. త్రైత సిద్ధాంతాన్ని మీరు తెలుసుకుంటే, దానిని అనుసరించేవారు మీరు కానీ, త్రైత సిద్ధాంతాన్ని మీరు సృష్ఠించలేరు. త్రైత సిద్ధాంతాన్ని పుట్టించింది మేము. దానిని తెలుసుకుని మీరు ఇతరులకు తెలియజేస్తే, మీరు బోధకులు అవుతారు. కనుక ఈ రోజు పీఠాధిపతులు అని చెప్పుకోవటం, వారందరూ చేస్తున్న పెద్ద పొరపాటు. పేరును ఆ విధంగా పెట్టుకున్ననూ అర్థము లేనిదై ఉండును. ఆ విధంగా అద్వైతమునకు పీఠాధిపతి శంకరాచార్యులే గానీ మిగతా పరంపరగా ఆ పీఠాన్ని అధిష్ఠించే వారు పీఠాన్ని అనుసరించే వారే, పీఠానుపతులే. అదే విధముగా మధ్వాచార్యులు, ద్వైతమునకు పీఠాధిపతి అగును, విశిష్టాద్వైతమునకు రామానుజాచార్యులు పీఠాధిపతి అగును, మిగతావారు పీఠాధిపతులుకారు. ఇప్పుడు నాల్గవది త్రైత సిద్ధాంతము, ఎప్పటినుండో ఉన్ననూ, అది అమలుకు రాలేదు, చెప్పబడిన శబ్దము చెవుల వరకు రాలేదు. ఇప్పుడు మాత్రము ఆ శబ్దము వినిపిస్తూ ఉన్నది. ఆ వ్రాత కనిపిస్తూ ఉంది, ఎక్కడ అంటే భగవద్గీతలో. దానిని మనము త్రైత సిద్ధాంతమని చెప్పి ప్రచారం చేసుకుంటున్నాము. శైవులు, వైష్ణవులు, ఇద్దరూ ఇ(హి)ందూ మతస్థులైననూ,

www.thraithashakam.org

పోట్లాడుకుంటున్న ఈ రోజుల్లో ఈ త్రైత సిద్ధాంతాన్ని ఒప్పుకునే పరిస్థితి ఉంటుందా! లింగమును మొలకి ధరించిన ఒక వ్యక్తి, వైష్ణవద్వేషియై "భగవద్గీతను మనము చదువ కూడదు వైష్ణవులు పూజించే కృష్ణున్ని, ఆయన చెప్పిన భగవద్గీతను మనము తిరస్కరించాలి" అన్నాడు. వైష్ణవులకు వ్యతిరేఖముగా ఉండే ఒకే ఒక్క ఆలోచనతో ఆ వ్యక్తి కాదు మిగతావారు కూడా ఆ విధముగా మాట్లాడుచున్నారు ఈ రోజు.

తిరుపతిలో ఉన్నవారంతా వైష్ణవులు, అక్కడ శైవులను చూస్తే వారికి ద్వేషము. మరి మీరు అది కాకుండా, ఇది కాకుండా క్రొత్తది తెచ్చారు. క్రొత్త బొట్టును పెట్టుకున్నారు అని అనడమేకాక "లేదులేదు అది శిలువే, క్రొత్తరకంగా డిజైన్ చేసి పెట్టుకున్నారు" అన్నాడట. అప్పుడు మన సభ్యుడగు ఒక వ్యక్తి, "అదికాదు అవి బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములు, మధ్యలో ఉన్నది బ్రహ్మనాడి. అవి మన తలలో ఉన్న చక్రాలు" అని చెప్తే, అదేంకాదు, వారు ఆ విధంగా చెప్పుచున్నారు కానీ అది శిలువే, ప్రత్యేకంగా డిజైన్ చేశారు అన్నాడట ఈ విధంగా అజ్ఞానమనేది అంతులేకుండా పోయింది. మేము ఏమి చెప్పుచున్నామంటే, మూడు యుగములు గడచిననూ, ఇంత అజ్ఞానము పెద్దగలేదు. ఎందుకంటే, అప్పుడు వైష్ణవం, శైవము అనేవి లేవు కనుక, ఉన్నదంతా ఒకే సిద్ధాంతమే కనిపించకుండా ఉన్నది. ఆ రోజు, విశ్వవ్యాప్తంగా కనిపించకుండా ఒకే సిద్ధాంతమున్నది ఆ రోజు జ్ఞానము ఉన్నది, నిరాకార జ్ఞానము, సాకారజ్ఞానము అనేవి ఉన్నవి. అనగా విశ్వవ్యాప్తమైన పరమాత్మకు ఆకారము ఏమీ లేదు కావున ఆయన నిరాకారుడని, ఒక రాయికి ఆకారం లేదు కావున, ఇది నిరాకారుడైన పరమాత్మనీ, ఆ విధంగా ఆకారము లేకుండా ఉన్న దేవుడు, మీ మధ్యలోకి మనిషి ఆకారంగా వచ్చి, మీకు జ్ఞానము తెలుపుతాడని సాకార రూపమును

పెట్టడం జరిగింది. ఈ విషయములన్నింటినీ మేము **"దేవాలయ రహస్యములు"** అనే గ్రంథములో వివరంగా ముందే చెప్పాము. ఈ విధముగా కలియుగముకంటే ముందు అజ్ఞానము ఏముండేది అంటే, యజ్ఞములు, వేదాధ్యయనములు, తపస్సులు, దానములు అనేవి మాత్రమే అధర్మాలుగా ఉండేవి. ఈ రోజు ఈ నాలుగే కాకుండా, శైవము, వైష్ణవం అనేవి చేరి మరికొంత అజ్ఞానము ఈ రోజు ప్రభలిపోయింది. ఈ రోజు ముస్లీమ్ మతము తీసుకుంటే, వారికి ఒకే దేవుడు అల్లాహ్‌నే. ఈ విధముగా చూసుకుంటే మనకంటే ముందంజలో జ్ఞాన విషయములో ఉన్నారని ఇంతకు ముందే మేము చెప్పాము. ఏదైతే భగవద్గీతలో భక్తియోగము అని చెప్పారో అది ముస్లీమ్‌లవద్ద ఉన్నది. మనకి ఏ యోగము లేదు. అసలు కర్మయోగము అంటే తెలియదు, బ్రహ్మయోగము అంటే అసలుకు తెలియదు. అసలు యోగము అంటే కూడా తెలియదు. ఒక్కటి మాత్రము తెలుసు అదే నామదార్లమా, మోడిదార్లమా అని అదైనా ఎవరైనా వారింట్లో చనిపోయి నప్పుడో, ఏదో పండగ రోజు మాత్రమే అదియును గుర్తుకు వచ్చును కానీ ప్రతి రోజూ కాదు.

ఈ విధముగా అజ్ఞానము పెరిగిపోయింది కనుక మీరు అందులో చిక్కుకోవద్దండి. ఏ పాపపు పనిచేసినా, జ్ఞానమునకు ఆటంక పరిచినా, దేవుడేమీ అడ్డు చెప్పడు. కానీ దాని అనుభవము మాత్రము తీవ్రంగా తరువాత ఉంటుంది. ప్రస్తుతానికి ఆ పని కనిపిస్తుంది కానీ దాని ఫలితములైన శిక్షను అనుభవించడం మాత్రము కనిపించదు. ఇంతకు ముందు ఒకసారి చెప్పాము. మహానంది క్షేత్రములో జ్ఞాన ప్రచారమునకు అడ్డుచెప్పి మన గ్రంథములను చించటం జరిగింది. సరేలే! వారికి వాటిపైన అవగాహనలేక, చదవకపోవటం వలన అలా చేశారని మేము అనుకున్నాము.

వారిని మేము వదలివేశాము. కానీ ఇంకొక వ్యక్తి. మా గ్రంథములో ఉన్న ఫోన్‌నెంబర్ చూసి, ఆ నెంబరుకు ఫోన్‌చేసి తిట్టారు. చివరికి ఎవరు తిట్టారు అనేది మాకు తెలిసింది. ఈ మధ్య ఆ వ్యక్తికి ఆరోగ్యం సహకరించక, పెద్దపెద్ద ఆసుపత్రిల్లో తిరుగుచున్నాడంటే, ఎంతటి కర్మో, అది ఎలా అమలుకు వచ్చినదో చూడండి. కానీ దేనికి మనము ఆ విధంగా అనుభవిస్తున్నాము అని మాత్రము వారు అనుకొనరు. ఒకసారి అదిలాబాద్ జిల్లాలో ప్రయాణం చేస్తున్నాము, ఆర్మూర్ ప్రాంతము అనుకుంటాము అక్కడికి వచ్చినప్పటికి రైల్వేగేట్ పడింది ఒక అడుక్కుతినే వ్యక్తి అక్కడకు వచ్చినాడు ముసలివ్యక్తి అతను, కాళ్ళులేవు, చేతులు లేవు, కుంటుకుంటూ కర్రసాయంతో వచ్చెను. ఏమయ్యా! నీ పరిస్థితి ఏమి, ఎందుకిలా జరిగింది నీకు? మిగతావారంతా ఆ విధంగా లేరు కదా! నీకే ఎందుకు ఈ సమస్య వచ్చింది? అని అడిగితే, ఆ వ్యక్తి "నా అదృష్టం" అన్నాడు. చూడండి ఏ విధంగా ఉన్నదో! అతను నేను చేసుకున్న పాపానికి శిక్ష అని చెప్పుకోలేక, తప్పించుకునే విధానములో అదొక పద్ధతి అన్నమాట. ఈ విధముగా దేవుడు నీవు ఏ పని చేసినా అడ్డుపడడు, అలాగని ఆ పాపపు పని యొక్క ఫలితాన్ని అనుభవిస్తున్నప్పుడు దానిని చూచి ఆనందించడు, దుఃఖించడు. మరి నేను భక్తిగా ఉన్నాను కదా! మరి ఈ బాధలు ఇప్పుడేమిటి? అంటే, ఇప్పుడు భక్తిగానే ఉన్నావు. ఇంతకుముందు జన్మలలో ఎలా ఉన్నావో అలాంటి పాపమే అమలుకు వచ్చును.

ఒక పాటపాడితే, దాన్ని 'ప్లే' బటన్ నొక్కితే మరలా ఆ పాట వస్తుంది. అప్పుడు తెలుస్తుంది, నేను ఇంతకుముందు పాడినపాటే అని. అదే విధంగా ఇంతకు ముందు నీవు చేసిన పాపము, ఇప్పుడు నీకు అనుభవమునకు వస్తున్నది. కనుక మనము దేవుని జ్ఞానము గూర్చి

తెలుసుకునే ప్రయత్నం చేస్తే, ఇవన్నీ అర్థమగును. **దేవుని జ్ఞానము నేర్చుకునే విషయములో ఎన్ని ఆటంకములు ఎదురైనా మనము వెనుకాడకూడదు.** భగవంతునిగా దేవుడు ఇంతకు ముందు భూమిమీదకు వచ్చినప్పుడు, అతన్ని అప్పటి వారు ఎన్నో ప్రలోభములకు గురి చేశారు. రాజ్యాన్ని అంతటినీ ఇస్తామన్నారు, అయినా ఆయన నా రాజ్యం వేరేది ఒకటుందిలే అని అన్నాడు. కోట్లాది రూపాయలు ఇస్తామన్నారు. అయితే ఈ ప్రపంచ ధనముతో నాకు సంబంధము లేదు పొమ్మన్నాడు. అదే విధముగా భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఏమి చెప్పాడు. భయము అనునది పరధర్మము అన్నాడు భయపడుతూ బ్రతుకకు, ధైర్యముగా బ్రతుకు, ధైర్యము అనునది స్వధర్మము అన్నాడు. అందుకే మేము ధైర్యముగా, "మీరు అజ్ఞానములో ఉన్నారు, జ్ఞానాన్ని సంపాదించండి" అని చెప్పు చున్నాము. అందుకే మేము చెప్పు జ్ఞానాన్ని బూడిదలో పోసిన పన్నీరులా చేయవద్దు అని మేము మీకు తెలియజేస్తున్నాము.

మేము మా గ్రంథమైన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"**లో కొన్ని పేజీలు ఈ పరధర్మము, స్వధర్మము అనే శీర్షిక మీద వ్రాశాము. జ్ఞాన సంబంధముగా ఉండాలి, ధైర్యముగా ఉండాలి, ఏది వస్తే అదే రానివ్వండి. ఒకవేళ చివరకు ఏమవుతుంది చెప్పండి, చనిపోవటం అవుతుంది, అంతేకదా! దానికంటే ఏమి జరుగును? దానికి మనము భయపడితే, నీవు ఎట్లు బ్రతుకాలనుకున్నా నీవు చనిపోక తప్పదు. కర్మపరిపక్వమైతే పెద్ద పాము ఏమీ అవసరము లేదు, నీకు చిన్న తేలు కుట్టినా చనిపోవుదువు. మరి ఎప్పటికైనా చనిపోయే దానికొరకు ఎందుకు కాలాన్ని వృథా చేసుకుని, జ్ఞానమును తెలుసుకోకుండా ఉండటం. మేము ఒక ప్రాంతమునకు వెళ్ళినప్పుడు, కొందరు ఆ విషయం తెలుసుకుని మా బండిని ఆపమంటారు.

www.thraithashakam.org

అది నాకు ఇష్టం ఉండదు. ఎందుకంటే, నేను వచ్చానని తెలుసుకున్న మరికొందరు, మేము చెప్పిన జ్ఞానము అర్థముకాక, మమ్మల్ని ఆపి, మా కాలాన్ని వృథా చేయవచ్చు కనుక మేము ఎటు వస్తున్నది, ఎటు వెళ్తున్నది, ఏమి చేస్తున్నది ఈ మధ్య ఎవరికీ తెలియకుండా చేస్తున్నాము. అలాగని నన్ను విమర్శించే వాళ్ళకు భయపడికాదు. ఆ సందర్భములో నేను కూడా వారితో క్రోధంగా ప్రవర్తించడము ఇష్టము లేదు. కానీ మేము ప్రపంచ వరముగా ఏ విధముగా ప్రవర్తించిననూ, మా అంతిమ నిర్ణయం మాత్రము జ్ఞానప్రచారమే! అదియే మా లక్ష్యం. అందుకే మోక్షసన్యాస యోగములో కృష్ణుడు ఒకమాట చెప్పాడు, **"నీవు చంపు, కాని పాపము రాని విధానాన్ని తెలుసుకో"** అని చెప్పాడు. అదే కర్మయోగము అన్నారు. దానిని నీవు సంపూర్ణముగా తెలుసుకో.

కనుక ఇప్పుడు చివరిగా చెప్పేదేమంటే, శైవము, వైష్ణవము అనునవి, మధ్యలో కల్పించుకున్నవే గానీ, ఆదినుండి లేవు ఒకవేళ ఉండి ఉంటే, దేవుడే భగవద్గీతలో శైవ, వైష్ణవ అని పేర్లు చెప్పియుండును కదా! ఆ మాటలు ప్రత్యక్షంగాగానీ, పరోక్షముగాగానీ భగవద్గీతలో ఎంత పరిశోధించినా కనిపించవు. ఇంతకుముందర ఈ వైష్ణవులు, శైవులు సురాపానమని, సోమరసము అనే ఒక మత్తు పదార్థాన్ని సుగంధ ద్రవ్యాలు వేసి తయారు చేసి, దానిని త్రాగేవారు. చివరికి అది సారాపానమయింది. ఈ రోజుకీ, అది త్రాగి మధ్యలోనే పోతున్నారనేనేమో దానిని మద్యపానము అంటున్నారు. ఇవన్నీ మనకు అవసరములేదు కానీ భగవద్గీతలో దేవుడు చెప్పిన జ్ఞానము ప్రకారము శైవం, వైష్ణవం అనే వాటితో మనకు సంబంధం లేదు కానీ నిరాకారానికి, సాకారానికే మనకు జ్ఞానవరంగా మనము సంబంధము పెట్టుకోవలెను. ఎప్పుడైతే నిరాకారమైన దేవుడు మనిషిగా

పుట్టి, సాకారముగా వస్తే, అతనే భగవంతుడు తల్లి గర్భము నుండి సజీవముగా పుట్టినవాడే భగవంతుడు. ఆ విధంగా జ్ఞానము ఎవరైతే చెప్తారో అదే సాకారము, అంతేగానీ, మనము గుడులలో పెట్టుకునేది మాత్రము సాకారం కాదు. దానికి ప్రతిరూపం మాత్రమే గుడుల్లో ఉండు ప్రతిమ అంతేగానీ ఆ ప్రతిమ సాకారము కాదు. 'భగవంతుడిగా దేవుడు, ముక్కు, ముఖం కల్గిన వ్యక్తిగా ఈ విధముగా పుడతాడు' అనే దానికి తెలిపే నిమిత్తమే గుడులలో ప్రతిమాకారమును ఉంచినారు. భగవంతుని ప్రతిరూపం కావుననే దానిని ప్రతిమ అన్నాము. కృష్ణుడు భగవంతునిగా వచ్చినాడు కావున, ఆయన ప్రతిరూపమును మనము పెట్టు కున్నాము. కానీ ప్రతిమ, ప్రతిమే కానీ అది దేవుడు కాదు. భగవంతునికి ప్రతిరూపం ప్రతిమ. దేవునికి రూపంలేదు కనుక అతనిని, ఆది, అంతులేని వాడిగా తెలిపే నిమిత్తము లింగాకారాన్ని స్థాపించారు. ప్రపంచానికంతటికీ అతను అధిపతి కావున ఈశ్వరుడు అన్నాము. కానీ ఈశ్వరుడు అనేది పేరు కాదు. కనుక ఇప్పుడు శైవము, వైష్ణవం అనుకున్నవి, వీటికి ఎటువంటి సంబంధము లేదు వాస్తవము కానేకాదు, శైవ వైష్ణవములు మధ్యలో కల్పించు కున్నవే అని మరొక్కసారి గుర్తు చేస్తున్నాము. శైవ, వైష్ణవములకు అతీతముగా ఉన్నప్పుడే, మనము నిజమైన పరమాత్మ జ్ఞానములో ఉన్నట్లు లెక్క.

## 9. బట్టతల

తేది : 14.09.2008

జ్ఞానము, అజ్ఞానము అనునవి మనిషి శరీరములోనే ఉన్నవి. దేవుడు జ్ఞాన స్వరూపమై, మాయ అజ్ఞాన స్వరూపమై ఇద్దరు మన శరీరము

www.thraithashakam.org

లోపలే ఉన్నారు. అలాగే ఉన్నట్లు బాహ్యంగా మన శరీరములో కొన్ని గుర్తులు పెట్టారు. శరీరమునంతటినీ నడిపించేది ఒక ఆత్మ ఉన్నదని మీ అందరికీ తెలిసినదే. అందరినీ నడిపించేది ఆత్మ అయినప్పుడు మరి మమ్మల్ని అజ్ఞానములోనికి, పరమాత్మ జ్ఞానమునుండి మరలించి ప్రపంచ పరమైన పనులందు ఆసక్తిని కలిగించేది కూడా ఆ ఆత్మే కదా, మరి మేము తప్పు చేయనట్లేనా? అని ప్రశ్నించవచ్చును.

నిజమే కర్మలో ఏ విధముగా ఉంటే అలాగే జరిగితీరును. దానినే ఆత్మ చేయించును గానీ ప్రత్యేకముగా ఏమీ ఆత్మ చేయదు. దుర్మార్గంలో ఉండిన కర్మ వలన చెడు పనులు చేయించేది ఆత్మే, సన్మార్గములో ఉన్న కర్మవలన ఆ మంచి పనులను చేయించేది ఆత్మే! కానీ నీ ఇష్టప్రకారము, శ్రద్ధ ప్రకారము నీవు జ్ఞానమును తెలుసుకొనవచ్చును. మరి ఇష్టాయిష్టములు కలుగచేసుకోవటం జీవాత్మవైన నీకే సంబంధము. ఇష్టమున్నా లేకపోయినా నీ చేత పనులను చేయించేది, కర్మప్రకారము నడిపించేది ఆత్మే.

మాయ అనునది గుణముల రూపములో ఉన్నది. ఒక పని జరుగాలంటే ఒక శరీరములో గుణముల ప్రేరేపణ జరుగవలెను. అలా ప్రేరేపణ జరిగిన తరువాత కార్యమును నడిపించేది ఆత్మే. అలా ప్రేరేపణ జరుగడానికి కావలసిన శక్తినిచ్చింది కూడా ఆత్మే. కానీ ఇప్పటి శాస్త్రవేత్తలందరూ మన మెదడే అన్నీ ఆలోచిస్తుంది, తద్వారానే కార్యములు జరుగుచున్నవందురు. నిజమే మెదడులోనే అన్ని ఆలోచనలు, ఆదేశములు వచ్చుచున్నవి. ఆదేశాలను కూడా ఇచ్చి, పనులను చేయిస్తుంది నేనే అనే దానికి గుర్తుగా, తలమీద వెంట్రుకలు ఎక్కువగా ఉన్నాయని మనమింతకు మునుపే తెలుసుకున్నాము. ప్రతీ కార్యము వెనుక నేనే ఉన్నానని తెలియజేయటం కొరకు శరీరము అంతటా వెంట్రుకలు పెట్టబడినవి. కన్ను

చూస్తు ఉందంటే దానికి సంబంధించిన వెంట్రుకలు కనుబొమ్మలుగా, రెప్పపైన వెంట్రుకలుగా ఉన్నవి. అనగా ఈ కన్ను పనిచేసేది ఆత్మ శక్తి వలననే, ఆత్మ శక్తి లేకుండా ఏమీ జరుగదు అని ఆత్మకు గుర్తుగా వెంట్రుక ఉన్నది. ప్రతీ శరీరములోను నీ వెంట ఉండి నడిపించేది ఆత్మే కదా. వెంట ఉండి నడిపించేది కనుక 'వెంటక' అంటారు. ఒక వ్యక్తి నా వెంట్రుక తీయలేవు అంటే నిజమే, వెంట్రుకకు మూలము ఆత్మను ఏమీ చేయలే మనేది పరోక్షముగా చెప్పబడినది. నేడు అది అర్థముకాక ఇప్పుడు తిట్టుగా మారినది.

ముందు ఈ పదమును 'వెంటక', 'వెంటకలు' అనేవారు. తరువాత అది వెంట్రక, వెంట్రకలుగా మారినది. ఇప్పుడు వెంట్రుక, వెంట్రుకలుగా మార్పు చెందినది. **ఆత్మకు చాలా దగ్గరైన భాష తెలుగు భాషయే.** కనుక వెంట్రుకలు ఎక్కడున్నాయో అక్కడ ఆత్మకు చిహ్నమై ఉన్నవని తెలుసు కున్నాము. అందరికీ తల పనిచేస్తే కదా, అన్ని పనులు జరిగేవి. కనుకనే తలపైన శరీరములో అన్ని భాగములకంటే ఎక్కువ వెంట్రుకలు ఉన్నవి. ఇప్పుడైతే మనము క్రాఫ్‌లు చేయించుకొని, తక్కువగా, జుట్టును చేయించు కుంటిమి కానీ పూర్వము ఆ జట్టును అంతటినీ మగవారైనా, ఆడవారైనా ముడి వేసుకునేవారు.

అయితే వెంట్రుకలున్న తల ఉన్నవారు కొందరైతే బట్టతల ఉన్నవారు కొందరున్నారు. కొందరికి బట్టతల పూర్తిగా ఉంటుంది. కొందరికి వెనుక భాగములో కొద్దిగా పైకి మాత్రమే బట్టతల ఉండును. కొందరికి ముందు చెప్పినట్లు, ముందునుండి ప్రారంభమై, వెనుకవరకు బట్టతల నున్నగా ఉంటుంది. మరి తలమీద ఉన్న వెంట్రుకలు ఆత్మకు గుర్తుగా ఉన్నవంటున్నాము. మరి కొంత వయస్సు వచ్చిన కొందరికి

బట్టతల వచ్చింది కదా! మరి వారిలో ఆత్మ పనిచేయలేదా? అని అడుగవచ్చు. ఆత్మ పనిచేస్తూ ఉంది, వెనుక ఉండి నడిపించేది, జరిపించేది అని దానికి పేరు ఉన్నది. ఎవ్వరికి ఎంత బట్టతల వచ్చి, వెంట్రుకలన్నీ ఊడిపోయినా సరే, తల వెనుక భాగములో చాలా క్రిందకు, మెడకు పై భాగములో మాత్రము వెంట్రుకలు ఊడటం జరుగదు. నీ వెనుకవుండి, కనిపించకుండా అన్నీ నడిపిస్తున్నానని తెలియజేయుటకు గుర్తుగా ఆ వెంట్రుకలు ఊడక, తల వెనుకనే ఉండును. బట్టతలలో, బట్టను "అడ్డు" అనే అర్థము వచ్చే విధంగా దేవున్ని తెలుసుకునేందుకు అడ్డుగా ఉన్నది "మాయ" అని మనకు తెలుసు. అందుకు పూర్వము దీనిని బట్టతల, బట్టనెత్తి అనేవారు. కాలక్రమంగా 'బ' పోయి 'ప' చేరి 'పట్టతల' అయినది. పట్ట అనే దానికి అర్థము లేదు కానీ 'బట్ట' అనేదానికి అర్థముంది. 'బట్ట' మాయకు గుర్తు.

మరి బట్టతల అని పేరుకలిగి తలమీదనే ఎందుకు వెంట్రుకలు ఊడిపోతున్నవి? వెంట్రుకలున్న మన శరీరములో ఇంకొకచోట ఎక్కడా అలా జరగటం లేదు ఎందుకని? అని ఆలోచించిన యెడల, మాయ అనునది ఎక్కడ పనిచేస్తున్నది, దానిస్థానము ఎక్కడ అని పరిశీలించిన తలే అని తెలియుచున్నది. ఇంతకు ముందు 'బట్ట' కు మాయ అని చెప్పితిమి కదా! తలలో దేవుడే కాదు, మాయ కూడా నీ తలలోనే ఉన్నదని తెలియ జేయుటకు, బట్టతలను చూపించినవాడు దేవుడే. అలా బట్టతలను తల అంతటా చూపించిననూ, నీ వెనుకలే నేనుంటిని అని చెప్పుటకు గుర్తుగా బట్టతల ఎంత శాతము ఉన్నవారికైనా, తలవెనుక భాగము చివరిలో మాత్రము వెంట్రుకలు ఉండునట్లు చేయుచున్నాడు.

మాయకున్నంత బలము మనిషిలో జ్ఞానమునకు లేదు. మాయ నీ తలలో మధ్యలో బలముగా ఉన్నదని చెప్పేందుకు బట్టతలను కొందరిలో

ఉండేటట్లు పెట్టబడినది. మరి మనుష్యులు ఈ బట్టతల గూర్చి ఆలోచింపరు, సరికదా జుట్టు ఊడిపోయినా తల వెనుక, చివర్లో జుట్టు ఎందుకు ఉంటున్నాయి? అని అసలు ఆలోచించటం లేదు. మరి విటమిన్స్ లోపమో, హార్మోన్ల లోపమో అని అంటాము. దానివలన బట్టతల వస్తే, జుట్టు తల అంతా ఊడవలెను కదా, మరి ఆ చివరిలో ఎందుకు మిగులుతున్నది? అని ఎవరైనా ప్రశ్నిస్తే, మాయ నీ తలలో ఉంది, కానీ మాయకు కూడా శక్తినిచ్చేది, దాని వెనుకనున్న ఆత్మనైన నేనే అని తెలియజేసేందుకు తల చివరిలో వెనుక భాగమున జుట్టు (వెంట్రుకలు) మిగిలి ఉన్నవని చెప్పాలి.

ఇప్పుడు 'మాయ' అను పదమును త్రిప్పి చదవండి. ఏమగును? 'యమా' అగును. 'యమా' అంటే ఎవరు ఆత్మయే. నీవు చేస్తున్న ప్రతీ పనిని చేయించి ఒక లిస్టు (చిట్టా) వ్రాసుకుంటున్నాడు లోపలున్న ఆత్మయే. 'మాయ'కు వ్యతిరేఖమైన 'యమా' అని పేరు కల్గిన ఆత్మస్వరూపుడైన దేవుడున్నాడు. 'మాయ' అనేది శరీరములో ఉన్నది. కనుక శరీరములో ఆత్మకు (దేవునకు), మాయకు గుర్తుగా తలమీద బట్టతల ఉండునట్లు చేసెను. అందుకే బట్టమీసం, బట్టగడ్డములుండవు. ఎందుకంటే మాయ తలలో ఉన్నది కనుక.

బట్ట అనగా తెర, మాయకు చిహ్నాముగా తెలుసుకున్నాము కదా! ఇది తెలిపేందుకే కొన్ని దేవాలయములలోనూ, మధురలో ఉన్న కృష్ణ దేవాలయములో, కృష్ణుని ముందు ఒక తెర కడతారు. ఆ తెరను రెండు నిమిషములకు తీస్తుంటారు, మరలా తెరను వేస్తూ ఉంటారు. దీనికర్థము మాయ నీకు అడ్డం ఉంది, దేవున్ని తెలుసుకునేందుకు, నీవు దానిని తొలగించుకో అని తెలిపే నిమిత్తము అలా వారు చేస్తున్నారు.

www.thraithashakam.org

ఈ విధముగా మాయ నీ తలలోనే ఉంది, దేవుడూ నీ తలలోనే ఉన్నాడు అని తెలిపేందుకు కొందరి తలలకు బట్టతలను ఏర్పరచి చూపించెను. ఆ బట్టతల కూడా నున్నగా మెరుస్తూ ఉంటుంది కొందరికి. ఎందుకనగా మాయకు కూడా ఎంతో ఆకర్షణ ఉంది, మెరుపు ఉంది అని చూపించేందుకు బట్టతల మెరుస్తూ ఉండును.

మరి మాయను కూడా నడిపిస్తున్నది, వెనుకవుండి శక్తినిచ్చునది మాత్రము ఆత్మయే. అందుకే వెంట ఉండేది వెంట్రుకలు కావున, ఆత్మకు వెంట్రుక గుర్తుగా తల వెనుక భాగములో ఊడకుండా ఉన్నవి. చేసే పనులే కనిపించునట్లు, మాయా స్వరూపమైన బట్టతల ముందు భాగములో తలమీద కనిపించును, కానీ చేసే పనికి శక్తినిచ్చేవాడైన ఆత్మమాత్రము కనిపించడు అనే సంకేతాన్ని తెలియజేసేందుకే బట్టతల ఉన్నవారికి కనిపించకుండా కొన్ని వెంట్రుకలు కలవు. అనగా ముందునుండి చూచిన నున్నగా బట్టతల కనిపించినా, ఊడకుండా ఉన్న వెనుక వెంట్రుకలు కనిపించవు ఈ వెంట్రుకలు వెనుకవుండి, నడిపించేవాడిని నేనే అని ఆత్మ తెలియ జేసినట్లయింది.

ఈ బట్టతల అనునది అందరిలోనూ కనిపించకపోయిననూ, మాయ మాత్రము బట్టతల ఉన్నవారికే కాదు (మాయ అలా ఉంటుంది అని చూపించేందుకే అమర్చబడింది, అంతేగానీ బట్టతల ఉన్నవారికి ఎక్కువ మాయ పని చేస్తున్నదని అర్థము కాదు) అందరికీ మాయ తలలో ఉన్నదని తెలియుచున్నది. మాయ పనిచేస్తున్నది కావున మనము జ్ఞానము వైపునకు వెళ్ళలేక పోవుచున్నాము. మరి జ్ఞానము వైపునకు వెళ్ళాలంటే ఏమి చేయవలెను. మనము జ్ఞానంపైన ఆసక్తి కలిగించుకొని, శ్రద్ధ పెట్టుకుంటే, జ్ఞానము లభిస్తుంది.

మరి మనిషికి ఏది దగ్గరగా ఉన్నది మాయనా? జ్ఞానము తెలుసు కోవటమా? అంటే, మాయే మనిషికి దగ్గరగా ఉందని చెప్పవచ్చును. అందుకే మాయను ముందు జయిస్తే, నీకు ఆత్మ దర్శనమగును అని తెలియజేసేందుకు బట్టతల ముందర భాగంలో ప్రారంభమై, చివరిలో అది లేకుండా ఆత్మ గుర్తయిన వెంట్రుకలు మాత్రము ఉండును.

ఇటువంటి గుర్తులు మన శరీరముపైన చాలా ఉన్నవి. అందులో హస్తమొకటి, అందులో **"జీవాత్మ, ఆత్మ, పరమాత్మ"** లకు గుర్తుగా మూడు గీతల ముద్రనొకటి ప్రతి మనిషికి ముద్రించి, మతము అనేది లేకుండా పంపించినాడు. ఈ విధముగా మనము తెలుసుకుంటే, మనలోనే దేవుడున్నాడు అని తెలుసుకొనవచ్చును.

అదే విధముగా తెలిసో, తెలియకో, కేశవ అను పదమును ఉచ్ఛరించారు. కేశవ అంటే 'ఓ ఆత్మా!' అని అర్థము. కేశము అంటే వెంట్రుక అని అర్థము, కేశవా అనగా 'వెంట్రుకలలో సైతం ఉన్నవాడా' అని కృష్ణున్ని 'కేశవా' అన్నాము. 'లోపలుండి నడిపించేవాడివి నువ్వే' అని అర్థమువచ్చే విధముగా 'కేశవా' అని అన్నారు. కేశవా అనగా 'ఓ వెంట్రుకా!' అని అర్థము. ఓ వెంట్రుకా! అనగా "ఓ వెంటనుండేవాడా!" అని అర్థము కదా! ఈ విధముగా చూచిన, **"ఓ ఆత్మా!"** అనే కదా అర్థము. కనుక జీవాత్మవైన నీ వెనుక ఉండేవాడు, నీవు చనిపోయిన తరువాత నీ వెనుకనే తోడై వచ్చేవాడు ఆత్మయే. కనుకనే ఆత్మకు 'వెంట, వెనుకనే' అని అర్థముగా వెంట్రక, వెంట్రుక ఉన్నది.

మన శరీరములో అన్ని భాగములు కుళ్ళిపోయి మనము చనిపోయిన తరువాత భూమిలో కలిసిపోవును. ఈ వెంట్రుకలు మాత్రము కుళ్ళిపోవు, భూమిలో కలిసిపోవు ఎందుకనగా! వెంట్రుకలకు ఈ ప్రత్యేకత

ఉంది. నీవు చనిపోయినా వెంట్రుకలు భూమిలో కలిసిపోవు. మరి దాని ప్రత్యేకత ఏమంటే, అవి నాశనం చెందేవి కావు. అక్షరము అనగా నాశనము కానిది, **"అక్షరుడు"** అని భగవద్గీతలో చెప్పెను ఈ ఆత్మ గూర్చే కనుకనే తల కుళ్ళిపోయినా సరే జుత్తు మాత్రము నాశనమవదు. ఇది అక్షరుడు అయిన ఆత్మకు గుర్తు కనుక అలాగే ఉండును.

మన శరీరములలో ఎక్కడ గాయపరచినా నొప్పి వస్తుంది కానీ వెంట్రుకలను కత్తిరించినా నొప్పిరాదు, ఎందుకు నొప్పిరాదంటే, బాధలకు అతీతమైనది, మనము మన జుత్తును క్రాఫింగ్ చేస్తున్నప్పుడు జుత్తును ఎంత కత్తిరించినా నొప్పి ఉండటం లేదంటే వెంట్రుకలకు ప్రత్యేకత ఉన్నట్లే కదా! నీ శరీరములో నొప్పికి అతీతముగా ఉండేది, ఉన్నది ఆత్మే! కర్మలు అనుభవించకుండా ఉండేవాడు ఎవరు? ఆత్మేకదా! కర్మలను అనుభవించే వాడు జీవాత్మ.

## 10. కాయ-పండు-కాయ

తేది : 20.10.2008

ప్రపంచములో అసలైన గురువెవరో తెలుసుకొనుట సాధ్యము కాదు. ఒకచోట ముందు ఉండిన దానినే వివరించి చెప్పేవారెవరున్నా బోధకులే అగుదురు, కానీ గురువు కాలేరు. ప్రపంచమునకంతటికీ గురువు ఒక్కడే ఉండును. ఆయన కొన్ని వేల, లక్షల సంవత్సరములకొకసారి భూమిమీదకు వచ్చును. ఆయనే గురువు లేదా భగవంతుడు. ఆయన అధర్మములు చెలరేగినప్పుడు దేవుడు భగవంతునిగా, లేదా గురువుగా వచ్చి, ఎవరూ వ్రాయని, చెప్పని విషయములనే క్రొత్తగా చెప్పును, అయినా వాటిని వినిపించుకొనని వారు ఉందురు.

www.thraithashakam.org

అయితే వచ్చిన గురువు గుర్తింపు లేకుండా ఉండును. కనీసం బోధకునికి ఉన్న గుర్తింపుకూడా ప్రపంచములో గురువుకు ఉండదు. అలాంటి వారిని ప్రపంచములో నాస్తికులుగానీ, అసలైన ఆస్తికులు కాకుండా ఉండిన వారు గానీ గురువుకు ఎట్టి పరిస్థితిలోనూ గౌరవం ఇవ్వరు, సరికదా ఆయన చెప్పినవి అసలు వినరు, చెప్పిన విషయములు వినినా ఈయన పిచ్చివాడనో, మూర్ఖుడనో చెప్పి, ఆయన గ్రంథములు చదవక, ఆయన చెప్పినవి వినక తప్పించుకొందురు.

ఆ విధముగా వారందరూ ఎంత చెప్పినా, ఎంత వాస్తవ జ్ఞానాన్ని అందజేసిననూ వినిపించుకునే పరిస్థితిలో లేరు. అటువంటి వారందరూ ఒక తరగతికి చెందినవారనుకుందాము. కొందరు మనము చెప్పిన జ్ఞానమంతా వింటారు కొంతవరకు ఇది మంచి జ్ఞానము అని తెలుస్తుంది వారికి అప్పుడు మరలా ప్రపంచ విషయములపైన ఆసిక్తిని కలుగజేసు కొనుటయే కాక, ఈ జ్ఞానము ఏముందిలే అని మరలా అజ్ఞానములో ప్రవేశించి, జ్ఞానమును విస్మరిస్తారు. ఈ విధముగా వారు జ్ఞానమును తెలుసుకున్ననూ, నిష్ప్రయోజనము. ఇక కొంతమంది ఈ జ్ఞానమును ప్రపంచ విషయములతో పోల్చుకుని ఈ పరమాత్మ జ్ఞానము చాలా గొప్పదని గ్రహించుదురు. ఇది ఏ గ్రంథములో చెప్పబడలేదు. ఇది చాలా పవిత్రమైన, వాస్తవమైన జ్ఞానమని, ఇదే ముఖ్యమని మన జీవితంలో దేనికీ ఇది సమానము కాదు, గొప్పదని జ్ఞానమును గొప్పగా చెప్పుకుని ఆచరించే వారూ ఉన్నారు. ఈ విధముగా మొదటికే ఏదీ తెలుసుకోకుండా ఉన్నవారున్నారు, తెలుసుకొని మధ్యలో వదలివేసేవారున్నారు. తెలుసుకుని దానినే ఆచరించేవారూ ఉన్నారు ఈ విధముగా మూడు తరగతులుగా ప్రజలు ఉన్నారు.

కొందరు జ్ఞానములో ఉండేవారిని చూసి, “ఎందుకు ఈ విధముగా జ్ఞానము అనీ, ఇది అది అని కాలమును గడిపేస్తున్నావు?” అని చెప్పినా వారిమాట వినకుండా జ్ఞానమునకు మించినది లేదని, దానికే విలువ ఇచ్చినవారై వాళ్ళకు దూరంగా ఉంటాడు జ్ఞాని. అటువంటి వాడు మాయలో పడకుండా అజ్ఞానిగా మారకుండా ఉండును.

ఈ విషయము బాగా అర్థము కావాలంటే ఉదాహరణకు ఒక మామిడి కాయను తీసుకుందాము. మామిడికాయ బాగా పరిపక్వం అయిన తరువాత పండు అగును. ‘పండు’ అయిన తరువాత దానిని మరలా కాయగా మార్చటం సాధ్యం కాదు. ఆ విధముగానే ఒక వ్యక్తి సంపూర్ణమైన జ్ఞానమును తెలుసుకున్న తరువాత, వాడు జ్ఞానములో పరిపక్వమైతే, అనగా పండితుడైతే ఎందుకంటే పండుగా పరిపక్వమైనవాడే పండితుడని అర్థము. అటువంటి వాడు ఎంత మాయ పనిచేసినా వాడు అజ్ఞానిగా మారడు. ఏ విధముగా అయితే పండును (మామిడి) తీసుకుని అగ్నివద్ద పెట్టినా కాయ కానట్లు ఉందురు. కనుక అటువంటి వారిని మామిడి పండుతో పోల్చుకొనవచ్చును.

ఇక నాస్తికవాదులు, హేతువాదులమనే వారు ఎప్పుడూ దేవుడు లేడనే అంటుంటారు. అటువంటివారు శాశ్వతముగా మామిడికాయగానే ఉండును. మామిడిపండుగా మారలేరు. దీనికి ఉదాహరణ మామిడికాయను తీసుకొని, ముక్కలు చేసినా లేదా ఆ కాయలకు రంధ్రాలు పెట్టి అందులో ఉప్పు, కారం అన్నీ కలిపి అందులో వేస్తాము. ముక్కలుగా పెట్టిన కాయలున్నాయి, ఏకంగా పూర్తికాయనే అలా పెట్టేందుకు కూడా అవకాశము ఉన్నది. వాటినే ఊరగాయలు అందుము. ఇక అలా పెట్టిన వాటిని ఊరగాయ అనగా శాశ్వతంగా కాయగానే చెప్పుకోవలసిందేగానీ, మరలా

www.thraithashakam.org

అవి పండుగా మారేందకు అవకాశము లేదు. ఈ విధముగా నాస్తిక వాదులుగా పేరున్నవారంతా, దేవుడులేడని, అంతా మూఢనమ్మకమని చెప్పి, శాశ్వతముగా అజ్ఞానులుగా మారుదురు వారు మామిడి కాయ ఊరగాయగా మారినవారుగా చెప్పుకొనవచ్చును.

ఇక కొందరున్నారు వారు కొంత పండుగా మారిన తరువాత, మరలా కాయగా మారుదురు. అనగా కొంత జ్ఞానము తెలిసిన తరువాత మరలా అజ్ఞానిగా మారుదురు. వీరు ఎటువంటివారనగా, నిమ్మకాయను ఉదాహరణగా తీసుకొనిన, నిమ్మకాయను ఎవరూ ఊరగాయగా పెట్టరు. నిమ్మకాయ బాగా పండుగా మారిన తరువాత, అప్పుడు ఉప్పు, కారం వేసి ఊరవేస్తారు, అప్పుడది ఊరగాయ అగును. ముందు నిమ్మకాయ, కాయే అగును తరువాత పండు అవుతుంది. ఊరవేసిన తరువాత మరలా కాయగా మారును. అనగా ముందు ఏ పేరుందో అదే పేరు మరల దానికి వచ్చును.

అనగా ముందు నిమ్మకాయే, తరువాత పండు అవుతుంది. ఏ విధముగా అనగా ముందు కొందరు అజ్ఞానిగానే ఉంటారు. నిమ్మకాయవలె తరువాత కొంత అసలైన జ్ఞానము తెలుసుకొని జ్ఞానిగా కొంత మారుతాడు. నిమ్మకాయ పరిపక్వమై పండైనట్లు మరలా ఎవరో ఏదో చెప్తారు, ఎందుకే జ్ఞానము అని అంటారు. అది విని ఉప్పు,కారము నిమ్మపండుకు తగిలిస్తే మరలా అది నిమ్మకాయ ఊరగాయని, కాయగా పేరు తెచ్చుకున్నట్లు, ప్రపంచ విషయాలనే ఉప్పు, కారాలను తగిలించుకొని జ్ఞానిగా మారినవాడు మరలా అజ్ఞానిగా మారును.

అందుకే జ్ఞానమనునది అందరికీ సమానముగా అర్థము కాదు. ఒకవేళ అర్థమైనా, మరలా వెనక్కువచ్చేవారు కొందరు. కొందరికి అసలు

అర్థము కాదు. కొందరు చాలా తక్కువ శాతం మందికి మేము చెప్పు జ్ఞానము పూర్తిగా అర్థమగునని, పై విశ్లేషణలో అర్థమగుచున్నది. వినే విషయంలోనైనా చెప్పు జ్ఞానము ఒక్కొక్కరికి ఒక్కొక్క శాతంగా అర్థమవుతూ ఉంటే, చేసే పనులలో ఎంత తేడా ఉండునో గ్రహించగలరు. ఈ విధముగా గురువు అనేవాడు భూమిమీద ఉన్నప్పుడే మూడు భాగములుగా మనుషులు ఉన్నారు.

ఈ విధముగా జ్ఞానమంటే ఏమిటో, ధర్మము అంటే ఏమిటో తెలియని వారంతా హిందూ ధర్మాన్ని రక్షిస్తామంటారు. ఏవో పేర్లు పెట్టుకుంటారు. దైవాన్ని తెలుసుకునేందుకే ఉండే జ్ఞానమునే ధర్మమనే విషయమని తెలియక, దైవము మీద భక్తికాక, దేశభక్తి అవసరము అంటారు. జ్ఞానము అనే విషయం వారికి తెలుసును అనే విషయం గంట వరకు హిందూ రక్షకులమని మాట్లాడిన వారిలో ఏ కోణంలోనైనా కనిపించదు.

అదే విధముగా వారిని, "ఏమయ్యా! మీలో వినాయకచవితి నిమజ్జన కార్యక్రమంలో, త్రాగి తందనాలు ఆడేవారున్నారట కదా! మరి అది మంచి పద్ధతేనా?" అని ఇతర మతస్థులు ఎవరైనా అడిగితే ఏమి చెప్పుదురు అని అడిగితే, ఏముందీ వారే ఉండాలిప్పుడు, ఎవరినైనా తన్నాలంటే వారే కదా! కావాల్సింది. మన ధర్మాలను రక్షించుకునేందుకు వారే! కావాలిప్పుడు. త్రాగేవారు ముఖ్యులు ఎందుకని అడిగితే మతఘర్షణలు వస్తే వారే కదా ముందు వారిని తన్నేది అని సమాధానము చెప్పారు.

హింసను ప్రోత్సహించేది ధర్మమా? ఇవి మంచి పద్ధతులు కావని మేము చెప్పితే, మమ్మల్ని వేరే మతస్థులు అంటున్నారు. హిందువులమైన మమ్మల్ని వెక్కిరిస్తున్నారు. హింసను ప్రోత్సహిస్తున్నారు. 1992, డిసెంబర్‌లో జరిగిన బాబ్రీమసీదు కూలగొడితే వారు 500-600

www.thraithashakam.org

దేవాలయములను పడగొట్టినారు, మరి దీనివలన ఏం ప్రయోజనము? మేము ఆ రోజు ఒక సమన్వయపరిచే విధంగా పరిష్కారాన్ని చెప్పినా ఎవరూ వినలేదు. ఆ దుర్ఘటన తరువాత ఎంతమంది హిందువులు ఇతర దేశాల్లో చనిపోలేదు?

కనుక మనము ఇప్పుడు చేయవలసినది ఏమంటే, అసలైన జ్ఞానమును పసరుగా ఉన్న కాయలవలెనున్న చిన్నపిల్లలకు చెబితే, వారు తప్పకుండా పండ్లుగా మారుటకు అవకాశము ఉన్నది. శాశ్వతంగా కాయలుగా ఉన్న అజ్ఞానులకు నీవు ఎంత చెప్పినా వారు పండ్లుకారు. కనుక వారికి చెప్పనవసరం లేదు. నిమ్మపండుగా మారి మరలా నిమ్మకాయ ఊరగాయగా మారిన వారికి మరి చెప్పినా వినరు. కనుక పండై కాయగా మారునది దేశములో ఏదని ప్రశ్నిస్తే, ఏమీలేదు అనుకోకూడదు. నిమ్మపండే ఊరవేస్తే మరల నిమ్మకాయ ఊరగాయ అగును. కనుక మనము కూడా మూడు విభాగాలలో ఏ తరగతికి చెందినవారమో తెలుసుకుని పండుగా అయ్యేందుకు ప్రయత్నం చేద్దాము.

## 11. జ్ఞానము - విజ్ఞానము

తేదీ : 13-11-2008

'జ్ఞానము' అనే మాటను రెండు విధములుగా ఉపయోగించుకోవచ్చును. ఇప్పుడు ఎవరినైనా మీరు జ్ఞానము తెలుసుకోండి అని మన సభ్యులు చెప్పినా, ఆ వ్యక్తులు మాకింతవరకు జ్ఞానము తెలియదనా మీ ఉద్దేశ్యం? అని జ్ఞానమును ప్రపంచ జ్ఞానముగా లెక్కవేసుకుందురు. మనము జ్ఞానము తెలుసుకోవటం అనే పదమును పరమాత్మను తెలుసుకునే విషయములకు చెప్పుకుంటున్నాము.

ఆత్మకు సంబంధించిన దానినే జ్ఞానమంటాము. వాస్తవముగా "ఆత్మజ్ఞానము" అని పిలువవలెను. కానీ సాధారణముగా "జ్ఞానము" అని మనము సంక్షిప్తముగా చెప్పుకుంటున్నాము. కొందరు ఒక మనుష్యునిలో ఉండే తెలివిని జ్ఞానము అంటారుగానీ అది ప్రపంచ జ్ఞానమని వారికి తెలియదు. వాస్తవముగా జ్ఞానము అనేది శరీరము లోపల కనిపించకుండా, కనిపించే వాటిని తెలుసుకునేందుకు, అనగా భౌతిక, అభౌతిక విషయములు మన శరీరములో ఉన్నవాటిని తెలుసుకునేదానిని మనము "జ్ఞానము" అని అనవచ్చును.

ఇప్పుడు భౌతికమైన శరీరములో భాగములైన ఊపిరితిత్తులు, మూత్రపిండములు మొదలగు అవయవములు అన్నియూ భౌతికముగా కనిపించేవి కానీ దానివెనుక ఉన్న, అభౌతికమైన విషయాలను తెలుసుకునే దానినే వాస్తవముగా 'జ్ఞానము' అనవలెను. వాస్తవముగా జ్ఞానము రెండు రకములు ఒకటి ప్రపంచ జ్ఞానము, రెండవది ఆత్మజ్ఞానము. మేము అడుగుచున్నది నీకు ఏ జ్ఞానము తెలుసునని. రెండవదైన ఆత్మజ్ఞానము గురించి తెలుసా అని అడుగుచుందుము. భగవద్గీతలో ఆత్మ అనే పదము చాలాచోట్ల వాడబడింది, కానీ ఏ ఆత్మ, జీవాత్మనా, ఆత్మా, పరమాత్మా ఏది అనునది నీవు తెలుసుకోవలెను. అందుకే మనల్ని దేవుడు పుట్టించినాడు. కనుక శరీరములో అభౌతికమైన ఆత్మను తెలుసుకోవటమే జ్ఞానము. ప్రపంచములో ఉన్న భౌతిక వస్తువుల జ్ఞానమును కూడా జ్ఞానమే అందురుగానీ అది వాస్తవముగా విజ్ఞానము అనవలెను లేదా ప్రపంచ జ్ఞానము అనవలెను. ఎందుకనగా ఐదు వస్తువులు అనగా గాలి, నీరు, అగ్ని, భూమి, ఆకాశము వీటితో తయారైన ప్రకృతి దృశ్యాల విషయాలే ప్రపంచ జ్ఞానములో ఉండును. కావున అవి ప్రపంచ జ్ఞానమే అగును.

'ప్ర' అనగా విశేషమైన, 'పంచ' అనగా ఐదు కదా! రెండింటిని కలిపితే 'ప్రపంచ' అగును కదా! కనుక పరమాత్మ జ్ఞానము కాదు, పరమాత్మ పక్షమైన ఆత్మను తెలుసుకోవటమే ఆత్మజ్ఞానమగును.

అట్లనిన ఇప్పుడు కొందరు శాస్త్రవేత్తలు లేదా వ్యక్తులు ఇలా అనవచ్చును. మీ జ్ఞానముకంటే మా విజ్ఞానమే గొప్పది. ఎందుకంటే విమానం కనిపెట్టింది మేము, ఫోను కనిపెట్టింది మేము. మరి మా విజ్ఞానముతోనే కదా ఇంతటి సౌకర్యవంతమైన జీవన విధానము వచ్చింది. ఇవన్నీ భౌతికముగా అందరికీ కనిపిస్తున్నవి. కానీ మీరు చెప్పుచున్న అభౌతికమగు ఆత్మ కనిపించదు, వినిపించదు, తెలియబడదు, మీరే ఇవన్నీ చెప్పుచున్నారు. మరి అభౌతికమైన ఆత్మజ్ఞానము వలన ఏమీ ప్రయోజనము బయటకు కనిపించటం లేదని వారు ప్రశ్నించవచ్చును నిజమే! మీరు చెప్పేదంతా ప్రకృతి గురించి అనగా ఐదు విషయముల గురించే చెప్పు చున్నారు. మీరు ఎంత పెద్ద యంత్రాన్ని కనిపెట్టినా ప్రకృతిలో భాగమే అవుతుంది. కానీ పరమాత్మ తెలియబడదు. అసలు నీ గురించే నీకు తెలియదు ఎందుకంటే నీవు జీవాత్మవు అనే సంగతే నీకు తెలియదు. కానీ విజ్ఞానమునే జనులు పెద్దగా చెప్పుకుంటున్నారు.

తరువాత ఏదో మతం పేరు ముందు పెట్టుకుని జన విజ్ఞాన వేదికలు అని పేర్లు పెట్టి మేమంతా ప్రచారము చేస్తున్నామంటున్నారు. హైదరాబాద్‌లో ఉబ్బసరోగమునకు మందు ఇస్తున్నారు. 'చేపమందు'గా అది పేరుపొందినది. కానీ కొందరు అది నమ్మటం లేదు. ఇదంతా ఒట్టిదే, ఉబ్బసరోగమేమీ దానివలన పోదు. అంతా మూఢనమ్మకము అంటున్నారు. వారి పరిశోధనకు కంటికి కనిపించేది ఏమీ ఉండదు. ఎందుకంటే ఆకులో ఉండే రసాయనములు, ఔషధ గుణములు మీ కంటికి

www.thraithashakam.org

కనిపించవు అనుట వాస్తవమేగానీ అంతమాత్రమున అది పనిచేయదు అనుట సమంజసము కాదు. ఆ మందును వాడిన వారంతా మాకు ఉబ్బస రోగము తగ్గింది అని చెప్పుట సాక్ష్యముగా ఉన్నప్పటికీ ఆ విధముగా వాదించటం మూర్ఖత్వమే అగునుగానీ, హేతువాదము కానేకాదు. అదే నిజమైనచో అన్ని రోగాలు, మందుల వలన నయమగునని నిర్ధారణ లేదు. ఎందుకనగా అల్లోపతి విధానములో చాలా రోగాలకు ఔషధములు లేనే లేవు. ఆ విధముగా ఒక వైద్యుడు తన మందులతో రోగమొచ్చిన తన సొంత కొడుకునే బ్రతికించుకోలేకపోయెను. అప్పుడు అతను అల్లోపతి మందులు అన్ని రోగాలకు పనిచేయవని సమాజమునకు తేల్చి చెప్పినాడు. తరువాత వేరే విధానమైన వైద్యముతో ఐదు సంవత్సరములు పరిశోధన చేసి మరియొక ఔషధమును ఆ రోగ నివారణకు కనుక్కొన్నాడు. దానినే హోమియో పతి వైద్యము అంటాము.

ఇప్పుడు చేప ద్వారా ఒక రకమైన ఆకును ఔషధంగా, అదియునూ, ఒక కాలములో, మృగశిర కార్తె మొదటి రోజుల్లోనే ఆ మందును రోగుల్లో ప్రవేశపెట్టుదురు. అంటే చేపతోనే ఎందుకలా చేస్తున్నారంటే అది వారికీ తెలియదు. ఒకానొకప్పుడు ఒక వంద సంవత్సరముల క్రితము ఒక వ్యక్తి ఒక ఇంటిలో మూడురోజులు ఆథిత్యము ఉండి, వెళ్ళిపోయిన రోజున మీరు నాకు మూడు రోజులిచ్చిన ఆతిథ్యానికి ప్రతిగా ఒక ఆకును ఔషధంగా చూపి, చేప ద్వారా ఎలా వెయ్యాలో చెప్పి, ఇది ఉబ్బస రోగాన్ని తగ్గించేందుకు బాగా పనిచేయును అని చెప్పి వెళ్ళిపోయెను. అప్పటినుండి ఆ ఇంటివారు వైద్యము చేయుచున్నారు. అనగా ఆ మృగశిరకార్తెకు, ఈ చేపకు, ఆ ఆకుకు ఏదో కనపడని ఔషధగుణము ఉన్నది. అతనికి ఉపయోగపడిన ఒక బావి నీటినే ఆ ఆకును నూరేందుకు వాడమన్నాడు కావున అతనిమీద

విశ్వాసంతో ఆ ఇంటివారు ఆ నీటిని ఉపయోగించి, ఆ ఆకును నూరి, చేపలో ప్రవేశపెట్టి ఉబ్బసరోగాన్నీ తగ్గిస్తున్నారు. అది వాస్తవమే కానీ కొందరు విజ్ఞానము అను పేరుతో, ఆ మందు పనిచేయదు, వాడవద్దని చెప్పిన సందర్భములు లేవా? మరి వారికి ఏ విజ్ఞానము ఉందట!

మేమిప్పుడు చెప్పునది ఏమనగా! జ్ఞానము ఉంటేనే విజ్ఞానము ఉండేది. నీవు చెప్పు 'విజ్ఞానము' అనే పదము ఏ విధముగా పుట్టింది, 'జ్ఞానము' అనే పదము ముందు ఉంటే కదా! 'వి' అనే అక్షరాన్ని పెట్టి విజ్ఞానము అని చెప్పుచుంటివి. ఇప్పుడు కొందరు జ్ఞానములేదు ఏమీ లేదు అంతా మూఢనమ్మకమని అంటున్నారు. మేమేమంటామంటే! అయితే మీ విజ్ఞానములో, జ్ఞానము అనే పదము తీసివేయండి, అప్పుడు ఒట్టి 'వి' యే మిగులుతుంది.

ఇప్పుడు విజ్ఞానము అని చెప్పే వారంతా సమాజాన్ని ఎక్కడికి తీసుకువెళ్ళుచున్నారంటే, దేవుడే లేడు, మహత్యాలే లేవు అంటున్నారు. మహత్యాలను మేమూ నమ్మటంలేదు, కానీ దైవమే లేదంటే ఎట్లా సాధ్యమగును. నీకు తెలియకపోతే, అలా అంటావు. దేవున్ని మరి తెలుసుకునే ప్రయత్నం చేస్తున్నావా, లేదు. మనం లేదు అంటున్నాము, వారు ఉన్నది అంటున్నారు, ఉన్నాడా, దేవుడు లేడా? అని ఎందుకు పరిశోధించ లేకపోవుచున్నారు అంటే ఒక్కటే ఉద్దేశ్యం వారిలో కనిపిస్తుంది. అది ఏమంటే! ఉంది అంటే లేదు అనాలి, లేదు అంటే ఉంది అనాలి అనే వితండవాదనే తప్ప వారివద్ద ఏమీ కనిపించటం లేదు. ఆ విధముగా విజ్ఞానవేత్తలమని పేరు తెచ్చుకున్నవారంతా పయనిస్తున్న మార్గము తప్పు.

దేవుడు లేడని వారంటున్నారు, దేవుడు ఉన్నాడు అని మనము అంటున్నాము. దేవుడు ఉంటే చూపించండి, దేవుడున్నాడని ఆధారము

www.thraithashakam.org

ఏమిటి? అంటున్నాడు, దేవుడు కనిపించకపోవటమనేదే ఆధారం అని మేము అంటున్నాము. కనిపించేవాడు దేవుడు కాదు కావున, కనిపించని వాడే దేవుడు అని మేము చెప్పుచున్నాము. లేదు మీది మొండివాదన అని అన్నారు. నాది మొండివాదన కాదు అడ్డంవాదనా కాదని ఇంతకు ముందే ఒక మాట చెప్పాము. **"దేవుడు నిజంగా లేడు కానీ అబద్ధంగా ఉన్నాడు"** అని అన్నాము. మరి మా మాటలో ఏముందో పరిశోధన చెయ్యక, కేవలం ఖండించేందుకే మాట్లాడితే ఏదీ తెలియబడదు.

ప్రపంచ వరముగా ఒక విద్యను నేర్చుకునేందుకే నానా తంటాలు పడి నేర్చుకుని, దానిని ఉపయోగించిన కొద్దిరోజులకే మనిషి చనిపోవు చున్నాడు. అయితే మేము ఇప్పుడు చెప్పుచున్నది ఏమంటే, పూర్వముకంటే సౌకర్యాలు పెరిగాయి, సుఖవంతమైన జీవనం పెరిగింది. అంతేమరి! పూర్వము సౌకర్యాలు లేవు, కానీ బాధలు మాత్రం ఇన్ని లేవు. ఇప్పుడు సుఖాలున్నాయి కానీ బాధలు మాత్రము దానికి రెట్టింపున్నాయి.

ఇప్పుడు ఐదు కిలోమీటర్ల దూరం ప్రయాణం ఒక అరగంటలో కాలు క్రింద పెట్టకుండా వెళ్ళుచున్నాము. అదే నడిస్తే మూడుగంటలు పట్టవచ్చు కదా! అని అంటే, నిజమే కానీ వారప్పుడు ఐదు కిలోమీటర్లు నడచినా, ఏ ఆయాసంగానీ, కాళ్ళనొప్పులుగానీ లేకుండా ఉండేవారు. మరి ఇప్పుడు ఆ ప్రయత్నం చేస్తే తెలుస్తుంది అని మేము అంటున్నాము. అందుకే పూర్వము సౌకర్యాలు లేకపోయినా బాధలు, రోగాలులేవు అని మేము అంటున్నాము. ఈ రోజు దేవుడు లేడు అనే పరిస్థితికి వచ్చినారు కావున, జ్ఞానము మీదే ఆధారపడునది విజ్ఞానము ఏదైనా సరే, **జ్ఞానములేని విజ్ఞానము ప్రకాశింపదు.** అయితే మీది కేవలము జ్ఞానమేనా అంటే మాకు జ్ఞానము ఉంది, విజ్ఞానము ఉన్నది.

భౌతికము, అభౌతికము రెండూ ఉంటేనే ఒక పని జరుగుతుంది. ఇప్పుడు నేను భౌతికంగా శరీరముతో ఉన్నాను. మరి అసలైన 'నేను' అనేవాడిని మాత్రము అభౌతికముగా ఉన్నాను. నీవు వెళ్ళిపోయిన రోజున అభౌతికము వెళ్ళిపోతుంది. భౌతికం ఉండిపోతుంది. అంతేకదా! అందుకే నీవు చనిపోయిన తర్వాత నీ శరీరము ఉంటుంది, కానీ నువ్వు ఉండవు, కనిపించవు. నీ వెనుక ఉండేవాడు కనిపించడు కావున అదియూ అభౌతికమే అగును.

నీవు, నీ వెనుక ఉన్నవాడు కాకుండా అంతటా నిండి ఉండినవాడు ఒకడున్నాడు, వాడూ అభౌతికమే అంటే వారికి శరీరము లేదు భౌతికముగా కనిపించేవారు కాదు, కనుక భౌతికము, అభౌతికము రెండూ ఉన్నప్పుడే దాని పనితనము అయిన మాటలాడటం కానీ ఇంకేదైనా తెలియవచ్చును. కనుక భౌతికమైన విషయములను తెలుసుకోవటమే ప్రపంచ జ్ఞానము, విజ్ఞానము అని అందురు.

ఇప్పుడు ఉదాహరణకు ఒక బడికి పోయితిమి అనుకోండి. అక్కడ ఉన్న బోధకులు విజ్ఞానము చెప్పుచున్నారు, వినేవారు నేర్చుకుంటున్నారు. ఏది తెలిసినా ప్రకృతికి సంబంధించిన విషయములే ఉన్నవి. కానీ ఆత్మజ్ఞానము కానీ, దైవజ్ఞానముగానీ అక్కడ చెప్పరు. మరైతే విజ్ఞానము వలనే కదా మనమింత సౌకర్యాలు అనుభవిస్తున్నది. మరి విజ్ఞానవేత్తలు గొప్పవారే కదా? విజ్ఞానము గొప్పదే కదా? అని కొందరు ప్రశ్నించవచ్చును. నిజమే ఒక వ్యక్తికి ఒక ఆలోచన వచ్చి, ఆ ఊహ లేదా ఆలోచనను పరిశోధించి, ఏదైనా కనుక్కుంటున్నాడు. అదే విధముగా కంప్యూటర్‌ను కనుగొన్న వ్యక్తి ఉన్నాడు, కారును కనుక్కొన్న వ్యక్తి ఉన్నాడు. ఫోన్‌ను, రైల్‌ఇంజన్‌లాంటివన్నీ కనుక్కున్నారు. కానీ ఒక్కొక్క ఆలోచన ఒక్కొక్కరికి

www.thraithashakam.org

వేరువేరుగా వచ్చినవి, కానీ సమాజములో ఆ ఆలోచనలు ఊహలు అందరికీ ఎందుకు రావటంలేదు? అదే విధముగా విమానం కనిపెట్టిన వ్యక్తి, ఫోన్‌ను కనిపెట్టలేదు. అలాగే కంప్యూటర్ కనిపెట్టిన వ్యక్తి, రైలింజన్‌ను కనిపెట్టలేదు. వాడి మెదడులో ఆ ఊహ మాత్రమే వచ్చినట్లు చేసిందెవరు? ఈ ఊహలన్నీ వాడిలోపలనుండి పుట్టినవే నేనిప్పుడు మీకు ఏదైనా విషయాన్ని మీ బుద్ధికి చెప్పాలంటే, ఎక్కడనుండో చూసి చెప్పవచ్చును. కానీ ఎవ్వరూ చెప్పని విషయాన్ని చెప్పాలంటే బయటనుండైనా రావాలి లేదా లోపలనుండైనా రావాలి. ఇంతకుముందు రేడియో కనిపెట్టిన వ్యక్తికి బయటనుండి ఏదీ రాలేదు. ఆ ఆలోచన అతని మెదడునుండి వచ్చినది.

మరి ఆ ఊహను అందించినవాడు ఎవడు అంటే ఆ ఊహను నీకు అందించినవాడు లోపల ఒకడున్నాడు. అదే విషయము భగవద్గీతలో ఒక శ్లోకములో **"మత్తః స్మృతి, జ్ఞాన మపోహనంచ"** అని నా వలననే జ్ఞానము, ఊహ, జ్ఞాపకము నీకు అందించబడుతాయి. ఎవరికీ తట్టని ఊహ నీ తలలోనే వచ్చిందంటే, నీలో ఉండేవాడు ప్రత్యేకంగా నీకు అందించాడు. నీ రూపములో, ప్రయోగాత్మకంగా బయటకు వచ్చి, పని చేసినట్లు, కనిపెట్టినట్లు చేస్తే, 'నేనే కనిపెట్టాను' అని అనుకుంటున్నావు. రేడియోను 'మార్కోని' కనిపెట్టాడు. నిజమే కానీ మార్కోనీకే ఆ ఊహ ఎందుకు రావలెను? మార్కోనీ తలలో ఉన్న దేవుడే ఆ ఊహను అందిస్తే, అతను ప్రయోగపూర్వకముగా రేడియోను కనిపెట్టగా, అప్పుడు కనిపెట్టినంతగా రేడియోలు ఇప్పుడు లేకుండా ఎన్నో మార్పులు వాటి ఆకృతిలో కలవు. అదే పరిస్థితి కంపూటర్లకు కూడా. కనుక మొదట సిద్ధాంతము మారలేదు. కానీ వాటి ఆకృతిలో ఎన్నో మార్పులు సంభవించినవి. కానీ మొదట ఊహ మాత్రము దేవుడు అందించినది, ఆ వ్యక్తిలో అన్నది మాత్రము సత్యము.

నీవు నిద్రపోయినప్పుడు నీ గుండెను కొట్టిస్తూ అప్పుడు కూడా పని చేసేవాడు, నీవు తిన్న ఆహారాన్ని జీర్ణింప చేసేవాడు, ఈ విధముగా ఒకటేమిటి నీ శరీరములో అన్ని పనులు చేసినవాడే, నీ తలలో ఊహను ఇస్తున్నాడు. తద్వారా వ్యక్తులు క్రొత్త విషయాన్ని కనుక్కున్నట్లు కనిపిస్తున్నది. అదే విధముగా ఒక ఉదాహరణ చెప్పుకుందాము. ఒక వ్యక్తి గురకపెట్టి నిద్రపోతున్నాడు. అతనివద్దకు వెళ్ళి వీడు పనికిమాలినవాడు అని తిట్టినా, ఆయనకు వినపడదు కావున అతను స్పందించడు. ఇప్పుడు ఆ వ్యక్తి వద్దకు ఒక తేలును తీసుకువచ్చి అతని దగ్గర వేసామనుకోండి. అప్పుడు అతను తన ప్రక్కన తేలున్నదన్న విషయాన్ని కూడా గుర్తుపట్టలేడు. ఎందుకంటే వాడికావిషయం తెలియదు గానీ చేతితో మాత్రం ఆ ప్రదేశంలో గీకును. మరి గీకింది అతనే అయితే అది తేలని తెలియాలి కదా! మరి గీకింది ఎవరు? ఆ విధముగా ఏమీ తెలియని స్థితిని నిద్ర అంటాము. అప్పుడు నీకు గట్టిగా పిలిస్తే మాత్రము లేచి పలికెదవు. మరి ఆ పిలుపు ఎందుకు వినిపించింది? నిద్రపోయిన నీకు ఆ విషయం ఎలా వినిపించింది? తేలు, పాములులాంటివి నీ మీద ఉన్నా, స్పందించక ఉన్న నీకు ఆ పిలుపు మాత్రము ఏ విధముగా వినిపించింది. నిన్ను లేపినది ఎవరు? నీ లోపల ఒకడున్నాడు కావున వాడే నిన్ను లేపినాడు. జీవున్ని బయటకు వచ్చినట్లు చేసాడు. నిద్రలో ఏమగును. మనస్సులోపల ఉండును అది నిద్ర అంటాము. మనస్సు బయట ఉంటే మెలుకువ అంటాము. మరి నీ నిద్రలో నీ మనస్సును బయటకు పంపించేదెవరు? నీ లోపలుండేవాడే లేపి నీతో ఏదో పని ఉంది అని పంపించినట్లు చేసెను.

అదే విధముగా నిత్యము మన వెనుకనే ఉండి చేయించే వాడు ఒకడున్నాడని తెలుస్తున్నది కదా! కానీ మనమే అన్నీ చేస్తున్నట్లు అనుకోవటం

www.thraithashakam.org

జరుగుచున్నది. మరి నువ్వే అన్ని విషయాలకు కారణమయితే, ఒక ఉదాహరణ చెప్పుకుందాము. ఒక పెద్దాయన నిద్రలో మూత్రవిసర్జన చేసెను. మూత్రవిసర్జన చేసిన తరువాత, ఆ తడికి తనకు మెలుకువ వచ్చింది. ఇదేమి ఇట్లా చేశాను నేను చేయలేదు ఆ పనిని అంటే మరి మూత్రము కనిపిస్తున్నది కదా! అంటే ఏమో నాకు తెలియదు అంటున్నాడు. వాడికి తెలియకుండా ఇంతపని ఎప్పుడు జరిగింది? అని మేము ప్రశ్నిస్తున్నాము.

కనుక నీ వెనుక అన్నీ చేసేవాడు ఒకడున్నాడు కావున, జ్ఞానము తెలిసినవారంతా తెలుసుకోవలసినది ఏమంటే, **"మనలో ఏమీలేదు అంతా దేవుడు బొమ్మలను ఆడిస్తున్నట్లు మన శరీరముతో ఆడిస్తున్నాడు"** అని, అది తెలియక మనమే ఆడుచున్నట్లు భావిస్తున్నాము. అదే విధముగా నీ మెదడులో నీకు అందించిన ఊహ విజ్ఞానమై బయటకు వచ్చుచున్నది.

కనుక లోపలున్న జ్ఞానముగానీ, బయటకు విజ్ఞానముకానీ ఇవ్వాల్సింది లోపలున్న ఆత్మయే అని తెలుసుకొనవలెను. ఆ విధముగా అనుకోకుండా లోపలున్న జ్ఞానముకంటే బయటనున్న విజ్ఞానమే గొప్ప అని చాలామంది అనుకుంటున్నారు. జ్ఞానము తెలియకుండా విజ్ఞానము గురించి చెపితే వాడు సగం తలకాయ ఉన్నవాడే అగును. పూర్తి జ్ఞానము, విజ్ఞానము తెలిసి ఉంటే పూర్తి తలకాయ ఉన్నవాడివే అగుదువు. ఎక్కువ విజ్ఞానము కేవలము యాభై సంవత్సరములలోనే సాధ్యమయింది, ఎందుకంటే వాటిలో పడి జ్ఞానమువైపు వెళ్ళనివ్వకుండా ఉండేందుకు మాయ పన్నిన ఉపాయం.

కనుక మనమిప్పుడు ఎవరూ, ఎక్కడా చెప్పని దైవజ్ఞానాన్ని, త్రైత సిద్ధాంతము ద్వారా తెలుసుకుంటున్నాము. కావున ఈ సమయంలోనే

www.thraithashakam.org

విజ్ఞానం బాగా పెరిగిపోయి, అనేక సౌకర్యాలు ఈ విశ్వములో కల్పించబడి నవి. కానీ మనమేమి చేస్తున్నామంటే అది ఎంత గొప్పదైనా, సగం మెదడు ఉండేదే, పూర్తి మెదడు కావాలంటే పూర్తి జ్ఞానము కావాలి మరియు విజ్ఞానము కావాలి అని మేము అంటున్నాము. కనుక విజ్ఞానము పనికిరాదు అని మేము అనడము లేదు కానీ విజ్ఞానమునకు కారణము జ్ఞానము అని ఖచ్చితంగా చెప్పగలము.

పూర్వము ప్రపంచ గురువులుగా ఉన్నవారు ఒక నియమం పెట్టు కున్నారు. అదేమంటే వారు నేర్పిన విద్యలో కొన్ని విషయాలను మాత్రము శిష్యులకు నేర్పకూడదని ఉదాహరణకు కుస్తీ విద్యను చెప్పేవారికి ఇరవై రకాల ఉపాయాలు తెలుసుననుకోండి శిష్యులకు లేదా విద్యార్థులకు 19 పట్లు అనే ఉపాయాలే నేర్పేవారు. కానీ ఒక పట్టును మాత్రము నేర్పేవారు కారు ఎందుకంటే చెప్పేవాడితో నేర్చుకునేవాడు సమానమవుతాడు అని భావించేవారు.

అదే విధముగా దేవుడు కూడా తానిచ్చిన విజ్ఞానములో కొంత నేర్పకుండా కొదువపెట్టెను, అనగా పూర్తి విజ్ఞానమును సమాజమునకు అందించలేదు. ఎందుకంటే పూర్తిగా అందిస్తే అంతా దేవుడే లేడు అనే స్థాయికి దిగజారుతారని తెలిసే అలా చేశాడు. అందుకే ఇప్పటికీ పడిశమునకు (జలుబుకు) మందు లేదు. అందుకే ఎంతటి విజ్ఞానికైనా పడిశము (జలుబు) రావాల్సిందే! మాత్రలు వేసుకుంటానంటే, ఒకరోజు ఇంకా ఎక్కువ నీ శరీరములో ఉంటుంది. మరి ఇంతవరకూ పడిశానికి మందు కనిపెట్ట లేకపోయారు మనది మరెంత విజ్ఞానమో! అదే విధముగా మూర్ఛవ్యాధి అది ఏ విధముగా వస్తోందో తెలుసా అంటే, మెదడులో ప్రకంపనలు వస్తాయి, దానివలన శరీరము పట్టు తప్పిపోతున్నది అంటారు.

అయితే మెదడులోనే ఎందుకు ప్రకంపనలు వస్తున్నాయి? అని మేము అడుగుచున్నాము.

అదే విధముగా మనము తెలుసుకోవలసినది చాలా ఉన్నది. ఈ మధ్య టీవీలో ఒక వైద్యుడు చెప్పుచూ, అమావాస్యకు పౌర్ణమికి వ్యాధులు ఎక్కువగా రోగిలో విజృంభిస్తాయన్నది నిజము కాదని చెప్పారు. అతనికి పూర్తిగా విషయము తెలియక అలా మాట్లాడారు. ప్రపంచమంతా అయస్కాంత శక్తి దక్షిణం నుండి ఉత్తర దిశకు ప్రయాణిస్తున్నది. దానినే ఆంగ్లములో గ్రావిటీ, గురుత్వాకర్షణ శక్తి అని కూడా అనవచ్చును. తద్వారా గాలిలో మార్పువస్తుంది, నీటిలో మార్పువస్తుంది, బ్రహ్మాండంగా అలలు పైకొస్తుంటాయి. పౌర్ణమి అమావాస్య దినములలో వాటినే సముద్రంలో ఆటు, పోట్లు అంటారు.

కనుక అమావాస్య, పౌర్ణమి రోజుల్లో మూర్ఛరోగులకు ఎక్కువసార్లు మూర్ఛ వచ్చే అవకాశము ఉంది. వాస్తవమే కానీ దానిని తెలియకుండా దేవుడు చేశాడు. ఇప్పటికీ మానవునికి తెలియకుండా అమెరికాకు కొద్దిదూరంలో, సముద్రములో ముక్కోణపు ఆకారంలో **'బెర్ముడా ట్రయాంగిల్'** గా పేరున్న ప్రదేశం ఒకటి కలదు. ఆ ప్రాంతంలో పై నుండి విమానాలు వెళ్ళినా, సముద్రములో షిప్‌లు (ఓడలు) వెళ్ళినా ఆ ప్రాంతంవద్దకు వచ్చేటప్పటికి మరి అవి కనిపించవు. వాటి ఆచూకీ కూడా తెలియదు. మరి దీని విషయం ఎవరికీ తెలియదు, పరిశోధనలకు కూడా అందలేదు. మరి విజ్ఞానవేత్తలందరూ దీనికి ఏమి చెప్పెదరు? మనుషులు మాకంతా తెలుసు, దేవుడే లేడంటారని దేవుడు ఆ విషయాన్ని అణచి పెట్టుకున్నాడు. ఈ విధముగా మనకు తెలియనివి చాలా ఉన్ననూ, దేవుడు సృష్ఠించిన వాటినే మనుషులు తెలుసుకోలేక పోయి, దేవుడే లేడు అనే

www.thraithashakam.org

స్థాయికి ఎదిగిపోయారు. కనుక దేవుని ఉనికిని ప్రశ్నించే విధానము ఏ విజ్ఞానవేత్తకైనా తగదు అని మేము చెప్పుచున్నాము.

ఈ విజ్ఞానవేత్తలమని చెప్పుచున్న శాస్త్రవేత్తలు కొందరు ఏమి చెప్పు చున్నారంటే, ఈ సృష్టి అంతా కూడా ఖగోళంలో ఒక పేలుడు జరిగినదనీ, తరువాత అవి చల్లబడి నక్షత్రాలు ఏర్పడ్డాయనీ, తరువాత భూమి తయారయినదనీ అంటున్నారు. మరి దీనికి ఆధారము ఉందా అంటే లేదు. అదే విజ్ఞానమా? మొట్టమొదట ఏకకణ జీవి పుట్టింది దానినే అమీబా అంటారు. ఆ ఏక కణజీవి అనేక మార్పులు చెంది, కీటకాలు నుండి, కోతి వరకు, కోతి నుండి మనిషి వరకు వచ్చినట్లు చెప్పుచున్నారు. ఇది 'డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం' అని చెప్పుచున్నారు. ఏ కోతినుండైనా మనిషి తయారైనట్లు మీరు చూశారా, మరి అతను చెప్పినవి వినవలెనా! ఇదేమి విజ్ఞానము!!

ఒక మనిషి పుట్టారంటే స్త్రీ శరీరములో ఒక అండము, పురుష శరీరములో ఒక వీర్యకణం కలిస్తే, అది కణవిభజన చెందుతూ మన శరీరములు తయారై మనమందరం వచ్చాము. ఇంకా ఈ సైంటిస్ట్‌లు "చూడండి మేము గర్భాశయంలో ఒక అండాన్ని అమర్చుతున్నాము." అంటున్నారు. అండము, వీర్యకణములను నీవు తయారు చేశావా? మరి అవేవీ పెట్టకుండా అన్నింటినీ తయారు చేసినవాడైన దేవుడు గొప్పవాడు కాదా? ఒక అండాన్ని, వీర్యకణాన్ని తీసుకుని నీవు గర్భాశయంలో పెట్టాలంటే డాక్టర్లు రెండు, మూడు లక్షలు తీసుకుంటున్నారు. అదికూడా ఫలిస్తుందని నమ్మకంలేదు. ఒకవేళ ఫలించినట్లు చూపిస్తే చూపించవచ్చు. నీవు ఆ విధంగా కలిపి, ఇంకెక్కడైనా శరీరములను తయారు చేస్తున్నావా అంటే, మళ్ళీ గర్భంలోనే పెట్టాలి. మరి నీ గొప్పతనమేముంది అందులో? అని

నేను ప్రశ్నిస్తున్నాను. ఒక కిడ్నీనే నీవు తయారు చేయలేవు. వాటి మూలకణాలు లేకుండా, మరి పూర్తి శరీరమును ఎవరు తయారు చేయగలరు? ఒక కిడ్నీని మూలకణాల ద్వారా తయారు చేస్తే దాని విలువ కొన్ని లక్షలుంటాయి. మరి శరీరములో ఎట్లు తయారయ్యాయి? అంటే, అటోమేటిక్‌గా తయారయ్యాయి అంటారు. అయితే మీరు ఆటోమేటిక్‌గా కిడ్నీని తయారు చేయగలరా?యని విజ్ఞాన వేత్తలను ప్రశ్నిస్తున్నాను.

కొందరు ఒక విద్యను పట్టుపట్టి నేర్వవలెనన్న నేర్వలేడుగానీ కొందరికి నేర్వకపోయినా సంగీతంలాంటి విద్యలు అబ్బును. మరి వారికి ఆ విధంగా చేసిందెవరు? మూడు సంవత్సరాల పిల్లాడు సంగీతాన్ని వినిపిస్తున్నాడు. ఇది అందరికీ సాధ్యమా అంటే లోపలుండేవాడు కదిలించి పాడిస్తుంటే పాడుచున్నాడు అంతే! ఒక ప్రోగ్రామ్‌లో పది సంవత్సరముల వయస్సున్న పాప పాటను నాలుగైదు గొంతులతో పాడింది. న్యాయ నిర్ణేతైన బాలసుబ్రమణ్యంగారికి ఆశ్చర్యం వేసి పది సంవత్సరాల వయస్సులో నేర్చుకున్న విద్యేనా ఇది అంటే పది సంవత్సరాల వయస్సుకు ఇది నేర్వలేమని ఆయనే ఒప్పుకున్నాడు. అంటే ఆటోమేటిక్‌గా వచ్చేది అంటే దేవుని బహుమతి అన్నారు. దేవుడు బయటనుండి పాడిస్తున్నాడా అంటే, నీ తలలో ఉండి ఆత్మ రూపములో చైతన్యమునిచ్చి పాడించారు. మరి నీవు ఎక్కడున్నావు? గుణచక్రములో మూడు భాగములలో ఒక దగ్గర ఉన్నావు. దేవుడు అంతటా అన్నీ తానై ఉన్నాడు. అందుకే భగవద్గీతలో సూర్యుడిలో ఉండే వెలుతురు నేనే, చంద్రునిలో ఉండే చల్లదనాన్ని నేనే, అంతటా, అన్నింటా నేనే ఉన్నానని చెప్పలేదా! మరి అలాంటప్పుడు గొంతులో ఉండే సంగీతాన్ని, పాటను నేనే అని అర్థము చేసుకోవలెను. కనుక విజ్ఞానమూ ఉంది దానికి ఆధారమైన జ్ఞానము కూడా ఉన్నది. క్రింద పునాది ఉంది,

దానిపైన భవనము ఉన్నది. ఆ విధముగ **జ్ఞానముపై విజ్ఞానము ఆధారపడి ఉన్నది.** కనుక మీరు శరీరములో ఉన్న జ్ఞానమును తెలుసుకోండి. శరీరము బయట ఉన్న జ్ఞానమును తెలుసుకోండి, అప్పుడు సంపూర్ణ జ్ఞానివి అగుదువు.

## 12. వార - మాస - వత్సర

తేది : 10-12-2008

మనకు వరుసగా ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని అని దినములకు పేర్లు కలవు. ఈ దినములు స్కూళ్ళకు వెళ్ళినప్పుడు శనివారము సాయంత్రం, మరునాడు ఆదివారం సెలవు దినము అని పిల్లలు సంతోషిస్తారు. మరలా సోమవారము బడి మొదలవుతుంది కనుక దానిని మొదటి దినముగా లెక్కవేసుకుంటాము. ఆదివారాన్ని చివరి దినముగా లెక్కవేసుకుంటున్నాము. మరి ఆదివారము మొదటి దినమా, చివరి దినమా అని చూస్తే, ఉద్యోగస్తుల లెక్కలో సర్వసాధారణంగా అందరి లెక్కలో చివరి దినముగానే ఉన్నది. అయితే మనము మనుషులం మనుషులు అని పేరు ఎందుకు వచ్చిందంటే, మననము కల్గినవాడు మనిషి. మనస్సు కల్గినవాడు కనుక మనిషి అంటున్నాము. అయితే మనస్సు అనేది మిగతా జీవరాసులకు కూడా ఉంది. ప్రత్యేకించి 'జ్ఞాపకశక్తి' ఎక్కువ ఉండేవాడు, కావున మనిషి అన్నారు. మిగతా జీవరాసులకు జ్ఞాపకశక్తి చాలా తక్కువ కనుక, మనస్సు వాటికి ఉన్ననూ వాటికి ఆ పేరు రాలేదు. మనస్సు ప్రభావము ఎక్కువ ఎవరిపైన ఉందో వారిని 'మనిషి' అన్నారు.

ఇప్పుడు ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని అని పేర్లు పెట్టుకుంటే, ఈ ఆదివారాన్ని మొదటి దినముగా లెక్కవేయాలా,

చివరి దినముగా లెక్కవేయాలా? అనే ప్రశ్నవేసుకుంటే, చాలామంది అభిప్రాయంలో చివరి దినమైననూ, క్యాలెండర్‌లో మొదటి దినముగానే లెక్కవేయవచ్చును, అందులో ఆదివారమే మొదటి దినముగానే ఉండును. ఆదివారము మొదటి దినమే అని దేవుడు అక్కడక్కడ గుర్తులు పెట్టాడన్న మాట. ఇప్పుడు మీ అందరికీ వీటితో ఎందుకు ప్రసంగాన్ని మొదలు పెట్టారన్న ప్రశ్న మీలో రావచ్చును. ఆదివారం మొదటి దినమైతేనేమి, చివరి దినమైతేనేమి, అనే ప్రశ్న కూడా రావచ్చును. అయితే ఆది, సోమ అని దినములకు పేర్లు పెట్టుకున్నాము కదా ఎందుకు పెట్టుకున్నాము. ఏడు దినములుగానే ఎందుకు విభజింపబడ్డాయి అని ప్రశ్నిస్తే, మనము కాలములో బ్రతుకుచున్నాము. ఎవరు ఎంతకాలం బ్రతికారు అనేదానికి చరిత్రలు ఉన్నాయి. ఒకడు 50 సం॥లు బ్రతికాడనీ, ఇంకొకడు 100 సం॥లు బ్రతికాడనీ మనం చెప్పుకుంటున్నాము. అంటే మనం కాలములో బ్రతుకుచున్నట్లే. మరి కాలము అంటే ఏమిటి? జరుగుతూ ఉన్నది. నువ్వు చిన్నప్పటి కాలం నుండి గుర్తుతెచ్చుకో కాలం ఏ విధంగా గడిచిందో అర్థమవుతుంది. సరే ఏదో రకంగా కాలం గడిచిపోయింది కాలం గడిచి పోయినా ప్రస్తుత కాలం కూడా ఉంది. జరిగిపోయిన కాలం, జరుగుచున్న కాలం, జరుగబోవు కాలం అని మూడు రకములుగా విభజించుకున్నాము. జరుగుచున్న కాలం అనేది ఉన్ననూ అది ఎవరికైనా కనిపిస్తున్నదా? అంటే కాలం మన కళ్ళ ఎదుటే ఉన్నప్పటికీ ఎవ్వరికీ కనిపించ లేదు, కనిపించదు. కనిపించదు అనే దానికి లెక్కాచారము ఉంది. కనిపించని కాలమును మనం ఏ విధముగా లెక్కవేసుకుంటున్నాము. ఏ ఆధారముతో వేసుకుంటున్నాము? అనే ప్రశ్న వేసుకుంటే, అనగా ప్రశ్నల మీద ప్రశ్నలు వేసుకుంటే, దానికి జవాబులు వెతికితేనే జ్ఞానం తెలిసేది. ప్రశ్న వేయని వానికి జ్ఞానము తెలియదు.

కాలము కనిపించనప్పుడు దానిని కొలత ఏ విధముగా వేసుకుంటున్నాము. కాలము అంటే ఏమి? భగవద్గీతలో **'కాలోస్మి'** అన్నాడు. అంటే **"కాలమే నేను"** అని అన్నాడు. పోనీ ఆయనెవరో తెలుసునా అంటే తెలియదు. ఎందుకంటే పేరులేదు, రూపములేదు, పని లేనివాడు దేవుడు. కనుక ఈ ప్రశ్నలకు జవాబులు వెతికితే, ఏమి తెలియుననగా! మనము సూర్య, చంద్రులను అనుసరించి, వారితో సంబంధము ఏర్పరచుకొని కాలాన్ని కొలుస్తున్నాము. సూర్యుడు కనిపించి ఒకమారు మరలా కనిపించకపోతే దానిని ఒక దినము అంటున్నాము. సూర్యచంద్ర గ్రహములతో మనము కాలాన్ని తెలుసు కుంటున్నాము. ఈ సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు మనకు గగనములో పైన కనిపిస్తున్నవి. గగనం అంటే ఏమి? ఆకాశము, శూన్యము అంటాము. ఎవరైనా 'అంతా దేవుడే చూసుకుంటాడులే' అని పైకి చూస్తారు. అంటే దేవుడు పైన ఉన్నాడని అర్థము. ఈ విషయాన్ని క్రికెట్ ఆడేవాడు 100 రన్స్ కొడితే పైకి చూసి, దండం పెట్టి, ఆ చేతిని ముద్దు పెట్టుకుంటాడు. అంటే దేవుడు పైన ఉన్నాడని అర్థము కదా! ఇది పూర్వమునుండి దేవుడినుద్దేశించి పైకి చూడటం అనేది ఉంది.

ఈ విధముగా పైకి ఎందుకు చూడాల్సి వచ్చింది అంటే కాలాన్ని మనము సూర్య, చంద్రులను గురించే లెక్క వేసుకుంటున్నాము కనుక దేవుడు అనేవాడు కనిపించే రెండు గ్రహములుగా ఒక నక్షత్రముగా ఉన్నాడు అని మనకి తెలుస్తుంది. ఈ విధంగా సూర్యున్ని ప్రత్యక్ష దైవం అంటున్నారు. చంద్రున్ని కూడా ప్రత్యక్ష దైవం అని కూడా అంటున్నారు. కనిపించే విధంగా కాలాన్ని విభజించి చూస్తే త్రైతము అంటే మూడు అని అర్థము. దేవుడు మూడు విధములుగా విభజింపబడి ఉన్నాడు. దేవుడే

కాలము, కాలమే దైవము కనుక దేవుడు సూర్య, చంద్ర, నక్షత్రములలో విభజింపబడి ఉన్నాడు. గ్రహము అనగా గ్రహించుకునే శక్తి ఉన్నది అని అర్థము. సూర్య, చంద్రులు గ్రహించుకొనేవి. నక్షత్రము చూచేది. మనిషి కూడా ఒక గ్రహమే. నేను చెప్పే విషయములను నువ్వు గ్రహించుకుంటున్నా వంటే, నువ్వు కూడా గ్రహానివే. కనిపించని సూర్యులు ఎందరో ఉన్ననూ, కనిపించే ఆ సూర్యున్నే మనము లెక్కించుకోవాలి. మనము అదే విధముగా నక్షత్రములు ఎన్నో ఉన్ననూ, దానిని ఒక్క సాక్షి గానే వాటిని ఏకవచనంలోనే లెక్కించుకోవలెను. అయితే దేవుడు పైనే ఉన్నాడా? అంటే, అంతటా వ్యాపించి ఉన్నాడు. కనిపించనివాడు కనిపించే విధముగా సూర్య, చంద్ర, నక్షత్రములను త్రైతముగా ఉన్నాడు. కనిపించే విధముగా ఉన్ననూ, కనిపించకుండా ఉన్ననూ, దేవుడు మూడు రకములుగానే త్రైతములోనే ఉండును. నీ శరీరములో కనిపించకుండా జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు ఉంటూ, బయటకు కనిపించే విధముగా సూర్య, చంద్ర, నక్షత్రములుగా ఉన్నాడు. సూర్య, చంద్ర, నక్షత్రములను దైవ స్వరూపమైన కాలమును లెక్కించేందుకు వాడుచున్నాము.

ఆ కాలము ఎవరికి పనికి వస్తున్నది అంటే, జీవాత్మ, ఆత్మ, పరమాత్మలుగా ఉన్న శరీరమునకు ఆయుష్షుగా పనికి వస్తున్నది. ఇటు చూస్తే ఆయుష్షుగా అటు చూస్తే కాల పరిమాణంగా కనిపిస్తున్నది. ఇక్కడ చూస్తే నీ ఆయుష్షును తెలుపుతున్నది. నీ ఆయుష్షుకు ఆధారము సూర్య, చంద్ర, నక్షత్రములుగా పైన చూపుచున్నది. అంటే దేవుడు కనిపిస్తూ, కనిపించకుండా ఉన్నాడనునదే సూత్రము. వారాలకు ఆది, సోమ అని పేర్లు ఎందుకు పెట్టాల్సివచ్చింది అని అనుకున్నాము కదా! కాలాన్ని లెక్కవేసుకోవాలంటే ఈ పేర్లతోనే లెక్కవేసుకోవాలి కదా! నీ ఆయుష్షు

దినాలు, నెలలు, సంవత్సరములు ఇవి కూడా మూడు రకములుగానే ఉన్నది. కాల పరిమాణంలో కనిపించేటటువంటి రెండు గ్రహాలు, ఒకటి నక్షత్రము మూడైతే, కనిపించే లెక్కాచారంగా దినము, మాసము, సంవత్సరముగా ఉన్నవి. ఇదంతా ఎవరికి లెక్కాచారం? జీవాత్మ, ఆత్మ, పరమాత్మలుగా ఉన్న శరీరములకు లెక్కాచారము.

ఈ విధముగా చూస్తే మనకు అవసరమైనవే దినములు. ఏది మొదటి దినము, ఏది చివరి దినము అని ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే మనకు వాటికి సంబంధం ఉంది కావున చెప్పాల్సివచ్చింది. ఈ కాలములో మనము బ్రతుకుచున్నాము. దేవుని కాలములో బ్రతుకుతున్నాము. ఆ కాలములో నీవు ఏమి చేస్తున్నావు? మనకు తెలిసిన జ్ఞానము ప్రకారము మనము ఏ విధంగా నడుచుకుంటున్నాము? అని చూసిన ఎవ్వరూ ఆ ప్రకారము నడచుకోవటం లేదు. ఈ ఉదయం కొద్దిమందిని కృష్ణప్రతిమ ఉన్నచోట పూజ చేసుకోండి అని చెప్పి మేము వెళ్ళాము. అయితే వారు ఏమి చేశారు. అక్కడ దూరంలో మందిరం పని చేస్తున్న వారిని సైతం పూజ చేద్దాము రండి అని పిలిచారు. దానికి మేమేమన్నాము అంటే ఎవరు బుద్ధి తక్కువ వారు, పని చేస్తున్నవారిని పూజకు పిలిచారు అని అన్నాము. అందుకు మీలో కొందరు ఇదేమి పూజ ముఖ్యమా? పని ముఖ్యమా? స్వామి ఏమి ఈ విధంగా అంటున్నారని అనుకొన్నారు. నాకు పనే ముఖ్యము. పని నీ ఇంటి పనైతే ముఖ్యము కాదు. కానీ ఇక్కడ పని సేవా రూపములో చేసే పని. పూజ ముఖ్యమా? సేవ ముఖ్యమా? అంటే పూజ ఎవరైనా కూర్చొని చేస్తారక్కడ, కానీ సేవ కష్టమైనదే కాకుండా, దేవునికి ముఖ్యమైనది కూడా సేవే. నీవు పూజ చేస్తే దేవుడికి ఏమి లాభము వస్తుంది, ఏమీ రాదు. సేవ చేస్తే దేవునికి లాభము వస్తుంది.

మననము కల్గినవాడు మనిషి కావున ప్రపంచ ధనము కొరకు గుర్తుపెట్టుకొని గంటముందునుండైనా వేచివుంటాము కానీ జ్ఞానము చెప్పే చోటుకు మాత్రము 10 నిమిషములు ఆలస్యముగా వస్తాము. ప్రపంచ జ్ఞానము, ధనము ఒకచోట ఉండిపోతుంది, కానీ జ్ఞాన ధనము మీరు ఎక్కడికైనా వెళ్ళినా మీ వెంట వస్తుంది, కనుక ప్రపంచ జ్ఞానముకంటే, పరమాత్మ జ్ఞానము తెలుసుకునే విషయములో శ్రద్ధ వహించండి.

ఇప్పుడు మనసు కల్గినవాడు మనిషి అన్నప్పుడు మనుషులందరూ ఒకే విధంగా ఉన్నారా అంటే లేరు. ఎందుకంటే వారి కర్మలు ఒకే విధంగా లేవు కనుక. దేవుడు ఏది చేసినా శాస్త్రబద్ధముగా చేసి పెట్టును. మీరు బ్రతికేది కాలములోనే, కాలము మూడు రకములుగా ఉన్నది. వారము, మాసము, సంవత్సరములుగా ఉన్నది. మనిషికీ మనిషికీ తేడావుంది అంటున్నాము. బజారులో రెండు వస్తువులు తీసుకుంటే ఒక వస్తువుకి, రెండవ వస్తువుకు ఖరీదులో తేడా ఉంటుంది. రెండూ ఒకటే కదా ఈ రెండింటికీ వారా ఏముంది? అంటాము. ఏమీ తేడాలేదు కానీ కంపెనీ తేడా ఉంది అంటాడు. ఎనాల్జిన్ అనే మందును (ఔషధమును) నవాల్జిన్ అనే పేరుతోనూ అమ్ముతున్నారు, పాల్జిన్ అనే పేరుతోనూ అమ్ముతున్నారు. వాటి ఖరీదుల్లో మాత్రం తేడా ఉండును. ఎందుకలా అంటే కంపెనీ తేడా అంటారు.

అదే విధముగా ప్రతి మనిషి వారా, వారాగా (తేడా తేడా) ఉన్నాడు. కనుక 'వారము'గా పేరుపెట్టాము. ఏ వారము ఏదో 'వారము'. 'ము' అనేది ఉత్త అక్షరమే 'వార' అనేది అసలైన పదము. 'వార' అనే దానిలో తేడాగా, ముద్రకొట్టబడి ఉన్నావు. ఆ ముద్రనే 'మూస' అంటాము. వారాగా మూస వేయబడి పుట్టినటువంటి వాడు మనిషి. అనగా తేడా

www.thraithashakam.org

తేడాగా ముద్రించబడి పుట్టినటువంటివాడు మనిషి. మూస అనేది ఆకారము, వత్సరము అంటే పుట్టడము, వత్సరము అంటే పుట్టినటువంటి వాడు ఎవరనగా జీవుడు. (శరీరము ఆడదైనా, మగెదైనా) ఏ విధముగా పుట్టాడు వారాగా మూస వేయబడి పుట్టినటువంటి వాడు. కాలములో వీడు పుట్టాడు కనుక 'మూస' అనేది మాస అయిందను కోండి! ఇక్కడ వారము, మాసము, సంవత్సరము. వత్సరము అనిన సంవత్సరం అనినా ఒక్కటే. నువ్వు వార, మూస, వత్సరం మూలంగా పుట్టినావు. అదే దానికి గుర్తుగా వారంలో, మాసంలో, సంవత్సరములో నీవు ఉన్నావు. నీవు నీ ప్రక్క మనిషిని చూసుకో నీవు వారా గా తేడాగా పుట్టినావో లేదో తెలుస్తుంది. ఫలానావారం, ఫలానా మాసం, ఫలానా సంవత్సరము అనేది బయట లెక్కచారం కాదు అది నీ లెక్కచారమే.

అందుకే నీవు తేడా తేడాగా ముద్రించబడి సమాజంలో బ్రతుకు చున్నావు. తేడాతేడా కల్గిన శరీరములో బ్రతుకుతూ, తేడాతేడా పనులు చేస్తూ బ్రతుకుతున్నావు. ఈ విషయము ఏ ఇతర పుస్తకములలో దొరకదు. కాలము నిన్ను తేడాతేడాగా బ్రతికిస్తున్నది. ఇద్దరికీ కంటిలో ధూళిపడినా ఇద్దరి బాధలో తేడా ఉంటుంది. ఒకటే కూర ఇద్దరికి పెట్టినా ఒకరి రుచిలో ఇంకొకరి రుచిలో తేడా ఉంటుంది ఎందుకంటే రుచిని గ్రహించు కునే, రుచి బొడిపలు ఆ వ్యక్తికి 3 లక్షలు పని చేస్తే నీకు రెండున్నర లక్ష మాత్రమే పని చేస్తాయి అందుకు తేడా ఉంటుంది. కనుక సూర్యుని దినముగానీ, చంద్రుని దినముగానీ ఆదివార, సోమవార, ఈ విధముగా వారములుగా కల్గిన వాటి పేర్లలో తేడా ఉంటుంది, కనుక 'మూస' అని పేరు పెట్టారు. కనుక సూత్రమేమంటే వార కల్గి, ముద్రించబడి మనము పుట్టినాము. ఈ విధంగా పుట్టినటువంటి మనము ప్రతిరోజు వారాగానే ఉన్నాము.

www.thraithashakam.org

ఇదంతా కర్మసిద్ధాంతము ప్రకారము పెట్టినవే ఇవన్నీ, కానీ వీటినన్నింటినీ మీరు విడిచిపెట్టి రాగల్గితే దానికి అతీతమైనది నావద్ద ఉన్నది. అంటే కర్మలు కూడా అతిక్రమించే శక్తి దేవుని జ్ఞానమునకు ఉంది. కనుక కర్మలో ఏ విధంగా ఉంటే ఆ విధముగానే జరుగుతుంది. ఆ కర్మలు జాపథకములో అనగా జాతకములో నిర్ణయించబడినటువంటివి. నీకు ఉద్యోగం చేయాలని ఉంది, కానీ నీ జాపథకములో అది లేదు కనుక నీవు నిరుద్యోగిగా ఉన్నావు. ఎవరూ దానినుండి తప్పించుకొనుటకు అవకాశము లేదు. దీనినే కర్మ సిద్ధాంతము అంటారు. **'జా'** అంటే పుట్టినపుడే 'పథకము' ముందే నిర్ణయించబడినది. జాపథకము కాస్తా కాలక్రమములో 'జాతకము'గా మారిపోయినది. చనిపోయినంతవరకు దానిని అనుభవించాల్సిందే కానీ దానిని సైతం మార్చివేయగలిగి, కర్మకు అతీతముగా అది జరుగకుండా చేయగలిగేది దైవశక్తి. ఎవరైతే దేవుని జ్ఞానము ప్రకారము బ్రతుకగల్గుచున్నాడో అప్పుడు ఆ కర్మ కూడా అతిక్రమింపబడి పోవును. ఉదాహరణకు కర్మరీత్యా ఒకరు ఉద్యోగం చేయాల్సి వచ్చినప్పుడు, వాడు జ్ఞానమును తెలుసుకుని, నాకు జ్ఞానమే ముఖ్యము, జ్ఞానము ప్రకారమే నేను చలామణి అవుతాను అనుకుంటే అప్పుడు వాడి కర్మ మారిపోవును. జ్ఞానము ప్రకారము మార్చుకోగల్గుతావు. జ్ఞానమునకు మార్చే శక్తి ఉంటుంది అని చెప్పాము కదా!

నీ నుదుటి వ్రాతను ఎవ్వరూ చెరపలేరు. కానీ ఒక్కడు మాత్రము తుడువగలడు, చెరపగలడు. ఎవరంటే దేవుడే. క్రొత్త వ్రాతను వ్రాయగలడు. దానినే తిరగవ్రాత అంటాము. తిరిగి వ్రాసేది ఎవరి చేత అవుతుంది అంటే దేవుని ద్వారానే అగును. కనుక మనకు తిరగవ్రాత పెట్టుకునే జీవితం కావాలంటే, జ్ఞానము తెలుసుకోవటం ద్వారా సాధ్యమగును. కనుక

జీవాత్మవైన నీవు, నా కాలములోనే నీవు బ్రతుకుతున్నావు అని తెలిపేందుకు, కాలమునకు వార, మూస, వత్సరములుగా పేర్లు దేవుడు పెట్టాడు. తరువాత అవి అర్థము తెలియని పదములుగా మారిపోయాయి. ఇప్పుడు మనకి అవి ఎందుకు ఆ విధముగా ఉన్నాయో అర్థమయ్యాయి. కనుక "నీవు ప్రపంచములో వార-మూస-వత్సరములలో (శరీరములో) బ్రతుకుతావా, నా కాలములోనికి వస్తావో నీ ఇష్టము" అని దేవుడు అంటున్నాడు.

మనమందరము బయటి లాభము కొరకే బ్రతుకుచున్నాము. కనిపించే డబ్బు కొరకే బ్రతుకుతున్నాము. కనిపించని డబ్బు ఉందని తెలుసుకోవటం లేదు. కనిపించే డబ్బు కొరకు చాలా శ్రద్ధ చూపుచున్నాము. ఇది శాశ్వతము కానిది, శాశ్వతము అయిన డబ్బు బయటకు కనిపించదు. దీని కొరకు ఎవ్వరూ శ్రద్ధ చూపటం లేదు. కనుక ఇప్పటినుండైనా జ్ఞానము నేర్చుకునే విషయంలో శ్రద్ధ చూపిస్తూ ఉంటేనే జ్ఞానము లభ్యమయ్యేది. శ్రద్ధ లేకపోయినచో జ్ఞానము లభించదు. శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్.

# 13. యుగము - యోగము

తేది : 21-12-2008

**"ప్రబోధ తరంగాలు"** అనే గ్రంథములో ఒక వాక్యమున్నది అదేమంటే 'మస్తకములో ఉన్నదంతా పుస్తకములోకి ఎక్కించవచ్చును'. వందకు వంద శాతం ఆ విధంగా చేయవచ్చును. కానీ పుస్తకములో ఉన్నదంతా మస్తకము లోనికి ఎవరికీ ఎక్కదు. మస్తకమునుండి మరియొక మస్తకమునకు చెప్పే విషయాలు ఎక్కుతాయా? అంటే, పుస్తకములోనికి మస్తకమునుండి ఎక్కవచ్చునుగానీ, మస్తకమునుండి మస్తకమునకు వందకు

www.thraithashakam.org

వందశాతం ఎక్కదు. అంటే ఒకరి తలనుండి ఇంకొకరి తలకు ఎక్కదు. అంటే మేము చెప్పు జ్ఞానము ఏ కొద్దిమందికో 90 శాతం జ్ఞానము వారి తలకు ఎక్కవచ్చును కానీ అందరికీ ఎక్కదు. కొద్దిమందికైనా 100కు 100 శాతం మాత్రం ఎక్కదు. గొప్ప సారాంశము కల్గిన విషయములను చెప్పుచున్నప్పుడు మనము వాటిని గొప్పగా గ్రహిస్తున్నామా? నేను చెప్పిన దాంట్లో లోతు ఎంత ఉంది అని చర్చించుకుంటున్నారా? అని ఆలోచిస్తే, ఏదో వారికి అర్థమయ్యే విధంగా అర్థం చేసుకుంటున్నారు.

ఇప్పుడు ఇక్కడ కూర్చున్న వారందరికీ ఈ జ్ఞాన విషయములు చెప్పటం లేదు. 300 మంది కూర్చుంటే మూడు వందలమందికి చెప్పటం లేదు. ఒకరికే చెప్పుచున్నానని అనుకుంటాను. వినేవారిలో శ్రద్ధగా క్షుణ్ణంగా అర్థము చేసుకునే వారిలో ఒక్కడైనా ఉంటాడు కదా! వారి కోసం చెప్పవలసిన పని వస్తున్నది. ఇప్పుడు ప్రత్యేకించి ఏమి చెప్పుచున్నామనగా! మీకు ఇప్పుడు కూర్చున్న వారిలో 2000 మంది ఉన్నట్టు మీ లెక్క. మీ లెక్క ప్రకారం అంతే అయివుండవచ్చు. మా లెక్క ప్రకారమైతే నాలుగు వేల మంది ఉన్నట్టు లెక్క. ఇదేమిటి? ఏ విధంగా 4000 మంది ఉన్నారని చెప్పుచున్నారనగా! మీరు వచ్చినట్లే, మీకంటే శ్రద్ధగా వినేవారు, మీ కంటే ఎక్కువమంది ఇప్పుడు సూక్ష్మంగా ఇక్కడున్నారు కనుక 90 శాతం అర్థం చేసుకునే వారికొరకు చెప్పాల్సిన పనివచ్చింది. కనుక వారివలె మీరు కూడా పూర్తిగా గ్రహించుకోండి లేకపోతే నేను తోకను గురించి చెప్తే మీరు తొండం వద్దకు పోతారు. అందుకు నేను చెప్పే విషయం మీరు శ్రద్ధగా వినటం లేదు సరికదా సరిగ్గా ఆ విషయములను ఇంకొకరికి చెప్పలేక పోతున్నారు. మీరు తెలిసిన జ్ఞానాన్ని పదిమందికి చెప్పండంటే ముందర చెప్పాల్సినవి వెనక్కు చెప్పుదురు. వెనక్కి చెప్పాల్సినవి ముందు చెప్పుదురు.

www.thraithashakam.org

కనుక ఇప్పుడు వినేవారైనా మీరు ముందు శ్రద్ధగా గ్రహించుకోండి. మీకున్న శ్రద్ధవలె నాకు కూడా శ్రద్ధ ఉండాలి, ఉన్నది కూడా, నేను కూడా శ్రద్ధగానే వింటున్నాను. తరువాతే వాక్కు ద్వారా మీకు చెప్పగలుగుచున్నాను. నేను చెప్పేది అర్థము కాలేదు కదా!

త్రైతము గురించి ఇంతకుముందు ప్రసంగములలో కొంత తెలుసు కున్నాము. మరికొంత భాగాన్ని ఇప్పుడు తెలుసుకుందాం. జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను 'త్రైతము' అందుము. మీదనుండి వస్తే పరమాత్మ, ఆత్మ, జీవాత్మ పైనుండి వ్రాసినా, క్రిందినుండి వ్రాసినా మధ్యనుండే ఆత్మ స్థానం మారదు. ఇంతకుముందు ప్రసంగములలో అండము గురించి, బీజము గురించి చెప్పుకున్నాము. ప్రపంచమంతా త్రైతమే ఇమిడి ఉన్నది. అదంతా మనకు అర్థము కాలేదు. మనం అర్థం చేసుకొనుటకు అనేకమైన ఉదాహరణలు కలవు. ఒక చిన్న ఉదాహరణ తీసుకుందాం. కరెంటు ఉన్నది. ఈ విషయము ప్రపంచం అంతా తెలిసిందే. కరెంటులో పాజిటివ్, నెగిటివ్ అని రెండు ఉంటాయి. ఒకటి శక్తి ఉన్నది, రెండవది శక్తి లేనిది. ఈ శక్తి ఉంటేనే కదిలేది కదలును వెలిగే బల్బు వెలుగును. ఉత్త వైరు ఒకటి వస్తూ ఉంటుంది. అందులో కరెంటు ఉండదు. కరెంటు ఉండే వైరు ఒకటి వస్తూ ఉంటుంది. అప్పుడు రెండిటినీ సాకెట్‌లో పెడితే లైట్ వెలుగును. అలాగే మన శరీరములో శక్తి ఉన్నది ఒకటి ఉంది. శక్తి లేనిది ఇంకొకటుంది. అంటే జీవాత్మ అనేవాడు ఒకడున్నాడు వాడికి శక్తిలేదు. జీవాత్మ శక్తిలేని వాడు. నీకు కదలుటకు శక్తినిచ్చేవాడు, మాట్లాడుటకు శక్తినిచ్చేవాడు, కనురెప్ప సైతం కదిలించే శక్తినిచ్చేవాడు, నీలో చైతన్యమై, నీకు శక్తియై ఉండేవాడు ఒకడున్నాడు. వాడిని **'ఆత్మ'** అని అంటాము. ఏ శక్తిలేక ఊరకే ఉండేవాడు ఒకడున్నాడు వాడే

www.thraithashakam.org

జీవాత్మ, ఇప్పుడు జీవాత్మ ఆత్మ అనేవాడి గురించి కొంత తెలిసినది అంటే మన శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అనేవారు ముగ్గురున్నారు అని మనకు తెలిసి పోయంది. బాహ్యంగా కూడా త్రైతమే ఉంది. ఉదాహరణకు విత్తనములో కూడా త్రైతం ఉంది, కోడిగుడ్డులో కూడా త్రైత సిద్ధాంతం ఇమిడి ఉంది. ఆ విధంగా ప్లస్ (+) మైనస్ (–) అని రెండు కలవు. మైనస్ (–) అనగా జీవాత్మ, ప్లస్ (+) అనగా శక్తి అని తెలియవలెను. ఆత్మ ఈ రెండింటి వలననే కరెంటు వస్తుందా అంటే మీరు కరెంట్ సాకెట్‌లో చూసిన మూడు రంధ్రములుండును రెండు చిన్న రంధ్రములు ఒకటి పెద్ద రంధ్రము కలదు. ఈ విధముగా తెలిసి పెట్టారో, తెలియక పెట్టారోగానీ పెద్ద రంధ్రము పరమాత్మకు ప్రమాణం.

ఇంతకుముందు అనగా 2003వ సంవత్సరములో మీ అందరికీ జ్ఞాన పరీక్ష ఒకటి పెట్టాము. అందులో ఒక ప్రశ్న ఇచ్చాము. "మొట్ట మొదట పరమాత్మ ఎన్ని భాగములైనాడు?" అందరూ మూడు భాగాలుగా అయ్యెను అని సమాధానం వ్రాస్తే అట్లు కాదు అని సమాధానం చెప్తూ, నాలుగు భాగములు అయ్యెను అని చెప్పాము. ఇదేమి త్రైతం, త్రైతం అంటే మూడు గురించికాక నాలుగు గురించి చెప్తున్నారేమిటి? అని మీరు అనుకోవద్దు. మొట్టమొదట పరమాత్మ నాలుగు భాగములయ్యెను. తన నుండి ప్రకృతిని సృష్టించినాడు. ప్రకృతి ఏది, పరమాత్మ అంశే కదా! అప్పుడు ప్రకృతి, పరమాత్మలు రెండు భాగములైనట్లు ముందు మనకి తెలిసినది. తరువాత పరమాత్మ మరల రెండు భాగములైనాడు. అంటే ప్రపంచాన్ని అంతటినీ సృష్టించిన తరువాత, అనగా భూమి, ఆకాశము, నీరు, అగ్ని, గాలి పంచ భూతములను మొట్టమొదట పుట్టించిన తరువాత జీవరాశులు లేవు. జీవరాశి కావాలంటే అందులో జీవాత్మ ఉండాలి, ఆత్మ

www.thraithashakam.org

ఉండాలి, శరీరం కావాలి. అంటే కదిలేది, కదలనిది రెండూ ఉండాలి. పరమాత్మ మూడవ దానిగా అంతటా వ్యాపించి ఉండవలెను. ఈ విధముగా జరిగేందుకు జీవాత్మ, ఆత్మ, పరమాత్మలుగా విభజన చెందవలసిన పని ఏర్పడినది. తన ప్రకృతినే శరీరముగా చేసుకొని, ఆ శరీరములో ఈ మూడింటిని ప్రతిష్ఠంచబడి ఒక సజీవ శరీరం తయారైనది. ఈ విధంగా 'జగతి' అనునది తయారైనది. మొట్టమొదట ప్రపంచం తయారైనది. ఇదేమిటి ప్రపంచము అనినా, జగతి అనినా ఒకటికాదా? అని మీరు ప్రశ్నించవచ్చును. ఒకటి కాదు ఆ విధంగా ఒకటి అనటం పొరపాటు. ప్రపంచం వేరు, జగతివేరు. పంచం అనగా ఐదువలన పుట్టేది. అనగా ఆకాశం, గాలి, నీరు, భూమి, అగ్ని వలన పుట్టినది ప్రపంచము. అప్పుడు అందులో జీవులు లేవు. ఈ ఐదుతో కూడిన ప్రపంచము పుట్టిన తరువాత జీవులు వచ్చాయి. అంటే సజీవమైన జీవరాశిని దేవుడు పుట్టించాడు.

ప్రకృతితో శరీరాలను తయారుచేసి, అనగా గాలి, నీరు, అగ్ని, భూమి, ఆకాశంతో శరీరములను తయారుచేసి, అందులో ఒక జీవుడ్ని , ఆ జీవుడికి శక్తినిచ్చే ఆత్మను కాపలాదారుగా పెట్టినాడు. ఇప్పుడు జీవాత్మ, ఆత్మ ఇద్దరు అయ్యారు కదా! తను పరమాత్మగా అంతటా ఉన్నాడు కనుక ఆ శరీరములోపల, ఆ శరీరం బయట కూడా దేవుడు ఉన్నట్లే. ఇప్పుడు మూడు ఆత్మలు శరీరంలో పూరింపబడినవి. ప్రపంచములో ఉన్నవన్ని చస్తాయి, పుడతాయి. ఎందుకంటే "జ" అంటే పుట్టడం, "గతి" అంటే గతించటం లేదా (మరణించటం) చావటం. మొత్తం కలిపితే "జగతి" అగును. జగతి అంటే ఎవరో కాదు మనమే చచ్చేవారం. ఇప్పుడు ఈ ప్రపంచమును, జగతిని కలిపితే ఏమవుతుందంటే 'విశ్వము' అగును. ఈ విశ్వమంతటా వ్యాపించిన వాడెవడు? పరమాత్మ (దేవుడు) మొట్టమొదట

www.thraithashakam.org

ఈ ప్రపంచం పుట్టినప్పుడు ఆదికర్త పరమాత్మయే. భగవద్గీతలో **"కాలోస్మి"** అన్నాడు కనుక కాలమే దేవుడు. కనుక ఆ కాలానికి యుగములని పేర్లు పెట్టి, ఆ యుగములకు కూడా ప్రత్యేకించి పేర్లు పెట్టారు. యుగములని పేర్లు కాలానికే కదా పెట్టినది. కాలము అంటే ఎవరు? పరమాత్మ స్వరూపమే కదా! విశ్వరూపాన్ని చూసిన అర్జునునికి దిక్కు తెలియక ఆ విశ్వరూపాన్నే ప్రశ్నించాడు, నీవెవరివని? అప్పుడు పరమాత్మ "కాలోస్మి" అని సమాధానం చెప్పాడు. కాలము అంటే ఏది? మనముందరే ఉన్నది. క్షణక్షణమునకు తెలుస్తూ వుంది, పరమాత్మ మన ముందరే ఉన్నాడు కానీ తెలియదు.

కాలమే అతనైనప్పుడు ఆ కాలానికి తన పేరు పెట్టుకోవాలి కదా. కనుక పరమాత్మ పేర్లే కాలానికి పెట్టబడ్డాయి. **"కాలము దైవ స్వరూపము"** అని భగవద్గీత ప్రకారం తెలుస్తున్నది కనుక దానికి ఏ పేరు పెట్టబడింది? అంటే కృత్‌యుగము అనగా **"కృత్"** అనగా **"చేయబడినది"** అని అర్థం. సృష్ఠిని చేసిన వాడు ఎవరు? పరమాత్మయే. కనుక కృతయుగము అన్నాము. తరువాత త్రేతాయుగము. ఈ పదం వాడుక భాషలో ఈ విధంగానే ఉన్ననూ, దేవుడు ఏ విధంగా ఉన్నాడు అనేది నిర్ణయింపబడి దానిని తెలియ జేసే నిమిత్తం **"త్రైతాయుగము"** అని అన్నారు. అనగా దేవుడు జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను ముగ్గురుగా ఉన్నాడని తెలిపే నిమిత్తంగానే ఆ పేరు పెట్టబడింది. ఈ మాటల్లో త్రైతాయుగము కాస్తా త్రేతాయుగముగా మారింది. ఇప్పుడు ఇంకొక విషయమేమంటే ప్రాశ్యాత్యులకు మన సంస్కృతి నచ్చుతున్నది. మనకి ప్రాశ్చాత్యుల సంస్కృతి నచ్చుచున్నది. ఆదిత్యుడు అనగా సూర్యుడు. సూర్యుని దినముగా ఆదివారం అని పేరుపెట్టాము. వారు (సన్‌డే) అనగా సూర్యుని దినమనే వారూ పెట్టుకున్నట్లే కదా! సోమవారము అనగా చంద్రుని దినము అనగా (మూన్‌డే) అని వారు

పెట్టారు. ఇప్పుడు ఆ మూన్‌డేలో ఒక "ం" లోపించి, "మన్‌డే" గా మారి పోయింది.

ఈ విధముగా ఎన్నో మార్పులు జరిగాయి. ఆ విధంగానే త్రైతాయుగము, త్రేతాయుగముగా కాలక్రమములో మారిపోయినది. కాలమే దేవుడు, దేవుడే కాలము కనుక వాటికి దేవుని పేర్లే పెట్టబడినాయి. ఇంతవరకు వీటిపైన ఎవరైనా ధ్యాస పెట్టారా అంటే లేదు. అందరూ చెప్తున్నారు. మనకి కూడా ఆ నాలుగు యుగముల పేర్లు తెలిసిపోయాయి అనుకోవటమే తప్పు. ఈ విషయములు పంచాంగాలు వ్రాసిన వారికే తెలియదు. మామూలు మనుషులకేమి తెలుస్తుంది! ఇక భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున, పదిహేనవ అధ్యాయమందు **"ద్వావిమౌ పురుషౌలోకే క్షరశ్చాక్షర ఏవచ"** లోకంలో ఇద్దరు పురుషులు క్షరుడు, అక్షరుడు అని ఇద్దరు పురుషులు. ఈ ఇద్దరు పురుషులే కాకుండా వేరేవాడు ఒకడున్నాడు వాడే పరమాత్మ. పురుషోత్తమ అని ప్రక్క 17వ శ్లోకములో **"ఉత్తమ పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః"** అని చెప్పెను. భగవద్గీతలో ఆణిముత్యాల్లాంటి శ్లోకములు ఈ రెండే. మన త్రైత సిద్ధాంతానికి కిరీటాలు. దానిలో చెప్పిన సిద్ధాంతం ప్రకారం మూడవవాడు ఒకడున్నాడు. అనగా ముందు శ్లోకంలో ఇద్దరు పురుషులున్నారు, వారికంటే ఉత్తముడు అన్నారు. ఆత్మకంటే పరముగా ఉన్నవాడు అన్నారు.

ఈ విధముగా చెప్పిన సారాంశం ప్రకారము, మూడవ యుగమునకు కూడా పేరుపెట్టారు. "ద్వాపర" "ద్వా" అనగా రెండు, "పర" అనగా 'వేరుగా ఉండేవాడు' అని అర్థము. రెండింటికి వేరుగా ఉండేవాడు దేవుడు. జీవాత్మ, ఆత్మగా ఉన్నవారికంటే వేరుగా (పరముగా) ఉన్నవాడు పరమాత్మ అనే తెలిపేందుకు "ద్వాపర" అన్నాడు. దానికే

www.thraithashakam.org

ద్వాపరయుగం అని పేరు పెట్టెను. ఇక చివరిలో కలియుగము ఎప్పటికైనా ప్రపంచం అంత్యం అవ్వవలసిందే అని తెలియజెప్పటం కొరకు 'కలియుగం' అన్నారు. ఈ నాలుగు యుగములు 250మార్లు జరిగితే అప్పుడు ప్రళయం ఏర్పడుతుంది అని చెప్పాడు. మొదటిది కృతయుగం, చివరిది కలియుగం. "కలి" అంటే నాశనము అని అర్థం. అప్పుడు ఇదంతా నాశనమైపోతే **"అవ్యక్తం"** అని అక్షర పరబ్రహ్మయోగంలో చెప్పాడు. వ్యక్తం కానటువంటి వాడు ఒకడుంటాడు వాడే పరమాత్మ. అదే **'గోవింద'** అనే పదం ఉంది దానికర్థం 'అయిపోయింది' అని అర్థం అనగా ఎవరైనా చనిపోతే 'గోవింద' అంటాము. ఎందుకు? వాడి శరీరములో జీవాత్మ, ఆత్మ పోయారు ఇక 'అవ్యక్తం'. వ్యక్తం కాకుండా పరమాత్మే మిగిలాడు అని తెలియజేయటం కొరకు గోవింద అంటాము. కాలము అనేది పరమాత్మ స్వరూపం కావున కాలమును నాలుగు భాగములుగా విభజించి ఈ నాలుగు పేర్లు పెట్టబడినవి. దేవునికి సంబంధించిన వాడు యుగములోనే ఉంటాడు. దేవుని ఆధీనములోనే ఎవరైనా ఉన్నారనేందుకు గుర్తుగా, ఈ నాలుగు యుగములకు దేవుని పేర్లే పెట్టబడినాయి. ఈ విషయములు ఏ గ్రంథము లోనూ ఉండవు. శ్రద్ధ వహించి వినండి. మరి పరమాత్మలో మనం ఐక్యం కావాలి కదా! ఆ విధంగా ఐక్యమయ్యే జ్ఞానాన్ని తెలుసుకోమనే దేవుడు చెప్పినాడు. భగవద్గీతలో అదే చెప్పాడు కదా **"అధర్మములు చెలరేగినప్పుడు, ధర్మములు ప్రతిష్ఠించేందుకు గాను నేను వచ్చి ధర్మముల గురించి చెప్తానన్నాడు".** జ్ఞానం చెప్పినప్పుడు అధర్మవరులు, ధర్మవరులుగా తయారవుతారు అని చెప్పినాడు.

ఆ విధముగా దేవుని గురించి తెలుసుకొని, దేవునిలో ఐక్యమవమని ఆయన ఎన్నోసార్లు చెప్పాడు. అది అర్థమయ్యేందుకు ఆయన జ్ఞానాన్ని

www.thraithashakam.org

బోధించాడు. మనము ప్రక్క చూపు లేకుండా, పై చూపులేకుండా వినవలెను. అయితే కొందరు పై చూపు చూస్తున్నారు. ఇప్పుడు నేను మీతో మాట్లాడుతూ, నా వేలి ఉంగరాలు ఈ విధముగా తిప్పుతూ, తీస్తూ మరలా వేలికి పెడుతూ ఉంటే, ఈయనేమి ఉంగరాలు తీస్తూ, పెడుతున్నాడు. ఈయనకు ఉంగరాలు ఉన్నాయని చూపించుటకేమోనని, నేను చెప్పే జ్ఞానాన్ని వినకుండా, నేను తిప్పే ఉంగరాలను చూస్తుంటారు కొందరు. ఆ విధంగా మీరు చేయవద్దు.

పరమాత్మ తనలోనికి ఐక్యమవ్వమని అందరికీ తెలియజేసే విధముగా ఏమి చేస్తే బాగుంటుందని ఆలోచించాడు. వియోగం అనగా విడిపోవటం అని అర్థము. యోగం అంటే కలిసిపోవటం అని అర్థము. యోగము, వియోగము అని రెండు ఉంటాయి మనకు. అనగా రామాయణములో రామునికి సీతావియోగమువలె అనుకోండి. సీతను పోగుట్టుకున్న రాముడు పుట్టని పట్టుకొని సీతా అని ఏడుస్తాడు, చెట్టు పట్టుకుని ఏడుస్తాడు దానిని వియోగం అంటారు. సీతను పోగుట్టుకున్నానని రామునికి వియోగం మనం దేవున్ని పోగుట్టుకున్నాము ఆయనను తెలుసుకోలేక పోతున్నామని మనకి వియోగం మనం ఇద్దరిగా ఉన్నాము జీవాత్మ వెళ్ళి ఆత్మతో కలిస్తే, ఈయన వెళ్ళి ఇంకొకరైన పరమాత్మతో కలుపును. కనుక 'మీరు యోగముతో రండి నాలో ఐక్యమవుతారు' అని చెప్పెను. ఈ విషయమును భగవద్గీతలో చెప్పాడు.

ఈ విషయములన్నీ ఏ విధంగా చెప్తే శాశ్వతముగా గుర్తుంటుందో, ముద్రపడినట్లు ఉంటే బాగుంటుందని **"కలియోగము, కృత్‌యోగము, త్రైతా యోగము, ద్వాపరయోగము"** అన్నింటికీ యోగము, యోగము అని పేర్లు పెట్టితే యోగము, యుగముగా మారింది. "ఏ"త్వము పోయి "కొమ్ము

వచ్చింది. **"ద్వాపరయోగము"** అంటే రెండవ దానికంటే వేరుగా గల మూడవ వానిలో కలిసిపో అనే కదా అర్థం అందులో ఉంది. **"త్రైతా యోగము"** అనినా అర్థం మూడవ వానిలో కలిసిపోమనే కదా అర్థం.

ఈ యోగములన్నీ యుగములుగా మారిపోయాయి. ఇవన్నీ వినిన వారంతా "మీ ప్రబోధ సేవాసమితి వారన్నీ ఇట్లానే చెప్తారు, త్రేతాయుగమును త్రైతాయోగం అంటారు. మీదంతా వేరుగా ఉంటుంది" అని అనవచ్చును గానీ ఇది నూటికి నూరుపాళ్ళు సత్యం. ఇదేమైనా మనుషులు చెప్పేదైతే ఏ విధంగానైనా ఉండవచ్చును. కానీ దేవుడు చెప్పింది కావున దానిని మార్చేందుకు అవకాశం లేదు. యుగము అనేమాట యోగముగా తెలియబడ కుండా ఇంతవరకు ఉండిపోయింది. కానీ సత్యం ఎప్పటికైనా బయటకు వస్తుంది కనుక అటువంటి సత్యం మనకు ఈ రోజు లభ్యమయ్యింది. కనుక దేవునికి పూర్తి కృతజ్ఞులం అవ్వాలని కోరుకుంటున్నాము.

కనుక ఇప్పుడు కలియుగం అని అనుకోకుండా కలియోగం అనుకుంటే దేవునికి దగ్గరగా పోతాము. కానీ మనము ఇప్పుడు ప్రపంచ ములోనికి పోతున్నాము. ప్రపంచ ధ్యాసలు విడిచిపెట్టి దేవుని మీద ధ్యాస పెట్టుకోవాలి. మేము తయారు చేసిన క్యాలెండర్‌లో, అందరి క్యాలండర్‌లలో ఉన్నట్లు "కలియుగే" అని ఉండదు. "కలియోగే" అని ఉంటుంది. మేము ఇదే సత్యం అని చెప్పటం కాదుగానీ సత్యమా, కాదా! అనేది మీరే చెప్పండి. దేవుడు కాలస్వరూపుడైనప్పుడు అక్కడ యుగము ఉంటుందా, యోగము ఉంటుందో ఆలోచించండి. ఈ విధముగా ప్రపంచములో అంతా త్రైతమే ఉన్నది. ఈ విధంగా కనిపించడమే కాకుండా కాలమును విభజించే విషయంలో కూడా త్రైతమే ఇమిడి ఉన్నది. అన్ని యోగములు నాలో కలిసిపోమనే వాటి పద అర్థాలు తెలుపుచున్నవి.

www.thraithashakam.org

ఈ మధ్య హైదరాబాద్ ప్రాంతములో వెళ్తున్నప్పుడు మాకు గోడల మీద సృష్టికర్త కోడ్ – 666 అని ప్రకటన గ్రంథము 13వ అధ్యాయము, 18వ వచనం అని వ్రాశారు. అది చూసిన తరువాత బైబిల్ అని అర్థమయినది. కానీ బైబిల్ 1300 పేజీలు సుమారు ఉంటుంది. కానీ బైబిల్ అంతా నేను చదవలేదు. 100 పేజీలే చదివాను, అంటే మిగతాది బైబిల్ కాదు. ఆ నూరు పేజీల బైబిల్ ఈ విషయాన్ని బైబిల్‌లో ఉందేమోనని చూశాము.

ప్రకటన గ్రంథమును "యోహాన్" అనే వ్యక్తి వ్రాశాడు. దేవుడు చెప్పినది కాదు. అందులో ఏముంది సాతాన్ ఒకటుంది. అది దేవునికి వ్యతిరేఖంగా ఉంటుంది. అపవాది అంటారు దాన్ని, అది మనుషుల్లోకి వస్తుంది. అది అందరిని తనమాటను వినేటట్లు చేసుకుంటుంది అని వ్రాశారు. దాన్నే "మాయ" అని మనం అంటున్నాము. దాని మాటను వినని వారిని చంపేస్తుంది. ఇబ్బంది పెడుతుంది. నిజమే, తన సంఖ్యను నుదుటిమీద, చేతుల మీద ముద్రించుకోమంటుంది అంటారు. తన సంఖ్య ఏది అంటే 666 ఇది ఎవరి సంఖ్య అని అర్థము. సాతాన్ సంఖ్య అని అర్థము. ఇది కేవలం మనుషుల సంఖ్యే అన్నారు. అంటే దేవుని సంఖ్య కాదు అని అర్థము. ఈ 666 మనుషుల సంఖ్యే. ఇందులో జ్ఞానము ఉంది అన్నారు. దీన్ని ఆలోచిస్తే ఇది సాతాన్ సంఖ్య తప్ప, సృష్టికర్త అయిన దేవుని సంఖ్య కాదు. మరి వీరు సృష్టికర్త కోడ్ అని ఎట్లు చెప్పినారు. ఇది చెప్పినవారిని అడిగాము, చివరికి చాలా చర్చ జరిగిన తరువాత, ఇది సాతాన్ కోడ్‌యే, కానీ ఆ విధముగా వ్రాశాము అన్నారు. అయితే సాతాన్‌కోడ్ అయితే సాతాన్ కోడ్ అని వ్రాయండి, కానీ సృష్టికర్త కోడ్ అని ఎందుకు వ్రాశారు? అని మరలా అడిగాము. అంటే ఆ విధంగా

వ్రాయుట వలనే కదా మా దగ్గరకు మీరు రాగలిగారు అన్నారు. అంటే మీ దగ్గరకు మేము వచ్చేందుకు గోడల మీద అంత పెద్ద అబద్దము వ్రాయాలా? అని అంటూ, ఈ 666 అంటే ఏమిటో అర్థం చెప్పండి అని అడిగాము. దేవుడు సృష్ఠినంతటినీ ఆరు రోజుల్లో తయారు చేశాడు, ఆరవ రోజున మనిషిని తయారు చేశాడంట, మరలా ఆరవ రోజున సాతాన్‌ను తయారు చేశాడంట.

ఈ విధముగా మూడు ఆరులు లెక్కవేసుకుంటే 666, దానినే మేము సృష్ఠికర్తకోడ్ అని చెప్పినాము అన్నాడు. నీవు చెప్పినది బాగానే ఉంది కానీ, సృష్ఠినంతా ఆరు రోజుల్లో దేవుడు చేశాడు కదా, మరి ఆరు రోజుల తరువాత మనిషిని చేశాడా అంటే, కాదు ఆరో రోజున మనిషిని చేశారు అన్నాడు. అంటే రాళ్ళు, రప్పలు, గుట్టలు అన్నీ చేసి, ఐదు రోజులు అయిపోయిన తర్వాత ఆరో రోజున మనిషిని చేశాడంట. అలాంటప్పుడు మొత్తమంతా ఒక ఆరే కదా, సృష్ఠి అంతా కలిసి ఐదు రోజులకు చేశాడంట ఐదుకే లెక్క చెప్పండి అలాగయితే ఐదురోజులకు ఐదు, ఐదురోజుల తరువాత మనిషి చేశాడు కనుక ఒకటి (1), మరలా ఆరు రోజులకు సాతాన్ తయారు చేశాడు కనుక ఆరు (6). ఆ విధంగా లెక్కవేస్తే 516 కదా అయినది. అలా కాకుండా సృష్ఠి అంతా మనిషితో పాటు లెక్క వేసుకుంటే ఒక ఆరు వేసుకో, సాతాన్‌కు ఇంకొక ఆరు లెక్కవేస్తే 66 అగును కదా! అంటే మీకు అర్థము కాలేదు అంటాడు. అర్థముకాక పోవటం ఏమిటి? మేము చెప్పింది చిన్నపిల్లాడుకు కూడా అర్థమవుతుంది. మీరు చెప్పినది తప్పని మేమన్నాము. మీకు ఒక ఉదాహణ చెప్తాము అని ఆ వ్యక్తి ఈ విధంగా చెప్తున్నాడు. ఒక జడ్జి ఉన్నాడనుకోండి, ఒక ముద్దాయి ఉన్నాడనుకోండి ఇప్పుడు జడ్జి 112 అనే నెంబర్‌ను ఖైదీకి ఇచ్చాడనుకోండి.

ఇప్పుడు 112 నెంబర్ జడ్జి ఇచ్చాడు కనుక అది జడ్జి నెంబరే కదా అంటాడు. అయితే "112 అని పిలిస్తే ఖైదీ పలుకుతాడా, జడ్జి పలుకుతాడా?" అని తిరిగి మేము అడిగాము. ఖైదీయే పలుకుతాడు కానీ జడ్జినెంబర్ కదా అంటాడు. అలాగయితే "నలుగురు ముద్దాయిలకు నాలుగు వేరువేరు నెంబర్లిస్తే ఏ నెంబర్ జడ్జిది అవుతుంది. ఏ నెంబర్‌కు పలుకుతాడు" అని అడిగాము. ఈ విధంగా కొందరు మొండివాదనలు చేస్తుంటారు. అందుకే బైబిల్ ఎవ్వరికీ అర్థము కాలేదు. **"తిరిగి ఆదరణకర్త వచ్చి, ఈ వాక్యాలను వివరముగా చెప్తేనే అర్థమయ్యేది"** అని ఏసుప్రభువే చెప్పినాడు. ఆయన మాటలు అర్థం కాకే కదా గందరగోళం పడుతున్నాం. మరి "ఏసుప్రభువే మీకు నేను చెప్పినవి అర్థం కాలేదు అన్నాడు కదా, అవి అర్థముకాక మీరిలా చెప్పుచున్నారేమో! ఆదరణకర్త వస్తేకానీ అర్థముకాదు అన్నాడు కదా!" అంటే, "ఆదరణకర్త అంటే ఎవరనుకున్నావ్?" అని అన్నాడు. "నాకు తెలీదు నువ్వే చెప్పు" అన్నాము. "ఆదరణకర్తయే పరిశుద్ధాత్మ" అన్నాడు. "పరిశుద్ధాత్మ ఎక్కడున్నాడు?" అని అడిగాము.

ఒక మనిషి ఉన్నాడనుకో, ఒక మనిషికి ఒక పేరుందనుకో, దేనికి పేరు పెట్టారు? మనిషివి కనుక పెట్టారు, మళ్ళీ అడిగితే మనిషికి కాదు లోపలున్న ఆత్మకు పెట్టారంటాడు. మనిషికి కాకపోతే "చనిపోయిననాడు వాడి ఆత్మ పోయిందా పోయాడు అంటారు కదా!" అని అడిగితే పోయింది ఆత్మే కనుక ఆత్మకే ఆ పేరు పెట్టారు" అంటాడు ఆ వ్యక్తి. సరే! ఆత్మకే అనుకుందాంలే అన్నాము. "పరిశుద్ధాత్మ అంటే మనలో ఉండే ఆత్మే, ఇప్పుడు మాట్లాడుచున్నాను కదా! పరిశుద్ధాత్మే మాట్లాడేది, ఆదరణకర్తే మాట్లాడుచున్నది" అని అంటున్నాడు. అయితే ఆ విధంగా కాకుండా "ఆదరణకర్తగా ప్రత్యేకంగా వస్తానన్నాడు కదా!'' అంటే,

"వస్తానన్నాడంటే మనలో ఉన్నాడనే లెక్క" అంటున్నాడు. కొందరికి ఈ విధంగా బైబిల్ అర్థమయింది. మేము "మాయకోడ్ 666" అని చెప్పుటయే కాకుండా "సృష్టికర్త కోడ్ 963" అని చెప్పాము. సృష్టికర్తకోడ్ 963 అని చెప్పేందుకు **"సృష్టికర్తకోడ్ 963"** అని ఒక గ్రంథాన్ని వ్రాసి ఉచితంగా కొన్ని వేల పుస్తకాలు పంచాము. దానితో పాటు 23 జిల్లాలలో కనిపించే విధంగా ప్రతీ జిల్లాలో పోస్టర్స్ అంటించాము, వివరము కోసం పుస్తకాలను పంచాము.

ఈ విధముగా వాస్తవమైన దేవుని విషయములు నేర్చుకోవటం వలన ఎంతో **ఆనందం, తృప్తి** కలుగుతాయి. కనుక మనము ఉండేది (కలియుగమే) కలియోగమే ఏ కాలంలో ఉన్ననూ దేవునిలో ఐక్యమవ్వమనే చెప్పుచున్నవి కనుక మనము జీవులుగా నాశనమైపోయి ఆత్మలో కలిస్తే తద్వారా పరమాత్మలోకి చేరవచ్చు. ఈ విషయములను **"జనన మరణ సిద్ధాంతము"** గ్రంథములోనూ, **"మరణ రహస్యము"** అనే గ్రంథములలో జీవాత్మ, ఆత్మతో కలిస్తే చాలు ప్రత్యేక ఆత్మ అయిపోతుంది అని చెప్పాము. ఇప్పుడు **"సృష్టికర్తకోడ్ 963"**లో 3 అనేది జీవాత్మ, 6 అనేది ఆత్మ, 9 అనేది పరమాత్మ అని చెప్పాము. ఇప్పుడు ఆత్మను జీవాత్మను కలిపితే ఏమవుతుంది. 6+3=9 అవుతుంది. 9+9=18 అగును కదా అనవచ్చును గానీ ఆధ్యాత్మిక విద్యలో ఏక సంఖ్యే ఉంటుంది. అలాగయినా సరే 9+9=18 చూసినా 1+8=9 మరలా తొమ్మిదే వచ్చును.

# 14. సేకూ వలీ - కూలీ సేవా

తేది: 11-01-2009

మన శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు ముగ్గురున్నారన్న విషయం తెలిస్తే, ఆ విధముగా ఉన్నారని తెలిపేందుకు సూచనగా, మన హస్తములో చాలా సూచనలుగా, గుర్తుగా చెప్పబడినవి. అందులో ఒక విషయమును తీసుకొనిన యెడల, మన హస్తములో ఉంగరపు వేలిని గురించి చెబితే, దానిని పూర్వము "అంగరపు వేలు" అని అనేవారు. దానికి గుర్తుగా ఒక (ఉంగరము) అంగరము అని పేరు పెట్టి, అంగరపు వేలుకు అంగరము ధరించేవారు. ఇలా ఎందుకు ధరించేవారంటే, ఆ వేలిని మన శరీరములో ఆత్మతో పోల్చి, ఆత్మ అన్ని శరీరభాగములలోను ఆవహించి ఉన్నదని, అన్ని అంగములను ధరించునది అనీ, అంగీరసుడు అనీ, అంగరము అనగా అంగములన్నిటినీ ధరించుట అని, "అంగీరసుడు" అన్ని అంగములందు శక్తిగా ఉన్నవాడు ఆత్మయనీ, అంగీరసుడు అనీ అర్థము తెలుపుచున్నది. కనుక చిటికెన వ్రేలు, దాని ప్రక్కనున్నది అంగరపువ్రేలు, దీనినే ఆత్మకు సూచికగా, చిటికెన వ్రేలును జీవాత్మకు గుర్తుగా, అంగరపువ్రేలునకు ప్రక్కనున్న మరి కొద్దిగా పొడవున్న వ్రేలును పరమాత్మకు గుర్తుగా మన హస్తములోనే అమర్చి, జీవాత్మకు, పరమాత్మకు మధ్యలో ఆత్మ గుర్తుగా మధ్య ఉన్న వ్రేలును చూపి, దానిని బాహ్యంగా తెలియజేసేందుకు, ప్రపంచములో విలువైన బంగారంతో చేసిన అంగుళీయకము అని పేరు పెట్టి, దానిని ఆ వ్రేలుకి ధరింపజేసారు. ఇప్పుడు అది రూపాంతరము చెంది ఉంగరపు వ్రేలు అయింది. దానికి ధరింపజేసేదానిని ఉంగరము అయినది, కాని అసలు అలా ఎందుకనాలో ఇప్పుడు అర్థమయినది కదా! అంగుళీయకములో కూడా అంగములన్నింటినీ ధరింపజేసేది అనే అర్థమే

www.thraithashakam.org

అందులో ఇమిడి ఉన్నదని గ్రహించగలరు. ప్రస్తుతం మరొక విషయాన్ని ఒక కథ రూపములో తెలియజేయాలనుకుంటున్నాము. ఒక ఊరిలో "సేకూ" అని, "వలీ" అనే వారు ఇద్దరు అన్నదమ్ములుండేవారు. వారిద్దరికీ దేవుని మీద భక్తి కలదు. పావలా వేసి అర్థరూపాయి కావాలనే భక్తికాదు వారిది. దేవుని మీద నమ్మకం, విశ్వాసము ఉండటం వలన ఏ కోరికా కోరుకొనలేదు, పైగా దేవుడు ఏమి చేసినా మాకు మంచే చేస్తాడులే, మనకి దేవుడు ఏమి ఇవ్వాలో తెలుసు, తెలియకపోతే కదా అడగాలి అనుకొని ఏమీ కోరుకొనరాదు అని అనుకునేవారట. ఉదా :- చిన్నపిల్లాడు బట్టలో (చెడ్డీలో) మూత్రం పోసెననుకో అప్పుడు ఆ పిల్లాడు ఏమీ చేయలేడు. అప్పుడు అది చూసిన పెద్దవారు ఎవరైనా దానిని తీసివేసి, పొడిగుడ్డను (చెడ్డీను) వేసారనుకో, పెద్దలకు తెలుసు వారికేది ఎప్పుడు ఏమి కావాలో. అలాగే దేవునికి మనకందరికి ఏమి చేయాలో అతనికి తెలుసు. కనుక పిల్లాడికి ఏమి ఇవ్వాలో, ఏది ఇవ్వకూడదో తెలుసు అని అనుకుంటూ "సేకూ", "వలీ" ఉండేవారు. ఇప్పుడున్న మనందరి కోరికల భక్తి కానే కాదు వారిద్దరిది.

ఈ విధంగా వారిద్దరూ ఉండటమే కాకుండా, మనద్దిరమూ బ్రతకాలంటే "కూలి" పని చేయాలికదా మనద్దిరం అదే పని చేస్తున్నాము కదా! ఇప్పుడు ఒక "కూలి" దేవునికిచ్చేద్దాం. ఒక కూలి మాత్రం మనం ఆహార పోషణకు ఉంచుకుందాము అని ఒప్పందం చేసుకున్నారు. అలా ఆ విధముగా ఒప్పందం చేసుకుని, ఒక ధనవంతుని దగ్గరకు పనికి వెళ్లినారు. అలా వెళ్లిన ఇద్దరూ పని చేసి, ఒక్కరే ఆ ధనవంతుని దగ్గర కూలి పుచ్చుకున్నారు. రెండవ కూలి దేవుని సేవ అనుకొని చేద్దాం అని ఒక కూలి ఆ ధనవంతుని దగ్గర తీసుకోవటం లేదు. అది చూసిన ధనవంతుడు (షావుకారు) చాలా సంతోషించాడు. ఎందుకంటే ఇద్దరు పని చేసి ఒక

కూలి డబ్బులే తీసుకుంటున్నందుకు. నేను మొన్న ఆంజనేయస్వామికి మొక్కుకుంటే నా వద్ద పనిచేయుటకు వీరిద్దరినీ చూపించినట్లుంది అని ఆయన అనుకుంటున్నాడు. ఈ విధముగా చేస్తున్నందువలన షావుకారి దగ్గర కొంత కాలానికి రెండవ కూలి డబ్బులు వెయ్యి రూపాయలు అయింది. ఆ విధముగా వచ్చిన వెయ్యి రూపాయలతో షావుకారు తన పొలంలో పంట పండించుకునేందుకు ఖర్చు పెట్టినాడు. మరలా ఆ పొలములో వీరిద్దరూ సేకూ, వలి అనేవారి చేతే పనిచేయించాడు షావుకారు. ఆ సంవత్సరము లక్షరూపాయల పంట పండింది షావుకారికి. షావుకారు చాలా సంతోషించాడు. తిక్కవారైన పనివారైన సేకూ, వలి వలన మంచి లాభమే వస్తున్నదనుకున్నాడు.

అప్పుడు లక్షరూపాయలు తీసుకొని, దేవుని వద్ద ఉంచాలని (ఇవ్వాలని కాదు) వెళ్ళాడు. ఆ లక్షరూపాయలు దేవుని వద్దపెట్టి, నమస్కరించి కోరికలు కోరడం మొదలుపెట్టాడు. ఒక కోతి అక్కడకు వచ్చి ఆ డబ్బు మూటను ఎత్తుకు పోయింది. ఆ కోతి మరి దొరకలేదు. చివరికి ఆ కోతి చాలా దూరం పోయి ఆ మూటను విప్పిచూసి, ఏమీ తినటానికి దొరకక, ఆ లక్షరూపాయలను క్రింద పడవేసినాయి. ఆ త్రోవలోనే కూలికి వెళ్తున్న సేకూ, వలికే అవి దొరికినవి. వాటిని వారు దేవుడే అవి అందజేశాడనుకొని ఆ లక్షరూపాయలను తీసుకున్నారు. కొంత మెరుగుగా ఉండేటట్లు జీవిస్తున్నారు. అలా వారు ధరిస్తున్న మంచి బట్టలను చూసిన షావుకారి, "మీరు ఎలాగ క్రొత్త దుస్తులు ధరిస్తున్నారు, నిన్న మొన్నటి వరకు చిరిగిన దుస్తులు ధరించేవారు కదా!" అని ప్రశ్నించాడు. అప్పుడు వారు "లేదయ్యా! మేము మొదటినుండీ దేవున్ని నమ్ముకుని ఉన్నాము. అందుకు దేవుడు మాకు మంచి చేసెను" అని చెప్పారు. అందుకు షావుకారు, "ఎలాగ

www.thraithashakam.org

మీకు దేవుడు మంచి చేశాడు" అన్నాడు, అందుకు వారు "మేము ఒక రూపాయి దేవుని సేవకు సమర్పిస్తే, దేవుడు వందరూపాయలు నీ కొరకు ఖర్చుపెడతాడు" అని ఒక పెద్దాయన చెప్పగా వింటిమి అన్నారు. అందుకు షావుకారు నిజంగా అలా రూపాయి ఇస్తే, దేవుడు వందరూపాయలు ఇస్తాడా? అని ప్రశ్నించగా, చూడు మేము ఎప్పుడు ఈ విధముగా ఉండటమే సాక్ష్యం అన్నారట 'సేకూ, వలి'.

అది విన్న షావుకారి అలాగే చేసాడు రూపాయి వేసి హుండీలో, నూరు రూపాయల కొరకు నాలుగు రోజులు ఎదురు చూసినా, రాలేదు. అది మరల వీరిద్దరినీ అడిగి, మీరు చెప్పినది అబద్ధం అన్నాడట. ఏవిధముగా నీవు చేసితివి అని వారు ప్రశ్నించగా, అతను చేసిన సంగతి చెప్పగా, అది ఎలా వస్తుంది, అలా రావుకదా అని వారు అన్నారట. మరి ఎలాగ అన్నాడట షావుకారు. వారప్పుడు "నీవు దేవుడిస్తాడా! ఇవ్వడా!! అని దేవునికి పరీక్ష పెట్టినావు, అంటే దేవుడలా ఇస్తాడని నమ్మకం, విశ్వాసముతో నీవు దేవునికియ్యలేదన్నమాట. దేవున్ని నీవు నమ్మలేదు కాబట్టి. నీకు ఆయన ఇవ్వలేదన్నారట."

అప్పుడు వారు దేవున్ని చూడక నమ్మేవారే దేవున్ని నమ్మేవారు, అతని మీద విశ్వాసం ఉన్నవారు. చూస్తేనే నమ్ముతానంటే నమ్మకమే కాదు. మేము ఆయన ఇస్తాడా, ఇవ్వడా అని సందేహించి మేము ఆ పని చేయలేదు, మేము సేవ చేయాలనుద్దేశ్యంతో చేశాము దేవుడిచ్చాడు నీవు మాత్రం ఇస్తే నమ్ముతా అనుకున్నావు. అందుకు దేవుడు ఇవ్వలేదు. అదే విధముగా ఏ విషయము అయినా గానీ, నమ్మకము లేకపోతే కుదరదు. జ్ఞానము మీద నమ్మకం లేకపోతే, దానిని నీకు తెలుసుకునే అవకాశమివ్వడు, అప్పుడు ఖచ్చితంగా నీవు దూరమయిపోవుదువు. కర్మచిట్టాలో నీకేది జరగాల్సి

ఉందో, అదే జరుగును అని మేము చాలామార్లు చెప్పాము. అందరూ ధనికులమవ్వాలనే అనుకున్నారు మరి అలా ధనవంతులయ్యారా? కొన్ని కోట్ల టర్నోవర్ చేసిన 'నిత్యం' కంప్యూటర్ల యాజమాని పరిస్థితి ఈ రోజు ఏమయ్యింది. ఈ విధముగా ఎందుకు జరిగింది? మన కర్మ లిస్టులో ఏమి జరగాలనుంటే అదే జరుగును. కానీ **కర్మకు అతీతమైనది దేవుని జ్ఞానము.** దేవుడుగాని, దేవుని జ్ఞానముగానీ కర్మకు అతీతముగా ఉండును. ఒక పెద్ద ప్రమాదము జరిగితే చిన్న దెబ్బలే తగులవచ్చును. చిన్న ప్రమాదము జరిగితే చిన్న దెబ్బలే తగులవచ్చును. చిన్న ప్రమాదము జరిగితే పెద్ద దెబ్బలు తగులవచ్చును. ఒకసారి చాలా పెద్ద ప్రమాదము జరిగినా ఏమీ మన శరీరములకు దెబ్బలు తగలకుండా ఉండవచ్చును. ఒక రోజు విశాఖపట్నం నుండి కారులో వస్తుంటే, రాత్రిపూట ప్రయాణం చేయము కానీ, ఆ రోజు పని ఒత్తిడివలన చేయక తప్పలేదు, రాత్రి 1:30 అయినది, అప్పుడే ఒక ప్రమాదం రోడ్డుమీద జరిగింది. రెండు లారీలు గుద్దుకున్నవి. ఒక లారీ ప్రక్కకు పడిపోయింది, రెండవ లారీ రోడ్డునకు అడ్డంగా ఉన్నది, మేము అది జరిగిన ఐదు నిమిషములకు మేము వెళ్ళి ఆగి ఉన్న లారీను మేము కారుతో ఢీకొట్టాము. బ్రేక్ వేసినా ఆధీనములోకి కారు రాలేదు. కారంతా పగిలిపోయినది. గాజుపెంకులు మూటమాదిరి నా వెనుక భాగములో ఉన్నవి. కానీ నాకు చిన్న దెబ్బైనా తగలలేదు, బండి ప్రమాదంలో పడాలని కర్మలో ఉన్నది కానీ మాకు దెబ్బలు తగలాలని లేదు తగలలేదంతే. కర్మలో జరిగిన నిరూపణ మీకు చెప్పాము. అలా కాకుండా ప్రతీ విషయము మనమే చేస్తున్నాము అనుకోవటం పొరపాటు. నా తెలివితక్కువ వలన పోగొట్టుకుంటిని అన్నదీ పొరపాటే, నా తెలివి వలన సంపాదించు కుంటున్నాను అన్నదీ పొరపాటే అగును. నీకుండే తెలివి కూడా నీ

కర్మరీత్యాయే ఉండును అని దేవుడు చెప్పలేదా. భగవద్గీత అంతా చెప్పిన తరువాత కృష్ణుడు, వీరికిది అంతా అర్థమయిందో, లేదో అని ఒక మాట చెపుతాడు. **"మీ కర్మరీత్యా నేను మిమ్మల్ని బొమ్మలను ఆడించినట్లు ఆడిస్తున్నాను"** అని అంటాడు. భగవద్గీత చదివిన వారందరికీ ఇది అర్థమయిందా?

ఆ విధముగా షావుకారి వారిద్దరినీ అడిగితే, మేమేమీ దేవున్ని కోరము. ఎలాఉంటే అలా జరుగును. అంతా దేవుడే చూస్తాడన్న నమ్మకముతో మేము ఉన్నాము అని వారు చెప్పినారు. మరి మీకా నమ్మకం ఎలా కలిగిందన్నాడు షావుకారు. మా తల్లిదండ్రులు చిన్నప్పటినుండీ దేవున్ని ఏమీ అడగవద్దనీ, నమ్మకంతో ఉండమని చెప్పినారు. మేము అలాగే చేసితిమి అన్నారు వారు. మమ్మల్ని దేవుడు చూస్తున్నాడు. మిమ్మల్నీ దేవుడే చూచును అని చెప్పారు. కనుకనే మాకు మా పెద్దలు పేర్లు మాకు 'సేకూ' అనీ 'వలి' అని పెట్టినారు. ఆ పేర్లు అనుసరించి మేము ఎప్పుడూ మరిచి పోకుండా ఉంటామని చెప్పెను. అప్పుడు షావుకారు "పేర్లలో ఏముందిరా?" అని ప్రశ్నించెను. దానికి మాకు ఈ విధముగా పెట్టినారు చూడు "సేకూ, వలి" లో మొదటి అక్షరాలను కలిపితే, "సేవ" అయింది, రెండవ అక్షరాలను కలిపితే "కూలి" అయినదికదా! దానికి గుర్తింపుగా మేము ఒకరు "సేవ" ఇంకొకరు "కూలి" అన్నారట వారు. అయితే నేరుగా సేవ కూలి అనకుండ మాకు అలా పెట్టకుండా మా పెద్దలు రెండు పేర్లు కలిపి "సేకూ" అనీ, "వలి" అనీ పెట్టారని చెప్పారు. అందుకే ఒక కూలి తీసుకొని, సేవ చేసితిమి అన్నారు. కనుక ఇకనుండైనా నీ బ్రతుకుదెరువు కోసం కొంత పనిచేసి (కూలి) డబ్బులు సంపాదించుకో, నీకు వచ్చే ఆదాయాన్నే దేవుని సేవ రూపములో వినియోగించు, నీకు జీవితములో కొంత కూలి, కొంత సేవ

www.thraithashakam.org

చేసుకో, దేవుని సేవకై మీరిక్కడకు వచ్చి, మీ డబ్బులు ఖర్చుపెట్టి, దేవుని సేవ చేస్తే, "సేవ" అవుతుంది. అలా కాకుండా మేము ఇక్కడికి వచ్చాము, మాకు ఏమి ఇస్తారనో, దేవుడేమి ఇచ్చునో అని అలోచిస్తే "కూలి" అవుతుంది.

అదే విధముగా మన శరీరములో రోగములు కూడా కర్మరీత్యా వచ్చును. అవి మందులు వాడటం వలన తగ్గవలెనని కర్మచిట్టాయందు ఉంటే తగ్గును, లేకపోతే ఎంత ఖరీదైన మందులు వేసినా, కర్మలో తగ్గాలని లేకపోతే తగ్గవు. దేవుని మీద నీకు నిజమైన విశ్వాసముంటే నీకు ఏమి చేయాలో దేవుడు చేయగలడు, చేయబోయేది చెప్పడు. ఉదా:- కొన్ని మార్లు వీడు చనిపోవును అని సర్టిఫికేట్ ఇచ్చిన తరువాత దేవుని మీద నమ్మకం ఉంటే మరలా వాడు బ్రతుకవచ్చును. ఇది ఎలా జరుగును? అని ప్రశ్నిస్తే, జ్ఞానము అనునది ఒకటున్నది అది దైవజ్ఞానము తెలుసుకోవటం వలన నీవు చనిపోవలెనని కర్మలో ఉన్ననూ, కర్మాతీతముగా ఆత్మజ్ఞానము చేత నిన్ను బ్రతికించగలదు దానికి ప్రభావం ఉన్నది, దానిపైన నిజమైన విశ్వాసం ఉండవలెను, లేకపోతే కాదు. జ్ఞానమునకు ఇంత శక్తి ఉంది అన్న నిరూపణకు అప్పుడప్పుడూ కొన్నిసార్లు ఇలా జరుగుతాయి. మరి పంచభూతాల వలననే శరీరము నాశనమగును. ఆస్త్మా అనునది వాయువు ప్రకోపించిన వ్యాధి దానిని ఆపమని చెప్పాలంటే, శరీరములో గాలిని అణిగిపొమ్మని చెప్పగలిగిన శక్తిమంతుడు కావాలి. అంత శక్తి ఎవరికి ఉంది, పరమాత్మకు ఉన్నది. పరమాత్మ మాట తప్ప ప్రకృతి ఎవరిమాట వినదు. మరి ఆరోజు ఒక వ్యక్తి ఒక దగ్గర బయట ఉన్న తుఫానును ఆగిపోమంటే ఆగిపోయింది. అతనిలోని జ్ఞానశక్తిని గ్రహించి అతను పరమాత్మ కావున ప్రకృతి అతని మాటవిన్నది.

www.thraithashakam.org

ఈ విధముగా ఆస్మా అనునది ఒక వ్యక్తికి వచ్చింది. అది దేనివలన వచ్చింది వాయువు వలననే, శరీరములో వచ్చింది. అప్పుడు సముద్రంలో వచ్చింది. జ్ఞానం విని, విశ్వాసం ఉంచటం వలన లోపలున్న వాయువును గురువు అణిగిపొమ్మనగా అణిగి పోయింది. జ్ఞాన శక్తికి ఇంత ప్రభావం ఉండును. దీనినే క్రొత్త రాత వ్రాయటం అంటారు. ఇది ఒక్క దేవునికే సాధ్యమగును. దీనినే "తిరగవ్రాత" అని పూర్వం అనేవారు. చివరికి అది 'తిరవాత' అయినది. అది పెడితేనే రుచి ఎలాగయితే ఆహారపదార్థానికి మారుతుందో, "తిరిగి వ్రాత నీవు వ్రాయించుకోవాలంటే, నీవు జ్ఞానమును సంపూర్ణముగా తెలుసుకుంటే, నీవప్పుడు దైవమునకు దగ్గరై, దేవుని సేవే ముఖ్యమైన పనిగా పెట్టుకొని నీవు జీవితము గడిపితే "సేవ" అగును. లేకపోతే "కూలి" అగును. దేవుని దగ్గరకు పోయి కూలి చేయకూడదు, దేవునిదగ్గరకు పోయి సేవ చేయవలెను.

# 15. వెలుగుబంటు

తేదీ : 09-02-2009

వెలుగుబంటును (కరడి) మనమందరము చూసే ఉంటాము. అయితే వెలుగుబంట్లు వాటి రంగును అనుసరించి రెండు రకములు కలవు. అయితే మనమందరము బాగా చూసినవి నల్లటిరంగుగల వెలుగుబంట్లను మాత్రమే. మంచు వెలుగుబంట్లు తెల్లగా ఉండును. అవి అతిశీతల ప్రాంతములలో కనిపించును. మరలా నల్లని రంగుగల వెలుగుబంట్లలో రెండురకములు గలవు. ఒకరకము వెలుగుబంట్లకు నల్లని మూతి ఉండును, రెండవరకం వెలుగుబంట్లకు మూతి తెల్లగా ఉండును. ఈ విధముగా నల్లగా ఉన్న వెలుగుబంట్లు రెండు రకములని తెలిసినది కదా!

ఈ విధముగా నల్లగా ఉన్న వెలుగుబంట్లకు మూతి కూడా నల్లగా ఉండుటయేకాక, కొన్ని వెలుగుబంట్లకు నల్లగా దాని శరీరమంతా ఉన్ననూ, మూతిమాత్రము తెల్లగా ఉండునవి కలవు. వీటిని మనమందరమూ ఇప్పుడు ఎలుగుబంటు అని పిలుచుచున్నాము గానీ దాని అసలు పేరు మాత్రము 'వెలుగుబంటు'. అయితే దీని అర్థమేమి అనగా 'వెలుగును తీసుకొచ్చు వాడని అర్థము' అయితే అదేమి వెలుగు తెచ్చును అని సందేహించవచ్చును. వెలుగు అనగా జ్ఞానము, చీకటి అనగా అజ్ఞానము అని తెలుసును కదా! కనుక **'జ్ఞానమును తీసుకువచ్చే బంటు'** మనకు జ్ఞానమును జ్ఞాపకమును తెచ్చునది. కనుక వెలుగుబంటు అయినది. అలాగే దానిని పూర్వం పిలిచేవారు. తరువాత ఆ పదము ఎలుగుబంటు అయినది. తరువాత 'ఎలుగుబంటి'గా మారినది.

ఆ విధముగా "వెలుగుబంటు" అనే పదములో అసలైన అర్థము తెలిసినట్లయిది. అయితే ఏ విధముగా అది మనకు జ్ఞానసందేశము తెలుపుచున్నదని ప్రశ్నిస్తే, శరీరమంతా రోమములు చాలా ఉండును. **వెంట్రుకలు ఆత్మకు గుర్తు** అని ఇంతకుముందు మనము తెలుసుకున్నాము. ఒక హరికాలు, హరచేయి తప్ప శరీరమంతా రోమములు ఉండును. అదే విధముగా వెలుగుబంటుకు ముందర మూతికి కూడా వెంట్రుకలు తక్కువగా ఉండును. కానీ మిగతా శరీర భాగములన్నియూ వెంట్రుకలతో ఏ జంతువుకూ లేని విధముగా కప్పబడి ఉన్నవి. ఆత్మకు వెంట్రుకలు గుర్తు. వెంట్రక అనగా వెంట ఉండి నడిపించేది ఎవరనగా ఆత్మ ఆ విధముగా వెంటక (వెంట్రక), వెంట్రుకగా రూపాంతరము చెందినది.

ఆ విధముగా ఆత్మకు చిహ్నములైన వెంట్రుకలు కలిగి జ్ఞానమును అనగా ఆత్మజ్ఞానమనే వెలుగు గూర్చి తెలిపేటట్లు అది ఉన్నది. కనుక

www.thraithashakam.org

దానిని 'వెలుగుబంటు' అని అన్నారు. సకల జీవరాసులలోనూ, ఆత్మ శరీరమంతా నిండియుండి ఉన్నదని తెలియుటకు దేవుడు వెలుగుబంటుకు రోమములు పెట్టి పంపించెను. కనుక వెలుగుబంటును చైతన్యశక్తికి సూచనగా చెప్పవచ్చును.

మనుష్య శరీరములలో కూడా ఈ రోమములు కలవు గానీ అంత పెద్దగా లేవు. కానీ ముఖ్యమైన అవయవములైన కనులు, చెవులు, ముక్కు, మూతివద్ద వెంట్రుకలు ఉంచి, ఆత్మకు సూచనగా చూపించబడినది. అంతేకాని ఆత్మపని ఆ అవయవములందేనా అని పొరపాటుపడకూడదు. మన శరీరమంతటా ఆత్మయే నిండి ఉన్నది. కనుక పూర్తి ఆత్మజ్ఞానమును, వెంట్రుకలద్వారా తెలియజేసేది వెలుగుబంటే.

ప్రపంచములో రెండు విధములుగా మనుష్యులున్నారు. కొందరికి జ్ఞానమంటే తెలుసు, కొందరికి జ్ఞానమంటే తెలియదు. అదే విధముగా వెలుగుబంట్లు కూడా రెండు విధములుగా ఉన్నవి. తెల్లటి వెలుగుబంట్లు, నల్లని వెలుగుబంట్లుగా ఉన్నవి. కాని నల్లని వెలుగుబంట్లే మనకు ఎక్కువ కనిపించుచున్నవి. తెల్లని వెలుగుబంట్లు మనకు అసలు కనిపించవు. అందుకే దానికి సూచనగా మూతితెల్లగా ఉన్న వెలుగుబంట్లు, మూతి నల్లగా ఉన్న వెలుగుబంట్లను రెండు రకముల పెట్టడం జరిగినది. ఎందుకు అలా దేవుడు పెట్టెననగా! మనుషులందరిలో ఆత్మ శరీరమంతా నిండుకుని ఉన్నది, కొంతమందికి జ్ఞానము అంటే తెలిసింది. కొందరికి తెలియలేదు. అనగా కొందరు జ్ఞానులుగా, కొందరు అజ్ఞానులుగా ఉన్నారు అనేదానిని సూచించుటకు కొన్ని నల్లటి వెలుగుబంటుకు మూతి తెల్లగా పెట్టెను. కొందరు అజ్ఞానులున్నారు అనేదానికి గుర్తుగా, మూతి నల్లగా పెట్టినాడు. మొత్తంగా చూసినప్పుడు మూతులను మినహాయిస్తే మిగతా శరీరమంతా

www.thraithashakam.org

నల్లగా వెలుగుబంట్లు కలవు. దానికి సూచన ఏమనగా! కొందరు పూర్తి అజ్ఞానులుగా ఉన్నారని కొందరు పూర్తి జ్ఞానులుగా ఉన్నారని గుర్తుగా వరుసగా నల్లని తెల్లని మూతిగల వెలగుబంట్లను పెట్టెను.

ఈ వెలుగుబంట్లలలో ఇంకొక ప్రత్యేకత ఏమిటంటే ప్రపంచములో ఏ జంతువైనా ఎన్ని రంగులైనా, ఎన్ని రంగుల మిళితము కల్గిన శరీరములు కలవుగానీ, వెలుగుబంట్లు మాత్రము రెండు రంగులు తెలుపు లేదా నలుపు రంగులు కల్గినవి మాత్రమే కలవు అని గ్రహించవచ్చును. ప్రపంచములో ఉన్న జీవులన్నీ పూర్తి అజ్ఞానముతోనైనా ఉన్నారని, లేదా కొందరు పూర్తి జ్ఞానముతో కూడి ఉన్నవని తెలియజేయుటకే రెండు రంగుల వెలుగు బంట్లు ప్రపంచమున ఉన్నవి. నేను తెల్లవెలుగుబంట్లను చూడలేదంటే, మూతి తెల్లగున్న వెలుగుబంట్లు కనిపించును. పూర్తి అజ్ఞానిని మూతి నల్లగా ఉన్న వెలుగుబంటుగా లెక్కించవచ్చును. మూతిమాత్రము తెల్లగా ఉండి, మిగతా శరీరమంతా నల్లగా ఉండే వెలుగుబంట్లును కొంత జ్ఞానము ఉంది, అలాగే కొంత అజ్ఞానం కూడా ఉన్న జీవులకు సూచనగా ఉందని అర్థమవుతున్నది. అలాగే పూర్తి తెల్లగా ఉండే వెలుగుబంట్లును, సంపూర్ణమైన జ్ఞానులకు గుర్తుగా మనము అర్థము చేసుకోవచ్చును.

అదే విధముగా ప్రపంచములో పూర్తి జ్ఞానికిగానీ, పూర్తి అజ్ఞానికి గానీ, సగం జ్ఞానము మరియు సగం అజ్ఞానము కల్గిన జీవులకుగానీ వాటి శరీరములను చైతన్యపరిచి ఆత్మే నడిపిస్తున్ననూ, వీరిలో పూర్తి జ్ఞానులున్నారు, పూర్తి అజ్ఞానులున్నారు, కొంత జ్ఞానము తెలిసి, వారిలోనే అజ్ఞానము కూడా ఉన్నవారున్నారు అనిగుర్తుగా మూడు విధములైన వెలుగుబంట్లు కలవు.

ఇప్పుడు మీ అందరికీ ఒక సందేహం రావచ్చును. ఈయన చెప్పినదంతా నిజమేనా? వెలుగుబంటులో ఇంత జ్ఞానసందేశం ఉన్నదా?

www.thraithashakam.org

లేక ఇతను కల్పించి చెపుతున్నాడా? అని మీరు ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానమేమనగా! పూర్వము రోజులకు వెళ్ళి చూసిన, వెలుగుబంట్లను ఆడించుకొని ఊర్లకు వచ్చి డబ్బు సంపాదించుకునేవారుండేవారు. అప్పుడు అక్కడున్న కొందరు ప్రజలు మా పిల్లవానికి లేదా మా పిల్లకు జ్వరము, జబ్బులు రాకుండా ఆరోగ్యంగా ఉండేటట్లుగా, వెలుగుబంట్లు వెంట్రుకలను రెండు ఇమ్మనేవారు. ఆ వెంట్రుకలను వెలుగుబంటునుండి పెరికి వాడిస్తే దానిని ఒకగుడ్డలో చుట్టి, దానిని నడుమునకూ, మొలత్రాడునకు కట్టేవారు.

ఎందుకు ఇలా చేసేవారంటే, ఆ వెంట్రుకలు ఆత్మకు, ఆత్మశక్తికి గుర్తు కనుక, వాటిని ఆ విధముగా తెలుసుకొని కట్టుకునేవారు. అనగా పూర్వమే వెలుగుబంటుకు గొప్ప గుర్తింపు ఉందన్న విషయం తెలిసినది. ఇప్పటికీ కొన్ని ప్రాంతాలలో ఈ విధముగా వెలుగుబంటు వెంట్రుకను, చిన్న పిల్లలకు కడుతున్నట్లు తెలుస్తున్నది. ఈ విధముగా మనము ఇప్పుడు 'వెలుగుబంటు' అనే పదమునకు అసలైన అర్థము **'జ్ఞానమును మోసుకొచ్చే వాడు'** అనే అర్థము మనకు తెలిసినది కదా!

## 16. మాట-మందు

తేది : 11-03-2009

ఈ మధ్య ప్రపంచములో వివిధ రకములైన రోగములతో (ప్రజలు) మనుషులు బాధపడుచున్నారు, ఎందుకనగా! పాపాలు రకరకాలుగా మనుషులు చేయుచున్నారు కావున రకరకములైన వ్యాధుల బారిన మనిషి పడి ఆ పాపఫలితాన్ని అనుభవిస్తున్నాడు. ఆ పాప ఫలితాన్ని మనిషి ఎక్కడ అనుభవిస్తున్నాడు? యమలోకములో! యమలోకమెక్కడ ఉన్నది?

www.thraithashakam.org

భూమిమీదనే ఉన్నది. మరి మనిషి పాపకర్మలు లేకుండా ఏ విధముగా బయటపడవలెను? జ్ఞానమును తెలుసుకోవడం ద్వారా మాత్రమే సాధ్యము. అయితే ఆ జ్ఞానము ప్రపంచ జ్ఞానము కాకుండా పరమాత్మ జ్ఞానమై ఉండవలెను. మరి ఈ జ్ఞానము ఒక్కసారి లభించదు. మనము కొన్ని సంవత్సరములు అంచెలంచెలుగా నేర్చుకొనవలెను. అప్పుడు కర్మల నుండి నీవు బయటపడుటకు అవకాశము కలదు. అంటే కర్మలు చేయవద్దని ఇక్కడ చెప్పటం లేదు, కర్మలు చేస్తే ఆ ఫలితము నీకు కలగకుండా వుండాలి. అహంకారము లేకపోతేనే ఇది సాధ్యమగును. ఈ అహంకారము లేకుండా పనులు చేయటమే కర్మయోగము అంటారు.

ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తికి ముఖ పరిచయమే లేదు. కానీ అందులో ఒక వ్యక్తి, రెండవ వ్యక్తిని తుపాకీతో కాల్చివేసెను, మరి ఆ వ్యక్తికి అలా కాల్చవలసిన పనేమి వచ్చినది? ఇప్పుడు తప్పులేనిది శిక్షపడదు అని అంటున్నాము కదా! మరి ఎందుకు ఆ విధముగా జరిగింది? తెలియనివారు ఏమంటారు, ఎంతటి క్రూరుడు అని చంపినవాడిని అందురు. చనిపోయిన వాడిని ఎంత అమాయకుడు అని అంటారు. కానీ దేవుని లెక్కలో అలా చనిపోయినవాడు చెడ్డవాడు, కాల్చినవాడు మంచివాడు. ఇదంతా వ్యతిరేఖముగా ఉన్నట్లుంది కదా! భగవద్గీతలో మోక్షసన్న్యాస యోగములో శ్రీకృష్ణుడు ఒకమాట చెప్పెను. **"నేను బొమ్మలనాడించినట్లు అందరినీ ఆడిస్తున్నాను"** అన్నాడు. ఈ మాటపైన మనకు విశ్వాసం ఉంటే, మనకీ విషయము అర్థమగును. అందుకు తుపాకీతో కాల్చింపజేసినాడు. మరి చేయించేది ఎవ్వరు? దేవుడు, చేసినదెవరు? వ్యక్తి, అనుభవించినది ఎవరు? రెండవ వ్యక్తి లేదా వ్యక్తులు. మరెందుకు వీరు బాధపడ్డారు, తప్పు చేశారు శిక్ష తప్పదు, ఏ తప్పు చేశారు అది గుట్టు, రహస్యం, ఫలానా అని తెలియదు.

www.thraithashakam.org

ఒక వ్యక్తి కొందరిని నిష్కారణముగా కాల్చి చంపినాడు. నిజమే బయటకు కారణమేమీ కనిపించదు గానీ, ఎవరు చావాలో వారు చస్తారు, ఎవరికి ఎంతటి గాయాలు తగలవలెనో అంతే తగులును. అంటే ఎంత పాపము చేస్తే అంతే శిక్షపడును అనేది అర్థమవుతున్నది కదా!

మనము చేసే ప్రతీ పని కర్మను నిక్షిప్తము చేయుచున్న సాక్షీభూతుడు కలడు కనుకనే ఈ విధముగా శిక్షలు అమలు జరుగుచున్నవి. శిక్షలు అమలు చేసే సందర్భములో, శిక్షలు అనుభవించాల్సిన వారిలోనే తీసుకొని, ఒకడి దెబ్బలు తినేవాడిగా, ఒకడిని దెబ్బలు కొట్టి తద్వారా వచ్చు శిక్షను అనుభవించే విధముగా కూడా పెట్టినాడు. కానీ బయటకు తన్నులు తినేవాడు మంచివాడుగా, దెబ్బలు కొట్టేవాడు లేదా చంపేవాడు చెడ్డగా అనిపించినా, దేవుని దృష్ఠిలో ఇద్దరూ మంచివారూ కారూ, చెడ్డవారూ కాదు. ఎందుకనగా అతను నిష్పక్షపాతి వారి కర్మలను అనుభవించేటట్లే వారిలో ఉన్న ఆత్మను ఆడిస్తున్నాడు, తద్వారా జీవుడు ఆడుతున్నట్లు కనిపిస్తున్నది. వాస్తవానికి వారి కర్మను వారే అనుభవిస్తున్నారు కనుక మనము ఒక శిక్షను అనుభవిస్తున్నామంటే, దాని వెనుక ఒక తప్పుందని అర్థము చేసుకోవలెను.

ఇప్పుడు ఇంకొక ఉదాహరణకు తీసుకుందాము. అదేమంటే ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తిని కత్తితో పొడిచి చంపెను. కానీ చంపిన వ్యక్తి పారి పోయాడు. కాని ఇంకొక వ్యక్తిని పోలీసులు అనుమానించి పట్టుకుని కోర్టుకు తీసుకువచ్చారు. వాయిదాలు జరుగుచూనే ఉన్నవి అని అనుకుందాము. అదే విధముగా నిజముగా హత్య చేసిన వ్యక్తి కూడా దొరికాడు వాడిని కూడా వేరే ప్రదేశములో, వేరే కోర్టులో విచారణ జరుగు చున్నది అని అనుకుందాము. కొంతకాలానికి హత్య చేయనివాడికి శిక్ష

పడింది. హత్య చేసిన అసలు ముద్దాయికి శిక్షపడలేదు. ఇప్పుడు మనకి ఒక ప్రశ్నవచ్చి, మనల్ని సమస్యలో పడవేయును, అది ఏమనగా! దేవునికి అన్నీ తెలుసును కదా! ఎవరు తప్పు చేశారో వారికి ఎందుకు శిక్షపడలేదు?

దీనికి ఆధ్యాత్మిక దృష్ట్యా సమాధానం కోసము పరిశీలిద్దాము. దేవుడు అంతటా ఉన్నాడంటారు, అన్ని విషయములూ తెలుసును అంటారు. మరి దేవుడు కళ్ళు మూసుకుని ఉన్నాడా! ఈ అన్యాయం జరుగుతూ ఉంటే? అని మనకు ప్రశ్న రాగలదు. మరి దీనికి సమాధానము ఏమంటే, ప్రస్తుత జన్మలో హత్య చేయని ముద్దాయి అనుభవిస్తున్న శిక్ష, ఇప్పటిది కాదు, గత జన్మలో చేసిన తప్పు నమోదైనది ఇప్పుడు ఈ విధముగా అమలు పరచబడుచున్నది. అయితే హత్య చేసిన వ్యక్తికి మరి శిక్ష ఎందుకు పడలేదంటే, ఇప్పుడు లేకపోవచ్చు, వచ్చే జన్మలోగానీ, ఆ జన్మలోనే మరికొంత కాలము తర్వాతగానీ, నమోదైనది అమలుకు వచ్చినప్పుడు తప్పక శిక్షపడును. ఇదే **కర్మసిద్ధాంతము**. ఇది అర్థము కాకపోతే అంతా గందరగోళంగా కనిపించును.

ఈ విషయములు భగవద్గీత అనే పాఠములో కలవు. ప్రపంచములో ఏది జరిగినా, ఎవరేమి చేసినా, దాని వెనుక కర్మ ఉంటుంది అది అమలు చేయునది ఆత్మ అని తెలిస్తే, నీకేమీ పాపము రాదు, పుణ్యము రాదు. ఎందుకనగా! దేవుడు కర్మ అమలు పరుచుటకు నీ శరీరమును ఒక పరికరముగా చేసి నీ లోపలున్న ఆత్మ ద్వారా బొమ్మలను ఆడించునట్లు ఆడిస్తున్నాడు. ఈ విషయము తెలియక పోవటం వలన, భగవద్గీతను సంపూర్ణముగా అర్థము చేసుకోలేకపోవటం వలన, అహంకారమునకు లోబడి నేనే ఆ హత్యను, కర్మను చేశాను అని అనుకోవటం వలన, ఆ హత్యాపాపం అనే కర్మ లేదా ఏ పని జరిగినా, దాని ఫలితములైన పాపము,

www.thraithashakam.org

పుణ్యము అనునవి నీ కర్మచిట్టాలో చేరిపోతున్నవి, నమోదవుతున్నవి తద్వారా అవి ఆ జన్మలోనైనా, తరువాత జన్మలలోనైనా అమలుకు వచ్చినప్పుడు ఆ శిక్షను అనుభవిస్తున్నాము మనకు తెలియకుండానే "ఏ జన్మలో చేసిన పాపమో ఇప్పుడు అనుభవిస్తున్నాను" అని అనుకుంటున్నాము. అది ఆ మాటను తెలిసి అనినా, తెలియక అనినా ఆ మాట వాస్తవమే కదా!

ఇప్పుడు మనిషి ఆ పాపకర్మంతా పోగొట్టుకోవాలంటే అనుభవించ వలసినదే. అనుభవిస్తే అది లేకుండా పరిహారమగును. అలా జరగాలంటే ఎలాంటి శిక్షలు ఉంటాయో, ఆ విధానమేమిటో, ఏ తప్పుకు ఏ శిక్షో ఏమో అనునది మాత్రము రహస్యం. అది ఎవరికీ తెలియుటకు అవకాశము లేదు. ఇప్పుడొక విషయమును చెప్పుకుందాము, బయట మన ఆశ్రమ గోడలపై ఒక వ్రాత గుర్తుకు వస్తున్నది, అది ఏమంటే **"లోకంలో మంచిగా, చెడుగా ఆడించేది నేనే కనుక ఈ లోకంలో ఎవ్వరూ మంచివారు కాదు, చెడ్డవారూ కాదు."** ఇది అసలైన జ్ఞానము అని తెలియకపోతే, నీవు శరీరానివే అగుదువు. అప్పుడు నీవు నిజముగా చెడ్డవానివే అగుదువు. ఈ పై సూత్రము దేవుని సూత్రం. మంచి, చెడు జీవునికి ఏమీ లేవు. దేవుడు ఆడు నాటకములో పావులుగా ఉన్నాము. అని తెలుసుకుంటే నీకు పాపము రాదు, పుణ్యము రాదు. ఒకవేళ పాపము, పుణ్యం వస్తే ఆడించే వాడికి రావాలిగానీ, నీకు సంబంధం లేదు కదా! ఇప్పుడు ఉదాహరణకు (చలన చిత్రమును) సినిమాను తీసుకుందాము. దానికి దర్శకత్వము చేసేవాడు వెనుక ఉండి నటున్ని ఇలా చేయు, అలా చేయు అని చెప్పుచుండును, ఆ విధముగా నటుడు, లేదా నటి నటించవలసిందే, కానీ అలా చెప్పిన దర్శకుడు మాత్రము తెరమీద కనిపించడు. చివరికి అది సినిమాగా పూర్తి అగును. ఇప్పుడు దర్శకుడు ఆ విధముగా చెప్పేందుకు, చెప్పిన దానిని నటించిన

నటులకు మూల కారకుడు ఇంకొకడుంటాడు, వాడే నిర్మాత. సినిమా రిలీజ్ అయితే లాభం, నష్టము అనేది నిర్మాతకే చెందుతుంది కానీ ఆడించే దర్శకునికి సంబంధము లేదు. ఆడే నటులకు సంబంధము లేదు. అలాగే జగన్నాటకంలో కూడా నిర్మాత ఉన్నాడు, దర్శకుడు ఉన్నాడు, నటులూ ఉన్నారు అనగా ఆడేవాడున్నాడు అది నీవే జీవాత్మవు. ఆడించేవాడు నీ వెనకుండే ఆత్మ. వీరిద్దరికీ పెద్ద ఒకడున్నాడు, పెట్టుబడి పెట్టినవాడు, అనగా ఈ సృష్టి అనే దానిని నిర్మాణం చేసిన నిర్మాత, ఆయనే పరమాత్మ.

ఇప్పుడు ఇంకొక ఉదాహరణ చెప్పుకుందాము. ఒక వ్యక్తిని రాముడు వేషం వేయమని దర్శకుడు చెప్పినాడు. అతను ఆ వేషం వేసుకున్నాడు. అప్పుడు దర్శకుడు, వేషములో ఉన్న రామునితో ఈ విధముగా చెప్పుచున్నాడు. ఇప్పుడు నీ భార్య సీత పోయింది. ఏ విధముగా ఏడ్వాలో చెప్పుచున్నానని అని చెప్పి, ఇప్పుడు ఈ చెట్టును పట్టుకొని "సీతా!" అంటూ ఏడ్వాలి, తరువాత ఈ రాయిని పట్టుకుని ఏడ్వవలెను, "ఈ సినిమా చూసిన వారంతా ఏడ్వాలి నిజంగా ఆ నటనను చూసి" అని చెప్పగా, అతను అట్లాగే చేసెను. సినిమా రిలీజ్ అయింది. అప్పుడు ఆ సినిమాను నటించిన నటుడు కూడా చూసెను. నేను బాగా నటించాను అనుకున్నాడు కానీ ఆ వేషంలో ఉన్న రామున్ని నేనే అనుకోడు కదా! ఆ విధముగా నటించినప్పుడూ అనుకోలేదు. ఇప్పుడు ఆ సినిమాను చూస్తున్నప్పుడు అనుకోలేదు. ఇది బయట కనిపించే సినిమా పరిస్థితి. అదే విధముగా మన శరీరములో కూడా అదే పరిస్థితి ఉందని గ్రహించవలెను. జీవాత్మవైన నీవు నటుడని, నీలోపలున్న దర్శకుడు ముందుగా ఎలా నటించాలో అంతా ఏమీ చెప్పడు. అప్పటికప్పుడు ఏ విధముగా నటించాలో, ఏ మేరకు నటించాలో చెప్పుతూ నీ చేత చేయిస్తుంటాడు తద్వారా నీవు చేయుచున్నావు.

www.thraithashakam.org

నీవేమి అనుకుంటున్నావు నేనే దర్శకున్ని, నేనే అన్నీ చేస్తున్నానను కుంటున్నావు. దర్శకున్ని మరచిపోయి, నేనే మహేష్‌ని అని ఒక వ్యక్తి అనుకుంటే, నేనే లక్ష్మీనారాయణను అని ఇంకొక వ్యక్తి అనుకుంటున్నాడు. ఈ జీవితం అనే స్టేజీ మీద పెట్టిన పేర్లనే నిజమనుకుంటున్నారు అంతా అదే విధముగా స్టేజీ మీద ఆడిన ఆటనే నిజమనుకున్నారు.

నేను వేరు, ఇప్పుడు ఈ స్టేజీ మీద ఆడుచున్నాను అని అనుకోవటం లేదు. అదే సినిమా అయితే మూడుగంటలు, డ్రామా అయితే ఒక గంట, మరి జీవితం ఎంతో మనకు తెలియదు. నలభై, యాభై సంవత్సరములా అనునది తెలియదు. కానీ నీ పాత్ర ఏదో తెలియక, నీ పాత్ర ఉండేది కొద్ది సమయమే ఈ స్టేజీ దిగి వేరే స్టేజీ ఎక్కాల్సి ఉంటుంది. ఈ నాటకంలో రామునిగా వేషం వేయాల్సి వస్తే, ఆ నాటకంలో ఆంజనేయుని వేషం వేయాల్సి వస్తుంది లేదా రావణాసురుని వేషం అయినా వేయాల్సి రావచ్చును అనగా అనేక జన్మలు ఎత్తాల్సి వచ్చును అని పై వివరణ ఉద్దేశ్యం.

కానీ లోకంలో ఎవ్వరూ ఈ విధముగా ఆలోచింపక, దర్శకున్ని, నిర్మాతను, అన్నీ నేనే అని తలంచి సొంత స్టేజీ మీద, సొంతంగా ఆడటం మొదలు పెట్టారు. ఈ విధముగా అనుకోవటం వలన, దేవుడేమిచేశాడు, "అన్నీ నేనే చేస్తున్నాను అని భ్రమిస్తున్నావు కావున, ఆ పనులలో వచ్చు ఫలితములైన పాప, పుణ్యములు నీకే తగులుకొనును, వాటిని నీవు అనుభవించవలసిందే!" అని తెలియవలెను.

ఈ విషయం ఏ విధంగా ఉందంటే, హరిశ్చంద్ర నాటకమును మేము చిన్నప్పుడు చూస్తున్నప్పుడు, ఒక సంఘటన జరిగింది. ఒక ప్రేక్షకుడు, నక్షత్ర వేషదారున్ని, ఆయన హరిశ్చంద్రున్ని పీడిస్తున్న సన్నివేశము నిజమనుకొని కొట్టడానికి స్టేజీ మీదకు పరిగెత్తాడు. అందరూ ఆయనను

www.thraithashakam.org

వారించి అదంతా నిజముకాదు, నటన అని చెప్పిననూ, కాదు మరీ ఇంత పీడించాలా అని ఊరుకోక, కేకలేసాడు. అనగా ఎంత మునిగి పోయాడో చూడండి ప్రేక్షకుడు, ఆ నటనను చూసి అతనే కాదు మనమూ అంతేకదా! ఇప్పుడొస్తున్న సినిమాలలో సన్నివేశాలు చూసి ఎంతమంది అది నటన అని తెలిసినా ఏడ్వటం లేదు. కనుక ఈ విషయములను పరిశీలిస్తే, ఈ విధముగా జీవులందరూ అజ్ఞానములో ఉన్నారని తెలుస్తున్నది కదా!

ఇప్పుడు మనము పై విషయముల సారాంశము ప్రకారము రకరకాలైన పాపాలను చేయుచున్నాము. కావున రకరకములైన శిక్షలను అనుభవిస్తున్నాము అని తెలిసింది కదా! అయితే మనకు రోగములు వచ్చినప్పుడు వైద్యుల దగ్గరకు పోయెదము. అక్కడ తలనొప్పికి ఈ మందని కడుపునొప్పికి ఈ మందని ఇస్తున్నారు. వైద్యం చేయటం వలన రోగము ఆధీనములోకి వచ్చును, నివారణ కొంత జరుగును అంటున్నాము కదా! అయితే ఒకే రోగము ఇద్దరు వ్యక్తులకు వచ్చినది అనుకుందాము. చికెన్ గున్యా అనుకుందాము ఆ వ్యాధిగల ఇద్దరూ డాక్టర్ దగ్గరకు వెళ్ళారు. ఇద్దరికీ మందులిచ్చారు. ఒక వ్యక్తికి రెండు రోజులలో తగ్గిపోయింది. రెండవ వ్యక్తికి ఎనిమిది రోజులు తరువాత ఆ వ్యాధి తగ్గింది. ఒకే మందు ఇద్దరికీ ఇచ్చినప్పుడు, ఇద్దరికీ ఒకేసారి ఆ వ్యాధి తగ్గాలి కదా! దీని వివరేమి అని వెనక్కి తిరిగి చూసిన, ఒక వ్యక్తికి అనుభవించే కర్మ తక్కువవున్నది. రెండవ వ్యక్తికి అనుభవించే కర్మ ఎక్కువవున్నది, కావున దానిని అనుసరించి మందు పనిచేసినది. అందువలననే అనేక వైద్య విధానాలు, అనేక రకమైన వ్యాధులు ప్రపంచములో ఉన్నవి.

అట్లనిన మందు వలన రోగం పోతుందా అంటే మందు వాడటం వలన రోగము పోవును. ఎందుకనగా! మందు అనగా దానిలో కొంత

www.thraithashakam.org

శక్తి ఉంటుంది. ఆ శక్తి వలన కొంత కర్మ నివారించబడుతున్నది. అది నీకున్న కర్మను అనుసరించి వేగంగా అయినా రోగం పోవచ్చును లేదా ఆలస్యముగానైనా పోవచ్చును. మూలిక అనగా మూలములో ఉన్న శక్తి అది వృక్షములలో, అనగా ఉద్భిజములలో అనగా విత్తనము నుండి పుట్టిన మొక్కలలో కొంత జ్ఞానశక్తి (ఆత్మశక్తి) ఉండును. దానిని మూలిక అంటాము. అన్నింటికీ మూలమైన శక్తి వాటిలో ఉంది కనుక వాటిని మూలిక అందురు. ఆ శక్తి ఆ మొక్కలకు **చంద్రుని** ద్వారా వస్తున్నది. తద్వారా ఆ జ్ఞానశక్తి వలననే నీ కర్మను కొంత నివారణ చేయగలదు. మరి మూలికలుగా కాకుండా కొన్ని రసాయనాలు మందులుగా కలవి ఉన్నవి అవి పని చేయునా అంటే, అన్నీ పని చేస్తాయని చెప్పలేము. అందుకే అల్లోపతి విధానంలో కొన్ని రోగములు తగ్గవు. అయితే ఆస్త్మాకు వాడుచున్న 'ఎడ్రిలిన్' అనే ఇంజక్షన్ కూడా ఒక మూలికనుండి తయారు చేసినదే, కావున ఆ వ్యాధి కొద్ది సమయమునకే అది తగ్గిపోవును. అది ఎలా అంటే, ఆ ఇంజక్షన్‌ను 'మారేడు ఆకు' నుండి, లేదా మారేడు చెట్టునుండి సేకరించారు కావున మారేడు చెట్టులో ఆ ఔషధశక్తి చంద్రుని వలన వచ్చింది కావున అది నీలో పనిచేసి, తాత్కాలికంగా ఆ వ్యాధిని ఆ జ్ఞానశక్తి ఆపివేసినది. ఈ విధముగా కొన్ని కర్మలు, రోగాలుగా బయటపడినవి, మూలికా శక్తి వలన ఆ కర్మలు అమలు జరుగకుండా కేవలం మూలికలో ఉన్న చంద్రుని నుండి వచ్చిన జ్ఞానశక్తి వలననే అది సాధ్యమాయెను అని గ్రహించవచ్చు.

అదే విధముగా కొన్ని రోగములు అసలు ఏ మందులకు తగ్గనివి కలవు. అంటే అది చాలా పెద్దపాపకర్మ. అది ఈ తక్కువగా ఉన్న జ్ఞానశక్తి వలన కూడా నివారణ కాని పెద్దపాపకర్మ ఫలితములవి. ఒకవేళ మందులు దొరకని చోట నీవున్నావనుకో, అప్పుడు నీకు మందులిచ్చే వైద్యులు

ఉండకపోవచ్చు అలాంటి ప్రదేశములలోనైనా, నీ కర్మ తగ్గి, నీ రోగం రాకుండా ఉండాలంటే మందులకు బదులు ఇంకొకటుంది. మందులో ఏ విధముగా శక్తి ఉందో, ఇంకొక దానిలో కూడా ఆ శక్తే ఉంది, అదేమనగా! 'మాట' అగును. మనిషిని బాధనుండి విముక్తిని చేయగలదు మాట. కనుక మాట మందుతో సమానమైనది, మందు మనిషిని చంపేందుకు పనికొస్తుంది, అలాగే బ్రతికించుటకు కూడా పనికొస్తుంది. అలాగే మాటకు శక్తి ఉండును. అయితే అందరికీ మాట ఉంది కదా! అందరి మాటలకు ఆ శక్తి ఉంటుందా? అని ప్రశ్నరావచ్చును. అన్ని రోగాలకు అన్ని ఆకులు మందులుగా ఏ విధముగా పని చేయవో, ఏదో ఒక ఆకు ఆ ఒక్క రోగానికే పని చేసినట్లు, ఆ విధముగా అందరి మాటలు మందుకావు. అందులో ఆ శక్తి ఉండదు. మరి నీ మాట మందురూపములో పనిచేయాలంటే, ఆ మాటకు కొంత శక్తి ఉండాలి. ఒక ఆకు ఔషధంగా పనిచేయాలంటే దానికి ఒక శక్తి లభించి ఉండాలి. ఎక్కడినుండి చంద్రుని నుండి, నీ మాట కూడా అలాగే శక్తిగా మారాలంటే, నీకు దైవజ్ఞానము తెలియవలెను. నీవు జ్ఞానము కలిగివుంటే నీ మాట కూడా శక్తి కలిగి ఉండును, కానీ నీ మాట అసలైన దైవజ్ఞానము అయి ఉండాలి. అప్పుడు నీ మాటకు శక్తి ఉంటుంది. అందుకు ఒక రోగాన్ని శాసించే అధికారము, జ్ఞానము కలిగిన మాటకు ఉంటుంది. అందువలన ఒక రోగముకు మందులేని సమయంలో (ఔషధం లేని సమయంలో) ఒక జ్ఞాని చెప్పినా, ఆ రోగము కల్గిన వ్యక్తిని చూసినాగానీ, సంకల్పముతోగానీ, ఆ రోగాన్ని నయం చేయుటకు అవకాశము ఉంది. అనగా జ్ఞానం అంత గొప్పది.

అయితే కొందరు ఇప్పుడు మేము జ్ఞానము తెలుసుకుంటున్నాము కదా! మరి మాకు ఆ జ్ఞానశక్తి లభించలేదంటే, మీరు సంపూర్ణంగా జ్ఞానాన్ని

www.thraithashakam.org

తెలుసుకుంటే, దేవునిపైన అతను చెప్పిన జ్ఞానమును కేవలము తెలుసుకోవటం వరకే కాకుండా దానిని ఆచరణలో పెట్టినట్లయిన అప్పుడు నీ మాటలో ఆ శక్తి వచ్చును.

ఇప్పుడు ఒక మనిషి చేత ప్రత్యక్షముగా కనిపించి పదిమందిని కాల్చి చంపి తద్వారా వారి పాపమును అనుభవించునట్లు చేసిన, రెండవ ఆత్మ కనిపించకుండా రోగముల ద్వారా ఆ పాపమును అనుభవించినట్లు చేయగలదు. మరి కనిపించినట్లు చేయిస్తే ఆ విధముగా చంపిన వ్యక్తిని చెడ్డవాడని వారిని దూషించెదము కదా! మరి కనిపించకుండా ఉన్న భూతములుగా నీ శరీరములో రోగములుగా నీకు అనుభవించేందుకు నీ శరీరములోకి వస్తే నువ్వు ఇప్పుడు ఎవరిని దూషించగలవు? మరి ఆ రోగము ఎందుకు వచ్చింది? దాని వివరమేమి? అనిన వివరముగా తెలుసుకొంటే పూర్వం **'కలరా'** అనే వ్యాధి ఉంది ఇప్పటికీ ఉంది. కలరాను కూడా ధాతుకణాలుగా మనము అనుకుంటే, వాటిని మాత్రం సూక్ష్మకణాలు అని అనవచ్చును. ఒక పెన్నుతో ఒక చుక్కపెడితే, అందులో అనగా ఆ చుక్కలో ఎన్నో వేల కణాలు ఉండును. అట్లాగే ఒక వ్యాధికారకములో కూడా ఎన్నో లక్షలు కల్గిన సూక్ష్మకణములు కలవు. ఆ కణములన్నీ రోగముల రూపములో విస్తరిస్తున్నాయి. ఆ కణములన్నీ పొగమాదిరి వ్యాపిస్తూ ఎంతవరకైనా పోగలవు.

ఈ పొగ మాదిరి దృశ్యాలను మనము పాత సినిమాలలో చూడవచ్చు, ఒక వ్యక్తి బాణంతో కొట్టగానే, కొట్టిన చోటునుండి పొగమాదిరి దృశ్యాన్ని చూపిస్తూ, అందులోనుండి ఒక రాక్షసాకారము వచ్చునట్లు చూపించెదరు. ఆ విధముగా కనిపించని పెద్దపెద్ద గ్రహాలు కనిపించే రోగాలుగా వచ్చును. కలరా ఈ విధముగా వస్తుందని అంటే కొందరు

www.thraithashakam.org

మూఢనమ్మకములు అని అంటారు. కానీ ఇది తెలిసిన తరువాత మూఢనమ్మకములు కావు, వాస్తవ నమ్మకములు. ఈ విధముగా కలరా అనేది విస్తరించి చాలా ఊర్లకు వ్యాపించును. అప్పుడు ఎవరైనా జ్ఞాని ఉంటే, వాడికి దూరంగా ఉండేది, వాడున్న ఊరికి కూడా కలరా వెళ్ళేది కాదు ఒకవేళ పొరపాటున వెళ్ళినా, ఊర్లో ఒక భాగం వరకు వెళ్ళి, ఒక భాగమంతా విడిచిపెట్టేది. ఒకవేళ జ్ఞాని నీవు ఈ త్రోవన రావద్దు అంటే, అలాగే వెళ్ళిపోయేది జ్ఞానానికి, జ్ఞానశక్తికి గౌరవించినది. అంటే అప్పుడు మాట మందు అయినట్లే కదా! అటువంటి వారు పూర్వము ఉండేవారు కానీ ఇప్పుడు జ్ఞానమంటే ఏమో తెలియదు. దేవుడెవరో తెలియదు, మరి ఆయన జ్ఞానము ఇంకేమి తెలియును కనుక మనము ఎటువంటి పరిస్థితులలో ఉన్నామో తెలియుచున్నది కదా! ఈ విధముగా రోగముల రూపంలో పాపాన్ని అనుభవించేది ఉండగా, శరీరము లోపలనే స్వయంగా నీ శరీరములో ఆత్మ ద్వారా అనుభవించే పాపకర్మ అంగలోపాలు గల శిక్షలను అనుభవించుచున్నాము అంటే యముడు ఎక్కడో లేడు. యమలోకము అనునది భ్రమ, ఆ యముడు మన శరీరములోనే ఆత్మ రూపములోనే ఉన్నాడు. యమధర్మరాజే శిక్షవేస్తాడు, అలా కాకుండా శరీరములో క్రిముల రూపములో శిక్షలు అనుభవించేది ఉన్నది. అవి ఏమనగా! ఇతర గ్రహములనుండి వచ్చిన భూతముల (జీవుల) ప్రాబల్యమది అని గుర్తెరుగవలెను. అవి క్రిముల రూపంలో వచ్చి పీడించి, నీ పాపాన్ని అనుభవింపజేస్తున్నవి.

మరి అటువంటి బాధలు నివారణ కావాలంటే, నీకు జ్ఞానము తెలిసియుండాలి, లేదా జ్ఞానము తెలిసిన వారివద్దనైనా ఉండవలెను. అప్పుడు అటువంటి జ్ఞానము కల్గిన వ్యక్తి చెప్పిన, ఆ రోగము, అంతటితో

వదలిపోవును. అనగా జ్ఞానపు మాట మంత్రమై, ఔషధమై పని చేస్తున్నది. ఉదాహరణకు విషమునకు మందువేసినా పనిచేస్తుంది, మాట వేసినా పని చేస్తుంది. ఇవన్నీ ఎందుకు తెలియజేస్తున్నామంటే కర్మలు ఎన్నో రకములు, దానికి తగిన శిక్షలు అనేక రూపము, శిక్షించే వారు కూడా అనేక రూపాలు.

ఈ విధముగా కొందరు, "మరి మీకు జ్ఞానము ఉందికదా! మీకు కూడా రోగాలొస్తాయా?" అని ప్రశ్నించవచ్చును. అయితే నాకు రోగాలు రావాలంటే నా అనుమతి తీసుకొని రావాలి. అలాగే అవి పోవాలన్నా అనుమతి తీసుకునే పోవాలి. మరి మీకు మాత్రము ఆ పరిస్థితి ఉందా? లేదు. నీవు నిర్బలుడవు. రోగమొచ్చినప్పుడు నిర్బలుడవే, పోయిన వరకూ నిర్బలుడవే. కనుక వైద్యులు మందులు ఇచ్చి, మేము మా ప్రయత్నం చేశాము ఇక దేవుని దయ అంటారు, మరి అంత పెద్ద డాక్టర్లే దేవుడి మీద భారము వేసినప్పుడు, మనమెందుకు అనుకోకూడదు? కానీ ఆ విధముగా అనుకోకుండా, నేనే అన్నింటికీ కారణమనుకొని నిజంగా చెడినవాడైనాడు. కనుక మనిషి అసలైన రహస్యమును గ్రహించి, ఆడించే దంతా నేను కాదనీ, కేవలం ఆ విధముగా అల్లాడేవాడినే నేను అని తెలుసుకొన్న రోజున నీకు ఏ పాపము రాదు, ఏ పుణ్యమూ రాదు అసలు కర్మలను అనుభవించే అవసరమే లేదు.

కనుక నీవు ఎంత సంపాదించినా జరగాల్సింది జరుగకమానదు. 'నీ శరీరము నీ మాటను వినని రోజు ఉన్నది.' ఆ రోగములు వచ్చినప్పుడు, వైద్యునికి కోటిరూపాయలు ఇస్తానన్నా, పోవలసిన ప్రాణం పోకమానదు. నీ రోగ బాధని అనుభవించాల్సిందే, నీ పాపపు కర్మ అమలుకు రావల్సిందే! కానీ, నీవు సంపూర్ణ జ్ఞానివైతే, నీ జ్ఞానశక్తి కల్గిన మాటకు విలువనిచ్చి, ఆ మాటే మందుగా పనిచేసి, నీవు ఆ పాపపు కర్మలను అనుభవించకుండా

చేసుకొనవచ్చును. ఒక వ్యక్తి మట్టిని కంటికి రుద్దమని చెప్తే, గ్రుడ్డివానికి కళ్ళు రాలేదా! మరలా ఈ విధముగా చెప్పానంటే, పరమత బోధ అంటారేమో కొందరు, ఉదాహరణగా కూడా వాడుకోకూడదట మరి!

కనుక మేము జ్ఞానము ద్వారా రోగములు పోవును అనునది వాస్తవము, మూఢనమ్మకము మాత్రము కాదు. మాకూ రోగాలొస్తాయి, కానీ అనుభవించేది మాత్రము నేను కాదు. కానీ మీకు అలాగ వీలుకాదు మీరే అనుభవించాల్సి వచ్చును, కానీ జ్ఞానమును సంపూర్ణముగా తెలుసుకోవటం ద్వారా మీరూ ఆ స్థాయికి చేరవచ్చును. కానీ ఆ పని మనము చేయటం లేదు, ఈ అజ్ఞానం ఏమి చేస్తున్నదంటే

తొఱ్ఱిమానులోని తోరట జీవులనెల్ల
మొల్లలేక జంపు ముదము తోడ
నగ్నిలేని మంట యదియేమి చోద్యమో
విశ్వదాభిరామ వినురవేమ!

అనగా జీవులందరినీ, ప్రేమతో శూలము లేకుండానే చంపేస్తున్నది. అగ్ని లేకుండా మంట కల్గి జీవులను బాధపెడుచున్నది, ఇది ఏమి చిత్రమో అని వేమనయోగి చెప్పెను. మరి మనమే కాదు వేమనగారే చెప్పారు. ఆ కర్మవిధానం గూర్చి కనుక వేమనయోగి పద్యాలన్నింటికీ అసలైన భావమును మేము వ్రాసితిమి. అందులో ఇంకా వివరములు తెలుసుకోనేందుకు ప్రయత్నం చేయండి.

www.thraithashakam.org

# 17. ఏకత - ఏకాగ్రత

తేది : 05-04-2009

ఈ దినం స్వామి పుట్టినరోజని మీరంతా వచ్చామని మీరు అనుకుంటున్నారు. కాని వాస్తవముగా ఈ రోజు పుట్టిరోజు కాదు గాని చచ్చిన రోజు అని మేమంటాం. ఇదేమి మీరంతా భిన్నంగా మాట్లాడుతారు, అని మీరు అనవచ్చును. భగవద్గీత ప్రకారం ఈ రోజు చచ్చిన రోజు అనునది వాస్తవము. ఎందుకంటే, **"జాతస్య హిధ్రువో మృత్యు:, ధృవం జన్య మృతస్యచ"** అన్నాడు. అంటే **పుట్టినవాడు మరణింపక తప్పదు, మరణించినవాడు జన్మింపక తప్పదని.** ఈ రోజు ఉదయం తొమ్మిది గంటలకు ఒక వ్యక్తి పుట్టినాడు అంటే, వాడు తొమ్మిది గంటలకు చనిపోయి ఉంటేనే తొమ్మిది గంటలకు పుట్టేది. ఈ విషయం జరగటానికి ఒక్క క్షణం కూడా తేడా లేకుండా జరుగును. ఎప్పుడైతే మనిషి చనిపోయాడో అప్పుడే జన్మను తీసుకోవటం కూడా జరుగుతుంది. కనిపించేది పుట్టిన దినం. కనిపించనిది చచ్చిన దినం.

పుట్టిన రోజునైతే పండుగ అని అనవచ్చును. మరి చచ్చిన రోజును ఏమనవలెను, పండగే అనవలెనా? అనంటే ఒక విధంగా బాధగా ఉన్నా పండుగ మాదిరి, ఆ శవాన్ని ఊరేగిస్తారు, డప్పులు కొడుతూ, నృత్యాలు చేస్తుంటారు కదా! మరి ఎందుకు పండగలాగ చేస్తున్నారు? చనిపోతే సరే! ప్రపంచరీత్యా ఏ విధముగా చేసుకున్ననూ ఆధ్యాత్మిక రీత్యా, పుట్టిన రోజును చనిపోయిన రోజుగా లెక్కించుకుంటూ, ఇప్పుడు ముందు కూడా ఉన్నాను, ఇంతకు ముందు జన్మలో ఎంత ఆస్తిపాస్తులు ఉన్నాయో తెలియదు. ఎందరు బంధువులుగా ఉన్నారో తెలియదు అని ఆధ్యాత్మికరీత్యా మనం గుర్తుకు తెచ్చుకొనుటకు పుట్టినరోజు పండుగను చేసుకోవటం పెట్టినారు ఆనాటి

పెద్దలు. కానీ ఈ రోజు ఆ విధంగా అనుకోవటం లేదు కొంతమందికి పాయసం అన్నము పెట్టి నా పుట్టినరోజు అని చేసుకుంటున్నారు. ఇంకను కొందరు ఏమి చేస్తున్నారంటే, మధ్యపానాన్ని సేవిస్తూ, పదిమందికి పంచి, పుట్టినరోజు పండుగను చేస్తున్నారు. ఈవిధంగా చాలా రకములుగా చేస్తున్నారు. ఇటువంటి పద్ధతులేమీ కాకుండా, ఈ సందర్భములో దేవుని జ్ఞానాన్ని మాత్రం గుర్తు చేసుకోవాలి. పుట్టినది దేనికి అంటే దేవున్ని చేరే జ్ఞానాన్ని తెలుసుకునేందుకు, మనమెవరిమో గుర్తించుకునేందుకే మనల్ని దేవుడు పుట్టించాడు. ఉదాహరణగా చెప్పుకుంటే, మన శరీరములో ఎన్నో భాగములు కలవు. కన్ను, ముక్కు, నాలుక, చర్మం, చెవులున్నాయి. కనిపించకుండా శరీరంలో ఎన్నో భాగాలున్నాయి. ఈ భాగాలన్నింటినీ తయారు చేసి పెట్టిందెవరు? దేవుడు. మనం ఆయనను చూడలేదు గానీ, దేవుడని మాత్రం తెలుసు. ఇన్ని శరీరభాగాలను సృష్టించిన దేవున్ని గురించి మనమేమైనా లెక్కించుకుంటున్నామా, అంటే లేదు.

ఆ శరీర భాగములను ఉపయోగించుకొని మనం తిరుగుతూ, పుట్టిన రోజు పండుగను చేసుకుంటున్నాం కానీ, పుట్టించిన వాడిని గూర్చి గుర్తించుకోవటం లేదు. శరీరంలో ఏ భాగమైనా పాడైతే, కొత్త దానిని సృష్టించటం నీకు సాధ్యమవుతుందా? కాదు అది ఒక్క దేవునికే సాధ్యమగును. నీవు షుగర్ వ్యాధిగ్రస్థుడవైతే నీకు ఎన్నో మందులెక్కించాలి, కానీ ఆ రోగం రానంతవరకు వాటిని అదేవిధంగా అంతవరకు పని చేయించింది ఎవరు? దేవుడే. దేవున్ని గురించి తెలుసుకోండి అని అంటే ఆయనతో మాకేమి పని? అని అడిగే లెక్కలో ఉన్నారు కొందరు. ఒక్క ఇన్సులిన్ గ్రంథి పనిచేయకపోతే రోజుకి 200 రూపాయల ఇంజక్షన్ వేసుకుని మనం బ్రతకగల్గుతున్నాము. ఆ విధంగా తాత్కాలికంగా ఆ గ్రంథులను పని

చేయించటం కొరకు ఎంతో ధనాన్ని ఖర్చుపెట్టుచున్నాం. అదియునూ పూర్తి బాగయ్యేందుకు కాదు. మరి కొందరిలో ఆ సమస్యలేమీ రాకుండా అన్ని గ్రంథులు బాగా పనిచేసియునట్లు, ఇన్ని సంవత్సరాలుగా చేస్తూ ఉ న్నాడు, వెనుకనుండి ఒక్కడు అంటే, అటువంటి వాడిని గుర్తు చేసుకోకుండా మనం ఈ రోజు ప్రవర్తిస్తున్నాం. కనుక ఈ పుట్టిన రోజు సందర్భముగా మనల్ని పుట్టించిన వాడైన దేవున్ని గుర్తించుకోవాలి. ఆయన చెవులకు వినిపించడు, కనులకు కనిపించడు, నాలుక రుచికి తెలియడు. ఇంద్రియాలకు అతీతుడు. ఎవరికీ అర్థము కాడు. వానికి ఒక పేరంటూ లేదు. అతనినే దేవుడు అని అంటున్నారు. దేవుడు అనేది ఒక పేరా? కాదు. అది పేరు కాదు. దేవుడు అంటే వెతకబడేవాడు అని అర్థముగానీ అది పేరుకాదు. దేవుడంటే వెతకబడేవాడు, దొరికేవాడు కాదు. నీ జీవితమంతా వెదకినా, వాడు దొరకడు. **దేవులాడబడేవాడు దేవుడు.** మరి ఆయనను తెలుసుకోవాలంటే ఆయన జ్ఞానాన్ని తెలుసుకోవలెను.

ఒక వ్యక్తి మనకి కావాలంటే, మనము ఆయన అడ్రస్‌ను తీసుకుంటాం కదా! అదే విధముగా దేవుని జ్ఞానాన్ని తెలుసుకుంటే అప్పుడు నీకు ఆయన అడ్రస్ (చిరునామా) తెలుస్తుంది. దేవుని అడ్రస్ తెలుసుకునేందుకు అవకాశము ఉందికానీ, దేవున్ని చూసేందుకు మాత్రము అర్హులము కాదు. పుట్టినటువంటి ఏ జీవరాసి గానీ, యోగిగానీ జ్ఞానిగానీ ఎంత గొప్పవాడుగానీ, ఏ మహర్షిగానీ భూమిపై వున్నవాడు దేవున్ని చూసినటువంటివాడు లేనేలేడు అనేది శాసనము. నేను దేవున్ని చూశాను. మీకు నేను చూపిస్తాను అని అంటే అది అసత్యము. ఈ విషయము మేము చెప్పినది కాదు. బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలో చెప్పినటువంటిది. “ఈ కన్నులకు నేను కనిపించను అర్జునా!” అని అన్నాడు. ఆ మాట విని

అర్జునునికి అనుమానము వచ్చింది. తర్వాత కృష్ణుడు ఇలా అన్నాడు. "నేను నీ ముందర ఉన్నాను, నీ వెనకా ఉన్నాను". అని అంటే ఈ మాట అబద్ధమే అనుకున్నాడు అర్జునుడు. "నీ ప్రక్కనున్నాను. నీ వెనుకనున్నాను, నీ ముందు ఉన్నాను, నీలోపల కూడా ఉన్నాను" అన్నాడు శ్రీకృష్ణుడు. బయటంటే ఏదోలే, కానీ లోపల ఎవరుండేది, నేనే కదా ఉండేది" అని అనుకున్నాడు అర్జునుడు అప్పుడు నీవు ఎవరు? అని అడిగాడు. అప్పుడు కృష్ణుడు మాట్లాడుతూ "నువ్వు నన్ను చూడలేవు. పంచభౌతికమైన ఈ కన్నులకు నేను కనపడను". మరి కనిపించేది ఎలా?" అంటే "నేనే నీకు ఆ దృష్ఠినిస్తే కనిపిస్తాను. ఎవరికీ ఆ దృష్టిలేదు" అని చెప్పాడు. అటువంటి వాడు దేవుడు అటువంటి దేవున్ని తెలుసుకునే ప్రయత్నము మనము చేయాలి. భూమిపైన జీవులకు దేవునియందు భక్తి ఉంది కానీ ఆ భక్తి ఒకే విధముగా లేకుండా వివిధ రకములుగా ఉంది.

కొందరు ఏదో ఉగాదికో, సంక్రాంతికో ఒక కొబ్బరికాయ కొట్టి నమస్కారము చేసి అదే భక్తి అనుకుంటారు. అదియునూ ఎవరికి మ్రొక్కుతున్నారంటే, ఏదో కనిపించే బొమ్మ పెట్టుకొని, కనిపించే పేరు పెట్టుకుని, దానికి నమస్కారము చేస్తున్నారు తప్ప ఏమీ లేదు. అది భక్తా అంటే అదోరకమైన భక్తి. ఇంకా కొందరు గురు, శిష్యుల సంఘములు ఏర్పాటు చేసి, అందులో పూజలు చేసే విధానము ఇంకొక రకమైన భక్తి. ఇంకా కొందరు అచలము అంటారు. పిరమిడ్ ధ్యానము అంటారు. ఉత్త ధ్యానం అంటారు కొందరు. బ్రహ్మ కుమారీ సమాజము అంటారు, ఈ విధముగా చాలా సమాజాలు ఏర్పడిపోయి అందరూ దేవుని గురించి చెప్పటము మొదలు పెట్టారు. ఇది జ్ఞానము అని చెప్పుచున్నారు. మనింట్లో మనము కొబ్బరికాయ పెట్టి పూజ చేయటముకంటే, బయట ఒక

సంఘములో కూర్చుని జ్ఞానము తెలుసు కొనుటకు ప్రయత్నము చేయటము మంచి పద్ధతే, కానీ అవన్నీ ఒకే రకంగా ఉన్నాయా? అంటే ఒకరు ఒక పద్ధతి మీద బోధిస్తే, ఇంకొకరు ఇంకొక పద్ధతి మీద బోధిస్తున్నారు. ఎన్ని పద్ధతులున్ననూ దేవుని అడ్రస్‌ను (చిరునామాను) తెలుపుచున్నాయా? అని తెలుసుకోవాలి. నీవు ఒక ఊరికి వెళ్ళి అడ్రస్ అడుగుతావు, ఎవరో ఎందుకు, మేమే విశాఖపట్నము వెళ్ళినప్పుడు ఒక అడ్రస్ కావాలని ఒక వ్యక్తిని అడిగితే ఈ ప్రక్కకు వెళ్ళండి అని చెప్పాడు, ఆ ప్రక్కపోతే అడ్రస్ లేనేలేదు. అంటే వాడికా అడ్రస్ తెలియక పోయినా తెలిసినట్లు నటించి, ఈ ప్రక్కకు వెళ్ళండి అని చక్కగా చెప్పినాడు. అక్కడకు పోయి అడిగితే, ఇక్కడని ఈ అడ్రస్ మీకెవరు చెప్పారు ఈ అడ్రస్ కల్గిన రూట్ (త్రోవ) ఇది కానేకాదు. ఈ అడ్రస్ ఆ ప్రక్కకు ఉందని అక్కడివారు చెప్పారు. సరే అని అక్కడినుండి వెనుకకు వచ్చాము. వెనక్కి వచ్చి విచారిస్తే అతను కొంత అడ్రస్ మాత్రమే చెప్పాడు. ఈ విధముగా నాలుగైదుగురిని విచారిస్తే అప్పుడు అసలు అడ్రస్ (చిరునామా) దొరికింది. ఒక మనిషి చిరునామానే ఐదుగురు మనుషులు చెప్పారు.

ఆ విధముగానే దేవుడు అడ్రస్ చెప్పాలంటే సులభముగా అవుతుందా, సంఘములెన్నో ఉన్నాయి. వీరు చెప్పిన అడ్రస్‌లు వాస్తవమేనా? వీరు చెప్పిన జ్ఞానమంతా నిజమేనా? అంటే కాదు వీరు చెప్పే విషయములలో తప్పకుండా లోపాలుంటాయి. ఈ విధముగా తప్పు అడ్రస్ చెప్తే ఊరంతా తిరిగినట్లు, ఎక్కడెక్కడో తిరిగి చివరికి అసలైన జ్ఞానము వద్దకు వచ్చినప్పుడు, తప్పకుండా పనికిరానివని వాటిని వదలివేస్తారు. అది మన బాధ్యత ఈ రోజు ఉత్తమోత్తమైన జ్ఞానాన్ని భూమిమీద అందించినది భగవద్గీత. ఆ భగవద్గీత హిందువులలో కొందరికే తెలుసును. భగవద్గీత 85 శాతము

www.thraithashakam.org

మనుషులకు అవగాహన లేదు. ఒకవేళ కొందరు చదివినా వాటిని పూర్తిగా అర్థము చేసుకోలేదు. భగవద్గీత సంపూర్ణమైన జ్ఞానాన్ని అందించినప్పటికీ, దానిని తెలుసుకోకుండా ఎన్నో దార్లు చూపించేవారు చాలామంది తయారయ్యారు. వీటన్నింటినీ చూస్తూ ఉంటే దేవున్ని చేరే పద్ధతి మనకి తెలుస్తుందా? అనే ప్రశ్న రాక మానదు, ఈ ప్రశ్న ఎంతో కొంత జ్ఞానము ఉన్నవారికి మాత్రమే వస్తుంది.

సమాజములో ఒక మనిషి అందరూ ఏ జ్ఞానాన్నైతే అనుసరిస్తారో, ఆ జ్ఞానాన్నే ఈ వ్యక్తి అనుసరిస్తూ ఉంటాడు. దానినే మిగతా వారికి కూడా ప్రచారము చేస్తూ ఉంటారు. ఇంకొక సంఘములో ఉండేవారు ఆ విధముగానే చేస్తూ ఉంటారు. వీటిలో ఎవరిని కాదంటాము. ఎవరిని అవునంటాము. ఎవరినీ కాదనటానికి వీల్లేదు. కాదంటే కొందరు నాదే వాస్తవమైన జ్ఞానమంటారు. ఇంకొకరు నాదే నిజమైన జ్ఞానమంటారు. దేవున్ని తెలుసుకోవాలంటే కేవలము ఇంట్లో పూజలు చేసుకోవటమేకాదు, కొందరి గురువుల దగ్గర జ్ఞానము తెలుసుకోవటము జరుగుతూ ఉంది. ఒక్కొక్క గురువు ఒక్కొక్క జ్ఞానము చెప్తున్నారు. అంతా నిజమా, కాదా అనే దానికి ఏమి గుర్తు? బ్రహ్మకుమారీ సమాజమువారు, పిరమిడ్ ధ్యానం వారిని ఒప్పుకోరు. పిరమిడ్ ధ్యాన సమాజము వారు బ్రహ్మకుమారీ సమాజాన్ని ఒప్పుకోవటం లేదు. అందరూ కలిసి మమ్మల్ని ఒప్పుకోవటము లేదు. ఆ విధముగా ఉంది పరిస్థితి. ఒక సూత్రమంటూ కావాలి కదా! భగవద్గీతలో దేవుడేమి చెప్పెనంటే, **“ఎప్పుడైతే ప్రశ్నలేకుండా జవాబు దొరుకుతుందో అదే నిజమైన జ్ఞానము. ఎప్పుడైతే అన్ని ప్రశ్నలకు జవాబు ఉంటుందో అది నిజమైన జ్ఞానము. ఎప్పుడైతే జ్ఞానముతో ఎవ్వరూ ఎదురాడలేరో అదే నిజమైన జ్ఞానము,** ఇది సూత్రము. ప్రశ్న ఉంది ఆ

www.thraithashakam.org

ప్రశ్నకు జవాబు లేదంటే, తెలియనితనము ఉందంటే, అది అజ్ఞానము. ఇంకా వివరముగా అర్థము కావాలంటే, ఏదైతే జవాబో అదే జ్ఞానము, ఏదైతే జవాబు లేని ప్రశ్నో అది అజ్ఞానము. ఎన్నో సమాజాలు, ఎన్నో జ్ఞానాలు ఉన్ననూ, మీకు నిజము తెలియాలంటే ఒకటే సూత్రము పైన చెప్పినదే, ఒక ఉదాహరణ చెప్తాము, వినండి.

ఒకాయన ఈ మధ్య ప్రయాణములో మా ప్రక్కన కూర్చున్నాడు. మీరు మాకు కొద్దిగా కూర్చునేందుకు సీటు ఇస్తారా? అని అడిగితే, రండి అని చెప్పి కూర్చో బెట్టుకున్నాము. మేము దేవుని జ్ఞానము గూర్చి ప్రచారము చేస్తున్నాము అని ఆ వ్యక్తి అన్నాడు. మంచిదే అని మేమన్నాము. చూడండి ప్రపంచమంతా అజ్ఞానము పెరిగిపోయింది, దైవభక్తి లేకుండా పోయింది వీరందరినీ ధ్యానము చెప్పి, ధ్యానపరులుగా మార్చివేస్తే సమస్య పరిష్కారము అయిపోతుంది అని ఆ వ్యక్తి అంటున్నాడు. అదియునూగాక 2012 వచ్చేటప్పటికి భూమి అంతా ధ్యానముతో మారిపోతుంది. మన ఆంధ్రప్రదేశ్ ధ్యానాంధ్రప్రదేశ్ అయిపోతుంది, కనుక మీరు కూడా ధ్యానం చేయండి అని చెప్పాడు. సంతోషం మంచి పని చేస్తామంటే ఆనందమే కానీ 2012 అంటున్నారు. అప్పుడు ఎలా మారిపోతుంది అని అడిగాము. 2012 కలియుగాంతము అయిపోతుందండీ, సత్యయుగము వస్తుందండీ అన్నాడు. ఇదెక్కడి రామాయణమో చూడండి. కలియుగ కాలపరిమాణము 4,32,000 సంవత్సరములు అన్నది వాస్తవమైనది. ఇప్పటికి 5110 సంవత్సరములే పూర్తి అయినది. 4 లక్షల 32 వేల సంవత్సరములలో 5110 సంవత్సరములు తీసివేస్తే ఇంకెంత ఉన్నట్లు అంటే ఒక గుమ్మడి కాయలో ఆవగింజంత పూర్తి అయినట్లు. 2012కి కలియుగము అంతం అయిపోతుంది అంటే క్రొత్తమాటే అనుకుందాము.

సత్యయుగము వస్తుందట, అది ఎన్ని సంవత్సరములు ఉంటుంది? అని అడిగాము. "చాలా ఏళ్ళు ఉంటుంది" అని అన్నాడు. "సరే ఎన్నో ఏళ్ళు ఉంటుందిలే తరువాత ఏమొస్తుంది?" అని అడిగాము. దానికి "మా గురువులు చెప్పలేదు తరువాత ఏమి వస్తుందో" అన్నాడు. అంటే ఆ ప్రశ్నకు జవాబు లేదు. "మనము పోయేది సత్యయుగంలోకే కదా! మిగతా యుగములతో ఏం పని" అంటున్నాడు. అంటే ఏదో యుగము పేరుపెట్టి, దేవుడు చెప్పిన యుగముల గురించి ప్రక్కకు పెట్టి, దేవుడు చెప్పిన ధర్మములకు వ్యతిరేఖముగా చెప్పుచున్నారు. దేవుడు చెప్పిన నాలుగు యుగములు వరుసగా వెయ్యిసార్లు జరిగితే ప్రపంచము ప్రళయము అవుతుంది అన్న భగవద్గీత సూత్రాన్ని ప్రక్కకు పెట్టేసి, ఇంకొక ఐదవ యుగమును తెచ్చిపెడితే దానిని ధర్మమనాలా అధర్మమనవలెనా? దేవుడు చెప్పిన దానికి వేరుగా వున్నది అధర్మము కదా! కృష్ణుడు భగవద్గీతలో అక్షరపరబ్రహ్మ యోగములో ఒక శ్లోకాన్ని చెప్పితే, ఆ శ్లోకాన్ని ప్రక్కకు పెట్టి, మీరు మరొక యుగము పేరు చెప్తే అధర్మము కాదా! అయితే నేను అధర్మము ప్రచారము చేస్తున్నాను అని తెలియకుండానే అధర్మాన్ని ఆ వ్యక్తి ప్రచారము చేస్తున్నాడు. యుగములపేర్లు ఆ విధముగా చెప్పటము అధర్మములే కానీ అతను చెప్పిన ధ్యానం చేయటం అధర్మము ఏ విధముగా అవుతుంది? అని మీరు అడగవచ్చును. సరే మంచి పద్ధతే, ధ్యానం చేస్తే ఏమవుతుంది ధ్యానమునకు మారు పేరేమిటి? ఒక్క దానిమీద ధ్యాస పెట్టి ధ్యానిస్తే ఏమవుతుంది, తపస్సు అవుతుంది.

భగవద్గీతా శాస్త్రములో ఒక్కదాని గురించి ధ్యానిస్తే తపస్సు అవుతుంది అని చెప్పాడు. ఇంకా బాగా అర్థమవ్వాలంటే ఒక విషయము చెపుతాను. ఉదయం లేచిన తరువాత పని ఒకటి చేస్తుంటే ఆలోచన

www.thraithashakam.org

ఇంకొకటి ఉంటుంది. ఉదాహరణకు మిరప కాయలు కావాలి అనుకుంటాము. ఆ మిరపకాయలు అక్కడ ఉన్నాయిలే అని తెలిసిన తరువాత ఆ మిరపకాయల ధ్యాస పోతుంది. ఆ పప్పుకు తయారు చేసిన తరువాత నేను డ్యూటీకి వెళ్ళాలి కదా, అని డ్యూటీ జ్ఞాపకము వస్తుంది. ఫలానా ఫైలు నేను ఇప్పుడు పూర్తి చేయాలి కదా! అని ఆ ఫైల్ గుర్తుకు వస్తుంది. ఈ విధముగా మనిషి ఏ క్షణములోనైనా ఆలోచించకుండా ఉంటున్నాడు అంటే **"నహికశ్చిత్ క్షణమపి"** ఏ ఒక్క క్షణము కూడా ఊరకనే ఉండక యోచన చేస్తున్నాడు అని భగవద్గీతలో కృష్ణుడు చెప్పెను. ఒక్కక్షణం ఊరకనే ఉన్నాడు అంటే నిద్రలో ఉన్నాడు అని అర్థము. మెలకువలో ఉన్న ప్రతీ క్షణము మనిషి ఆలోచిస్తూనే ఉన్నాడు. బయట పనులు కూడా ఆ విధముగానే ఉంటాయి కూడా. ఒక్కసారి పరీక్ష కొరకైనా కండ్లు మూసుకొని కూర్చోండి, ఒక ఆలోచన వస్తుంది, రెండో ఆలోచన వస్తుంది, అమ్మో! మనము ధ్యానంలో ఉన్నాము ఆలోచనలు రాకూడదు అనుకుంటారు. అంటే ఒక గురువుగా ఉండే వ్యక్తి ఒక మంత్రాన్ని ఇస్తాడు. ఆ మంత్రాన్ని ఆ వ్యక్తి జపించుకుంటూ కూర్చుంటాడు. కానీ లోపల ఆలోచనలు మాత్రము ఇంకొకటి వస్తూ ఉంటుంది. ఇదేమిటి నేను నమఃశ్శివాయ, అని జపించాలి కదా! మరి నాకు ఇన్ని ఆలోచనలు వస్తున్నాయేంటి అనుకుంటాడు, మరల నమఃశ్శివాయ అంటే ఇంకొక ఆలోచన వస్తుంది, ఒకటి తీస్తేనే ఇంకొకటి వెంటనే వస్తున్నది అంటే కదిలే చక్రంలాంటిది. ఒక సగభాగము కనిపిస్తే, రెండవ భాగము క్షణంలో కనిపించినట్లు. ఒక యోచనపోతే, ఇంకొక యోచన రావటము సహజమైన ధర్మము.

ప్రతీ మనిషి శరీరములో ఉండే సిద్ధాంతమిది. నువ్వు ఏ పని చేస్తున్నావో అవసరము లేదు. కానీ నువ్వు ఏ ఆలోచనలు నాకు రాకుండా

ఉండాలనుకుంటే మరి కొద్ది వేగంతోనే ఆ యోచనలు వస్తుంటాయి. ఇంకా కొద్ది ప్రయత్నము చేస్తే ఒక్క దానిపైన ఒక నిమిషము ధ్యాస వుంచితే వెంటనే ఇంకొకటి వస్తుంది కానీ మొదటి దానికి, రెండవ దానికి మధ్యలో గ్యాప్ ఉండదు. రకరకములైన ధ్యానములు అన్నీ మనస్సుపైనే ఆధారపడి ఉన్నవి కదా! అందుకే వేమనగారు **'కూర్చుండి మేపిన కుందనపుగడ్డి',** అది పొలంలో కనిపిస్తుంది. ఒక మొక్క ఉంటుంది, దానికి ముందు వేరులాంటిది భూమి పైన ప్రాకి దానికి ఒక రెమ్మ, ఆ రెమ్మకు ఇంకొక రెమ్మ ఈ విధంగా భూమిలో వల మాదిరిగా ఉంటుందది. **"ఇనుమును చేసిన మైనపు కడ్డీ",** మైనముతో చేసినది వంగుతుంది. ఇనుముతో చేసినదైతే గట్టిగా ఉంటుంది. చాలా మెత్తగానూ ఉంటుంది. అంటే ఒక్కోసారి మనిషి గట్టిగా, ధైర్యముగా ఉన్నట్లుంటాడు. ఒక్కోసారి మెత్తగా వంగిపోతాడు అంటే మనుసు చాలా కఠినమైనది, చాలా మెత్తనిది. చూడండి మీరు ఎంత కఠినాత్ములైనా సరే ఒక్కోసారి విషయములో మెత్తగా మారిపోతారు. ఇది అందరికీ అనుభవమే.

ఈ విధముగా దేవుణ్ని గురించి తెలుసుకునే పద్ధతులలో చాలామంది ఒక మంత్రము చెప్పి కూర్చొని ధ్యానము చేసుకోమంటారు, లేకపోతే ఇంకొకటి చేయమంటారు. ఈ పద్ధతులల్లో వాస్తవమైన పద్ధతేది దేవుణ్ని తెలుసుకునేందుకు? ఎప్పుడైతే నీకు ప్రశ్నలేని జవాబు ఉంటుందో అది నిజమైన జ్ఞానము. ఒక వ్యక్తి అంటాడు "మనం ధ్యానం చేస్తే మనమంతా భగవంతులమవుతాం" అన్నాడు. అసలు భగవంతుడంటేనే అర్థము తెలియదు అతనికి. భగవంతుడేమి చెప్పినాడు నన్ను తెలుసుకునేందుకు ఈ మార్గములేవీ పనికిరావు అని భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగములో 48వ శ్లోకములోను, 53వ శ్లోకములోనూ స్పష్టముగా చెప్పాడు.

అంటే ధ్యానము పనికిరాదు, వేదాధ్యయనము పనికిరాదు, యజ్ఞములు పనికిరావు అని చెప్పెను. కానీ ఏవైతే పనికిరావు అని చెప్పెనో, వాటినే మనము తీసుకొని చేస్తున్నాము. కావున మన దారి తప్పుదారి. సర్వసాధారణముగా అందరిలో ఒక్క క్షణమైనా ఆలోచనలో లేకుండా ఉండలేకపోవటము జరుగుతూ ఉంటుంది. అంటే నీకు తెలిసిగానీ, తెలియకగానీ నీకు ఒక దానిపైన ధ్యాస ఉంది, ఆ ఒక్క దానిపైన పోతే ఇంకొకటి వస్తుంది దీనిని ఏమంటామంటే ధ్యాస ఒకదానిపైన ఉంది అంటాము. ఒక్కదానిపైనే ధ్యాస ఉంది అనే దానిని ఇంకొక విధముగా చెప్పాలంటే "ఏకధ్యాస" అంటాము. ఎంతసేపంటే ఒక్క క్షణములో ఒక ధ్యాస. సమయమంతా ఒకే ధ్యాస ఉంటుందని నమ్మకము లేదు. కానీ నేను ఏమి చెప్తున్నానంటే మీకందరికీ జరిగే పరిస్థితి ఇది. కానీ మేము మోకాలిపైన ధ్యాస పెట్టుకుంటాము, దానినే ధ్యానం అని అంటాము. మోకాలిపైన ధ్యాస పెట్టుకోమని ఒక గురువు చెప్పాడు నాకు. చూడు నీకొక రహస్యము చెప్పుచున్నాను. మోకాలిపైన ధ్యాస పెట్టుకో నీకు మరేమీ అవసరము లేదు అని చెప్పాడు. అప్పుడు నేను మోకాలిపైన ధ్యాసపెట్టుకుంటే నాకు ఇంకొక స్థలములో యోచన వచ్చేది. మళ్ళీ అక్కడనుండి తెచ్చి మోకాలివద్ద పెట్టాను, మరొకటి జ్ఞాపకము వచ్చింది నాకు అని అంటారు.

మన శరీరములో మనస్సు అనేది ఒక భాగము. దాని యొక్క పనే ఇది. శరీరములో జీవాత్మవైన నీవుకాక 24 భాగములు ఉన్నాయి. అందులో ముఖ్యమైనది మనస్సు. ఆ మనస్సు చిన్నప్పటినుండి ఏదో ఒక ఆలోచన నీకివ్వటమే దానిపని. మోకాలిమీద ధ్యాస ఉంచిన క్షణము నిన్న 100 రూపాయలు ఇవ్వవలసినవాడు 90 రూపాయలే ఇచ్చాడే, 10

రూపాయలు సాయంత్రము వెళ్ళి తెచ్చుకోవాలి అని నా ధ్యాస పది రూపాయల మీదకు పోయి మరలా మోకాలిపైకి వచ్చింది. ఈ విధంగా రకారకాలైన ధ్యాసలు వస్తూ ఉంటాయి. ఈ విధముగా ఐదు సంవత్సరాలు నేను ప్రాక్టీస్ చేసి, కష్టపడి, ఎన్ని ఆలోచనలు వస్తున్నా, వద్దువద్దని చెప్పి మనస్సును మోకాలిపైన పెట్టగలిగాను అని అనుకుని నేను జయించాను మనస్సును అని అనుకున్నాడు. ఎందుకంటే 10 సం॥లు కష్టపడి సంపాదించాను ఆ ధ్యాసను, ఇంకెవరో గురువులాంటివాడు ఒకడొచ్చి, మీరెన్ని సంవత్సరములు ఈ ధ్యాసను చేస్తున్నారు అని అడిగాడు. నేను మా గురువుగారు చెప్పినట్లు పది సంవత్సరములనుండి ధ్యానం చేసి మనస్సును మోకాలిమీదే పెట్టి దానిని జయించాను నేను ఇప్పుడు కనీసము ఒక్క అరగంట వరకు ఆ విధముగానే ఉండగల్గుతున్నాను అని అన్నాడు. అయితే నీవు సాధించిన ఘనకార్యమేమి? అని అడిగాడు. ఘన కార్యమేమిటి అంటావేంటి, పది సంవత్సరాలనుండి కష్టపడి నా మనస్సును నా మోకాలిపైన పెడ్తే ఘనకార్యమేమి అంటున్నావు ఏంటి అని అడిగితే, ఆ వ్యక్తి మరలా ప్రశ్నిస్తున్నాడు.

మనస్సు ఎప్పుడైనా ఒక దానిమీద ఉంటుందా, రెండింటిమీద ఉంటుందా? చూడండి ఒక దానిని విడిచిపెట్టితేనే, రెండవ దానిమీదకు ఆ మనస్సు పోయేది, ఒకేసారి రెండింటిపైన మనస్సును ఉంచలేము, ఎట్లామారినా ఒకదానిమీదే కదా ఉంటుంది. నువ్వేమి చేశావు ఇప్పుడు, ఈ విధంగా మారే మనస్సును, మోకాలిమీద పెట్టావు మరి అది కూడా ఒకటేకదా అన్నాడు. మనస్సు ఏక క్షణములో ఏక వస్తువు, ఏక ఆలోచన మీదే ఉంటుంది అనేది సూత్రము. ఆ సూత్రము ప్రకారము నీ మనస్సు కూడ ఒక్క దానిపైనే ఉంది కదా! నీవు మోకాలి మీద నీ మనస్సు ఉంది

www.thraithashakam.org

కానీ దేవునిపైన ఉందా అని అడిగాడు. దేవుని మీద లేదన్నాడు. మరి మోకాలి మీద నీ ధ్యాస పెట్టుకుంటే నీకు మోకాలు తెలుస్తుంది కానీ దేవుడు తెలియడు కదా! అన్నాడు. కనుక దేవున్ని తెలుసుకోవాలంటే ఏమి చేయాలి? పుట్టినప్పటినుండి నీ మనస్సుకున్నది ఏకధ్యాసే కదా! మార్చుకున్నా ఒక్కటే, మార్చినా ఒక్కటే! ఒకడు పకోడా తింటున్నానన్నాడు, ఇంకొకడు అన్నము తింటున్నానన్నాడు, ఇంకొకడు ఇంకొకటి తింటున్నానన్నాడు. ఏదైనా తిండే కదా! ఏదైనా ఆహారము తీసుకున్నాడు కదా! ఏదో తీసుకున్నది కాదు, ఏదీ తీసుకొనని స్థాయి కావాలి తినే స్థాయి కాదు అని చెప్పాడు. నువ్వేమి అంటున్నావు అంటే అందరూ అన్ని రకాలు తింటున్నారు, నేను మాత్రము పది సంవత్సరాలనుండి బజ్జీలే తింటున్నాను, మరొక దానిపైన ధ్యాసలేదు అంటే బజ్జీలైతేనేమి, ఇంకొకటైతేనేమి కడుపునిండా తింటున్నావు కదా! అంటే ఇందులో ఏముంది వాడు మార్చి మార్చి తింటున్నాడు. నువ్వు ఒక్కటే తింటున్నావు అంతే తేడా! పొట్టకు ఆహారము కావాలి అంతే, నువ్వు ఏమి తింటావు అనేది సమస్యకాదు, నువ్వు పైకి బజ్జీలు అని పేరు పెట్టుకోవచ్చు కానీ కడుపుకు మాత్రము ఆహారమే.

ఆ విధముగానే నీ మనస్సుకు ఏదో ఒకటి పైన ధ్యాస పెట్టుకుంటున్నావు తప్ప, అదియును చిన్నప్పటినుండీ, ఏదీ పెట్టుకోకుండా ఉన్నావా? ఇదంతా మీరు మాకు ఎందుకు చెప్తున్నారు? అని మీరు నన్ను అడగవచ్చును. దేవుని జ్ఞానమునకు దీనికి ఏమి సంబంధము? అని ప్రశ్నించవచ్చును. మనము దేవుని జ్ఞానము తెలుసుకోవాలంటే బయట ఎన్ని విధాలుగా ప్రయత్నించినా అర్థముకాదు. నీ లోపల పరిశోధన చేస్తేగానీ తెలియదు. ఈ శరీరము లోపల పరిశోధన చేస్తే ఏమి తెలుస్తుంది

అంటే, శరీరములో ముఖ్యమైనది మనస్సు అని తెలుస్తుంది ఆ మనస్సును నియంత్రించాలని కొందరు ఏమి చేశారంటే రకరకాల ధ్యానాలు, రకరకాల పద్ధతులు నేర్పిస్తూవున్నా, ఒకటి తీసి ఇంకొకటి పెట్టటం అనే పనిని చేస్తున్నారు గానీ మరొకటి కాదు.

తిరుపతిలో ఒక వ్యక్తి 30 సంవత్సరములు నమ:శ్శివాయ అనే జపంచేసి, నేను ఏకంగా నమ:శ్శివాయ అనే దానిపైనే ధ్యాస పెట్టుకొన్నాను అన్నాడు. అప్పుడు మేమేమన్నామంటే నీకు ఒక మంత్రము ఎవరో చెప్పి ఉంటే చెవి ద్వారా విన్నావు, నువ్వు విని, ఆయన చెప్పినది జ్ఞాపకము పెట్టుకొని జపిస్తున్నావు అంటే అన్ని ధ్యాసలు విడిచిపెట్టి ఏకధ్యాసకు వచ్చినావు నువ్వు. ఏకధ్యాస వచ్చిన తరువాత ఏమైంది అంటే, నువ్వు దానిని కరుచుకుని ఉండిపోయావు. 30 సంవత్సరములనుండి నమ:శ్శివాయ అని ధ్యానం చేస్తున్నావు నీకు దేవుడు తెలిశాడా? అంటే తెలియలేదు. అంటే 30 సం॥లు జపము చేసిన నువ్వు, 3 సంవత్సరముల పిల్లవాడు ఒక్కటే. ఎందుకంటే ఏదో దానిపైన ధ్యాస ఉండటం అందరికీ సహజము. నీవు చేసింది ఇప్పుడు ఏకత ధ్యానమే తప్ప ఏమీకాదు అన్నాము. ఇప్పుడు సమాజములో అధర్మాలు పెరుగుతున్నాయని తెలిసిపోతూ ఉన్నది. ఎందుకంటే శ్రీకృష్ణుడు చెప్పినాడు, ఎప్పుడైతే అధర్మాలు చెలరేగుతాయో అప్పుడు నేను పుట్టి మరలా జ్ఞానము చెప్పాల్సి ఉంటుంది.

ద్వాపరయుగము చివరిలో చాలామంది మహర్షులున్నారు, స్వాములున్నారు. వారంతా యజ్ఞాలు, యాగాలు చేస్తున్న రోజుల్లో దేవుడు భూమిమీదకు వచ్చి, ధర్మాలు తెలియజెప్పాల్సిన పని వచ్చింది. ద్వాపర యుగములోనే కాక కలియుగంలో ఇంకా అధర్మాలు చెలరేగిపోయినాయి. ఇప్పుడు అధర్మము ప్రచారము జరుగుతున్నది. అధర్మాలు చెలరేగుతున్నాయి.

www.thraithashakam.org

మనము ఇప్పుడు దేవుని సేవ చేయాలంటే, ధర్మములను బయటకు తెలియజేయాలి. చెలరేగుతున్న అధర్మములను ఖండించి చెప్పేదే మన కర్తవ్యముగా ఉండాలి. ఇప్పుడు ధ్యానం చేయి అని అంటే **ధ్యానం వేరు, యోగము వేరు** అని చెప్పవలసిన పని వచ్చింది. ధ్యానం చేస్తే నీ మనస్సు ఒకదానిపైనే లగ్నమవుతుంది. ధ్యానం చేయకుంటే దేవునిలోకి వెళ్తావు. పంచభూతములలో చెవి ద్వారా శబ్దం నుండి వినిన నమ:శ్శివాయ మంత్రజపం నీకు దేవున్ని ఎలా తెలియజేస్తుంది. అందుకే నీవు 30 సం॥ నుండి జపం చేస్తున్నా నీకు దేవుడు తెలియబడలేదు. ఇప్పుడు నీకు ఈ ధ్యాస ఫెవికాల్ బంకవలె అంటుకు పోయింది అది పోగొట్టుకొనుటకు నీకు మళ్ళీ జన్మ కావాలి. మరి దీనికి ఉపాయమేమి, నువ్వు ఏకతా ధ్యానం అని ఏదైతే అనుకున్నావో అది తప్పు పద్ధతి, తప్పుత్రోవ, మాయ అనేది గురువు రూపములో తయారయి అధర్మములను బోధిస్తూ ఉన్నది. ప్రపంచములో కొన్ని వేల సంవత్సరములకు భగవంతుడు భూమిమీదకు వస్తాడు. కానీ ఈ రోజు అందరూ భగవాన్‌లని, అందరూ భగవంతులౌ తారమని అదే విధంగానే పుట్టాము కదా! అనవచ్చును. లేదు, తల్లి గర్భంనుండి మన శరీరాలు పుట్టాయి కాని నేరుగా మనమెవ్వరం ప్రాణంతో పుట్టలేదు.

"భగవంతుడు అంతటా నిండి ఉన్నాడు" అంటున్నారు. భగవంతుడు ఒక మనిషిగా ఒక దగ్గరే ఉంటాడు అంతటా నిండి ఉండడు. కానీ దేవుడు అంతటా ఉండి అన్నీ చూస్తున్నాడు అంటే వాస్తవమే గానీ భగవంతుడు అంతటా చూస్తున్నాడు అంటే వాస్తవం కాదు. అంటే దేవుడు అనే దానికి అర్థము తెలియదు. భగవంతుడు అనే దానికి అర్థము తెలియదు. ధర్మ పరిరక్షణ సంఘము అని పేరు పెట్టుకున్నారు. మేము చెప్తున్న

www.thraithashakam.org

జ్ఞానము ఎంతో వాస్తవము అని ఇతర మతస్థులు చెప్పుకొని అర్థము చేసుకుంటూ ఉంటే, హిందువులు మాత్రము కొందరు ఈయన చెప్పింది ఏమిటో ఏమీ అర్థము కావటం లేదు అనుకుంటున్నారు. **పవిత్ర ఖురాన్** అని పేరుపెట్టుకున్న ముస్లీమ్‌లు వారి ఖురాన్ గ్రంథమును క్రింద కూడా పెట్టరు. క్రైస్తవులు బైబిలును వారు **పరిశుద్ధ** గ్రంథమన్నారు. హిందువుల భగవద్గీత ముందర మాత్రము ఏ హోదా లేదు. మేము భగవద్గీత ముందర **ప్రథమ దైవగ్రంథము భగవద్గీత** అని హోదాను కల్పించి చెప్పాము. మనము భగవద్గీతను గొప్పగా చూసుకుంటున్నాము ఈ రోజు. కానీ మేము వ్రాసిన భగవద్గీత అర్థముకాక త్రైతమును, త్రిత్వముగా అర్థము చేసుకుని, క్రైస్తవ మత ప్రచారము అనుకుని ఆ భగవద్గీతను హిందూ పెద్దలు, ధర్మాన్ని రక్షిస్తామని చెప్పుకుంటున్నవారు, మా భగవద్గీతను నీచముగా చూచిన వారు, కాలితో త్రొక్కిన వారు కలరు. అదే భగవద్గీతను మాకివ్వండి మేము చదువుతాము అని ముస్లీమ్స్ అడుగుతుంటే, భగవద్గీతను హిందువులు ఎంత కించపరిచారో చూడండి.

ధర్మాలు అంటే ఏమిటో తెలియకుండా పోయాయి కొందరికి. భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఏకాగ్రత చెందండి అని చెప్పినాడు. మనస్సును ఏ వైపూ పోకుండా, ఏ ధ్యాస మీదకు పోకుండా, గాలిలేనిచోట దీపం వెలిగినట్లు మనస్సును పెట్టుకో, అప్పుడే నేను నీకు తెలియబడతాను అన్నాడు. ఈ రోజు అధర్మాలు చెలరేగిపోయి ఏకాగ్రతలో అగ్రతను విడిచిపెట్టి, ఏకత మాత్రము పట్టుకొన్నారు. అంటే ఒకదానిమీద కూడా ధ్యాస పెట్టుకోకండి అని ఏకాగ్రత అనే దాని అర్థము తెలుసుకుంటే ఏకత అనేది పోతుంది. ఏకము అనగా ఒకటి అగ్రత అంటే ఒకటిపైన గల సున్న, అదే శూన్యం. నువ్వు సున్నా స్థితికి వెళ్తే నేను తెలుస్తాను. నువ్వు

సున్నా స్థాయికి కాకుండా ఉంటే, నువ్వు ఏకం స్థాయిల్లో ఉన్నట్లే లెక్క. ఒక వ్యక్తికి ముక్కు మీద పుండు పుట్టిందట. నా ధ్యాస అంతా ముక్కుమీద పుండు, దాని బాధమీదే ఉంది అన్నాడట. ఇప్పుడు ముక్కుమీద ధ్యాస పెట్టిన వాడి స్థితీ, నీ స్థితీ ఒకటే కదా! ఇటువంటి పద్ధతులు అధర్మములుగా ఉన్నాయి. కనుక ఇవన్నీ మంచి పద్ధతులు కాదు. దేవునికి సంబంధించిన జ్ఞానము, ధర్మము భగవద్గీతలో సంపూర్ణముగా ఉన్నాయి. దానిని తెలుసుకుంటే మనము ఎంతైనా తెలుసుకోవచ్చును. మనము ఉదయం నిద్ర లేచిన దగ్గరనుండి ఎంత పనిచేస్తున్నాము. ఈ పనుల్లో ప్రపంచపరమైన పనులే చేస్తున్నానా? దేవునికి సంబంధించిన పనులేమైనా చేశానా? అని లెక్కవేయండి.

ఒక వ్యాపారి వ్యాపారము చేసేముందు ఒక ఫోటోకు దండం పెడతాడు, వ్యాపారం అయిన తరువాత సాయంత్రం తిరిగి వస్తాడు. ఉదయమే దేవునికి మ్రొక్కాను కదా! అంటాడు, నీవు మ్రొక్కినది దేవునికా అక్కడ పెట్టిన ఫోటోకా? నువ్వు అక్కడ పెట్టిన ఫోటోకి ఒక ఆకారముంది ఆకారముతో ఉన్నవాడు దేవుడా? దేవునికి ఆకారము లేదు కంటికి కనిపించే వాడు కాదు. నీవు కంటికి కనిపించే వానిని మ్రొక్కి నేను దేవున్ని మ్రొక్కాను అని అంటున్నావు. వాస్తవముగా నీవు దేవునికి మ్రొక్క లేదు. కొందరు నేను జపమాలతో 108 సార్లు జపించి పోతున్నాను అంటారు. ఎన్నిసార్లు అయినా జపించు కానీ ఏమీ జపిస్తున్నావు? **మా గురువుగారు చెప్పవద్దన్నారు. ఎట్లా చెప్పినాడు? నా చెవిలో చెప్పాడు.** చెవిలో చెప్తే కదా! నీకు వినిపించినది. ఇంద్రియాతీతుడు దేవుడైతే నీకు చెవి ఇంద్రియం కనుక ఆ విధంగా వినిపించినది దేవుడు కాదు, వినిపించే ఒక మంత్రము వలన దేవుడు తెలియబడడు. కొందరు సాలగ్రామము ముట్టుకొని అది

దేవుడంటారు. స్పర్శకు అందనివాన్ని నేను అని దేవుడన్నప్పుడు సాలగ్రామము కూడా దేవుడు కాదు. ఇదేమిటి ఏదీ కాకపోతే ఎలాగూ తెలియకపోతే మరి ఏ విధంగా మ్రొక్కాలి? అని మీరడిగితే, మేము దేవునికి మ్రొక్కము అంటున్నాము. దేవుడెవరు? నీకూ అదే ప్రశ్న, నాకూ అదే ప్రశ్న. అది ప్రపంచానికే పెద్ద ప్రశ్న. మరి ఈ ప్రశ్న ద్వారా దేవున్ని తెలుసుకోవాలంటే భగవద్గీతను ఆశ్రయించవలసిందే. అప్పుడు దేవుడెవరో తెలుస్తుంది. భగవద్గీత అంటే చాలామంది వ్యాఖ్యానించిన భగవద్గీతలు ఉన్నాయి. వాటిని చదివాము అని చెప్పుచున్నారు. ఇంకనూ అందులో అంతటా నేను ఉన్నాను, నన్ను ఎక్కడ మ్రొక్కినా అక్కడే ఉన్నాను అని చెప్పెను కదా! అని అంటారు. మరి మేము మ్రొక్కుతున్నది చాలదా? భగవద్గీత ప్రకారమే కదా దేవునికి మ్రొక్కుతున్నది, ఎందుకు మీరింత గందరగోళం చేస్తారు? అని మమ్మల్ని ప్రశ్నించవచ్చును. భగవద్గీతలో ఆయనేమి చెప్పెనో తెలుసునా? నేనంతటా ఉన్నాను, నీవు ఎవరికి మ్రొక్కినా నాకే చేరుతుంది. భద్రాచలం వెళ్ళి మ్రొక్కినా నాకే, తిరుపతికి వెళ్ళి మ్రొక్కినా నాకే చేరుతుంది. ఎందుకంటే అంతటా నేనే కదా ఉన్నాను కానీ నీవు వెళ్ళింది మాత్రము తప్పుత్రోవ, నీ మ్రొక్కులు నాకే వస్తాయి కానీ నీవు మాత్రము ప్రక్కకు పోతావు. "భజంతే అ విధి పూర్వకం" అంటే ఆ విధంగా చేస్తే నీవు దారి తప్పిన వాడివే అని అర్థము. "అన్నీ నాకు చేరుతాయి కానీ నీవు మాత్రము నన్ను చేరలేవు" అన్నాడు. కనుక ఆ విధంగా మ్రొక్కినా కుదరదు.

ఇదేమి ఇతను చెప్పినదంతా హిందుమతమునకు విరుద్ధముగా ఉంది, రామునికి మ్రొక్కవద్దంటారు, ఆంజనేయునికి మ్రొక్కవద్దంటారు అని అనుకోవచ్చును. మరి దైవ గ్రంథాల్లో ఏ దేవుని పేరైనా వ్రాశారా

www.thraithashakam.org

అంటే అదేమీ లేదు. రామున్ని దేవుడందామా అంటే రాముడు పోయి ఇంకొక దేవున్ని మ్రొక్కినాడు. శివలింగానికి మ్రొక్కలేదా, నా సీత దొరికేటట్లు చెయ్యి స్వామీ అని మ్రొక్కినాడు. పోనీ శంకరున్ని దేవుడందామా? అంటే అతను కమండలము చేయి క్రిందపెట్టి, జపమాలతో దేవుడా, దేవుడా అంటున్నాడు. ఒకరోజు పార్వతీదేవి అడిగిందట. ఏమయ్యా! ఈ రోజు శివరాత్రి అని భక్తులంతా నీకు మ్రొక్కుతుంటే, మీరేమో కనులు తెరవకుండా జపం చేస్తున్నారు. కనులు తెరచి చూడండి ఎందరు మ్రొక్కుతున్నారో అన్నదట. అప్పుడు శంకరుడు నేనే దేవుడెవరని అడుక్కు తింటున్నాను. పెళ్ళయింది, పిల్లలు పుట్టారు, దేవుడెవరో ఇంతవరకు నాకు తెలియలేదు. వీరంతా నన్ను దేవుడంటే ఎట్లా అవుతుంది? వారి చావు వారు చస్తారు. నా చావు నేను చస్తాను ఊరుకో అన్నాడట. పద్మంలో కూర్చున్న బ్రహ్మ దేవుడూ అదే పని చేస్తున్నాడు. విష్ణుమూర్తికి యోగం చేసేందుకు చేతి క్రింద యోగదండం అవసరము కనుక ఆయన తన చేతికి యోగదండం బదులు దిండు పెట్టుకుని ఒత్తిడి కలిగించి యోగము చేస్తున్నాడు దేవుడెవరని? ఈ ముగ్గురు ఎవరికొరకైతే ప్రార్థిస్తున్నారో, ప్రయత్నం చేస్తున్నారో ఆ దేవున్ని మనము తెలుసుకునేందుకు ప్రయత్నం చేయవలెను.

విశ్వరూపం చూసిన సమయంలో అర్జునునికి శ్రీకృష్ణుని విశ్వ రూపంలో సకల దేవతలైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వర్లు అందరూ కనిపించారు. విశ్వరూపం చూచి భయకంపితుడై "నీవెవరవు?" అని అర్జునుడు అడిగాడు. విశ్వరూపము చూపించక ముందు కూడా ఇదే మాట అడిగాడు. నువ్వు అంతట ఉన్నాను, క్రింద ఉన్నాను, ప్రక్కనున్నాను అంటున్నావు, ఎట్లు ఉన్నావు? అని అడిగాడు అర్జునుడు. పాండవుల్లో ఉన్నాను, పాండవుల మధ్యముడైన అర్జునునిలో ఉన్నాను అంటే ఏ విధముగా ఉన్నావు, నాకు

www.thraithashakam.org

చివరిగా చెప్పు అని కృష్ణున్ని అడిగిన తర్వాత అతనికి విశ్వరూపం చూపించాడు. చూపించిన తరువాత భయపడిపోయి, "నువ్వెవరు?" అని అడిగాడు. అప్పుడు అతను **'కాలోస్మి' నేను కాలాన్ని** అని అన్నాడు. కాలం మన ముందర కూడా ఉంది. మరి కాలం కనిపిస్తూ ఉందా? లోకంలో వృద్ధి చేసేవాడిని నేనే, క్షయం చేసేవాడిని నేనే అన్నాడు. అటువంటి దేవున్ని నీవు తెలుసుకోవాలంటే నిన్ను నీవు ముందు తెలుసుకో అప్పుడు నీకు దేవుడు తెలియబడుతాడు. మరి దేవున్ని తెలుసుకోవాలంటే ముక్కుమీద ధ్యాస, శ్వాస మీద ధ్యాస వలన సాధ్యం కాదు. కనుక మనమిప్పుడు ఏమి చేయాలి? ఆ విషయాలు భగవద్గీత చదివితే, దానిలో కర్మ సిద్ధాంతము తెలిస్తే, అదే విధంగా మనస్సును ఏమీలేని స్థితి అయిన ఏకాగ్రం చేస్తే, దేవుడు తెలియబడతాడు అనే విధానమొకటి తెలుస్తుంది. లేదు నేను మనస్సు జయిస్తానని కూర్చుంటే నాకు సంసారం ఎలాగు గడుస్తుంది? అని అంటే, అలా ఏమీ కూర్చోకుండా, అన్ని పనులు నీవు చేసుకో, చేస్తూ దేవున్ని తెలిసే విధానమొకటి ఉన్నదని నీకు తెలుస్తుంది.

కనుక ఇప్పటినుండి ఒకవేళ నీవు పుట్టినరోజు పండుగ అంటే జల్సాగా తినటం, త్రాగటం కాదు. నిన్ను పుట్టించిన వానిని గూర్చి తెలుసుకునే ప్రయత్నం చేయండి. నీ తండ్రి ఎదురుగా నీకు కనిపించే వాడు కాదు. అందరికీ తండ్రైన వాన్ని తెలుసుకో, మనము పెళ్ళి అంటే దేవున్ని తెలిపే విధానమే అందులో ఉందని **"ఇందూ సాంప్రదాయములు"** అనే గ్రంథములో వివరించి ఇక్కడ జరుగుచున్న పెళ్ళిల్లన్నీ ఆ విధంగానే శాస్త్రబద్ధముగా చేస్తున్నాము. ఈ విధంగా ఇంకెక్కడా చేయటం లేదు అని ఖచ్చితంగా చెప్పవచ్చును. నీకు, నీ కొడుక్కి, నీ మనుమనికి, నీ మనువని కొడుక్కి తండ్రి ఒకడున్నాడు అతనే దేవుడు. తల్లి ఎవరు ప్రకృతి. వారిద్దరు

ఉన్నారని తెలిస్తే నీకు జ్ఞానము ఉత్పత్తి అవుతుంది. మేము ఇక్కడ ఒక బోర్డు పెట్టాము. అందులో "నీ అడ్రస్ నీకు తెలుసునా?" అని వ్రాశాము. ప్రపంచ సంబంధమైన అడ్రస్ కాదు. జీవాత్మగా నీ అడ్రస్ ఏది? అని దానర్థము. నీ అడ్రస్ నీ శరీరములోనే కలదు. నువ్వున్నది రవ్వంత, అదీ నీ తలలో, గుణచక్రములో అని తెలుసుకో. కనుక జ్ఞానాన్ని తెలుసుకుంటూ ముందుకు వెళ్ళాలని మీకు తెలియజేస్తున్నాము.

## 18. ధర్మము - అధర్మము

తేది : 16.05.2009

ధర్మము అనే దానికి ఇంతకు ముందు నిర్వచనము చెప్పుకున్నాము. నిబంధన అని చెప్పినా ధర్మమే అగును. బంధన అంటే కట్టి వేయబడేది అని అర్థము. నిబంధన అంటే కట్టివేయనిది అని అర్థము. అంటే ఏ బంధనము లేనిది. ఏ బంధనములు లేనటువంటిది నిబంధన అంటాము. ధర్మము అన్నా అవే అర్థములు వచ్చును. ధర్మము, అధర్మము అనే పదములు భగవద్గీతలో చాలాచోట్ల వచ్చినవి. ధర్మము అంటే బంధనము లేనిదైతే, అధర్మము బంధన కల్గినటువంటిది అనే నిర్వచింపవచ్చును. ఖండింప బడనిది ధర్మము, ఖండింపబడేది అధర్మము. మనకు ఖండింపబడనిది, కొట్టివేయబడనిదైన ధర్మమే కావాలిగానీ ఖండింపబడునది ఎంత పెద్దదైనా మనకి అవసరము లేదు. ఒక ఊరిలో బక్కచిక్కినవాడు ఒకడున్నాడు, శరీర దారుఢ్యము కల్గినవారు పదిమంది ఉన్నారనుకుందాము. ఈ పదిమంది, బక్కచిక్కిన వాడి ముందర తాము గొప్పవారిమనుకునేవారు, ఎందుకంటే వారి ముందర బక్కచిక్కినవాడు చిన్నగా కనిపిస్తుంటాడు కదా! ఈ బక్కచిక్కిన వాడికి మర్యాద ఇచ్చేవారు కాదుగానీ, ఈ పదిమంది శరీర

దారుఢ్యము కల్గిన వారికి మాత్రము అందరూ విలువ ఇచ్చేవారు. ఊదితే గాలికి ఎగిరి పోయేవాడు మాకెంత అని వీరంతా అనుకునేవారు. ఏదో చిన్న పేచీ, సంఘర్షణ వచ్చింది. ఈ బక్కచిక్కినవాడికి, బలమున్నవాడికి, ఈ విధముగా పేచీ రావటము వలన పోట్లాడుకున్నారు. బలమున్నవాడు ఏమనుకున్నాడు, బక్కచిక్కినవాడు నాకెంత అని అనుకుంటాడు. బక్కచిక్కిన వాడికి మాత్రము ధైర్యము ఉంది. వాని బయటకు కండలు ఏమీ కనిపించ టము లేదుగానీ ధైర్యముగా పోట్లాడినాడు, అంటే మీకింతకముందే చెప్పాను, కండల బలముకంటే నరాలబలము ఎక్కువ అని, నరములనుండే కండలకు బలము పోయేది, కండలకు బలమేమీ ఉండదని చెప్పాము. కండలు నీవు చూసేందుకు అందంగా ఉంటాయిగానీ, కండలకు బలము ఉండదు. కండలకు బలము నరాలనుండే వెళ్ళాలి. నరములలో ఏ శక్తి ఉంది, ఆత్మ శక్తి ఉన్నది. ఈయనకేమో, కండలు లేవు ఉత్త నరాలే ఉన్నాయి, ఆ శక్తేదో ఈయనకి ఉంది. నరాలలో శక్తి, కండలలో తిరిగి, ఆ విధముగా మారేకంటే ప్రత్యక్షముగా బక్కచిక్కినవాడికి ఉండటము వలన, బక్కచిక్కిన వాడే ఆ పోరాటములో గెలిచెను. మిగతావారు కూడా పోరాడినారు వారికి అదే గతి పట్టింది. ఇక్కడ బలము ముఖ్యముగానీ, కండలు, శరీరము ముఖ్యమా? కండలు ముఖ్యము కాదు, బలము ముఖ్యము. బలము ఎవరికుంది బక్కచిక్కిన వాడికే ఉన్నది. ఈ విధంగా పదిమంది ఓడిపోయి ఒక్కడు వారిపైన గెలిచినాడు.

ఈ విధముగా బక్కచిక్కినవాడని, శరీర దారుఢ్యము కల్గినవారని ఏ విధముగా ప్రపంచములో లెక్కలో ఉన్నదో అదే విధముగా ధర్మము బక్కచిక్కుకు పోయింది, బలహీనముగా ఉన్నట్లు కనిపిస్తూ ఉంది. అంటే బక్కచిక్కుకు పోయినట్లు ధర్మము కనిపిస్తూ ఉంది కానీ వాస్తవముగా అదే

బలమైనది. కండలు తిరిగి అందంగా, బలముగా ఉన్న మనుషుల్లాగ అధర్మములు కనిపిస్తున్నవి. కానీ ఆ అధర్మములో పసలేదు. ఏ విధముగా బలముగా ఉన్నట్లు కండలు తిరిగి ఉన్న మనుషులు ఆయాసము వచ్చి, అలసి క్రిందపడిపోయినట్లు అధర్మము ఎప్పటికైనా క్రిందపడాల్సిందే, ఓడిపోవాల్సిందే! బక్కచిక్కినవాడు, కండలున్నవారిని గెలిచినట్లు టీవీలో స్పోర్ట్స్ ఛానల్‌లో రెజిలింగ్ క్రీడలో గెలిచేది ఎక్కువమంది బక్కపలచగా ఉన్నవారే. కండలు తిరిగి, శరీర దారుఢ్యము కల్గిన వ్యక్తులు వేగంగా అలసి క్రిందపడిపోవటము మనము చూస్తూనే ఉందుము. దీనిని మీరు ఒక్కసారి గమనించండి.

ఈ మధ్య 'మా టీవీ'లో నామాలు పెట్టుకున్న ఒక స్వామి చెప్తుంటే విన్నాము. అతను ఏమంటాడంటే, మీరనుకున్నట్లు ఆత్మ శరీరమంతా ఉండదు. కొంతమాత్రమే ఉంటుంది అని చెప్తుంటే, ఇదేదో బాగుంది, ఆత్మను గురించి ఎవ్వరూ చెప్పటము లేదు, ఈయనేదో చెప్తున్నాడు అనుకున్నాను. ఆత్మ శరీరమంతా ఉందని చాలామంది అంటున్నారు. అనేదేముంది, అలా అనేవారిలో మేమూ ఉన్నాము. ఆత్మ అనేది వెడల్పు అయ్యేది, పొడవయ్యేది ఏమీ ఉండదు. అది ఎప్పటికీ ఒకేలా ఉంటుంది అంటున్నారు. ఒకవేళ ఒక మనిషి చనిపోయి, అతని ఆత్మ ఇంకొక చిన్నదైన శిశుశరీరములోకి వెళ్ళాలంటే, ఇంత పెద్ద ఆత్మ ఏ విధముగా పడుతుంది, ఆ శరీరములోకి పట్టదు కదా! అని అంటున్నారు. ఆ విధముగా మళ్ళీ చిన్నగా మారుతుందా, మారదు కదా! అంటున్నారు. కనుక ఆత్మ అనేది చాలా చిన్నది, ఏ శరీరములోకి చేరినా ఆ శరీరముకంటే చిన్నదిగానే ఉంటుంది అని చెప్పుచున్నారు. అయితే ఈయనిప్పుడు జీవుని గురించి చెప్తున్నారా? ఆత్మ గురించి చెప్తున్నారా? అంటే ఆయన లెక్కలో జీవుడు, ఆత్మ ఒక్కటే.

www.thraithashakam.org

చూడండి అంత పెద్ద స్వామీజీ పదిహేను నిమిషములు చెప్పినన్నూ, జీవాత్మ ఆత్మ వేరువేరు అని చెప్పకుండా జీవుడ్నే ఆత్మ అని అనుకుని మరలా జీవుడు అని చెప్తున్నారు. మొదట శరీరమంతా ఆత్మలేదని, ఆత్మ గురించే చెప్పారు కదా! మరలా జీవుడు అని దీనిని అన్నట్లు, చివరి వరకు ఆత్మ అనే పదముతోనే ప్రసంగాన్ని కొనసాగించవచ్చు కదా! మరలా జీవుడెట్లు వచ్చినాడు. ఒకచోట జీవుడంటారు, ఒకచోట ఆత్మ అంటారు. మళ్ళీ జీవాత్మ, ఆత్మ ఒక్కటే అంటారు. రెండింటినీ కలిపి ఒకటే అంటారు. చెప్పేవాడు నిర్ధిష్టముగా చెప్పటము లేదు. వినేవాడు గందరగోళం అయిపోవును. మనకి తెలుసు కనుక మనము రెండు వేరువేరు అని తేల్చివేశాము. అది తెలియనివారికి ఏమర్థమవుతుంది, రెండు వేరువేరు అనికొందరు అర్థము చేసుకుంటే, రెండు ఒక్కటే అని కొందరు అనుకొని సందిగ్ధములో పడిపోవుదురు. ఈ విధముగా జ్ఞానము తెలియని విధానము అవుతుంది. జీవుడనేవాడు ఎప్పుడూ ఒకే విధముగా ఉంటాడు. ఏ శరీరములోకి వెళ్ళినా అంతే ఉంటాడు. కానీ ఆత్మమాత్రము ఎంత వెడల్పయినా ఉంటుంది, ఎంత పొడవైనా ఉంటుంది. శిశుశరీరములో ఎంత పరిమాణములో ఉండాలో అంతే ఉంటుంది. ఆ ఆత్మ పెంచితే శరీరము పెరుగుతూ ఉంటుంది. మరణించినప్పుడు ఆత్మ అంతా ముకుళించుకుని, బ్రహ్మనాడిలోకి పోయి, కాల, కర్మ, గుణచక్రములలో మధ్యలో నిలిచిపోతే, ఈ చక్రముతో లేచి బయటకు వస్తుంది. జీవాత్మతో సహా ఆత్మ ఇంత విధానముతో లోపల ఉందని తెలిస్తే సరిపోతుంది, లేకపోతే చెప్పేవారికి అర్థము కాదు, వినేవారికి అంతకు అర్థము కాదు. ఈ విధముగా చెప్పటము అజ్ఞానము.

ఈ విధముగా ఇంత పెద్ద స్వామీజీ రెండింటినీ ఒకటే అని చెప్పటము అధర్మము కాదా? ఇంకొక స్వామీజీ మనస్సును గురించి చెప్తు,

మనుసుని కట్టివేయవచ్చు, పట్టివేయవచ్చు, మోకాల్లో బిగించవచ్చు, మోచేతిలో బిగించవచ్చు అంటున్నారు. మనము చెప్పునదేమనగా! మనస్సు అనేది మెలకువలో శరీరమంతా వ్యాపించి ఉంటుంది. నిద్రలో కేవలము ఒక్క చోటికిపోయి, ఒక బిందువుగా తయారవుతుంది. క్రొత్త శరీరము వచ్చినప్పుడు క్రొత్త మనస్సు వస్తుంది. శరీరము పోయినప్పుడు శరీరముతో పాటు మనస్సు పోతుంది. ఆ విధముగా మనస్సు శరీరమంతా వ్యాపించటము వలననే మనకు స్పర్శ తెలిసేది. మనస్సు అనేది ఎవరికీ కనిపించేది కాదు, దానిని ఎవ్వరూ పట్టుకోలేరు అని మనము చెప్పుకుంటూ వచ్చాము. ఈ విధానమంతా మనము చెప్పటము ధర్మము. కానీ కొందరు విధానమేమో తెలియకుండా, మనము చెప్పిన మాటలను కాదంటున్నారు. ఇటువంటిదే, ఇంకో మాట ఏకత, ఏకాగ్రత. ఏకత అంటే ఒకటని, ఏకాగ్రత అంటే ఒకటి మీదకంటే పెద్దది అంటే శూన్యము, సున్నా అని అర్థము. వేమనయోగి కూడా **ఊరకుండువాడు ఉత్తముడు**, అంటే ఒకటి కూడా పెట్టుకోకుండా అంటే ఏమీ లేని స్థితిలో ఉన్నవాడే ఉత్తముడు, అంటే యోగి అనేవాడు ఒకదానిపైన దృష్టిపెట్టాలి, చుక్కపైన (బిందువు పైన) ధ్యాస ఉంచాలి ఇలాంటివి కాకుండా, ఏమీ లేని అంటే ఏకాగ్రంగా ఉంటేనే అసలైన యోగములో ఉండటము అని వేమనయోగి ఆయన పద్యములో చెప్పెను.

ఏదో ఒకటే పట్టుకుంటే, అందులోనే అతను ఉండిపోతాడు. మంత్రము చెప్పేవాడు మధ్యముడు అని చెప్పాడు. అది కాకుండా నీవు ముక్కుమీద ధ్యాస, మూతిమీద ధ్యాస పెట్టుకుంటే ఆ ముక్కు, మూతి దగ్గరే నీవు ఉండాల్సిన పని వస్తుంది అని ఉన్నది ఉన్నట్లు చెప్పితే, మమ్ములను అసూయగా మాట్లాడినారు అని అంటున్నారు. అసూయగా

మాట్లాడవలసిన అవసరము మాకేమి వచ్చింది. మనిషి జ్ఞానము తెలుసుకుని, ఉన్నత స్థానానికి పోవాలి, దేవున్ని తెలుసుకోవాలి అని చెప్తే, నీకు ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించవద్దు అని చెప్తే, మా ముఖాన మసిపోసినట్లు చెప్పారు, మా ముఖమున పేడ జల్లినట్లు చెప్పారు అంటే, నీవు దొంగవు కనుకనే దొంగ అనే పదము అనాల్సి వచ్చింది. అవమానించినట్టు మాట్లాడినారంటే ఎక్కడ మాట్లాడినాము? ఉన్న విషయాన్ని చెప్పాల్సివచ్చింది, చెప్పాము అంతే! మీరు అధర్మములో ఉంటే విరుద్ధముగానే ఉంటుంది. ఇప్పుడు శరీరములో ఉన్న మనస్సు ఈ విధముగా ఉంటుంది అని చెప్పాము. అంతే కాదా! చెప్పండి. మనస్సును అంతా ఒక దగ్గరే పెట్టాము అంటున్నారు. దేవుడి మీద పెట్టినారా? శరీరము భాగముమీద పెట్టినారా? అని అడిగాము. "ధ్యానములో విలువ ఏమీ తెలియదు, ధ్యానములో ఆనందము మీకు తెలియదు" అని వారు అంటున్నారు. నీకు ఆనందము కావాలా? దేవుడు కావాలా? దేవుడు కావాలంటే ఆయనను తెలుసుకునే ధర్మాలున్నాయి. వాటిని తెలుసుకుంటే సరిపోతుందికానీ అధర్మము ప్రకారము నడుచుకుంటే దేవుడు తెలియబడడు. అధర్మము అనేది చాలామందిలో హత్తుకుని ఉన్నది. చిన్నచిన్న వారే కాకుండా పెద్దపెద్ద స్వామీజీలలో కూడా హత్తుకుని ఉన్నది. పేరు ముందర గురువు అని తగిలించుకునే వారిలో ఇంకా గట్టిగా హత్తుకుని ఉంది అధర్మము.

అదేంటది గురువు అనే పేర్లు పెట్టుకున్నవారికి అధర్మము ఉంది అని ఏ విధముగా చెపుతున్నారు? అంటే, గురువెవరు ఈ దేశములో లేడు. ఎన్నోవేల సంవత్సరాలకో, లక్షల సంవత్సరములకో గురువు భూమి మీదకు వస్తాడు. ఇంత విశ్వములో ఒక్కచోట అతనుంటాడు. ఆయన దైవజ్ఞానమును చెప్పిపోతాడు భూమిమీద అంతవరకు గురువు ఉండడు.

మరి వీరంతా ఎవరు? పీఠాధిపతులు, మఠాధిపతులు, హంసలు అని పేరు పెట్టుకున్నవారు, భగవాన్‌లు అని పేరు పెట్టుకున్నవారు, వీరందరినీ ఎవరూ కాదనటము లేదు. నా ధర్మాలు తెలుసుకున్నవారు నావద్దకు వస్తారు. లేకపోతే నావద్దకు రారు అని చెప్పెను కృష్ణుడు. ఆ జ్ఞానము ప్రకారము నడిచేవారు ఎవరున్నారు? మనస్సు, బుద్ధి, చిత్తం అంతా ఒక్కటే అంటారు. జీవున్నే చిత్తము అంటారు, జీవున్నే మనస్సు అంటారు.

ఈ విషయాలు భగవద్గీతలో చెప్పారా? దీనికేమైనా ప్రామాణికము ఉందా? అధర్మాలు చెప్పేవారంతా బలిష్టముగా ఉన్నారు. సమాజములో పెద్దగా గౌరవంగా బ్రతుకుతున్నారు. ధర్మము కనపరాకుండా ఉంది. ఒకవేళ ధర్మము చెప్పేవాడు కనిపించినా వారి ముందర బక్కచిక్కినవాడే! ఈ గురువుకేమి తెలుసులే అనే లెక్కలో ఉందురు. అంత పెద్ద గురువులు చెప్తుంటే కాదని ఈయనేమి చెపుతాడు అనుకుంటారు. కానీ ఎప్పటికైనా ధర్మమే గెలుస్తుంది, అధర్మములు ఓడిపోవాల్సిందే! కానీ ధర్మము ఎప్పుడు చెప్పినా, అధర్మము ముందర చిన్నగానే కనిపిస్తుంది. కానీ చివరికి నిలబడేది ధర్మమే. ఎందుకంటే ఈ రోజు ఒక్క **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** చదివిన తరువాత చాలామంది దేశములో, అంటే భగవద్గీతలలో ఆరితేరినటువంటి వారు భగవద్గీతను మేము తెలుసుకున్నాము అనేటటువంటవారు, "త్రైత సిద్ధాంత భగవద్గీత" చదివిన తరువాత, ఇవన్నీ భగవద్గీతలు కావు, మేము ముందు చదివిన భగవద్గీతలలో శ్రీకృష్ణుని యదార్థ భావన లేదు, అని వారే చెప్పి బయటపడినారు. శ్రీకాకుళము, విజయనగరము, విశాఖపట్నము జిల్లాలు వారు మేము భగవద్గీతలలో గీతామకరందము అనే గ్రంథాన్నే గొప్ప అనుకున్నాము. కానీ త్రైత సిద్ధాంత భగవద్గీతలో శ్రీకృష్ణుని యదార్థ భావన బయటపడింది అని అంటున్నారు. వారు మమ్మల్ని చూడలేదు,

మాట్లాడలేదుగానీ జ్ఞానాన్ని గుర్తించి, ఇది గొప్పది, అది తక్కువది అంటే అధర్మమునకు ఆయాసము వచ్చి పడిపోయింది. ధర్మమునకు ఆయాసము లేక నిలబడింది అని అర్థము.

ఈ రోజు ప్రచారము చేసే స్వామీజీల ముందర, ఏ ప్రచారము లేని మనము నిలబడినాము, మనుషుల హృదయాల్లో, వాళ్ళు కొట్టివేయబడినారంటే, బలాఢ్యులుగా ఉన్నవారంతా క్రిందపడినారు, బలహీనుడిగా కనిపించేవాడు పైకొచ్చినట్లే కదా! ధర్మము గెలిచింది, అధర్మాలు కొట్టివేయబడినాయి, ఎప్పటికైనా కొట్టివేయబడాల్సిందే. అప్పుడు ఆ విధముగా తెలుసుకొన్నవారు గురువులుగా పేర్లు పెట్టుకొన్నవారిని గురువులుగా లెక్కించక బోధకులుగా మాత్రమే గుర్తించెదరు. భగవంతుడుగా భూమి మీదకు వస్తే గురువు అవుతాడు, ఆయన ఎవరి చేత తెలియబడడు, ఎప్పుడొస్తాడో తెలియదు. ప్రపంచమంతటికీ ఆయనే గురువు. ఆ గురువును నీవు తెలుసుకుంటే మోక్షమే అని చెప్పాడు కృష్ణుడు. భీష్ముడు ఆ విధముగానే శ్రీకృష్ణున్ని భగవంతునిగా తెలుసుకొని మోక్షము పొందాడు. భగవద్గీత పూర్తిగా వినిన అర్జునునికి మోక్షము రాలేదు. మరి ఈ రోజు భగవాన్‌లుగా పేరు పెట్టుకున్న వారంతా మరి వీరు భగవంతులా, ధర్మము ఎక్కడ ఉంటుందో ఎవరికేమీ తెలియదుగానీ అధర్మములు మాత్రము విస్తరించి ఉంటాయి. ధర్మము అనేది ఒక్క చోట పుట్టినా, అధర్మములను అణచి వేస్తుంది. త్రైత సిద్ధాంత భగవద్గీత ఎక్కడికైతే పోయిందో, అక్కడ మిగతా భగవద్గీతలను ముడిచి వేస్తున్నారు. ఈ ఒక్క భగవద్గీత చాలు అంటున్నారు. అంటే మిగతావన్నీ సరిగా లేవనే కదా! ఇప్పుడు ఒక స్వామీజీకి లక్షమంది అభిమానులుంటే, ఇప్పుడు మనము చెప్పిన ధర్మములలో వారు చెప్పిన అధర్మములు కొట్టివేయబడితే, ధర్మము అధర్మాన్ని విమర్శిస్తుంది. నువ్వు

ధర్మముకాదు నేను ధర్మాన్ని అని చెపుతుంది. అప్పుడు ఆ స్వామీజీకే నేను చెప్పినది అధర్మము అంటావా అని కోపము వస్తుంది. ఎవరు ఏమి చెప్పినా, మేము భగవద్గీత ప్రకారము మీరు చెప్పినది అధర్మము అంటున్నాము. అప్పుడు వారు నడచుకునే ప్రవర్తన వారికి అధర్మము అనిపించదు. అలాగని మేమేమైనా స్వంతముగా చెపుతున్నామా? మీరు చెప్పినది అధర్మమని, బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీత ప్రకారము మేము చెప్పుచున్నాము. గాలిలేని చోట దీపము వెలిగినట్లు అన్నాడు.

శరీరములో వీరికి అర్థము కాదని మేమేమి చెప్పామంటే, గాలి పూర్తిగా విస్తారంగా వీచని చోట దీపము నిశ్చలంగా, కదలకుండా ఉంటుంది కదా! అదే విధముగా మనస్సు అనేది సున్నా స్థాయికి పోవాలి అని చెప్పాము కానీ అది సున్నా స్థాయి కాదది. కాకున్నా అర్థము కావాలి, లేకపోతే విరుద్ధము అయిపోతుంది. భగవద్గీత అనే ఉద్దేశ్యముతో చెప్పాము. కానీ అక్కడ ఏమి చెప్పాలి, గాలిలేనిచోట దీపము వెలుగుతుందా? ఆరిపోతుంది, అంటే దీపమే ఉండకూడదు. అంటే ఏ తలంపు ఉండకూడదు. అంటే మనస్సు పూర్తిగా పోతుందా అంటే పోదు, కానీ మనోధ్యాసను దేనియందూ లేకుండా చేసుకోవాలి. అంటే అక్కడ మనస్సే లేనట్లు. ఎప్పుడైతే నీకు మనోధ్యాస ఏ ఒక్కదానియందూ లేకపోతే, ప్రపంచము నీకు తెలియకుండా ఉంటుంది. అది బ్రహ్మయోగము అవుతుంది. గాలిలేని చోట దీపము వెలిగినట్లు, అంటే ఆరిపోయినట్లు అప్పుడే నీకు జ్ఞానము తెలుస్తుంది.

మేము మా భగవద్గీతలో కనీసము ఆ మనస్సును నిశ్చలంగా దేవునిమీద పెట్టుకోండి అని వ్రాశాము. కానీ మీవలె మనోధ్యాసను మోకాలిమీద పెట్టండి, మూతిమీద పెట్టండి, నాలుకమీద పెట్టుకోండి అని

చెప్తే ఏ విధముగా అవుతుంది. పేరుపెట్టి, ప్రకృతికి సంబంధించిన అవయవమో, వస్తువో పేరు చెప్తూ వుంటే ధర్మము అవుతుందా? సుఖము ఉంటే దుఃఖము కూడా ఉంటుంది. కారము ఉంటే తీపి ఉంటుంది, ఏదీ లేకపోతేనే ఏదీ లేనట్లు అని సూత్రబద్ధముగా మేము చెప్తూవుంటే, అర్థము చేసుకోకుండా అడ్డదిడ్డముగా మాట్లాడడము సమంజసమా! మన మంచికొరకు చెప్తున్నారు అనుకోకుండా ఆయన పెద్దరికము కొరకు చెప్పుకుంటున్నాడు అనుకుంటే ఎట్లా? దేశములో ఇంతమందితో విరుద్ధమయితే ఎట్లు? మా స్వామీజీకి కోపము రాదా అంటే ఎలాగ? ఎవరైనా ఒక వ్యక్తి దొంగతనము చేస్తే, తన్నులు తింటాడు అని అన్నామనుకో. అట్లు చెప్పితే ఎట్లు అంటే, దొంగతనము చేస్తున్నావని, నిన్ను అంటున్నానని కోపమా? దొంగతనము చేయనివానిని, రాజు మాదిరి కూర్చోబెట్టి పూజిస్తారు. దొంగతనము చేసినవాడ్ని దొంగ అనకండి, మా దొంగల నాయకునికి కోపము వస్తుంది అంటే ఎలా? అది తప్పు పనే, చట్టమునకు ఎప్పటికైనా దొరకాల్సిందే, శిక్షపడవలసిందే.

ఈ విషయములన్నీ మేము భగవద్గీత ప్రకారము చెప్తున్నాము. లక్షమందికి ఉపదేశము ఇచ్చాము, మీరు తప్పంటే మా స్వామికి కోపము వస్తుంది అంటే, లక్షమందికి ఉపదేశము ఇచ్చాడని, అధర్మాన్ని నిరసింపక, ధర్మాన్ని ప్రక్కకు పడేసి కూర్చోమంటారా? కోటిమంది అధర్మాలలో ఉన్నారు. మనము ధర్మము ఎందుకు చెప్పాలిలే అని ఆ రోజు కృష్ణుడనుకున్నాడా? అధర్మమునకు అనుకులంగా చెప్పితే, దేవుని చట్టములో అది అధర్మమవుతుంది. కనుక అధర్మములను అధర్మములనే చెప్పవలెను కానీ, ఎంతమందికో చెడ్డ అవుతాము కదా అని చెప్పకుండా పోతే అది అక్రమమవుతుంది. అధర్మమే అవుతుంది, దేవుని విధానములో సరైన

www.thraithashakam.org

పద్ధతి అనిపించుకోదు. మనము పూర్తి స్థాయిలో ధర్మముల గురించి చెప్పినా, ఒక మనిషి అతని స్థాయిలో ధర్మములను ప్రచారము చేయవలెను. దేవుని జ్ఞానమే, దేవుని ధర్మము. ఆ ఉద్దేశ్యముతోనే మనము ఈ రోజు ఆ పనిని చేయుచున్నాము. మరి మనమందరము ఒకని చేత నిర్ణయించబడి ఈ జన్మకొచ్చాము, బొమ్మగా మనల్ని ఆడించేవాడు ఒకడున్నాడు, కనుక నేనే కర్తను, అని అనుకోవటము పొరపాటు అగును. మేము చెప్పుచున్నవేవీ మా స్వంత అభిప్రాయములు, ఆలోచనలు కావు. భగవద్గీతను అనుసరించి చెప్తున్నవే. కనుక మీరైనా మేమైనా వాస్తవ ధర్మాలను ప్రచారము చేసేదానికే ఉండాలి కానీ అధర్మములవైపు పోకూడదు.

చాలామంది చాలా విధములుగా చివరికి మరణిస్తున్నారు. ఒక వ్యక్తి యం.బి.బి.యస్ చదివి, ప్రాక్టీస్ మొదలుపెట్టే లోపలనే చనిపోయాడు. ఎన్నో తిప్పలుపడి ఈ విధముగా చనిపోయాడు. ఒక రాజకీయ నాయకుడు పోట్లాటలో రాయి తగిలి చనిపోయినవారు లేరా! ఆ విధముగా ఎవరైనా చనిపోక తప్పదు. చావును ఎవ్వరూ ఆపలేరు. కానీ చనిపోయేదేదో దేవుని చేరే ధర్మాలను చెప్తు చావు వచ్చినా మంచిదే కదా! ఎన్నో విధములుగా చనిపోయిన వారికంటే మనది మంచి చావే అగును కదా! మేము ఈ మధ్య కార్లో డ్రైవింగ్ చేస్తూ వస్తూ ఉంటే, ఒక పెద్ద రోడ్డు ప్రమాదము జరిగినది. డ్రైవింగ్ చేస్తున్న నా వాహనము, ఈ లైట్లఫోకస్ వలన కనులు కనిపించక ఆ రాత్రిలో అడ్డముగా ఉన్న లారీని గుర్తించలేక 120 కిలోమీటర్ల స్పీడ్‌లో గుద్దాము. కానీ మాకు ఒక్క చిన్న గాజుపెంకు కూడా గ్రుచ్చుకోలేదు. అంటే అర్థమేమంటే, నేను ధర్మప్రచారము చేయాల్సి ఉందేమో, అందుకే దేవుడు నన్ను మరలా బ్రతికించాడు ఎందుకంటే, ఆ ప్రమాదము అటువంటిది తప్పకుండా ఆ ప్రమాదములో చనిపోవాల్సిందే,

అందుకే మేము చచ్చి బ్రతికాము అంటున్నాను. ఇప్పటికి నాలుగురోజుల క్రితము మాకు జ్వరము వచ్చింది, వాంతులొచ్చాయి. ఆ వాంతిలో నేను త్రాగిన మజ్జిగ, నీరు పడింది. దానితోపాటు ఒక గ్లాసుడు రక్తము కూడా పడింది, నన్ను మా కుటుంబ సభ్యులు ఒత్తిడి చేసి, హైదరాబాద్‌లో పెద్ద ఆసుపత్రికే తీసుకువెళ్ళారు. కానీ ఏ జబ్బు ఉన్నట్లు నిర్ధారణ కాలేదు. మీకు ఏ జబ్బు లేదన్నారు. నిజమే జబ్బు తగ్గింది. అది లేకుండా దేవుడే చేసి, నన్ను మరలా చనిపోయిన వాడ్ని బ్రతికించినట్లే! ఎందుకంటే నేను ఒక గ్రంథము వ్రాస్తున్నాను కదా! ధర్మప్రచారము జరగాలని ఆయన నన్ను మరలా బ్రతికించినట్లున్నాడు.

ఈ విధముగా దేవుడు నన్ను ఇన్నిమార్లు బ్రతికించి, ధర్మము ప్రచారము చేయమంటే, ఆ విధముగా చేస్తే లక్షమంది శిష్యులున్న ఒక స్వామీజీకి చెడ్డ అవుతానని ధర్మవిరుద్ధముగా మాట్లాడమంటారా? మన లెక్కలో దేవుడొకడున్నాడు. ఆయన మన కర్మ ప్రకారము మనల్ని ఆడిస్తూ ఉంటాడు. వాడిని దృష్ఠిలో పెట్టుకోవాలిగానీ మనుషులను దృష్ఠిలో పెట్టుకోకూడదు. ఒకవేళ ఒకవ్యక్తి నన్ను చంపాడనుకో, చంపనీ ఎప్పుడూ తాడిపత్రిలోనే జ్ఞానము చెప్తే ఎలాగవు తుంది? ఇంకో దేశములో ఎవరు చెప్తారు అని దేవుడనుకుంటే? ఆయన ఎవరి ద్వారానైనా చంపిస్తే చంపించనీ, ఏమైనా ధర్మములు చెప్పేదే మన పనిగా పెట్టుకోవలెను. ఆ విధముగా చెప్పటము వలన అధర్మవరులందరికీ విరుద్ధముగానే ఉండును. కనుక వ్యతిరేఖతను వ్యక్తపరుస్తారు, అప్పుడు నీవేమీ చలించవలసిన పనేమీలేదు.

ఇప్పుడు “దరిద్రపు నారాయణ” అనే పేరుంది. ఆ పేరు ఎట్లు వచ్చింది అంటే, ఎలాగో వచ్చిందిలే అని సమాధానము చెప్పారు.

www.thraithashakam.org

ఎందుకంటే వారికి అర్థము తెలియదు. అన్నీ అతనికే తెలుసు, మమ్మల్ని ప్రతీసారి కించపరుస్తాడు అని ఎవరైనా అనవచ్చును. "ఆదికర్త" అని పేరు పెట్టుకున్నారు. మీకు కర్త అంటే అర్థము తెలుసా? అని మమ్మల్ని అడుగుతారు. కర్త అంటే మీకు అర్థము తెలియదు కనుకనే **"కర్మణ్యే వ్యాధికారస్తే"** అనే శ్లోకాన్ని వివరించినది. ఈయనకేనా జ్ఞానము తెలిసేది. మాకేమీ తెలియదా అంటే, నాదే జ్ఞానము అని నేను అనుకోవటము లేదు. భగవద్గీతలో కృష్ణుడు చెప్పినది జ్ఞానము అంటున్నాము. ఎన్ని మతాల్లో ఏమి చెప్పినా, ఆ జ్ఞానాన్ని అన్ని మతాలు ఒప్పుకుంటున్నాయి. ఒకే హిందూ మతములో మాత్రము చాలా ఇబ్బంది పడుచున్నారు. ఎందుకంటే, భగవద్గీత హి(ఇ)ందూ మతములోనిదే, కానీ హిందూ మతములో అధర్మములున్నవని తెలిపినది ఆ భగవద్గీతయే.

ఆ విధముగా ఆయన చెప్పిన జ్ఞానాన్ని మేము మరలా ఇప్పుడు చెప్పుచున్నాము. ఆ జ్ఞానము పదిమందికి సరిపోయినా, వందమందికి సరిపోకపోయినా మనము ప్రచారము చేయటమే కర్తవ్యము అనే ఉద్దేశ్యముతో మనము చేయాలి. ఇది నా కొరకు చెప్పుకుంటున్నది కాదు నేను ఎలాగూ ఆ పనిలోనే ఉన్నాను. మీరు జ్ఞానప్రచారము కొరకు మీ కాలాన్ని వినియోగించండి. ఇప్పుడు విజయనగరములో ఒక వ్యక్తి వున్నాడు. అతనికి 65 సంవత్సరముల వయస్సు. మన త్రైత సిద్ధాంత జ్ఞానము తెలుసుకున్నాడు, అతను పెద్ద జ్యోతిష్య వేత్త. ఎన్నో ఇతర గ్రంథములు చదివాడు, ఇప్పుడు అవన్నీ ప్రక్కకు పడేసినాడు. ఎన్నో సంఘములకు అధ్యక్షుడిగా ఉండి ఎన్నో విడిచిపెట్టారు. చివరికి అతను విడిచిపెట్టిన చివరిది శ్వాసమీద ధ్యాస అనే సంఘమును విడిచిపెట్టి అసలైన మన జ్ఞానము అర్థమై, ఇందులోకి వచ్చారు. అదియునూ కాక ఈ జ్ఞానము

చాలా గొప్పదని, ఇంటింటా ప్రచారము చేస్తున్నాడు. అంటే గొప్పపనే కదా! జీవితములో జ్ఞానము ప్రకారము నడచుకోవటమే ముఖ్యమైన సారము. మన జీవితాలను అటువైపుకు పోనివ్వవలెను. అధర్మములు నిన్ను భయపెడతాయి, కానీ నీవు భయపడకూడదు. నీవు బక్కచిక్కిన వానిగానే నీవు బలాఢ్యుల ముందర కనిపిస్తావు అయినా నీవు భయపడవద్దు. నువ్వు గట్టిగా నిలబడితే, అధర్మములు క్రిందపడి పోతాయి. మేము ఆ విధంగా ఉంటున్నాము కనుకనే ఇంత వ్యతిరేఖతలో కూడా వాస్తవ జ్ఞానాన్ని ధైర్యముగా చెప్పగలుగుచున్నాము.

వేదాలను అధర్మములనీ, మాయ మూడు గుణముల రూపములో నీ తలలోనే ఉన్నదని **"త్రైగుణ్య విషయా వేదా"** అని వాటిని త్యజింపమని చెప్పలేదా భగవద్గీతలో శ్రీకృష్ణుడు. మరి మీరెందుకు వేదపాఠశాలలు పెట్టాలి, అంటే మన సంస్కృతి అంటారు. మన సంస్కృతి అంటే ఏమిటి? 'సం' అనగా మంచిదని, కృతి అనగా చేసినది. అసలైన దేవుని జ్ఞానము తెలుసుకోవటమే సంస్కృతి అని అర్థము ఉండగా వేదాలు చదవటము, అనుసరించడమా సంస్కృతి. పెళ్ళిలో తలంబరములు పోస్తే, వాటి అసలు అర్థము తెలుసుకొని నడుచుకోవటము సంస్కృతి. ఇటువంటి పెళ్ళి అనే దాంట్లో పరమాత్మ జ్ఞానమును తెలుసుకో, అదీ సంస్కృతి అంటే, కనుక ఇప్పటికైనా అసలైన దేవుని చేరే ధర్మములు తెలుసుకొని, జీవితాలను సార్థకము చేసుకోవలయును. ఈ విధముగా చేయటము మంచిదికానీ, మన పని మనము చేసుకుందాము. ఎక్కడైనా వస్తే లాభము తీసుకుందాము. దేవుని జ్ఞానము కొరకు కర్మరీత్యా నా పని చేస్తూ శ్రద్ధతో, కర్మతో సంబంధము లేని జ్ఞానాన్ని కొంతవరకు తెలుసుకొని దేవుని సేవ చేస్తున్నాను అని అనుకొని ఇప్పటినుండి చేయుటకు ప్రయత్నము చేయండి. అప్పుడు మన

జీవితాలు వాస్తవముగా సార్థకము అవుతాయి. మనము ఆ విధముగా దేవుని సేవ చేసే నిమిత్తము దేవుడు మమ్మల్ని ఎన్నో ప్రమాదాల నుండి రక్షించెను. బహుశా ఈ జ్ఞాన ప్రచారములో మీరు ఉపయోగపడతారని కర్మరీత్యా మీరు ప్రమాదములో చిక్కుకున్నా, మీరు చనిపోవాల్సిన కర్మ ఆ ప్రమాదములో మీకు వ్రాసిపెట్టబడిననూ, మీరు ఎన్నిసార్లు అటువంటి ప్రమాదాలనుండి రక్షింపబడ్డారో లెక్కించుకోండి.

ఇందులో కొందరు, ఎప్పుడూ దేవుడు అంటారు, దేవుని పని అంటారు. రామునిగుడి కట్టాలా! ఆంజనేయస్వామి గుడికట్టాలా! అదీ దేవుని పనే కదా అని మమ్మల్ని ప్రశ్నించవచ్చును. కానీ మేము ఏం చెప్తామంటే, దేవుడు అనేవాడు ఒక్కడే ఉన్నాడు. మిగతా వారంతా దేవతలే, వీరంతా ఆడవారే! అసలైన దేవుడు నిరాకారుడు కనుక చందాలు ఏమైనా ఇవ్వాలని వచ్చినవారికి, మేము దేవుడికైతే ఇస్తాముగానీ అందరూ ఆడవారైన దేవతలకు, గుడులకు చందాలు ఇవ్వమని చెప్పండి. సరే మన ధర్మములను తెలుసుకొని, ధర్మములను ప్రచారము చేసుకొనుటకు జీవితములో నీవు ఎన్ని కష్టములు ఎదుర్కొన్నను ఫరవాలేదుగానీ దేవునికి ఇష్టమైన పనై ఉండవలెను. ఆ నిర్ణయముతో మీరంతా దేవుని జ్ఞానము తెలుసుకోవాడానికి ప్రయత్నము చేయండి.

## 19. సృష్టి - సృష్టికర్త

తేది : 07-06-2009

సృష్టిలో త్రిమూర్తులను పెద్ద దేవుళ్ళుగా చెప్పుకుంటారు ప్రజలు. వారి ముగ్గురుకంటే అతీతముగా ఉండేవాడు గురువని అటువంటి గురువుకు

www.thraithashakam.org

నమస్కరిస్తూ ఆ గురువునే నిజమైన దేవునిగా లెక్కించుకుని కొన్ని జ్ఞాన విషయములను తెలుసుకుందాము. ఈ రోజు **"సృష్టి-సృష్టికర్త"** అనే అంశమును గూర్చి తెలుసుకుందాము. సృష్టి-సృష్టికర్త లో ఎవరు ముందు. సృష్టికర్త అనగా సృష్టిని తయారు చేసినవాడు, కనుక సృష్టికర్తే ముందు వాడు. కుమ్మరికుండ అంటాము. కుండ ముందా! కుమ్మరి ముందా! అంటే కుమ్మరివాడు తయారు చేస్తేకుండ అయినది. కుమ్మరి ఒక్క కుండనే తయారు చేస్తాడా అంటే , కడవలు తయారు చేస్తాడు, బానలు తయారు చేస్తాడు, మట్టితో తనకు ఇష్టమైన వస్తువులన్నీ తయారు చేస్తాడు. ఆ విధముగానే సృష్టికర్త అనేవాడు సృష్టిని తయారు చేసినాడు. ఆ విధముగా కంటికి కనిపించేదంతా సృష్టించినదే. కంటికి కనిపించకుండా సూక్ష్మముగా కొన్ని వస్తువులు ఉన్నాయి. భూతద్దములు పెట్టిచూస్తే తెలియును. అనగా కంటికి కనిపించేవి, కంటికి కనిపించనివి. అదే విధంగా కదిలే జీవులు, కదలని జీవులు, వస్తువులు అనగా చరించే ప్రకృతి, చరించని ప్రకృతి, ప్రాణమున్న ప్రకృతి, ప్రాణములేని ప్రకృతి. ఇవన్నీ ఒక్కడి చేత సృష్టించబడ్డాయి, వాడెవడో తెలియదు. కుండలు తయారుచేసినవాడిని కుమ్మరి అని ఎట్లు అంటున్నామో అట్లే సృష్టిని తయారు చేసినవాడు సృష్టికర్త అంటున్నాము. కర్త అనగా చేసినటువంటివాడు. మొట్టమొదలు అన్నీ సృష్టించిన తరువాత అవన్నీ మనకి ఇప్పుడు కనిపిస్తున్నాయి కానీ, వాటిని సృష్టించిన సృష్టికర్త మాత్రము కనిపించడు. సృష్టికి రూపమున్నది కానీ సృష్టికర్తకు రూపము లేదు. సృష్టిలో ప్రతీదానికీ పేరు ఉన్నది కానీ సృష్టికర్తకు పేరు లేదు. ఏదైనా వస్తువు, ఉదాహరణకు సున్నపురాయి ఎక్కడ దొరుకును? అంటే రాయలసీమలో దొరుకును అంటాము. కానీ సృష్టికర్తకు అడ్రస్ (చిరునామా) లేదు. ఒకచోట ఉండేవాడికైతే అడ్రస్ ఉంటుంది. కానీ

అంతటా ఉన్నవాడికి చిరునామా ఏ విధముగా ఉంటుంది. ఈ విధముగా సృష్టికి–సృష్టికర్తకు చాలా తేడాలున్నాయి. అయితే సృష్టి గొప్పదా, సృష్టికర్త గొప్పవాడా అంటే సృష్టికర్తే గొప్పవాడు కదా! మనిషి ఉన్నాడు, మనిషి కూడా సృష్టిలోని ఒక భాగమే. సృష్టిలోని భాగమైనటువంటివాడు సృష్టికర్తను ఎదిరిస్తే ఏమవుతుంది, పొరపాటు అవుతుంది. దేవున్ని అంచనా వేయలేని వీరంతా దేవునితో మాకు పనేలేదు అంటున్నారు. సృష్టితోనే పని వీళ్ళకు గానీ, సృష్టికర్తతో పనిలేదు. సృష్టికర్త లేకుండా ఏవైనా వచ్చాయా నీకు, ఏదీ లేదు. నీ జేబులోని 10 రూపాలయల నోటుగానీ, ఇంటిలో ఉన్న కుండగానీ, నీవు కట్టుకునే గుడ్డలుగానీ నీవు పుట్టించుకున్న బిడ్డను (కొడుకును) గానీ, ఇవన్నీ సృష్టికర్త ఇచ్చినటువంటివే. నీవేదీ సృష్టించుకోలేదు. అన్నింటినీ సృష్టించినవాడే దేవుడు. ఈయననే ఇంకొక అర్థముతో 'పరమాత్మ' అంటున్నాము. ఆత్మకంటే పరముగా ఉన్నాడు కావున పరమాత్మ అంటున్నాము. ఎంత వెదకినా దొరకడు కావున **'దేవుడు'** అంటున్నాము. సృష్టిని అంతటినీ సృష్టించాడు కావున **'సృష్టికర్త'** అంటున్నాము. కానీ వాడు (దేవుడు) ఈ విధముగా ఉంటాడు అని మాత్రము చెప్పలేము. ఎందుకంటే ఇవేవీ పేర్లు కూడా కావు. అతను ఉండే విధానము అనుసరించి భావముతో ఆ పదములను పెట్టాము కానీ వాస్తవముగా ఇవేవీ ఆయనకు పేర్లు కూడా కావు. మరి అటువంటి సృష్టికర్తకు మనము భయపడుతున్నామా! లేదు మనం భయపడుచున్నది డబ్బుకు, అందులోనే క్రింద, మీద పడి నలిగిపోతున్నాము.

ఈ రోజు మనిషియొక్క మనస్సు అంతా ఎక్కడ లగ్నమై ఉంది? డబ్బుమీదే! ఒక వ్యక్తి వద్ద కోటిరూపాయిలు ఉంది అంటే భయపడతాము. మనకు ఒక వ్యక్తి యాభై రూపాయలు బాకీ ఉంటే పోట్లాడుతాము. అంతా

డబ్బుమయం అయిపోయింది. 'డబ్బుకు లోకం దాసోహం' అని ఎవరో చెప్పినట్లు ధనమునకే వశం అయిపోతున్నాము. సరే అది నీ ఇష్టము! ఆ విధముగానే ఉండుగానీ అందులో ఉండైనా, దేవున్ని తెలుసుకుంటున్నావా అంటే అదీలేదు. తెలుసుకుంటే దేవునికి విధేయతగా ఉండవలెను. కానీ మనకు దేవునియందు భయము లేదు, భక్తి లేదు. ఈ విధముగా మనుషులందరూ తయారయ్యారు. ఒక పులికి మనిషి భయపడుచున్నాడు గానీ, పదివేల పులులు తయారు చేసిన సృష్ఠికర్తకు మాత్రము భయపడడు. దేవుడే వచ్చి నిన్ను శిక్షించక్కరలేదు. ఒక తేలుని పంపిస్తే నీ పని అయిపోతుంది, ఒక పామును పంపిస్తే నీ పని అయిపోతుంది. దేవుడు తను సృష్ఠించిన తల్లిదండ్రులనుండే సృష్ఠిస్తున్నాడు, చివరికి తను సృష్ఠించిన సృష్ఠితోనే చంపుచున్నాడు.

సృష్ఠికంతటికీ అధినేతగా ఉన్న అతను అంతటా వ్యాపించి, ఏమీ చేయకుండా, ఊరకనే కాలమై ఉన్నాడు. సృష్ఠిలో ఎన్ని అంశాలున్నాయి, ఎన్ని భాగములున్నాయని లెక్కవేస్తే ఎన్నో ఉన్నాయి. వీటినన్నింటినీ సృష్ఠించిన దేవున్ని మనిషి మరచిపోయాడు. పైగా దేవునితో నాకేం పని? అంటున్నాడు మనిషి. నీవు లేచిన వెంటనే తినే ఆహారం ఎవరు సృష్ఠించారు? దేవుడే, కనుక దేవునితో నీకు పనిలేనిది దేవుడు సృష్ఠించిన వాటితో నీకేం పని? ఇదంతా దేవుడు చేసినది అని అనుకోవటం లేదు. ఇదంతా నేనే తయారు చేశాను అని మనిషి అనుకుంటున్నాడు. ఆహారము ఉంది, దీనిని నేనే సృష్ఠించాను అనుకుంటున్నాడు. పంట నేనే కదా పండించాను అనుకుంటున్నాడు, పంట పండింది కనుక తింటున్నావు సరే తెగులొచ్చి పోతే అప్పుడు. ఏమి నాక్కుంటాడు. పండితే నీవు పండించావు అనుకుంటున్నావు, తెగులొచ్చి పోతే ఏమీ రాదు. అది మొలకెత్త లేదనుకో

ఏమీ రాదు. కదిలించే ప్రకృతిని ఒకదానిని పెట్టుకొని, కదలని ప్రకృతిని ఒకదానిని పెట్టుకొని నాటకము ఆడుతున్నాడు నీతో దేవుడు.

నీవు పండించే పంట నీది కాదు. నీవు దేనినీ సృష్టించలేవు. ఆయన కదిలిస్తేనే నీవు కదులుతున్నావు. లేకపోతే నీవు కదలలేవు. ఒక వ్యక్తి అన్నాడట, **"గ్రుడ్డివాళ్ళందరినీ కళ్ళున్నవారిగా చేస్తాను కళ్ళున్న వారందరినీ గ్రుడ్డివాళ్ళుగా చేస్తానన్నాడు"** ఏమయ్యా! కళ్ళు లేనివారికి కళ్ళున్నట్లుగా చేస్తే మంచిదే కానీ, కళ్లున్నవారినైన మమ్ములను గ్రుడ్డివాళ్ళుగా చేయటం ఏమిటి? అని అడిగారు. నేను చూస్తున్నాను అని నీవు అనుకుంటున్నావు కనుకనే పాపం వస్తున్నది. నేను గ్రుడ్డివాన్ని అని నీవు అనుకుంటే ఏ పాపం రాదు. ఇదేమి చూస్తూ ఉంటే పాపం వస్తుందంటున్నాడు, గ్రుడ్డిఅయితే పాపం రాదు అంటున్నారు. గ్రుడ్డితనం ఏమిటి అనేది మనకు అర్థం కావాలి, ఆమాట మనకు అర్థం కాలేదు. ఆ విధముగానే దేవుడు చెప్పిన జ్ఞానం ఉంది. ఇప్పుడు సృష్టిని, సృష్టికర్తను విడదీసి, సృష్టికంటే సృష్టికర్త గొప్పవాడు అని తెలుసుకుంటే, ఆ విషయములన్నీ తెలియాలంటే దేవుడు చెప్పిన జ్ఞానమే ఆధారము. ఆ దేవుడు చెప్పిన జ్ఞానము తెలుసుకోగల్గితే అప్పుడు సృష్టికి, సృష్టికర్తకు ఉన్న తేడా తెలుస్తుంది. ఇది తెలియకపోవటం వలన కనిపించని గొప్పవాడైన సృష్టికర్తను విడిచిపెట్టి, సృష్టిని ఆధారం చేసుకొని బ్రతుకుచున్నాము.

ఈ విషయములు తెలుసుకున్న మనిషి ఇప్పుడు మనం అనుభవిస్తున్న, చలామణి చేస్తున్న ప్రతీ వస్తువు దేవుడు సృష్టించినదే. దేవుడు సృష్టించిన వస్తువులను నేను వాడుకుంటున్నాను. కనుక ఆయనను స్మరించకపోవటం మంచిదికాదని, జ్ఞాని అనుకుని దేవున్ని ప్రక్కనపెట్టకుండా, సృష్టిని ప్రక్కకు పెట్టి ఆయనను తెలుసుకోవటానికి ప్రయత్నం చేస్తాడు.

www.thraithashakam.org

మరి ఈ జ్ఞానం, ఇటువంటి విషయాలు వినటం వలనో, పుస్తకాలు చదవటం వలనో, ఏదో విధంగా అటువంటి జ్ఞానం మనకు లభిస్తుంది.

ఇంతసమయం మనం మాట్లాడుచున్నాం. ఎక్కడైనా దేవుని పేరైనా ఫలానా దేవుని పేరు అనిగాని చెప్పామా. ఈ మధ్య విజయనగరం జిల్లాలో ఒక వ్యక్తి మన సభ్యులు పంచుచున్న కొన్ని కరపత్రములను చూసి, కాల, కర్మ, గుణచక్రాలను చూసి, ఇదేమిటి అడ్డంగా లేదు, తిన్నగా లేదు, ఈ వాక్యాలలో ఫలానా దేవుడని పేరులేదు, తలకాయ ఉండేవాడు వ్రాసినవేనా ఇవి? అన్నాడట నిజమే తలకాయ లేనివాడు వ్రాసినవే. తలకాయ ఉన్నవాటికి గుణములుంటాయి, గుణములు లేనివాడు తలకాయ లేనివాడే. ఏ పేరూ లేదు, దేవుడెవరు? అని అడిగాడు, అంటే వారి లెక్కలో దేవుడెవరని మనము ప్రశ్నిస్తే ఏమి చెప్పాడు. ఇంతమంది దేవుళ్ళలో దేవుడెవరు? భగవద్గీతలో దేవుళ్ళను (దేవతలను) ఆరాధించవద్దు, దేవున్నే ఆరాధించండి అని చెప్పలేదా? తలకాయ ఉన్నవాళ్ళకు ఇది ఎక్కలేదా? ఈ విషయము 5116 సం॥లు క్రితమే భగవద్గీతలో బయటపడింది కదా! ఈ విషయాలు వీళ్ళకు అర్థము కాలేదా! భక్తిలో వ్యభిచరించవద్దు అసలైన వాడ్నే నమ్ముకో, పురుషులను మార్చినట్లు దేవతలను మార్చవద్దు అన్న కృష్ణుని మాటలు వీరెవరికీ అర్థము కాలేదా? భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు ఏమయ్యాయి? ఈ రోజు మీకు అర్థముకాకే, భగవద్గీత మూలనపడింది. తద్వారా మిగతా వారికి అసలుకు తెలియకుండా పోయింది. ఈ రోజు ఎవరైతే తలకాయ ఉన్నవాడు వ్రాసిందేనా! అని అడిగినాడో, ఇటువంటి వారు ఉండడము వలననే ఉన్నత కులమనీ, మాదిగ కులమని పేర్లుపెట్టి మాదిగ కులస్తులను ప్రక్కకు పెట్టడం వలన, వారు ఈ రోజు క్రైస్తవ మతములోకి చేరిపోవుచున్నారు. దీనికి కారణము ఎవరు? ఈ విధముగా

www.thraithashakam.org

మాట్లాడినవారే కారణము. ఇప్పుడు ఏమి చేస్తారు. ఆ మతములో అందరూ సమానముగా, కులబేధాలు లేకుండా ఉంటున్నారు. ఈ రోజు క్రైస్తవ మతములోకి పోయినవారంతా భారతీయులు కారా? శూద్రులు కారా? మీరన్నట్లు ఎందుకు వెళ్ళారు? వీరంతా మీరు చూపించిన వివక్ష వలననే. మేము దేవుని జ్ఞానమును గూర్చి చెప్తే తలకాయ ఉన్నవారు వ్రాసుకునేదా అని అంటున్నారు కదా! మీరు తలకాయ ఉన్నవారు, మీరేమి చేస్తున్నారు? ఇందూ (హిందూ) మతము క్షీణించిపోయే విధముగా తయారు చేశారు. ఈ రోజు క్రైస్తవమతము రోజురోజుకీ పెరిగిపోవుటకు ఎవరు కారణము? మీరే కారణము. విజయనగరంలో ఒక పూజారి ఈ మాటలన్నీ అంటున్నా డంట ఆయన పూజ చేసుకునే దానికి అర్థమే తెలియదు.

నేను చెప్తే తెలిసింది పూజా విధానమంతా, కొబ్బరికాయ ఎందుకు కొడతారు? కర్పూరం ఎందుకు వెలిగిస్తారు? దీపం ఎందుకు పెడతారు? శఠగోపం (షట్ గోప్యం) ఎందుకు పెడాతారో మేము చెప్తే అర్థమయింది. దేశములో ఇవేమీ తెలియకుండా ఎవరికి తలకాయ లేదంటున్నావు? మీరు చూపించిన కులబేధం వలన కదా! ఈ రోజు క్రైస్తవమతము పెరిగిపోయింది. మీరంతా కలిసి, హిందూ మత సంరక్షణ, వేదిక అని పేర్లు పెట్టుకొని, మీరే జ్ఞానులమని అసలైన దైవజ్ఞానము చెప్తున్న మమ్మల్ని విమర్శిస్తున్నారా? భగవద్గీతలో దేవుడు ఏమి చెప్పాడో తెలియదు. **"దేవతలను పూజించేవాడు దేవతలలోకే పోతాడు, నన్ను పూజించేవారు నాలోకి చేరుతారని"** తనను ఒక ప్రక్కకి పెట్టి చెప్తే, దేవుడెవరని ప్రశ్నిస్తారా? మీకు జ్ఞానము ఉందా! జ్ఞానములేదు కనుకనే ఈ విధముగా మాట్లాడుచున్నారు. ఆ విధంగా చేసినందువలన ఈ రోజు ప్రత్యక్షంగా మేము చూస్తున్నాము. వంద సంవత్సరముల క్రితం మీ కుల పరిస్థితి చాలా బాగుండేది, ఎక్కడ చూసినా మీకు భూములుండేవి. ఇప్పుడు ఆ భూములన్నీ పోగొట్టుకున్నారు ఈ

రోజు చివరికి మీరు అడుక్కుని తినేవారిలో కూడా మిమ్మల్ని చూస్తున్నాము, రిక్షా త్రొక్కే వాళ్ళను కూడా చూస్తున్నాము. మీ కులములో ఈ ఊర్లో బాగా బ్రతికిన ఒక వ్యక్తి, **"నేను రిక్షా త్రొక్కటము తిరుపతిలో చూసి,"** ఏమయ్యా బాగున్నావా! అంటే "ఏమి చేస్తాము పువ్వులు అమ్మిన చోట, కట్టెలమ్ముతే బాగుండదని ఇక్కడికొచ్చి రిక్షా త్రొక్కుతున్నాను" అన్నాడు. ఇదంతా ఎవరు చేసుకున్న పాపము, మీరు చేసుకున్న పాపము? కాదా? అజ్ఞానము ప్రజలకు బోధించి, జ్ఞానము తెలియకుండా చేసి, మీ బ్రతుకుతెరువు కోసము, ఈ దానాలు చేయండి, ఆ దానాలు చేయండి అని చెప్పుకుంటూ, ఈ రోజు ఉన్న జ్ఞానము కూడా లేకుండా చేసి దేవుడెవరు? అని కూడా ప్రశ్నిస్తున్నారు, భగవద్గీత చదివితే తెలియదా నీకు దేవుడెవరో? అందరికంటే మీకు చదువు బాగా వస్తున్నది కదా! వారి బ్రతుకుతెరవు కోసము, మేము చెప్పినది జ్ఞానమే కాదు అంటున్నారు. ఎందుకంటే భగవద్గీతనే కాదంటున్నారు. కనుక దీనివలన పెద్దపాపమే వస్తున్నది. దానిని అనుభవించాల్సిన పని కూడా వస్తున్నది.

ఈ విధముగా సృష్టిలో బ్రతికేవారు చాలామంది ఉన్నారు. ఈ రోజు సృష్టికి భయపడకుండా ఎవరయినా బ్రతుకుతున్నారంటే 98 శాతము భయపడే బ్రతుకుచున్నారు. ప్రకృతికి భయపడే బ్రతుకుతున్నారు. నువ్వు ఎవరికి భయపడుతున్నావు అని అడిగితే ఫలానావాని పేరు చెప్తారు. "మావూరి రెడ్డి చాలా గొప్పోడు, ఎదురు మాట్లాడకూడదు". అని అంటారు. ఈ రెడ్డి ఎవరు? సృష్టికర్త పుట్టించినవాడే, మరి ఈ ఊరిలో రెడ్డికి భయపడు తున్నావు నువ్వు, ఇంత పెద్ద రెడ్లను ఎందరినో పుట్టించిన ఆ పెద్ద రెడ్డి అయిన దేవునికి ఎందుకు భయపడటం లేదు?

www.thraithashakam.org

చూడండి మన పని, ఏ విధముగా ఉన్నదో మనము ఎవరికి భయపడాలో, వారికి భయపడుచున్నామా? సమాజములో నీవు బ్రతుకుతున్నావు. నీవు ఎవరికి ఏ విధముగా విలువ ఇవ్వాలో ఆ విధముగా గౌరవించు కానీ ఇంతకంటే గొప్ప విలువ దైవానికి ఇవ్వాలి కదా! దేవునికి విలువ ఇవ్వకుండా, దేవుని సేవ చేయకుండా బ్రతికితే, ఇది మంచిదా! ఏముంది ప్రపంచములో మనమందరం పుట్టాము అంటున్నారు. ఆ విధముగా పుట్టడానికి ఎవ్వరికీ హక్కులేదు. నీకు ఒక చరిత్ర ఇచ్చి, నీకు ఒక కర్మను అంటగట్టి, నీవు ఈ విధముగా నడుచుకో, అని చెప్పి, ఏ సమయములో ఎంత శాతము అనుభవించాలో పెట్టినటువంటి వాడు దేవుడు.

అటువంటి దేవున్ని విడిచిపెట్టి, దేవుడు సృష్టించిన వస్తువులను నమ్ముకుంటున్నావు. దేవుడు సృష్టించిన మనుషుల్ని నమ్ముకుంటున్నాము. ఒకడు ప్రయాణం చేయాలనుకున్నాడు, కొబ్బరికాయ, నిమ్మకాయను తీసుకుని వెళ్ళాడు. ఆ వాహనమునకు నిమ్మకాయపెట్టి, టెంకాయ కొట్టి పూలు దానికి వేసి దానిని నమ్ముతున్నావు తప్ప, ఈ విశ్వమంతటినీ సృష్టించిన దేవునిమీద మాత్రము నమ్మకము లేదు. సరే అందరూ ఆ విధముగానే వాహనములకు పూజ చేస్తారు కానీ, ప్రయాణం సజావుగా సాగుతుందా? లేదు, పెళ్ళికి ముందు ఒక దేవతకు మ్రొక్కుకొని వెళ్ళినా ప్రమాదములు జరుగకుండా ఉన్నాయా? అంటే ఏది జరగాలో అదే జరుగుతుంది. అందరికంటే అధికారైనవాడు ఒకడున్నాడని మరచిపోయి కూరగాయల వ్యాపారి వాడు అమ్మే వంకాయలకు మొక్కడుగానీ అవి అమ్మిన తర్వాత వచ్చిన డబ్బులకు మ్రొక్కును. జ్ఞానము తెలిసినవారికి అది తప్పే అనిపిస్తుంది. తెలియని వారికి, మనము డబ్బువలనే బ్రతుకుచున్నాము

www.thraithashakam.org

కదా! డబ్బుకు మ్రొక్కితే తప్పేమిటి? అంటారు. మొదటివాడు, చివరివాడు, నీకు బ్రతుకుతెరువు చూపువాడు, నీకు ఎంత ఆహారము ఇవ్వవలెనో, అంతే ఇచ్చువాడు, దానిని నిర్ణయించువాడు ఒకడున్నాడు. "నాకు తెలియకుండా ఏదీ జరగలేదు ఈ ప్రపంచములో" అంటాడు ఆ దేవుడు.

నాకు తెలియకుండా నీవు పుట్టలేదు. నాకు తెలియకుండా నీవు చావలేవు. ఇంకా ఏమి చెప్పెనంటే, నీ తలమీద వెంట్రుకలు కూడా లెక్కించే పెట్టాను అన్నాడు. **'కర్మ విసర్గః'** అని భగవద్గీతలో చెప్పెను. కర్మను చీల్చి, చీల్చి పెట్టాడు. ఈ అర్థాన్ని చూసుకోలేదు. ప్రతీవాడు సృష్టికే మ్రొక్కుచున్నాడుగానీ, సృష్టికర్తకు మ్రొక్కలేదు. ఈ రోజు నేనందుకే నన్ను ఎవరూ మ్రొక్కవద్దని చెప్పేది. నేను ఒక మనిషిని, సృష్టిలో ఒక భాగాన్ని, నాకు మ్రొక్కితే ఏమొస్తుంది? అసలైన దేవునికి మ్రొక్కండి. ఒకవేళ మీరు మ్రొక్కుచున్నారు కదా అని నేను ఎవరినీ దీవించలేదు కూడా.

అజ్ఞానముతో మీరెవరైనా మాకు అనుకోకుండా మ్రొక్కినా సరే మేము ఎవరికీ, ఏమనీ దీవించలేదు. నేను మ్రొక్కించుకునే దానికి అర్హుణ్ణికాను అని అనుకుంటున్నాను. ఒకవేళ తెలియక నన్ను మ్రొక్కారను కోండి, నా లోపలున్న వాడికే మ్రొక్కారులే అనుకుంటాను. కానీ మీరు మాత్రము ఫలానావాడికే మ్రొక్కుతున్నాను అనుకుంటారు. అందుకే మా మెడలో పూలమాలలు వెయ్యవద్దు అని చెప్పుచుంటాము. ఎప్పుడైనా మా మెడలో పూలమాలలు వేసుకోవటం చూశారా? ఈ విషయములను అందరికీ తెలియజేసే విధముగా బోర్డులలో వ్రాశాము. 'మాకు మ్రొక్కవద్దు. మ్రొక్కితే దేవునికే మ్రొక్కండి, దేవుడే మ్రొక్కించుకునేందుకు అర్హుడు'. నేను చెప్తున్న జ్ఞానము నాకైనా అమలు కావలసిందే, నాకు కూడా వర్తిస్తుంది. కనుక విలువంతా అసలైన దేవునికే ఇవ్వవలెను. నిన్ను అడిగి మీ తల్లిదండ్రులు

www.thraithashakam.org

నిన్ను పుట్టించుకోలేదు. దేవుడు తల్లి గర్భములో శిశువును నిర్మింపకుండా ఏ శిశువు పుట్టేందుకు అవకాశము లేదు. ఒక స్త్రీకి పురుష సంబంధము వలననే శిశువు పుట్టును అన్న గ్యారంటీ ఏమీ లేదు. దేవుని సంకల్పము చేతనే ఒక స్త్రీకి పదిమందైనా పుడతారు, దేవుని సంకల్పము లేకపోతే ఒక్కరైనా పుట్టరు. ఒకరికి పదిమంది పుట్టి నీకు ఒకరు కూడా పుట్టక పోవుటకు కారణమేమి?

అందరికీ అధికారి ఒకడున్నాడు కావున మనము ఈ రోజునుండి ఏమి చేయాలి. సృష్టికర్త అంటే ఎవరు? సృష్టికి విలువిస్తున్నామా? సృష్టికర్తకు విలువిస్తున్నామా? అని మనము చూసుకొని జాగ్రత్త పడటం మంచిది. త్రాడు దారిప్రక్కన ఉంటే, పామనుకొని భయపడి దూరముగా పోతాము. తాడును పామనుకొని భయపడుచున్నావు. నిజంగా పామే కనబడితే ఇంకా భయపడతావు. ఈ విశ్వమంతా 70 శాతము నీరుంది, 30 శాతము భూముంది. ఈ 30 శాతము భూమిలో 194 దేశాలున్నాయి. 194 దేశాల్లో మనుషులు కాక జంతువులు కాకుండా ఎన్నో రకముల జీవరాశు లున్నాయి. మరి వీటన్నింటినీ తయారు చేసిన వాడిని గుర్తుంచుకోకపోవటం మంచిదా? కనుక నీవు సృష్టిని ఆరాధిస్తే సృష్టిలోనే ఉంటావు. సృష్టికర్తను ఆరాధిస్తే సృష్టికర్త వద్దకే చేరుదువు. ఈ విషయము భగవద్గీతలో ఉంది. ఈ రోజు మానవుడు 200 రూపాయలు పెట్టి జ్ఞానగ్రంథాన్ని కొనుటకు వెనుకాడుతున్నాడుగానీ 500 రూపాయలైనా సరే కేజీ మాంసాన్ని కొని తినుటకు ఇష్టపడుతున్నాడు. అంటే ఈ రోజు తింటే రేపటికి నీ శరీరములో అదేమి మిగలదుగానీ జ్ఞానగ్రంథము నీ తలలో ఎంతయినా పట్టగలదు. అందులో ఉండే జ్ఞానమును మిగతావారు చూసి వారి తలలోకి ఎక్కించుకో వచ్చును కానీ, పుస్తకమేలే, మాములే తరువాత చూద్దాం అంటారు.

www.thraithashakam.org

కొందరికి లక్షల ధనము ఉంటుంది. జ్ఞాన గ్రంథాలను చూస్తారు గానీ ఖర్చుపెట్టి కొనరు. దానిని లోభము అంటారు. కర్మసిద్ధాంతము ప్రకారము ఎంత సంపాదించిన వారికి ఎంత మిగలాలో అంతే మిగులుతుంది ఒక ఊరిలో ఒక వ్యాపారి ఉన్నాడు కష్టపడి 4 లక్షలు సంపాదించాడు. మనకి ఆ డబ్బు మన తెలివికొద్ది లభ్యమవుతూవుంది అని అనుకున్నాడు. ఇంతలో అతని భార్యకు రోగమొచ్చింది. అప్పుడు కొంత డబ్బుపోయింది. ఆ తరువాత అతనికి జబ్బు చేసింది. అప్పుడు ఉన్న డబ్బు కూడా పోయింది. ఇద్దరూ బాగైన తరువాత ఇంటికి పోయి చూస్తే, వెయ్యిరూపాయలే మిగిలింది. ఆ వెయ్యి మొదట వ్యాపారం చేసుకొనుటకు మొదలు పెట్టిన సొమ్ము అది. అంతవరకు కనిపించే సొమ్ము కనపరాకుండా పోయింది, ఇప్పుడు నీ తెలివి ఏమయింది? కొందరు అదే తెలివిని జ్ఞానం దగ్గర కూడా చూపిస్తుంటారు. కనుక సృష్టికర్త పైన ధ్యాస ఉంచండి.

కొందరు సృష్టిపైన ధ్యాస ఉంచకపోతే ఏ విధముగా బ్రతికేది? చెప్పేవారు మీరు ఎలాగైనా చెప్తారు. సృష్టికి విలువివ్వకపోతే ఎట్లా బ్రతికేది? అని అంటారు. ప్రకృతిలో నేనిట్లే బ్రతకాలి, అట్లే బ్రతకాలి అని నీవు అనుకుంటున్నావు, నువ్వు అనుకుంటున్నట్టు ఏమీ జరుగదు. నీకు చిట్టా వ్రాసి, నడిపించేవాడు ఒకడున్నాడు. వాడు ఏ పని చేయించాలో ఆ పనే తెలుసుకుంటే నీకు ఈ విధానమంతా తెలియును. తద్వారా కర్మలో జరుగు కష్టము లెక్కించబడదు. జ్ఞానము నేర్చుకునే విషయములో ఉన్న తృప్తి మరి ఎందులోనూ దొరకదు. కనుక దైవ ధర్మములకు విలువివ్వండి, దైవధర్మాలు తెలుసుకోండి. సృష్టికర్తకు విలువివ్వండి.

www.thraithashakam.org

# ౨౦. గురువులేని విద్య - గ్రుడ్డివిద్య

తేది :07-07-2009

మన వాడుక భాషలో 'గురువులేని విద్య గ్రుడ్డివిద్య' అనే వాక్యాన్ని వాడుదుము. ఆ మాటను పూర్వము ఎందుకన్నారు? ఏ సందర్భమును అనుసరించి అన్నారు? అని మనము ఆలోచించిన, గురువు అనగా దైవము అని ముందే తెలుసుకుంటిమి. దేవుడు కనిపించని వాడు అని అనుకుంటే మరి గురువు అనేవాడు మనిషిగా కనిపిస్తున్నాడు కదా, దేవున్ని కనిపించే (మనిషిగా) గురువుగా చెప్పుకొనవచ్చునా? అని ప్రశ్నించుకుంటే, "దేవుడు కనిపించే గురువుగా తన అంశను పంపించును" అని ఇంతకుముందు చెప్పుకున్నాము. అనగా దేవుడు అనేవాడు పూర్తిగా రాకున్ననూ, దేవుడు మనిషిగా పుడతాడా? అని కొందరు ప్రశ్నిస్తే, దేవుడు మనిషిగా వస్తాడని మేము చెప్పటము లేదు, దేవుని అంశ ప్రపంచమంతా విస్తరించి ఉంది. ఆ విధముగా అంశలో ఒక భాగము, మనిషిగా శరీరము దాల్చిన ఆ మనిషిని గురువు అంటాము.

దీని విషయమై పూర్తిగా అర్థమయ్యేందుకు ఒక ఉదాహరణను తెలియజేద్దాము. విశాలమైన సముద్రము ఉందనుకోండి, సముద్రము నుండి ఒక నీటి బిందువు బయటకు వస్తే, చాలా స్వల్పముగా ఉంటుంది. ఆ విధముగా వచ్చిన బిందువును సముద్రము అని అనడము లేదు కదా! కానీ సముద్రంలో ఉన్న నీరే, నీటిబిందువుగా వచ్చింది అనేది మాత్రము వాస్తవము. ఇప్పుడు సముద్రములో ఉన్నదీ నీరే, నీటి బిందువుగా సముద్రము నుండి వచ్చిన ఆ నీటి బిందువులో కూడా నీరే ఉన్నది. అక్కడ సముద్ర రూపములో నీరున్నది. ఇక్కడ నీటిబిందువు రూపములో నీరు ఉన్నది. కనుక నీటి బిందువును సముద్రము అనలేము, సముద్రమును బిందువు అని అనలేము.

అదే విధముగా దేవుడు గురువుగా వచ్చెను అంటే దేవుని అంశే గురువుగా భూమిమీదకు వచ్చెను. దేవునిలో కూడా గురు అంశ ఉన్నది, అదే విధముగా ఒక శరీరముగా ప్రపంచములోకి వచ్చిన గురువులో కూడా గురు అంశ ఉన్నది. కనుక విశాలంగా కనిపించక ఉన్న దానిని గురువు అనకూడదు, కనిపించే గురువును దేవుడు అనకూడదు. కానీ రెండింటిలోనూ గురు అంశ ఉన్నదనేదీ వాస్తవమే! విశాలంగా ఉన్న పరమాత్మ తన ఇష్టం ప్రకారము తనలోని కొంత అంశను మనిషి రూపములో భూమిపైకి పంపిస్తే, ఆ విధంగా వచ్చే మనిషిని గురువు అంటాము, అనగా దేవుడు గురువుగా వచ్చును కానీ, మనిషి గురువుగా ఎప్పటికీ కాలేడు (రాలేడు). ప్రపంచములో పుట్టిన ఏ మనిషైనా గురువుగా మారలేడు, మరి ఇద్దరూ మనుషులే కదా అంటే మనుష్యులే. కానీ వీడు మనిషిగా వచ్చినవాడు, వీడు మనిషిగా ఉన్నవాడు. మనిషిగా ఉన్నవాడు ఎప్పటికీ మనిషే, కానీ దేవుడు మనిషిగా వచ్చినవాడగును. మరి ఇందరి మనుషులలో "ఎవరు గురువు" అని పోల్చుకోగలము? అంటే పోల్చుకోవాలని నీవు ప్రయత్నం చేస్తే పోల్చు కొనవచ్చును.

విశాలముగా దేవున్ని పోల్చుకుంటే **'రుకారో రూప వర్జితం'** అనవచ్చును. అనగా విశాలముగా ఉన్నవాడికి రూపములేదు స్వల్పముగా ఉన్న మనిషిగా తీసుకుంటే **"గుకారో గుణాతీతః"** ఇక్కడ 'గురు' అనే శబ్దాన్ని తిరగవేస్తే 'రుగు' అగును. ఏదైనా ఒకటే అర్థము వచ్చును. ఇక్కడ మనిషిగా వచ్చిన దేవుని అంశకు రూపము ఉంది, గుణాలకు అతీతుడుగా ఉన్నాడు కనుక అతను 'గురు' అందుము? మరి 'రుగు' అని చెప్పవచ్చు కదా! 'గురు' అని ఎందుకు అనవలెను. విశాలముగా ఉన్న పరమాత్మ మనకు తెలియబడడు, మరి విశాలముగా ఉన్నవాడు

ఎప్పుడు తెలియబడతాడు, చిన్న రూపంలోకి వస్తే తెలియబడును. అక్కడనుండి 'రుగు' అనకపోయినా ఇక్కడ నుండి 'గురు' అనవలెను. అదేమి విశాలముగా ఉన్నవాడి నుండి, విశాలముగా లేనివాడైన గురువు వచ్చాడు కదా! మరి 'రుగు' అనే చెప్పాలి కదా! గురు అని ఎందుకనవలెను? అని ప్రశ్న రావచ్చును. ఒకవేళ 'రుగు' అనేదే నిజమనిన, నీకు తెలియదు కదా, మనకు ఆకారములో ఉన్నవాడు, ఆకారములేని వాడియొక్క జ్ఞానమును తెలియజేస్తే, అప్పుడు ఆకారము లేనివాడైన పరమాత్మ తెలియబడును. కనుక రూపవర్జితుడు గురించి చెప్పాలంటే, గుణాతీతుడైన మనిషిగా వచ్చి తెలియజేయాలి కనుక 'గురు' అని అనవలెను.

ఈ విధముగా 'గురువులేని విద్య గ్రుడ్డి విద్య' అనే వాక్యాన్ని మేము చిన్నప్పటినుండి వినియుంటిమి. అప్పుడు నేను ఆరవ తరగతి చదువుచుంటిని. ఆ రోజుల్లో ముప్పైరూపాయ లిచ్చి, చేతి గడియారం కొనుక్కున్నాను. అది ఏ విధముగా పనిచేస్తున్నదో అని తెలుసుకునేందుకు గడియారాన్ని విప్పి తెలుసుకోవాలనుకున్నాను. అందుకు నా వద్ద స్క్రూడ్రైవర్‌లాంటి పరికరములు లేవు. అందుకుగాను నేను బ్లేడును ఒక డబ్బాకు కట్టి, దాని సహాయంతో స్క్రూలను విప్పితిని. అప్పుడు నేను ఈ విషయమేమి, ఈ ముల్లు ఎవరూ తిప్పకుండా ఏ విధముగా తిరుగుతున్నది అనే సందేహాన్ని తీర్చుకునేందుకు నేను ఆ విధముగా ఆ గడియారాన్ని విప్పి తెలుసుకుంటిని. వాటి పరికరములను అన్నింటినీ విప్పి, గుర్తుగా ఒక వరుస క్రమములో అన్నింటినీ టేబుల్‌పైన పెట్టితిని. ఇంతలో ఒకాయన వచ్చి, "ఏమిటిదంతా?" అని అడిగాడు, అందుకు "వాచీపని నేర్చు కుంటున్నాను" అని నేనంటిని. అందుకు అతను, ఎంతైనా నువ్వు చెప్పు, 'గురువులేని విద్య గ్రుడ్డివిద్య' అవుతుంది. కనుక ఎక్కడైనా నేర్చుకుంటే

బాగుంటుంది అన్నాడు. అందుకు నేను రెండు, మూడుమార్లు ఆ గడియారాన్ని విప్పి, మళ్ళీ వాటిని యథాతథంగా సర్దేసరికి దాని పనియంతా తెలిసిపోయింది. అప్పుడు నేను ఆ వ్యక్తితో నువ్వు చెప్పిన 'గురువులేని విద్య గ్రుడ్డి విద్య' అనేది తప్పు అని చెప్పాను. ఎందుకంటే నాకు ఎవరూ ఏమీ చెప్పకుండానే, నేను నేర్చుకోకుండానే నాకు వాచీ పనితనం తెలిసింది కదా! అని అన్నాను. అంటే ఎట్లైనా సరే, గురువులేని విద్య గ్రుడ్డివిద్యే అని అన్నాడు. ఎట్లైనా కాదు ఎట్లా అది నిజమో చెప్పు, సెకండ్ల ముల్లు ఏ విధంగా తిరుగుతున్నదో, నిమిషముల మరియు గంటల ముల్లు ఏ విధముగా తిరుగుతున్నదో, నేనిప్పుడు గురువులేకుండా తెలుసుకుంటిని కదా! అని అంటే, అవుననుకో, కానీ అదే నిజమంటాడు కానీ నేను 11 సంవత్సరముల వయస్సున్నప్పుడే నేను ఆ వాక్యాన్ని ఒప్పుకోలేదు.

ఇప్పుడు ఈ కాలమునకు వద్దాము. బాలసుబ్రమణ్యం ఉన్నాడు. అతడు సంగీతము నేర్చుకొనకపోయినా పాటలు పాడగలడు. ఆయన ఏ గురువువద్ద నేర్చుకోకుండానే మరి, అతను ఆ సంగీతములో రాణించాడు కదా! మరి గురువులేని విద్యేకదా అది, మరి అలాగే ఐదు, ఆరు సంవత్సరముల పిల్లలే సంగీతాన్ని పాడగలుగుచున్నారంటే, అద్భుతమైన పనులను చేయగలుగుచున్నారంటే దానిని మనము ఇప్పుడు ఏమంటున్నా మంటే, **"జన్మ సంస్కారము"** అంటున్నాము. ఈ విధముగా ప్రపంచములో చాలా విద్యలు గురువు లేకుండానే నేర్చుకున్నవారు, ఆ విద్యలలో రాణిస్తున్నవారు చాలామంది కలరు. కనుక **"గురువులేని విద్య గ్రుడ్డి విద్య"** అనే మాట ప్రపంచ సంబంధమైన విద్యల విషయములో ఇది తప్పు అని చెప్పవచ్చును. విద్య అనగా నేర్చుకునేది అని తెలిసింది. అదే విధముగా గురువు అంటే నేర్పించేవాడు అని తెలిసింది. అయితే గ్రుడ్డివిద్య అంటే ఏమిటి? విద్యలలో గ్రుడ్డివిద్య అనునది ఉంటుందా! ఏ విద్యయితే

నీవు పూర్తిగా తెలుసుకోగలవో చూడగలవో దానిని విద్య అంటాము. గ్రుడ్డివిద్య అంటే, నీవు ఏదైతే నేర్చుకున్నావో, దానియొక్క వాస్తవమైన ఫలితాన్ని పొందలేదో దానిని గ్రుడ్డివిద్య అనవచ్చును. కానీ ప్రపంచ సంబంధముగా ఏ విద్యనైనా సరే గురువు లేకుండానే నేర్చుకొనవచ్చును. కనుక అన్ని విద్యలూ మంచి చూపున్న విద్యలే. మరి పై వాక్యము ఎక్కడ వర్తించుటకు అవకాశం ఉంది, అంటే ప్రపంచ సంబంధమైన ఐదు శాస్త్రములు కాకుండా ఆరవ శాస్త్రమైన బ్రహ్మవిద్యా శాస్త్రము మాత్రం నేర్చుకొనుటకు తప్పకుండా గురువు అవసరము. బ్రహ్మవిద్యలో గురువు లేకుండాపోతే గ్రుడ్డివిద్య అగును. బ్రహ్మవిద్యలో గురువుంటే చూపున్న విద్య అగును. అయితే గురువు ఎవరు? ఎవరో తెలియదు. గురువు ప్రపంచంలో ఇతనే అని చెప్పుటకు అవకాశం ఉన్నదా? లేదు ఒకవేళ నేను చెప్పగలను అని ఎవరైనా అంటే, నిన్ను అలా చెప్పనివ్వకుండా చివరన కూర్చుండ బెడుతుంది మాయ. మరి ప్రపంచములో గురువెవరు? అని ఎవరికీ తెలియదు. మరి తెలుసుకొనుటకు అవకాశం ఉందా అంటే, గురువు అనేవాడు ఉంటే, దేవున్ని చేరేందుకు ధర్మాలను తెలియజేస్తే, ఆ ధర్మాల వలన తెలియగలిగేవాడు గురువు. ధర్మాలేంటో తెలియవు, సంపూర్ణ జ్ఞానం తెలియదు, మరి గురువును ఏ విధంగా కనుక్కోగలం, కనుక్కునేందుకు అవకాశం లేదు. ఒకవేళ గురువును కనుక్కున్నావు అంటే నీకు జన్మరాహిత్యం కలుగుతుంది. ఎందుకంటే కర్మంతా అయిపోయింది, కావున మోక్షమును పొందినట్లే లెక్క! కనుక మోక్షం పొందును కాని గురువును కనుక్కోవటం దుస్సాధ్యము.

మేము వ్రాసిన **"గురు ప్రార్థనా మంజరి"** అనే గ్రంథములో ఒక ప్రశ్నవేశాము. గురువుకు శిష్యులుంటారా? ఎంతటి అజ్ఞానం కల్గిన వ్యక్తిని

ఈ ప్రశ్న అడిగిననూ, ఇది తెలివితక్కువ ప్రశ్న కాదా? అని అందురు. ఆ విధంగా అనటమే కాక, శిష్యులు లేకుండా గురువెట్లు అవుతాడు? అని అందురు. గురువుకు శిష్యులుంటారా? అనే ప్రశ్న బుద్ధివున్న మాటేనా! అనుకుంటారు కానీ "గురువుకు శిష్యులుండరు" అని మేము చెప్పుచున్నాము. వీడు ఫలానావాడు గురువు అని తెలిస్తేకదా శిష్యులుండేందుకు, అది తెలియదు కావున శిష్యులు ఉండేందుకు అవకాశమే లేదు. ఒకవేళ భక్తులు ఉండవచ్చు, విశ్వాసం ఉన్నవారు ఉండవచ్చుగానీ శిష్యులనేవారుండరు. కునుక గురువును కనుక్కునేవారు లేరు, శిష్యులు అంతకూ లేరు.

మరి గురు, శిష్యులనే పేరు ఎట్లు వచ్చింది? నాకు ఇష్టమొచ్చినట్లు నేను పెట్టుకున్నాను, నీకిష్టమొచ్చినట్లు నీవు పెట్టుకున్నావు. ఆ లెక్క ప్రకారం ప్రపంచములో గురువులెంతమంది ఉన్నారు? శిష్యులెంతమంది ఉన్నారు? మన లెక్కప్రకారం గురువు ఒక్కడే ఉన్నాడు, రూపం లేకపోతే దేవుడు, రూపము ఉంటే గురువు. ఎప్పుడొస్తానన్నాడు దేవుడు గురువుగా, తనకు ఇష్టం వచ్చినప్పుడు వస్తానన్నాడు. తనకు ఏమి అవసరమొస్తుంది, ధర్మాలు ఎప్పుడు భూమిమీద లేకుండా పోవునో, అధర్మాలు ఎప్పుడు భూమిమీద చెలరేగునో, అప్పుడు తిరిగి ధర్మాలను తెలియజేసేందుకు అవసరమై నేను వచ్చెదనని దేవుడు చెప్పినాడు. అధర్మాలు చెలిరేగినప్పుడు అంటే అధర్మాలేవో తెలియదు ఇక ధర్మాలు ఏమి తెలుసు? తనేదైతే నడచుకుంటున్నాడో అదే ధర్మము అనుకుంటాడు మనిషి. ఆ విధంగా ఉన్నవారు చాలామంది ఉన్నారు. ఇ(హి)ందువులున్నారు వారు నమ్మే ధర్మాలను గొప్పవని కొందరు హిందువులనుకుంటే, ఇంకొందరు మావే నిజమైన ధర్మములని వారు అనుకుంటున్నారు. శైవులని, వైష్ణవులని, ఇంకొకరని, వారే కాకుండా, ఇందూ (హిందూ) మతాన్ని సంస్కరించే వాళ్ళమని, ఇందూ ధర్మరక్షకులమని

పేరుపెట్టుకునే వారున్నారు. సరే ధర్మము అంటే ఏమిటో తెలుసునా? దేవుడొచ్చి చెప్తే తెలుస్తుంది. మరి సమాజము తనకు తెలిసినదే ధర్మమనుకొని, నిజమైన గురువు వచ్చి చెప్పుచున్ననూ, ధర్మములను వ్యతిరేఖించి, నీవు చెప్పునదే అధర్మము, నేను చెప్పినదే ధర్మము అని తిరిగి ప్రశ్నిస్తారు. ఎందుకంటే వాడికి 'ధర్మము' అంటే నిర్వచనము తెలియదు కదా! మరి అధర్మాలు చెలరేగుతున్నాయని గుర్తించగలిగే వాడెవడు? దేవుడే! కనుక ధర్మాలను ప్రతిష్ఠించేందుకు వచ్చును. ఆ కాలమెంత ఉంటుందంటే, కొన్ని వేల సంవత్సరములకైనా ఉండవచ్చు, కొన్ని లక్షల సంవత్సరములకైనా, కొన్ని కోట్ల సంవత్సరములకైనా ఉండవచ్చు. మరి అతను వచ్చి, ఇవి ధర్మములు అని చెప్పిననూ వినే పరిస్థితిలో మనము ఉన్నామా అంటే లేము. ఎందుకంటే మనకు తెలిసినదే ధర్మము అని అనుకునే దానివలన, మానవునిగా దేవుడు వచ్చిననూ, ఆయనను వ్యతిరేఖించి, నీవు దుర్మార్గునివి, చాలా తప్పుడు పనులు చేసినవాడవు, అని అనే వారున్నారు.

దేవుడు కృష్ణుని రూపములో భూమిమీదకు వచ్చాడు. అది మనము గ్రహించింది, ఆయన చనిపోయిన కొన్ని వేల సంవత్సరములకు, అదియునూ మనమే చెప్పుకుంటున్నాము. కొందరు ఆయనను జగద్గురువంటే ఒప్పుకోరు, పరమాత్మ అంటే ఒప్పుకోరు. దేవుని అవతారమంటే ఒప్పుకోరు. ఎందుకు ఒప్పుకోరంటే, ఆయన చేసే పనులు చూడయ్యా! అంటారు. మనమేమంటా మంటే ఆయన చెప్పిన జ్ఞానము చూడండి అంటాము. వారేమంటారు, ఆయన చెప్పిన జ్ఞానము అవసరము లేదు, ఆయన చేసిన పనులు చూడండి అందురు. అదియునూ గాక అటువంటి పనులు చేసిన శ్రీకృష్ణుడు గురువెట్లవుతాడు? అని అందురు. మరి అటువంటి పనులు చేసినట్లు ఆయన ఉండకపోతే, ఆయనను గురువని మనమంతా

www.thraithashakam.org

కనిపెట్టేస్తాము కదా! మరి ఆయనను కనుక్కోకుండా ఉండాలంటే, మనలాంటి మనిషి మాదిరిగానే ఉండవలెను. నీవెట్లా అయితే ఆయనను అజ్ఞాని అని అందువో, ఆయనట్లే కనిపిస్తాడు. ఆయన చెప్పే విషయాలను నీవు గ్రహించకపోతే నీవు అతనిని అజ్ఞాని అనే అంటావు. ఆయన నీ చేత పనికిమాలినవాడు అని అనిపించుకోవాలనే ఆయన ఆ పనులన్నీ చేస్తాడు, నీవు గుర్తించకూడదనే చేస్తాడు. కానీ ఆయన ఏ సందర్భములో ఏ జ్ఞానము చెప్పవలెనో అదే చెప్పి, ఆయన వెళ్ళిపోవును. శ్రీకృష్ణుడు 126 సంవత్సరములు బ్రతికెనంటే, ఎంతకాలము జ్ఞానము చెప్పినాడు? రెండు, మూడు నిమిషములు చెప్పినాడు అంతే! రెండు, మూడు నిమిషములు జ్ఞానము చెప్పేవాడు గురువెట్లు అవుతాడని కొందరంటారు. కానీ ఆయన చెప్పినది అమృతంలాంటిది. అది ఎన్నో రోగములకు పనిచేస్తుంది. అజ్ఞానమనే రోగాన్ని తీసివేస్తుంది. కావున, ఆయనను మనము గురువు అంటున్నాము. అదియునూ మనమే అంటున్నాము. ఆదిశంకరాచార్యులను జగద్గురువు అంటున్నారు.

ఇప్పుడు ఈ విషయములో వాస్తవం చెప్పాలి కావున, విమర్శించి చెప్పక తప్పదు. మూసిపెట్టి చెప్పిన ఏమర్థమగును? మీరు భయంలేకుండా ఈ విధంగా చెప్పుచున్నారు అంటే, చెప్పకతప్పదు. భయపడి వాస్తవమును చెప్పకుండా మూసిపెట్టలేము కదా! అదేమి శ్రీకృష్ణుడు ఎప్పుడూ స్త్రీలోలుడై కనిపించగా ఆయనను గురువు అంటారు. ఎప్పుడూ కాషాయాంభరములు ధరించి నెత్తిన ముసుగు వేసుకుని, స్వచ్ఛంగా ఉండేవారిని జగదుర్గువు కాదంటారు అని కొంతమంది మమ్మల్ని ఎదిరించి మాట్లాడవచ్చును. మాట్లాడినా ఫరవాలేదు కానీ, సత్యం చెప్పటంలో మేము భయపడకూడదు కదా! కనుక శంకరాచార్యులు జగద్గురువు ఏ విధంగా అగును? అని

మనము ప్రశ్నించుకుంటే, ఆయనకు చాలామంది శిష్యులున్నారు కావున, ఆయన చెప్పిన విషయాలను ధర్మాలుగా జగత్తంతా ఆచరిస్తున్నారు కావున ఆయనను జగద్గురువు అంటున్నారు. అలాగయితే శ్రీకృష్ణున్ని కూడా ఒకప్పుడు జగద్గురువుగా చెప్పినవారున్నారు. మరి ఆయనకు ఒక్క శిష్యుడు కూడా లేడు. కనీసం అర్జునునికి విశ్వరూపము చూపించిననూ, ఇదంతా భ్రాంతివలె జరిగింది అని అనుకున్నాడుగానీ, ఆయన శిష్యునిగా ఎక్కడా పరిగణింప బడలేదు. మరి ఇప్పుడైనా మీలో ఎవరైనా చెప్పండి, కృష్ణునికి ఎవరైనా ఫలానావాడు శిష్యుడున్నాడా? ఒక్క శిష్యుడు కూడా లేనటువంటి వాడు జగద్గురువా? అంటే జగద్గురువే, మరి చాలామంది శిష్యులుంటే వారిని జగద్గురువు కాదంటున్నారు, ఒక్క శిష్యుడు కూడా లేని కృష్ణుడిని జగద్గురువు అనడమేమి అని ప్రశ్నిస్తే? విశాలముగా ఉన్న పరమాత్మ, తన అంశను గురువుగా పంపించును, అతనే అసలైన గురువు. కనుక మనుషులకు గురువు అనే పేరు తగిలించటం పొరపాటు.

దేవుడు భూమిమీదకు వస్తే గురువగును. మనిషిగా ఉన్నవాడు ఎప్పటికీ గురువు కాలేడు. కనుక మనిషిగా పుట్టిన శంకరాచార్యులు **"గురువు"** అనే పదము ఆయనకు వర్తించదు కానీ, శ్రీకృష్ణునికి వర్తిస్తుంది. మరి శిష్యులు లేకుండా గురువెట్ల అగును అంటే, శిష్యులు లేకపోయినా ఆయన జగద్గురువే. ఎందుకంటే ఆయన చెప్పిన ధర్మము జగత్ అంతటికీ వర్తిస్తుంది. ఎవరు చెప్పిన ధర్మము (లోకమంతటికీ వర్తిస్తుందో) జగత్ అంతా వర్తిస్తుందో ఆయనే జగద్గురువు. శంకరాచార్యులు చెప్పిన ధర్మము వారి కులంలోని వారికే వర్తిస్తుంది గానీ ఇంకెవరికీ వర్తించదు, అందుకే అతనికి ఒక హరిజనుడు ఎదురొస్తే, "చండాలుడవు ప్రక్కకు పో!" అన్నాడాయన. అంతా సమానమే అని చెప్పినవాడు, మరల చండాలుడుని

www.thraithashakam.org

ప్రక్కకు పొమ్మన్నాడు. దీనినిబట్టి అద్వైతములో సమానత్వము లేదని తెలియుచున్నది.

ఒకసారి గుంతకల్ ఆశ్రమములో మేము వెళ్ళి కూర్చున్నాము. సాయంకాలము ఆరుగంటలకే రమ్మనమన్నారని వెళ్ళటం వలన ముందు వరుసలో కూర్చున్నాము. కానీ ఇంతలో కొందరు వచ్చి, మీ అందరూ వెనక్కిపొండి ఇక్కడ వేరేవారు కూర్చోవాలి అన్నారు. అంటే వారికి వారు ముందు వరుసలో కూర్చుంటారంట. మాకు విషయము తెలియదు. తర్వాత కొంతసేపటికి ప్రసంగము జరిగినది. చెప్పిన ప్రసంగములో విషయమే మంటే, అంతా పరబ్రహ్మ స్వరూపులమే ఆదిశంకరాచార్యులు అదే విషయాన్ని చెప్పినాడు, అని చెప్పారు. మమ్మల్ని మీటింగులో వెనక్కి పంపించి అంతా సమానమే అని చెప్పటములో ఏమి ఆచరణ ఉన్నదని మేము ప్రశ్నిస్తున్నాము. అంటే ముందు కూర్చున్నవాడు ఒక పరబ్రహ్మ, వెనుక కూర్చున్నవాడు ఇంకొక పరబ్రహ్మనా? అంతా సమానమైతే ఎవరు ఎక్కడ కూర్చుంటే మీకేమి? కానీ ప్రసంగములో "మనమంతా ఒకటే అలా చూడకపోతే పొరపాటు" అని అంటున్నారు. ఎదురుగా మీరే ఆ పొరపాటు చేస్తుంటే, మీరు చెప్పే బోధలు కొందరికి వర్తించును గానీ అందరికీ వర్తించవు అని అర్థమవుతున్నది కదా! కనుక జగత్తంతటికీ ఆయన చెప్పినవి వర్తించటము లేదు. జగత్తంతా ఎందుకు ఆ గుంతకల్‌లోనే వర్తించలేదు. కనుక జగత్ అనగా 'జ' అంటే పుట్టేది 'గత్' మరణించేది అనగా సర్వజీవ రాసులకు వర్తించేది జ్ఞానము ఏదైతే ఉందో, దానిని చెప్పినటువంటివాడు జగద్గురువు.

**"జాతస్య హిధృవో మృత్యుః ధృవం జన్మ మృతస్యచ"** అనగా "పుట్టినటువంటివాడు మరణింపక తప్పదు. మరణించినవాడు పుట్టక తప్పదు". ఈ సూత్రము జగత్తంతటికీ వర్తించేది కనుక ఆయనను

జగద్గురువు అనవచ్చును. తర్వాత శైవము, వైష్ణవం, ఇంకొకటి, ఇంకొకటి వచ్చాయికానీ శైవము చెప్పింది వైష్ణవానికి వర్తించదు, వైష్ణవం చెప్పింది శైవానికి వర్తించదు. వైష్ణవం వైష్ణవులకే వర్తించును, శైవం శైవులకే వర్తించును. మొన్నటికి మొన్న అన్నవరము దేవాలయమునకు అయ్యప్ప భక్తులొస్తే శైవులని చెప్పి ఆలయములోనికి ప్రవేశింపనీయలేదట! అనగా వీరు చెప్పిన వైష్ణవ సాంప్రదాయము అయ్యప్ప భక్తులకు వర్తించవట. ఎందుకంటే వీరు విభూది పెట్టుకున్నారు, వారు నామాలు పెట్టుకొంటారు. కనుక వారి సిద్ధాంతము వీరికి వర్తించలేదు. లోకములో ఉన్న తేడాలన్నీ నాకు ఈ మధ్యన తెలిశాయి. ఎందుకంటే ఒకసారి విభూతి పెట్టుకున్న స్వామివద్దకు వెళ్ళాము. అక్కడకు వెళ్ళిన తరువాత, వీరికంతా నామాలున్నాయి. వీరంతా వైష్ణవులు అని అనుకోవటానికి, అవకాశము లేదు కనుక, మమ్మల్ని వేరే మత ప్రచారము గురించి చెప్పటానికి వచ్చినవారని మమల్ని వద్దన్నారు. ఇ(హి)ందువులుగా మనముండి, పరమాత్మయిన శ్రీకృష్ణుడు చెప్పిన, భగవద్గీతను ప్రచారము చేయుటకుపోతే, మమ్మల్ని వేరే మత ప్రచారకులు అని విభూతి పెట్టుకున్నవారు అన్నారంటే, వీరంతా జగద్గురువులు ఏవిధముగా అయ్యారు?

వాస్తవంగా గురువు అనేవాడు కొన్ని లక్షల, కోట్ల సంవత్సరములకు వచ్చును. అంతవరకు గురువులు ఉండరు, గురువు ఉండును. ఎప్పుడైనా భూమిమీద గురువు ఒక్కడే ఉంటాడు. ఇద్దరు, ముగ్గురు ఉన్నారంటే, ఒక్కడు మినహా మిగతా వారు గురువులు కారు అని తెలియవలెను. ఒకవేళ నిజమైన గురువు భూమిమీద ఉన్నప్పుడు, గురువులు చాలామంది ఉన్నారంటే ఆయన దానిని అంగీకరించడు. గురువు భూమిమీద ఉన్నాడు అంటారా? గురువులు భూమిమీద ఉన్నారంటారా? కానీ ఈ రోజు వేలసంఖ్యల్లో,

లక్షల సంఖ్యల్లో గురువులున్నారు. శిష్యులను నలుగురిని వెంటవేసుకుని తిరిగితే చాలు అతనొక గురువే, ఈ విధంగా సమాజము తయారయినది. కానీ నిజగురువు దేశాలతో సంబంధము లేకుండా విశ్వంలో ఎన్ని దేశాలున్నాయో అన్నింటికీ ఒక్కడే గురువు ఉండును. అతను ఎంత కాలముండును అని ఏమాత్రము చెప్పలేము. మరి ప్రపంచములో ఎంతోమంది గురువులుగా చెలామణియై, ద్వైతమనో, అద్వైతమనో చాలా విద్యలు నేర్చుచున్నారు కదా, మరి ఆ విద్యలను ఏమనాలి? గురువులేడు కనుక గ్రుడ్డివిద్యే! అగును.

మిగతా సిద్ధాంతములను చెప్పిన వాడు గురువు కాదు కావున గ్రుడ్డివిద్యే మరి! గురువున్నప్పుడు, గురువే ప్రత్యక్షముగా చెప్పు విద్య, నిన్ను మోక్షమునకు పంపించును. కావున ఆ విద్య చూపున్న విద్య అగును. ఎందుకంటే ఈ మార్గము జ్ఞానమార్గము కావున, ఆ మార్గము ద్వారా నీవు పోయి, మోక్షమనే గమ్యాన్ని చేరుకుంటావు. ఇది కాకుండా గురువుకాని విద్య, **"గురువులేని విద్య గ్రుడ్డివిద్యే"** అగును. దీన్ని తెలియ జేసేందుకే పూర్వపు పెద్దలు గురువులేని విద్య గ్రుడ్డివిద్య అన్నారు. మరి ఈ రోజు ఇంతమంది గురువులొచ్చి, వైష్ణవమని, శైవమని, ద్వైతమని, అద్వైతమని, విశిష్టాద్వైతమని, రకరకాల పేర్లు పెట్టుకున్నారు. మరి భగవద్గీతను చెప్పిన జగద్గురువైన శ్రీకృష్ణుడు, అతను చెప్పిన భగవద్గీతను బ్రహ్మవిద్యాశాస్త్రములో వీరు పెట్టిన శైవము, వైష్ణవమని పేర్లు ఏ శ్లోకములో ఉన్నాయో చెప్పమనండి.

ఇదేమి! మా మీద కక్ష కట్టినట్లు చెప్పుచున్నాడు అని వారు అనుకొన వచ్చును, కానీ ఉండే విధానమును గూర్చి మాత్రమే మేము చెప్పుచున్నాము గానీ, కల్పించి ఏదీ చెప్పటము లేదు. ఈ విధముగా అయితే ఎలాగ అని కొందరనుకోవచ్చును. ఇదేమి ఇతను ఇంత వ్యతిరేఖముగా చెప్పడమేమి,

www.thraithashakam.org

ఇంతమందికి వ్యతిరేఖమవడమేమి? ఈయన చెప్పినది జ్ఞానమే కావచ్చును. మమ్మల్ని గురువులు కాదు అనేస్తే అదే నిజమనుకొని మమ్మల్ని ఎవరూ ఆదరించకపోతే మాకు ఉపాధి ఏ విధంగా జరుగుతుంది, ఎట్లా బ్రతికేది? ఈ విధముగా ఈయన చెప్తే మాకు కోపం రాదా? అని కొందరు అనవచ్చును.

దేవుని విషయములో అసత్యము చెప్పకూడదు కావున అలా చెప్పవలసి వచ్చినది. ప్రతీదీ కర్మప్రకారము వ్రాసిపెట్టబడి ఉందో, ఎప్పుడైతే దేవుడు ఆజ్ఞ చేసి పెట్టెనో, ఆ సమయములోనే మనము చనిపోవుదుము. క్షణం ముందుగానీ, క్షణం వెనుకగానీ వ్యత్యాసము జరుగదు. మరి మీకందరికీ కోపము వస్తున్నదని మేము అసత్యము చెప్పకూడదు. ఎందుకంటే దేవునిజ్ఞానము అటువంటిది. అందులో ఉన్న సత్యము అటువంటిది. అది మరచిపోతే ఎవరికైనా భయము ఉంటుంది. కనుక మేము ఇప్పుడు ధర్మములు చెప్పుచున్నాముగానీ అధర్మములేమీ చెప్పటము లేదు కదా! కానీ మమ్మల్ని చాలామంది వ్యతిరేఖించారు, దూషించారు, ధర్నాలు చేశారు, మమ్మల్ని గురించి చెడ్డగా మాట్లాడినారు, పైగా వారే నిజమైన భక్తులని నినాదాలు చేశారు. కానీ అది నిజమైన భక్తా? కాదు! గురువు అసలుకు లేడు, వారికి వాస్తవ జ్ఞానము తెలియదు. అయితే మీరందరూ నన్ను, మరి మీరు చెప్పేది గురువున్న విద్యయా అని ప్రశ్నించ వచ్చును. మరి మీకు గురువున్నాడా? అని ప్రశ్నించవచ్చును. మొట్టమొదటే నేను చెప్పుకున్నాను, నాకు ఎలాగూ గురువులేదని ఎందుకంటే, ఇప్పుడు ప్రత్యక్షంగా ఉండేవాడయితే గురువున్నాడని చెప్పుకోవచ్చును, కానీ ఇంకొక విధానంగా నేను చెప్పుచున్నది ఏమనగా! ఒకరోజు శ్రీకృష్ణుడు గురువుగా ప్రత్యక్షముగా ఉన్న రోజున కూడా ఇతనిని గురువుగా ఎవ్వరూ కనుక్కోలేక

www.thraithashakam.org

పోయారు. అర్జునునికి తాను స్వయంగా విశ్వరూపమును చూపించిననూ అతడు గుర్తుపట్టలేని స్థితిలో ఉన్నాడు. చివరకు అర్జునుడు అతనిలోని గుణాల రూపములో ఉన్న మాయ, ఈయన ఏం దేవుడు, అదేదో నాకు భ్రాంతి కల్గించినాడు అనుకున్నాడు. నిజంగా ఆ రోజు అర్జునునికి విశ్వాసము లేదు. ప్రత్యక్షముగా ఉన్నప్పుడు కృష్ణున్ని ఎవ్వరూ గుర్తించలేదు. కృష్ణుడు భగవద్గీత అను జ్ఞానము చెప్పిన తరువాత కొన్నేళ్ళు బ్రతికే ఉన్నాడు. ఆయన 90 సంవత్సరముల వయస్సులో భగవద్గీతను చెప్తే మరలా 36 సంవత్సరములు దాదాపు అలా చెప్పిన తరువాత బ్రతికాడు. భగవద్గీతను చెప్పిన తరువాత బ్రతికుంటే ఎవరైనా గుర్తించారా అంటే ఎవరూ గుర్తించలేదు.

చాలామందికి భగవద్గీతను చెప్పాడన్న విషయము కూడా తెలియదు, భీష్మునికి ఆయన చెప్పిన ధర్మాలు తెలియవు. అయినా ఈయన దేవుడని భీష్మునికి తెలుసు. అందుకే భీష్ముడు యుద్ధరంగములో క్రిందపడిపోయిన తరువాత, ఎవరినీ పిలువక కృష్ణున్నే పిలిచి, నాకీ జన్మవద్దు, నీలో ఐక్యం చేసుకో అని కృష్ణున్ని కోరాడు. పద్ధతి ప్రకారము మోక్షం పొందాలంటే ఉత్తరాయణం వచ్చేంతవరకు ఉండవలెను. అదియునూ పగలు మాత్రమే చనిపోవాలి. ఇదంతా మార్గము కావున, భీష్ముడు క్రింద పడిపోయినప్పుడు ఉత్తరాయణం వచ్చేంతవరకు ఉండు అన్నాడు కృష్ణుడు. ఆ విధంగానే పది, పన్నెండు రోజులు ఉండి భీష్ముడు మోక్షం పొందగలిగెను. మరి ఆయన ఏ విధంగా దేవుడని కనిపెట్టాడో మాకు కూడా తెలియదు. దేవుడు, గురువై శ్రీకృష్ణుడుగా ప్రత్యక్షంగా ఉన్నప్పుడు జరిగిన విషయమిది. మరి పరోక్షంగా దేవుడు గురువై ఉన్నప్పుడు, శ్రీకృష్ణుడు భూమిమీద లేనప్పుడు మీరాబాయి ఆయనను దేవుడని నమ్మింది, ఆమె కూడా మోక్షం పొందినది.

www.thraithashakam.org

మరి ఆయన చెప్పిన ధర్మాలను, భగవద్గీతను ఏమైనా చదివిందా అంటే, ఆమె అసలు భగవద్గీతనే చదవలేదు. ఈ విధముగా ప్రత్యక్షముగా ఉన్నప్పుడు భీష్ముడికి భగవద్గీత తెలియదు. పరోక్షంగా ఉన్నప్పుడు మీరాబాయికీ భగవద్గీత తెలియదు. కానీ **"శ్రీకృష్ణుడే దేవుడు అనే విశ్వాసము"** మాత్రమే మోక్షాన్ని పొందగలిగేట్టు చేసెను. కానీ మనము మాత్రము శ్రీకృష్ణుడు చెప్పిన భగవద్గీతను చదువుచున్నాము. ఆయన చెప్పిన ధర్మాలను గుర్తించలేకపోతున్నాము. తద్వారా శ్రీకృష్ణున్ని నమ్మి, నమ్మకుండా ఉన్నాము. అటువంటి పరిస్థితిలో మనము ఉన్నాము. కనుక శ్రీకృష్ణుడు చెప్పిన ధర్మాలను తెలుసుకుంటే, అతనే గురువు కనుక, అతను చెప్పిన విద్య చూపున్న విద్యే అగును. ఆయన ప్రత్యక్షంగా లేకపోయినా, పరోక్షంగా ఆయన చెప్పిన జ్ఞానాన్ని నేర్చుకుని చూపున్న విద్యను ఆశ్రయించ వచ్చును. ప్రపంచమున కంతటికీ చూపున్న విద్య భగవద్గీతయే. మరి ఇంతటి భగవద్గీతను మన దగ్గర పెట్టుకుని దానిని విశ్వసించకుండా వేదాలంటారు. సరికదా, మమ్మల్ని వారు ఏమంటున్నారంటే, ఏమండీ! మీరు ప్రబోధ సేవా సమితి అంటారు. శ్రీకృష్ణున్ని పెట్టుకుని, వేదాలను విడిచిపెట్టి, భగవద్గీతను పట్టుకున్నారు ఎంత పొరపాటది అని అంటున్నారు. నిజమే పెద్ద పొరపాటే, పొరపాటునైనా ఆయనను విశ్వసిస్తే చాలు. అంతేగానీ బ్రహ్మ విద్యాశాస్త్రమని చెప్పి, ఏవేవో చెప్తే అది గురువులేని విద్య గ్రుడ్డివిద్య అగును. కానీ ప్రపంచపరమైన విద్యలకు ఆ వాక్యము వర్తించదు. కనుక ప్రపంచములో అందరూ గ్రుడ్డి విద్యే నేర్చుకుంటున్నారు. కావున కనిపించక క్రిందపడవలసినదే, అది నేర్చుకుని వారూ గ్రుడ్డి వారయినట్లే లెక్క. కనుక మోక్షమును చేరాలంటే గురువున్న విద్యనే ఆశ్రయించవలెను. అయన ప్రత్యక్షంగా ఉన్నప్పుడు గానీ, పరోక్షంగా

www.thraithashakam.org

ఉన్నప్పుడుగానీ ఆయన చెప్పిన మార్గాన్ని అనుసరించవలసినదే. కనుక గురువును దృష్టిలో పెట్టుకుని, గురుపౌర్ణమి సందర్భముగా, గురువు ఎక్కడైనా కనబడతాడేమో వెతకండి. ఒకవేళ ఆయన కనిపించినా, ఆయనను గురువని అనుకునేకంటే, ఆయన చెప్పిన జ్ఞానాన్ని అనుసరించండి. కనుక మనకందరికీ గురువు శ్రీకృష్ణుడే కావున, ఆయన చెప్పిన జ్ఞానమును తెలుసుకోండి. కనుక ఇప్పుడు గురువును వెతికే ప్రయత్నంకంటే, జగద్గురువైన శ్రీకృష్ణుడు చెప్పిన భగవద్గీతను తెలుసుకోండి. కనుక అదియే చూపున్న విద్య, గురువున్న విద్య అని ధైర్యంగా చెప్పుకోండి.

# 21. భగవంతుడు

తేది : 13-08-2009

ఈ రోజు కృష్ణాష్టమి అంటే కృష్ణుడు పుట్టిన దినం. కృష్ణుడు కనిపించిన దినము రేపల్లెలో గోకులాష్టమి. ఒకచోట పుట్టి మరొకచోట అందరికీ కనిపించాడు. పుట్టినప్పుడు ఇద్దరు వ్యక్తులకు మాత్రమే అదియు వారి తల్లిదండ్రులైన దేవకీ, వసుదేవులకు కనిపించాడు. తరువాత రోజు నంద యశోదుల ఇంటిలో రేపల్లెలో కనిపించాడు. అందరూ కృష్ణుని జన్మదినాన్ని అష్టమినాడు చేసుకుంటే, గొల్లవారు మాత్రము అష్టమి తర్వాత దినము గోకులాష్టమి జరుపుకోవటం మన భారతదేశములో ఉంది. కృష్ణున్ని గోపాల అనేవారు. గోపాల అంటే గోవులను పాలించే వాడు అని అర్థము చెప్పుకున్నారు. ఆయన గోవుల్ని పాలించక పోయినా ఆ పేరు వచ్చింది. ఈ రోజు గొల్లలు గొర్రెలను కాస్తున్నారు. ఆ రోజుల్లో గొల్లలు ఆవులమందను కాచేవారు. ఆ రోజుల్లో గొల్లలకు పాలు, పెరుగులకు లోటు లేకుండా ఉండేది. కొంతకాలానికి వారు ఆవులను వదలి గొర్రెలను కాయటం

మొదలుపెట్టారు. ఆ రోజుల్లో గొల్లలింటిలో పాలు, వెన్న, నేయి సమృద్ధిగా ఉండేవి. శ్రీకృష్ణుడు వాటిని దొంగిలించినట్లు మనము చెప్పుకుంటున్నాము. తరువాత కొంత కాలమునకు భగవంతుడుగా పరిగణింపబడ్డాడు. భగవాన్ అనే పేరు పెట్టబడింది. మొట్టమొదటిసారి 'భగవాన్' అనే పేరుతో కృష్ణున్ని పిలిచిన వ్యక్తి భీష్ముడు. **భగవాన్** అనే పేరు చాలాచోట్ల వినిపించుచున్నది. కొంతమంది స్వామీజీల పేరు ముందర భగవాన్ అని ఉంటుంది. ఆ రోజులలో కృష్ణునికి కొంతకాలము తరువాత భగవాన్ అని పేరు వచ్చింది కానీ, ఆయనకు ఆయనగా ఆ పేరు పెట్టుకోలేదు. ఈ రోజు జ్ఞానము చెప్పగలిగిన వ్యక్తులందరూ భగవాన్ అనే పేరును తగిలించుకోవటం జరిగింది. అయితే భగవాన్ అనేది అలంకారమా, హోదాయా? అని ప్రశ్నిస్తే, అది వ్యక్తి నిజస్థితిని గూర్చి ఇతరులు చెప్పినటువంటిది. కృష్ణుని నిజస్థితిని ఆ రోజుల్లో గమనించినటువంటివాడు ఒక్క భీష్ముడే. ఆ భీష్ముడు శ్రీకృష్ణుడు ఎవరు అని తెలుసుకొని **"భగవాన్ శ్రీకృష్ణ"** అని అన్నాడు. అయితే భగవాన్ అంటే అర్థమేమిటంటే "తల్లి గర్భములో సజీవముగా ఉండి, సజీవముగా పుట్టినటువంటివాన్ని భగవాన్" అని అందురు. **"భగవాన్ అంటే భగమునుండి పుట్టినటువంటివాడు"** అని అర్థము.

మరి మన మందరము తల్లిగర్భమునుండే వచ్చాము కదా మరి ఆ నిర్వచనము మనకు వర్తించదా? తల్లిగర్భమునుండి పుట్టినటువంటి వాన్ని భగవాన్ అంటే మనమందరమూ తల్లిగర్భమునుండే పుట్టాము. కనుక భగవంతులమే అగుదుము కదా అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! తల్లిగర్భము నుండి ఎవరూ సజీవముగా పుట్టలేదు. వారి శరీరములు జీవము లేని స్థితిలో గర్భాలనుండి పుట్టాయి గానీ, మీరు మాత్రము పుట్టలేదని గత 30 సంవత్సరాల క్రితమే చెప్పాము. ఈ

విషయాలన్నీ మా గ్రంథాలలో ఉన్నాయి. తల్లిగర్భము నుండి ఎవరూ పుట్టలేదు. పుట్టినటువంటివాడు ఒక్కడే ఆయన కృష్ణుడే కనుక అతనికి మాత్రమే భగవాన్ అనే బిరుదు వర్తిస్తుంది. మరి సజీవముగా పుట్టినాడు అనే దానికి సాక్ష్యమేమి? అనే ప్రశ్న ఏమైనా రావచ్చునేమోనని ఆయన ఎరుకతో పుట్టినాడు. ఎరుక అంటే జ్ఞప్తి అని అర్థము. మరి జ్ఞప్తి లేదా జ్ఞాపకము అనే పదాన్ని సంస్కృతములో 'యాద్' అంటారు. ఆ యాద్‌తో పుట్టాడు కనుక అతను యాదవుడైనాడు. అతను జ్ఞప్తితో పుట్టాడు అని మీకు ఎలా తెలుసు? ఎట్లు తెలుసు అనే విషయాన్ని ప్రక్కకు పెట్టి దేవకీదేవి ప్రసవించినప్పుడు అందరూ పుట్టినట్లు కృష్ణుడు తలతో పుట్టలేదు, కాళ్ళతో పుట్టాడు. లక్షలో అరుదుగా ఒక్కరు కాళ్ళ భాగము ముందుగా వచ్చేటట్లు పుడతారు కానీ కృష్ణుడు తల్లిగర్భము నుండి పుట్టినప్పుడు కాళ్ళు బయటికి వచ్చిన తర్వాత ఎడమకాలిని రెండుసార్లు కదలించాడు, కుడి కాలిని ఒక్కసారి కదిలించాడు. అంటే తల్లిగర్భములో ఆయన సజీవముగా ఉన్నాడా, లేడా అనేదానికి సమాధానము. అయితే ఆ రోజు దేవకీదేవి, వసుదేవులే ఉన్నారు కదా మరి మీరెట్లు చూశారు? అని ప్రశ్నించవచ్చు. అయితే నేనైతే చూడలేదు కానీ మీలోపల, నాలోపల ఆత్మ అనే అధిపతి ఒకడు కలడు ఆయనకు మాత్రము అన్నీ తెలుసు. ప్రతీ వ్యక్తిలోనూ ఇద్దరున్నారు. ఒకరు కనిపించేటట్లు, రెండవవారు కనిపించనట్లు ఉన్నారు.

శరీరములో మీ రెండవవాడు మీ వేషమే వేసి, మాట్లాడడం వలన నేనే మాట్లాడుచున్నాను అని మీరు అనుకుంటున్నారు. శరీరములో మీరు భ్రమించి ఒక్కరున్నారని అనుకుంటున్నారు. భ్రమించుకోకుండా మేము ఇద్దరం ఉన్నాము అని అనుకుంటున్నాను. మా ఇంటివద్ద మా పిల్లలు నన్ను ప్రశ్నించారు ఏమంటే, మాతోపాటు ఉంటావు, మాతోనే అన్నము

తింటావు, మరి ప్రతీ క్రొత్త విషయం (జ్ఞానము) ఏ విధముగా చెప్పగలుగు చున్నావని? మా చిన్నకొడుకు నన్ను ఈ ప్రశ్న అడిగితే, నాకేమీ తెలియదు, నేనూ మీ మాదిరే ఉన్నాను. ఇంకా నాకంటే, మీరు అన్నము కలుపుకుంటున్నట్టు కూడా నేను కలుపుకోలేను. మీరు కంప్యూటర్‌లో పని చేసినట్లు నేను అసలుకు చేయలేను. చాలా విషయాలలో నేను వెనుకబడే ఉన్నాను. కానీ అన్ని విషయాలు తెలిసినవాడు మాత్రము మరొకడున్నాడు. నా శరీరములో ఉన్న ఇద్దరిలో ఒకడు ఆత్మ, ఆత్మకు అన్నీ తెలుసు, ఇంకొకడిని అయిన నాకు ఏమీ తెలియదు. తెలియని జీవుడు మాత్రము అన్నీ తెలుసు అనుకుంటున్నాడు. నాకు పేర్లు రెండున్నాయి. ప్రపంచ సంబంధముగా ఒకటి, జ్ఞానసంబంధముగా ఇంకొకటి. ప్రపంచవరముగా ప్రబోధానంద చౌదరి, జ్ఞానవరంగా ప్రబోధానంద యోగీశ్వరులు అని రెండు పేర్లు గలవు. ఏదయినా క్రొత్త విషయాలు చెప్పేది ఆత్మ ప్రబోధానంద యోగీశ్వరులు నేను కాదు అని నా కొడుకుకి సమాధానము చెప్పినాను. అదే తిరిగి మరొకసారి వారితో జ్ఞానము తెలుసుకోండిరా, కాలాన్ని ఎందుకు వృథా చేస్తారు అని అనగానే నా కొడుకు ఇప్పుడు యోగీశ్వర్లు మాట్లాడుచున్నారు నీవు కాదు అని అన్నాడు. కనుక ఆ ఇద్దరినే క్షరుడు, అక్షరుడు అంటారు.

క్షరుడు అంటే నాశనమయ్యేవాడు, అక్షరుడు అంటే నాశనము కానివాడు. నాశనమయ్యే వారం మనం జీవాత్మలం, నాశనము కానివాడు అక్షరుడు వాడే ఆత్మ. ఆత్మ అనే పదాన్ని మనము చాలా చోట్ల వినే ఉంటాము. ఆత్మగౌరవం, ఆత్మాభిమానం, ఆత్మహత్య ఈ విధముగా ఆత్మ పేర్లతో ఎన్నో పదాలను మనము వాడుతూ ఉన్ననూ, జీవాత్మనే ఆత్మగా అనుకుంటారు. నువ్వువేరు, నీ ఆత్మవేరు నీ ఆత్మ ఎల్లప్పటికీ ఉంది.

అన్ని జ్ఞాపకాలు దానికి ఉన్నాయి, కానీ నీకు ఒక్క పుట్టినప్పటి జన్మలోనే జ్ఞాపకము ఉంటుంది. వాటిలో కూడా చిన్నప్పటి విషయాలు కొన్ని పెద్దయిన తరువాత జ్ఞాపకము ఉండవు. కనుక శ్రీకృష్ణుడు ఒక సందర్భములో అర్జునునితో, నీవు పుట్టావు నేనూ పుట్టాను. నేను ఎప్పుడు పుట్టాను, ఏమి చెప్పాను? అనేవి నాకన్నీ జ్ఞాపకము ఉన్నాయి. నీకు మాత్రము వెనుకటి జన్మల జ్ఞాపకాలు లేవు అని చెప్పినాడు. నీవు మనస్సుతో ఉన్నావు. నేను మనస్సు కాకుండా ఉన్నాను. నీవు మనస్సును ఆధారము చేసుకుని బ్రతుకుచున్నావు. నాకు నేనే ఆధారముగా అన్నాడు. ఈ విధముగా నాశనం కానటువంటివాడు మీ శరీరాలలో ఒకడున్నాడు. నాశనము కానటువంటివాడు దేవకీదేవి శరీరములో ఉన్నాడు. వసుదేవుని శరీరములోనూ ఉన్నాడు. దేవకీదేవి శరీరములో అక్షయ అని పేరు కల్గినటువంటివాడు. అక్షర అని పేరు కల్గినటువంటివాడు, ఆత్మ అని పేరు కల్గినటువంటి వాడు ఎవరైతే ఉన్నాడో, కృష్ణుడు జన్మించినప్పుడు ఏ కాలు ఎన్నిసార్లు కదలించాడో చూసినవాడు ఆత్మ, ఆత్మ అన్ని శరీరాల్లో ఉంది. నా శరీరములో కూడా ఉంది. అందుకే భగవద్గీతలో ఒక చోట నేనే మీ శరీరములో **జ్ఞాపకాన్ని, మరుపును, ఊహను, జ్ఞానాన్ని** కూడా ఇస్తున్నాను అన్నాడు.

ఈ రోజు డార్విన్ సిద్ధాంతమనో ఇంకొకటో, పరిశోధన చేసిపోగా, సిద్ధాంతాన్ని కనుగొన్న వారిలో సిద్ధాంతము ఎవరిది, ఏమీ తెలియనప్పుడు ఎవరిదీ సిద్ధాంతము. న్యూటన్ సిద్ధాంతము ఉంది. అంటే న్యూటన్ అనే వ్యక్తినుండి ఆత్మ, సిద్ధాంతాన్ని అందిస్తే, న్యూటన్ కనిపెట్టినట్టు 'న్యూటన్ సిద్ధాంతము' అనుకుంటున్నారు. మనుషులకు ఆ సిద్ధాంతము అవసరము కనుక ఆత్మ నేరుగా ఎవరితోను చెప్పలేదు కనుక, ఒక వ్యక్తి నుండి బయటకు

చెప్పి ఆ సిద్ధాంతాన్ని నిరూపించింది. ఆ వ్యక్తి మాత్రము నేనే ఆ సిద్ధాంతాన్ని కనిపెట్టాను అని అనుకొని ఆయన పేరు ఆ సిద్ధాంతానికి ముందు పెట్టుకుంటున్నారు. ఇప్పుడు నాగరికత ఎంతో అభివృద్ధి చెంది ఉన్నది. ఎన్నో యంత్రాల విషయాలన్నీ కనిపెట్టేది లోపలున్న అక్షయ ఆత్మయే. ఆత్మను తెలుసుకుంటే మన జన్మ ధన్యమవుతుంది. ఆ విషయం ఎవరికీ తెలియటం లేదు, ఏ స్వామీజీలకు కూడా ఈ విషయం తెలియదు. సుఖాలు అనుభవించేందుకు, మన కోర్కెలు తీర్చేందుకే దేవతలున్నారని స్వామీజీలు చెప్తుతుంటారు. శివలింగంలో మూడు విభూతిరేఖలలో మధ్య రేఖకే ఒక ఎర్రని బొట్టు పెట్టారు. అది ఆత్మకు గుర్తుగా పూర్వపు పెద్దలు చెప్పారు. 2000 సం॥ క్రితము అద్వైతాన్ని స్థాపించిన ఆది శంకరాచార్యులు వచ్చినప్పుడు ఈ విభూతిరేఖలు రాలేదు కానీ సృష్టి ఆదిలోనే వచ్చాయి. మనమందరం మొట్టమొదట పూజించినది శివలింగమునే. కృత, ద్వాపర, త్రేతాయుగాలలోనే ఈ శివలింగము ప్రసక్తి ఉంది. ఆ శివలింగములోనే మూడు విభూతిరేఖలు దిద్దారు పరమాత్మ, ఆత్మ జీవాత్మయని వాటిని చెప్పారు. మూడు ఆత్మలను స్వచ్ఛమైన కల్మషంలేని తెల్లని రంగుతో లింగము మీద పెట్టారు. ఆ రేఖలను మూడు ఆత్మలుగా గుర్తించి, ఆ మూడు ఆత్మలలో మధ్యమ ఆత్మకే ఎర్రటి గుర్తింపు పెట్టారు. ఎందుకంటే దానినే (ఆత్మనే) నీవు తెలుసుకోవాలి కనుక, కానీ ఈ విషయం మాత్రము ఎవరకీ తెలియదు.

ఇంకా మన ముఖాలకు విభూది రేఖలు పెడతాం, ఒకరు మూడు బెడితే, ఇంకొకడు నాలుగు రేఖలు పెడతాడు, ఇంకొకడు పూర్తిగా రేఖలే లేకుండా నుదుటి మీద మొత్తము రాసేస్తాడు. ఈ విషయం పెద్దపెద్ద స్వామీజీలకు కూడా తెలియదు. నేడు ఎవరికీ ఈ విభూతి రేఖల అర్థము

మాత్రము తెలియదు. కాని వారు చెప్పిందే జ్ఞానమని నమ్మిస్తున్నారు. జనాలు వారి వెనుకే అనుసరిస్తున్నారు. వారు చనిపోయి జన్మకే పోయారు, వారిని నమ్ముకున్న వారంతా కూడా జన్మకే పోయారు. జన్మరాహిత్యము కావాలంటే నీవు అసలైన జ్ఞానము తెలియాలి. దేవుడు చెప్పిన జ్ఞానాన్ని తెలుసుకోవాలి అంటే నీ శరీరములో ఉండే రెండవ ఆత్మ గురించి కొంతయినా తెలుసుకోవాలి, ఆ రెండవ ఆత్మ దేవకీవసుదేవుల శరీరములో ఉంది కావున, కృష్ణుని జన్మ ప్రత్యక్షంగా చూసింది కావున, ఎడమకాలు రెండుసార్లు, కుడికాలు ఒకసారి అల్లాడించింది అనే విషయాన్ని చూచింది. అయితే కుడికాలు మరియు ఎడమకాలును ఆ విధంగా రెండు ఒకటిసార్లు మాత్రమే ఎందుకు కదలించాలి? నాలుగుసార్లు ఎందుకు కదలించకూడదా? అని ప్రశ్నవస్తే, మనకు జ్ఞానము లభిస్తుంది. ప్రశ్న తరువాత జవాబు లేకపోతే అక్కడ అజ్ఞానము ఉందని అర్థము. ఈ చిక్కు ఎందుకు? ఆయన రెండుసార్లు, ఒకసారి కాలు అల్లాడించాడని చెప్పడమెందుకు? ప్రశ్నలు అడగడమెందుకు? ఆ జవాబుకొరకు వెతుకులాడటం ఎందుకు? ఇప్పుడు మీరు ఈ ప్రశ్నలో ఇరుక్కోవటం ఎందుకు? అని మీరు అనుకోవచ్చును. కృష్ణుడి శరీరములో ఉండి కాళ్ళను అల్లాడించింది ఎవరు? రెండవవాడయిన ఆత్మయే. చివరివాడు, మొదటివాడు ఇద్దరూ ఒకలాంటివారే, ఇద్దరూ ఏమీ చేయరు. మొదటివాడు జీవుడు. చివరివాడు దేవుడు, నీకు ఇంత వయస్సు, వచ్చింది అని అనుకుంటున్నావు కానీ వయస్సు పెరిగింది నీకు కాదు నీ శరీరానికి, మరి అసలు వయస్సు ఎంత? సృష్ఠి ఆదినాటిది నీ వయస్సు ఇక ఎన్ని సంవత్సరాలు అయిందో చూసుకో.

కలియుగములో నీ వయస్సెంత 5,150 సంవత్సరాలు అయితే నీవు 30,40 సంవత్సరాలు అని అనుకుంటున్నావు. కానీ అది నీ శరీరము

వయస్సు. నీ శరీరాన్ని విడిచిపెట్టి నీవు మరలా పోతావు. నీ శరీరము పోకముందే నీవే ముందు పోతావు. ఎక్కడికి పోతున్నావు? ఎక్కడినుండి వచ్చావు? ఈ విషయాలను తెలుసుకునేదే జ్ఞానము, ఒక గుడికి పోయి గంట కాలము భజనచేస్తే, కొబ్బరి కాయలు కొట్టేస్తే అది భక్తికాదు, జ్ఞానము కాదు. అది ఎవరైనా చేయవచ్చు. కానీ మనిషి పుట్టిన తరువాత, జ్ఞానమార్గాన్ని తెలుసుకోవాలి లేకపోతే నీకూ పశువుకు ఏమీ తేడా లేదు. మనిషిగా పుట్టిన తరువాత మనమెవ్వరం అని ప్రశ్నవేసుకుని నీవెవరో తెలుసుకుని, నీ వెనుక ఉండేవారు ఎవరో తెలుసుకుని, దానికి పైన ఉండేవాడు ఎవరో తెలుసుకుని ఉండేందుకు శివలింగంపైన విభూతి రేఖలు మూడింటిని దిద్ధి మధ్య రేఖకు మన పెద్దలు బొట్టుపెట్టారు. ఆ రోజు పెట్టినటువంటి ఆ బొట్టును గుర్తించుకుని చూస్తే ఆత్మ అనేది ఒకటుంది. దానిని నీవు గుర్తించాలి. నాలో ఉన్న ఆత్మను నేను గుర్తించాను. దానికో ప్రత్యేకమైన పేరు పెట్టుకున్నాను. నెంబరు టు (2) అని పెట్టుకున్నాను, నెంబర్ వన్ (1) నేను, నెంబరు త్రీ (3) దేవుడు. ఈ విషయాలు మేము ఎక్కడా చూడలేదు, వినలేదు అంటే అది నీ చేతిలోనే ముంద్రించి పంపించినాడు. నీ చేతిలోని రేఖలను చూస్తే 1, 2 రేఖలు కలసి ఉంటాయి మూడవ రేఖ మాత్రము వేరుగా ఉంటుంది. ఈ విషయాన్ని మీ చేతులను చూసుకొని తెలుసుకోండి.

ఈ ముద్ర పశు, పక్ష్యాదులకు లేదు. కేవలము మనిషికే ఈ ముద్ర ముద్రించి పంపించినాడు దేవుడు. ఎందుకంటే మనిషి వాటికంటే అజ్ఞాని కావున అంటే జంతువుల కంటే మనము పెద్ద కదా, వాటికి ఏమీ తెలియదు మనకు అన్నీ తెలుసు కదా! అని అనుకోవచ్చు. ప్రపంచ విషయాలలో అవి చాలా వెనుకబడే ఉన్నాయిగానీ దేవుని విషయంలో

www.thraithashakam.org

మీకంటే ముందున్నాయి. వాటికంటే ప్రపంచ విషయంలో మనము ముందున్నాము, కనుక మనిషి శరీరములోనే కొన్ని ముద్రలు వేసి పంపిస్తే బాగుంటుంది అనే ఉద్దేశ్యముతో, తనకు పని తగ్గుతుంది అనే ఉద్దేశ్యంతో, జ్ఞానేంద్రియాలలో ముఖ్యమైన దానికి, కర్మేంద్రియాలలో ముఖ్యమైన దానికి, ఆయన మూడు ఆత్మల ముద్రను ముద్రించి పంపించినాడు. నీ శరీరములో మూడు ఆత్మలున్నాయని, ప్రపంచ వ్యాప్తంగా ప్రతీ జీవరాసిలోనూ ఈ మూడు ఆత్మలు ఉంటాయని, ఒకటి నీవెక్కడ ఉంటే అక్కడే నీతో పాటు కలిసి ఉంటుందని, ఇంకొకటి వీటికంటే భిన్నంగా ఉంటూ ప్రత్యేకంగా ఉంటుందని, మన శరీరములో అనేక గుర్తులు పెట్టి పంపించెను. "జ్ఞానేంద్రియాణాం నయనం ప్రధానం" అంటారు అంటే జ్ఞానేంద్రియాలలో కన్ను ప్రధానం, ఆ నేత్రంలో త్రైతం ఉంది. నీవు అద్దంలో చూసుకుంటే నీ కండ్లలో మూడు భాగాలు కనిపిస్తాయి. తెల్లగుడ్డు, అందులో నల్లగుడ్డు అందులో మూడవ గుడ్డు మూడు భాగాలుగా నీ కన్ను ఉంది. అది నీకు మూడు ఆత్మలుగా కనిపించాలని ఆ గుర్తులు అక్కడ అమర్చబడ్డాయి. "కర్మేంద్రియాణాం హస్తం ప్రధానం" అంటే పనులు చేయువాటిలో చేయి ప్రధానము. ఏ రోజైనా ఈ హస్తాన్ని చూసుకుంటే, ఈ మూడు ఆత్మల గుర్తులు కనిపించాలని త్రైతం గుర్తును ముద్రించి పంపించాడు. కానీ ఈ రోజు మనం బాగా అజ్ఞానులం అని మనము నిరూపించుకున్నాము.

సృష్ఠి ఆదిలో దేవుడు మనల్ని పుట్టించాడు కానీ ఈ గుర్తులేమిటో మనము గుర్తించలేకపోయాము. మరి పెద్దపెద్ద స్వామీజీలు ఎందుకు ఈ విషయాలు చెప్పలేదు. మీరే ఎందుకు చెప్తున్నారు? అంటే నా బాధ్యత అది, అంటే నాలో ఉండే రెండవ ఆత్మ యొక్క బాధ్యత. మిగతా స్వామీజీలు నడచిన నడక అతను నడవడు, 'నేను' అనుకొని జీవాత్మలు నడుస్తున్నాయి.

www.thraithashakam.org

కానీ ఈ విషయాలు చెప్తున్నది నేను కాదు, నా వెనుక ఉండేవాడు, చెప్తే సత్యమే చెప్తాడు, పొట్టకూటికోసము బ్రతికేవాడు కాదు ఎవరు బ్రతకకపోయినా ఆయన బ్రతకగలడు. ఆదాయం కొరకు బ్రతికే వాడు కాదు. తన విధానాన్ని బయటకు చెప్పేందుకే బ్రతకగలడు. ఆ రోజు కృష్ణుడు జన్మించిన దినానికి వెళ్తే, కృష్ణుడు ఎదురు కాళ్ళతో పుట్టాడు, కాళ్ళను కదిలించాడు, నడుమునుండి పై భాగము అంతా లోపల తల్లి గర్భములో ఉన్నప్పుడు, మోకాళ్ళు మాత్రము బయట ఉన్నప్పుడు కాళ్ళను కదిలించాడు అని చెప్తున్నాము. అబ్బ ఎంత కరెక్ట్‌గా చెప్తున్నారు, అక్కడ ఇతనే చూసినట్లు చెప్తున్నారు అని అనుకోవచ్చుగానీ చూసినట్లుగా కాదు ప్రత్యక్షముగా చూసే చెప్తున్నాను అని ధైర్యంగా చెప్పగలుగుచున్నాను. కర్మలు లేనటువంటి ఆత్మలు ఇద్దరు ఉన్నారు. కర్మ ఉండేవాడు ఒకడున్నాడు.

పాపపుణ్యాలు అనే కర్మలు కల్గినటువంటివాడు ఒకడున్నాడు. పాపపుణ్యాలు అనే కర్మలు లేనటువంటి వారు ఇద్దరం ఉన్నాము. కనుక రెండుసార్లు ఒక కాలు కదలించాను, పాపపుణ్యాలు లేవు మాకు, ఒకడు చేసేవాడు, ఒకడు చూసేవాడు అయినా గానీ ఆ విషయాలు మాకు అంటవు. ఇంకొకడున్నాడు వాడు చేసేవాడూ కాదు, చూసేవాడూ కాదు కానీ, అనుభవించేవాడు జీవాత్మ వాడు ఒకడు కనుక ఒకసారి ఒక కాలును కదలించాడు. ప్రతీ శరీరములో కూడా మూడు ఆత్మలు ఉన్నాయి. ఆ కాళ్ళ కదలికలు గొప్ప జ్ఞానసందేశమే అయినప్పటికీ, ఆ ఆత్మే శరీరములో సజీవంగా ఉన్నాడు అని గుర్తించినప్పటికీ, ఆయన ఎదురు కాళ్ళతో పుట్టి, ఆ కాళ్ళను ఎందుకు కదలించాడో తెలియదు. ఈ మూడు ఆత్మల విషయం అంతకూ తెలియదు. ఎవరికీ తెలియకుండా పోయింది ఆ రహస్యం. అందుకే పెద్దపెద్ద స్వామీజీలుగానీ, బాబాలుగానీ మహర్షులు అని పేరు

గాంచినవారు గానీ, పరమహంసలు అని పేరుగాంచినవారుగానీ, జ్ఞానము తెలిసి, కర్మలు లేకుండా చేసుకుంటే నాలోనే ఐక్యం అయిపోతారు, లేకపోతే ఏ పేర్లు పెట్టుకున్నా ప్రయోజనము లేదు అని అంటున్నాడు.

భగవాన్ అని పేర్లు ఎందరు తగిలించుకున్నాగానీ, ఎంతమాత్రము ప్రయోజనము లేదుగానీ, భగవాన్ ఎవడు అని తెలుసుకుంటే ఉపయోగము ఉంది. ఒక్కడే భగవాన్, ముగ్గురు ఆత్మలం మేము మా పనులలో లగ్నమయి ఉన్నాము. ఇక్కడ ఈ సభలో ఇంతకు మునుపు మీరు అందరూ మాట్లాడుతున్నప్పుడు టీవీలో చూచాము, విన్నాము. పెద్దలు ఏమీ మాట్లాడలేకపోయారు కానీ చిన్నపిల్లలు చాలా మాట్లాడారు. పెద్దలు ఎంతో జ్ఞానము తెలుసుకున్నారు, చిన్న పిల్లలు మాట్లాడినట్లు ఎవరూ మాట్లాడలేదు. ఇంకొక విషయం ఏమంటే ఇక్కడ ఇద్దరు ముస్లీమ్ స్త్రీలు మాట్లాడినట్లు హిందూ స్త్రీలు మాట్లాడలేకపోయారు. ఇంకొక పెద్దాయన నేనే దేవున్ని అనే లెక్కలో మాట్లాడినాడు అయితే నేను దేవున్ని కాను, గురువుని అసలుకు కాను. గురువును అని ఎక్కడైనా చెప్పానా నేను. అన్ని గ్రంథాలలో నేను గురువును కాను అనే చెప్పాము. నేనే కాదు ప్రపంచములో ఎవరూ గురువు కాదని కూడా చెప్పాము. మీరు భ్రమిస్తున్నారు, గురువు అని వాళ్ళు పేర్లు పెట్టుకున్నారు. గురువులని మేము ఆ పేరు పెట్టుకోలేదు. గురువునే కాను, నేనే కాదు ఎవరూ కాదు. ప్రపంచానికి అందరికీ గురువు ఒక్కడే. గురువుని గూర్చి శ్లోకాన్ని చదివితే గురువుని ఉద్దేశించే చదవాలి, మనుషులెవరినీ గురువుగా స్తుతించకూడదు.

దేవుడు గురువుగా మనిషి అవతారంలో వస్తాడన్నమాట. ఆ విధముగా వచ్చినటువంటివాడు ఒకే ఒక వ్యక్తి, 5000 సం॥రముల పూర్వము వచ్చి పోయినాడు. ఆయన 'యాద్' కలిగి వచ్చినాడు 'యాదవ్'

www.thraithashakam.org

అని పేరుగాంచాడు. రెండవ రోజు గొల్లలందరూ ఆ పండుగను రేపల్లెలో పుట్టినాడని సంతోషంగా యమునానది తీరంలో పెద్ద సందడి చేసుకున్నారు. ఆయన నందుని ఇంటిలో పుట్టాడని సంతోషంగా పండుగ చేసుకున్నారు. అదే గోకులాష్టమి. కానీ ఈ రోజు ముందే మనము పండుగ జరుపుకుంటున్నాము. ఈ రోజు కృష్ణాష్టమిగా మనము జరుపు కుంటున్నాము. శ్రీకృష్ణుని గురించి మనకేమీ తెలియదు. ఈ మధ్య నేనొక కృష్ణుని గుడి చూశాను. ఆ గుడి ఆలనా, పాలనా లేకుండా ఉండేవి. పరిసరాలు అశుభ్రంగా ఉండేవి. దానిని అభివృద్ధి పరచాలని మేము అక్కడకు వెళ్ళాము. దానిని అభివృద్ధి చేశాము. ప్రహరీగోడ కట్టాము. అక్కడ మేము గమనించింది ఏమంటే కృష్ణ ప్రతిమ చాలా అందంగా ఉంది. ఆయన ప్రక్కన ఉన్న రాధమ్మను కూడా పెట్టారు. రుక్మిణీ, సత్యభామలను కూడా పెట్టారు, ఎందుకంటే అది మొదటనుండి వస్తున్న ఆచారము. అయితే అక్కడ జరిగిన పొరపాటు ఏమంటే రాధ మెడలో తాళిబొట్టు పెట్టారు. అంటే ఆమెను పెళ్ళి చేసుకున్నట్టు, అసలు రాధకు పెళ్ళి అయినట్లు చరిత్ర ఉందా? ఈ విషయం అక్కడ బ్రాహ్మణులు చేసిన పని అని అర్థమయింది.

ఏదో ఒక తంతు చేయాలి, డబ్బులు ఖర్చు పెట్టాలి. ఒక కృష్ణ ప్రతిమను ప్రతిష్ఠిస్తే యజ్ఞాలు, హోమాలు చేసి, నానా హంగామా చేసి ప్రతిష్ఠ చేస్తే వారికి ఎంతో తృప్తి. మేము మా స్వహస్తాలతో కృష్ణ ప్రతిమను ప్రతిష్ఠించాము. కానీ ఏ యజ్ఞము, యాగమూ చేయలేదు. ఏ మంత్రపఠనం చేయలేదు. చాలామంది ఎట్లా పెడతారో చూడాలి చూడాలి అనుకున్నారు. యజ్ఞాలు, యాగాలు చేయించి, బ్రాహ్మణులను పిలిపించి చేస్తారేమో అని అనుకున్నారు. వారు ఊహించినట్లు కాకుండా ముహూర్తమే లేకుండా,

www.thraithashakam.org

ఎందుకంటే మనుషులకు ముహూర్తాలు కానీ ఆయనకేమి మూహూర్తము ఉండదు. అక్కడున్న వారందరినీ మభ్యపెట్టి తెల్లవారురఝామున, బ్రాహ్మణులందరూ వస్తారు, మీ అందరూ పడుకోండి మిమ్మలి వారు వచ్చిన తరువాత లేపుతాము అని చెప్పి, నేనే ఆ ప్రతిమను ప్రతిష్ఠించేసి లేపాము. ఇదేమి ఇలా చేశారన్నారు వారు. అంటే వారి ఉద్దేశ్యం ఏమంటే సుంకులమ్మలాంటి దేవతలకు పూజ చేస్తే పెద్ద దున్నపోతును బలి ఇస్తారు. ఆ విధముగా చేస్తేగానీ పని అయినట్లు కాదు వారికి. కృష్ణునికి వేదపఠనము సరిపోదు, వేదమంత్రాలు సరిపోవు అది శాసనము. ప్రతీచోట పూజ చేశారంటే ఏదో ఒక వేదమంత్రం చదువుతారు. ఆయన జగద్గురువు. జగద్గురువు వద్ద ఏ విధంగా ఉండాలో ఆ విధముగా ఉండాలి. ఆయన చెప్పినట్లు మనము చేయాలి అంతేగాని అతను ఏదైతే వద్దు అన్నాడో ఆ పనులనే ఆయన ముందు చేస్తే, ఆయనకు మనమేమి గౌరవం ఇచ్చినట్లు? భగవద్గీతలో ఏమి చెప్పాడు. **"యజ్ఞాలు చేసినా, వేదమంత్రాలు చదివినా, దానములు చేసినా, తపస్సులు చేసినా నావద్దకు రాలేరు"** అని చెప్పినాడు. కానీ ఈ రోజు చేసేది అంతా అదే చేస్తున్నారు.

మేము ఈ రోజు మా కృష్ణమందిరంలో ప్రార్థన చేశారు. ఏమని చేశారు "గురువు" అనే పేరుతోనే చేశారు తప్ప ఒక్క వేదమంత్రమూ లేదు. ప్రపంచమంతటా వ్యాపించుకుని ఉన్నవాడా **"అఖండ మండలాకారం వ్యాప్తం ఏన చరాచరం"** అంటారు. విశ్వవ్యాప్తంగా కదలని, కదిలెడి వస్తువుల అన్నింటిలోనూ నీవే ఉన్నావు. అటువంటి గురువుకు నమస్కారము అంటున్నారు. ఆ శ్లోకము ఎవరికి చెందుతుంది, ఆయనకే చెందుతుంది. నిజమైన భావముతో చేసినటువంటి మాటలవి. అంతేగాని ఏదో మంత్రము చదువుతాము అంటే ఆ మంత్రములో ఉండే అర్థానికి ఈయనకు ఎటువంటి

సంబంధము లేదు. చాలామంది శ్రీకృష్ణ విగ్రహం అంటారు. ఆయన విగ్రహం కాదు ప్రతిమ మాత్రమే. కృష్ణుడు భగవంతుడు. ఆయన తప్ప మిగతా ఎవరూ భగవంతులు కారు. భగవంతుడు అని పేరు ఎవరయినా పెట్టుకుంటే పెట్టుకోవచ్చునుగానీ భగమునుండి వచ్చినవాడే భగవంతుడు.

ఆ విధముగా వచ్చి రెండుకాళ్ళను కదలించి కృష్ణుడు పుట్టినాడు. అయితే దేవకీ వసుదేవులకు ఈ విషయం తెలియదు కదా! వారు ఆ విధముగా కాలు కదిలించినప్పుడు చూసినప్పటికీ వారికది అర్థము కాదు కదా! మరి ఆ విషయం ఎవరూ తెలియలేరు కదా! మరి ఆ విధముగా ఆ రోజు కాళ్ళను అల్లాడించటము వలన లాభమేమి? అంటే, ఏదో ఒక రోజు తెలియబడుతుందని అలా చేశాడు. ఆత్మ అందరి శరీరాల్లో ఉందికదా, ఏదో ఒక శరీరము నుండి పలికిస్తుంది. ఈ రోజు ప్రబోధానంద నుండి ప్రబోధానంద యోగీశ్వరులు పలుకుచున్నాడు. ఆ రోజు నేను చూశాను అని అంటున్నాడు. మీకు పుట్టినప్పుడు కాదు కదా పుట్టిన తరువాత ఐదు సంవత్సరాలకు కూడా మీకు తెలియదు, చనిపోయినప్పుడు కూడా తెలియదు. ఎన్నో జన్మల్లో ఎన్నిసార్లు చనిపోయారో తెలుసా, వెనుకటి జన్మే తెలియదు. నీ శరీరము పుట్టిన తరువాత ఎన్ని నిమిషములకు ప్రాణం వచ్చిందో తెలుసునా? కానీ నీ వెంట ఉండేవాడికి తెలుసు.

నీ శరీరములోనికి నీవు ఎప్పుడు వచ్చావో తెలియదు. నీవు ఎప్పుడు పోతావో తెలియదు. నీ శరీరములో నీ గతే తెలియదు. మిగతా వారి కథ నీకేం తెలుస్తుంది. మరి జ్ఞానము అంటే ఏమిటి? నీ గూర్చి నీవు తెలుసుకోవటమే. ఇంకొక దేవున్ని ఆరాధించమని చెప్పలేదు. మొక్కుబడులు చెల్లించమనీ చెప్పలేదు. నీ శరీరములో నీ సంగతి తెలుసుకో, కనీసము నీ శరీరంలోనే ఆత్మల జ్ఞానము తెలుసుకునేందుకు కంటిలో గుర్తులు పెట్టారు,

www.thraithashakam.org

చేతిలో గుర్తులు పెట్టాడు. దేవుడంటే అర్థము తెలియదు, భగవంతుడు అంటే అర్థము తెలియదు. భగవంతుడు అంటే భావము తెలియదు. ఈ రోజు పెద్దపెద్ద స్వామీజీలు టీవీలలో చెప్తున్నారు. భగవంతుడు చాలా గొప్పవాడు అందరినీ చూస్తున్నాడు. భగవంతుడు అంతటా వ్యాపించి ఉన్నాడు అంటున్నారు. భగవంతుడు అంతటా వ్యాపించి ఉంటాడా? భగవంతుడు శరీరంతో ఉంటాడు, ఒక్క చోటే ఉంటాడు. కంటికి ఎంతవరకు కనిపిస్తే అంతవరకే చూడగలడు. భగవంతుడు వేరు, దేవుడు వేరు వారి వ్యత్యాసం తెలియదు. ఎప్పుడు భగవంతుడౌతాడు, ఎప్పుడు దేవుడౌతాడో తెలియదు. విశ్వవ్యాప్తంగా ఉన్నవాడు దేవుడు, ఒక్కచోట ఉన్నవాడు భగవంతుడు. ఈ విధానము తెలియక దేవుడు అనవలసిన సందర్భములో భగవంతుడంటారు. భగవంతుడనే చోట దేవుడంటారు. యోగమునకు, తపస్సుకు వ్యత్యాసం తెలియదు. తపస్సు చేస్తే యోగి ఎట్లా అగునో తెలియదు.

ఈ విషయం స్వామీజీలకే తెలియకపోతే మిగతావారికి ఎట్లు తెలుస్తుంది? మీరు అనుకోవచ్చు ఇందరు స్వామీజీలను తీసిపారేస్తున్నారు అంటే, నేను కాదు మీ అందరి వెనుక, నా వెనుక ఉండేవాడు చెప్తున్నాడు. వారు చెడిపోవటమే కాకుండా మిగతావారిని కూడా చెడగొడుచున్నారు. ఇది మంచి పద్ధతి కాదు. ఒక పెద్దవాడు ఎవరైనా ఉంటే వారిని దండించగలరు. చిన్న పిల్లలను పెద్దలు దండించినట్లు దండించగలడు. ఏ స్వామీజీలనైనా, ఎవరినైనా ఇది మంచి పద్ధతి కాదు అని దండించగల స్థోమత ఎవరికి ఉంది? వెనుక ఉన్నవాడికే ఉంది. వాడే చెప్పగలుగు చున్నాడు. నేను ఆ రోజు ఆ విధంగానే చెప్పానా? భగవద్గీతలో నేను ఆ రోజు ఇట్లాగే చెప్పానా? శైవం, వైష్ణవం అని చెప్పానా? ఎక్కడైనా నా

భగవద్గీతలో ఆ విధంగా ఉందా? మీరెందుకు పెట్టారు శైవం, వైష్ణవం అని, ఎవరు చెప్పారు మీకు? స్వయంగా రాజకీయ పార్టీలు పుట్టించినట్లు పుట్టించుకుని కాటావేసి దేవున్ని అమ్ముతున్నారు మీరు దేవుడు అనేవాడు ఒక్కడే అనీ, ప్రపంచమునకు సృష్ఠికర్త ఒక్కడేనని మీరు తెలియకున్నారు. మా దేవుడు వేరు, మీ దేవుడు వేరు అంటున్నారు. మతము మతమునకు దేవుడు వేరుగా ఉంటారా? ఈ ప్రపంచాన్ని పుట్టించింది ఒక్కడే అయితే, మా దేవుడే పుట్టించాడు అంటే మీ మతము పుట్టిన తరువాత ఆ మతము మాట వచ్చింది మీ మతము రాకముందు ఏ దేవుడు ఉండేవాడు. దేవునికి రూపంలేదు, పేరులేదు, ఫలానా దేవుడు అని మీరు చెప్పేందుకు అకారమే లేదు.

ఆ రోజు నిన్ను పుట్టించిన దేవుడు ఏ మతమనీ పేరు చెప్పలేదు. సృష్ఠి ఆదిలోనే నేను జ్ఞానాన్ని సూర్యునికి చెప్పాను అన్నాడు ఆయన. ఈ మధ్యలో మన అందరి మధ్య ఉన్న భగవద్గీత ఎప్పటిది? సృష్ఠిఆదిలో పుట్టినటు వంటిది, దేవుడు నేరుగా చెప్పాడు సూర్యునికి, భగవంతుడు చెప్పలేదు. ఆ రోజు ఆకాశంనుండి ప్రత్యేకంగా చెప్పాడు. ఆ సూర్యుడు తరువాత మనువు అనే వ్యక్తికి చెప్పాడు. మనువు ఇక్ష్వాకుడు అను రాజుకు చెప్పినాడు, ఇక్ష్వాకుని ద్వారా అందరికీ తెలిసింది. కాని మొట్టమొదట ఎక్కడ పుట్టింది దేవునినుండి పుట్టిన జ్ఞానము భగవద్గీత, దేవుడు తెలియజేసిన జ్ఞానము ఆ రోజు చెప్తే మీరు మరల మరచిపోయినారు. కనుక మరల ఈ రోజు చెప్తున్నానని 5000 సంవత్సరాల పూర్వము శ్రీకృష్ణుని గా వచ్చిన వ్యక్తి, భగవంతుడిగా తిరిగి చెప్పటం జరిగింది. అయినా సరే మనమేమైనా వినగలిగామా, శ్రద్ధ పెట్టి చూస్తున్నామా అంటే లేదు. మా గురువు ఫలానా ఆయన బాగా చెప్తారండి అంటారు. ఏమి చెప్తున్నారు? భగవద్గీత కాదా?

వారికి చివర ఒక తోక ఉంటుంది, నాదీ సిద్ధాంతము, నా పద్ధతి ఇది అంటారు. ఆ సాంప్రదాయం ప్రకారము వీరు నడుచుకుంటూ ఉంటుంటారు. మీకు ఒక చిన్న ఉదాహరణ చెప్తాను చూడండి.

ఈ మధ్య విద్యుత్‌శాఖలో పనిచేస్తున్న వ్యక్తి ఉద్యోగ విరమణ పొందాడు. ఆయనకు భక్తి, జ్ఞానము మీద కొద్దిగా శ్రద్ధ ఎక్కువ. ఉద్యోగం విరమణ ఎలాగూ అయింది కనుక, ఎన్నాళ్ళు బ్రతుకుతామో తెలియదు కనుక ఆధ్యాత్మికం గురించి తెలుసుకోవాలనుకున్నాడు. ఎలా తెలుస్తుంది, ఎవరైనా పేరు పొందిన స్వామీజీని కలిస్తే బాగుంటుందని అనుకొని, తమిళనాడు వెళ్తే అద్వైత స్వామీజీ దొరుకుతాడనుకొని, శైవసాంప్రదాయము అంటే ఆది శంకరా చార్యుల పీఠానికి సంబంధించిన స్వామీజీ లేకపోతే, విశిష్టాద్వైత స్వామీజీ ఇంకొకచోట దొరుకుతాడు, మరి ఎవరినో ఒకర్ని ఆశ్రయించి జ్ఞానము పొందాలని, ఆయన విశిష్టాద్వైతములో పేరుమోసిన వారు ఎవరైతే ఉన్నారో, పేరు నాకు తెలియదు. రెండవవాడికి (ఆత్మ)కు తెలుసు కానీ ఆయన చెప్పడు. ఆ స్వామీజీని ఇంటికి పిలిపించుకున్నాడు. లక్షలు ఖర్చుపెట్టి ఆయనను రప్పించాడు. స్వామీజీలకు ఒక రేటు ఉంటుంది, గేటు ఉంటుంది. ఒక డ్రామా యాక్టర్‌కి నటించడానికి ఇంత రేటు అని ఉంటుంది కదా! అలాగ కాళ్ళకు మ్రొక్కితే ఇంత డబ్బు, ఇంటికి వస్తే ఇంత డబ్బు, మీ ఇంటిలో ఉప్మా తింటే ఇంత డబ్బు, అన్నము తింటే ఇంత డబ్బు ఇవ్వాలన్నమాట. ఏదోలాగ కొంత డబ్బులిచ్చి ఆ స్వామీజీని పిలిపించుకున్నాడు. ఒక మంచి ఉన్నత ఆసనం పైన కూర్చో బెట్టాడు.

అయితే అతని ఇంట్లో భక్తి వలన ఎన్నో చిత్రాలు (ఫోటోలు) గోడలకు తగిలించి ఉన్నాయి. నేను చాలా భక్తి వరున్ని అని తెలియాలి

www.thraithashakam.org

అనుకొని రకరకాల పటాలు పెట్టారు. సరే! ఆ స్వామి వచ్చినప్పుడు అతనికి శంకరుని ఫోటో కనిపించింది. అది కనిపించగానే ఒళ్ళంతా మండిపోయిందతనికి, ఈ ఫోటో పీకేయ్ అని అన్నాడు ఆ స్వామి. ఈ ఫోటో తీస్తే నేను ఉంటాను లేకపోతే బయటికి పోతాను అన్నాడు. ఆ విధంగా ఆయన కక్షకట్టుకుని ఫోటో తీయమనడానికి కారణమేమి? మేము శ్రీవైష్ణవులము, మేము నిలువనామస్తులము అంటే వైష్ణవసాంప్రదాయము ఉండాలి, విష్ణువు ఫోటో పెట్టుకో, అంతేగానీ ఈ శంకరుని ఫోటో పెట్టుకుంటే మేము ఒప్పుకోము. అతను దేవుడుకాదు, అది భక్తికాదు, జ్ఞానముకాదు ముందు ఆ ఫోటో తీసేయ్ అన్నాడు. అంతడబ్బు ఖర్చుపెట్టి స్వామీజీని తీసుకువచ్చి, ఫోటోకొరకు గొడవ ఎందుకని ఆ ఫోటోతీసి ప్రక్కకు పెట్టాడు, తరువాత చూసుకుందామనుకొన్నాడు. ఆ తరువాత వచ్చిన స్వామి కొంత జ్ఞానాన్ని చెప్పాడు. నువ్వు నామము పెట్టుకో అంతేగానీ ఆ నామంలో ఒకటో ఆత్మ, రెండు, మూడు ఆత్మలున్నాయన్న విషయం తెలియ చెప్పలేదు. కానీ బయట విషయం మాత్రము చెప్పారు. అష్టాక్షరీ మంత్రము జపించుకో, విష్ణు సహస్రనామస్తోత్రం చదువుకో అని చెప్పాడు. సరే ఈయన విష్ణు సహస్రనామావళి చదవటం మొదలుపెట్టాడు. కేశవాయనమః, ఆనమః, ఈనమః అని చెప్పసాగడు. చివరికి ఇదేమి కప్పలు బెకబెకలాడుచున్నట్లు ఉంది నా పని అనుకున్నాడట. ఏమి తెలిసింది దీనివలన, ఏమీ తెలియలేదు. అది అయిన తరువాత నీళ్ళు తాగాల్సిందే, దానివలన నీకేమైనా జ్ఞానము వచ్చిందా? అంటే ఏమీ లేదు.

దీనివలన నీ వెవరో, నీ వెనుక ఉన్నవాడు ఎవరో, పరమాత్మ ఏమైనా తెలుస్తాడా, భగవంతుడు తెలుస్తాడా, దేవుడు తెలుస్తాడా? తెలియదు. ఒకాయన 30 సంవత్సరముల నుండి భజన చేస్తున్నాను, నాకేమి తెలిసింది,

నాకేమి వచ్చింది అని అంటున్నాడు. ఏమి తెలిసింది, "నీ భావం మంచిదే కానీ నీ త్రోవ తప్పు త్రోవ, ఉద్దేశ్యం మంచిది, దారి తప్పు ఏ దారి మంచిదో తెలుసుకో" అని చెప్పాను. ఆ స్వామీజీలందరికీ వ్యతిరేఖము చెప్పడానికా మీరు వచ్చింది అని నన్ను మీరు అడుగవచ్చు. మీకు వ్యతిరేఖమా కాదా నాకు తెలియదు కానీ నేను చూపేది మాత్రము సరైన త్రోవని మాత్రము తెలుసు. నేను **"జననమరణ సిద్ధాంతము"** వ్రాసినప్పుడు శిశువు పుట్టినప్పుడు ఏం జరుగుతుందో చెప్పాను. పుట్టినప్పుడు జ్ఞాపకము ఉంటేనే కదా వ్రాసేది. మరణించినప్పుడు ఏమవుతుందో వ్రాశాను. మరణించినపుడు ఏ జ్ఞాపకం ఉండదు, కానీ వ్రాశాను. వ్రాసినది నేను కాదు, నా వెనుక ఉండేవాడు అని ముందే చెప్పాను. వాడికి పుట్టినప్పుడు జ్ఞాపకం ఉంది, చచ్చినప్పుడూ జ్ఞాపకం ఉంది అటువంటి విషయాలు మీకు తెలిసినందుకు, మీరు సంతోషపడాలి గానీ, నీకెలా తెలుసు అని ప్రశ్న ఎందుకు వేయాలి? నేను జ్ఞానమును చెప్తాను అని, నా నోటినుండి రాబోవు వాని కొరకు ఎదురు చూడండి. జ్ఞానము తెలుసుకోండి, ఓహో! ఈ విధముగా చెప్పినాడు అని మీకు అర్థమవుతుంది, చెప్పటం చేతకాదు అని అనుకోవద్దు. ఎంత పెద్ద రహస్యాన్నైనా ఆత్మ చెప్పగలడు కనుకనే 300 సం॥ పూర్వము పుట్టిన వీరబ్రహ్మంగారు, కాలజ్ఞానము గురించి వ్రాశారు అందులో భవిష్యత్ గురించి (జరిగే కార్యక్రమాలు) వ్రాశారు. ఆత్మజ్ఞానము గూర్చి ఏమి వ్రాశాడో మాకు తెలియదు కానీ, కాలజ్ఞానము గురించి మాత్రము వ్రాసినది చాలా జరిగాయి, జరగాల్సినవి చాలా ఉన్నాయి. **"మూడు మతాలను ఒక్కటి చేసేవాడు వస్తాడు"** అన్నారు.

మరి ఈ రోజు ఇక్కడ చూస్తున్నారు హిందువులున్నారు, క్రైస్తవులున్నారు, ముస్లీమ్స్ ఉన్నారు. అదియేకాక మూడు మతస్థులలోనూ

www.thraithashakam.org

బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రాలు నుదుటి మీద కనిపిస్తున్నాయి. ఇప్పుడు మీలో ఎవరు హిందూ, ఎవరు ముస్లీమ్, ఎవరు క్రిస్టియనో నాకు తెలియదు. ఇది ఏ జీవునికీ గుర్తుకాదు, నీలోపల ఉన్న స్థితికి గుర్తు. ఈ రహస్యము 5110 సం॥రముల క్రితము చెప్పినా మనకు తెలియదు. ఈ రహస్యం సృష్ఠి ఆదిలో సూర్యునికి చెప్పిన రహస్యం. ఈ రోజు మనందరికీ తెలిసింది దానిని మన నుదిటిపైన ధరించుకుంటూ జ్ఞానాన్ని సంపాదించు కుంటున్నామంటే మనము చాలా అదృష్టవంతులం. ఈ ప్రాంగణంలోకి రావటమే కాకుండా జ్ఞానాన్ని వింటున్నారు ఎంతటి అదృష్టం చూడండి. నీవు ధనికుడువవుతావనో, నీ సంసారం బాగుపడాలనో ఏమీ ఇక్కడ చెప్పబడదు. ఇక్కడకు వస్తే ప్రపంచ కర్మరీత్యా ఏ మార్పూ ఉండదు, ఇక్కడకు వస్తే జ్ఞానరీత్యా మార్పు ఉంటుంది.

ఈ ప్రపంచములో ఏ మనిషికైనా ఎంత సంతోషము, సుఖము ఉన్నా ఎంతో కొంత అసంతృప్తి ఉంటుంది. కానీ తృప్తి ఎప్పుడు వస్తుంది అంటే నిన్ను నీవు తెలుసుకున్న రోజు తృప్తి ఏర్పడుతుంది తప్ప మరెప్పుడూ తృప్తి రాదు. మాకు ఈ మధ్య చాలా తృప్తిగా ఉంది. ఎందుకంటే చల్లని గదుల్లో ఉండే నేను ఈ మధ్య ఉడుకు వాతావరణములో పని చేయాల్సి వచ్చింది. చాలా నల్లబడ్డాను. ఇంకా నా వీపు మీద గడ్డపుట్టి దానినుండి చీము వస్తూ ఉంటే ఆ బాధ మీకు తెలుసు. అయినా సరే చిన్న చీమ కుట్టినంత బాధకూడా నాకు అనిపించలేదు. దేవుడు కుంటివాడిగా నన్ను నడిపించి సేవ చేయించాలను కున్నాడేమోగానీ నాకు మాత్రము ఏ బాధ అనపించలేదు. జీవునిగా నాకే బాధలేదు. మరి డాక్టర్ దగ్గరకు వెళ్ళినా ఇంతకంటే పెద్ద డాక్టర్ నా శరీరములో ఉన్నాడు. వాడు రోగాన్ని పెద్దది చేయాలన్నా వాడే, రోగాన్ని తగ్గించాలన్నా వాడే అంటే రోగాలు లోపలే

ఉన్నాయి మందులూ లోపలే ఉన్నాయి. నేను డాక్టర్ దగ్గరకు పోవడమేమిటి? పోవాలంటే పోతాను, ఎందుకు? మీరు చూసేదానికైనా పోవాలి కనుక పోతాను. లోపలవాడు నన్ను రోగం తెప్పించి పరుండబెట్టాలి అంటే పరుండబెడతాడు. అప్పుడు నేను అనుకుంటాను నన్ను పరుండబెట్టాల్సి వుంది కనుక పరుండ బెట్టాడు అని అనుకుంటాను, అంటే రెండోవాడిమీద నాకు నమ్మకము ఉంది. ఈ మధ్య మాకు పెద్ద యాక్సిడెంట్ జరిగింది. తునివద్ద 120 కి.మీ స్పీడుతో వెళ్తున్న మా కారు డివైడర్ గుద్ది 20 అడుగులు పైకి లేచింది తిరిగి అలాగే పడింది. ఆ విధంగా జరిగితే బండి ఏమవుతుంది. అందులో మనుషులేమవుతారు? కానీ మాకు ఏమీ జరుగలేదు. ఒక్కరికి కూడా చిన్న గీత కూడా పడలేదు. ప్రక్కన ప్రత్యక్షంగా చూసినవారంతా మీరు చాలాచాలా అదృష్టవంతులు, ఇంతపెద్ద యాక్సిడెంట్ జరిగితే బ్రతికారంటే చాలా ఆశ్చర్యము అన్నారు. మేము పోయేదెక్కడికి దేవుని పనిమీద పోతున్నాము. జరిగేది జరుగుతుంటాది, మా పని మాది అని వారితో చెప్పాము. మేము చేసే పని చాలా ఉంది. మేము అంత వేగముగా చనిపోము.

ప్రపంచములో ఉన్న క్రొత్త క్రొత్త రహస్యాలన్నీ చెప్పాల్సిన పని ఉంది. 5110 సం॥ పూర్వము విషయము ఈ రోజు మీతో చెప్తున్నాము. మరి మనమెట్లు చనిపోతాము. కొన్ని రోజుల క్రితము కొందరు మాకు చెప్పారు. ఇతరులు మిమ్మల్ని హత్య చేస్తారు, వారు చాలా క్రూరమైన మనుషులు. చంపాలని అదే పనిగా ఉన్నారు అంటే, చంపేవాడెవడు, చంపేవాని శరీరములో ఉండేవాడు ఆయుధాన్ని పట్టి, ఎత్తించి చంపిస్తే వీడు చచ్చేది. నీవు చేయి ఎత్తితే వెంట్రుకలు బాహుమూలల్లో కనిపిస్తాయి. వెంట్రుక అంటే నీ వెంట ఉండేవాడు. నీ శరీరములో వెంట్రుకలు దేనికి

గుర్తు, ఆత్మకు గుర్తు. మూతి కదలాలంటే ఆత్మ ఆధారము కనుక మూతి మీద వెంట్రుకలున్నాయి. నీ మెదడు పనిచేయాలంటే ఆత్మే ఆధారము కనుక తలమీద వెంట్రుకలున్నాయి. శరీరములో ప్రతీ అవయవము దగ్గర వెంట్రుకలున్నాయి చూడండి. దేవుడు మన శరీరములోనే జ్ఞానము పెట్టాడు. ఆ విషయము నీకు తెలియదు కృతయుగమునుండే శివలింగాన్ని పరమాత్మకు గుర్తుగా ఆరాధించారు. రాముడు పూజించాడు, శంకరుడు పూజించాడు శివలింగాన్ని, అంటే సృష్టి ఆదినుండే శివలింగాన్ని పరమాత్మగా శంకరుడే ఆరాధిస్తే, ఈ రోజు శివునికి, శంకరునికి తేడా తెలియదు మీకు. ఇద్దరూ ఒకటే అనుకుంటున్నారు. శివలింగానికి మూడు ఆత్మల గుర్తులున్నాయి. దానికి గుడికట్టి పై కప్పు పెట్టకూడదు అది తప్పు. శివలింగానికి అభిషేకము చేయరాదు కానీ, అందరూ దానికి అభిషేకము చేస్తున్నారు. ఈ లింగము ఏ విధానము, ఏ గుర్తుగా ఉందో తెలియదు. దానికి ముక్కు, ముఖము లేకుండా ఉండాలి. కాని వెండితో, బంగారంతోనో ఒక ముఖాన్ని తయారు చేసి, ఆ శివలింగానికి ఇరికిస్తున్నారు. అక్కడ శంకరుని రూపం కనిపించినట్లు చేస్తున్నారు అలా చేయకూడదు.

దేవునికి రూపము, నామము లేదు అని చెప్పేందుకు గుండ్రటి రాయిని తీసుకుని గుర్తుగా పెట్టారు. ఈ దేవుడు మూడు భాగాలుగా ఉన్నాడు అని ఆ రోజు మూడు రేఖలు తీర్చిదిద్దారు. మధ్యలో నీవు ఆత్మను తెలుసుకో, నీ జీవితము యొక్క ధ్యేయం అదే అని తెల్పేందుకు మూడు విభూది రేఖల్లో మధ్యదానికి బొట్టు పెట్టారు. స్వామీజీలే మధ్యలో ఉన్న రేఖకు నుదుటి మీద బొట్టుపెట్టారు. కొందరికి విభూతి రేఖలుంటాయి క్రింది రేఖకు పెడతారు బొట్టు. కొందరు అదీకాక మొత్తం అంతా చేతికి పులుముకుని ఏకంగా దిద్దుతారు నుదుటిమీద రేఖలే లేకుండా, దానికి

అర్థము లేదు, అర్థరహితమది. అలా కాకుండా విభూతి పెట్టకుండా ఊరుకోవటం మంచిది. ఇంకా విచిత్రమేమంటే దేవునికి ఆగమం అనే పేరుతో గుడికి ఈ మూల ఇలా ఉండాలి, ప్రహరీ గోడ ఇలా ఉండాలి అని కొలతలువేసి పెట్టారు. దానికి ఆగమశాస్త్రం అని పేరు పెట్టారు. ఆగామికర్మయే లేనివానికి ఆగమశాస్త్రము అని పేరు పెట్టడం విచిత్రము. మనుషులు ఉండేందుకు ఇంటిలో ఈ మూల ఇట్లా ఉండాలి, ఈశాన్యానికి బరువు ఉండకూడదు, చెట్టు ఉండకూడదు, పుట్ట ఉండకూడదు. గుంత ఉండాలి. కానీ దేవుడు ఏ రోజో ముద్రవేసి పంపించాడు.

ఈ విధముగానే ఆహారము తినాలి, ఈ విధముగానే నీరు త్రాగాలి, జీవించాలని, ఫలానా సమయమే నీ కాలికి ముల్లు గుచ్చుకోవాలని అయితే సొంత ఉపాయాలు చేసి, నీ కర్మను నీవు తప్పించుకోవాలని చూచినా అది నిన్ను విడిచిపెట్టదు. వాస్తుశాస్త్రమునకే కాదు, వాస్తు శాస్త్రజ్ఞునికి కూడా కర్మ విడిచిపెట్టదు. జ్యోతిష్యశాస్త్రము సంపూర్ణముగా మీరు తెలుసుకుంటే వాస్తుశాస్త్రము లేనేలేదు అని తెలుస్తుంది. మనిషి పనిని మానిపించటానికి పూనుకోకూడదు. దానికి వారి కర్మను లేకుండా చేయాలి. కర్మలు లేకపోతే వారు ఆ పనిని చేయలేరు. పనిని మాన్పించకూడదు. అలా మాన్పిస్తే మిగతా స్వామీజీల మాదిరి అయిపోతాము. కనుక వారి కర్మను మాన్పించాలి, వీరందరినీ చంపితే నాకు పాపము వస్తుంది అని అర్జునుడు అంటే నీవు చంపితే పాపము వస్తుంది నిజమే. పాపము రాని విధానాన్ని తెలిసి పని చేయి, పాపము రాదు. **"నీవు పనిని మానవద్దు. పనిలో ఉండే భావాన్ని మార్చుకో"** అని చెప్పాడు. ఒకవేళ నువ్వే చంపాను అనుకుంటావేమో చూడు అని చెప్పి, ముందే భీష్మ, ద్రోణులందరూ చనిపోయినట్లు చూపించాడు. పనిచేయకపోవడము. ధర్మము కాదు. నీ

www.thraithashakam.org

వెనుక వచ్చే కర్మను పోగొట్టుకునేదే ధర్మము **"కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన"** భగవద్గీతలో ఆ శ్లోకము ముఖ్యమైనది. పనులు చేయుటయందే అధికారము కలదు కానీ ఫలితము పైన లేదు అని మిగతావారు చెప్పారు. మేము చెప్పేది ఏమనగా! "కర్మ అంటే ఇక్కడ పాపము, పుణ్యము కర్మను సంపాదించుటయందే నీకు అధికారము ఉందని, దాని పనిని చేయడములో నీకు అధికారము లేదు'' అని అంటున్నాము. **"పాపము, పుణ్యం సంపాదించుటయందు నీకు అధికారము ఉంది కానీ పనులు చేయట యందు అధికారము లేదు"** అని ఆయన చెప్పినాడు మనుషులను చంపటము అనేది అర్జునునికి పని. కనుక ఆ పనిలో నీకు అధికారము లేదు. యుద్ధం చేయాల్సిందే కానీ, చంపితే వచ్చే పాపముగానీ, పుణ్యముగానీ సంపాదించటం, సంపాదించక పోవటము అనే దానిపైనే నీకు అధికారము కలదు.

ఆ విధముగా భగవద్గీతలో ఉన్న జ్ఞానము తెలిస్తే కార్యములు చేసుకోగలవు. మరి అది నీకు తెలిస్తే కదా! ఇప్పటికి ఐదువేల సంవత్సరాలయింది ఎవరికీ భగవద్గీత అర్థము కాలేదు. స్వామీజీలకే అర్థము కాలేదు, మీకెట్లు తెలుస్తుంది? ఈ దేశములో భగవద్గీత పుట్టింది. ఇశ్రాయెల్ దేశములో బైబిల్ పుట్టింది. బైబిల్ ఇశ్రాయెల్ దేశములో ఎవరికీ అర్థము కాలేదు. పుట్టిన ఇశ్రాయెల్ దేశంలోనే అర్థము కాకపోతే భారతదేశంలో అది వ్రాకినా అక్కడే అర్థము కాకపోతే ఇక్కడేమి అర్థమవుతుంది? పాస్టర్లు, ఫాదర్లు, బిషప్‌లకు ప్రభువు ఏమి చెప్పాడో అర్థము కాలేదు. బైబిల్‌లో ప్రశ్నిస్తే జవాబులు లేవు. భగవద్గీతలో కూడా ప్రశ్నిస్తే జవాబు లేదు. భగవద్గీతలో అయితే మీరు స్వామీజీలను ప్రశ్నించవచ్చుగానీ, బైబిల్‌లో ప్రశ్నించుటకు నీకేమి అర్హత? అని కొందరు

www.thraithashakam.org

అనవచ్చును. మూడు మత గ్రంథములు కావు. మూడు గ్రంథముల మీద అందరికీ హక్కు కలదు, అన్ని మతాలలోను ఉండేవాడు ఒకడే. నీవు నీ మతములోనే ఉండు. ఏ మతానికీ నీవు మారవద్దు. నీ మతములోనూ దేవుని జ్ఞానము ఉంది. అంతేగానీ నీ మతములో ఒక దేవుడు, నా మతములో ఇంకొకడు దేవుడు ఉండడు.

ప్రతీ మతములో ఉన్న ప్రతీవాడికి కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియాలు పదే ఉన్నాయి, ఒకటి ఎక్కువ, ఒకటి తక్కువ లేవు. బైబిల్‌లో చెప్పిన జ్ఞానమే భగవద్గీతలో ఉంది. భగవద్గీతలో చెప్పిన జ్ఞానమే బైబిల్‌లో ఉంది. మేము మూడు గ్రంథముల గూర్చి మాట్లాడగలము, కానీ నేను చదివింది ఒక్క భగవద్గీతే, కానీ మూడు గ్రంథాలు చదివిన వారికంటే ఎక్కువ చెప్పగలుగుచున్నాను. ఎందుకు చెప్పినవాడు ఒక్కడే, ఆ ఒక్కడే నాకు చెప్తున్నాడు. దేవుడు బైబిల్‌లో "ఎదురాడని జ్ఞానాన్ని చెప్తాను" అని చెప్పాడు. నేను ఆయన అందించిన జ్ఞానాన్నే చెప్తున్నాను. ఎవరు అందించారు ఈ జ్ఞానాన్ని కృష్ణపరమాత్మ అందించాడు. ఆ విధంగా శరీరముతో పుట్టిన మీరు శరీరముతో సంబంధముగా కృష్ణుడున్నాడు. ఆ రోజు కృష్ణుడు, ఈ రోజు ఆత్మ. ఆ రోజు కృష్ణుడు యాద్‌గా పుట్టాడు. యాద్‌గా పెరిగాడు. ప్రక్కనున్న వాళ్ళందరినీ యాదవులను చేశాడు అంటే జ్ఞానులను చేశాడు. యాదవులు అని పేరు పెట్టారు.

ఆ విధంగా పేరు పెట్టి వీరికి ముసలం ఒకటి ఉంటుంది అని చెప్పాడు. ముసలము అంటే అజ్ఞానము అని అర్థము. ఈ అజ్ఞానము యాదవులను నాశనము చేస్తుంది అన్నాడు. అంటే మాయ అనేది యాదవులను (జ్ఞానులను) నాశనం చేస్తుంది అన్నాడు. దీని అర్థమేమనగా అజ్ఞానము జ్ఞానులను లేకుండా చేస్తుంది. జ్ఞానులుగా కాకుండా చేస్తుంది.

www.thraithashakam.org

మాయలో పడిపోతారు. యాదవులకు ముసలం పుట్టింది అంటే ప్రత్యేకంగా ఎవరికో, ఎక్కడో పుట్టిందని కొందరు చెప్పుకుంటున్నారు. వీళ్ళు సాధారణంగా ఒక రోకలి పుట్టింది అంటారు. కానీ తలలోనే మాయ పుట్టింది కడుపులో కాదు. తలలోనే పుట్టింది ఆ ముసలం (అజ్ఞానము). అది ఈ జ్ఞానులందరినీ దూరం చేసింది. యాదవులు ఈ రోజు జ్ఞానంలేని యాదవులైనారు. యాద్ లేని యాదవులైనారు. ఇప్పుడు ఆ విధముగా తయారైన యాదవులందరినీ జ్ఞానమైన యాదవులుగా తీర్చిదిద్దటం మావంతు. వారికే కాక మిగతా అందరినీ యాదవులుగా చేయటమే మా పని. ఇక్కడ యాదవులు అంటే జ్ఞానులని అర్థము. అంతేగానీ ముసలం పుట్టి యాదవులంతా నాశనమై పోతారంటే, ఏ యాదవుడూ నాశనము కాలేదు. యాదవకులము భారతదేశములో సంపూర్ణంగా ఉంది. క్షేమంగా ఉంది కానీ యాదవకులంలో యాద్ లేదు, పప్పు ఉంది కానీ తిరువాత లేదు. వారిలోని యాద్‌ను పోగొట్టు కున్నారు. కొంత తెలిసి కృష్ణుని బొమ్మ పెట్టుకుంటారుగానీ ఏ విధముగా పూజించాలో తెలియదు. శ్రీకృష్ణుడు జన్మించి దేవునిగా ప్రవర్తించాడా, సాధారణమైన మనిషిగా ప్రవర్తించాడు. మోసం చేయలేదా? దగా చేయలేదా? దొంగతనము చేయలేదా? యుద్ధము చేయలేదా? చేశాడు. పెళ్ళికాని రుక్మిణిని ఎత్తుకొచ్చాడు. అడ్డువచ్చినవాడిని చంపి మరీ ఎత్తుకెళ్ళాడు.

మరి వీటన్నటినీ మనము ఒప్పుకుంటామా! టీ.వీలో కృష్ణుని సీరియల్ మీరు పూర్తిగా చూస్తే కృష్ణుడు అంతా వక్రమైన పనులే చేశాడు అనిపిస్తుంది. పాండవులు ఐదు ఊర్లు ఇవ్వండి మేము ఎలాగో బ్రతుకుతాము అంటే, ఆ విధముగా కౌరవులను అడుగుతూ ఇవ్వకపోతే భీముడు రక్తం త్రాగుతాడు, అర్జునుడు బాణాలు వేసి చంపుతాడు అని చెప్పి దుర్యోధనునిలో

www.thraithashakam.org

కోపమును రేకెత్తించి, యుద్ధాన్ని తెచ్చాడు. సరే ఏదో యుద్ధంలో ఓడిపోయి దుర్యోధనుడు జలస్తంభనం చేసి కూర్చుంటే, పౌరుషం తెప్పించినట్లు మాటలాడి బయటకు వచ్చేటట్లు చేసి భీమునికి దుర్యోధనునికి యుద్ధం పెట్టించాడు. దుర్యోధనుడు గదా యుద్ధములో ఆరితేరినవాడు. దుర్యోధనునికి గురువు కృష్ణుని అన్న బలరాముడే. ఆ గదా యుద్ధములో కొన్ని షరతులు, పద్ధతులుంటాయి. గదను నడుము నుండి పై భాగానికే తిప్పాలి, కొట్టాలిగానీ నడుము క్రింద భాగానికి కొట్టకూడదు. అలా కొడితే అక్రమ యుద్ధం అవుతుంది. ఆ రోజు భీమునికి దుర్యోధనుడు పాలభాగముపైన కొడితే భీముడు క్రిందపడతాడు కళ్ళు తిరిగి. అప్పుడు దుర్యోధనుడు క్రిందబడ్డవానిని వీరుడు కొట్టడు, తిరిగి నీవు లేవగలిగితే యుద్ధము చేయి అని సక్రమమైన పద్ధతిలో మాట్లాడుతాడు. అది ఒక నీతి కాదా? కానీ తెప్పరిల్లి భీముడు లేస్తే, కృష్ణుడు భీముడి పని సరి దుర్యోధనుడు చంపేస్తాడని తెలిసి, భీమునికి తొడపైన కొట్టు అని సైగ చేశాడు. క్రిందకొట్టకూడదు కదా! నీకెందుకు నేను చెప్పాను కదా, కొట్టు! అన్నాడు. అలాగే కొట్టాడు అప్పుడు దుర్యోధనుని కాలు విరిగి క్రిందపడ్డాడు. అప్పుడు దుర్యోధనుడు కృష్ణున్ని నీవు ప్రత్యక్షంగా ఉండి కొట్టించినావు కదా, ఇది పద్ధతేనా? అని అడిగాడు. పద్ధతే అని ఎవరు చెప్పారు అన్నాడు కృష్ణుడు. ఇది న్యాయమే కాదు అన్యాయమే అన్నాడు కృష్ణుడు. నేను వచ్చినది న్యాయం, అన్యాయం కొరకు కాదు. నేను వచ్చినది **జ్ఞానము, ధర్మము** కొరకు అన్నాడు.

నీవు ఇప్పటికైనా జ్ఞానము, ధర్మము తెలుసుకో నీ కర్మపత్రములో ఇట్లా ఉంది అదే జరిగితీరింది. నేను చెప్పటము కాదు నీ కర్మచిట్టాలో ఉంది కనుక నేను చెప్పాను. నీవు ఇట్లానే చనిపోవాలి దానిని ఎవరూ

www.thraithashakam.org

మార్చలేరు అని చెప్పాడు. నిన్ను భీష్ముడు దేవుడని పొగడుతూ మాతో చాలాసార్లు చెప్పాడే మరి! నీ దగ్గర ఏదైనా గొప్పతనము ఉందా? అని అడిగాడు. నా జీవితములో అన్యాయాలు, మీ జీవితములలో కూడా అన్యాయాలు ఉన్నాయి. మీ జీవితాలలో ఏయే పనులు ఉన్నాయో అవే పనులు నేనూ చేశాను. నాకు అవసరము లేదు అయినా మీ కోసము చేశాను. మీలా అక్రమాలు చేసేవారు కూడా ఈ జ్ఞానాన్ని తెలుసుకోవచ్చును, కర్మలు లేకుండా చేసుకోవచ్చు అనే నిరూపణగా చేసి చూపించాను. తామరాకు మీద నీరు అంటనట్లు, నేను కర్మలు చేస్తున్నాగానీ ఏ కర్మ నన్ను అంటదు. ఆ విధముగా నీవు కూడా చేయి అర్జునా! అని చెప్పాడు, మోక్షసన్న్యాసయోగము 18వ అధ్యాయంలో, లోకములో అందరిని చంపినా నీవు హంతకుడవు కావు, పాపమురాదు. ఏమి చెప్తున్నాడు ఈయన, ప్రత్యక్షంగా చంపినా హంతకుడవు కావు అంటే, ఎట్లా హంతకుడు కాకుండా పోతాడు? అంటే హత్యాపాపము అంటితే కదా హంతకుడు అయ్యేది. కర్మయోగ సిద్ధాంతాన్ని తెలుసుకుని చేస్తే ఎటువంటి పాపము రాదు. నీవు అలా చేస్తావా, అది తెలుసుకుంటే నీవు బొమ్మవు, నీ వెనుక ఉండేవాడు అన్నీ చేస్తున్నాడు అని తెలుస్తుంది. ఇంకొక శ్లోకములో చెప్తాడు **"జంత్రగాడు బొమ్మలను ఆడిస్తున్నట్లు ఆడిస్తాను"** అంటాడు. నరాలు అనే సూత్రాలు నా దగ్గర ఉన్నాయి. ఆ నరాలన్నీ ఎక్కడ కలుస్తున్నాయి? బ్రహ్మ నాడిలో కలుస్తున్నాయి. ఆ బ్రహ్మనాడి నా చేతిలో ఉంది. నేను ఇక్కడ అల్లాడిస్తే నీ చేయి అల్లాడుతుంది. నేను ఇక్కడ అల్లాడిస్తే నీ కాలు అల్లాడుతుంది. నేను అల్లాడిస్తేనే నోరు కదులుతుంది. నేను మాట్లాడిస్తేనే మాట్లాడుతారు, నోరు కదులుతుంది, నేను మాట్లాడిస్తేనే మాట్లాడుతారు. నేను వద్దు అనుకుంటే నీవెంత పలకాలన్నా పలకలేవు.

ఈ రోజు ఒకడు బలంగా ఉన్నాడు. విపరీతముగా మాట్లాడేవాడు, చాలామందిని దండించేవాడు. ఒక రోజు మాట్లాడడానికి సాధ్యమవుతోందా ఆయనకు? మనము చెప్పేది అర్థమవుతుంది అతనికి. కానీ మాట్లాడడానికి మాటరాదు, నేను మాట్లాడించాలి అనుకోలేదు, నరం నా చేతిలో ఉంది. నాశనరహితుడు ఎవరైతే ఉన్నాడో దానిని నరము అంటున్నాము. అక్షరము అనువాడు ఎక్కడున్నాడో దానిని నరము అంటున్నాము. నీ శరీరములో ప్రతీ నరములో ఎవరున్నారు? అక్షరుడున్నాడు. వాడు అల్లాడిస్తే నీవు అల్లాడు తున్నావు, లేకపోతే నీవు అల్లాడేందుకు లేదు. ఇప్పుడు నేను మాట్లాడు చున్నాను అంటే ఎవరు అల్లాడిస్తున్నారు, వెనుక ఉండేవాడు. ఏ మాట మాట్లాడాలో నాకు తెలియదు. దీనికంతటికీ ఏమంటే లోపలుండేవాడు ఆడిస్తే ఆడుతావు, లేకపోతే లేదు. వాడు ఎన్ని రోజులు ఆడిస్తే ఆడతాను. ఎప్పుడు నిలిచిపోతే అప్పుడు ఆట ఆగిపోతుంది. అది ఆయన చేతిలో ఉంది.

అగనంపూడిలో కృష్ణ మందిరము పని చేస్తుంటే, అక్కడ పెద్ద మండ్రగప్పలు ఉన్నాయి. అవి తేళ్ళకంటే జంపు (పెద్దవి) గలవి. ఒక వ్యక్తి పని చేస్తుంటే మండ్రగప్ప కరిచింది. రక్తం వచ్చింది. అతను గబగబా వచ్చి, మండ్రగప్ప కరిచింది అన్నాడు. నా ముందు కూర్చుండిపోయాడు. కొంత సమయానికి నీకు నొప్పిలేదు కదా! అంటే లేదన్నాడు, మరెందుకు కంగారు పని చేసుకో అన్నాను. ఆయన నిజమే కదా! అని పనిలోకి పోయాడు. అక్కడ పనిలో కరిచే కర్మ ఉన్నా, నొప్పిలేకుండా శరీరములో చేసింది ఎవరు? లోపలున్న ఆత్మయే. ఏ సమయంలోనైతే శ్రీకృష్ణుని పని చేస్తున్నావో, దేవుడంటే ఆయనొక్కడే కనుక ఆ సమయంలో జరుగబోయే ప్రమాదకరమైన కర్మలు తప్పిపోతాయి. కర్మలు

www.thraithashakam.org

కొట్టి వేయబడతాయి. ఆ కర్మలు కాల్చబడతాయి, క్షమించబడతాయి. కర్మలో దెబ్బలు తగిలి హాస్పెటల్‌లో నాలుగు రోజలు ఉండే కర్మ ఉంటే ఆ కర్మంతా కొట్టి వేయబడుతుంది. ఈ విధముగా దేవుడు మనిషిగా పుట్టాడు కనుక భగవంతుడనీ, ఆయనే దేవదేవుడనీ, విశ్వవ్యాప్తముగా ఉండేవాడనీ, అన్ని శరీరాల్లో ఉండేవాడనీ, మనము ఈ రోజు గుర్తు చేసుకొని, అతని జ్ఞాపకంగా కృష్ణాష్టమిని చేసుకుంటున్నాము. ఇంతకు ముందు మంత్రులను, రాజకీయ నాయకులను పిలిచి, వారు వచ్చిన వరకు మనము వేచివుండి, వారు వచ్చి ఏది చెప్తే అది విని వారిచే పుస్తకాలు ఆవిష్కరణ చేసేవారము. ఈ విధముగా చేయటం వలన కాలమంతా వృథా కనుక అవన్నీ మానుకొన్నాము. మనమే జ్ఞానము గురించి మాట్లాడుకుని, నాకు తెలిసింది నేను చెప్తాను.

అదే విధముగా **'త్రిమూర్తులు'** అనే నాటకము కూడా ఈ రోజు ప్రదర్శించబోతున్నాము. కనుక అది చూసి, జ్ఞానాన్ని ఆ విధముగా తెలుసుకుని, జ్ఞానవరంగా కృష్ణాష్టమిని గడుపుకుని, కృష్ణుని జీవితములో ఎన్నో అక్రమాలు చేసి మనకు ఎందుకు జ్ఞానము చెప్పాడు, అనేది మీకు కొంత సమయము తర్వాత తెలుస్తుంది. అదే విధముగా "గోవింద" అనే పదాన్ని గూర్చి మేము **"దేవాలయ రహస్యములు"** గ్రంథములో వ్రాశాము దానిని చూడండి, తెలుసుకోండి. ఆ నామములో ఉండే అర్థాన్ని ఈ విషయాన్ని అడిగితే ఎవరికీ తెలియలేదు. ఎవరి దగ్గరకైనా పోతే ఏదో చెప్తారు. రామాయణము, భారతం గురించే చెప్తారు గానీ, శాస్త్రము గురించి చెప్పరు. పురాణాలువేరు, శాస్త్రాలువేరు భగవద్గీత బ్రహ్మవిద్యాశాస్త్రము, అదే భాగవతము చెప్తే పురాణము అవుతుంది. 18 పురాణాల రూపంలో, వేదాలరూపంలో మాయ మన తలలోనే ఉంది. భగవద్గీతలో **"గుణమయి**

**మమమాయా"** అని చెప్పాడు. జ్ఞానము ప్రక్కనే అజ్ఞానము ఉంది. అజ్ఞానాన్ని విడిచిపెట్టి వస్తే మీకు జ్ఞానము తెలుస్తుంది. లేకపోతే మనముందరే ఆ మాయ స్వామీజీల రూపంలో, గురువుల రూపంలో అజ్ఞానము చెప్పిస్తూ ఉంది. పురాణాల, వేదాల రూపములో బోధిస్తూ ఉంది. భగవద్గీతకంటే వేదాలు ముఖ్యము అంటున్నారు. వేదాలు విడిచి పెట్టండి అని ఆయన చెప్తే, వేదాలు ముఖ్యం అంటున్నారు. మీరు మాయలోకి పోతున్నారు అని నేను చెప్తున్నాను అదే ముసలం మీకు కనుక వేదాధ్యయనం, యజ్ఞాల మార్గాలకు మీరు వెళ్ళవద్దండి. స్వచ్ఛమైన జ్ఞానము తెలుసుకోండి. నేను చెప్పడము కాదు మీరు చెప్పగలరు జ్ఞానాన్ని, జ్ఞానాన్ని చెప్పడానికి ప్రయత్నించండి. మీరూ ఎలా చెప్పారో తెలుస్తుంది, లోపలివాడే పలికిస్తాడు. మీకు తెలియని జ్ఞానము కూడా చెప్పిస్తాడు మీతో. అప్పుడు ఎట్ల చెప్పాను ఈ జ్ఞానాన్ని అనుకుంటారు. భక్తిలో మీరు వ్యభిచరించవద్దు నీకు నాకు అందరికీ ఒక్కడే మొగుడు (పతి) ఉన్నాడు. "భక్తిర్వ్యభిచారిణి" అని చెప్పాడు. దేవుడు జగద్భర్త ఒకడున్నాడు అని వానికే మనము కొబ్బరికాయను అర్థముతో కొట్టాలి. అంతేగానీ స్లాబ్‌కి, ఇంటికి, ద్వారానికి కొట్టరాదు. కనుక కృష్ణపరమాత్మ మీద ధ్యాస పెట్టుకొని జ్ఞానము తెలుసుకోండి.

## 22. ద్రావిడులు - ఆర్యులు

తేది : 21-09-2009

ఆర్యులు, ద్రావిడులను ద్వేషభావంతో చూడటం, చులకనగా చూడటం జరుగుచున్నది. ఈ మధ్య క్రికెట్ ఆటగాడ్ని, ఆర్యులు అనగా ఉత్తరదేశ ప్రాంతపువారు చెంపదెబ్బ కొట్టడం జరిగినది. ఆ దెబ్బను

www.thraithashakam.org

తిన్నవాడు ద్రవిడ దేశపువాడు (దక్షిణ రాష్ట్రమునకు చెందినవాడు). ఈ విధముగా దక్షిణ దేశపు వారిని (దక్షిణ రాష్ట్రపు వారిని) చులకనగా చూడడము అన్ని రంగాలలోనూ ఉన్నది. ఇది ఇప్పటి పరిస్థితి కాదు పూర్వమునుండి ఇదే పరిస్థితిలో ఉండేది. ఇంకను ఇప్పుడు తగ్గినా, అదే పరిస్థితి కొంత కనిపిస్తూనే ఉన్నది. ఇప్పుడు మనమంతా దక్షిణ దేశస్థులము, అంటే ఒకే దేశంలో ఒక భాగములో ఉన్నవారము. ఏ భాగమంటే దక్షిణ భాగములో ఉన్నవారము. ఈ విధముగా దక్షిణ భాగములో ఉన్నవారి నందరినీ "ద్రావిడులు" అన్నారు, ఉత్తర భాగములో ఉన్న వారినందరినీ "ఆర్యులు" అన్నారు.

ఈ ఆర్యులు, ద్రావిడులు అనే విషయము పూర్వమునుండే వస్తున్నది. ఆర్యులు అనగా దేవతలని, ద్రావిడులు అంటే రాక్షసులు అనే అర్థముగా వాడేవారు. దక్షిణ ప్రాంతమని దేనిని అందురనగా, ఆంధ్రప్రదేశ్ కర్ణాటక, తమిళనాడు, కేరళ, శ్రీలంక ఈ ఐదు రాష్ట్రములకు దక్షిణ దేశమనేవారు. శ్రీలంక ఇప్పుడు ఒక దేశము కదా! అనవచ్చును. శ్రీలంక ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌కంటే చిన్నది కదా! ఇప్పుడు శ్రీలంక ప్రత్యేక దేశమైనప్పటికీ పూర్వము తమిళనాడు, లంక కలిసి ఉండేవి. ఇప్పటికీ కలిసేటట్లే ఆ కొన, ఈ కొన కలిసే ఉన్నాయి. మధ్యలో కొంతవరకు నీరుంది. తుఫాన్‌లు వలన, సునామీల వలన ఆ నీరు ఆ భూభాగాన్ని ఆక్రమించుకున్నాయి. అక్కడ ఉన్న నీరు 5 నుండి 6 అడుగులే ఉండును. అక్కడ మెరికగా (గడ్డగా) ఉండటము వలన స్టీమర్స్‌లాంటివి వెళ్ళలేవు కనుకు ప్రయాణీకులు చుట్టూ తిరిగి రావాల్సిందే. ఇప్పుడు అక్కడ ఉన్న మెరికలాంటి భాగాన్ని, గడ్డను తీసివేసి, స్టీమర్లు పోయేదానికి త్రోవ చేద్దామంటే, అది రాముడు సీతమ్మను తేవటానికి కట్టిన వారధి, అది

తీయకూడదని కొందరు గందరగోళం చేశారు. ఎవరేమి అనుకొని పోట్లాడుకున్ననూ, వాస్తవముగా పూర్వము రెండు భాగాలు కలిసే ఉండేవి. మొత్తంగా ఈ ప్రాంతాన్ని నివాసంగా చేసుకొని బ్రతికే వారందనినీ రాక్షసులు అనేవారు. రాక్షసులు అంటే కొమ్ములు, కోరలు ఉండేవారని కాదు. ఆర్యులు మనుషులే, ద్రావిడులూ మనుషులే. ద్రావిడులు నల్లగా ఉన్నారు. ఆర్యులు తెల్లగా ఉన్నారు. అంతే తేడా! ఇటు, అటు సముద్రము ఇరుకుగా ఉండటము వలన, మధ్యలో మనము ఉండటము వలన, సముద్రము దగ్గర ఉండేవారందరూ నల్లగానే ఉంటారు. మద్రాస్ ప్రాంతములో మనము చూసినట్టైన, అక్కడ ఉన్నవారు నల్లగానే ఉంటారు. ఇక్కడ శరీరము నల్లగా ఉందా. అందవిహీనముగా ఉందా అని కాదుగానీ వారిలో ఉండే గుణములే ముఖ్యము. బాగున్న శరీరములో చెడుగుణములుండవచ్చు, బాగాలేని శరీరములో మంచి గుణములుండవచ్చు. కనుక ఎటూ మనము నిర్ణయించు కొనుటకు అవకాశమే లేదు. అయితే ద్రావిడులకు, ఆర్యులకు ఎందుకంత తేడా వచ్చిందో అంటే, ఆర్యులు ఎక్కువమంది పండితులుగా ఉన్నారు. కాశ్మీర్ పండిట్స్ అని పేరు వినే ఉంటాము, అలాగే కాశీపండితులు. వీరంతా సంస్కృతము బాగా నేర్చుకుని పాండిత్యము బాగా కలిగి ఉండేవారు. సంస్కృత పాండిత్యము ఉండటము వలననే వారు గ్రంథములు వ్రాశారు. దక్షిణ ప్రాంతపు వారికి చదువు పెద్దగారాదు, చదువురాదు కనుక వీరు ఏ పుస్తకాలు వ్రాయలేకపోయారు. ఇది ఈ విధముగా ఉండగా, తరువాత తుఫాన్‌ల వలన, సునామీల వలన లంక ప్రాంతము విడిపోయినది. ఆ విధముగా కలిసివున్న నాలుగు రాష్ట్రాలు విడిపోయాయి. శ్రీలంక ప్రత్యేక దేశమయ్యింది. భారత దేశానికి, శ్రీలంకకు సంబంధము లేదని ఇరువురు చెప్పుకుంటున్నారు. పూర్వము మాత్రము వారూ, వీరూ ద్రావిడుల క్రిందే

లెక్క. ఈ రోజుకు కూడా లంకలో తమిళ దేశస్థులు ఉన్నారంటే, ఈ రెండు దేశాలు పూర్వము కలిసే ఉండేవి అనే విషయము తెలుస్తున్నది.

త్రేతాయుగములోనే రాముడూ పుట్టాడు, రావణుడూ పుట్టాడు. రామునికి, రావణునికి చాలా తేడా ఉండేది. రాముడికంటే రావణుడు 60 సంవత్సరములు పెద్ద. ఆయన ముందు పుట్టినటువంటివాడు జ్ఞానమును సంపాదించినాడు కావున రావణబ్రహ్మ అని పేరుగాంచెను. ఆధ్యాత్మిక జ్ఞానము తెలిసినటువంటివాడు రావణుడు. రామునిది రావణుని కంటే చాలా చిన్నవయస్సు, పదహారు సంవత్సరములకే రామునికి పెండ్లి అయిపోయింది. పదిహేడు సంవత్సరములకే అడవులకు వెళ్ళిపోయాడు. కొంతకాలము తరువాత సీతను రావణుడు లంకలో పెట్టినది పదినెలల కాలము మాత్రమే. ఈ 10 నెలల తరువాత ఆమెను తేవటము జరిగింది. ఇదంతా రామునికి 20 సంవత్సరముల వయస్సులోపలనే జరిగినది. అదే విధంగా సీత చనిపోవటము కూడా తక్కువ వయస్సులోనే చనిపోయింది. అప్పటికి రాముని వయస్సు కూడా చిన్నదే కదా!మరి. రావణబ్రహ్మకు, అతను చనిపోయేటప్పటికి 80 సంవత్సరములుండును. ఆ రోజుల్లో సంపూర్ణమైన ఆధ్యాత్మిక జ్ఞానము కల్గిన వ్యక్తిగా రావణుడు పేరుగాంచి రావణబ్రహ్మ అయినాడు. ఇక్కడ బ్రహ్మ అంటే 'గొప్ప', 'పెద్ద' అని అర్థము. ఒక విధముగా 'కృష్ణభగవాన్' అనే పేరు ఎటువంటిదో, 'రావణబ్రహ్మ' అనే పేరు కూడా అటువంటిదే. మరి ఇంత జ్ఞానము కల్గిన రావణుడు అంత చిన్నవయస్సున్న రాముని చేతిలో చనిపోవటము అనేది వాస్తవమే! ఈ విధంగా కొంత కాలము గడిచిన తరువాత రాముడు మా వాడు, రావణుడు ద్రావిడుడు, రాముడు ఆర్యుడు, రాముడు దేవుడు, రావణుడు రాక్షసుడు అనే తెగలు కల్పించి, రామున్ని గురించి ప్రశంసిస్తూ ఒక పెద్ద

గ్రంథమును వ్రాసి, ప్రచారము చేశారు ఆర్యులు. వారు చెప్పిందే జ్ఞానము, మనకు తెలియదు అని, వారు చెప్పిందే నిజమని చదువు పెద్దగా రాని ద్రావిడులు నమ్మారు.

ఈ విధముగా ఉత్తర భాగములో లేని ప్రచారము, దక్షిణ ప్రాంతపు ద్రావిడులుండే భాగములోనే జరిగినది. అంతటితో ఊరుకోక రాముని గుడిని కట్టాలని ఆ రోజు శాసించారు. కడితే రాముని గుడినే కట్టాలనే విధముగా చేశారు. ఉత్తర రాష్ట్రప్రాంత భాగములో రాముని గుడులు కనిపించవుగానీ అమ్మవారి గుడులు, కనిపిస్తుంటాయి. కాశీమాతా, మాతాజీ గుడులుంటాయి గానీ రాముని గుడులు ఉండవు. మన ప్రాంతములో ద్రావిడులు అందరూ ప్రతీ ఊరిలోనూ, వాడలోనూ రాముని గుడి కట్టుకుంటున్నాము. ఆ విధముగా ప్రచారము చేసిపోయారు ఆర్యులు. ద్రావిడుల వ్రేలు తీసి ద్రావిడుల కళ్ళనే పొడిచారు ఆర్యులు. అంటే రావణబ్రహ్మను వ్యతిరేఖముగా ప్రచారము చేసి, ఆయనను నీచముగా సృష్టించి, రామున్ని గొప్పగా చూపించి, ద్రావిడులతోనే రామున్ని పొగిడునట్లు చేసి, రావణున్ని నిందించినట్టుగా చేశారు. రావణబ్రహ్మను రావణాసురుడు అన్నారు. వాస్తవముగా ఆయన పేరు రావణుడు. మనమిప్పుడున్నాము, మనమంతా ఎవ్వరిక్రింద లెక్కంటే రాక్షసుల క్రిందే లెక్క! మనమంతా ఇప్పుడు ఎవరిని పూజిస్తున్నాము, ఆర్యులనే, ఆ విధముగా మనల్ని తర్ఫీదు చేశారు ఆర్యులు. ఇది ప్రస్తుత పరిస్థితి పూర్వపు పరిస్థితికి మరలా వెళ్ళి చూసిన, దక్షిణ దేశపు ప్రాంతపు వారు జ్ఞానులు. ద్రావిడ దేశపు ప్రజలు సంపూర్ణమైన దైవజ్ఞానము కలిగి ఉండేవారు. ఆత్మజ్ఞానము సంపూర్ణముగా లేనిది ఉత్తర దేశపు రాష్ట్ర ప్రాంతము. ఈ విధముగా కృత, త్రేతా, ద్వాపర యుగములలోను ఉండేది. కానీ కొంతకాలానికి ఆ ఆత్మజ్ఞానము లేకుండా

www.thraithashakam.org

చేసే ప్రయత్నము చేసినవారు ఆర్యులు ఇది పెద్ద కుట్ర. ఆత్మజ్ఞానము ద్రావిడ రాజ్యములో ఉండేది కనుకనే, దేవాలయములను శాస్త్రబద్ధముగా, ఆధ్యాత్మికరీత్యా అర్థము ఉండే విధముగా నిర్మించేవారు. పూర్వముగానీ, ఇప్పుడుగానీ ఉత్తరదేశ భాగములో (ఉత్తర రాష్ట్రముల భాగములో) ఎక్కడా సాంప్రదాయ, శాస్త్రబద్ధత దేవాలయ నిర్మాణము కనిపించదు. తిరుపతి దేవాలయము చూడండి శాస్త్రబద్దముగా నిర్మించబడింది కర్ణాటక పోయి చూసినా, అక్కడ కూడా సాంప్రదాయబద్ధముగానే దేవాలయములు నిర్మింపబడ్డాయి. అదే విధముగా ఉత్తరదేశ ప్రాంతపు దేవాలయాలు ఇళ్ళా, గుడులా అన్నట్లు ఉండును. విశాఖపట్నములో ఒక గుడి కట్టారు. ఎటువంటి సాంప్రదాయము లేకుండా కట్టేశారు. ఈ ప్రాంతాలకు కూడా అటువంటి పరిస్థితులు వస్తున్నట్లు ఉన్నాయి. ఉత్తర ప్రాంతపు గుడులు మరీ విడ్డూరమేమంటే ఒక అరుగు కడతారు, వరసగా మనుషుల్ని కూర్చో బెట్టినట్లు దేవతలందరినీ కూర్చో బెట్టారు. నువ్వు ఏ దేవతలకైనా మ్రొక్కుకో నీ ఇష్టము గర్భగుడి అసలుకు ఉండదు. ఇప్పుడు ఆధ్యాత్మికతను మరచి పోయినందువలన ఆత్మజ్ఞానాన్ని మరచిపోయినందువలన, ఆర్యసమాజ సంస్కృతిని మన తలలకు పట్టేసింది. తద్వారా వీరు గుడులను కట్టేటప్పుడు సాంప్రదాయము, శాస్త్రబద్ధమైన నిర్మాణాలను చేయటము మానేస్తున్నారు. పూర్వము కట్టిన అసలైన దేవాలయము గర్భగుడిగల నామాల దేవుళ్ళ ఆలయము ఒక్కటి, మరొకటి గర్భగుడి లేని దేవాలయము పై కప్పు లేకుండా సాంప్రదాయముగా ఉంటుంది. పూర్వము ఈ విధముగానే ఉంది. ఈ మధ్య ఆర్యుల ప్రభావము వలన ద్రావిడులందరూ భ్రష్టుపట్టుకు పోయారు. ఈ విధముగా భ్రష్టుపట్టుకు పోయినందువలన తిరిగి మేము చెప్పాల్సిన పని వచ్చింది. కానీ చాలామంది అసూయతో నేను చెప్పేది వినకున్నారు.

ఇప్పటికీ పూర్తి ద్రావిడ ప్రాంతమునకు వెళ్ళండి. అక్కడ రావణున్ని పూజిస్తారు. రాముని గుడులు అక్కడ ఉండవు. ఈ ఆంధ్రప్రదేశ్ ప్రాంతానికి ఆర్యుల గాలి ఎక్కువ తగిలింది కాబట్టి, ఎక్కడ పడితే అక్కడ రాముని గుడులు కట్టారు. ఎక్కడైనా జ్ఞానసాంప్రదాయములు మిగిలి ఉంటే ద్రావిడ దేశములోనే కలవు. 2000 సం॥ పూర్వము ఇజ్రాయెల్ దేశములో ఏసుప్రభువు అనే వ్యక్తి పుట్టాడు. మరలా ఇతని పేరు చెప్పుచున్నాడంటే మత ప్రచారమేమో అని అనుకోకండి. ఈ విధంగా పుట్టినటువంటి వ్యక్తి గొప్పవాడని తెలిసి తూర్పు దేశపు జ్ఞానులు అక్కడకు వెళ్ళారు, జ్ఞానసముపార్జన కొరకు తూర్పుదేశము ఎక్కడుంది, ఇక్కడే ఉంది. ఇజ్రాయిల్‌కు తూర్పుగా ఉండే దేశము భారతదేశము. ఆ రోజు అక్కడకు పోయినవారు కేవలము ద్రావిడులే. ఆర్యులెవరికీ తెలియదు గొప్పవాడు పుట్టాడని, ద్రావిడులకే తెలుసు. కనుక ఆయన దర్శనమునకు వీరు పోయారు. తూర్పుదేశము వారు ఇజ్రాయిల్ వెళ్ళారు అనే వ్రాతకు, ద్రావిడులు తూర్పుదేశమునకు వెళ్ళారు. అందుకే వారు జ్ఞానులు అని చెప్పుటకు ఆధారముగా ఉన్నది. ఇంకా చెప్పాలంటే అద్వైతము ప్రతిపాదించిన శంకరాచార్యులుగానీ, ద్వైతము ప్రతిపాదించిన మధ్వా చార్యులుగానీ, విశిష్టాద్వైతము గురించి ప్రతిపాదించిన రామానుజా చార్యులుగానీ పుట్టినది ద్రావిడ ప్రాంతములోనే వారంతా ద్రావిడులే ఎందుకనగా! శంకరాచార్యుల వారు కేరళలో పుట్టారు కేరళ ద్రావిడ ప్రాంతము. రామానుజాచార్యులు పెరంబుదూర్ (తమిళనాడు) లో పుట్టారు. అదీ ద్రావిడ ప్రాంతమే మధ్వాచార్యులు కర్ణాటక (ఉడిపి) ప్రాంతములో పుట్టారు. అదియునూ ద్రావిడ ప్రాంతమే. ఇప్పుడు త్రైత సిద్ధాంతము ప్రతి పాదించిన మేము అయిన **శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానందయోగీశ్వరులు** పుట్టినది ఆంధ్రప్రదేశ్, ద్రావిడ ప్రాంతమే. మరి ఆర్యులెవరైనా ఉన్నారా,

www.thraithashakam.org

సిద్ధాంతకర్తలుగా మేము చెప్పునది ఏమనగా ద్రావిడదేశము జ్ఞానుల దేశము అని దేవుడు తెలియజేసేందేకేమో సిద్ధాంతకర్తలందరినీ ఈ ప్రాంతములో పుట్టినట్లు చేశాడు. ఇ(హి)ందూ మత సిద్ధాంతకర్తలందరినీ ఇక్కడే పుట్టించాడు. ఇందూమతములో ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము, త్రైతము ఉండవచ్చు ఒక దానికంటే ఇంకొకటి గొప్ప కావచ్చు. అద్వైత సిద్ధాంతము ఆధారముగా భగవద్గీతను వ్రాసినవారు కొందరున్నారు. విశిష్టాద్వైతమే గొప్పదని, దానిని ఆధారము చేసుకుని భగవద్గీతను వ్రాసినవారు కొందరున్నారు. అన్నిటికీమించి **"త్రైత సిద్ధాంతము"** గొప్పదని దానిని ప్రతి పాదిస్తూ మనము కూడా "త్రైత సిద్ధాంత భగవద్గీత"ను వ్రాశాము.

ఆర్యుల ప్రభావము మనమీద పడింది. వారిది ఉత్తర ప్రాంతము అని చెప్పాము కదా! వారంతా ఎక్కువగా వేదాన్నే పఠిస్తారు. యజ్ఞాలు ఎక్కువగా చేస్తారు. వీటికన్నిటికీ వ్యతిరేఖంగా, భగవద్గీతను మనము ప్రచారము చేస్తున్నాము అంటే వారు చెప్పేదీ జ్ఞానమే, మనము చెప్పేదీ జ్ఞానమే కానీ, బెల్లంపానకానికీ, తేనెకూ ఉన్నంత తేడా ఉంది. బెల్లాన్ని నీళ్ళతో కలిపితే ద్రవమై, కల్తీ అయి తీపిదనాన్ని (రుచిని) పొందింది. ఈ తేనెలో నీరు కలపలేదు, స్వయంసిద్ధంగా తయారయింది. తేనే త్రాగనంత వరకు పానకమే గొప్ప అందరికీ, కానీ తేనె త్రాగిన తరువాత పానకము తక్కువే అగును. ద్రావిడులవద్ద ఉన్న జ్ఞానము, ఆర్యుల జ్ఞానముకంటే చాలా ఎక్కువ విలువ కలిగి ఉన్నదని చెప్పవచ్చును. ఆర్యులు చెప్పిన జ్ఞానమే నిజమనుకొని అనుసరించినాగానీ, ద్రావిడ జ్ఞానము తెలిసిన తరువాత ద్రావిడ జ్ఞానము చాలా గొప్పది అని తెలుస్తుంది. ఆర్యులు, ద్రావిడులు ఇటువంటి పేర్లన్నీ మనము పెట్టుకున్నవే కానీ మనమందరము మనుషులము అనేది మాత్రము వాస్తవము.

ఈ ద్రావిడ దేశములో నిర్మించిన దేవాలయములను అనుసరించి, వాటి నిర్మాణము నుండి పూజచేసే విధానములో ఉన్న అర్థములను **“దేవాలయ రహస్యములు”** అనే గ్రంథములో వ్రాశాము. అంటే గోపురము ఉంటుంది, గర్భగుడి ఉంటుంది, ధ్వజస్తంభము ఉంటుంది. ఈ విధముగా సాంప్రదాయమైన దేవాలయములో ఇవన్నీ ఉండును. వీటన్నిటినీ గురించి దేవాలయ రహస్యములనే గ్రంథములో వ్రాశాము. ఒక గర్భగుడిలో రెండు ప్రతిమలు పెట్టకూడదు. ఒకవేళ పెట్టినా, అది సాంప్రదాయము కాదు. ఒకవేళ భార్యాభర్తలుగా ఉన్న ఒక ప్రతిమను పెట్టవచ్చును. గర్భమునందు ఒకడు పుట్టుటకు, ఇద్దరు అరుదుగా పుట్టుటకు అవకాశము కలదు. దేవుడే భగవంతుడై, ఒక్క గర్భమునందు ఒక్కడై పుట్టును అనే దానికి సంకేతంగా సాకారరూప ప్రతిమను దేవాలయములందు ఉంచేవారు, ఉంచాలి కూడా! కానీ ఇప్పుడు దేవాలయమునకు గర్భగుడి ఒకటి ఉంటే అందులో ఎందరో దేవతలుంటారు, అదియునూకాక, ఈ రోజు గర్భగుడులే లేని దేవాలయములు నిర్మిస్తున్నారు. ఆ గర్భగుడిలో కూడా, భగవంతుని ప్రతిమ మాత్రమే ఎక్కడుంటుందో దానినే గర్భగుడి అనవలెను. శ్రీకృష్ణ పరమాత్మ ఉన్నాడు. అతని ప్రతిమనే మనము మన మందిరములో ప్రతిష్ఠించు కున్నాము. ఎందుకంటే ఆయన గర్భమునుండే సజీవముగా పుట్టెను అని తెలిపే నిమిత్తము, గర్భములో ఆకారాన్ని పెట్టి పుట్టినటువంటివాడు కనుకనే అతను ఉండే స్థానాన్ని గర్భగుడి అంటున్నాము. గర్భగుడి ఎందుకనాలి? గర్భ అంటే ఏమిటి అని ఎవరైనా యోచించారా? ఇప్పుడు కడుతున్నామంటే, ఏదో రకంగా కట్టేస్తున్నారు అంతే! శాస్త్రబద్ధత అసలుకు లేకుండా పోయింది. భగవద్గీతలో అక్షర పరబ్రహ్మ యోగములో ఉత్తరము, దక్షిణము అని ఒక శ్లోకములో కలదు. ఏ పక్షమున జ్ఞానము ఉంది అనగా, దక్షిణములో

www.thraithashakam.org

జ్ఞానము ఉంది కనుక ఉత్తరమునుండి ప్రయాణించి దక్షిణమువైపుకు వస్తే నీవు జ్ఞానములోకి పోతావు. దక్షిణ ప్రాంతము మోక్షమనుకో, మరి మోక్షానికి పోవాలంటే ఉత్తర దేశాము నుండి దక్షిణ దేశానికి రావలెను. అంటే ఉత్తర దేశము నుండి దక్షిణ దేశమునకు వెళ్తేనే మోక్షానికి పోగలమని, అంతరార్థము అందులో కలదు. అదే ఉత్తరాయణము, దక్షిణాయణము అని పేర్లు అందులో కనిపిస్తుంటాయి. అంటే ఉత్తరాయణము నుండి దక్షిణాయణమునకు వెళ్ళాలని చనిపోయిన తరువాత శవాన్ని దక్షిణ దిక్కుకే తల ఉన్నట్లు పెడతారు. అంటే తెలిసినా, తెలియకపోయినా ఆ విధముగానే చేస్తారు. అందుకే దక్షిణ దేశములో జ్ఞానము ఉన్నదని అర్థమవుతున్నది. ఉత్తరదేశ ప్రాంతములో చనిపోయినవారికైనా దక్షిణమువైపునకే తలపెట్టుదురు. ఎవ్వరు చనిపోయినా ఆ శవాన్ని ఉత్తరదేశం వారు పెట్టకపోయినా, మనము మాత్రము శవాన్ని దక్షిణం వైపుకే పెట్టి, దక్షిణ ప్రాంతము జ్ఞానము కల్గిన ప్రాంతముగా గుర్తించే నిమిత్తము ఆ విధముగా పెట్టడము జరుగుచున్నది.

జ్ఞానము దక్షిణ దేశములో ఉన్ననూ, దానిని గుర్తించకుండా ఉత్తర దేశ జ్ఞానమును తలలో పెట్టుకుని తిరుగుచున్నారు. ద్రావిడులు అదియునూ దక్షిణదేశపు జ్ఞానాన్నే అనగా వారి జ్ఞానాన్నే వారు వెక్కిరిస్తున్నారు.

రాముడు మంచివాడు, రావణుడు చెడ్డవాడు? అని కొందరు అంటున్నారు. రావణుడు చేసిన తప్పేమి? 10 నెలల కాలము ఉంచిన సీత అతనిని ఏమీ అనలేదు వాస్తవముగా ద్రావిడులు వారి జ్ఞానాన్ని వారు గుర్తించక, చెప్పినా సరే జ్ఞానమును అర్థము చేసుకోవడము లేదు సరికదా! ఏదో అడ్డంగా ప్రశ్నించాలని ప్రశ్నిస్తున్నారు. వివరించి చూసుకో, నీకు

www.thraithashakam.org

మెదడు లేదా? రాముని జీవిత చరిత్ర చూసిన, ఎక్కడైనా ఆధ్యాత్మిక జ్ఞానము తెలుసుకొనుటకు ఆయనకు అవకాశము కుదిరిందా? యజ్ఞములను కాపాడాడు, ఆ యజ్ఞముల గురించి భగవద్గీతలో ఏమి చెప్పినారు? అవి అధర్మములు అని భగవద్గీత చెప్పింది. ఏవైతే అధర్మములో వాటిని సంరక్షించుటకు నీవు వెళ్ళినావు. వాలిని చంపటము అధర్మము కాదా! సుగ్రీవుడు ఏదో చెప్పాడంటే, రాజుగా నీవు పంచాయితి పెట్టించి, వారిద్దరినీ మందలించి వారిని కలిసేటట్లు చేయటము నాయ్యంగా, ధర్మముగా ఉంటుందా? ఏదీ ఆలోచించకుండా చంపేయటము న్యాయమా? ఈ ఆర్య సమాజము అనే గుంపు తయారయింది. ఉదయము లేచిన దగ్గరనుండి ఏదో ఒక యజ్ఞము చేయాలివారు, అది చెయ్యకుండా అన్నము తినకూడదు. ఇంట్లో అందరూ ఆ యజ్ఞము చేయాల్సిందే తలా ఒక కుంపటిలాంటిది పెట్టు కుంటారు మంత్రాలను చదవటము, నెయ్యి పోయటము, మంత్రములు చదివే యజ్ఞము చేయాలి, అది ఆర్యసమాజము యొక్క సిద్ధాంతము. వేదాలు ఈ విధముగా చెప్పాయి అంటారు. వేదాలను విసర్జించమని భగవద్గీత చెప్తే, వేదాలు ఈ రకంగా చెప్పాయి, ఈ విధముగా చెయ్యమని వీరు చెప్తున్నారు.

ఈ మధ్య ఒక భగవద్గీత సి.డి ఒక దానిని మేము విన్నాము. అందులో ఇప్పుడు 100 శ్లోకాలు చదివి మొత్తము భగవద్గీత అయింది. ఘంటసాల, సుశీల, బాలసుబ్రమణ్యముగారు పాడినలాంటిది కాదది మొత్తము శ్లోకాలన్నీ చదివి, దానికి భావము చెప్పినారు. అది ఐదు ఆరు గంటల కాలము ఏకధాటిగా వింటేనే అయ్యేది కాదు. అంతపెద్దగా చెప్పినారు. కానీ ఆ శ్లోకములను వింటూవుంటే ఎంత అజ్ఞానముతో చెప్పుచున్నారో అర్థమగును.

శ్రీకృష్ణుడు అసలుకు యజ్ఞాలు చేయవద్దని చెప్తే, యజ్ఞాలు చెయ్యమని అందులో చెప్తున్నారు. అందులో సంస్కృతము శ్లోకము చదవటము, దాని భావాన్ని తెలుగులో చెప్పటము మరొక విధముగా చెప్పుచున్నారు. యజ్ఞములు రెండే రెండు అని ఆయన (శ్రీకృష్ణుడు) చెప్తే వీరు మరి నాలుగు కలిపి చెప్పారు, అందులో తపోయజ్ఞము అని కూడా చెప్పారు. భగవద్గీతలో జ్ఞానాన్ని పెట్టి పంపిస్తే, వీరంతా మసిబూసి, ఇంకో విధముగా తయారు చేసి, ఇదీ భగవద్గీత అని చెప్పినారు. ఆ రోజు శ్రీకృష్ణుడు ఏ భావముతో చెప్పెనో ఆ భావముతో భగవద్గీత లేనేలేదు. ఘంటసాలగారి భగవద్గీత చూసినా, అందులోనూ కొంత తప్పుంది.

ఈ విధముగా మీరు చదువుచున్న, వింటున్న భగవద్గీతలలో తప్పుంది అని చెప్తే జీర్ణించుకోలేక, ఆర్యసమాజమును తలకెత్తుకుని మనల్ని ప్రశ్నించేందుకు తయారైనారు. ఈ మధ్య ఒక వ్యక్తి ప్రశ్నించారు. ఏమంటే, మీరు చెప్పిన జ్ఞానము గొప్పదంటున్నారు. మీ జ్ఞానము మోక్షానికి తీసుకు వెళ్ళును అనటానికి ష్యూరిటీ ఇవ్వగలరా? అని మమ్మల్ని ప్రశ్నించాడు. నేను ఏదో ఒక బస్సులో నిన్ను ఎక్కించాననుకో, అది కడపకు పోయింది. కడపకు పోయినాను అని ష్యూరిటీ ఏమంటే, నీవు కడపకు పోయి చూసుకుంటే నీవు కడపలో ఉన్నావో, లేవో తెలుస్తుంది. నేను చెప్పాను నా బస్సుపోతుంది, ఖచ్చితము అని చెప్తాను సరే! నేను ష్యూరిటీ ఇస్తాను, నేను ష్యూరిటీ ఇచ్చానా లేదా అని నీకెట్లు తెలుస్తుంది. నీవు వెళ్ళి చూడాలి, నీకు త్రోవ తెలియదు, డొంకా తెలియదు నీవెట్లు చేరుతావు అక్కడికి? నీకు జ్ఞానమే తెలియదే, నీకు నేను ష్యూరిటీ ఇచ్చినాను. కాగితము మీద ముద్రవేసి చెప్పాను, ఇస్తాను, ష్యూరిటీ కాదని నీవెట్లు నిరూపించగలవు. అసలుకు నీవు వెళ్ళలేవు, ఎవరైనా పోయినారో లేదో అని ఎట్లు చూస్తావు?

ఎవరి జ్ఞానము వారు తెలుసుకొని, శ్రద్ధతో ఎవరికి వారు జ్ఞానము ద్వారా మోక్షానికి వెళ్ళగలరు ష్యూరిటీలు ఇస్తే మాత్రము జ్ఞానము తెలుసుకోకుండా నీవు వెళ్ళగలవా? ఎవరైనా వెళ్ళినారా అని చూడగలవా? ఆ విధముగా ప్రశ్నించే తెలివి తక్కువ మనుషులు చాలామంది ఉన్నారు. కానీ నేను ఆయనకు సున్నితముగా చెప్పాను. ఏమంటే, ఇదంతా నమ్మకము పైన ఆధారపడి ఉంటుంది కానీ ష్యూరిటీలు ఉండవు అని చెప్పాను. నువ్వేదో శ్లోకాన్ని తెచ్చి, దీనికర్థము చెప్పమన్నావనుకో, నేను ఒక అర్థము చెప్పాను, దానికి నానార్థాలు ఉంటాయి. అది కాదు ఈ విధముగా చెప్పాలని నువ్వు అంటావు. అందుకే మేము భాషాపండితులము కాదు, భావ పరిజ్ఞానము కల్గిన పండితులము. మేము భావాన్ని గురించి చెప్తాముగానీ భాష గురించి చెప్పము అని అంటాము.

ష్యూరిటీ ఏమంటే చెప్తాము. నువ్వు శ్వాస పీల్చుతున్నావు. ఆ శ్వాస ఎవరు ఆడిస్తున్నారు? నువ్వు ఊరక ఉండు అది ఆడుతుందో! లేదో తెలుస్తుంది. నువ్వు నిద్రలో ఉండే నువ్వు ఎక్కడ శ్వాస తీసుకుంటావు, ఎవరో ఆడిస్తున్నట్లే కదా! నీవు లోపలికి ఆహారముగా వేసినది ఎవరు జీర్ణము చేస్తున్నారు? శరీరములో ప్రతీ మార్పు ఏ విధముగా జరుగుతుంది? ఇవన్నీ ష్యూరిటీలు కావా? లెక్కవేసుకుంటే, మనిషికి బుద్ధియుంటే, జ్ఞానము ఉంటే ఇవన్నీ ష్యూరిటీలు కావా? దేవుడున్నాడని ష్యూరిటీలే ఇవన్నీ! "దేవుడెవరు?" అనే ప్రశ్నకు వస్తే, "దేవుడు లేడు" అనే దానికి వస్తే, నీ శరీరములో ఉంది జ్ఞానము. బయట వెతుక్కుంటాను అని అనటము అజ్ఞానము అని చెప్పాము.

ఈ విషయములన్నీ వాస్తవమే అయినప్పటికీ, అసూయతో లెక్కించక, విమర్శిస్తే, నీ శరీరములో నీవు చేసే ప్రతీ పని నమోదు చేసేవాడు ఒకడు

www.thraithashakam.org

ఉన్నాడు. దానిని తప్పక నీవు అనుభవించాల్సిన పని వస్తుంది. ఒక కుంటివాడివై, అడుక్కుతింటూ ఉంటే, నేనేమి పాపము చేశానా అని అనుకున్న రోజు ఉంటుంది. "దైవజ్ఞానము తెలిసినవారు ఆది, సోమ, మంగళవారములు మాంసము తినవద్దని" చెప్పాము. కానీ పురాణాలు చెప్పాయి, వారు తిన్నారు, వీరు తిన్నారంటే తెలిసి నువ్వు ఆ పనిని చేస్తున్నావు, కనుక ఆయన తప్పక నమోదు చేసుకుంటాడు. లెక్కాచారము అమలుకు వచ్చినరోజు తెలుస్తుంది. అది మరచిపోయి, జ్ఞానము తెలిసి కూడా, జ్ఞానాన్ని వెక్కిరించే పరిస్థితిలో ఉన్నారు. వారికి శిక్ష తప్పదు. మనము ఆ పరిస్థితి తెచ్చుకోవద్దు. ద్రావిడ జ్ఞానము చాలా గొప్పది, దానిని ఎదిరించి మాట్లాడితే శిక్ష తప్పదు.

## 23. మేఘం ఒక భూతం - రోగం ఒక భూతం

తేది : 04.10.2009

మనము చెప్పుకునే విషయాలు ఎక్కడా ఇంతకముందు చెప్పబడ లేదు. ఎక్కడా చెప్పని విషయాలే మేము చెప్పుచున్నాము. ప్రతీదీ క్రొత్త విషయమే చెప్పుకుంటూ వచ్చాము. అదే మా ధ్యేయము మరియు ప్రయత్నము. మనము చెప్పే విధానము ఎవ్వరూ చెప్పరు, ఎందుకంటే "యధార్థం లోకవిరుద్ధం" అనే దానిని అనుసరించి సత్యము చెప్పటమే మా కర్తవ్యం కానీ, చాలామంది ఎదుట వినేవారికి ఇష్టం ఏదైతే ఉందో దానినే చెప్పుచున్నారు గానీ సత్యం చెప్పటం లేదు. ఎవరి ఇష్టం అయిష్టం అనే దానికి సంబంధము లేకుండా, ఉన్న సత్యమును చెప్పుకుంటూ పోవాలి. ఈ విధంగా చెప్తూ ఉంటే, ఎవ్వరికీ తెలియని విషయాలు మీరెట్లు చెప్పు చున్నారని? మమ్మల్ని ప్రశ్నిస్తున్నారు. మాకు ఏ విధంగా తెలుసు అని

www.thraithashakam.org

ప్రశ్నవేసేకంటే, మేము చెప్పినది సత్యమా, కాదా అని పరిశీలించుకోవచ్చు కదా!

మనము ఒక ఇంటివద్దకు పోయి బిక్షాందేహి అని అడిగాము అనుకోండి. వాడు ఎవ్వరూ చేయని పదర్థాములు చాలా రుచికరముగా చేసి పెడితే, నీవు ఏ విధముగా చేశావు అని అడుగుతామా, ముందు ఆకలికి వాటంటినీ తింటామా? మనము అడుక్కునేందుకు పోయినప్పుడు తినాలి, రుచికరంగా వండితే ఇంకా బాగా తినవలెను కానీ నువ్వు ఏ విధముగా నేర్చుకున్నావు? ఏమేమి వేసి వండావు? అని అడిగితే, పెట్టేది కూడా వాడు పెట్టడు. మీరు ఏ విధంగా చెప్పగలుగుచున్నారు? అనే విషయాన్ని వదలివేసి, ఇది సత్యమా, కాదా! అనే విషయాన్ని మీరు తెలుసుకోండి, అది ముఖ్యం. అలాగే ఇప్పుడు కొందరు నాస్తిక వాదులు, హేతువాదులు ఈ దేశంలో ఉన్నారు. హేతువాదం అని పేరున్నా గానీ వాస్తవముగా హేతువాదమనేది ఎక్కడా లేదు. కానీ వారిది నాస్తికవాదమనే చెప్పవచ్చును. హేతువాదము అనే ముసుగులో నాస్తికవాదులు ఉన్నారు. హేతువాదలు అనేవారు కూడా ఉన్నారుగానీ వారిలో హేతువాదం ఉందా? అంటే నిజమైన హేతువాదం మాత్రము వారివద్ద లేదు. ఎందుకంటే నిజంగా హేతువాదైతే ప్రశ్నవేసి, దానికి ఆమూలాగ్రం దాని గురించి తెలుసుకొని, సత్యముంటే ఒప్పుకుంటాడు, అసత్యముంటే ఒప్పుకోడు, అదీ సత్యమైన హేతువాదం. కానీ సత్యం చెప్పినా ఒప్పుకోరు, అసత్యము చెప్పినా ఒప్పుకోరు వాడు నాస్తికవాది. ఈ విధంగా చాలామంది తను నెగ్గేందుకు, తన మాట నెగ్గేందుకుగాను, ఎదుటివాడు ఎంత గొప్ప విషయము చెప్పినా, కాదు కాదు అని వాదించేవాడు నాస్తికవాది. వాడెప్పుడూ సత్యమును తెలుసుకోలేడు. ఈ నాస్తికవాదమనేది దేశములో ఉంది.

www.thraithashakam.org

ఇప్పుడు మేము చెప్పే విషయం శాస్త్రబద్ధమా కాదా అనే విషయాన్ని నాస్తికవాదులు కూడా ప్రశ్నిస్తూ ఉంటారు. శాస్త్రబద్దత అవునా, కాదా అనే దానికి నేటి పద్ధతులలో నిరూపణ అయితేనే శాస్త్రబద్ధత, లేకపోతే లేదు కాదు అంటున్నారు. ఇప్పుడు చిన్న ఉదాహరణ మీకు చెప్తాము. టీవీ ముందరున్న రిమోట్ తీసుకుని, టీవీకి పది అడుగులు దూరంలో ఉండి రిమోట్ ద్వారా టీవీని ఆన్ చేస్తే, ఆ టీవీలో బొమ్మ మారుతుంది. మరి ఇక్కడనుండి అక్కడికి కనెక్షన్ ఎట్లా వచ్చిందంటే కనిపించలేదు కదా ఎట్లా అవుతుంది? అలాగే అలాంటి కనిపించని కిరణం గురించి మరొక దానిని చెప్తే మేము నమ్మమంటారు. అంటే వారికి తెలియకపోతే అసలుకు కానే కాదు అని అంటుంటారు శాస్త్రజ్ఞులు. అటువంటివారు ఎప్పటికీ సత్యమును తెలుసుకోలేరు. ఇంతకుముందు చంద్రమండలములో నీళ్ళు లేవన్నారు. చంద్రమండలం ఒట్టి భూమే అది. అందులో నీరు లేదు అన్నారు. వారే ఇప్పుడేమి అంటున్నారు, నీరు కొద్దిగున్నది అంటున్నారు. వారం, పదిరోజుల క్రిందట న్యూస్‌పేపర్‌లో, టీవీలలో వచ్చింది. ఏదో శాటిలైట్‌లాంటిది ఒకటి పంపించాము ఆ శాటిలైట్ కనిపెట్టింది. దానిద్వారా అక్కడ నీరుంది అని. ఆ విధంగా ఉండటం వలన మనుషులు ఉండేందుకు అవకాశము ఉంది అని అంటున్నారు శాస్త్రజ్ఞులు. వీరికి ఈ విధంగా నిరూపణకు వచ్చివుంటే, 1977వ సంవత్సరములో నీటికి చంద్రుడు అధిపతి. విశ్వంలో నీరెక్కడుంటే అక్కడ చంద్రుడు అధిపతి. చంద్రుడే నీటికి అధిపతియైతే చంద్రమండలంలో నీరులేకపోవటమేమిటి? నీళ్ళు ఉన్నాయి. లేవు అనే మాట అసత్యం అని మేము ఆ రోజే చెప్పాము. 1977లో మేము చెప్తే, ఆ రోజు అది అశాస్త్రీయం, వీరు కనుక్కున్న రోజు శాస్త్రీయం. అంటే వీరు కనుక్కున్నవే శాస్త్రీయం. వీరు కనుక్కోలేనివన్నీ

అశాస్త్రీయం, చూడండి ఏ విధంగా ఉందో! అంటే మీరో శాటిలైట్ పెట్టి, కొన్ని కోట్లు ఖర్చుపెట్టి, పరిశోధన చేస్తేనేగానీ అది సత్యం కాలేదు. అంతకుముందు చెప్తే అది సత్యంకాదా? ఆ విధంగా పూర్వం మన పెద్దలు మనకు తెలియని అనేక రహస్యాలు చెప్పారు. అటువంటి రహస్యాలన్నీ అశాస్త్రీయం, మేము ఒప్పుకోము అని అంటున్నారు. చివరికి వాటినే ఒప్పుకోవలసి వస్తున్నది. ఇవన్నీ కళ్ళబొళ్ళి మాటలు. చంద్రమండలమంతా చవుడు భూమి అందులో నీరేలేదు అని చెప్పిన వారంతా ఈ రోజు "నెలరాజు జలరాజే" అని పేపర్లో వచ్చింది. మరి ఈ విషయం మేము 1977లోనే చెప్పినాము. తెలిసినా తెలియకపోయినా శాస్త్రము శాస్త్రమే అవుతుందిగానీ ఎప్పటికీ అశాస్త్రీయం కాదు. మరి మేము నిరూపణకు వచ్చినట్లు మేము చూపిస్తాము కదా! అంటే కొన్ని నిరూపణగా చూపగలము, కొన్నింటిని నిరూపించలేము. చెప్పగలిగినా నీవు చూడలేనివి ఉంటాయి. మోక్షం ఉందని నాకు తెలుసు. నీకు తెలియదు. నువ్వు చూచినప్పుడు నీకు తెలుస్తుంది. చూడనంతవరకు నువ్వు లేదనుకుంటావు. చూచినవారు చెప్పిన దానిని విశ్వసించి, నీవు ప్రయత్నం చేసి, నీవు దానిని చూడటం ముఖ్యముగానీ, నీకు తెలియనంత మాత్రాన లేదనుకోవటం పొరపాటు. అటువంటివారు జ్ఞానులు కాలేరు. ముందుకు పోయి ఏమీ తెలుసుకోలేరు.

ఆ విధముగా మేఘము అనే దానిని మనము చూస్తూ ఉన్నాము. మేఘం చూస్తుంటే పెద్దదిగా కనిపిస్తుంది. ఉండగా ఉండగా చిన్నదైపోయి మాయమై పోతుంది. ఒకచోట పెద్ద మేఘముంటుంది. ఇంకొకచోట చిన్న మేఘము ఉంటుంది. ఒక మేఘము వేగంగా వెళ్తూ ఉంటుంది. ఇంకొక మేఘము చాలా మెల్లగా వెళ్తూ ఉంటుంది. అదే విధంగా వాటి రూపురేఖలు మారిపోతూ ఉంటాయి. పదినిమిషాలు గమనించండి

మేఘాలను, మీకు తెలుస్తుంది. చిన్నగా ఉండే మేఘం పెద్దదైపోతుంది. పెద్దగా ఉన్నది చిన్నదైపోతుంది. అయితే మేఘమంటే ఏమి, అదొక పొగ, నీటి ఆవిరి, అని మన సైన్స్ ప్రకారము చెప్పినాగానీ, కనిపించేది చెప్పినా సరే, కనిపించనిది చాలా ఉన్నది. మరి నీటి ఆవిరే అయితే, అంత ఉన్నది ఇంత ఎట్లా అయింది? ఇంత ఉన్నది అంత ఎట్లా అయింది? ప్రతీ నిమిషానికి మేఘము తన ఆకారాన్ని మార్చుకుంటుంది. అవి బహిరంగంగా కనిపించే విషయాలే. మీరెవరూ దానిని గమనించలేదు. మేఘము ఒక భూతము. మేఘం ఒక జీవుడు అనగా భూమిమీద ఎన్నో జీవరాశు లున్నట్లే పైన ఆకాశములో కూడా ఎన్నో జీవరాశులు కలవు. మేఘాలు ఎన్నో రకములు కలవు. ఈ మేఘము ఒక జీవం అని ఏ విధంగా చెప్పుచున్నారు? మనలాగే బంగారు పని ఒకడు చేస్తాడు, వ్యవసాయం ఇంకొకడు చేస్తాడు. అలాగే మేఘాలు కూడా అనేక రకముల పనులు చేస్తున్నాయి. ఏ పనులంటే! మేఘములన్నీ వర్షిస్తున్నాయా? కొన్ని మేఘాలే వర్షిస్తున్నాయి. కొన్ని మేఘాలు వేరే పనులు చేస్తున్నాయి. ఏ మేఘం ఏ పనులు చేస్తున్నాయో తెలియదు. తుఫాన్ వచ్చినప్పుడు ఈ మేఘాలేమైనా కనిపిస్తున్నాయా మీకు? ఒకానొకసారి మేఘాలు కనిపిస్తూ వర్షిస్తాయి. ఒక్కొక్కసారి చాలా పెద్దది, ఒకటే మేఘము కనిపిస్తుంటుంది మరి చిన్న మేఘాలన్నీ ఏమయినట్టు తెలియదు. ఎండాకాలంలో తెల్లటి మేఘాలు కనిపిస్తాయి, ఎందుకో తెలియదు. కొన్ని మేఘాలు చీల్చుకున్నట్లు కనిపిస్తాయి ఎందుకో తెలియదు. చారలు చారలుగా మేఘాలు ఉంటాయి ఎందుకో తెలియదు. మేఘం నీటి ఆవిరి అనుకుంటే, కొండమీదకి వెళ్ళినప్పుడు మనం వాటికి తగలవచ్చు, మరి విమానాలు కూడా వాటిలో దూరి పోతున్నాయి, అంతా పొగలాగ ఉంటుంది. ఏమీ ఉండదు. అంటే

www.thraithashakam.org

వాస్తవమే, మరి నీరెట్లు వచ్చింది? మనము ఈ రోజు చూస్తే పెద్దపెద్ద ప్రవాహాలు వర్షకాలములో ఉంటాయి. మరి ఇన్ని నీళ్ళు ఏ విధముగా వచ్చాయంటే, వర్షం వలన వచ్చాయి. వర్షం ఎట్లు వచ్చింది? అంటే మేఘం వలన వచ్చింది. ఎంత మేఘము కురిసుంటే వచ్చింది? ఈ నీళ్ళన్నీ పైనుంటే ఎంత బరువుంటాయి? ఒక మేఘాన్ని తూకం వేసుకుని ఎవరైనా చూడగలరా? లేదు మేఘం అంత బరువున్నట్టు కనిపించదుగానీ కిందికి వస్తే ఎంతో నీరు కనిపిస్తుంది. ఇతనేంటి ఏదో సైన్స్ తెలియకుండా మాట్లాడుచున్నాడు. అదంతా నీటి ఆవిరి అదంతా హైడ్రోజన్, ఆక్సిజన్ అణువుల కలయిక వలన నీరు అయినాయి అనుకుంటారన్నమాట. హైడ్రోజన్‌లు ఉంటే విమానాలతో నీవు వెళ్ళి మేఘమధనం చేస్తే వర్షం ఎందుకు రాలేదు? ఎందుకా ప్రయోగం విఫలమైంది. సైన్స్ ఏమయింది? మరి వర్షం మాత్రము దానికిష్టమైనప్పుడు వస్తుంది. నాకింతే కావాలంటే కాదు. దానికి బుద్ధి పుట్టినంత కురుస్తుంది. ఎవరిష్టం వలె దానిష్టం. మరి ఇన్ని నీళ్ళు తనలో పెట్టుకున్నప్పుడు ఎంత పొడవుండాలి, ఎంత వెడల్పు ఉండాలి, మరిప్పుడు విశాలంగా పైన ఎందుకు కనపించటం లేదు? చిన్నమేఘము కురిసినాగానీ పెద్ద నీరు వస్తుంది. ఇంతకు పూర్వం పెద్దలు చెప్పుకునేవారు ఏమంటే "చేటడు మేఘమునకు చెరువు అంత నీరు కురుస్తుంది" అని మేము చిన్నప్పుడు విన్నాము. చెరువు నీరు, చేటంత భాగంలో ఎట్లా పడతాయి. ఆ వయస్సులో అనుకునేవాన్ని కానీ పెద్దలు ఏదో అనుభవించే చెప్పారు.

ఇప్పుడు ప్రత్యేకంగా మేము మీకు చెప్పేది ఏమంటే **"మేఘము ఒక భూతము"** ఇంతకు ముందు **"రోగము ఒక భూతము"** అని కూడా చెప్పాము. ఒక రోగము ఊరంతా వ్యాపించి వారందరినీ ఇబ్బంది పెట్టి

www.thraithashakam.org

చంపే సమయంలో జ్ఞానశక్తి ఉన్నటువంటి వ్యక్తి, నువ్వు మరి ముందుకు పోవద్దు అని చెప్పితే ఆ రోగం ఆగిపోయింది. రోగమంతా క్రిములు రూపంలో ఉంది. ఆ క్రిములు వ్యాపించుకుపోతాయి అని చెప్పినా సరే, ఇక్కడ వరకే ఉండు అని గీత గీస్తే అక్కడే ఉండిపోయేది. అంటే వారు చెప్పిన మాటను అవి విన్నాయి. అంటే ఏమర్థం అవీ జీవుడే అని అర్థము. మన శరీరములో కొన్ని లక్షల, కోట్ల ధాతుకణములున్నట్లు, ఒక రోగము కొన్ని కోట్ల క్రిములమయం. అదే విధముగా మేఘము కూడా ఒక శక్తే.

కొందరు సముద్రములో నీరు ఆవిరైపోయి, మేఘాలు ఏర్పడి వర్షం పడును అని చెప్పుచున్నారు. ఆ విధంగానే ఒక లెక్కలో అనుకున్నా సరే! ఈ నీళ్ళు పైకి తీసుకుని పోయి ఆ విధంగా నీళ్ళను విడిచి పెట్టేవే మేఘాలు. అయితే కనిపించే నీటిని కనిపించని విధంగా ఎలా తీసుకున్నాయి? కనిపించకుండా ఆ నీటిని వాటిలో ఎట్లా పెట్టుకున్నాయి? మీరంతా ఏమంటు న్నారంటే ఆవిరి అంటున్నారు, అలాగైతే ఎన్ని నీళ్ళు చల్లబడాలి? ఎంత నీరు ఆవిరి అవ్వాలి? మనము అంచనా వేసుకుంటే ఎంతో చల్లదనం కావాలి, ఎన్నో నీళ్ళు పైనుండి రావాలి. ఎంతో నీటి ఆవిరి క్రిందకు రావాలి. ఏమైనా ఉందా కొలత వేసుకునేందుకు. పెద్ద మేఘం, చిన్న వర్షమును ఇస్తుంది, చిన్న మేఘము వలన పెద్ద వర్షం వస్తుంది. ఈ వర్షం కుండపోతగా వస్తుంది. కొన్నిసార్లు కొద్దిగా రాల్చుతుంది, తన ఇష్టం అంటే ఆ మేఘం ఇంకొకరి ఆధీనములో ఉండి పని చేస్తుంది. ఇంకొకరి ఆధీనములో ఉండి మన శరీరము పని చేసినట్లు నువ్వు నీ శరీరంలో ఉన్నావుగానీ, నీ శరీరము నువ్వు కలిపి ఇంకొకరి ఆధీనములో ఉన్నారు. నా ఆధీనములో శరీరము ఉంది అని నీవు అనుకుంటున్నావు. ఆ విధంగానే మేఘము కూడా ఒకరి ఆధీనములో పనిచేస్తూ ఉంది. నిన్ను నడిపించేది, మేఘాన్ని నడిపించేది ఒకే శక్తి.

www.thraithashakam.org

ఈ మధ్య ఒక సంఘటన జరిగింది. మేఘము ఒక భూతం అనే దానికి నిరూపణకు వచ్చే విధంగా ఒక చెరువులో నీటినంతటినీ మేఘము ఎత్తుకు పోయింది. ఈ విషయాన్ని టీవీలో కూడా చూపించినారట, పేపర్‌లో ఫోటో వేశారు. ఈ విధంగా మేఘమే ఎక్కడైనా నీటిని తీసుకెళ్తుంది అని ముందే మేము చెప్పాము. కంటికి కనిపించీ తీసుకోగలదు. కంటికి కనిపించకుండా కూడా తీసుకువెళ్ళగలదు. కనిపించి తీసుకుంటే విచిత్రంగా ఉంటుంది మనకు. కనిపించకుండా తీసుకువెళితే విచిత్రంగా ఉండదు. ఇక విచిత్రమేమంటే ఒక చెరువులో వెయ్యి చేపలు ఉన్నాయను కోండి, వంద కప్పలున్నాయనుకోండి. మేఘము 900 చేపలను తీసుకు వెళ్తుంది, 90 కప్పలను తీసుకువెళ్తుంది మేఘం ఒక నీటినే కాకుండా, చేపలు, కప్పలు కనిపించే వాటిని కూడా తీసుకువెళ్తుంది. ఇవన్నీ ఆవిరై పోతున్నాయి అంటే ఎలాగ? ఈ విషయం దృశ్యరూపంలో జరుగగలదు లేదా అదృశ్య రూపంలోనైనా జరుగగలదు. అప్పుడు ఆ చేపలు, కప్పలులాంటివి అదృశ్య రూపంలోకి మారును. ఒక మేఘం సముద్రంలో గానీ, చెరువులోగానీ నీటిని తీసుకు వెళ్తే ఈ చేపలు, కప్పలు ఈ మేఘంలో ఒక్కటైనా కనిపించకపోయినా అవి వర్షం సమయంలో మాత్రము క్రింద పడుతున్నాయి. ఇవన్నీ లేనిచోటికి రవాణా చేయబడుతాయి. ఏ విధముగా అయితే పులులు లేని అడవుల్లోకి ఎక్కువగా పులులున్న ప్రాంతమునుండి పులులను తీసుకువెళ్ళి పులులు లేనిచోట విడిచిపెట్టినట్లు, ఆ విధముగానే వర్షం కొన్ని వస్తువులను, జీవులను ఒక ప్రాంతం నుండి ఇంకొక ప్రాంతమునకు సప్లై చేస్తుంది, ఇది క్రొత్త విషయం.

భూమిని ఒక చోట త్రవ్వి అంటే నూరు అడుగులు ఉండేటటువంటి లోతున ఉన్న మట్టిని పైకి తెచ్చి, ఒక ఎకరాలో ఆ మట్టిని ఒక గజం

www.thraithashakam.org

మందం వేసేయండి. అంత లోపలనుండి తీసిన మట్టి కావున అప్పుడు గడ్డి మొలవటానికి గడ్డి విత్తనాలులాంటివి ఏమీ ఉండవు. ఇంకా ఎకరం పొలం చుట్టూ కాంపౌండ్ గోడ కట్టేయండి. గాలిద్వారా ఏ విత్తనాలు ఆ మట్టిలో పడకుండా ఉండేందుకు, వర్షాకాలంలో వర్షం వచ్చినప్పుడు, పై నుండే కదా వర్ష బిందువులు వస్తాయి. ఆ వర్షం నుండి వచ్చిన గడ్డి గింజల వలన ఆ మట్టిలో గడ్డి మొక్కలు వస్తాయి. **గడ్డి గింజలు లేనిచోట కూడా గడ్డి గింజలు వస్తాయి.** వర్షం స్వచ్ఛమైన నీరు అంటారు. చేపలు, కప్పలు, గడ్డిగింజలు పడుతుంటే ఇంకేమి స్వచ్ఛం! ఇదంతా జ్ఞానమా! ఇది సోదిలాగ చెప్పుచున్నారు అని ప్రశ్న రావచ్చును. జ్ఞానమునకు ఆధారమైనటువంటిదే ఇది. అంటే కంటికి కనిపించనటువంటి శక్తి, మేఘమును నడిపిస్తున్నది. నిన్ను నడిపిస్తున్నది. ఈ రోజు మనిషి కర్మలను అనుభవిస్తున్నాడు. మరి ఇన్ని కర్మలు ఫలించాలంటే రకరకాలుగా అవి కర్మలను అనుభవింపజేయాలి. ఒకతేలు కుడితే బాధపడతాము. అంటే ఒక జీవరాశి వలన నీవు బాధపడుతున్నావు. అలాగే మేఘము అనే జీవరాశి నుండి నీవు బాధపడాలంటే వర్షరూపంలో బాధపడాలి. మేఘము అనేది ఒక జీవరాశి అని తెలిస్తే, కంటికి కనిపించకుండా ఎన్నో జీవరాశులున్నాయి అని అర్థమవుతుంది. ఆ జీవరాశులు ఆ విధముగా ఉండాల్సిన పని ఎందుకు వచ్చింది? నిన్ను రక్షించేందుకో, శిక్షించేందుకో అవి అవసరము. దేవుడే ఆ విధముగా సంబంధాన్ని కల్గించి పెట్టాడు.

ఈ రోజు చంద్రమండలంలో ఏ జీవరాశీ లేదు. అక్కడ మేఘాలు కూడా లేవు. ఇంతకుముందు నీరే లేదన్నారు. చంద్రుడు నీటికి అధిపతి, జ్యోతిష్యశాస్త్రము ప్రకారము, అక్కడ నీరు లేకపోవటం ఏమిటి? నువ్వు అక్కడకు వెళ్ళు కనిపిస్తుంది సమృద్ధిగా నీరుంది. మనిషికి అక్కడికి పోతే,

నీరు సమృద్ధిగా ఉంటుంది. అప్పుడు మేఘాలు కూడా వస్తాయి. భూమిమీద ఉండే జీవరాశులు పైన నివాసం చేయగలితే ఆ రోజు మేఘాలు వస్తాయి. మేఘాలు ఎందుకు వెళ్తాయి. నీ కర్మలన్నింటినీ జరిపించేందుకు. ఒకరు ఒక దగ్గరకు వెళ్తే వాడి వెనుక వెళ్ళాల్సినవి చాలా ఉంటాయి.

ఆ విధముగా మన వెనుక ఎన్నో శక్తులు పని చేస్తున్నాయి. ఎంతో పెద్ద గ్రహాలు పని చేస్తున్నాయి. ఆ గ్రహాలవలనే మనము చాలా బాధపడ వలసి వస్తున్నది. ఈ మధ్య వర్షం భూమి ఉన్న చోటంతా పడింది. అందరినీ ఇబ్బంది పెట్టింది. మరి అంత నీరు పడేటట్టు చేసిందెవరు? మమ్మల్ని "వీళ్ళంతా ఏదో చెప్తున్నారులే" అని హేతువాదుల ముసుగులో నాస్తికవాదులు చెప్పుకున్నాగానీ, ఇది ఎవరికీ తెలియని సూక్ష్మ విషయము. వీటికి ఎంతో చరిత్ర ఉంది. వాటి విషయాలు ఇప్పుడు మేము చెప్పుచున్నాము. ఇదంతా సైన్సే, అంటే తెలియని సైన్స్, బహిరంగంగా తెలియాలాంటే తెలియదు. ఒకరోజు టీవీలో వర్షం పడినప్పుడు చూపిస్తున్నాడు. ఒకతను చేతిలో మగ్గు ఉంటే ఆ మగ్గులో ఒక బ్రతికున్న చేప పడింది. పై నుండి అంత పెద్దచేప, అదియూ బ్రతికున్నది ఎట్లా పడింది. బజారంతా చేపలు పడ్డాయి. చేపల వర్షం కురిసినట్లు కురిసింది. పైకి ఎన్ని చేపలు మేఘాలు ఎత్తుకు పోయాయో, క్రిందకు వచ్చినప్పటికీ బ్రతికే ఉన్నాయి. బ్రతికి అన్నాళ్ళు ఎక్కడ ఉన్నాయి, తెలియదు. మనకు తెలియని రహస్యాలు ఎన్నో ఉన్నాయి అంటే మేఘము ఏదైతే తీసుకు వెళ్తుందో వాటిని మళ్ళీ తిరిగి క్రిందికి వదులుతుంది. అంటే ఒకచోట నుండి తీసుకుపోయి, ఇంకొక చోట వేస్తూ ఉన్నది. ఎక్కడా లేని విత్తనం ఇక్కడికి వచ్చి మొలిచిందీ అంటే ఎట్లా మొలిచిందది? ఈ విధముగా మనకి తెలియని రహస్యములు చాలా ఉన్నాయి. ఇంతకు ముందు రోగము

www.thraithashakam.org

ఒక భూతము అన్నాము. భూతము అంటే దయ్యం అని కాదు. ఒక జీవరాశి అని చెప్పాము. ఆ జీవరాశుల్లో పెద్దవారున్నారు, చిన్నవారున్నారు, మనకంటే చాలా పెద్ద జీవరాశులున్నాయి.

కలరా అనే రోగాన్ని తీసుకుందాము. అది చాలామందిని చంపుకుంటూ పోయేది. వచ్చిందంటే 2,3 రోజుల్లో చంపేయగలదు. అవి క్రిములు, అవి అంటురోగము ఒకరినుండి మరొకరికి వస్తుంది అంటున్నారు. మేమూ అదే చెప్తున్నాము. క్రిముల రూపములో ఆ భూతము ఉంది. మందులు వేస్తే కంట్రోల్ అవుతున్నది కదా అంటే అదీ నిజమే. మందు లేకపోయినా పోతుంది కదా! ఈ ప్రాంతమునకు నువ్వు రావద్దు, ఆ ప్రాంతములోనే నువ్వు ఉండు అని చెప్తే మరి ఆ విధంగా ఎందుకున్న దది? పూర్వం కలరా ఊరూరు వ్యాపించుకుంటూ పోయేదట. ఒక జ్ఞాని ఈ ప్రాంతమునకు రావద్దు అని చెప్తే, ఆ ఊరిలోనికి అది రాలేదంట. మరిప్పుడు ఏ మందు వేస్తే అది రాకుండా పోయింది? నోటిమాటతో రాలేదు. ఒక ఊర్లో పశువులకు కాలికుంటువ్యాధి వచ్చిందట కాలిగిట్టలకు వచ్చే వ్యాధి అన్నమాట అది. అన్ని పశువులకు వ్యాపిస్తూవుంది. ఒక ఇంటివారు ఒక వ్యక్తివద్ద రక్షించండి అన్నాడట. ఆ వ్యక్తి అప్పుడు కొద్దిగా నీటిని గ్లాసుతో తెస్తే దానివైపు ఒక్కసారి చూచినాడంట. ఆ నీటిని అన్ని పశువుల చేత వేరే నీటిలో కలిపి త్రాగించమన్నాడట. అలా త్రాగిన పశు వులు మిగతా పశువులతో మేతకు వెళ్ళినా, ఆ ఊరంతా అన్ని పశువులు ఆ వ్యాధితో బాధపడ్డాయిగానీ, ఈ ఇంటి 20 పశువులకు ఆ వ్యాధి రాలేదట. మరి ఆ వ్యాధికి ఏమైనా టీకాలాంటివి వేశారా? కానీ చెప్పిన ప్రకారము ఆ రోగము రాకుండా నిలబడింది, అంటే అది ఒక జీవరాశి. రోగము అనేది జీవరాశి అనేదానికి ఆధారమిది. సైన్స్ ప్రకారము జీవరాశేగానీ

www.thraithashakam.org

నీవు ఇంకోరకంగా అనుకుంటున్నావు. ఆ రోగకారక క్రిములన్నింటినీ కలిపి మేము ఒక జీవరాశి అంటున్నాము. ఇప్పుడు మన శరీరము ఉంది, కోట్ల దాతు కణములు కలిసివుంటే ఒక శరీరము అవుతుంది. ఆ విధంగా కంటికి కనిపించనిది ఏదైతే ఉందో, అలాగే మేఘము కూడా కంటికి కనిపించని విధానములో ఒక భాగమై ఉన్నది. అలాగే తన చేతనైనంత నీటిని, చేపల్ని తీసుకుపోతూ ఉన్నది.

ఈ విధముగా మేఘము ఎక్కడైనా ఎవరైనా దైవానికి విరుద్ధముగా ఉండి, దైవదూషణ చేస్తున్నారో, అక్కడ వారిని ఇబ్బంది పెట్టడానికి ప్రయత్నిస్తుంది. పంటలు పండటం లేదు అని అందరూ అంటూవుంటే వర్షమును కురిపించింది ఎవరు? నేనే నా ఇష్టం వచ్చినట్లు కురిపిస్తాను అని భగవద్గీతలో చెప్పలేదా? ఎవరి ఆజ్ఞతో, దేవుని ఆజ్ఞ ద్వారా దేవుని సైన్యం ద్వారా జరుగుతుంది. వరదలొస్తే షావుకార్లు, బీదవాళ్ళు అందరూ ఒకటవుతారు. ఆహార పొట్లాల కొరకు అందరూ ఎదురు చూస్తారు. ఎందుకు అలా జరిగింది? దేవుడు నీవు చేసిన పాపానికి కట్టెపట్టుకొస్తాడా శిక్షించేందుకు? రకరకాల రూపాల్లో పంపిస్తాడు కర్మను అనుభవింప జేసేందుకు. ఈ విధంగా పాపము నానా రకాలుగా హింసిస్తూ ఉంటుంది.

ఇవన్నీ ఇప్పుడెందుకు తెలుసుకుంటున్నామంటే పాపము చాలా భయంకరమైనది. అనేక రూపాలలో నిన్ను హింసిస్తుంది. దేవుడు చాలా శక్తిమంతుడు. ఆయన ఆజ్ఞలో ఎన్నో శక్తులు పనిచేస్తున్నాయి. ఏ శక్తి తక్కువగా విజృంభించినా సరే నీవు తట్టుకోలేవు. నీవు బలవంతుడివి అనుకుంటున్నావేమో చాలా బలహీనుడవు. లోపల ఏ రోగం మెదిలినా తట్టుకోలేవు. బయట ఏ మేఘము కదిలినా తట్టుకోలేవు. నీవు దేవుడు అనే దానిని మరచి బ్రతుకుచున్నావు. ఇంతకుముందే దేవునికి విరుద్ధముగా

www.thraithashakam.org

ఏది జరిగినా వాటి ఫలితము ఉంటుంది, అది మీకు తెలియదు అని చెప్పాము. ఈ మధ్య దేవతల దగ్గరకు యాత్రలకు పోయేవారే చాలామంది చనిపోయారు. పెళ్ళిళ్లకు పోయేవారు చాలామంది చనిపోయారు. మంత్రాలయంలో ఒకతను చనిపోయారు. సరైన దేవుడ్ని వదిలివేసి, దేవతల వద్దకు పోవుచున్నారు. కానీ ఎవ్వరికి కోపము వచ్చింది అంటే ఎవ్వరికో! వరదలలో చిక్కుకుని ఎంతోమంది చనిపోయారు. దేనివలన జరిగాయి? దేవుని ధ్యాస తగ్గింది కావున జరిగింది. దేవుడు అని జ్ఞాపకము ఉండే వారికి జరుగదా అంటే జరుగుతుంది కానీ వారికా బాధ ఉండదు. చేసేవన్నీ ప్రత్యేకంగా చేస్తాయి. ఒక రోగము ఒక జ్ఞానికి మర్యాద ఇస్తూ ఉన్నది. అన్ని జ్ఞానాలను ఒకే జ్ఞానం అనుకుంటే పొరపాటు. "ధర్మార్థ కామ మోక్షాలు" అని అన్నారు. మేము ఆ వరుస తప్పు అంటున్నాము. ధర్మార్థ అన్నారు ధర్మం వలన ధనము వస్తుందా, కామం వలన మోక్షము వస్తున్నదా? పెద్దలు ఏమి చెప్పినారంటే **"కామార్థ ధర్మమోక్షము"** లు అన్నారు. **"ఆశతో ధనము, ధర్మముతో మోక్షము వస్తాయి"** అని చెప్పారు అని మనము చెప్తే, నువ్వు చెప్పేదంతా తప్పు. ఇదే కరక్ట్ అంటారు. ధర్మముతో కూడుకున్న ధనం, ధనముతో కూడుకొన్న కామం ఇవన్నీ మంచివట. ధర్మము లేకుండా మోక్షము ఉన్నా లాభంలేదు. ధర్మము అంటే ఏమిటంటే దేవునికి సంబంధించినది. డబ్బుకు ఉంటుందా ధర్మము? అసలైన జ్ఞానము తెలుసుకోకుండా, తప్పుడు జ్ఞానము తెలుసుకుంటే ఇప్పుడు వరదల్లో ముంచినట్లే ముంచుతారు.

ఒక దేవాలయంలో ఒక దేవతను అందరూ మ్రొక్కుచున్నారట స్వామి ఎట్లాగైనా కాపాడుస్వామి నీటిలో ఉన్నాము. అని, అర్థగంటలో ఆ స్వామిని, వీళ్ళని కలిపి కొట్టుకెళ్ళిందంట నీరు. ఒక గుడివద్ద నీటిలో

ఉన్న విగ్రహాలు మునిగిపోతాయని ఆ విగ్రహాల్ని, హుండీని తీసి మీద పెట్టినారంట. ఇప్పుడు ఎవరు ఎవర్ని కాపాడినట్లు మనుషులే ఆ దేవతను కాపాడినట్లు. ఈ విధంగా మనిషి నేనేమి చేస్తున్నాను, నేను అనుసరిస్తున్నది నిజమైన జ్ఞానాన్ని కాదా? అని చూసుకోవటం లేదు. అసలైన జ్ఞానము అంటే ఏదో తెలుసుకుని బయటపడు, అంతేగానీ వినిపించేదంతా జ్ఞానమే అనుకుంటే పొరపాటు. జ్ఞానము అనేది దైవసంబంధముగా ఉంటుంది. ప్రపంచ సంబంధముగా ఉండదు. ప్రపంచ సంబంధమైన కోరికలు దేవుడు తీరుస్తాడు అనేది వాస్తవము కాదు. మనము పుట్టినప్పుడే మనము ఎట్లా జీవించాలి అనేది ముందే నిర్ణయించబడి ఉంది. నా తెలివి మీదే సంపాదిస్తు న్నానని అనుకోవటం పొరపాటు. విన్న జ్ఞానాన్ని ఆచరించినపుడు కర్మలు కాలిపోతాయి. క్రొత్త కర్మలు రాకుండా ఉంటాయి. నువ్వు స్వచ్ఛంగా ఉంటే నీ పాతకర్మలు కూడా నశించవచ్చు. అతని ఇష్టం. అది నీ జ్ఞాన ఆచరణ యొక్క తీవ్రత అనుసరించి ఉంటుంది. అలా కాదు నా తెలివి వలనే నేను సంపాదించుకుంటున్నాను అంటే, నిజమే, వాస్తవమే, కానీ నీ తెలివి లేకుండానే మళ్ళీ పోతాయి కూడా. అందరూ షావుకార్లు కావాలనే ఉంటుంది. ఎవరికైనా బీదవాళ్ళుగా ఉండాలని ఉంటుందా? అది వారివారి కర్మనుబట్టి ఉంటుంది. అవన్నీ మరచిపోయి మనుషులను ఆడించే శక్తి ఒకటి ఉంది. దానిప్రకారము అంతా నడుస్తూ ఉంటుంది. అంతకంటే మనకేమి జరుగదు అని ధైర్యంగా ఉండేవారు ధైర్యంగానే ఉంటారు. అది స్వధర్మము అవుతుంది. ఆ స్వధర్మము తెలియని రోజు ఏమవుతుంది. పొరపాటుగా దైవజ్ఞానాన్ని మరచిపోయి, నేనే అన్నీ చేస్తున్నాను అని నడుచుకోవటం వలన, అసలైన దేవున్ని తెలుసుకోకుండా ఉంటే పొరపాటు అగును. కనుక ఏది నిజమైన జ్ఞానమో కాదో తెలుసుకుని మెలిగితే బాగుంటుందని చెప్తూ ముగిస్తున్నాము.

www.thraithashakam.org

# 24. ప్రభువు - ప్రభుత్వం

తేది : 02-11-2009

మీ అందరికీ "ప్రభువు-ప్రభుత్వం" గురించి తెలుసు. మనకి ఒక రాజ్యాంగము ఉంది, దానిని నడిపించుటకు చట్టం ఉంది. ప్రభుత్వం ఉంది, దానికి ప్రభువు కూడా ఉన్నాడు. ఆ రాజ్యాంగములో ఎంతోమంది పనిచేస్తుంటారని తెలుసు. వారిలో మంత్రులు, రాజ్యప్రతినిధులు, సేనాధి పతులు ఈ విధంగా చాలామంది ఉద్యోగస్తులుగా ఉందురు. ఈ విధముగా పరిపాలించబడే ప్రజలను ఒక భాగంగా, పరిపాలించే వారిని ఒక విభాగంగా మనము చూడవచ్చును. ఈ పరిపాలనా విభాగము చాలా ఉపవిభాగాలుగా (డిపార్ట్‌మెంట్స్)గా మరికొంత విభజించబడినది. ఈ విధముగా ఉప విభాగములుగా ఉన్న వారందరికీ అధిపతి ప్రెసిడెంట్, లేదా ప్రధానమంత్రో అధికారిగా ఉండును. అదే విధంగా కనిపించని ప్రభుత్వం కూడా ఒకటి ఉన్నది. దానికీ చట్టము ఉంది, దానికీ పాలకులున్నారు. పాలకులు పాలించే విభాగాలు కూడా ఉన్నవి, పాలించబడే ప్రజలు కూడా ఉన్నారు. మరి ప్రజలు ఎవరు అంటే, ఇప్పుడున్న ప్రపంచములో ఉన్నవారందరూ అందులో పాలింపబడే వారుగా ఉన్నారు. కనిపించని ఈ ప్రభుత్వములో కనిపించని రాజు ఒకడున్నాడు. అతడు శాశ్వితముగా ఉండేవాడు. కనిపించే రాజు శాశ్వతుడుకాడు, కనిపించే ప్రభుత్వము శాశ్వతమైనది కాదు. ఈ రోజు ప్రపంచములో ఒక ప్రభుత్వం ఉండవచ్చు, తరువాత అవి మారిపోవచ్చును, తద్వారా ప్రభువు మారవచ్చు. ఇప్పుడు మనం చూస్తున్నాము కదా! ఇంతకుముందు ప్రభువులుగా ఉన్నవారు ఎవరైనా మిగిలారా అంటే లేదు. ప్రభువు అని మేము చెప్తే, ప్రభు అని అంటున్నా రంటే ఈయనేదో పరమతం క్రిస్టియానిటీ గురించి చెప్తున్నానని అజ్ఞానంగా అనుకోకండి.

ఇక్కడ **"ప్రభువు"** అంటే, **రాజు** అని, **పెద్ద** అని అర్థము. ప్రపంచములో అన్నిటికంటే పెద్దవాడిని రాజు అంటాము. బ్రహ్మ అని కూడా అంటాము. అందరికంటే పెద్ద, ఈ కనిపించే ప్రభుత్వంలో ప్రెసిడెంట్ అంటాము, కానీ అతను ఇప్పుడు ప్రెసెడెంట్‌గా ఉన్ననూ, శాశ్వతంగా మాత్రము ఉండలేడు. ఇప్పటికే ఎంతోమంది ప్రెసిడెంట్‌లు ఆ పదవిలో మారినారు. కనుక కనిపించే ప్రభుత్వంలో, చట్టాలు మారుతుంటాయి, ప్రభుత్వములు మారతూ ఉంటాయి, కానీ మారని చట్టం, మారని ప్రభుత్వం ఒకటుంది. మారని ప్రభువు ఒకడున్నాడు. అందులో ప్రభువు ఎవరికీ కనిపించడు. అతనొక్కడే శాశ్వతుడు. ఇప్పుడు మనమందరమూ చూస్తున్న భూమి కృత యుగములో ఉన్నది, త్రేతాయుగములో ఉన్నది, ద్వాపర యుగములోనూ ఉన్నది, ఇప్పటి కలియుగములో కూడా ఉన్నది. కానీ యుగయుగము నందు, ఎందరో ప్రభువులు ఇది నా జాగా, నా భూమి, నా రాజ్యం అనుకుని శాశ్వతంగా ఉంటామని భ్రమించినవారు ఎవ్వరునూ శాశ్వతంగా లేరు. కానీ భూమి మాత్రము అలాగే ఉంది. కానీ కృతయుగము నుండి మారనటు వంటి ప్రభువు కనిపించకుండా, శాశ్వతుడిగా ఉన్నాడు. వాడే పెద్ద, బ్రహ్మ, ప్రభువు, రాజు దేవుడు అని అంటాము.

ప్రపంచములో 194 దేశాలున్నాయి, 194 ప్రభువులు, 194 ప్రభుత్వములున్నట్లే కదా! అదే విధముగా ప్రతీ దేశములో ఒకే విధమైన చట్టము కాకుండా రకరకములైన చట్టములు కలవు. మనుషులు తయారు చేసుకున్న చట్టములు వివిధ రకములుగా కలవు. వ్యభిచారము ఒక దేశములో చట్టరీత్యా నేరమైతే, మరొక దేశములో అది చట్టరీత్యా ఆమోదయోగ్యమైనదిగా ఉన్నది. ఇదంతా కనిపించేది. కనిపించని దానిని గురించి చెప్పితే ప్రపంచమునంతటికీ ఒకే రాజు ఉన్నాడు. ఆ రాజునే

www.thraithashakam.org

మనము **దేవుడు** అంటున్నాము, **బ్రహ్మ** అంటాము, **పెద్ద** అంటాము, **ప్రభువు** అంటాము. రకరకములుగా ఆయనను వ్యక్తపరచుకుంటాముగానీ, ఆయన తెలిసేవాడు కాడు, కనిపించేవాడూ కాడు. మరి కనిపించని ఆ ప్రభువు మనందరినీ పరిపాలిస్తున్నాడు. ఇప్పుడు ఒక చట్టమును తీసుకుందాము. ఒక వ్యక్తి తప్పు చేస్తే పోలీసులు వస్తారు, కోర్టుకు తీసుకువెళ్తారు, శిక్ష వేస్తారు. ఇది కనిపించే విభాగము. కనిపించని విభాగము కూడా ఉంది. దాంట్లో విచారణ జరుగదు. బయటకు కనిపించే చట్టములో విచారణ జరిగినపుడు తప్పు చేయనివాడికి శిక్ష పడవచ్చును, తప్పు చేసినవాడికి శిక్ష పడకపోవుటకు అవకాశము కలదు.

కానీ దేవుని చట్టములో, దేవుని న్యాయస్థానములో విచారణ ఉండదు, సాక్షులుండరు. ఈ రోజు ప్రపంచ వరముగా తప్పును ఒక వ్యక్తి చేస్తే, ఏడు ఎనిమిది సంవత్సరముల తర్వాత వాడికి శిక్షను వేయగలరు కానీ, కనిపించని న్యాయస్థానములో మాత్రము ఏ రోజు చేసిన తప్పుకు ఆ రోజే తీర్పు చెప్పబడును. దాని ప్రకారము పాప పుణ్య కర్మలు నిర్ణయించబడును. ఇందులో వాయిదా పద్ధతులుండవు. అయితే కోర్టు విషయానికి వస్తే ఎవరికీ కనిపించని కోర్టు అది. ఎందుకంటే అది దేవుని రాజ్యాంగము. కనుక నీ తప్పుకు తీర్పు, శిక్షగా నమోదు చేయబడుతుంది. అంది ఎప్పటికి అమలు కావలెనని ఉండునో అది తప్పక అమలు జరుగును. మరి ప్రపంచ పరముగా తప్పు చేస్తే, పోలీసులు, సైనికులు ఉంటారు కదా!వారు వచ్చి జైలుకు తీసుకువెళ్లారు. మరి కనిపించని చట్టములో ఏమి జరుగునంటే, రాజు కనిపించడు, కనిపించని రాజు పరిపాలనలో, కనిపించని శాఖలు ఎన్నియో కలవు. ఆ శాఖల్లో పని చేసే వారెవ్వరూ మనకు కనిపించరు. కానీ ఫలానా తప్పుకు శిక్ష అమలు పరచేందు

మాత్రము కొంతమంది అవసరము. బయటకు కనిపించే జైళ్ళలో శిక్షలు అంత తీవ్రంగా ఉండవు. వేళకు భోజనం పెడతారు, అది శిక్షగానే కొన్నిసార్లు అనిపించని పద్ధతి ఉండును. కానీ దేవుడు వేసిన ఆ శిక్షలో, ఎంత అమలు జరగాలో ఏ విధముగా అమలు జరగాలో ఆ విధముగానే హెచ్చు, తగ్గులు లేకుండా అమలు పరుచబడును. కాని అది ఒక గదిలో పెట్టే శిక్షలుండవు. ఓపెన్ జైల్‌వలె, బహిరంగముగాగానే శిక్షలు అమలు చేయబడును. ఆ శిక్ష వేసేందుకు చాలామంది ఉన్నారు. ఉన్నటువంటి వ్యక్తులు, ఒక న్యాయ స్థానములో ఒక శిక్ష చెప్పబడింది అనుకోండి, ప్రపంచపరముగా ఆ శిక్షను అమలు పరచేందుకు నీవలె నున్న వ్యక్తులు ఉందురు. వారు వేసుకునే బట్టలు తేడాగా ఉండును. వారినే పోలీసులని, రక్షకభటులని అందుము. ఈ విధముగా వేసుకునే బట్టలలోనే తేడాగా ఉండును గానీ, అవయవములలో ఎటువంటి తేడా ఉండదు వాడు శిక్షవేస్తాడు, ఎందుకంటే ప్రభుత్వంలో పనిచేసేవాడిని, ప్రభువు దగ్గర ఉద్యోగము చేసేవాడు కనుక, ఆయన చట్టము ప్రకారము నేను నిన్ను శిక్షిస్తున్నాను అని అనుకొనును. కానీ శిక్షించేవాడు నీవలెనే ఉంటాడని మాత్రము గుర్తుంచుకోవలెను.

కానీ విచిత్రమేమంటే, కనిపించని ప్రభువు దగ్గర, కనిపించకుండా ఉన్న పరిపాలకులకు, ఒక చేయి, రెండు చేతులు కాకుండా, పదివేల చేతులు కలిగియుండవచ్చు. అంటే నిన్ను శిక్షించేవానికి రెండు కాళ్ళు, రెండు చేతులు ఉంటాయని ఉండాలని ఏమీ లేదు. నాలుగు కాళ్ళు, నాలుగు చేతులు ఉండేవారు ఉండవచ్చు. కాళ్ళే లేకుండా, అన్నీ చేతులే కలిగి ఉండేవారు ఉండవచ్చు. రకరకములుగా ఉండేవారు ఉన్నారు. ఏ దేశములోనూ ఎవరూ ఈ విధముగా కనిపించరు. కనీసము సినిమా వాళ్ళకు

కూడా అందని ఆకారములవి, ఊహకు అందనివారిని ఊహకు అందని ప్రభుత్వాన్ని అర్థమగుటకు కంటికి కనిపించినట్లు నేను చెప్పుచున్నాను. ఒక చేయి కలిగిన వాడు కొంత బరువును ఎత్తితే, పది చేతులు కల్గినవాడు వాడికంటే ఎక్కువ బరువు ఎత్తును కదా! అదే విధముగా, వంద, వేయి చేతులు కల్గినవాడు ఇంకెంత బరువు ఎత్తునో కదా! ఇక లక్ష చేతులు కల్గినవాడిని గూర్చి చెప్పనవసరము లేదు. పెద్ద భవనాన్నే తీసి ప్రక్కన పెట్టగలడు. ఈ విధానముగానే, ప్రపంచములో పెద్దపెద్ద వస్తువులు కదిలించబడుచున్నవి. పెద్ద భవనములు ప్రక్కకు ఉన్నట్టుండి పడిపోవటం మనము చూడలేదా, దీనిని మనవారందరూ ప్రకృతి వైపరీత్యము అందురు. ఒక కరెంట్ స్థంభాన్ని ఎత్తాలంటే 100 మంది వ్యక్తులు అవసరమవుతారు, కానీ దానిని ఒక్కసారిగా పడద్రోస్తారు. కనిపించకుండా కొందరో ఒక్కరో, నీకు కనిపించలేదు కావున, నీవు దానిని ప్రకృతి వైపరీత్యం అంటున్నావు.

ఒక మనిషి ఇంకొక మనిషిని చంపాలంటే చాలా కష్టమగును, కానీ శిక్షలు అమలు చేయవలెనన్న, కనిపించకుండా ఒక్కడు వందమందిని చంపగలడు. ఎందుకంటే కనిపించని వాడికి వేయి చేతులుంటాయి, దానిని నీవు చూడలేవు కనుక ప్రకృతి వైపరీత్యం అంటున్నావు. పోనీ ప్రకృతి వైపరీత్యం అని పేరు పెట్టినప్పుడు, దాని వెనుక ఏమి జరుగుచున్నదో ఆలోచించాలి కదా! ఏమి జరుగుచున్నదంటే, కంటికి కనిపించని పెద్ద తతంగము జరుగుతూ ఉన్నది. సాముహికంగా శిక్షలు అమలు పరచడం పెద్దపెద్ద గ్రహముల వలన సాధ్యపడుతుంది అని మేము ఇంతకుముందే చెప్పియున్నాము. పెద్దపెద్ద గ్రహములు అంటే, గ్రహించుకునేది గ్రహము అని చెప్పాము. గ్రహించుకునే శక్తి మనిషికి కూడా ఉన్నది, కనుక మనిషి కూడా ఒక గ్రహమే. అంటే మీరెంత గ్రహము అంటే చిన్న గ్రహము,

పెద్దపెద్ద గ్రహములు అంటే, అవి ఎంత పెద్దగా ఉంటాయో చెప్పలేము. నీవు ధరించిన శరీరమునకు రెండు చేతులు గలవు. కానీ వారు ధరించిన శరీరమునకు ఎన్ని కాళ్ళు, ఎన్ని చేతులున్నాయో నీకు తెలుసునా అంటే నీకు తెలియదు. అందుకే మేము ముందే చెప్పాము, పెద్దపెద్ద గ్రహములు ఇక్కడకు జ్ఞానము తెలుసు కొనుటకు వచ్చుచున్నవి, జాగ్రత్తగా ఉండండి. తప్పు భావముతో ఉండకండి. అవి మిమ్మల్ని మీ భావాలను గ్రహించగలవు అని బోర్డులో కూడా మేము వ్రాసిపెట్టాము. ఉదాహరణకు ఒక విషయము చెప్పుకుందాము.

కర్నూల్‌కు వరదొచ్చింది. మొత్తము అంతా ముంచెత్తింది. తరువాత ఆ నీళ్ళు పోవాలి కదా, పోయాయి, కానీ తొమ్మిదడుగులు నీరు వచ్చియుంటే, ఆరడుగుల బురద ఏర్పడింది. ఆరడుగులు నీరు వచ్చి యుంటే, మూడడుగుల బురద ఏర్పడుతున్నది, అంత బురద ఏ విధముగా ఏర్పడు తున్నది. ఎవరైనా ఆలోచించినా అర్థముకాదది. ఊరి వెలుపల ఉన్న చెరువుల్లో నీరు ఎంత ఉన్నాయో అంతే ఉన్నాయి. చేలల్లో ఎంత నీరుండాలో అంతే నీరుంది. వరదపోయిన తరువాత, చేలల్లో, చెరువుల్లో లేని బురద ఊరిలోకి ఏ విధముగా వచ్చింది? అన్ని నీళ్ళు ఏ విధముగా వచ్చాయి? అన్ని నీళ్ళు మేఘాల్లో ఏ విధంగా ఉన్నాయి? అందుకే మేము చెప్పిన ఉపన్యాసములలో **"మేఘము ఒక భూతము"** అని చెప్పాము. మేఘము కూడా ఒక గ్రహమే, ఒక జీవుడే. దానికి ఆకారమంటూ కనిపిస్తుంది. కొన్నిసార్లు ఆ ఆకారము అదృశ్యమవుతూ ఉంటుంది. దానికెంత శక్తి ఉందో తెలియదు, చాలాశక్తి ఉండును అని చెప్పవచ్చు, ఒక చిన్న మేఘము ఎంత బరువునైనా మోయగలదు అని చెప్పాము. మేఘము అదృశ్య రూపములో ఉంటుంది, దృశ్యరూపములోనూ ఉంటుందని చెప్పాము.

అదృశ్యరూపములో చాలా పనులు చేస్తుందని చెప్పాము. నేను చెప్పు విషయము దేవుని చట్టములో ఒక మేఘము అనే విభాగము గురించి చెప్పుచున్నానుగానీ ఇటువంటి శాఖలు దేవుని చట్టములో ఎన్నో గలవు. ఈ విషయమై మీకు ఉదాహరణగా కనిపించే ఒక సంఘటనను వివరిస్తాము. మేఘము అదృశ్యరూపములో నీటిని పైకి తీసుకువెళ్తుంది. తీసుకుని అదృశ్యరూపములోనే పెట్టుకుంటుంది. కానీ మరలా ఆ నీటిని క్రిందికి విడిచిపెడుతుంది.

భగవద్గీతలో ఒక శ్లోకముంది, అదేమంటే, భూమిమీద ఉన్న నీటిని నేనే, నేనే ఆ నీటిని పైకి తీసుకువెళ్ళి దానిని క్రిందకి మరలా పంపిస్తున్నాను అంటాడు. అంటే దానివెనుక ఒక దైవశక్తి ఉందని అర్థమవు తున్నది కదా! అనగా మేఘము అనే గ్రహములో కూడా దైవశక్తి ఉంది, ఆ దైవశక్తే ఆ విధముగా చేయిస్తున్నది. పైకి కనిపించేది మేఘమయితే, దానివెనుక కనిపించక ఉన్నది దైవశక్తి. అంటే రాజ్యాంగములో రాజు ఏమి చెప్తే అదే పరిపాలకులు చేయాల్సిందే అదే విధంగా కనిపించని దేవుని రాజ్యాంగములో కనిపించనటువంటి పరిపాలకులు, వ్యక్తులు రకరక ములుగా ఉన్నారు, రకరకముల పనులు చేయుచున్నారు. అందులో మేఘము ఒక భూతము అని చెప్పాము. ఆ భూతము ఎటువంటిది అంటే ఒక చెరువులో ఉన్న నీటినంతటినీ ఒక్కసారి లాగేయగలదు. సముద్రములో అయితే ఇంకెంతయినా నీటిని తీసుకువెళ్ళగలదు. ఒక కుండలో నీరుంటే, అది ఎండిపోయింది, అందుకే నీరు ఆవిరైపోయింది అంటున్నారు. నీరు ఎండిపోవటం వాస్తవమే, ఆవిరైపోవటం వాస్తవమే కానీ ఆ నీరు ఏమయింది? అని మేము ప్రశ్నిస్తున్నాము. మనకు తెలిసినట్లు ఎండకు ఎండింది, ఆ నీరు ఆవిరైపోయింది అని ఈ విధముగా ఎన్నైనా చెప్పవచ్చు

గానీ వాస్తవమేమంటే, మేఘమనేది దృశ్యరూపములోగానీ, అదృశ్య రూపములోగానీ, ఆ నీటిని తీసుకుంటున్నది.

సాధ్యమైనంత వరకు అదృశ్యరూపములోనే మేఘములు పని చేయుచున్నవి. నేను చెప్పినది యదార్థము, నిజము అని తెలిసేటట్లుగా నిరూపణకు వచ్చే విధముగా కనిపించేటట్టు మీరు విదేశములో మేఘము దిగి నీటిని సుడిగా మీదకు లాగుతున్న దృశ్యాన్ని ఇంటర్ నెట్‌లో మీరు చూడవచ్చు. దానినే మేము ఇప్పుడు చూపిస్తున్నాము చూడండి. ఆ నీటిలో ఉన్న చేపలను కూడా తీసుకునిపోయి, ఇంకొకచోట వేయటం, అవియూ బ్రతికి ఉన్న చేపలగానే అవి వర్షం ద్వారా భూమీమీద పడటం చూస్తూ ఉన్నాము. ఈ విధంగా చూడలేని దృశ్యాన్ని మనము చూడ గల్గుచున్నాము. గత నెలలోని మా ప్రసంగములో ఈ విషయాన్ని మేము చెప్పగా, దానికి నిరూపణగా జరిగిన దృశ్యాన్ని మీకు ఇప్పుడు చూపిస్తున్నాము.

అదే విధముగా వడగండ్లవాన గురించి మీకు తెలిసేయుండును. మంచు (ఐస్) ముక్కలు పడుతూ ఉంటాయి. ఆ ఐస్ ముక్కలు క్రిందకు పడుతూ ఉంటాయి, పడేవి మనముందరే పడుతుంటాయి. పడింది పడినట్లే నిలిచిపోతుంది కానీ, పగలదు మీరు గమనించండి. కానీ అంత పై నుండి పడిన ఐసు ముక్క తప్పకుండా పగలవలసిందే. చిన్న రాయిని తీసుకుంటే పైనుండి వదిలితే క్రిందపడి రెండు ముక్కలౌతుంది. ఐస్‌ముక్క మరి పెలుసుగా ఉంటుంది కదా! దానిని నీవు తీసుకుని కొంత ఎత్తునుండి వదలిన అది పగులుతుంది కదా! మరి ఆకాశమునుండి అంత ఎత్తునుండి పడినవి ఎందుకు పగలటం లేదు. పగిలిపోదు ఎందుకంటే, ఆ ఐస్‌ముక్కను వేసిన చేయి పైనుండి వేసిన ఆ చేయికి కొలతలేదు, అంతపెద్ద చేయి

www.thraithashakam.org

కలిగినది ఎవరంటే మేఘమే, అది ఒక భూతమే. ఎంత ఎత్తునుండి ఆ వడగండ్లను వేసిందంటే, అవి క్రిందపడినా పగలనటువంటి తక్కువ ఎత్తునుండి వేసింది. అంటే దాని చేయి ఎంత పొడవుగా ఉన్నదో ఊహించండి. అదియునూ నీకు కనిపించకుండా ఉన్న చేయి ఆ విధంగా వేసింది. ఆ విధంగా పడిన తరువాత నీవు వాటిని చూస్తున్నావు. వేసినది ఎంతమంది వేశారంటే, వేసినది ఒక మేఘమైనాగానీ దానికి చేతులు లక్ష ఉండవచ్చు, వేయి ఉండవచ్చు, పదిలక్షలుండవచ్చు. నేను చిన్నప్పుడు ఒకసారి ఒక పేపర్‌లో చదివాను ఆరడుగుల పొడవు, మూడడగుల ఎత్తు, నాలుగైదడుగులు వెడల్పు కల్గిన ఐస్ ముక్కలు క్రిందపడినాయి. అవి పొలంలో పడినాయి. పొలంలో పడినందువలన విధ్వంసం ఏమీ జరుగ లేదు, కానీ ఆ విధంగా పదిరోజుల పాటు అవి ఏమీ కరుగకుండా ఉండి తరువాత కరిగాయి, పదిరోజులపాటు కరగకుండా ఉండే ఐస్ ముక్కలు పడినాయంటే, అవి ఇంతకు ముందు ఎక్కడున్నాయి? ఎవరు వేశారు? అంత ఎత్తునుండి పడినవి ఎందుకు పగలకుండా ఉన్నాయి? ఇవన్నీ ప్రశ్నార్థకములే!

ఈ విధముగా ప్రశ్నించుకుని జవాబు వెదకగల్గితే హేతువాదం అవుతుంది. అంతేగానీ ఈ రోజు హేతువాదం అని పేరుపెట్టుకుని, ఏది చెప్పినా అదికాదు అనడంతో వారి సమాధానము ప్రారంభమవుతుంది. ఆ విధంగా మనం ప్రశ్నించుకుని, సమాధానము కొరకు వెతికితే నిజమైన హేతువాదమవుతుంది. ఈ విధముగా తెలుసుకోవటం వలన దేవుని రాజ్యాంగము ఎంతో పెద్దది ఒకటున్నదని అర్థమవటం ప్రారంభమగును.

ఇప్పుడొక ఊరునంతటినీ నాశనము చేయగలిగింది ఒక గ్రహము. ఇప్పుడు నేను మేఘము అని చెప్పటం లేదు, **"గ్రహము"** అని చెప్పుచున్నాను.

చాలా గ్రహములు కలవు. ఒక్కొక్కచోట భూకంప రూపములో వస్తుంది. ఒక ప్రాంతంలో అగ్ని ప్రమాదం సంభవింపగలదు. అలాగే వర్షాన్ని ఎక్కువగా పడి వరదలను సృష్ఠించగలవు, వీట0న్నంటినీ మనమందరం సులభమైన పదముతో ప్రకృతి వైపరీత్యం అని అనేస్తున్నాము. అదియును గాక, ఒకరికొకరము సహాయం చేసుకోవాలి అంటున్నాము. ఒక ప్రాంతంలో ప్రమాదం సంభవించి, ఇంకొక ప్రాంతంలో ఆ విధముగా జరుగలేదు కనుక సహాయం చేస్తాము, నిజమే, కానీ అంతటా అదే జరిగింది అనుకో నీవేమి చేస్తావు?

మొన్నటికి మొన్న సునామీ వచ్చింది, వేలాదిమంది ఒకేసారి చనిపోయారు. ఇంతమందిని చంపటానికి నీరు అనేది ఎంతో కఠినముగా ప్రవర్తించింది. మరి కొంతమంది ఏమి చెప్పారంటే, భూమిలో భూకంపం వచ్చింది సముద్రము ఆక్రమించిన భూమి కంపించటం వలన సునామీ వచ్చింది. అందువలన ఆ నీరు ఈ విధముగా పొంగివచ్చింది, అని చెప్పుచున్నారు. వరదలు ఎందుకొస్తున్నాయి అంటే, వర్షాలు ఎక్కువ పడ్డాయి కనుక వరదలొచ్చాయి అంటున్నారు. మరి ప్రతీ సంవత్సరము ఎందుకు ఆ విధంగా కురవటం లేదు, వరదలు ఎందుకు ఒకే ప్రాంతానికే రావటం లేదు. లేదు రావద్దు అంటే రాకుండా ఉంటాయా? లేదు ఎవరైనా రమ్మనమంటే ఆ వరదలు వస్తాయా? ఈ విధముగా వీటన్నింటినీ ప్రకృతి వైపరీత్యములు అని చెప్పుకుంటున్నా, వాటి వెనుక ఎవరో చేస్తున్నారు. ఎవరు చేస్తున్నారంటే, కనిపించనివాడు ఎవడైతే ఉన్నాడో, వాడు కనిపించ కుండా ఉన్నటువంటి వారిని పెట్టి నడిపించుచున్నాడు. మనల్ని పరిపాలించ డానికి ప్రపంచములో ప్రభుత్వం ఎట్లు వివిధ శాఖలతో ఉన్నదో, ఆ విధముగానే మనల్ని, మనము చేసే తప్పు, ఒప్పులను బేరీజు వేసి

www.thraithashakam.org

శిక్షించేందుకు దేవుని దగ్గర ఎన్నో శాఖలు కలవు. వారి వలనే మనము సుఖాలు దుఃఖాలు అనుభవిస్తున్నాము.

ప్రపంచములో ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తిని చంపితే, అతనిని చట్టరీత్యా ఉరివేయవచ్చును. వాడి గురించి శ్రద్ధగా చెప్పుకుంటాముగానీ, ఇవేవీ అవసరము లేకుండా దేవుని పాలకులు వేలాదిమంది వారి కర్మానుసారము ఒక్కసారి చంపివేయుచున్నారు. శిక్షను అమలు చేస్తున్నారు. దేవుని సైన్యము చాలా బలాఢ్యులు, ఎన్నో చేతులు, కాళ్ళుగల వారు అని చెప్పినాము. మేఘములాంటి భూతములకు, కనిపించని గ్రహములకు, దేవుని రాజ్యాంగములో కూడా, జ్ఞానేంద్రియములు కలవు, కర్మేంద్రియములు కలవు. కానీ కర్మేంద్రియములుగా చేతులు నీలాగే వాటికీ ఉన్నప్పటికీ వాటికి మాత్రము ఎన్నో చేతులుండవచ్చు. ఎందుకంటే ఒకే శిక్షను ఎంతోమందికి అమలు చేయాల్సిరావచ్చును, కనుక అనేక చేతులుంటేనే అది సాధ్యమగును. ఆ విధముగా అవి పని చేసేందుకుగాను, దేవుడు వాటిని అనేక చేతులు కల్గిన, ఆకారములతో సృష్ఠించెను. కానీ అవి మనకు కనిపించవు. మరి కనిపించవు అనుమాటను, కనిపించినట్లు నీవెట్లు చెప్పుచున్నావని ప్రశ్నించ వచ్చును? దానికి ఈ దృష్ఠి పనిచేయదు, జ్ఞానదృష్ఠి ఉండవలెను. తద్వారా నీవు వాటిని చూడగలవు. కానీ కొందరు వినినంతవరకు తలకాయలు ఊపుతూ, అలాగే అంటున్నారు. ఇక్కడనుండి వెళ్ళిన తరువాత అదేమీ లేదు, పో అని చెప్పి వెళ్ళిపోతున్నారు.

ఈ విషయములన్నీ కొంత తెలిసిన తరువాత ఇవన్నీ ఆచరిస్తే, బ్రతకలేము అంటారు. మీరు బ్రతికేదానికి ఒక చట్టముంది. ఒక నిర్ణయం ముందే పెట్టబడి ఉంది. దాని ప్రకారమే ఇవన్నీ జరుగుచున్నాయి, ఏ విధముగా బ్రతకాలో ఆ విధంగానే నీవు బ్రతుకుతావు. ఏ విధముగా

www.thraithashakam.org

శిక్షించబడాలో ఆ విధముగానే శిక్షించబడతావు. అది ముందే నిర్ణయం అయింది కనుకనే శిక్షలు అమలు చేయబడుతున్నవి. కానీ సామూహికంగా శిక్షలు అమలు పరచాలంటే పెద్దపెద్దవారు చేయాలి. కంటికి కనిపించని వారు చేస్తారు. ఒక బస్సు వెళ్తూ ఉంటుంది, ప్రమాదం జరుగుతుంది. అందులో ఎంతమంది చావాలో వారందరూ చస్తారు. ప్రమాదము జరుగుటకు అవకాశమే లేదంటారు. ప్రమాదం జరగాలి, జరిగింది. ఎవర్ని ఏ విధంగా చంపవలెనో అదే విధముగా చంపుదురు. అంటే ముందే నిర్ణయించబడి ఉంటుంది. ఆ నిర్ణయం ప్రకారమే వారు ఆ శిక్షను అమలు చేయుదురు. ఆ శిక్షను అమలు చేసేవారు ప్రత్యేకముగా ఉంటారు. ఈ మధ్య కొంతమంది భగవద్గీతను ప్రచారము చేస్తున్నారు. మనము కూడా **"త్రైత సిద్ధాంత భగవద్గీత"**ను ప్రచారము చేస్తున్నాము. మన ఉద్దేశ్యమేమంటే, ఆ భగవద్గీతలో ఉన్న జ్ఞానము సమాజానికి అందజేయాలని మన ఆలోచన కానీ మిగతా ప్రచారకుల ఆలోచన ఏమంటే, సంస్కృత భాష అభివృద్ధి చెందాలనేది వారి ఆలోచన. సంస్కృత భాష అభివృద్ధి చెందాలంటే భగవద్గీత ను ప్రచారము చేయాలంట, చూడండి వారి ఆలోచన ఏ విధముగా ఉన్నదో! ఈ విధముగా ప్రచారము చేయాలని పెద్ద వ్యాన్‌తో వెళ్ళి, ప్రమాదం జరిగి అందరూ చనిపోయారు. వీరు చేస్తున్నది భగవద్గీత ప్రచారమైతే అంత పెద్ద ప్రమాదం ఎందుకు జరిగింది? అది మానవ తప్పిదం కాదు, డ్రైవర్ తప్పు అంతకంటే కాదు. ప్రమాదం జరుగుటకు అవకాశమే లేదు. వ్యాన్ పల్టీకొట్టింది, దెబ్బలు పెద్దగా తగలలేదు కానీ చనిపోయారు.

ఎవరినో ఉద్దేశించి ఎందుకు, మేము స్వంతముగా డ్రైవింగ్ చేస్తున్న వాహనములే చాలాసార్లు ప్రమాదములు జరిగినవి కానీ మాకు ఒక్క చిన్న దెబ్బయినా తగలలేదు. మా వాహనములు మాత్రము దెబ్బతిన్నవి. కానీ

www.thraithashakam.org

కొందరికి దెబ్బలు ఏమీ తగిలియుండవుగానీ చనిపోతుంటారు. మరి ఆ విధముగా ఎందుకు చనిపోతుంటారు, శిక్షపడింది, చనిపోయారు. మరి వారు మంచి పని చేస్తున్నారు కదా! మంచిపనే, ఇంతకుముందు ఏ తప్పు చేసితివో, ఆ తప్పులకు శిక్ష పడింది ఇప్పుడు. మరి భగవద్గీత ప్రచారమే కదా చేస్తున్నది అంటే, ఉద్దేశ్యము మంచిదే కానీ దేని కొరకు ఆ ప్రచారము చేస్తున్నారంటే, భాషాభివృద్ధికి గాని జ్ఞానప్రచారము కాదని అర్థమవుతున్నది. నీవు మాట్లాడే భాష ఏదైతే నీకెందుకు? భావముండాలి గానీ, అందులో (భగవద్గీత) భావము ఒక్కటే కదా, కానీ భాష కొరకు బయలుదేరారు, భావము చెప్పుటకు కాదు. కానీ వీరందరికీ శిక్ష ఎందుకు పడింది అంటే, తప్పు తప్పే, ఒప్పు ఒప్పే.

దేవుని రాజ్యాంగములో ఎన్నో రకాల వ్యక్తులున్నారు. నేను ఈ రోజు తప్పు చేస్తే, ఏముందిలే, ఎవరు చూస్తారులే, ఏమవుతుందిలే, అని కంటికి కనిపించే ధనమునకు ఆశపడి, దేవునికి మోసము చేయుటకు కూడా కొందరు వెనుకాడుట లేదు. ఇప్పుడు హుండీలలో డబ్బులు పట్టుకొని పోవటం లేదా? గుడిలో దొంగతనాలు చేయటం లేదా? వీరందరినీ గమనించేవాడు, అప్పుడే దానికి శిక్ష ఖరారు చేయును. అమలు చేసేది మాత్రము తరువాతే. ఎవరు చూసేది అని నీవంటే నీ కంటికి కనిపిస్తే కదా! చూసేదానికి, కాని ఆ శిక్ష ఏది అనేది అప్పుడే నిర్ణయించబడి ఉంటుంది. కానీ దాని అమలు మాత్రము ఎప్పుడైనా జరుగవచ్చు. ఆ విధంగా దేవుని ప్రభుత్వం ఉంటుంది. ఈ విషయాలు మీకు క్రొత్తగా ఉండి ఉండవచ్చు. వరదలు వచ్చిన కర్నూల్‌లో కొన్ని రోజులపాటు తీస్తున్నా బురద తరగటం లేదు. అంత బురద ఏ విధముగా వచ్చింది, కొన్ని వందల ట్రాక్టర్లు తోడుతున్నా, ఆ బురద తరగటం లేదు. దాని వెనుక

కొందరి దేవుని పాలకుల హస్తమున్నది. వారిని మీరు గమనించండి, మీకు భయం ఉండదు. వారిని మీరు గమనిస్తే, మనకు శిక్షలు తప్పవు అని తెలిస్తే, తప్పనిసరిగా దేవుని జ్ఞానము తెలుసుకోవాలని ఆ విధముగా మాత్రమే నీకు శిక్షలు తగ్గుతాయి, అని నీకు తెలుస్తుంది. నీవు ఈ రోజునుండైనా, దేవుని వాస్తవమైన జ్ఞానము తెలుసుకుంటే, నీకు నిర్ణయించబడిన శిక్షలు తగ్గే అవకాశము ఉంది. కొట్టివేయబడే అవకాశము ఉంది కనుక, అది తెలియకపోతే, భయంకరమైన శిక్షలు అనుభవించాల్సి వస్తుంది.

ఈ విధంగా ప్రపంచపరముగా చేసిన పాపాలకు శిక్షలు ఒక రకంగా ఉంటే, దేవుని యెడల చేసిన పాపములకు శిక్షలు ఇంకా చాలా భయంకరముగా ఉండును. అందుకే మత గ్రంథములలో **"కర్మవిసర్గః"** అని అన్నారు. అటువంటి తప్పులకు ప్రత్యేకముగా గుర్తు కల్గిన శిక్షలుంటాయి అని చెప్పడము జరిగింది. అదియేకాక ఒకానొక మత గ్రంథములో **"నీవు దేవుని యెడల చేసిన పాపము అనుభవించుటకు, ఈ యుగమందును మరియు రాబోవు యుగమందునూ ఆ పాపము అనుభవించినా అయిపోదు"** అన్నాడు. ప్రపంచవరముగా చేసిన పాపము ఒక జన్మలో పోవచ్చు, దానిని అనుభవించిన తరువాత, అది అయిపోతుంది. కానీ దేవుని యెడల చేసిన పాపము మాత్రము యుగయుగములందు అనుభవించినా ఇంకా మిగిలే ఉంటుంది. అంటే అది ఎంత పెద్ద పాపమో, పొరపాటో ఆలోచించండి. మీ మత గ్రంథములలో జన్మలుంటా యంటున్నారు, మా మత గ్రంథములో లేదు అన్నా, వారి మత గ్రంథములలో జన్మలున్నట్టు కలవు గానీ, వారు దానిని గ్రహించలేకపోయారు. ఇంకో మతములో "ఒక్కసారిగా అందరినీ లేపి శిక్షలు వేస్తారు" అని అంటున్నారు.

www.thraithashakam.org

కానీ ప్రతి రోజూ ఎక్కడో ఒక దగ్గర శిక్షలు అమలు జరుగుచున్నా అవి ఎవ్వరూ ఆలోచించటం లేదు. ఈ శిక్షలను అమలు చేయటంలో దయా, దాక్షిణ్యాది గుణములు ఏమాత్రము దేవుని పరిపాలకులకు ఉండవు. ప్రపంచ సంబంధముగా చట్టం వేసిన శిక్షలు అమలు కావచ్చు, కాకపోవచ్చు. జైలుకు వెళ్ళినవాడికి బిర్యానీ పొట్లం ఇమ్మనమని ఇంకొక వ్యక్తి పోలీసుకు ఇస్తే, దానిని అతనికి అందజేయగలడు. తిని వాడు ఆనందించగలడు. అదే విధముగా ఉరిశిక్ష పడిన వ్యక్తి ప్రెసిడెంట్‌కు అర్జీ పెట్టుకుంటే, అతను రద్దు చేస్తే అది ఆగిపోగలదు. కానీ దేవుని రాజ్యాంగములో అటువంటి ప్రసక్తి లేనేలేదు, కానీ అక్కడక్కడ కొట్టివేయబడుతుంది, ఎప్పుడంటే, నీవు జ్ఞానము తెలుసుకుని ఆచరిస్తే, అప్పుడు శిక్షల్లో రాయితీలూ, క్షమాపణలు ఉండును. అప్పుడు వ్రాసిన వ్రాత తిరిగి వ్రాయబడుతుంది దానినే "తిరిగివ్రాత" అందురు, కానీ ఆ పదము నేడు తిరవాతగా మారినది. తిరవాత నీకు తలలో పడాలి, పడితే నీకు ఆ శిక్ష మానిపోవును. అది ఎప్పుడు? నీవు జ్ఞానము తెలుసుకున్నప్పుడు, జ్ఞానము ప్రకారము ఆచరించి నప్పుడు అది జరగుతుంది.

ఇప్పుడు జ్ఞానము తెలుసుకున్న కొందరు ఏమి చేస్తున్నారంటే, జ్ఞానము వినినంతవరకు బాగా ఉందంటూ, దానిని ఆచరించాల్సి వచ్చినప్పటికీ, ఇవన్నీ ఆచరిస్తే, ఏ విధము కుదురుతుంది అంటున్నారు. కానీ ఈ విధముగా అంటున్నారంటే ఇవన్నీ జరిగేందుకు ఒక చట్టం ఉంది. దాని ప్రకారమే మన బ్రతుకు ఉంటుంది అని తెలియక, దేవుని రాజ్యాంగము వేసే శిక్షల్లో మన ముందరే మన పిల్లలు చనిపోవచ్చు. అదియూ కర్మానుసారమే అనుకోండి, లేదా మన పిల్లల ముందే మనము చనిపోవచ్చు లేదా చాలామందిని ఒకేసారి చంపేవారున్నారు లేదా, ఈ

www.thraithashakam.org

ఊరంతా ఒకేసారి చంపేసేవారున్నారు. ఇవన్నీ చేసిన తప్పులకు శిక్షలే, కానీ ఇవేవీ వారికి అర్థము కాలేదు.

కనిపించని రాజు, కనిపించని వారిచే కనిపించే శిక్షలు వేస్తున్నాడు. సునామీ వచ్చేటప్పుడు ఏనుగుల గుంపును కొండ మీదకు పొమ్మంటే అవి కొండపైకి పోయినాయి. కానీ అందరికీ ఆశ్చర్యము వేసింది అంత కొండపైకి ఏనుగులు ఒక్కసారి ఎందుకు పోతున్నాయి అని, కానీ మేతకు వెళ్తున్నాయిలే అని సమాధానపరచుకున్నారు. ఇంతలో సునామీ వచ్చింది. ఎందరు చావాల్సి ఉందో, అందరూ చనిపోయారు. సునామీ తగ్గిన తరువాత ఏనుగుల గుంపు క్రిందకు కొండపైనుండి దిగాయి. మరి వీటిని కొండపైకి ఎవరో తోలితే కదా వెళ్ళాయి మన కంటికి కనిపించని వారే, వాటిని ముందు పైకి పంపించారు. ఈ విధంగా భయంకరమైన శిక్షలు అమలు జరుగుతూ ఉన్నాయి. వర్షాలనుండి చేపలు పడుతున్నాయి. అంతపైనుండి పడుతున్నా, అవి చనిపోవటం లేదు. అంటే నీకు కనిపించకుండా ఆ శక్తులు (మేఘములు) అవి క్రిందపడినా చనిపోనంత క్రిందవరకు తెచ్చి వేస్తున్నాయి. కానీ నీకు అది దృశ్యంగా కనిపించక, ఎంతో ఎత్తునుండి పడుచున్నట్లు అనిపించినా, అవి ఎలా బ్రతుకు చున్నాయని ఎవరైనా ఆలోచిస్తున్నారా? నీవు ఎంత సైన్సు అని అన్నా, దీనివెనుక పెద్ద తతంగం ఉందన్న విషయము ఎవరికీ తెలియదు. అది కూడ సైన్సు. ఆ సైన్సు నీకు తెలియదు. నీకు తెలిసిందే సైన్స్ అనుకుంటున్నావు. కానీ తరువాత పరిశోధనల్లో తెలిసినవి కొన్ని గలవు. కనుక మనిషికి తెలియని రహస్యములు ఎన్నో గలవు. ఒక గ్లాసుడు నీటిని, మనము మంచుముక్క (ఐస్) ముక్కగా తయారు చేయాలంటే, ఫ్రిడ్జ్‌లోపెట్టి బాగా చలవ చేస్తేగానీ ఆ ఐస్ తయారు కాదు. కానీ పైనుండి పడుతున్న వడగండ్లను తయారు

www.thraithashakam.org

చేయుటకు ఎన్ని ఫ్రిడ్జ్‌లు కలవు. ఊరంతా ఐస్ ముక్కలు పడతాయి. మరి అక్కడ ఫ్రిడ్జ్‌లున్నాయా, నీకు తెలియదు. ఇదంతా ఏ విధముగా జరుగుచున్నదో నీకు తెలియదు. క్రిందపడిన ఐస్‌ముక్క మరి ఎందుకు పగలకుండా ఉందో తెలియదు? పైనుండి పడిన చేపలు ఏ విధంగా బ్రతుకుతున్నాయో తెలియదు? ఇవన్నీ మేఘములలో కనిపించకుండా ఏ విధముగా ఉన్నాయో తెలియదు? వరదలొస్తే, దేశమంతా ముంచేయగల నీరంతా మీదున్నదని కనిపించిందా!

ఈ విధంగా కనిపించనటువంటి రాజ్యాంగము ఉంది. ఎందరో పాలకులు కనిపించకుండా ఉన్నారు. "మేఘము ఒక భూతము" అని ఇంతకు ముందు చెప్పాము, అటువంటి భూతాలు చాలా దృశ్యరూపంలో ఉన్నాయి. కొన్ని అదృశ్యరూపములో ఉన్నాయి. కానీ అవి ఎన్నో సంఖ్యల్లో ఉన్నాయి, శిక్షలు అమలు పరచుచున్నాయి. ఆ శిక్షా సమయంలో నన్నేదేవుడూ చూడలేదు, నన్నెవరూ శిక్షించలేరనుకోవద్దు. మీకు తెలియని దేవుడున్నాడు. ఈ విధంగా లెక్కవేసుకుంటే, ఏ పనైనా చేయగల శక్తి దేవుని రాజ్యాంగములో పనిచేసే గ్రహములకున్నది. కనుక దేవునియందు భయము, భక్తి కల్గి, జ్ఞానము తెలుసుకునేందుకు ప్రయత్నం చేయండి. దేవుడు అన్ని రాజ్యాలకు అధిపతి. నీవు ఒక్క దేశానికి వున్న అధిపతినే వెంటనే చూడలేవు, చాలా ప్రయత్నం చేస్తేనేగానీ నీవు అతనిని కలువలేవు, చూడలేవు, మాట్లాడలేవు. మరి ఇంత ప్రపంచమునే పెద్ద రాజ్యాంగానికి అధిపతియైన దేవున్ని నీవు ఏ విధంగా చూడగలవు. కనుక దేవుని మీద భక్తి పెట్టుకొని, అతనిని తెలుసుకునే జ్ఞానాన్ని తెలుసుకుంటేనే జీవితం సార్థకమగును. జ్ఞానము తెలియకపోతే నీకూ, పశువుకూ ఏ తేడా లేనట్లే! ఎందుకంటే అదీ తింటున్నది నిద్రపోతున్నది, పనిచేస్తున్నది. మరి నీవూ

అదే చేస్తున్నావు కనుక నీకూ, పశువుకూ ఏమి తేడా ఉన్నట్లు. ఇప్పటినుండైనా మనిషిగా బ్రతకాలంటే, దేవుని గురించి తెలుసుకో, దేవుని చట్టం గురించి తెలుసుకో. అప్పుడు నీ జీవితం సార్థకమవుతుంది.

## 25. భూతం - మహాభూతం

తేది : 02-12-2009

మేము చెప్తున్న చాలా విషయములు ఇంతకముందు ఎవ్వరూ చెప్పనివి. ఇంకా చెప్పాలంటే, సృష్ఠి ఆదినుండి కూడా ఎవ్వరూ చెప్పనివి. కానీ మేము చెప్పిన విషయములను కొందరు సర్వసాధారణముగా చెప్పిన విషయములుగా పరిగణిస్తున్నారు. ఇంతకు ముందే "మేఘము ఒక భూతము" అనే విషయాన్ని, అదే విధంగా "ప్రభువు-ప్రభుత్వం" అనే శీర్షికలో దేవుని రాజ్యాంగము గూర్చి వివరించటం జరిగింది.

మేము ముందునుండి చెప్పుచున్నాము. హిందూమతమును ఉద్ధరించుటకు అద్వైతసిద్ధాంతము, ద్వైతసిద్ధాంతము, విశిష్టాద్వైత సిద్ధాంతము వచ్చాయిగానీ, ఒకరు చెప్పింది మరొకరికి పొసగని కారణంగా అవి ఇప్పటికీ ప్రచారంలో ఉన్నప్పటికీ, వాటిలో ఉన్న లోపముల వలన ఇ(హి)ందూ మతము క్షీణించిపోయింది అని చెప్పాము. సృష్ఠి ఆదిలోనే దేవుడు సమాజానికి దేవున్ని తెలుసుకునే ధర్మాలను చెప్పెను, కానీ అవి కొంతకాలమునకు అధర్మములుగా మారిపోగా, ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతములు వచ్చినా, అవి వాటిని నిలపలేకపోయాయి. ఎందుకంటే వాటిలో లోపాలు కలవు. ఇప్పుడు **"త్రైత సిద్ధాంతము"** వెలుగులోకి వచ్చుచున్నది. ఇప్పుడున్న వారందరి సిద్ధాంతములకంటే త్రైత సిద్ధాంతము

www.thraithashakam.org

లోనే దేవున్ని తెలుసుకునేందుకు ఎక్కువ అవకాశము కలదు. నేను ఇంతకుముందే చెప్పి ఉంటిని, నేను పీఠాధిపతిని కానుగానీ సిద్ధాంతకర్తనని. ఇప్పుడున్న కంచికామకోటి పీఠాధిపతి జయేంద్ర సరస్వతి కావచ్చు, విశిష్టాద్వైత పీఠాధిపతి చిన్నజీయర్ స్వామివారు కావచ్చు. వీరందరూ ఒకరు పెట్టిన సూత్రాలను అనుసరిస్తూ నడుచుచున్న వారేకానీ సిద్ధాంతకర్తలు కారు. ఇప్పుడు మేము చెప్పుచున్న త్రైత సిద్ధాంతము సృష్టి ఆదినుండి దేవుని ధర్మములు తెలియజేసిన దేవుని మాటలలో కలదు. కానీ దానినెవరూ ఇంతవరకు గ్రహించలేదని ఖచ్చితంగా చెప్పగలను.

భగవద్గీత అను గ్రంథము కలదు. ఆ గ్రంథము ఆరు (షట్) శాస్త్రములలో ఆరవశాస్త్రమైన, బ్రహ్మవిద్యాశాస్త్రమంటే అదే. మిగతా శాస్త్రములు ఉన్నవి. గణిత, ఖగోళ, రసాయన, భౌతిక, జ్యోతిష్య శాస్త్రములు. శాస్త్రము లెన్ని? అని అడిగినా చాలామందికి తెలియదు. ఒకరు రెండు అని చెప్తే, మరొకడు మూడంటారు. ఈ ఆరు శాస్త్రములలో కొన్ని బాగా అభివృద్ధి చెందినవి. కొన్ని అభివృద్ధి చెందలేదు. అష్టాదశ పురాణములు ద్వాపరయుగ అంత్యములో వచ్చినవి కానీ, ఆరు శాస్త్రములు సృష్టి ఆదినుండి ఉన్నవి. అందులో మొదటి నాలుగు శాస్త్రములైన గణిత, ఖగోళ, రసాయన భౌతిక శాస్త్రములు అభివృద్ధి చెందినవి కానీ, ఈ నాలుగు శాస్త్రములు ప్రపంచ సంబంధమైనవి కనుక ప్రపంచ సుఖాలను అనుభవిస్తున్నాము. కానీ ఒక శాస్త్రము మాత్రము ప్రపంచ సంబంధము కానిది కలదు. అదే బ్రహ్మవిద్యా శాస్త్రము. ఇటు ప్రపంచ సంబంధమైనదికాక అటు పరమాత్మ సంబంధమైనది కాకుండా ఒక శాస్త్రము కలదు అదే జ్యోతిష్యశాస్త్రము. దీనిని పూర్తిగా దైవికమనే చెప్పలేము, అలాగని ప్రపంచ సంబంధమని కూడా చెప్పలేము. కనుక జ్యోతిష్య శాస్త్రము కూడా ఎక్కువగా

www.thraithashakam.org

పరిశోధింపబడలేదు. జ్యోతిష్య శాస్త్రవేత్తలు ఉన్ననూ, ఆ శాస్త్రము యొక్క పూర్తి ఫలితాలు మనకు పూర్తిగా తెలియకుండా పోయాయి. కొన్ని సూత్రములను మాత్రమే చెప్పగలుగుచున్నారు. కానీ అన్ని సూత్రములను మాత్రము చెప్పలేక పోవుచున్నారు.

ఇక బ్రహ్మవిద్యా శాస్త్రము వద్దకు వస్తే, భగవద్గీతయే సంపూర్ణమైన బ్రహ్మవిద్యా శాస్త్రము. బ్రహ్మవిద్యాశాస్త్రము మనకు ఎంతవరకు తెలిసిందంటే, మన చుట్టూ క్రైస్తవులున్నారు, చిన్నపిల్లలకు కూడా, వారి గ్రంథము బైబిల్ అని తెలుసు. అదే విధముగా ముస్లీమ్స్ ఉన్నారు. వారి మత గ్రంథము ఖురాన్ అని వారందరికీ తెలుసు. మరి హిందూమతము వద్దకు వచ్చినట్లయిన భగవద్గీత తమ మతగ్రంథమని తెలియనివారు 80 శాతము ఉన్నారు. 20 శాతముమందికే భగవద్గీత తమ మత గ్రంథమని తెలుసు. 20 శాతంలో దానిని చదివినవారు 15 శాతము ఉన్నారు. 5 శాతము ప్రజలు దానిని కేవలము పూజిస్తున్నారు. మరి 15 శాతం ప్రజలు భగవద్గీతను చదివితే ఎంతవరకు అర్థమయిందంటే, ఒక్కొక్కరికి ఒక్కో విధంగా అర్థమయింది ఎందుకంటే వ్రాసేవారు అలాగే వ్రాశారు. మరి ఈ భగవద్గీత బ్రహ్మవిద్యాశాస్త్రమైనప్పుడు హేతువాదులు అడిగిన జవాబు చెప్పలేని పరిస్థితి ఎందుకొచ్చింది? అంటే అందులో అసలైన భావన మనకు అర్థము కాకుండా పోయింది కనుక. స్వామీజీలకే పూర్తిగా అర్థము కాలేదు. మరి సామాన్య ప్రజలకేమి అర్థమవుతుంది? కనుకనే మేము విప్లవాత్మకమైన శ్రీకృష్ణుని యదార్థ భావనను **"త్రైత సిద్ధాంత భగవద్గీత"**గా గ్రంథమును వ్రాసితిమి. దీనిని శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం జిల్లాలలో ప్రచారము చేయగా, భగవద్గీత అంటే ఈ విధంగా ఉంటుందా, ఇదా అసలైన అర్థము అని, ఇంతవరకు మేము గొప్ప జ్ఞానులమనుకుంటిమి

www.thraithashakam.org

ఈ భగవద్గీతను చదివిన తరువాత, మేము ఇంతవరకు ఎన్నో భగవద్గీతలు చదివిన వాటికంటే, వాస్తవమైన జ్ఞానము తెలుసుకుంటిమి అని వారు చెప్పుకుంటున్నారు. ఈ విషయములు చదివిన అదే విషయము ప్రతీవారికి తెలియును.

భగవద్గీత ఆనాడు ఎంతవరకు చెప్పవలెనో అంతవరకే చెప్పబడినది. కానీ ఇప్పటి కాలములో చెప్పవలసినవి, ఇంతకుముందు భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పని విషయములను కూడా ఇప్పుడు చెప్పబడినవి, ఇదంతా సిద్ధాంతపరముగా చెప్పబడుతూ ఉంది. శాస్త్రబద్ధముగా వివరించబడు తున్నది. ఎవ్వరూ ఖండించలేని విధంగా చెప్పబడుతూ ఉన్నది. మరి దానిని శ్రద్ధగా తెలుసుకొను ప్రయత్నము చేయవలెను. అందుకే భగవద్గీత లో శ్రీకృష్ణభగవానుడు చెప్పినట్లు **"శ్రద్ధవాన్ లభతే జ్ఞానమ్"** నీకు శ్రద్ధ ఉన్నప్పుడే జ్ఞానము లభించును. శ్రద్ధ లేకపోతే నీకు జ్ఞానము లభింపదు. అని చెప్పుచున్నాము.

హైదరాబాద్‌లో గోడలపై "సృష్ఠికర్తకోడ్ 666" అని వ్రాసియుంటే అది తప్పని అది 963 అని వ్రాసి, దాని వివరము బ్రహ్మ విద్యాశాస్త్రము భగవద్గీతలో ఉందని చెప్తే, క్రైస్తవులు వారిది తప్పే అని ఒప్పుకున్నారు. కానీ సృష్ఠికర్త అనే పదమును చూసి హిందువులు మాత్రము మమ్మల్ని క్రైస్తవులన్నారు. సృష్ఠి ఎప్పుడు జరిగిందో తెలియదు, సృష్ఠికర్త ఎవరో తెలియదు. 2000 సం॥ క్రితము పుట్టిన క్రైస్తవం అనే మతమునకు హిందువులు సృష్ఠికర్త అనే పదాన్ని లీజుకు ఇచ్చారా? అని మేము ప్రశ్నిస్తున్నాము. సృష్ఠికర్త అనే పదము హిందువులకే కాదు, క్రైస్తవులకే కాదు, ఎవరికైనా వర్తించే పదమది. ఈ మధ్య అహ్మదాబాద్‌లో భూకంపం వచ్చింది. ఎందుకు వచ్చిందో తెలుసునా? భూమిలో కంపనాలు వచ్చాయి

అంటున్నారు, అక్కడే ఎందుకు రావాలో తెలుసునా? నాలుగు శాస్త్రములు మాత్రమే తెలిసేవారు మాట్లాడే మాటలు ఈ విధముగానే ఉంటాయి. కానీ ఆరవదైన బ్రహ్మవిద్యాశాస్త్రము మాత్రమే సరియైన జవాబులివ్వగలదు.

భగవద్గీతలో శ్రీకృష్ణుడు భూమిలో జలాన్ని నేనే విడుస్తున్నాను అన్నాడు. ఇదంతా అదృశ్యరూపముగా జరుగుచున్నది. కానీ ఇప్పటి సైంటిస్ట్‌లు ఏమి చెప్పుచున్నారంటే, నీరు సూర్యుని వలన ఆవిరై పోతున్నది, ఆవిరి మేఘమవుతున్నది, మేఘమునకు, చల్లనిగాలి తగిలినప్పుడు అది వర్షిస్తున్నదని సూత్రము చెప్పుచున్నారు. పోనీ వాస్తవమే, ఒక గిన్నెలో నీరు ఆవిరి కావాలంటే, ఎంతవేడి కావాలి? ఒక ఐదు లీటర్ల నీరు ఆవిరి కావాలంటే 100 డిగ్రీలపైన వేడిచేస్తే ఒక అర్థగంటకు అవి ఆవిరయ్యే అవకాశము ఉంది. మరి ఈ భూమిమీద నీరు 5 లీటర్లు కాదు, పది లీటర్లుకాదు, ఇన్ని నీళ్ళని చెప్పలేము. మరి అన్ని నీళ్ళు పైకి వెళ్ళాయంటే, ఎలా వెళ్ళాయి? అలాగే మొన్న వరదలొచ్చాయి. ఎన్ని నీళ్ళు వచ్చినట్లు? మరి అంత నీరు వర్షం వలన వచ్చినట్లే కదా! మరి అంత నీరు పైకెట్లు పోయినట్లు? మరి అన్ని నీళ్ళు ఆవిరైపోవాలంటే, ఎంత వేడి పెట్టాలి? వేడంటనే 40 డిగ్రీల వేడంటనే మనము ఇంటి లోపలకు పోతాము. మరి 40 డిగ్రీల వేడికి ఎన్ని నీళ్ళు పైకి పోగలవు. ఇన్ని నీళ్ళు పోయాయి, అని ఏమైనా మనము చెప్పగలమా! సైన్స్ ఈ విషయములో ఇంకా అభివృద్ధి చెందాల్సి ఉంది. గుడ్డిలెక్కలు చెప్పటం కాదు. ఇన్ని క్యూసెక్కుల నీరు ఆవిరి రూపంలో పైకి పోయిందని మీరు చెప్పగలరా? సైన్స్‌ను అడ్డంగా పెట్టుకుని మేము శాస్త్రజ్ఞులం అంటే సరిపోదు. దానితో పాటు దేవుడు లేడు అనే మాటను చెప్పటం కూడా అలవాటయింది. ఇదంతా ప్రకృతి సంబంధముగా జరుగుచున్నది అని చెప్పటం తప్ప వివరము మాత్రము లేదు.

www.thraithashakam.org

మేము ఇంతకు ముందే చెప్పినట్లు, విదేశాల్లో ఒక చెరువులో మేఘము దృశ్యరూపములో నీరు లాగేస్తున్న దృశ్యాన్ని ఇంటర్ నెట్‌లో పెట్టి మీ అందరికీ చూపించాము. అదే విధంగా ఇంకొక ప్రదేశములో ఆ నీటితో పాటు వెళ్ళిన చేపలు కూడా పడ్డాయి మరి ఏ నీటి ఆవిరి ఆ చేపలను పైకి తీసుకువెళ్ళిందో ఈ శాస్త్రవేత్తలు చెప్పగలరా? అదే విధంగా కోట్ల టన్నుల బరువున్న నీళ్ళు ఆ మేఘములో ఉన్నాయి. మరి అంత బరువును ఎవరు పైన మోస్తున్నారు? ఈ రోజు శాస్త్రవేత్తలు అనేవారు ఏమైనా చెప్పగలరా? ఈ మధ్య చైనాలో విపరీతంగా మంచు కురిసింది. ఒకచోట ఒక కోటి అరవై లక్షల టన్నుల మంచుపడింది. ఆ బరువును తట్టుకోలేక కొన్ని చెట్లు, కొన్ని ఇల్లు కూలిపోయినవి. మరి అంత ఐస్ పైన ఎక్కడున్నట్టు. చైనాలోనే మరొకచోట ఒక కోటి ఎనభైలక్షల టన్నుల మంచు కురిసింది. ఈ రెండింటినీ కలిపితే మూడుకోట్ల నలభైలక్షల టన్నులు అవుతుంది. మరింత ఐస్ మీద నుండి పడుచున్నదంటే, ఎంత విచిత్రమైన సంఘటన! అదే విధంగా గత ఉపన్యాసములో మేఘము ఏ విధముగా నీటిని మీదకు తీసుకుంటున్నదో దృశ్యరూపములో చూపబడింది. వాస్తవముగా ఇదే పద్ధతి అదృశ్యరూపంగా ఎల్లప్పుడూ జరుగును. దృశ్యరూపంగా ఆ పద్ధతి కనిపించి మనకు వాటి పనితనము తెలియాలనేమో, విదేశాల్లో ఒక చెరువునిండా ఉన్న నీరు ఏ విధముగా దానిలో నీటిశాతము ఒక్కసారి తగ్గినట్టు మేఘాలు నీటిలో ఉన్న చేపలను సైతము తీసుకువెళ్ళాయో, మనము వీడియో ప్రసారమును చూశాము. కానీ ఇన్ని చేపలు, అంతనీరు తిరిగి మరలా వర్షించేంత వరకు ఆ చేపలు పైన ఎక్కడున్నట్టు? ఏమి తిని బ్రతికినట్లు? వాటిని ఎవరు, ఎక్కడ ఉంచినట్లు? మరియు ఆ చేపలు క్రింద పడిననూ, అవి చనిపోకుండా ఎట్లు బ్రతికినవి?

www.thraithashakam.org

ఈ విషయమును నాలుగు శాస్త్రములను ఉపయోగిస్తే సమాధానము దొరకదు. ఐదవ శాస్త్రము పనికి రాదుగానీ ఆరవ శాస్త్రమైన బ్రహ్మ విద్యాశాస్త్రము మాత్రమే దీనికి సమాధానము చెప్పగలదు. అందువలన మనకు తెలియని విషయములు చాలా ఉన్నవి. వీటి గురించి ఏ ఇతర గ్రంథములలోనూ వివరింపబడలేదు. భగవద్గీతలో కూడా ఈ విషయమును చెప్పలేదు. దేవుడు, జీవునికి జ్ఞానము ఎంత అవసరమో అంతే చెప్పెను. కానీ దానినైనా (భగవద్గీతను) పూర్తిగా తెలుసుకోకుండా ఉండిపోయారు. ఇవన్నీ మీకు అవసరము లేదు, జ్ఞానము దేవుని దగ్గరకు చేర్చగలదు అని కృష్ణుడు చెప్తే, అప్పుడు చెప్పని విషయములను కూడా ఇప్పుడు మేము తెలియజేస్తున్నాము. ఇప్పుడు మనము నుదుటిమీద పెట్టుకున్న బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములు ప్రతీ మనిషిలోనూ, ప్రతీ జంతువులోనూ ఉన్నాయి. ఈ నాలుగు చక్రములు మినహా మరే చక్రములు లేవు. మరి ఈ నాలుగు చక్రములు మన తలలోనే ఉన్నట్లు ఏమైనా చిన్న సూచన భగవద్గీతలో మీకు కనిపించిందా అంటే కనిపించలేదు. కానీ భగవద్గీతలో అక్షర పరబ్రహ్మయోగము అనే అధ్యాయములో దీనిని గురించి చెప్పటం జరిగింది. ఇన్ని లక్షల సంవత్సరముల తరువాత మీకు మరలా తెలియ జేయటం జరిగింది. కనుక అదే పద్ధతిలో ప్రతీ నెల ఒక క్రొత్త విషయం తెలుస్తూ ఉంది. మరి ఆ విధముగా తెలుస్తూ ఉంటే, శ్రద్ధ మనకు దానిపైన ఉండాలి. ఆ ధ్యాస, శ్రద్ధ లేకపోతే ఏమీ ప్రయోజనము లేదు.

నేను ఎప్పుడూ చెప్తుంటాను. ఇక్కడకు చాలా దూరప్రాంతముల నుండి జనులు వస్తున్నారు. కానీ ఇక్కడకు మీరు వస్తే ప్రపంచ సంబంధమైన కోరికలేవీ నెరవేరవు. ఇక్కడ తెలుసుకొన్న జ్ఞానముతో మీ బుర్రకు లాభం చేకూరుతుంది. నీ వెంట వచ్చేది జ్ఞానము, ఒక్కసారి జ్ఞానము మీ వద్దకు

www.thraithashakam.org

వస్తే పోయేది కాదు. అది చిరస్థాయిగా ఉండే ధనము. సరే ఈ విషయములతో పాటు ఒక క్రొత్త విషయమును అందజేస్తాను అదేమంటే **"భూతం-మహాభూతం".** ఇప్పుడు భూతం అనగానే దెయ్యం అనుకోకండి. భూతము అంటే వాస్తవముగా జీవుడు అని అర్థము. మనము జీవులం, జీవుడనే వాడు మనిషి శరీరములో ఉన్నాడు. మనిషి రూపంలో ఉన్నవాడే జీవుడా, అంటే కాదు జంతువుల రూపములో, చెట్లరూపంలో ఎన్నో రూపములలో కలరు. కనిపించే రూపములన్ని కంటికి కనిపించే ప్రపంచము. కంటికి కనిపించని ప్రపంచము కలదు. అదే సూక్ష్మ ప్రపంచము. దానినే రెండవ ప్రపంచము అని అందురు.

ఈ సమావేశములో మీరెంతమంది కూర్చున్నారు? అని ప్రశ్నిస్తే మీరు రెండువేల మంది కూర్చున్నాము అని కనిపించే వారి గురించే చెప్పుదురు. కానీ ఇక్కడ ఐదువేల మంది కూర్చున్నారని మేము చెప్పుచున్నాము. మరి కనిపించిన వారు ఎంతమందో, అంతకంటే ఎక్కువ కనిపించకుండా ఉన్నవారు ఇక్కడ ఉన్నారు. కానీ వారు మనకు తెలియరు. తెలియనంత మాత్రాన వారందరు లేరనటం పొరపాటు. ఈ మధ్య కర్నూల్‌లో ఒక సంఘన జరిగింది. ఒక శబ్ధము వచ్చింది గోడలు బీటలు బారాయి. దానిని కొందరు చూసి గ్యాస్ లీకయిందన్నారు. గ్యాస్‌లీకైతే ఆధారము ఉండాలి మంట మండుతుంది, తరువాత ప్రేలిపోతుంది. ఏమీ లేకుండానే శబ్దము రావటం, సామాన్లు వంకరవటం, గోడ చీలిపోవటం జరిగింది. వారికది అంతుపట్టలేదు. కాని దానికి సమాధానము మనము చెప్పగలము. మిగతావారు చెప్పలేరు ఎందుకంటే, వారికి కంటికి కనిపించే ప్రపంచము గురించే తెలుసుగానీ, కనిపించని సూక్ష్మ ప్రపంచము గూర్చి తెలియదు. కనిపించే దానికి ఆధారాన్ని మాత్రమే వెదకుదురుగానీ

www.thraithashakam.org

కనిపించని ప్రపంచం గురించి వెదకరు. వాటి ఆధారము కొరకు వెతికే అవకాశము కూడా లేదు.

భూతము అంటే జీవుడు అని అర్థము. అయితే ఆ జీవుడు ధరించిన శరీరము కనిపించేదైనా కావచ్చును, కనిపించనిదైనా కావచ్చును. అంటే ఒక జీవుడు పుట్టిన తరువాత మరణించేంతవరకు కనిపిస్తూ ఉండవచ్చు లేదా కనిపించకుండా ఉండవచ్చు. ఉదాహరణకు ఒక మనిషి పుడితే, వాడు ముప్ఫైయేళ్ళకు చనిపోతే, ఇంకా ఇరవై, ముప్ఫైయేళ్ళు కనిపించకుండా భూమిమీద ఉండవచ్చును. ఆ విధముగా కనిపించి జీవించే వాళ్ళు, కనిపించకుండా జీవించే వాళ్ళు రెండు రకములుగా ఉన్నారు. అకాలములో చనిపోయిన వారు కాలమరణం వచ్చేంతవరకు ఇంకొక జన్మకు వెళ్ళటానికి అవకాశమే లేదు. నీకు అకాలమరణం సంభవించెననుకో, నీ దేహం పోతుంది. అనగా శరీరములో పది భాగములు పోతాయి, 15 భాగములు మిగిలి ఉంటాయి. ఈ శరీరము మొత్తము 25 భాగములతో తయారయింది. ఇందులో 15 భాగములైన మనస్సు, చిత్తం, బుద్ధి, గుణములు ఆదిగాగల అన్నీ నీకు నీ దేహము ఉన్నప్పుడు కనిపించలేదు. శరీరము పోయిన తర్వాత అసలుకు కనిపించనివి. పైకి కనిపించేదే శరీరము, ఈ విధముగా కాలమరణం వచ్చినంతవరకు శరీరముతో కూడి 25 భాగములతోనైనా ఉండవచ్చు లేదా శరీరముతో కూడక 15 భాగములతోనైనా జీవులుండవచ్చు.

ఈ విధముగా వీటిని స్థూల శరీరము, సూక్ష్మ శరీరము అంటాము. అయితే ఈ జీవులు ఎన్ని రకములుగా ఉన్నారంటే, భగవద్గీతలో శ్రీ కృష్ణుడు "దైవ అసుర మేవచ" అన్నాడు. అనగా దేవతలు, రాక్షసులు అని విడదీసిన మనకు తెలియును. అనగా జీవరాసులు మంచిగా ఉండేవారు, చెడ్డగా

ఉండేవారు కూడా కలరు. కనిపించే వారిలో మంచివారు, చెడ్డవారున్నారు. వాస్తవమే కానీ కనిపించని వారిలో కూడా మంచివారు, చెడ్డవారున్నారు. మరి ఈ విషయం మనకి ఏ విధముగా తెలియును. గుడిలో ఒక ప్రతిమను (విగ్రహమును) మనము పూజిస్తున్నామంటే, ఆ ప్రతిమలో కూడా ఒక జీవుడు ఉండును. ఆ జీవుడు కూడా భగవద్గీతలో చెప్పిన లిస్టులోకే వచ్చును. వారు దేవతలుకావచ్చు, మనము మనుషులం కావచ్చు గానీ మొత్తము అందరము జీవరాసులక్రిందకే వచ్చెదము. కనుక గుడిలో ఉండే ప్రతిమలో ఉన్న జీవుడు కూడా భూతమే అనవచ్చును. ఈ కనిపించని వాటిలో దేవతలుండవచ్చు, దెయ్యాలుండచ్చు. దెయ్యాలు ఒకరిమీద పూనకము వచ్చి మాట్లాడుతుంటాయి. అదే విధముగా దేవతలు కూడా ఇంకొక శరీరముపై పూని మాట్లాడుదురు. ఇప్పుడు దెయ్యాలు అంటే కొందరికి నమ్మకం లేదు. మేము సైన్స్ చదువుకున్నాము.

ఈ నవీన కాలంలో రాతియుగపు మాటలేమిటి? అంటున్నారు. రాతి యుగములోనే కాదు, నవీన కాలములో కూడా దాని గురించి ఎవ్వరికీ తెలియలేదు. రాతియుగములో దెయ్యం అంటే నమ్మకముండేది కానీ దాని వివరము పూర్తిగా వారికి కూడా తెలియలేదు. సైన్స్ అభివృద్ధి చెందిన కాలంలో దెయ్యాలున్నాయనటం ఘోరంకాక ఇంకేమి అంటున్నారు. దెయ్యాలు అనే విషయం అర్థము కాకపోతే ఘోరమే. **"దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు"** అనే గ్రంథమును వ్రాశాము. అందులో 20 పేజీలు ప్రశ్నలు అడుగుతూ వచ్చాము. అందులో మీ శాస్త్రజ్ఞులకు ఎంత జ్ఞానము ఉంది అంటే, మీ తెలివి అంత నాలుగు శాస్త్రములపైనే ఉంది అని చెప్పాము. ఈ నాలుగు శాస్త్రములు "గణిత, ఖగోళ, రసాయన, భౌతిక" ములు మినహా జ్ఞానము మీకెవ్వరికీ లేదని చెప్పాము. మిగతా

రెండు శాస్త్రముల "జ్యోతిష్య, బ్రహ్మవిద్యాశాస్త్రముల జ్ఞానము అసలుకే మీకు తెలియదు. కనుక అది లేదు, ఇదిలేదు అంటున్నారు. మీకు అర్థము కాలేదు కనుక మూఢనమ్మకము అంటున్నారు. మేము సైన్స్ ప్రకారమే అడుగుచున్నాము. ఇన్ని కోట్ల లక్షల టన్నుల మంచు ఏ విధముగా పైన ఉన్నది? ఏ విధముగా క్రింద పడింది. ఐస్‌బండలు పడుచున్నాయి, ఎవరు మోశారు వాటిని? పైన అంతవరకు కొన్ని నీళ్ళు ఐస్‌క్యూబ్‌గా మారాలంటే, ఫ్రిడ్జ్‌లో పెట్టాలి. మరి అంతపెద్ద ఐస్‌బండలు తయారవాలంటే ఎంత పెద్ద ఫ్రిడ్జ్ ఉండి ఉండవలెను. వర్షములలో చేపలు, కప్పలు కూడా పడుచున్నాయి. వర్షంతోపాటు ఎర్రమన్ను పడిందట పేపర్లో వచ్చింది, కట్‌చేసి పెట్టాము. మరి ఎర్రమన్నుతో బురదవర్షం ఏ విధంగా పడింది. వీటన్నిటికీ జవాబులున్నాయి. సైన్స్ అనేవారు ఎవ్వరూ సమాధానము చెప్పలేరు వీటికి. సమాధానము చెప్పలేక రాతియుగపునాటి మనుషుల్లాగ ఈ నవీన కాలంలో మీరున్నారని మేమంటున్నాము. ఒక ప్రాంతంలో రాళ్ళు వచ్చి పడుచున్నాయట. ఆ ప్రాంతంలో లేని ఒక రకమైన రాళ్ళు వచ్చి పడుచున్నాయి. అంతేకాకుండా, పెంకుల్లాంటివి పడుచున్నాయి. దానికి కూడా సమాధానము ఉంది.

ఒక సూత్రము ప్రకారము జవాబు చెప్పవచ్చు. ఈ మధ్య సాయిబాబా ఫోటోలనుండి విభూది రాలుతూ ఉంది. రాలుతుంది వాస్తవమే! రాళ్ళే వచ్చి పడుచున్నప్పుడు విభూది పడడం ఎంత పని! కొందరు రాళు ్ళ వచ్చి పడేటట్లు చేస్తూ ఉంటే, మరికొందరు విభూది పడేటట్లు చేస్తున్నారు. రాళ్ళు వస్తే మహత్యం కాదుగానీ, విభూది పడితే మాత్రము అది పెద్ద మహత్యం అగును. ఈ విధముగా ఏ రాయి దొరక్కపోతే పెంకు పెడితే, ఆ పెంకే ఇంకో దగ్గరకు వచ్చి పడుతుంది. లేదు బూడిద పెడితే ఇంకో

దగ్గర విభూది పడుచున్నది. ఈ విధముగా మాట్లాడితే నాస్తికులని మమ్మల్ని అనవచ్చును. కనుక మేము చెప్పేది ఏమంటే, జ్ఞానము వేరు మహత్యం వేరు. మహత్యాలు మనిషిని నమ్మించుటకు పనికి వస్తాయి, తద్వారా ప్రపంచ లాభాలు పొందవచ్చునుగానీ పరమాత్మ జ్ఞానాన్ని పొందలేరు. వీటన్నింటినీ మూఢనమ్మకాలంటారు కొందరు. కానీ మేమేమంటామంటే ఇది "సూపర్‌సైన్స్" అంటాము.

మీరు చెప్పేది సైన్స్ కానీ నేను చెప్పేది దానికంటే పెద్దదైన సూపర్‌సైన్స్. ఆ విధంగా ఏదైనా జీవరాసే, దానినే బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము దానిని భూతము అన్నారు. "ద్వౌభూతసర్గౌ లోకేస్మిన్" భూతము అనే పదము భగవద్గీతలో చాలాచోట్ల వాడబడింది. ఆ విధముగా జీవరాసినే భూతము అన్నారుగానీ మరియొక అర్థములో కాదు. ఈ విధముగా మనుషులు కావచ్చు, మీ వెనకున్న దయ్యాలు కావచ్చు, వాటి వెనకున్న దేవతలు కావచ్చు, ఏవైనా అవన్నీ భూతములే అన్నీ జీవరాసులే. శాస్త్రబద్ధముగా చెప్పవలెనన్న ఈ విధముగానే చెప్పవలసి వచ్చును. దీనిని మేమేమీ క్రొత్తగా సృష్టించి చెప్పటం లేదు. భగవద్గీతలో చెప్పినదే. సరే ఇవన్నీ భూతములయితే, మహాభూతములేవి అని ప్రశ్నవచ్చును. ఇప్పుడు మనిషిని భూతమన్నాము. మనిషి చనిపోయి కనిపించకుండా ఉంటే వాడిని (దెయ్యాన్ని) భూతమే అంటున్నాము. గుడిలో ప్రతిమ ఉన్నదనుకుందాము, ఆంజనేయస్వామి ఉన్నాడనుకుందాము. ఈ విధంగా రకరకాల దేవతలున్నారు, వారిని కూడా మనము జీవుడే అంటున్నాము. దీనిప్రకారము మనిషిగా ఉండేది, ఉండేవాడు జీవుడే, దెయ్యమూ జీవుడే, గుడిలో ప్రతిమ జీవుడే. ఈ విధముగా ఇంకొక విధముగా చెప్పాలంటే, దెయ్యమును గ్రహం అంటున్నాము. గుడిలో ఉండే ప్రతిమను విగ్రహము అంటున్నాము.

www.thraithashakam.org

గ్రహము అంటే గ్రహించుకొనేది, గ్రహించబడే వాడు, గ్రహించుకొనేవాడు ఎవరైనా గ్రహమే. కనుక నీవు కూడా బ్రతికుండి గ్రహించుకుంటున్నావు కనుక నీవు గ్రహానివే. చనిపోయిన తరువాత కూడా నీవు గ్రహానివే. బ్రతికున్నప్పుడూ గ్రహానివే. ఎవరో చెప్పుచుంటే విన్నాను అల్లుడు పదవ గ్రహమని, అంటే తొమ్మిది గ్రహములున్నవి వారు పీడించేకంటే, ఎక్కువ పీడిస్తాడని అల్లుడిని పదవ గ్రహమన్నారంట. వాడు పదవని, పదవకొండ వని అనేవాడు, అనిపించుకునే వాడు అందరూ గ్రహములే. మన మందరమూ బ్రతికున్నా గ్రహములమే, చనిపోయినా గ్రహాలమే. కానీ గుడుల్లో ఉండేవారు మనకంటే శక్తిగలవారు కనుక వారిని విగ్రహములు అంటున్నాము.

వాడు బలహీనుడు, వీడు బలవంతుడు అని అంటున్నట్టు వీరిని గ్రహములనీ, వారిని విగ్రహములనీ అంటున్నాము. అనగా గ్రహములో విశేషము కలిగినవని కనుక విగ్రహము అంటున్నాము. విగ్రహము కూడా ఒక జీవుడే ఇప్పుడు. మహాభూతము గురించి చెప్పుకుంటే, గొప్ప జీవరాసి అని అర్థము వచ్చును. అయితే ఈ గొప్ప జీవరాసి ఏది. ఇంతకముందే చెప్పాము. నీవు మనిషివి, నీకు రెండు చేతులుంటాయి. సూక్ష్మమైన దెయ్యానికి కూడా రెండే చేతులుంటాయి. కానీ ఒక జీవునికి మాత్రము లెక్కలేనన్ని చేతులున్నాయి. ఇన్నే ఉన్నాయని చెప్పలేము లక్ష ఉండచ్చు, రెండు లక్షలుండచ్చు అని చెప్పాము. ప్రభుత్వం అంటే పాలించేది అని అర్థము. ప్రభువు వద్ద పని చేసేవారు చాలామంది ఉంటారు కదా! వారిని పరివారం అంటారు. మొత్తము ప్రభువు, పరిపాలకులను కలిపి ప్రభుత్వం అంటాము. అనగా మనల్ని బాహ్యంగా పరిపాలించేందుకు గవర్నమెంట్ ఉన్నట్లు, అందులో వివిధ శాఖలు ఉన్నట్లు, అదే విధంగా దేవుని ప్రభుత్వంలో

కూడా ఎన్నో శాఖలున్నాయి వారందరూ ప్రపంచమునంతటినీ పరిపాలిస్తున్నారు. ఏ విధముగా అనగా నిన్ను, నీ వెనుకుండే దెయ్యాలను, గుడుల్లోవుండే దేవతలను అందర్నీ పరిపాలిస్తున్నారు. మహా జీవరాసులు, అనగా జీవరాసులను పరిపాలించువారు మహా జీవరాసులు. భూతములను పరిపాలించువారు మహాభూతములు. ఈ మహాభూతములు ఏ విధంగా ఉన్నారంటే, కొన్ని వేల టన్నుల ఐస్‌ను క్రిందకు వేయగలరు. వరదల్లో మొత్తము అందరినీ ముంచెత్తగలరు, భూకంపమును సృష్టించి మిమ్మలందరినీ పడద్రోయగలరు.

ఇండోనేషియాలో ఒక దగ్గర చూస్తుండగానే ఒక భవనము కూలిపోయింది. అదే ఇంకొక ప్రదేశములో ఆరు అంతస్థుల హోటల్ ఒకటి పునాదులతో సహా కూలిపోయింది. మరి అంతబలము ఉండటం, మహాభూతాలనే వారికే సాధ్యం. అదే విధంగా 2006వ సంవత్సరము అనుకుంటాను. మేము ప్రొజెక్టర్ ఒకటి పెట్టి "దేవీపుత్రుడు" అనే సినిమాలో కొన్ని సన్నివేశాలు తెరపై చూపించాము. అందులో సముద్రములో ఏదో శక్తి ఉంది. అది బయటకు తీస్తే ప్రమాదం. దేశాలన్నీ నాశనమవుతాయి అని ఎవరో పరిశోధన చేసినట్లు చూపించారు. బయటకు వస్తే అన్నీ మునిగిపోయి గందరగోళం అవుతుందని కూడా చూపించారు. దానిని రాత్రి చూశారు. మరనాడు డిసెంబర్ 25, మరి ఆ విధముగా జరగటం కాకతాళీయమో, యాధృచ్ఛికమో తెలియదు గానీ మరునాడే సునామీ వచ్చింది. అందులో చూచిన సన్నివేశాలన్నీ నిజమై అందరినీ, అన్నింటినీ ముంచివేశాయి. ఈ మధ్య కర్నూల్‌లో వరద లొచ్చాయి, వరద తగ్గింది. అంత బురద ఏ విధంగా వచ్చిందో తెలియదు గానీ ఎన్ని ట్రాక్టర్లతో తీసుకెళ్ళినా, బురద ఆ వరదొచ్చిన ప్రాంతమంతా తగ్గలేదు. కొన్ని లక్షల

టన్నుల బురద పేరుకుపోయింది. కానీ ఆ బురదలో ధ్వజ స్తంభము కూడా మూసుకుపోయిందంటే అంత బురద ఏ విధముగా వచ్చిందో అర్థము చేసుకోండి. అదే విధముగా ఈ మధ్య టీవీ9 లో ఒక సన్నివేశము చూపించారు. అందులో ఎన్ని దేవాలయాలు ఈ వరదల్లో పాడైపోయాయో చూపిస్తున్నారు. అందులో ఒక ఆంజనేయస్వామి విగ్రహం ఒకటి క్రిందపడిపోయింది. గుడిలో ఉన్న ఆంజనేయస్వామి పరిస్థితి ఇది అని అందులో చూపిస్తున్నారు. అదే విధంగా మొన్న ఎవరో చెప్పారు. షిరిడిసాయి పాలరాతి విగ్రహం ఒకటుంది, ఆ విగ్రహము తల వరదలో కొట్టుకుపోయింది అంటే షిరిడిసాయి మనకు గొప్ప కావచ్చు, కానీ మహాభూతాలకు అవేవీ లెక్కలోకి రావు. వాటి పరిపాలనలో ఒక భాగమది.

నిన్ను, నీవెనుక ఉండే దెయ్యాన్ని అదే విధంగా గుడులలో విగ్రహములలో ఉన్నవారిని సైతం వాటి కర్మానుసారంగా ఇబ్బంది పెట్టును ఎందుకంటే విగ్రహములలో ఉండేవి కూడా జీవులే కనుక. ఆ మహాభూతాలు సామూహికంగా హింసించేవి కూడా ఉన్నవి. సునామీలు, భూకంపాలు, సామూహికంగా శిక్షను, కర్మానుసారముగా మనము అనుభవించేవి కావా? ఈ మహాభూతములన్నీ దేవుని పరిపాలనలో కలరు. ఇటువంటి శిక్షలేకాక మనందరి కర్మానుసారము సుఖములు కూడా అందించబడుచున్నవి. ఈ సుఖాలు పెద్దగా లెక్కించనక్కరలేదుగానీ, నువ్వు కష్టాలు ఎందుకు వస్తున్నాయో, తెలుసుకుంటేనే పాపభీతి కలుగుతుంది. లేకపోతే ఏముందిలే, ఎవరు చూస్తారులే అని అందురు. కనుకనే మానవుడు పాపం చేయుటకు వెనుకాడుట లేదు. ఎందుకంటే ఆ సమయంలో డబ్బు కనిపిస్తున్నది కానీ దానివలన వచ్చే పాపము మాత్రము కనిపించటం లేదు. కానీ ఆ పాపాన్ని మూటకట్టుకుంటున్నావు. అది నీకు కనిపించటం

లేదు. కనుక ఎంతటి పాపాన్నైనా మానవుడు చేయుటకు వెనుకాడటం లేదు. అలాంటి పాపాన్ని చేయకుండా ఉండాలంటే, మన వెనుక శిక్షవేసే వాడు ఒకడున్నాడు, దేవుడు మరియు దేవుని పరిపాలన ఉందని తెలియాలి. మరి ఆ రోజు శిక్ష పడినప్పుడు దేవునికి కనికరం లేదంటారు. మరి కనికరం ఎందుకుంటుంది? పెద్దవారిమి మేము ఎలాగో బాధపడతాంగానీ పిల్లలు వారెట్లు ఈ కష్టాలు పడతారు? ఈ ప్రమాదాల్లో, వరదల్లో మొదలగు సందర్భములలో అని కొందరు పెద్దలు అంటుంటారు. కానీ దేవునికి వీటితో ఎటువంటి సంబంధము లేదు. ఆయన దగ్గరున్న పరివారం వేస్తున్నారు ఆ శిక్షలన్నింటినీ, వారికి దయాదాక్షిణ్యములుండవు.

ఈ మధ్య వరదలొచ్చినప్పుడు ఆ నీటిలో ముందుకు వెళ్ళి, షిరిడీసాయి విగ్రహమును అదియునూ నీటిలోనే ఉందనుకోండి, అనగా గుడి మునిగిపోయింది. ఆ వ్యక్తి విగ్రహం ముందు నిలబడి, స్వామీ, బాబా నన్ను ఎలాగైనా ఈ వరద నుండి, ప్రవాహమునుండి నన్ను రక్షించమని అడుగుతుండగానే ప్రవాహం ఆ బాబానే (విగ్రహాన్నే) ఎత్తుకుని పోయిందట. అంటే మనకు బాబాగారు గొప్పకావచ్చు గానీ వాటికి (మహాభూతాలకు) లెక్కలేదు. నీవు చేసిన తప్పుకు మాత్రమే శిక్ష వారు వేయుచున్నారు. విగ్రహములలో ఉన్న జీవులు కూడా తప్పు చేస్తారు కావున, వారికీ శిక్షలు అనుభవించటం తప్పదు. కనుక దేవతలుగా ఉన్నవారిని సైతం పాలించేవారు మహాభూతములు. అయితే నేనేం తప్పుచేశాను అంటే, నీవేమి తప్పు చేశావో నీకు గుర్తుకు ఉండదు గానీ, పాలకులు వాటిని మాత్రము నమోదు చేయుదురు. నువ్వు ఎప్పుడు తప్పు చేశావో గుర్తు ఉంటే కదా! ఈ శిక్ష అందుకు పడింది అని తెలియటానికి. కనుక మనము ఇప్పుడు ఏమి చేయాలాంటే తప్పులు చేయకుండా మసలుకోవాలి.

చాలాకాలం క్రితం మేము ఒక వాక్యాన్ని వ్రాశాము. **"నీ ఉద్యోగంగానీ, నీ హోదాగానీ, నీ అధికారము గానీ, నీ పలుకుబడిగానీ, నీ ధనము నిన్ను రక్షించలేదు. నీ శరీరము కూడా నీ మాట వినని రోజుంది, జాగ్రత్త!"** నీ అంతట నీవు నీ చేతితో అన్నాన్ని తినలేని పరిస్థితి వస్తుంది. నీ హోదా, నీ ఉద్యోగము, నీ అధికారము, ఇంత బలముంది అంత ధనముంది అని మనిషి అనుకోవటం సహజమే కదా! ఇవన్నీ పనికి రావు. అటువంటి రోజొస్తుంది జాగ్రత్త!

ఇంకొక విషయమేమంటే 'కలియుగాంతం 2012' అని ఒక సినిమా తీశారు. ఆ సినిమా తీయని ఆరునెలల కాలము ముందునుండి ఈ యుగాంతం గూర్చి ఎందరో మాట్లాడినారు. ఇంకొందరు 2012 డిసెంబర్ 21వ తేదీ అని కూడా అన్నారు. మరి డిసెంబర్ ఏమిటి, 21వ తేదీ ఏ విధంగా చెప్పారో వారికే తెలియదు. అసలుకు 2012 ఏమిటో తెలియదు. జ్యోతిష్యశాస్త్రము ప్రకారమైతే చెప్పవచ్చు. జ్యోతిష్యశాస్త్రములో పూర్తి పరిశోధన లేదు. మరి జ్యోతిష్య శాస్త్రమును అసలైన రీతిలో ఎవరో ఒకరు చెప్పాల్సిందే. కనుక మేము దానిని గూర్చి వ్రాయటం జరిగింది. ఇప్పుడున్న జ్యోతిష్యశాస్త్రంకంటే అనేక రెట్లు పెద్దది. దానిని 80 పేజీలు వ్రాసి ఆపాము. తర్వాత అది వ్రాయబడుతుంది. అది కొన్ని వందల పేజీల వరకు ఉండవచ్చు. దీనిని ప్రతి ఒక్కరు సులువుగా తెలుసుకోవచ్చు. ఐదవ తరగతి చదువుచున్న విద్యార్థులు కూడా జ్యోతిష్యశాస్త్రమును సులువుగా తెలుసుకోవచ్చు. ఆ గ్రంథాన్ని చదివితే ఇంతవరకు ఎవ్వరికీ తెలియని పద్ధతులను వివరించి వ్రాశాము. మీ అందరూ గ్రహములు తొమ్మిది అనుకుంటున్నారు. కానీ గ్రహములు పన్నెండు అని మేము చెప్పుచున్నాము. అసలు జ్యోతిష్యం అంటే ఏమిటో తెలియని వారంతా యుగాంతం

www.thraithashakam.org

అయిపోతున్నది అని అంటున్నారు. మరి మీరు జ్యోతిష్య శాస్త్రం అంతా క్షుణ్ణంగా తెలిసినప్పుడు ఎందుకు మీరు ఈ ప్రశ్నకు జవాబు చెప్పలేక పోవుచున్నారు. యుగాంతం అయిపోదు అని మీకు తెలియదు కనుక మీరంతా ఏదో చెప్పుచున్నారు. యుగాంతం అవదు అని మాకు తెలుసు కావున ఏమీ చెప్పటం లేదు. కలియుగము యొక్క కాలవ్యవధి 4,32,000 సంవత్సరములు అయితే 5,116 సంవత్సరములు ఇప్పుడు పూర్తి అయినది. ఇప్పుడు 4 లక్షలు ప్రక్కకు పెట్టు, 32,000లోనే 5110 సంవత్సరములైతే ఇంకెంత కాలము ఉంది, చాలా ఉన్నది. మరి అంతవేగిరం డిసెంబర్ 2012, యుగాంతము ఏ విధముగా అవుతుంది, కనుక అది జరగని పని. కొందరు ఏమి చేస్తారంటే వారికి గుర్తింపు రావాలంటే అటువంటి ప్రచారములు చేస్తుంటారు.

ఉదాహరణకు ఒక ప్రాంతమునకు ఒక ఎస్.ఐ వచ్చాడనుకో అతనికి గుర్తింపు రావాలని, ఆ సైకిల్‌వాడిని కొట్టి, ఆటోవాడ్ని కొట్టి ఒరేయ్! ఆ అంగడిని అటు మార్చు అని చాలా హంగామా చేస్తాడు, ఒక నెల రోజులు. తద్వారా ఎస్.ఐ చాలా గట్టివాడు అని అందరూ అంటారు. గుర్తింపు వచ్చిన తరువాత అణిగి పోతాడు. అదే విధముగా స్వామీజీలు ఏమి చేస్తారంటే ఇటువంటివి ఏదో చెప్తుంటారు. 1994లో ఒక మెజిస్ట్రేట్ ఉండేవాడు శాంతరాం నాయుడని అతని పేరు. అతనికి నాతో పరిచయం మూలంగా వారింట్లో నేను అతనితో మాట్లాడుతున్నప్పుడు, నేను ఢిల్లీనుండి వచ్చితినని, గన్‌లైసెన్స్ తీసుకున్నానని అతనితో చెప్పాను. అందుకు ఆయన ఎందుకు స్వామీ, 1994లో యుగాంతము అన్నారు, మరి గన్ దేనికి? ఈ లైసెన్స్ దేనికి? అని ఆయన నాతో అన్నారు. ఇదేమి! ఈ విధముగా అంటున్నారంటే, 1994నకు అంతా అయిపోతుందట, మా బ్రహ్మకుమారీ

సమాజము వారు చెప్పుచున్నారు. "సరేలే! నీ నమ్మకం నీది, నా నమ్మకం నాది. నాకవసరము, నేను గన్‌లైసెన్స్ పెట్టుకున్నాను. ఉంటే ఉన్నది లేకపోతే నాతో పాటు అదీ పోతుంది" అని చెప్పాను.

తరువాత 1994 అయిపోయింది 1995 వచ్చింది. ఒకరోజు ఆయనను అడిగాను "ఏమైంది! 1994లో అంతా పోతుందంటివే! ఏదీ పోలేదే!" అని అన్నాను. పోలేదు, ఎందుకు పోలేదో నాకేం అర్థము కాలేదు. నీకే కాదు నాకూ అర్థము కాలేదు అని ఆ రోజు ఆయనతో నేను చెప్పాను. అంటే 1994 బ్రహ్మకుమారి సమాజం వారు అప్పుడప్పుడే పుంజు కుంటున్నారు. ఆ సమయంలో గుర్తింపునకు ఏదో చెయ్యాలి కనుక యుగాంతం అనే మాటను పైకి తెచ్చారు. ఇది ఈ విధంగా ఉంటే ఒక వ్యక్తి వేదవ్యాస్ ఐ.ఎ.యస్ (కలెక్టర్) "1999 కలియుగాంతము" అని పుస్తకము వ్రాశాడు. ఎక్కడెక్కడో ఆధారాలను సేకరించి పుస్తకం వ్రాశాడు. ఆయన పద్ధతిలో ఆయన చెప్పాడు. కానీ యుగాంతము అవుతుందా? అని ప్రశ్నిస్తే ఎందుకు, ఏ విధంగా పోతుంది, చాలా సంవత్సరముల గడువుంది. మన వెనకాల మహాభూతములున్నవి అవి చెప్తే మనము పోతాము గానీ వీరందరూ చెప్తే మనమెందుకు పోతాము? వారు (మహాభూతములు) ఎప్పుడు యుగాంతము చేస్తారు మరి అంటే దేవుడు చెప్పినాడు వారికి కలియుగము ఆయుష్షు 4,32,000 సంవత్సరములని. అది పూర్తవకుండా ఎందుకు చేస్తారు వారు ఆ పనిని. గవర్నమెంట్ ఉద్యోగి, గవర్నమెంట్‌కు విరుద్ధంగా పని చేయకూడదు కదా! అదే విధముగా దేవుని పరిపాలకులకు దేవుడు చెప్పిన దానికి విరుద్ధంగా ఎందుకు చేస్తారు? చేయరు.

**దేవుడు రూప, నామ, క్రియారహితుడు.** కానీ మహాభూతములతో నడిపిస్తుంటాడు. అవి భూమంతటినీ ఒక్కసారి పెకలించి, ప్రక్కకు ట్రాక్టర్లు పొలమును దున్ని క్రిందమట్టి పైకి వచ్చినట్లుగా చేయగలరు. ఆ విధముగా లోపలున్న మట్టింతా పైకి వస్తుంది. మనమంతా క్రిందకు పోతాము ఇదంతా ఎప్పుడు చేస్తారు? కలియుగము అంతా అయిపోయిన తరువాత చేస్తారు, అప్పుడైనా అంతం అవుతుందని గ్యారంటీ ఉందా అంటే, లేదు ఎందుకంటే ప్రపంచ ఆయుష్షు ఎన్ని కోట్ల సంవత్సరములు, 108 కోట్ల సంవత్సరములు. ఈ విషయము అందరికీ జ్ఞాపకము ఉండేందుకుగాను జపమాలలో 108 పూసలను అమర్చారు. ఇది అన్ని మతములలోను కలదు. ఒక స్వామిని మీరెందుకు ఈ విధముగా పెట్టుకుంటున్నారని అడగగా పెద్దలు పెట్టారు, మనము పెట్టుకున్నాము అంటున్నాడు. పెద్దలు ఎందుకు పెట్టారు? సనాతన ధర్మము అది 108 పూసలుండటం. జపమాలలో 108 పూసలైనా ఉండాలి, లేదంటే 54 పూసలుండాలి, వీటిని రెండుమార్లు త్రిప్పితే 108 అగును. దీనిప్రకారము ప్రపంచ ఆయష్షు 108 కోట్ల సంవత్సరములని తేలినది కదా! కృతయుగము, ద్వాపరయుగము, త్రేతాయుగము, కలియుగము. ఈ నాలుగు యుగాలు అయిపోతే ఏమవుతుంది! మరలా కృతయుగము మొదలవుతుంది. ఆదివారము నుండి శనివారము లెక్కిస్తే మరలా ఆదివారము వచ్చినట్లు ప్రపంచం ఆయుష్షు 108 కోట్ల సం॥లు గడవాలంటే నాలుగు యుగాలు పూర్తి కావాలంటే 250 మార్లు పునరావృతం కావాలి. అంటే 1000 యుగాలు జరగాలి అంటే 250 సార్లు ఈ నాలుగు యుగాలు పూర్తి కావాలి. ఇప్పటికి ఎన్నిసార్లు అయ్యాయో తెలీదు. ఒకరు 17 టర్న్లు అయ్యాయి అంటున్నారు కానీ ఖచ్చితంగా చెప్పలేక పోవుచున్నారు. భూగర్భ శాస్త్రజ్ఞుల లెక్కప్రకారము

ఏదైనా భూమిమీద ఉన్న వస్తువులకు వారు వాటి ఆయుష్షును చెప్పగలరు గానీ అంత అనగా 17 టర్న్‌లు జరిగినంత ఆయుష్షు కల్గిన వస్తు తేదీ ఇంతవరకు కనుక్కొనబడలేదు. మేము చెప్పేదేమంటే ఇప్పుడే మొదలైంది. అనగా కృతయుగముతో మొదలయింది. ఇప్పుడు నాల్గవదైన కలియుగము నడుస్తున్నది. దీని తరువాత మరలా కృతయుగము మొదలవుతుంది. ఇప్పుడు ఇది అయిపోతే ఇంకా ఈ విధంగా జరగాల్సినవి 249 సార్లు ఉన్నాయి. ఇంత ఉంటే, ఇంకెప్పుడు అంతము జరిగిపోతుంది. ఈలోగా నువ్వు ఎన్నిమార్లు పుట్టాలో, ఎన్నిమార్లు చావాలో తెలియదు కానీ ఈ ప్రపంచ మాత్రము పోదు. కృతయుగము నుండి భూమి ఉంది. గడచిన ఇన్ని లక్షల సంవత్సరముల ముందు భూమి ఉంది. కానీ ఇప్పుడు జరుగబోయే కాలంలో కూడా ఉంటుంది.

సినిమాలో చూపినట్లు అంతా పోతుందనో అనుకుంటే, ఆ విధంగా జరుగుటకు అవకాశము లేదు. లేదు యుగము అయిపోతుంది అనుకుంటే, యుగము ఒక్కొక్కటి అయిపోవచ్చు గానీ ప్రపంచ ఆయుష్షు 108 కోట్ల సంవత్సరములు అయినంతవరకు భూమి ఉండాల్సిందే! 4,32,000 సంవత్సరములు కలియుగము కాలవ్యవధి అనుకుంటే, ద్వాపరయుగం కలియుగానికి రెండింతలు ఉంటుంది. కలియుగమునకు మూడురెట్లు త్రేతాయుగమునకు కాలవ్యవధి ఉండును. కలియుగమునకు నాలుగు రెట్లు కాలము కృతయుగమునకు కలదు. కాని పై మూడు యుగములలో దైవజ్ఞానము కొంత ఉండేది. కలియుగము వచ్చినప్పటికీ ఆ దైవజ్ఞానము పూర్తిగా లేకుండా పోయింది. ప్రపంచ జ్ఞానము పూర్తిగా అంటుకున్నది. దేవుని జ్ఞానము అని పేర్లు చెప్పి, ప్రపంచ జ్ఞానము గురించి చెప్పేవారుంటారు. అదేమనగా మహత్యాలు ఉంటాయి. డబ్బులు మ్రొక్కు

బడులతో సంపాదించే విధానాలు అన్ని చెప్తూ ఉంటారు. అట్లాంటివారంతా స్వామీజీలను పెద్దగా లెక్కించి పూజిస్తూ ఉంటారు. కానీ దేవుడు ఏ మనిషినీ మ్రొక్కమని చెప్పలేదు. అందుకే మేము ఒక బోర్డు పెట్టాము. **"మనిషినైన నాకు మీరు మ్రొక్కవద్దు, నా చిత్రపటమునకు పూలమాలలు వెయ్యవద్దు"** అని అందులో వ్రాయబడింది. వేస్తే పూలమాలలు దేవునికి వెయ్యండి, మ్రొక్కితే దేవునికి మ్రొక్కండి. అందరిని పుట్టించినవాడు దేవుడు, కావున దేవునికే మ్రొక్కండి. అంతేగానీ మనుషులు మనుషులతో మ్రొక్కించుకోవటం మంచిది కాదు. దేవునికంటే మనము పెద్దవారమని మ్రొక్కించుకుంటున్నారు. మనమంతా మనుషులమే, మనల్ని పాలించే మహాభూతములున్నాయి, మనము ఏ తప్పు చేసినా లెక్కపెట్టి మరీ శిక్షిస్తారు.

## 26. ప్రభు - ప్రజ

తేది : 27-12-2009

ప్రభు, ప్రజ అనే పదములను గూర్చి తెలుసుకుంటే, ఏమి తెలియు చున్నదనగా, ప్రజలను పరిపాలించువాడు ప్రభువు అగును. అదే విధముగా ఇంకొక పదము సిద్ధి, ప్రసిద్ధి అనగా 'సిద్ధి' అనే పదము ముందర 'ప్ర' ను చేర్చితిమి. అలాగే వక్త ముందు 'ప్ర' చేర్చిన ప్రవక్త అగును. అనగా 'ప్ర' అనగా గొప్పనైనది, ఉన్నతమైనది అనే అర్థము ఇచ్చుచున్నది. అదే విధముగా 'పంచము' అని ఉన్నది అనగా ఐదు అని అర్థము. దీనిముందు 'ప్ర' చేర్చిన ప్రపంచము అగును. అనగా ఐదు చాలా గొప్పవి అని అర్థము వచ్చుచున్నది. అదే విధముగా ప్రభు, ప్రబోధ ఇప్పుడు ఈ పదముల వలన మనకు అర్థమైనది ఏమనగా! 'ప్ర' అనే దానిని చేర్చిన విశేషము కలది అన్న విషయమునకు వాడబడుచున్నది అని తెలుస్తున్నది.

www.thraithashakam.org

'జ' అనగా పుట్టుట అని అర్థము. ప్రజలు అనగా విశేషము కలిగి పుట్టినటువంటివారు. మరి మనమందరము 'ప్రజ' లుగా ఉన్నామా అంటే, ఒట్టి 'జ'లుగా మాత్రమే ఉన్నాము. మరి మనము ప్రజలుగా మారవలెనన్న మన జన్మకు సార్థకత చేర్చుకొనవలెను. అప్పుడు మనం ఆ పదమునకు న్యాయం చేకూర్చినవారమగుదుము. అదే విధముగా 'ప్రభు' అనగా ఏమి అని అంటే, ప్రభు అనగా 'పుట్టినటువంటిది', 'భు' అనగా పుట్టనటువంటిది, స్వయంగా ఉండునది. జీవరాసులన్నీ పుట్టి ఉన్నవి కనుక 'జ' అన్నాము. అదే విధముగా 'భు' అనే పదముకు ప్రత్యేకతను చేకూర్చుతూ 'ప్రభు' అంటున్నాము. 'ప్రజ'కు బీజదాత కలదుగానీ 'ప్రభు'కు బీజదాత లేదు. అయితే ఈ ప్రభు–ప్రజలో ఎవరు ఎక్కువ, ఎవరు తక్కువ అని తెలిపేందుకు ఒక గుర్తు పెట్టెను. అది ఏమనగా! 'జ'ను భరించేది 'భు' దేవుడు జీవరాసులను భరిస్తున్నాడు. జీవరాసులు దేవున్ని భరించలేదు. అటువంటి పద్ధతి తెలియవలెనన్న దేవుడు మన శరీరములోనే ఒక పేరు పెట్టి, గుర్తు పెట్టెను. మనము దేనినైనా మోయుచున్నామనుకోండి మనమేమంటాము. 'భుజ స్కందములపై' అని అంటాము. అందుకే 'జభు' అని అనడము లేదు, 'భుజ' అనే మనము అంటున్నాము. అనగా పుట్టించినవాడు, పుట్టినవాడిని మోయుచున్నాడు లేక ఆధారముగా ఉన్నాడు. కానీ నేనే నా భుజములతో మోయుచున్నాను అంటారు. అది వాస్తవము కాదు. 'జ'కు ముందు 'భు' అనేది ఉందని తెలియక, 'భుజ' అనే పేరు తెలుసునుకానీ దాని అర్థము మాత్రము ఎవరూ చెప్పలేదు. ఎందుకంటే వారికి తెలియదు.

ఈ పదమునకు అర్థము మన పూర్వపు పెద్దలకు తెలుసు కనుకనే ఈ పేరును పెట్టినారు. మన శరీరములో ఎన్ని భాగములున్ననూ,

www.thraithashakam.org

జ్ఞానార్థముతో ఉన్నటువంటి అవయవం భుజమే. ఏదైనా నీవు పని చేశావు అంటే, ఏదైనా నీవు మోశావు అంటే, ఏ కార్యమైనా నీ చేత జరిగింది అంటే, వెనుక, నీకు ఒకడు కలడు అనే అర్థముతో 'భుజ' అనునది కలదు. నీవేమి చేయలేదు. నేను నా భార్యతో కాపురం చేయుచున్నాను అనుకుంటే, ఆ కాపురాన్ని చేయించేవాడు ఒకడున్నాడు, 'భు' అనే వాడున్నాడు. కానీ నీవేమీ చేయలేదు. కేవలము బొమ్మవే కనుక వెనుక ప్రతీ పనిని చేయించు వాడు ఒకడున్నాడని గుర్తు పెట్టుకొనుట కొరకు మన పెద్దలు **'భుజ'** అని పెట్టినారు.

అదే విధముగా "ఆత్మకు వెంట్రుక గుర్తు" అని చెప్పేందుకు సూచనగా భుజముల క్రింద వెంట్రుకలు కలవు. దీనిని పూర్వము వెంట ఉండేవాడే అని అర్థము వచ్చే విధముగా 'వెంటక' అనేవారు తరువాత అది రూపాంతరము చెంది వెంట్రక అయి వెంట్రుక అయినది. ఈ వివరణను అనుసరించి మనకు ఏమి తెలియుచున్నది? మనమేమీ చేయటం లేదు. ఆ పనిని చేయించేవాడు ఒకడున్నాడు అని తెలియుచున్నది. కనుక 'ప్రభు' లో 'భు' ను 'ప్రజ' నుండి 'జ' ను వేరుపర్చిన 'భుజ' అగును. 'భుజ' అను పదములో 'భు' ముందు ఉన్నది కనుక 'భు' అనేది ముందు దాని తరువాత 'జ' అనేవాడివైన నీవు ఉన్నావు అనగా స్వయముగా ఉన్నది మొదటిది, స్వయముగా లేనటువంటి నీవు తరువాత ఉన్నావు.

నీవు ఏ పనైనా చేస్తున్నావంటే చేతులతోనే చేస్తున్నావు. మరి ఆ చేయి ఎక్కడనుండి కదలుచున్నది భుజములనుండే కదలుచున్నది. కనుక దీనికంతటికీ 'శక్తి' కారణం, నీలో 'ఆత్మ' కారణం, 'దేవుడు' ఆధారము అని తెలిపే నిమిత్తము **'భుజ'** అని పేరువచ్చినది. ఇప్పుడు 'భుజ' అను పదములోని అక్షరములకు 'ప్ర' చేర్చిన **'ప్రభు'** అగును. 'ప్రజ' అగును.

అంటే ప్రజలను పరిపాలించేవాడు ప్రభు అలా కాకుండా, నీకొక్కనికే చూసిన నిన్ను పరిపాలించే వాడు, మోసేవాడు కూడా 'ప్రభు'యే అగును. ఇందులో ఏమైనా తప్పు ఉందా అంటే, తప్పేమీ లేదు శాస్త్రబద్ధముగా ఉన్నది. మన శరీరములో ఉన్న అవయవమునకు ఇంత అర్థము ఉన్నదని తెలియక "నేనే చేస్తున్నాను" అనుకుంటున్నారు. అలా అనుకోవటం వలన వ్యతిరేఖమై 'జభు' అగును. నేను చేస్తున్నాను అనుకుంటే అర్థములేని 'జభు' అగును. అర్థము తెలిస్తే అర్థమున్న పదమైన 'భుజ' అగును. ఈ విషయమును భగవద్గీతలో కూడా చెప్పెను. **"నీవేమీ చేయటం లేదు, కానీ నీవు మాత్రము అన్నీ నేనే చేస్తున్నాననుకొని పొరపాటు పడుచున్నావు. కానీ నీ వెనుక ఉండి నడిపిస్తున్నది నేనే"** అని చెప్పెను. భగవద్గీత చదువుచున్నప్పుడు ఆ విషయం గుర్తుండును, తరువాత మరలా మరచిపోవుదుము. దీనివలన పాపముగానీ పుణ్యముగానీ జీవునికే అంటుకొనుచున్నది.

నీ శరీరములో ఆత్మ అనే శక్తి ఉన్నది. అది నీ ప్రక్కనే ఉన్నది. దానినే 'నీ పొరుగువాడు' అంటున్నాము. నీవు పాలుత్రాగే ప్రాయములో చిన్నగా ఉన్నప్పుడు, పాలుత్రాగే విధానమే నీకు తెలియని అంత చిన్న వయస్సునందు, నీచేత పాలు త్రాగించినవాడు, నిన్ను నిద్రలో ఒక ప్రక్క నుండి ఇంకొక ప్రక్కకు పెట్టి నిద్రపుచ్చేవాడు, నీకు ఒకడున్నాడు. వాడిని మనము మరచిపోరాదు, అలా మరచిపోతే దానిని **'మిత్రద్రోహం'** అంటారు. మరి బాహ్యార్థములో దీనిని వాడుదురు కదా, అంటే కాదు. మిత్రుడు అంటే స్నేహితుడు అని అర్థం కదా! హితుడు అనగా 'మేలు చేయువాడు' అని అర్థము 'స్నే' అనగా 'దగ్గరనుండి' అని అర్థము. అనగా నీకు **'దగ్గరుండి మేలు చేసేవాడు'** అని అర్థము. మరి మనకు అంత దగ్గరగా ఉండి ఏమి మేలు చేస్తున్నాడని ప్రశ్న రావచ్చును. నీవు ఏదైనా తింటున్నప్పుడు గొంతుకు

www.thraithashakam.org

అడ్డుపడితే, దానిని నెట్టేందుకు, నీకు కళ్ళవెంబడి నీరు వచ్చి చాలా బాధను అనుభవించి, చాలా కష్టపడతావు మరి అహర్నిశలు నీకు శ్వాస ఆడించేవాడు ఒకడున్నాడు. నీ శరీరములో అనేకమైన కార్యక్రమములు చేస్తూ, నీ శరీరమును నడిపించే హితుడే దగ్గరగా ఉండి చేయిస్తున్నాడు. కావున అత్మను 'స్నేహితుడు' అంటున్నాము. ఈ ఆత్మను గూర్చి పెద్దలు ఏమి చెప్పారంటే, నీవు స్నేహితుణ్ణి సంపాదించుకో, స్నేహితునితో బంధమును ఏర్పరుచుకో, దానినే స్నేహబంధము, ఆత్మబంధము అన్నారు. రెండూ ఒకే అర్థమునిచ్చును. నీవు ఆత్మతో బంధింపబడి ఉన్నావు. ఆ విధముగా స్నేహితున్ని తెలుసుకుంటే, దగ్గరగా ఉందువు. లేదు 'నేనే చేస్తున్నాను' అని అనుకుంటే, ఉదాహరణకు బాహ్య ప్రపంచములో నీ స్నేహితుడు నీకు వంద రూపాయలు ఇచ్చి, ఇంకొకడు ఆకలిగా ఉన్నారు, నీవు ఈ ధనముతో వాడి ఆకలిని తీర్చు అని చెప్పితే అతను చెప్పిన విధముగా నీవు చెప్పకుండా, నేనే డబ్బు ఇచ్చానని ఆకలికొన్న వానికి చెప్పావనుకో ఏమవుతుంది, మిత్ర ద్రోహమగును. అలా స్నేహితున్ని మూసిబెట్టి, నువ్వు బయటపడినట్లు అవుతుంది.

అదే విధముగా నీ శరీరములో ఆత్మ చేసే పనిని నేనే చేస్తున్నాను అనుకుంటే ఏమగును? "ఆత్మద్రోహం" అవుతుంది. దానినే మిత్ర ద్రోహము అంటాము. ఒకవ్యక్తి "మంచి స్నేహితున్ని సంపాదించుకో" అని చెప్పెను. అదేమి ఒక స్నేహితుడు కాదు నాకు చాలామంది ఉన్నారంటే, వారంతా బయటివారే. వారు స్నేహితులా నీకు. అవసరము కోసము అంటిపెట్టుకునే వారు. అయితే అవసరము ఉన్నా, లేకపోయినా అంటి పెట్టుకునే వాడొకడున్నాడు వాడు ఎవరు? నీకు దగ్గరగా ఉండేవాడు, అతనే హితుడు, స్నేహితుడు. లోపలయున్న ఆత్మ.

ఒక మతగ్రంథములో "అన్యాయం చేసైనాగానీ, మోసము చేసైనా గానీ, అక్రమం చేసైనాగానీ స్నేహితున్ని సంపాదించుకో" అన్నారు. ఇదేమి దిక్కు తెలియని అర్థము అనుకోకండి. బాహ్యార్థముగా దీనిని తీసుకుని మోసము చేసి స్నేహితున్ని ఎలా సంపాదించెదవు? అలా ఉంటే వాడు దూరమవుతాడుగానీ దగ్గర ఎలా అవుతాడు? బయట మోసము చేసైనాగానీ స్నేహితుడ్ని అనగా లోపల స్నేహితుడ్ని సంపాదించుకో, ఆత్మను తెలుసుకో అని అర్థము.

ఇదే పనిని బాహ్య విషయములకై నీవు ఆ పని చేసిన పాపము వచ్చును. కానీ ఆత్మసంబంధమై విషయాన్ని తెలుసుకోవాలంటే మోసము చేసైనా తెలుసుకోవచ్చు అన్నాము కదా అని మోసము చెయ్యమని కాదు. ఉదాహరణకు నీవు జ్ఞానమును తెలుసుకోవలెనని ఒకచోటుకు వెళ్ళాలను కున్నప్పుడు, నీవు పనిచేసే ఆఫీస్‌లో లేదా మరొకచోటైనా సరే, నీ పై అధికారి ఈ రోజు నీవు సెలవు పెట్టుటకు వీలుకాదు అన్నాడనుకోండి, అప్పుడు పై అధికారిని మోసము చేసి, అబద్దము చెప్పి నీవు జ్ఞానము తెలుసుకునేందుకు వెళ్ళినా ఫరవా లేదు.

ఇటువంటి పనిని యోగి వేమన చేశాడు. అభిరాముడు ఎటో పోతూవుంటే, వాడిని పిలిచి మోసము చేసి, అక్కడ అతనిని ఉంచి అతను జ్ఞానము తెలుసుకొనుకుటకు వేరే దగ్గరకు పోయాడు. వేమనకు నగలు చేయమని రాజుగారు చెప్పారు. అభిరాముడు వేమన వద్దకు వచ్చి, ఒక జ్ఞాని ఈ రోజు చాలా జ్ఞానము చెప్తానన్నాడు, వెళ్తున్నాను అంటే అయితే నేను వేరే చోటికి వెళ్తాను, నీవు ఈ నగలు చేసిపెట్టు అని చెప్పి, వేమన ఆ జ్ఞానివద్దకు వెళ్ళాడు. ఇదేమిటి నీవు వచ్చావు అంటే అభిరామునికి ఏదో పని ఉంది ఉండిపోయాడు. నాకు చాలా శ్రద్ధ దీనిపైన ఉంది అని చెప్పగా

**"శ్రద్ధ కలిగిన వాడికే జ్ఞానము"** అని ఆ జ్ఞానమంతా వేమనకు చెప్పగా ఆయన యోగి వేమన అయ్యెను. జ్ఞానంపైన ఎవరికిక్కడ ఎక్కువ శ్రద్ధవుంది వేమనకే ఉంది. ఆ విధముగా విన్న జ్ఞానమునే పద్యముల రూపములో చెప్పటం జరిగింది. మోసము చేసైనాగానీ జ్ఞానమును సంపాదించుకో గలిగాడు. తద్వారా ఆత్మను తెలుసుకోగలిగెను.

మోసము మాటకేమిగానీ, సక్రమమైన మార్గములోనైనా మనము ఆత్మజ్ఞానమును తెలుసుకుంటున్నామా అంటే లేదు. మేము ఒక వ్యక్తికి 120 రూపాయలు విలువచేసే క్యాసెట్‌ను ఉచితముగా ఇచ్చి, దీనిని చూసి జ్ఞానము తెలియండి అని చెప్తే, దానిని పదిరోజులైనా ఆయన చూడలేదంటే అతని శ్రద్ధ ఉదయం నిద్రలేచిన దగ్గరనుండి మరలా నిద్రపోయేంతవరకు ప్రపంచ పనులపైనే ఉన్నది. కానీ ఆత్మజ్ఞానము తెలుసుకునే దానిపైన లేదు. పైగా దేవాలయమునకు వెళ్ళి మొక్కు తీర్చుకొనవలెను అని అన్నాడు. అయితే దేవాలయమునకు వెళ్ళినా జ్ఞానము తెలుసుకోవటం ఒక్కటే అనవచ్చును. కానీ ప్రపంచములో ఏ దేవతకు ఏ పేరుపెట్టుకున్న అవన్నీ నీతో సమానమైన జీవులే "అన్నియూ 'జ'లే 'భ'లు ఎవరూ కాదు. భూతం అనగా భూ యొక్క అధీనములో ఉండేవాడివని 'భూతం' అన్నారు. ఈ భూతాలకు, మహాభూతాలకు 'ప్రభువు' ఉన్నాడు. అటువంటి ప్రభువును తగ్గించి, ఎవరెవరినో మ్రొక్కుతూ ఉంటే, దేవుడు ఎలాగూ ఏమనుకోడు కానీ మహాభూతాలకు మాత్రము ఆగ్రహం వచ్చి, వారిని శిక్షించుటకు వెనుకాడరు. ఈ విషయమును మేము ముందే చెప్పితిమి.

ఒక రోగమొస్తే ఒక వ్యక్తికి, అతని శరీరములో రోగాన్ని పెంచేవాడెవడు, తగ్గించేవాడెవడు? ఆత్మయే! మరి మందుల ద్వారా వ్యాధులను తగ్గించవచ్చు కదా! అని అంటే, మందులు తిన్నా, రోగగ్రస్తులైన

www.thraithashakam.org

వైద్యులు కూడా చనిపోయారు. వైద్యుల యొక్క పిల్లలు కూడా చనిపోవు చున్నారు. మందులు వాడిననూ, మరెందుకు చనిపోవుచున్నారు? నీవు వైద్యం చేసినా సరే, ఆ రోగము తగ్గకుండా పెరిగేటట్లు కర్మానుసారము నడిపేవాడు ఆత్మయే. అందుకే **"దండనాధికారుల్లో యమున్ని నేను"** అన్నాడు. నీలో ఉన్న ఆత్మకు సర్వహక్కులు కలవు.

ఇంతకు మునుపు (ముందు) "రోగము కూడా ఒక భూతమే" అని చెప్పితిని. అయితే జ్ఞానము తెలుసుకుంటున్న వ్యక్తికి షుగర్ రోగము రావడమేమిటి, అది లేకుండా చేసుకోవచ్చును కదా! అని అనవచ్చును. రోగాలతో కూడిన భూతములు వేరు. కాని షుగర్ అనేది రోగము కాదు. 'జాఢ్యం' దానిని శరీరలోపం అంటారు. కానీ క్యాన్సర్ మాత్రము రోగము అగును, ఎందుకనగా! క్యాన్సర్ కణములు అవి పెరుగుతూ, నీ శరీరములో ఉండి నిన్ను తినివేయును. అదే విధముగా గ్రుడ్డితనము కూడా జాఢ్యమే అగును.

ఇప్పుడు క్యాన్సర్ కల్గిన వ్యక్తికి రేడియోథెరఫీ అనే విధానము ద్వారా క్యాన్సర్ కణాలను లేకుండా కాల్చివేయుదురు. ఆ విధముగా అవి తగ్గి, ఆ వ్యక్తి కోలుకునే కర్మ అతని కర్మచిట్టాలో ఉంటే ఆ రోగము తగ్గును. లేనిచో ఎంత చికిత్స చేసినా, అవి పెరగకమానవు. కర్మలో తగ్గకూడదని ఉంటే, అదే జరుగునట్లు లోపలున్న ఆత్మ చేయును. కానీ దేవుని జ్ఞానము తెలిసినటువంటి వ్యక్తి అనగా ప్రభు జ్ఞానము తెలిసిన వాడెవడైతే ఉన్నాడో, అతను ఒకవేళ చెప్పితే, క్యాన్సర్ కణాలు కదలకుండా నిలబడవచ్చును. మరి దీనికి నిరూపణేమి? అని ప్రశ్నించవచ్చును. ఒక గ్రంథములో మేము చెప్పియుంటిమి, గీచిన గీతను దాటి ఒక రోగము ఆ ఊరులోనికి రాలేదని చెప్పాము. అదే విధముగా జ్ఞానిని గౌరవించి, అతను త్రాగించిన నీటిని

www.thraithashakam.org

గౌరవించి, త్రాగిన పశువులకు గాలికుంటు వ్యాధి రాకుండా జరిగింది అని చెప్పితిమి. అలాగే క్యాన్సర్‌తో బాధపడే వ్యక్తిని ఆదేశించి లోపలున్న క్యాన్సర్ కణములను పదిరోజుల పాటు కదలవద్దని ఆదేశించగా, అలాగే జరిగింది. పది రోజుల తర్వాత మరల కదలిక మొదలయింది. మరి పూర్తిగా పోయినట్లుగా ఎందుకు ఆదేశించలేదంటే, ఎందుకు చెప్పును? కర్మ విధానమునకు వ్యతిరేఖముగా, జ్ఞానమునకు ఇంత శక్తి ఉందని తెలియజేయుటకు, జ్ఞాని ఆ పది రోజులు అనుభవించకుండా చేసెను. అది ఎవరికి సాధ్యమయింది? ఆత్మజ్ఞానము తెలిసిన వ్యక్తికే సాధ్యమయినది. మరెవరికీ సాధ్యమయ్యేందుకు అవకాశమే లేదు.

నీవు ప్రజవే, ప్రభువుకు అన్నీ అధీనములో ఉన్నాయి. ప్రజలు కూడా ప్రభు జ్ఞానమును అంటించుకుంటే అనగా తెలుసుకుంటే, ఈ ప్రజలకు కూడా కొంతశక్తి లభించును. భగవద్గీతలో తన జ్ఞానమెటువంటిదని కృష్ణుడు చెప్పెను. "జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మాసాత్" అన్నాడు. అనగా **"కర్మ అనే కట్టెలను నా జ్ఞానము కాల్చివేయును"** అనెను. అటువంటి జ్ఞానమును మనము తెలుసుకుంటే, జ్ఞానాగ్నికి ఇంత శక్తి ఉంది అని నిరూపణ నిమిత్తము, ప్రభు జ్ఞానముతో, ఆ రోగమును శాసిస్తే, ఆ రోగము ఆయనను గౌరవించి, ఆ రోగము తగ్గినది. ఇది యదార్థ సంఘటన.

మరి ఈ జ్ఞానమును తెలుసుకోవలెనన్న 'కర్మయోగము' అంటారు. బ్రహ్మయోగమంటారు. ఇవి చేయుటకు నేను అసమర్థున్ని అని నీవు అనుకొంటే అవి ఏవి చేయవలసిన పని లేదు. దానికి బదులుగా నా కొరకు పని చేయి' అన్నాడు. "అభ్యాసే అసమర్థోపి, మత్కర్మ పరమో భవ" 'మదర్థ మపి కర్మాణి' 'కుర్వన్ సిద్ధి మవాప్స్యసి" **"నా కొరకు పని చేయుము తప్పక నీకు మోక్షము లభిస్తుంది"** అన్నాడు. దేవుని పని

www.thraithashakam.org

అనగానేమి? జ్ఞానము తెలియజేయుటయే ఆయన పని అగును. మరి ప్రత్యక్షముగా చేసినా, పరోక్షముగా చేసినా దేవుని పనే అగును. కనుక మనకు తెలిసిన జ్ఞానమును పదిమందికి చెప్పిన అదియే దేవుని పని అగును. ఈ విషయంలో ప్రాణాయామం చేయనక్కరలేదు, కర్మ యోగము చేయనక్కర లేదు. నేను చెప్పినట్లు నీవు చేసిన అది భక్తియోగము అగును. ఆ భక్తి యోగమును తెలుసుకొని, ఆత్మజ్ఞానము తెలుసుకొని ప్రభు-ప్రజ-భుజముల జ్ఞానమును తెలుసుకొని ముందుకు సాగుదాము.

## 27. ఇందూ మహాసముద్రము

తేది : 31-12-2009

భగవద్గీత ప్రకారము ఇందూ అనగా "చంద్రుడు" అని అర్థము. చంద్రుడు జ్ఞానమునకు గుర్తు కనుక, ఇందూ అనగా జ్ఞానము అని అర్థముగా చెప్పుకొనవచ్చును. జ్యోతిష్య శాస్త్రము ప్రకారము జ్ఞానమునకు అధిపతి చంద్రుడే. ఈ లెక్కప్రకారము ఇందూ మహా సముద్రము జ్ఞాన మహాసముద్రము అని పేరుగాంచింది. హిందూ అనకూడదు "ఇందూ" అనవలెను. ఇందూ అన్నప్పుడే పై అర్థములు చేకూరును. హిందూ అని వ్రాస్తే అర్థహీనమగును. ఇందూ మహా సముద్రము అంటే జ్ఞానమునకు మహానిధి. అది నీరు, సముద్రమే కదా మరో పేరు పెట్టక ఇందూ మహసముద్రమనే ఎందుకు పేరు పెట్టారు?

మనిషి పుట్టిన తరువాత, పుట్టకపూర్వము మనిషికి జ్ఞానము రాలేదు. మనిషిలోకి జ్ఞానము వచ్చేందుకు దేవుడు ఇంకొకరి ద్వారా చెప్పాడు. అదే మొట్టమొదట నీటి నుండి పుట్టించబడిన జ్ఞానము. పంచభూతాలలో నీరు,

www.thraithashakam.org

భూమి, గాలి, అగ్ని, ఆకాశము కలవు. భూమికి, నీటికి దగ్గరగా మనమంతా ఉన్నాము. ఈ నీరు 70 శాతము ఉంది. కేవలము 30 శాతమే భూమి ఉంది. ఈ నీరు 70 శాతము, భూమి 30 శాతము ఏ విధంగా అయితే ఉందో నీ శరీరములో కూడా 70 శాతము నీరుంది. మిగతా 30 శాతం ధాతువులు ఉన్నాయి. నీటి పరిమాణాన్ని మొత్తము ఒక మనిషి నుండి తీసేస్తే 70 శాతము చిక్కిపోయి 30 శాతము మాత్రము మిగులుతాడు.

అమెరికాకు 500 కిలోమీటర్ల ఇటుప్రక్కన త్రిభుజాకారములో, సముద్రములో ఒక ప్రాంతమున్నది. దానిని బెర్ముడా ట్రయాంగిల్ అంటున్నాము. బెర్ముడా అనే ప్రాంతంలో ముక్కోణాకారములో ఉన్న ప్రాంతము అని అర్థము. ఆ ప్రాంతంలో ఏముందో, ఏమో తెలియదుగానీ, మొట్టమొదట అమెరికాలో యుద్ధవిమానాలు ట్రయినింగ్ కొరకు బయల్దేరాయి. అ ట్రయినింగ్ భూమి మీద బాంబులు వేస్తే ప్రమాదమని సముద్రములో వాటిని వేసి నైపుణ్యము సాధించాలని వెళ్ళారు. అమెరికా గడ్డమీద నుండి ఐదు విమానాలు బయల్దేరాయి. ఆ సముద్రములోకి వచ్చేసరికి ఏమి జరిగిందంటే, పైలట్ విమానం ఒకటి ముందు పోతున్నది దానివెనుక మిగతా విమానాలు బయల్దేరాయి. మొట్టమొదట ఆ పైలట్ విమానం బెర్ముడా ట్రాయాంగిల్ ప్రాంతం వద్దకు వచ్చిన తరువాత అది కనిపించకుండా పోయింది. దాని వెనుక వెళ్తున్నటువంటి మిగతా ఐదు విమానాలు కూడా కనిపించకుండా పోయాయి. ఇప్పుడు అవి ఎక్కడికి పోయాయి, అనేది సమస్యగా మిగిలి పోయింది. ఎవ్వరికీ అర్థము కాలేదు. ఇంతవరకు వెళ్ళాయి, అక్కడనుండి సిగ్నల్ కట్ అయింది, తరువాత అవి కనిపించకుండా పోయాయి. ఆ ప్రాంతాన్ని వెతుకుతూ వెళ్ళారు. ఆ విధంగా వెళ్ళినవారు కూడా పోయారు. తరువాత కొంతకాలమునకు

త్రిభుజాకారముగా ఉన్న ఈ ప్రాంతములో స్టీమర్లుగానీ, పైన విమానములు పోయినా సరే అవి కనిపించకుండా పోతున్నాయి. వాటి ఆచూకీ ఏమాత్రము తెలియకుండా పోతున్నది. ఇంత సైన్స్ అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో కూడా దాని రహస్యమేమి అనేది తెలియలేదు. తెలుసుకోవటానికి ప్రయత్నం చేశారు గానీ ఎవరి చేత అది కాలేదు. ఆ విధంగా వెళ్ళిన వారెవరూ, ఏ విధంగా అక్కడున్నదని చెప్పుటకు అవకాశము లేకుండా వారు కనిపించలేదు. మరి అక్కడేమున్నది? అనేది అగమ్యగోచరముగా మిగిలిపోయింది.

ఏదైతే బెర్మూడా ప్రాంతంలో త్రిభుజాకారంలో ఉందో అదే ఇందూమహ సముద్రములో ద్వాపర యుగము వరకు ఉండేది. ఇక్కడ నుండి కదిలి అక్కడికి వెళ్ళటం జరిగింది. అంటే ప్రాంతాన్ని మార్చుకుంది. అది ఎక్కడకు వెళ్ళినా ఒక శక్తి. ఆ శక్తి కంటికి కనిపించదు. అటువంటి శక్తిని జ్ఞానము కల్గిన శక్తిగా చెప్పవచ్చును. అది ఈ రోజుకీ జ్ఞానము కల్గిన శక్తిగానే ఉన్నది. ఒకరోజు శ్రీలంకకు దగ్గరగా ఉన్నటువంటిది, అదే విధంగా ఆ సమయములో భారతదేశానికి ఆనుకుని ఉండేదిగా ఆ శక్తిని చెప్పవచ్చును. ఒకరోజు భారతదేశం, శ్రీలంక కలిసి ఉండేవి. ఆ రోజు లంక భారతదేశమునకు మధ్యలో సముద్రము లేదు. ఇప్పుడు అమెరికాలో బెర్మూడావద్ద ఉన్న శక్తి ఏదైతే ఉందో అదే శ్రీలంకలో మొట్టమొదట ఉండేది. ఎప్పుడైతే రావణబ్రహ్మ జన్మించాడో, అతనికి తన జ్ఞానాన్ని ఆ శక్తి అందజేయటం జరిగింది. ఈ సముద్రంలో ఉన్న శక్తి సంపూర్ణమైన జ్ఞానాన్ని రావణబ్రహ్మకు అందించటం జరిగింది. రావణబ్రహ్మ త్రికాలజ్ఞాని, బ్రహ్మ అని పేరుగాంచినవాడు. కానీ అసూయ వరులు ఆయనను రావణ అసురున్ని చేశారు. రాక్షసుడిగా చిత్రీకరించారు. కానీ మనము సత్యము చెప్పుకుంటే, త్రేతాయగములో జరిగిన విషయం మనకు

www.thraithashakam.org

సంబంధము లేకపోయినా, వాస్తవముగా రావణబ్రహ్మకు గొప్ప జ్ఞానము లభించింది. లంకేశ్వరుడుగా ఉన్న ఆ రోజుల్లో త్రికాల జ్ఞానిగా, రావణబ్రహ్మగా భారతదేశాన్నంతటికీ నిజమైన జ్ఞానిగా ఒక్కడే ఉండెను.

ఆ రోజు రావణబ్రహ్మవద్ద ఉన్న జ్ఞానము మనకు తెలుసు కనుక ఈ రోజు ఆ విషయాన్ని చెప్పవలసి వస్తున్నది. ఆయన వద్ద ఎటువంటి జ్ఞానము ఉంది? గ్రంథములలో చదివే జ్ఞానము ఉందా, ఎవరైనా ఉపన్యాసం చెప్పిన జ్ఞానము ఉందా? అని ప్రశ్నిస్తే సముద్రములో ఉండేశక్తి కొన్ని వేల చదరపు మైళ్ళ విస్తీర్ణములో ఉండే శక్తి ఏదైతే ఉందో అది రావణునికి జ్ఞానము తెలియజేసింది. విశ్వములో విశేషమైన జ్ఞానము కల్గిన శక్తులు చాలా ఉన్నాయి. వాటినే మహా భూతములు అంటున్నాము. అవి జ్ఞానము మీద శ్రద్ధ లేనివారిని ఇబ్బంది పెడుతున్నాయి అనికూడా మేము ఇంతకుముందే చెప్పాము.

భారతదేశానికి ఆనుకుని ఉండి, శ్రీలంకలో ఉన్నటువంటి సముద్ర తీర ప్రాంతమంతా, ఆవహించిన శక్తి ఏదైతే ఉందో, ఆ రోజు రావణ బ్రహ్మకు గొప్ప జ్ఞానాన్ని అందించింది. అటువంటి జ్ఞానము మనకు ఈ రోజుల్లో లేదు. ఆ ప్రాంతములో ఉండే నీటిలో స్నానం చేస్తే, అందులో ఉండే జ్ఞానశక్తి లభిస్తుందని ఆ రోజుల్లో దక్షిణ సముద్రములో స్నానం చేసేవారు. ఏదేమైనాగానీ ఆ రోజు జ్ఞానానికి చిహ్నమైన ఆ ప్రాంతము ఉండటం వలన ఇందూదేశమని పేరు కూడా వచ్చింది. జ్ఞానం కల్గిన ఆ ప్రాంతమునుండే మనకు జ్ఞానము ప్రాకింది. రావణబ్రహ్మ చనిపోయిన తరువాత కూడా ఆ జ్ఞానం ఈ దేశంలో ఇంతవరకు కొందరిలో మిగిలింది. ప్రపంచంలో ఎక్కడా ఉద్భవించని జ్ఞానులు ఇక్కడే ఉద్భవించినారు. కనుకనే ఇందూ దేశమని భారతదేశాన్ని అన్నారు. అది ఇందూ సముద్రమైతే, దానికి

అనుకుని ఉన్న గడ్డకూడా జ్ఞానం ప్రకాశించి, ఇందులో ఎందరో జ్ఞానులు పుట్టి, ఇది ఇందువుల దేశమయింది, అంటే జ్ఞానుల దేశమయింది. మరి ఇప్పుడు జ్ఞానుల దేశం ఏ విధముగా ఉన్నదంటే, జ్ఞానమంటే ఏమిటో తెలియని పరిస్థితి తయారయింది.

జ్ఞానులుగా పేరుపొందిన ఈ దేశంలో, జ్ఞానదేశంగా (ఇందూ దేశంగా) పేరుపొందిన ఈ ప్రాంతం ఇప్పుడు ఎందుకు జ్ఞానము లేకుండా పోయింది? అని ప్రశ్న వేసుకుంటే, అజ్ఞానం పెరిగిపోయి జ్ఞానం లేకుండా పోయిందనేది వాస్తవమే! ఆ రోజు మన భూమికి ఆనుకొని, ఒక జ్ఞానంతో నిండుకున్న శక్తి సముద్రంలో ఇమిడి ఉండేది. ద్వాపర యుగము తర్వాత ఆ శక్తి ఇక్కడ లేదు, వ్యతిరేఖదిశకు వెళ్ళింది. కనుక మనకి జ్ఞానం లేకుండా పోయింది. ఇందూదేశమని పేరుకల్గినది, చివరికి హిందూగా మారిపోయింది. కాని పూర్వం ఈ విధంగా ఉండేది కాదు. ఇందూ దేశంగా ఉండేది అని చెప్తే, ఈ రోజు అది కానేకాదు అని కొందరు చెప్తున్నారు.

ప్రపంచంలో దేవుడెవరు? అనే ప్రశ్న మొట్టమొదట వచ్చినది ఈ దేశంలోనే, ప్రపంచంలో నిరాకార చిహ్నానికి లింగమును ప్రతిష్టించిన దేశమిది. అప్పటికి శ్రీలంక కూడా ఈ దేశంతో కలిసి ఉండేది. మొట్టమొదట లంకలోనే ఆ శివలింగం ప్రతిష్టించబడినది. ఆ లంకకు శ్రీలంక అని పేరు ఉన్నది. శ్రీ అంటే జ్ఞానం అని అర్థం. ఇదేమి భారతదేశాన్ని ప్రక్కకుపెట్టి శ్రీలంకను గొప్పగా చెప్తున్నారేమిటి? అని ప్రశ్నించవచ్చును. ఉన్న సత్యం మాత్రం చెప్తున్నాము. లంకంతా జ్ఞానముతో కూడుకున్నది. ఒకరోజు, అక్కడ నుండే ప్రాకింది, జ్ఞానమంతా దక్షిణదేశంలోనే ఉంది. ఉత్తరాది ప్రాంతంలో మీకు ఈ ఆత్మ జ్ఞానం కనిపించదు. సాంప్రదాయమైన దేవాలయములు అన్నీ దక్షిణ భాతదేశంలోనే ఉన్నాయి. ఉత్తర భారతదేశ ప్రాంతంలో మీకు కనిపించవు.

www.thraithashakam.org

సముద్రములోని శక్తి ఇక్కడనుండి పోయి అక్కడ ఏమి చేస్తున్నది? సముద్రంలో నేనొక శక్తిని ఉన్నానని చెప్పే నిమిత్తం దాని ప్రభావాన్ని చూపుచున్నది. మీ మనుషులెంత శక్తిపరులు, ఎంతోమేథాశక్తి ఉందని అనుకుంటున్నారు కదా! మీ అభివృద్ధిగానీ, మీ శక్తిగానీ నా దగ్గర దేనికీ పనికి రాదు అని, ప్రశ్నగా, ఒక సవాల్‌గా ఆ ప్రాంతంలో ఎవ్వరూ వెళ్ళకుండా త్రికోణాకారంగా దిగ్భంధించింది. ఎవ్వరు పోయినా అంతమవ్వటమే తప్ప, ఇంకేమీ కాదు. ఇంతవరకు పరిశోధన చేస్తామని వెళ్ళిన వారంతా కనిపించకుండా పోయారు. కనుక దానిని పరిశోధించేవారు ఎవ్వరూ లేకుండా పోయారు ఈ రోజు. సరే వదిలేశారు, మరి ఇప్పుడు అక్కడేముంది అని ఆలోచన ఎవ్వరికైనా పుట్టిందా? ఏదో తెలియని శక్తి ఉంది అని ఎవరైనా అనుకుంటున్నారా? 1969 సంవత్సరములో, చంద్రుడి మీద కాలుపెట్టి, ఆ రోజుల్లో అక్కడ నుండి భూమండలాన్ని చూశారు, అప్పుడు వారు చెప్పినదేమంటే, అమెరికా వద్ద ఉన్న బెర్ముడా ప్రాంతంలో ఉన్న త్రిభుజాకార ప్రాంతం ఎంతో కాంతివంతంగా ఉన్నట్లు గమనించారు. ప్రకాశవంతంగా కనిపించింది అన్నారు కానీ మరి దాని గురించి ఎవ్వరూ పరిశోధించలేదు. ఎందుకు ప్రకాశంగా కనిపించింది. ప్రకాశమనేది జ్ఞానమునకే ఉంటుంది. కనుక ప్రకాశంగా కనిపించింది.

ఈ రోజు దేవుడంటే ఎవరో తెలియకుండా పోయింది. ఈరోజు భారతదేశంలో వివిధపూజలు, వివిధ దేవతలు, వివిధ ఆరాధనలు మొదలయాయ్యాయి. అందులో యజ్ఞాలు, వేదాధ్యయనముల వలన జ్ఞానం నుండి క్రిందికి రావటం జరుగుచున్నది. దీనినంతటినీ గమనించిన తరువాత ఒకానొక శక్తి వలన, పేరుగాంచిన ఈ దేశం, ఈ రోజు జ్ఞానం లేకుండా పోయింది. దేవుడు అందుకు ఉత్తరదేశంలో పుట్టి జ్ఞానము కృష్ణుని

రూపములో చెప్పటం జరిగింది, ద్వాపరయుగం చివరిలో భగవద్గీత రూపములో చెప్పబడింది. ద్వాపరయుగం తరువాత ఆ శక్తి ఏ మాత్రం లేకుండా పోయింది. ఉత్తదేశంలో పూర్తి అజ్ఞానం ఉంది.

ఈ విధంగా దేవుడు, భగవంతుడై జ్ఞానమును చెప్పెను. ఇప్పుడు చెప్పిన బెర్ముడా ట్రయాంగిల్ వద్దకు వస్తే ఇంతవరకు దానిపైన ఏ పరిశోధన చేయలేదు. నావద్ద మీ పరిశోధనలు పనికిరావు అని చెప్పినట్లుంది. ఇటువంటి తెలియని శక్తులు ఎన్నో ఉన్నాయని తెలియని సమాజంలో మనుషులందరం ఏమి చేస్తున్నాము? అజ్ఞాన దశలో ఉండి, ప్రపంచ విషయములలోనే లీనమయిపోతున్నాము. మనకు తెలియనటువంటివి, మన అంచనాకు అందనటువంటివి ఎన్నో విషయములు జరుగుచున్నవి. జ్ఞానలోపం వలన, అజ్ఞాన ప్రభావం వలన మనకేమీ తెలియకుండా పోయింది. డబ్బులు సంపాదించుకుంటున్నాను అంటే నువ్వు సంపాదిస్తున్నావా? అందరికీ డబ్బు సంపాదించాలనే ఉన్ననూ, ఎవరెంత సంపాదించాలో అంతే సంపాదిస్తారు. ఎవరి కర్మలో ఎంత సంపాదించాలని ఉంటే అంతే సంపాదించెదరు తప్ప అంతకు మించి సంపాదించుటకు అవకాశమే లేదు. నా తెలివితో ధనికున్ని అయ్యాను అని అనుకున్ననూ, కర్మ ఆ విధంగా ఉంది కావున ధనికుడు అయి ఉంటాడు. కర్మ ఇంకొక విధంగా ఉంటే బీదవాడు అగును. బీదవానికీ తెలివుంది వాడూ డబ్బులు సంపాదించాలని ప్రయత్నం చేస్తున్నాడు. కాని వాడు సంపాదించలేక పోయాడు. కర్మలలో తేడా మినహా ఏమీ లేదు. నువ్వు బాహ్యంగా ఏమి చేయాలి అనేది ముందే ముద్రించబడి ఉన్నది, ముందే వ్రాసిపెట్టబడి ఉన్నాయి. దాని ప్రకారమే జరుగును. ఎంత యుక్తి, కుయుక్తి ప్రదర్శించినా నీవు స్వంతంగా చేసుకునేది ఏమీ లేదు. అందువలన మనం ఈ రోజు

www.thraithashakam.org

బ్రతుకుతెరవు కొరకే ప్రాకులాడుతూ ఉంటే, ఆ శక్తుల వలననే మనకు రోగాలొస్తున్నాయి. ఆ శక్తులవలనే ఉపద్రవాలు వస్తున్నాయి. ఏవో చెప్తున్నారు, ఏదో వింటున్నాము, ఇదెంత అనుటకు అవకాశం లేదు. ఎందుకంటే ప్రత్యక్ష ప్రమాణంగా ఎన్నో జరిగినవి. ఈ మధ్యన కర్నూల్ జిల్లాలో ఒక ఇంట్లో ప్రేలుడు జరిగింది, వస్తువులన్నీ ముడుచుకుపోయాయి. గోడలు బీటలు బారాయి కానీ ఎందుకిలా జరిగిందో అర్థం కాలేదు. ప్రేలుడు పదార్థములు ఏమైనా ఉన్నాయా అంటే అటువంటివి ఏమీలేవు. వంటగ్యాస్ ఏమైనా లీక్ అయిందా అంటే ఏమీలేదు. కనుక ఎవ్వరికీ ఏమీ అర్థం కాలేదు.

గ్యాస్ నాలుగైదు కేజీలు లీకు అయింది కావున ఆ విధంగా జరిగింది అని అన్నారు. కానీ వారికేమీ అర్థం కాలేదు. ఈ మధ్య తాడిపత్రిలో ముస్లిమ్స్ ఇంట్లో ప్రేలుడు జరిగింది. అక్కడ గోడ ఒకటి క్రింద పడిపోయింది. స్కూల్ కాంపౌండ్ వాల్ అది. పిల్లలకేమీ దెబ్బలు తగలలేదు. ఆ ఇంట్లోవారికి చిన్న దెబ్బలే తగిలెను. వారు మేల్కొన్న సమయంలోనే జరిగింది కావున, వారికి ఫలానా దాని వలన జరిగిందని చెప్పుటకు అవకాశం ఉన్ననూ, దానికి తగ్గ కారణం ఏమీ కనిపించలేదు. పోలీస్ డిపార్ట్‌మెంట్ వారు వచ్చారు. ఎన్నో పరిశోధనలు చేశారు గానీ, అక్కడ ఏ ప్రేలుడు పదార్థములు కనిపించలేదు. ఇటువంటి చిన్న సంఘటనలు మనకు అర్థం కాకుండా పోయాయి. మనకు తెలియని అనేక రహస్యములు కలవు. చిన్న సంఘటనలకే కారణం తెలియనిది, బెర్ముడా ట్రయాంగిల్ గురించి ఏమి తెలియును? మనకంటే మించినవి కొన్ని ఉన్నాయి. మరి ఈ రోజు మానవుని శక్తికి ఎందుకు లోబడి ఉండలేదు. మానవుడు కేవలం యాంత్రిక శక్తి, తాంత్రిక శక్తి తప్ప జ్ఞానశక్తి ఏమీ లేదు. జ్ఞానశక్తి ముందర ఏదీ గొప్పశక్తి

కాదు. సముద్రములోనున్న త్రికోణాకారము కూడా జ్ఞానశక్తి కల్గినది కనుక, ఆ శక్తుల ముందర ఏ శక్తులు పని చేయలేదు. కనుక ఎంత పెద్ద శాస్త్రవేత్తలైనా దాని గురించి వివరించి చెప్పలేపోతున్నారు. ప్రయత్నం చేసినా ఏమీ సాధించలేకపోతున్నారు.

మనం ఇన్ని శాస్త్రాలలో అభివృద్ధి చెందిననూ ప్రత్యక్షంగా జరిగిన కొన్ని సంఘటనలు చూసి, వాటి ఆచూకీ తెలుపలేక పోతున్నామంటే, మనం తెలుసుకున్న ఈ ప్రపంచ జ్ఞానం కూడా చాలా చిన్నది. మనం ఒకే ఒక దైవ జ్ఞానాన్ని తెలుసుకుంటే ఇప్పుడు వాటి వివరములు తెలిసే అవకాశం కలదు. దేవుడు అనేవాడు అంతటా వ్యాపించి, అన్నింటికీ శక్తినిస్తున్నాడు. మనం ఇప్పుడు చెప్పుకుంటున్న బెర్ముడా ట్రయాంగిల్ గానీ, ఏదైనా సరే అన్నింటికీ శక్తినిచ్చేవాడు దేవుడే. ఈ రోజు అక్కడకు పోయిన వారు ఎవరూ కనిపించకుండా, ఇటు రాకుండా అటు వెళ్తున్నారు. పెద్దపెద్ద విమానములుగానీ, పెద్దపెద్ద స్టీమర్‌లుగానీ అంత్యమైపోయినప్పుడు ఒకే ఒక దైవ జ్ఞానము తెలిసినవాడు ఎవడైతే ఉన్నాడో అతను అందులోకి సులభంగా వెళ్ళిరాగలడు. ఎటువంటి నష్టం ఉండదు. ఎటువంటి ప్రమాదం ఉండదు. ఎవరైతే దైవజ్ఞానం లేకుండా ఉన్నారో వారు అంత్యమై పోవాల్సిందే. ఒకే ఒక్క జ్ఞానానికే అది మర్యాద ఇస్తున్నది. ఈ రోజు ప్రపంచంమీద ఎక్కడ ఏమి జరిగినా గానీ అక్కడనుండే సూచనలు వస్తున్నవి. సముద్రంలో జ్ఞానకూడలి ఉన్నది. చిన్నచిన్న శక్తులు పని చేస్తున్నాయి అంటే, దాని కంటే పెద్ద శక్తి ఉండాలి. ఆ శక్తి పెద్దగా ఉండాలంటే దేవుడున్నాడు. చిన్నచిన్న సంఘటనలకు ఆదేశాలు ఎక్కడ నుండి వస్తున్నాయి? భూమి మీద ఉపద్రవాలు ఎందుకు జరుగుతున్నాయి? అంటే అక్కడనుండి వచ్చే ఆదేశాల మేరకే, త్రిభుజాకారములో ఉండే ప్రాంతము నుండే వస్తున్నవి.

2004వ సంవత్సరములో సునామీ వచ్చినది. ఆ రోజుకి ముందు ఒక సినిమా "దేవీపుత్రుడు" చూపించాము. అందులో నీటి ప్రళయం ఏవిధంగా వచ్చి భూమిని ఆక్రమిచుకుంటున్నది, దేవునియొక్క శక్తి సముద్రంలో ఉంది. సముద్రం బయటకొస్తే ఇబ్బంది అవుతుంది. అక్కడే ఉంటే ఏ ఇబ్బంది ఉండదు. ప్రతీ పౌర్ణమికి మార్పు జరుగుతుందని ఏదో చూపించారు. ఆ రోజు మనం చూశాము. దైవశక్తిని ఎవరమూ నియంత్రించ లేము అని అనుకున్నాం. ఉదయం సునామీ నిజంగానే వచ్చింది. ఈ సినిమాలో ఏ విధంగా అయితే చూపించారో ఆ విధంగానే జరిగింది.

ఇంతటి సంఘటన ఏవిధంగా జరిగిందో మీ వద్ద సమాధానం ఉందా? భూమిలో కంపం వచ్చింది. దానివలన నీరు ఉవ్వెత్తున పైకి వచ్చాయి అంటున్నారు. భూమి ఎంత పైకి వచ్చింది, నీరు ఎంత పైకి వెళ్ళాయి అని అంచనావేస్తే, వీరు చెప్పిన దానికి, జరిగిన దానికి పొంతన కుదరదు. సముద్రంలో ఏదో జరిగింది, ఏమి జరిగిందో వాస్తవముగా చెప్పగలరా? అంచనా ప్రకారం చెప్తున్నారు. భూమి మీద కంపం వస్తే, ఆ కొద్ది ప్రాంతము ప్రభావితం అగును కానీ సముద్రంలో ఎంత వస్తే అంత సముద్రం పొంగిందని మీరు చెప్పగలరా? మరి భూమి ఎత్తు వచ్చింది, సునామీ విషయంలో మరి ఆ నీరు ఆ ఎత్తులోనే ఉండక మరలా భూమి క్రిందకి ఎట్లు వెళ్ళిపోయింది? ఈ ప్రశ్నలకు జవాబు లేదు. మరి అంత పెద్ద శక్తి ఆ సముద్రంలో ఉండి ఉంటుంది. మరి బెర్ముదా ట్రయాంగిల్ దాని పరిధికి వెళ్ళిన వాటిని కనిపించకుండా చేస్తూ ఉందంటే, ఎంత పెద్ద శక్తి ఉన్నట్లు! చంద్ర మండలమునుండి, భూమండలమునకు చూస్తే ప్రకాశవంతంగా ఆ ప్రాంతము (త్రిభుజాకారం) కనిపించిందంటే, ఆప్రకాశం ఏమిటి? అని ప్రశ్నించుకుంటే మనకు తెలియని రహస్యం చాలా ఉన్నది.

దీనినంతటినీ నడిపించింది ఎవరు? దేవుడు. మరి దేవుని ఆధీనములో ఉండే శక్తులే అంత భయంకరంగా ఉంటే, ప్రశ్నార్థకంగా ఉంటే, వాటినే మనం ఏమీ తెలుసుకోలేకపోతే, వాటికంటే గొప్పవాడైన దేవున్ని తెలుసుకునేందుకు, కనుక్కునేందుకు అవుతుందా? మరి ఆ దేవున్ని తెలుసుకోవాలంటే, యజ్ఞాలు చేసినా, వేదాధ్యయనములు చేసినా, తపములు చేసినా, దానములు చేసినా దేవుడు తెలియబడడు. కానీ అందరూ వాటినే ఆచరిస్తున్నారు. తద్వారా దేవుడు తెలియబడటంలేదు. ఎక్కడైనా ఎవరైనా ఒక దైవక్షేత్రము అని పేరున్నది ఉంటే అది ఒక దేవతారాధన క్షేత్రమే అగును కానీ అసలైన దైవజ్ఞానం, వారు చేసే ఆరాధన ఉండదు. వీటిని చూసిన దేవుడు ఏమీ చేయడు. ఎందుకంటే దేవుడు రూప, నామ, క్రియా రహితుడు. కానీ అతని ఆధీనములో ఉన్న శక్తులు మాత్రం ఒక్క నిమిషంలో మన అందరినీ చంపేయాలంటే చంపేయగలవు. అంతటి పెద్ద శక్తులు ఆయన ఆధీనంలో, అనుమతిలో కలవు.

ఇప్పుడు మనిషి అసలైన దేవున్ని విడిచిపెట్టి ఎవరెవరినో దేవునిగా చేసి పూజించి, అసలు దైవం ఉన్నాడన్న జ్ఞానమే లేక, చెప్పినా అర్థం చేసుకొనక, వితండవాదన చేసి, తనకు తెలిసిందే గొప్పనుకుంటే, అది దేవునికి సంబంధము లేదు. ఆయన నీవు మంచి చేసినా, చెడు చేసినా అలాగే ఉంటాడు. కానీ అతని ఆధీనంలో ఉండే శక్తులకు (భూతములకు) సరిపోదు. ఒక ప్రాంతం అని చెప్పాను చూడండి, బెర్ముడా ట్రయాంగిల్ అనే ప్రాంతంలో ఉండే అతనికి సరిపోదు. ఇటువంటి వాటినుండి మనకు ప్రభావం దేవున్ని విడిచి పెట్టడం వలన జరుగుచున్నది. అటువంటి బాధ మనకి లేకుండా ఉండాలంటే, దేవుడు తెలియజేసిన పద్ధతితో ఆరాధిస్తే దాని ప్రకారం దేవున్ని తెలుసుకునేందుకు మనకు అవకాశం కలదు.

ఈ శక్తులు ఏ దేవున్నైతే గొప్పగా పెట్టుకున్నాయో, ఆ దేవున్ని మనం ఆరాదిస్తే ఆ శక్తులకు ఆనందం కలగుతుంది. మనలను ఇబ్బంది పెట్టవు. ఇప్పుడు మనం పుట్టాము కనుక ప్రజ అయినాం. "ప్ర" అంటే ముఖ్యమైన "జ" అంటే పుట్టుక. పుట్టుకనే ప్రజ అంటున్నాం. ఇప్పుడు ముఖ్యమైన జన్మగా నీవు మారవలెను అంటే, నీ శరీరంలో నిన్ను నీవు గుర్తించుకుని, నీవు ఎంతకాలం ఉంటావో లెక్కవేసుకుని, దేవున్ని తెలుసుకునేందుకు ప్రయత్నం చేస్తూ ఉండవలెను. ఆ విధంగా దేవున్ని తెలుసుకునే జ్ఞానం ఉన్న వ్యక్తి ఎవరైనా ఉన్నారంటే వాడు జ్ఞానము (పరమాత్మ జ్ఞానము) తెలిసినవాడి క్రిందే లెక్క కట్టవచ్చును, వాడు కష్టములకు అతీతముగా ఉంటాడు. సంతోషానికి పొంగడు, కష్టములకు దుఃఖపడడు. కనుక మనమందరము జ్ఞానాన్ని తెలుసుకునే ప్రయత్నంచేద్దాం. మన మందరం జ్ఞానం ఉందని అనుకుంటున్నాం గాని ఎంత శాతం ఉంది అని మాత్రం బేరీజు వేసుకోవటం లేదు. కనుక మనం సంపూర్ణ ఆత్మ జ్ఞానం తెలిసిన వాళ్ళుగా మారవలెనని, ఆ విధంగా మన ప్రయత్నం ఉండవలెను.

## 28. పుస్తకము - గ్రంథము

తేది : 28-01-2010

అందరూ 'పుస్తకము-గ్రంథము' అనునవి రెండూ ఒకటే అని అనుకుంటారు. కానీ ప్రతీ విషయాన్ని విశ్లేషించుకుని తెలుసుకుంటున్నాము. కనుక భవిష్యత్‌లో ఏ చిక్కులు లేకుండా జ్ఞానప్రచారము సాగవలెను అని అనుకొని ప్రతీ విషయాన్ని క్షుణ్ణంగా తెలుసుకోవాలని ఉద్దేశ్యం. మా చిన్న వయస్సులో అంటే 15-16 సంవత్సరముల వయస్సులో జరిగిన సంఘటన అనంతపురంలో ఒక గ్రామములో ఒక జ్యోతిష్యుడు ఉండేవాడు.

www.thraithashakam.org

అతని వద్ద ఒక భగవద్గీత ఉండేది మేము దానిని చదవాలనే ఉద్దేశ్యంతో, ఆ భగవద్గీతను ఇవ్వండి దానిని చదివి ఇస్తాముని అని అడిగాను. అందుకాయన సంస్కృతము నాకు రాదుగానీ, ఒక శ్లోకాన్ని ఆయన చెప్పాడు. "వనితా విత్తం పుస్తకం పరహస్తం గతంగతః" ఇదేమిటి మాకు అర్థము కాలేదు అని అడిగాము. అప్పుడు అతను వనిత అంటే స్త్రీ, విత్తం అంటే ధనం, పుస్తకము అంటే పుస్తకము వీటిని ఇతరులికిస్తే నాశనమైపోతాయి కనుక నేను ఇవ్వను అన్నాడు. డబ్బులు అంటే ఖర్చు పెట్టేయవచ్చు. స్త్రీ అంటే ఆమెను లోబరచుకోవచ్చు, కానీ పుస్తకాన్ని ఏమి చేస్తాడు అని అడిగాము. చించేస్తారు, పాడు చేస్తారు అన్నాడు. సరేలే! అందులో విషయమేముందో తెలుసుకోవాలని అడిగాము. సరే, నేను అడిగేది భగవద్గీత కదా పుస్తకము కాదు కదా! అని అతన్ని అడిగాము. "భగవద్గీత పుస్తకము కాకుండా ఏమవుతుంది, పుస్తకము కాదు కదా! అంటావు మరి భగవద్గీత పుస్తకము కాకుండా ఇంకేమవుతుంది" అని అతను అడిగాడు. అప్పుడు నేను భగవద్గీత గ్రంథము కదా! అని అన్నాను. చిన్నగుంటే పుస్తకమా, పెద్దగా ఉంటే గ్రంథమా, పుస్తకమన్నా గ్రంథమన్నా ఒక్కటే కదా! అని అన్నాడాయన, మరి అంత పెద్ద వయస్సు గల అతనికి చెప్పితే కించపరచి నట్లుంటుందని ఏమీ చెప్పలేక పోయాను.

ఆ రోజు ఆయనకు చెప్పవలసిన సమాధానము ఏమంటే, పుస్తకము అనేటువంటిది అన్ని పేపర్లతో కూర్చిపెట్టబడినదే. మీరు వాటిని గ్రంథము అని పేరు పెట్టినా, పుస్తకము అని పేరు పెట్టిననూ వాటిలో పురాణాలు ఉన్నాయి, శాస్త్రాలున్నాయి, ఇతిహాసాలున్నాయి, కావ్యాలున్నాయి అని చెప్పుకున్నాము. ఈ పేర్లన్నీ ఎందుకు వచ్చాయంటే, గడచిపోయే విషయాన్ని చరిత్రని, ఇతి హాసమని, గడచిపోయిన చరిత్రను ఆధారము చేసుకుని

కల్పితాలు చేసి, వ్రాసినది పురాణమని చెప్పటం జరుగుచున్నది. ఆ విధంగా కాకుండా తు.చ తప్పకుండా జరుగు సూత్రములున్నవి శాస్త్రములని చెప్పవచ్చును. అంతే కాకుండా కవులు రూప కల్పన చేసిన రకరకముల పాటలు, పద్యాలు వీటన్నింటినీ కావ్యములు అంటాము. అన్నీ పుస్తకాలే కదా అంటే, అన్నీ పుస్తకాలే కానీ అందులో శాస్త్రాలున్నాయి, పురాణాలున్నాయి, ఇతిహాసాలు, కావ్యాలు ఉన్నాయి. ఒక్కొక్క పుస్తకం ఒక్కొక్క దానిని సూచిస్తూ ఉంటుంది. శాసనాలతో కూడుకున్న దానిని శాస్త్రము అంటాము. అవి సూత్రాలతో నిండుకుని ఉంటాయి. అదే చరిత్ర అయితే గతకాలాన్ని గురించి వివరించేదై ఉంటుంది. పురాణాలు సమయానుకూలముగా, ఇష్టం వచ్చినట్లు మలచుకుంటూ వ్రాసినవి. అవి మానవున్ని మంచి మార్గములోకి పంపించాలని ప్రయత్నం చేసినాగానీ అందులో సత్యములు చాలా తక్కువ ఉండును. ఈ విధముగా లెక్కిస్తే కాగితములతో వ్రాసే పుస్తకములే నాలుగు రకములుగా ఉన్నవి అని చెప్తున్నాము.

ఒక మనిషిలో రుగ్మత (రోగం) ఏర్పడితే దానిని రోగము అంటున్నాము. తలనొప్పి, కడుపునొప్పి, కొన్ని రకముల బాధలను రోగములు అంటున్నాము. కానీ కొన్నింటిని రోగములు అని కాకుండా జాఢ్యములు అనవలెను. మనిషిలో ఉండే బాధలను కొన్నింటిని రోగాలుగా, కొన్నింటిని జాఢ్యములుగా విభజించవచ్చును. ఏ విధముగా అయితే పుస్తకములను విభజించుకుని చూసినట్లు రోగములుగా, జాఢ్యములుగా ఇంతకముందు మనము చెప్పుకున్నాము. శరీరములో లోపము ఏర్పడి వస్తే అది జాఢ్యము. బయటనుండి వచ్చిన క్రిముల ద్వారా శరీరములోకి ప్రవేశిస్తే, అది శరీరాన్ని బాధిస్తే దానిని రోగము అంటాము. రోగముల గూర్చి వైద్యులకు చాలామందికి తెలుసును కానీ, జాఢ్యముల గూర్చి మాత్రము తెలియదు.

ఒక వ్యక్తికి క్యాన్సర్ వచ్చింది. ఆ వైద్యుడు క్యాన్సర్ ఎందుకు వచ్చింది? అంటే నిర్ధిష్టమైన సమాధానము చెప్పలేదు. మిగతావారికి ఎందుకు రాలేదో కూడా చెప్పలేదు. ఈ విధంగా కొన్ని విషయములు తెలుస్తాయి. కొన్ని విషయములు తెలియవు. ఏ విధంగా అయితే రోగాలువేరు, జాఢ్యాలు వేరు అని తెలియకుండా అయిపోయిందో, ఈ రోజు కాగితాలలో అచ్చు వేయబడినటువంటి వాటిని పుస్తకములు, గ్రంథములను పేరు చెప్పుకుంటున్నాము.

పుస్తకములే అని ఏ విధముగా చెప్పగలుగుచున్నాము. గ్రంథములే అని ఏ విధముగా చెప్పగలుగుచున్నాము? ఇంతకు ముందర ఒక వ్యక్తికి పుస్తకము కాదు గ్రంథమని చెప్పాము కదా! ఇంకా కొందరు చిన్న పరిమాణంలో ఉన్నది పుస్తకము, పెద్ద పరిమాణంలో ఉన్నది గ్రంథము అంటారు. మేమేమంటామంటే పెద్ద పరిమాణంలో ఉన్న దానినైనా దాని సమాచారమును బట్టి పుస్తకమనే అంటాము. ఎంత చిన్న సైజులో ఉన్నా దానిని గ్రంథము అంటాము. ఇదేమి, మీరు భిన్నముగా మాట్లాడుతారు అంటే మేమన్నీ భిన్నముగానే చెప్పినా వాస్తవమే చెప్పుచుంటాము. మరి ఆ విధముగా చెప్పుటకు కారణమేమి? ఎందుకంటే చాలా పెద్ద పరిమాణంలో ఉన్న దానిని గ్రంథమన్నామనుకో తప్పవుతుంది. చిన్నగా ఉన్న దానిని పుస్తకము అన్నామనుకో తప్పు కావచ్చు. ఎందుకంటే చిన్నసైజుగా ఉన్నదాంట్లో పుస్తకాలున్నాయి, గ్రంథాలు ఉన్నాయి. పెద్దగా ఉన్న వాటిల్లో కూడా పుస్తకాలుండవచ్చు, గ్రంథాలు ఉండవచ్చును. ఏ సూత్రము ప్రకారము మీరు చెప్తున్నారు? అని మమ్మల్ని ప్రశ్నించవచ్చును. మస్తకము నుండి వచ్చినవన్నీ వ్రాస్తే దానిని ఎంత చిన్నదైనా, పెద్ద పరిమాణంలో ఉన్ననూ, దానిని పుస్తకమే అనవలెను. చిన్న పరిమాణంలో ఉన్నదానినైనా పెద్ద

www.thraithashakam.org

పరిమాణంలో ఉన్నదైనా ఎవరు వ్రాసినా మస్తకమునుండే కదా! వ్రాస్తారు. మరి ఆ సూత్రము ప్రకారము అన్నీ పుస్తకాలే అని అనవచ్చును. మరి భగవద్గీత కూడా మస్తకమునుండి వ్రాయబడినదే కదా! అనే సంశయము వచ్చును. తలనుండే వ్రాయబడినవే కానీ రెండు భాగములున్నాయని చెప్పవచ్చును. తలలో ఏమున్నాయి గుణములున్నాయి. గుణములచేత వ్రాయబడిన విషయమేదేతై ఉన్నదో, దానింతటినీ పుస్తకము అంటాము.

**"త్రైగుణ్య విషయా వేదా"** మూడు గుణములతో కూడుకున్నవే వేదాలు అని చెప్పినాడు. మరి ఇప్పుడు వేదాలను ఏమనవలెను, పుస్తకాలే అనవలెను. తరువాత గణితశాస్త్రముంది, గుణితములతో కూడుకున్నదే గణితము, అవి గుణములతో కూడుకున్నవే గుణితాలు కాబట్టి శాస్త్రములు కూడా పుస్తకములే. రామాయణం ఉంది, అది చరిత్ర కనుక అదియును పుస్తకమే, మరి కావ్యములు గుణములతోనే వ్రాస్తారు కావున అవియునూ పుస్తకములే. పురాణములు అన్నీ కల్పనలే, గుణములతో వ్రాసినవి కావున పురాణములూ పుస్తకములే, మరి మిగిలిన ఏది గ్రంథమవుతుంది. ఒక వ్యక్తి ఉపన్యసిస్తూ, ఈ వేదములో ఈ విధంగా ఉందని, ఈ శాస్త్రములో ఈ విధంగా ఉంది అని అంటాడు ఇవన్నీ పుస్తకాలే అగును. మీరేమో ఏ విషయం చెప్పినా శాస్త్రబద్ధంగా చెప్పాలని అంటూ శాస్త్రాలను పుస్తకాలే అంటే మరి గ్రంథము ఏది? అని మీరు అడుగవచ్చును. అదే విధంగా భగవద్గీతను శాస్త్రమే అనుకుంటున్నాము కదా! మరి భగవద్గీత కూడా పుస్తకమే అగునా? మరి మీరు భగవద్గీతను జ్యోతిష్యుడు ఇవ్వనంటే, నేను అడిగింది గ్రంథముగానీ పుస్తకము కాదు కదా! అని అడిగినారు కదా! మరి భగవద్గీత ఎట్ల గ్రంథమయింది అని అడుగవచ్చును. అసలు గ్రంథము లేవైనా భూమిమీద ఉన్నాయా? ఇంతకు ముందర గురులెవరైనా ఉన్నారా? అని ప్రశ్నించుకుందాము.

ఆ గురువు వస్తాడు ఎన్నో వేల సంవత్సరాలకు కానీ గురువు భూమిమీద ఒక్కడే ఉంటాడు, కానీ శాశ్వతంగా భూమిమీద ఉండడు అని చెప్పాము. మరి గురువును అరుదుగా వస్తాడు, గురువులుగా పేర్లు పెట్టుకున్న వాళ్ళెవరూ గురువులు కానట్లు అన్నీ పుస్తకాలే కానీ గ్రంథములు కావు అంటున్నారు అని అనుకోవద్దండి. గురువుకు ఒక సూత్రము ఉంది. "గుణాతీతుడని" చెప్పుకున్నాము. లాలాజల గ్రంథులున్నాయి. నోటివద్ద దానినుండి లాలాజలం ఊరుతూ ఉంటుంది. నిమ్మకాయనో, చింతకాయనో చూస్తే జిల్లుమని నీళ్లు ఊరును. మరి ఈ నీళ్లు గ్రంథిలో ఉండే ఊట నుండి వస్తున్నవి. మరి ఈ ఊట ఎట్లు వస్తున్నదంటే ఎవరో పోస్తే వస్తున్నది. ఎవరో శరీరములో కనపరాని వాడున్నాడు. వాడు ఊటను కలుగజేస్తే ఊరుతూ వస్తున్నది. ఆ విధంగానే శరీరంలో ఇంకనూ ఆరు గ్రంథులున్నవి. ఈ ఆరు గ్రంథులలో కూడా ఊటలున్నవి. ఏ గ్రంథి ఏ విధంగా పని చేస్తున్నదనే సమాచారం పూర్తిగా తెలియదు. అన్నింటికంటే పరిమాణంలో చిన్నది, మన తలలో మధ్యలో ఉన్నది దానిని ఆంగ్లంలో 'పిట్యూటరీ గ్లాండ్' అనీ, తెలుగులో 'పీయూష గ్రంథి' అంటారు. ఈ గ్రంథి ఏ విధంగా పని చేస్తున్నదనేది ఏ శాస్త్రవేత్తకూ పూర్తిగా తెలియదు. ఇది మిగతా ఆరు గ్రంథులను నియంత్రిస్తుందని మాత్రం తెలుసును. దానిలో ఊటలేకుండా ఏ విధంగా నడిపిస్తున్నది అని మాత్రం తెలియదు. ఇంతకు ముందు మనం చెప్పాం. దాని నుండి కిరణములు బయటకు వస్తున్నవనీ, ఆ కిరణములు అన్ని గ్రంథులను ప్రాకుతున్నవనీ, వాటి వలననే అన్ని గ్రంథులు పనిచేస్తున్నవి. కంటికి కనిపించని వెలుగు దాని నుండి వస్తున్నది, కాని ఏ శక్తి నుండి అవి వస్తున్నది అని మాత్రం ఎవరికీ తెలియదు. ఆ గ్రంథి చింత పిక్క సైజుకంటే చిన్నదై ఉండి ఇంత పెద్ద శరీరాన్ని నడిపిస్తూ ఉంది. అన్ని గ్రంథులను నడిపించే శక్తి ఆ ఒక్క గ్రంథిలో ఉన్నది.

www.thraithashakam.org

మన శరీరములో ఆత్మ ఉంది అని ఇంతకు ముందే చెప్పుకున్నాం. నీ శరీరములో శక్తి ఆత్మ నుండే వస్తున్నది అని చెప్పాము. ఆ శక్తి రెండు రకములుగా ఉంది అని చెప్పాం. ఒక రకం నాడుల రూపంలో, అనగా తలనుండి బయలుదేరిన పెద్దనరమైన వెన్నుపాము నుండి ఆ శక్తి ప్రవహించి, అక్కడనుండి ఏడు కేంద్రాలుగా విభజింపబడి నీ శరీరమంతా నరముల ద్వారా ప్రాకి, నీ శరీరమునంతటినీ అణువణువునూ కదిలిస్తుంది అని చెప్పాం. ఇంకొక రూపంలో గ్రంథుల ద్వారా నీ శరీరాన్ని కాపాడి, ఎంత పెంచాలో నీ శరీరాన్ని అంతే పెంచుతూ ఎంత లావు కావాలో అంతే పెంచుతూ ఉంది.ఎంత ఎత్తు పెరగాలో అంతే పెరిగిస్తూ, నియంత్రిస్తున్నది. శరీరమునకు బలమునిచ్చే విధంగా మరియు ఆరోగ్యంగా పెంచే విధంగా రెండు రకముల ఉన్నది. దానికిష్టమైతే క్రొత్త కణములను పుట్టిస్తున్నది. క్యాన్సర్ కణములుగా అవి మారుతున్నవి. అవి పెరిగేందుకు ఎవరు అవకాశం ఇస్తారు? పై గ్రంథే? అంటే బలాన్నిచ్చేవి నాడులు, నియంత్రణ జరిగేది గ్రంథుల ద్వారా. ఈ రెండూ జరిగేవి ఆత్మ శక్తి ద్వారానే. అంటే నువ్వు వేరు, నీ ఆత్మ వేరు. నువ్వు, ఆత్మ ఒకటే అనుకోవద్దు. నువ్వు వేరు నీ ఆత్మ వేరు. నువ్వు అన్నం తింటే జీర్ణింపచేసేది ఆత్మ. నువ్వు దంచలేదు, రుబ్బలేదు. లోపలకు వేయటమే నీకు తెలుసు, నీ కెంతవరకు తెలుసు, ఆహారం యొక్క రుచిని అనుభవించటమే తెలుసు గానీ, ఆ రుచిని చూపించినది మాత్రం ఆత్మశక్తే. ఈ ఆత్మ గ్రంథుల్లో ఆరోగ్యాన్ని కాపాడుతూ ఉంది కనుక, ఆ గ్రంథిలో ఉండేవాడి యొక్క రహస్యాన్ని ఏదైతే చెప్తూ ఉన్నదో దానినే గ్రంథము అంటారు. గ్రంథిలో ఉండే దానిని ఏదైతే తెలియజేస్తుందో దానినే గ్రంథము అనాలి. గ్రంథిలో ఉండే శక్తిని గురించి తెలియజెప్పేదేదైతే ఉందో దానినే గ్రంథము అంటాము. అది ఏదైనా గానీ,

ఎంత తక్కువ పరిమాణంలో ఉన్నా, ఎక్కువ పరిమాణంలో ఉన్నా, వ్రాత అయినా దానిని గ్రంథమే అనవలెను.

ఆరు శాస్త్రములలో ప్రపంచం గురించి తెలిపేవి ఐదున్నాయి అని చెప్పాము. ఒకే ఒక్క శాస్త్రం నీలో ఉన్న ఆత్మను గూర్చి తెలియజేసింది. అదే బ్రహ్మవిద్యా శాస్త్రమంటారు. ఆ ఒక్క శాస్త్రాన్నే గ్రంథము అంటాము గానీ, అది మినహా అన్నీ పుస్తకాలే అనవలెను. భగవద్గీతను పుస్తకం అని అంటే కాదు అన్నాము కదా! ఆ రోజున. అది పుస్తకం కాదు గ్రంథము అది. ఆ విధంగా గ్రంథిలో ఉన్న సారాంశాన్ని తెలియజేసింది కావున గ్రంథము అంటాము. ఆ విధంగా గ్రంథిలో సారాంశాన్ని తెలియజేసింది చిన్న పరిమాణంలో ఉన్నదైనా అనగా తక్కువ పేజీలు కలిగినవైనా గ్రంథములే అనవలెను. ఇప్పుడు గ్రంథములకు, పుస్తకములకు వ్యత్యాసము తెలిసిందనుకుంటాను. ఇక్కడ తయారైనవి ఏవైనా గ్రంథములే, బయట తయారైన పెద్దపరిమాణం గల ఎక్కువ పేజీలు కలిగినదైనా పుస్తకమే గానీ గ్రంథము కాదు. అందుకే మనం ఏ మాట మాట్లాడినా సూత్రబద్ధముగా మాట్లాడవలెను. అంటే శాస్త్రాలు ఆరైనా ఒక్క శాస్త్రాన్ని మాత్రం గ్రంథము అంటున్నాం. మిగతా వాటిని పుస్తకములే అంటున్నాము. ఇప్పుడు చాలామంది ఏం చేస్తున్నారంటే భగవద్గీతను కూడా పుస్తకముల క్రిందే లెక్కవేస్తున్నారు. దాంట్లో సారాంశం తెలియటం లేదు. అందులో గ్రంథి సారాంశము ఉన్నప్పటికీ దానిని గ్రహించుకోకుండా పుస్తకంగానే తీసుకుంటున్నాం. భగవద్గీతా గ్రంథాన్ని కూడా గుణముతో లెక్కించుకుని చూస్తున్నారు. అందులో ఆత్మశక్తి యొక్క వివరము తెలియబడటం లేదు. శ్లోకం చెప్పుకుంటారు. ఆ శ్లోకం బయట ప్రపంచ అర్థంగానే ఉంటుంది. వేమన వ్రాసిన పద్యాలను గ్రంథము అంటున్నాము. కాని దానికి ఇంకొకడు

www.thraithashakam.org

వివరణ వ్రాస్తే పుస్తకమగును. ఆ పద్యాలను వారు బయట ఉండే అర్థంగానే తీసుకుంటున్నారు. వేమన వ్రాసినది ఒకచోట గ్రంథముగా ఉంది ఒకచోట పుస్తకంగా మారింది. అందుకే వేమన నేను వ్రాసింది పుస్తక రూపములో ఉండవచ్చు, గ్రంథరూపములో ఉండవచ్చు అది నీ తలకాయను అనుసరించి ఉంటుంది. అందుకే వేమన **"వేమన పద్యములమరు వేయి విధముల అర్థమిచ్చు, అరసి చూడ జ్ఞానంబు కల్గు విశ్వదాభిరామ వినురవేమ"** నా పద్యము వేయిరకములైన అర్థములిస్తుంది. 999 రకములు పుస్తకములుగా కనిపిస్తుంది. ఒకటి మాత్రం గ్రంథంగా కనిపిస్తుంది. ఆయన వ్రాసిన పద్యములను చూసి అవి పుస్తకములుగా ఉండకూడదు అనుకున్నాం. ఆయన పద్యములకు మేము వివరము వ్రాశాము. అది నూటికి నూరు పాళ్ళు గ్రంథమయింది. **"నిగూఢ తత్త్వార్థ బోధిని"** ఏ పద్యం కూడా అందులో బయట ప్రపంచ వివరణ ఉండదు. శరీరం లోపలుండే జ్ఞాన విషయములనే వివరించాం.

భగవద్గీత గ్రంథములో ఒక్క శ్లోకం కూడా శరీరం దాటి బయటకు పోదు, శరీరం లోపలుంది. శరీరంలో గ్రంథులున్నాయి. గ్రంథులలో ఉండేది ఆత్మశక్తియే కదా! శరీరము లోపలనున్న వివరణ ఏదైనా గ్రంథమే అగును. కొందరు వీటిని విని, ఇదేమి ఇతను ఎప్పుడూ ఏదో క్రొత్త విషయమే చెప్పుతాడు. ప్రతిసారీ ఇదే క్రొత్త విషయములు చెప్పడమే జరుగుతుంది. ఆయన క్రొత్త విషయం చెప్పని సందర్భం ఏది? దాని కొరకే వెళ్తే మనకు పనులొద్దా? మనం బ్రతకొద్దా? అని అంటారు. బ్రతుకు తెరువును లాగిస్తున్నదెవరు? నీ శరీరంలో ఉండే ఆత్మే నిన్ను బ్రతికిస్తున్నది. మన చేతిలో ఏమీలేదు, అంతా నడిపించేవాడు లోపలి వాడే. ఒక వేళ బయట ప్రపంచంలో షావుకార్లు అవ్వాలన్నా, బీదవారు అవ్వాలన్నా జాపథకం

ముందే ఉన్నది. దానినే జాతకం అంటున్నాము. అసలు నీకు తెలివి ఉందా అంటే తెలివి నీది కాదు. ప్రతీదీ ఆత్మదే. ఈ విషయాలను **"సుబోధ"** గ్రంథములో వివరించాము. శరీరంలో ఉండేది నేనే, నా బుద్ధి నాఇష్టం అంటున్నాడు. వాస్తవముగా జీవుడు ఏమీ చేతకానివాడు. జీవుడు దేనికీ పెద్దకాదు.

ఒక టీవి ఛానల్‌లో ప్రోగ్రామ్ వస్తున్నది. అందులో ఒక వ్యక్తి డాక్టర్‌ను అడుగుచున్నాడు. నేనొక అమ్మాయిని ప్రేమించాను, ఆమెను ఎలాగో లొంగదీసుకున్నాను. లొంగిపోయిన తరువాత నాకు ఆమె దగ్గర మగతనం లేకుండా పోయింది. అప్పుడు ఆమె కొజ్జావాడివి నీవు అని తిట్టింది. ఇప్పుడు నేనేమి చేయాలి? అనేది ప్రశ్న. డాక్టర్ ఏమి చెప్పును? ఇన్నాళ్ళు నేను నేనే, అన్నీ నేనే అని అనుకున్నాడు. నేనూ మగాన్నే అనుకున్నాడు లోపలుండేవాడు బ్రేక్ పెడితే నేను దేనికీ పనికిరానివాడినైనాను అని తెలిసింది. ఇప్పుడు గుర్తుంచుదాం ఏమి చేయవలెనని. డాక్టర్ ఏమి చెప్పును డాక్టర్‌ను ఆడించినవాడు వాడే, డాక్టర్‌లో ఉండే మగవాడు వాడే. నీలో ఉన్న మగవాడు వాడే. నేనప్పుడే చెప్పాను మీరంతా ఆడవారేనని. నిన్న మన సభ్యులకు బస్సు టికెట్లు మగవారికే ఇవ్వు, ఆడవారికి ఇవ్వకు అని నేను చెప్పాను. ఇదేమి! స్వామి ఇట్లు చెప్పాడు అని అర్థం కాలేదు కొంతవరకు అంటే వీరికి తెలుసు మనం మగవారం కాదని టికెట్లు రాయించుకుంటారా అని ఎవరో అడిగితే, స్వామి మగవారికే టిక్కెట్లు ఇవ్వమన్నారంటే, అతను మనం మగవారిమే కదా! అని అన్నాడట, నిజమేనా! అని మావారు అన్నారు. ఎందుకంటే జ్ఞానవరంగా అంతా ఆడవారమే (స్త్రీలమే). ఇప్పుడు జ్ఞానవరంగా మాట్లాడాలా, ప్రపంచవరముగా మాట్లాడవలెనా అని సంశయమొచ్చింది వీరికి. జ్ఞానవరంగా మనమెవ్వరం

పురుషులం కాదు. ఆకారమును అనుసరించి పురుషులమే గానీ మనమంతా జ్ఞానపరంగా నపుంసకులం. జీవుడు నపుంసకుడు. ఆత్మ పురుషుడు. పరమాత్మ ఉత్తమ పురుషుడు. శరీరంలో ముగ్గురు పురుషులున్నారు. ముగ్గురు పురుషులలో జీవుడవైన నీవు ప్రకృతిలో (స్త్రీతత్త్వంతో) సంబంధము ఉన్నందువలన జీవుడు ఏమయ్యాడంటే నపుంసకుడైనాడు. ఈ విధంగా శరీరంలో నడిపించేవాడు, ఒకడున్నాడు. నీకు బలమేమీ లేదు. నీ చేత ఏదీ కాదు. ఈ విధంగా నాది అనుకోవటం, నా బలము అనుకోవటం పొరపాటు. నా బలము ఉన్నది అనుకుంటే నువ్వు ఓడిపోవలసి వస్తుంది. ఆ విధంగా లోపలుండే శక్తిని గురించి తెలియజేసే దానినే గ్రంథము అంటాము.

శరీరంలో అంతర్గతంగా ఉన్న శక్తిని గూర్చి దాని యొక్క సారాంశాన్ని గూర్చి వ్రాసిన గ్రంథాన్ని మీరు చదవండి, పుస్తకాలు చదవవద్దు. పుస్తకాలు చదివితే ప్రపంచ జ్ఞానం వస్తుంది, గ్రంథాలు చదివితే ఆత్మజ్ఞానం వస్తుంది. నిన్న ఒక ప్రోగ్రామ్ చూశా! అందులో ఒక వ్యక్తి అతను చెప్పే పదాలు స్వచ్ఛంగా పలుకుచున్నాడు. దానికి మేము అభిలషిస్తున్నాం. ఫలానా పేజీలో, ఫలానా శ్లోకం అని గుర్తుంచుకుని చెప్తున్నాడు. దానిని కూడా మెచ్చుకుంటున్నాం. మనమంత స్పష్టంగా పలుకలేక పోవచ్చును. అంత జ్ఞాపకశక్తి వారికుంది. కానీ వారు ఏమి చెప్తున్నారంటే వారు పుస్తకముల గూర్చే చెప్పుచున్నారు కానీ గ్రంథముల గురించి చెప్పటం లేదు. అప్పుడది అసంపూర్ణమైన జ్ఞానం. సంపూర్ణమైన జ్ఞానం కాదు. ఆత్మతో సంబంధపడేది ఆత్మజ్ఞానం, ఆత్మతో సంబంధపడనిది జ్ఞానమే కానీ ప్రపంచజ్ఞానమగును.

గ్రంథములు, పుస్తకములు అని రెండెట్లున్నవో ఆ విధంగానే జ్ఞానములలో రెండున్నాయి, ఒకటి ప్రపంచజ్ఞానం, రెండవది పరమాత్మ

www.thraithashakam.org

జ్ఞానం. ప్రపంచ జ్ఞానాన్ని యజ్ఞం చేయమన్నాడు శ్రీకృష్ణుడు. దానినే **"జ్ఞానయజ్ఞం"** చేయ మన్నాడు. అదే విధంగా ద్రవ్యాన్ని పొట్టలో వేస్తున్నాము. లోపల జీర్ణమవు తున్నది దానిని **"ద్రవ్యయజ్ఞం"** అంటాము. జఠరాగ్నిలో ద్రవ్యాలు కాలిపోతున్నాయి, అది ద్రవ్యయజ్ఞము. జ్ఞానమనే అగ్నిలో జ్ఞానమే కాలిపోవుచున్నది, ఇదేమి విచిత్రం. వాస్తవమే పరమాత్మ జ్ఞానములో ప్రపంచ జ్ఞానం కాలిపోవుచున్నది. అది జ్ఞానయజ్ఞము. అది తలలో జరుగుతుంది. ఇప్పుడు ద్రవ్యాలు నాలుగు రకములు, జ్ఞానములు ఐదు రకములు (పంచజ్ఞానములు) కన్ను, చెవి. ముక్కు, నాలుక, చర్మము. శరీరములో వీటివలన వచ్చే జ్ఞానము కాలిపోతే జ్ఞానయజ్ఞమగును. జఠరాగ్ని వలన కాలిపోతే ద్రవ్యయజ్ఞం అందుము. ద్రవ్యాలు కాల్చే జఠరాగ్ని గానీ, ఐదింటిని కాల్చు "జ్ఞానాగ్ని" గానీ ఎవరై ఉన్నారు. **"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రిత:"** అని ఒక శ్లోకంలో చెప్పాడు. అందులో అనగా జఠరాగ్నిలో ఉండేది నేనే అని అతను చెప్పెను. తలలో ఉండే అగ్నిని నేనే. కనుక ఈ అగ్ని రూపములో ఉన్న, గ్రంథులరూపంలో ఉన్న, కనిపించనటువంటి ఆత్మ రూపంలో ఉన్న శక్తిని గురించి తెలియజేసే వ్రాత ఏదైతే ఉందో దానిని "గ్రంథము" అందుము. ఇప్పుడు గ్రంథాలు ఎక్కడున్నాయో, వెతికి తీసుకోండి. ఏ ఒక్కటి దొరికినా స్థిర ఆస్తిగా ఉంచుకోండి. ఈ విధముగా మాటల సందర్భములో అర్థమయ్యేందుకు పుస్తకములుగా చెప్పినా, మేము వ్రాసినవన్నీ గ్రంథములే. ఇప్పుడు చెప్పిన విషయములు పెద్దపెద్ద పీఠాధిపతులుగానీ, స్వామీజీలకు గానీ తెలియవు. దేవునికి, భగవంతునికి తారతమ్యం తెలియక దేవుడని, భగవంతుడని, రెండూ ఒక్కటే అని ఏవిధంగా అయితే చెప్తున్నారో, పుస్తకమునకు, గ్రంథమునకు తారతమ్యత తెలియకుండా, పుస్తకమంటారు, గ్రంథమంటారు. ఇప్పుడు మీకు మాత్రం పుస్తకమునకు, గ్రంథమునకు తారతమ్యం తెలిసింది

www.thraithashakam.org

కదా! ఇప్పుడు చూసిన వెంటనే, ఇది పుస్తకము, ఇది గ్రంథము అని చెప్పేయవచ్చును కదా!

ఇందూ మతమునకు లేదా హిందూ ప్రజలకు ముఖ్యమైన గ్రంథము ఏది? అని ఒక వ్యక్తి అడిగితే, 'వేదాలు' అని సమాధానం చెప్పారు కొందరు. వేదాలు పుస్తకాలు. వేదాలలో ఇందూ సాంప్రదాయాలు ఇమిడి ఉన్నాయని కొందరనుకుంటే, ఈ జ్ఞానమే అవసరం లేనప్పుడు, తెలియనప్పుడు ఈ విధముగా చెప్పటము పొరపాటు. చాలామంది హి(ఇ)ందువులు భగవద్గీతను ప్రక్కకు పెట్టేసి, వేదాలను పట్టుకున్నారు. అంటే గ్రంథమును వదిలివేసి పుస్తకమును పట్టుకున్నారు. అందుకే వేదాలను నమ్ముకున్న వారందరికీ జ్ఞానం దొరకకుండా పోయింది. వేదాలను చదవచ్చు, కంఠస్థం పెట్టవచ్చు గానీ వేదాధ్యయనం వలన మోక్షం రాదు అని దేవుడు భగవద్గీతలో చెప్పెను. అందుకే **"నవేదా"** అన్నాడు. అవి పుస్తకాలు కనుకనే అది చదివితే మోక్షం రాదు అన్నాడు. ఈ విషయమును నాలుగు శ్లోకముల ద్వారా చెప్పినాడు. ఈ జ్ఞానాన్ని తెలుసుకుంటే వేదాలను అతిక్రమించిన వాడివగుదువు అని అర్థం. అప్పుడు భగవద్గీతకు, వేదాలకు ఎంత వ్యత్యాసం వుందో తెలిసింది కదా! అందుకే మేము ఎప్పుడూ ఉన్న విషయములను చెప్పలేదు. నిమ్మకాయ నిమ్మపండుగా మారుతుంది. దానికి ఉప్పు, కారం, నూనె వేస్తే మరలా ఊరగాయ అనగా మరలా కాయ అవుతుంది. ఈ విధంగా కొందరు జ్ఞానం తెలుసుకుని పండుగా మారి, మరలా వేదాలలో ఉన్న హంగులు, మసాలాలను కలుపుకుంటే మళ్ళీ కాయ అగును. ఊరగాయే అంటాం గానీ ఊరపండు అని అనం కదా!

చూడండి! ఈ వేదాలు (మాయ) హిందువులకే కాదు, క్రైస్తవులకు కూడా పనికొస్తున్నాయి. వేదాలలో మాకు సంబంధించిన శ్లోకాలున్నాయని,

వారు కూడా వేదాలలో, మాయలో పడ్డారు. వేదాలలో ఎక్కడా పునర్జన్మ ఉన్నట్లు లేదు చూడు అని ముస్లీమ్స్ కూడా వేదాలనే అనుసరిస్తున్నారు. ఆ శ్లోకాలను వారూ చెప్తున్నారు. మూడు మతములలో ఉన్నవారు వేదాలలో శ్లోకాలను చెప్తున్నారు. సరిపోయింది! ఎందుకంటే అవన్నీ గుణములతో కూడుకున్నవే కనుక, అందరికీ నచ్చేశాయి. అందుకే భగవద్గీతలో శ్రీకృష్ణుడు **"త్రైగుణ్య విషయా వేదా"** అన్నారు. అంటే అసలైన గ్రంథము విడిచి పెట్టేశారు. కనుక స్వచ్ఛమైన జ్ఞానం, పరమాత్మ జ్ఞానం ప్రపంచమంతా దేవున్ని తెలుసుకునే జ్ఞానం, ప్రత్యేకమైన జ్ఞానం. అందరికీ అందని జ్ఞానం, ఒకే ఒక భగవద్గీతలో కలదు. భగవద్గీతే ముఖ్యము. సృష్ఠి ఆదిలోనే అందించబడిన ఈ జ్ఞానం నీవు మరచిపోయావని 5110 సం॥ పూర్వం శ్రీకృష్ణునిగా వచ్చి మరలా జ్ఞానాన్ని భగవద్గీత రూపంలో అందించారు. దానిని వదలిపెట్టి, గ్రంథము కాని విషయములను పట్టుకొని ఇదే పెద్దదని ఒక మతస్థుడంటే, మా గ్రంథమే పెద్దది అని ఇంకొక మతస్థుడంటే చివరకు వేదాలే పెద్దవని హిందువులు అంటున్నారు. అంటే అందరూ ప్రక్కదోవ పట్టారు. కనుక గ్రంథము కానిదానిని మేము ఒప్పుకోము. గ్రంథము అయిన దానిని మేము ఒప్పుకుంటాము. గ్రంథమైతే మీరు కూడా చూడండి ఎంత బాగా వ్రాశాడో అని ఒప్పుకుంటున్నాం. వేరే మతంలో ఉన్నా అవి గ్రంథమైతే, వాటినీ ఒప్పుకుంటున్నాము. అది ఎంత పెద్ద పేజీలు కల్గిన వ్రాతైనా గ్రంథము కాకపోతే మేము పుస్తకమే అంటాము. కనుక మీరు గ్రంథములను మాత్రమే స్వీకరించి, పుస్తకములను విడిచిపెట్టండి. కనుక మీరంతా మీకు పుస్తకం కావాలా, గ్రంథము కావాలా అనేది మీరే నిర్ణయించుకోండి, ఆలోచించండి.

# 29. ఎదమీద ముద్ర - తల్లి తండ్రి గుర్తు

తేది: 28-02-2010

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే।
జ్ఞాన విజ్ఞాన సహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసే శుభాత్ ॥

నీవు ఏమాత్రం అసూయ లేకుండా, శ్రద్ధతో ఈ రహస్యమైన జ్ఞానమును నేను చెప్పుచున్నాను కనుక నీవు వినుము. అసూయ అనేది నీ కుండే గుణములలో చివరిది. దీని ద్వారా చాలామంది జ్ఞాన విషయంలో వెనుకబడి పోవుచున్నారు. కనుక నేనిప్పుడు జ్ఞానమును విజ్ఞాన సహితంగా చెప్పుచున్నాను.

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥

రహస్యములలోగానీ, రహస్యమైన విద్యలలో గానీ గొప్పదైన ఉత్తమమైనటు వంటి, పవిత్రమైనటువంటిది, ఈ భూమి మీద ప్రత్యక్షమైనటు వంటి అవ్యయము అయినటువంటి, నాశనము లేనటువంటి ధర్మాన్ని చెప్తున్నాను, జాగ్రత్తగా, శ్రద్ధగా వినుము. ఆ విధంగా వినకపోతే ఈ జ్ఞానం తెలియకుండా పోతుంది. అప్పుడు నీవు అధర్మంలోనే ఉంటావు.

శ్లో॥ అశ్రద్ధ ధానా: పురుషా ధర్మస్యాస్య పరన్తప ।
అప్రాప్య మా నివర్తన్తే మృత్యు సంసారవర్త్మని ॥

ఈ జ్ఞానం పైన శ్రద్ధ లేకపోతే, నన్ను ఎవరూ పొందజాలరు. అప్పుడు భౌతిక ప్రపంచంలో జనన మరణములో కొట్టుకొని పోతూ ఉంటారు. కనుక దీనిని శ్రద్ధగా వినండి.

www.thraithashakam.org

ఇంతకు ముదే చెప్పాము దేవుడు ఒక్కడే పురుషుడు ఈ ప్రపంచములో, ప్రకృతి స్త్రీ, సర్వజీవులకు బీజదాతను నేను అని చాటి చెప్పేందుకు గాను పెళ్ళి పత్రికలో శ్లోకాన్ని పెట్టి, దాని క్రింద పెళ్లి కుమారుడు, పెండ్లి కుమార్తె అని వ్రాశాము. పెళ్ళి అనేది పరమాత్మకు గుర్తు. ఆయన అందరకీ తండ్రి అని ఉద్దేశ్యంతో **"పెళ్లి"** అనే పదం తరువాత కొడుకు, కూతురు అని పేర్లు వచ్చును.

భగవద్గీతలో "ప్రకృతి మీకు తల్లి. బీజదాతనైన తండ్రిని నేను." అని అన్నాడు. వారిద్దరికీ పుట్టినటువంటి వారమే మనమంతా. ప్రకృతికి, పరమాత్మకు చిహ్నాములాగా, స్త్రీ, పురుషున్ని భూమి మీద జన్మింప చేశాడు. ఆ రహస్యం మనకి తెలిసే విధంగా, వారి శరీరముపైనే ప్రకృతి, పరమాత్మల గుర్తులుగా ఉంచాడు. వీరే కాకుండా నపుంసకుడు అనగా ఆకారము పురుషునదైనా కానీ పురుషత్వం లేనటువంటి వాడు. అటువంటి జాతి కూడా భూమి మీద ఉండునట్లు, అంటే జీవాత్మ ఎటువంటివాడు (శరీరం మగదైనా, ఆడైనా కావచ్చు) అని తెలియజేసే నిమిత్తం నపుంసకున్ని భూమిపై జన్మించునట్టు దేవుడు చేశాడు.

అదే విధంగా జ్ఞానం తెలియకుండా, అజ్ఞానంతో ఉన్నవారంతా నపుంసకుల క్రిందే లెక్క. అంటే ప్రకృతి, పురుషులకు గుర్తుగా నమూనాగా స్త్రీ, పురుష శరీరములు ధరించి, ఆడ, మగగా గుర్తింపు ఉన్ననూ, స్త్రీ, పురుష శరీరములలో ఉండే జీవుడు పురుషుడైనా నపుంసకుడే అయినట్లు, అజ్ఞానంలో ఉన్నవారు లెక్కించబడుదురు. అదే విధంగా ప్రకృతి తల్లి అనగా స్త్రీ తత్త్వం, పరమాత్మ తండ్రి పురుషుడు. జీవుడు నపుంసకుడు. సృష్ఠిలో స్త్రీగా ఆకారమున్ననూ స్త్రీ తత్త్వం లేనటువంటి వారున్నారు. వారిని 'మాచకమ్మలు' అంటారు. అదే విధంగా పురుష ఆకారమున్ననూ, పురుషత్వం లేని మగవారున్నారు వారిని 'నపుంసకులు' అంటారు.

మీ శరీరాలు తయారుచేసినప్పుడు జ్ఞానమును ఇమిడ్చిపెట్టాడు అని చెప్పాం. జ్ఞానేంద్రియములలో కన్ను చాలా ముఖ్యమైనది. కన్నులో జ్ఞానచిహ్నం ఉందని ఎవరికీ తెలియదు. జ్ఞానేంద్రియములలో కన్ను ముఖ్యమైనది అని అందరూ అందురు గానీ, దృష్ఠి లేకపోతే మనం ఏమీ చూడలేము కనుక ఆ విధంగా అన్నారని అందరూ అనుకున్నారు గానీ, జ్ఞానవరంగా ఎవ్వరూ ఆ విధంగా అనుకోలేదు. జ్ఞానేంద్రియములలో కన్ను ముఖ్యమైనదైతే, కర్మేంద్రియములలో చేయి ముఖ్యమైనది. కంటిలోకంటే చేతిలో విశేషమైనజ్ఞానం ఇమిడి ఉన్నది.

మనం మొదటినుండి హద్దు అంటే గీత, శరీరము హద్దుగా ఉండేవాటి గురించి చాలా విషయములు చెప్పాము. చాలా రకములైన పుస్తకాలలో, ఆధ్యాత్మిక గ్రంథాలు అని పేరు పెట్టుకున్న వారంతా బయటి విషయాలే తెలియజేశారు. మనం మాత్రం శరీరం లోపల విషయముల గురించే చెప్పుకుంటూ వచ్చాం. భగవద్గీత అంటే భగవంతుడు చెప్పిన హద్దు. శరీరం హద్దుగా చెప్పుకుంటే, బాహ్యంగా శరీరమును గీతగా వేసుకుంటే, దానికి లోపలుండే విషయాలనే చెప్పుకుంటూ వచ్చాము.

గుణముల గురించి చెప్పాము. అవి శరీరం లోపలివి కావా? ఆత్మ, బుద్ధి, చిత్తం, మనస్సు, అహంకారముల గూర్చి చెప్పాం. ఇవన్నీ శరీరమును హద్దుగా (గీతగా) చేసుకొని చూస్తే శరీరము లోపల విషయములు కావా? ఈ విధంగా భగవద్గీత ప్రతి శ్లోకం శరీరం లోపల ఉండే వాటిని గురించే తెలియజేస్తూ ఉంది. కానీ అన్ని శ్లోకాలను అందరూ బయట విషయాలనే, శరీరమనే హద్దు (గీత) దాటిపోయి చెప్పుకున్నారు. శరీరాంతర్గతంగా భగవద్గీతను చూస్తేనే భగవద్గీత అందరికీ అర్థమవుతుంది.

మొన్ననే కొందరు వ్యక్తులు మమ్మల్ని "మీరు ప్రత్యేకంగా భగవద్గీతను చెప్తుంటారట, మీరు ఏ మతం గురించి చెప్తారు?" అని ప్రశ్నించారు. మేము మతాన్ని గురించి ఎక్కడా చెప్పం. మా జ్ఞానం వినిన తరువాత ఫలానా మతం అని చెప్పుటకు అవకాశం లేదు.మేము మనిషిని గూర్చి చెప్పుచున్నాను. నువ్వు మనిషివే కావున నేను మనిషిని గూర్చే చెప్పు చున్నాను. నీవు హిందువువా, ముస్లీమ్‌వా, క్రైస్తవునివా నాకు సంబంధము లేదు కానీ నేను చెప్పినది మాత్రం నీకు వర్తిస్తుంది. ముందు నీవు, తరువాత మతం. నువ్వు ముందు పుట్టావు. నీకేమతం తెలియదు. 10-12 సంవత్సరముల తర్వాత మతం మత్తులో పడిపోతున్నావు. అంతకు ముందు నీదే మతమో తెలుసునా?

మేము చెప్పు విషయములన్నీ భగవద్గీతను ఆధారం చేసుకుని చెప్తున్నాము. భగవద్గీత ఫలానా హిందూమతం గురించే ఉన్నట్లు గ్రంథములో ఏ శ్లోకంలోనైనా ఉన్నదా? హిందూ అనే పేరు ఎక్కడైనా ఉన్నదా? మరి ఏమతమని చెప్పమంటారు? ఇప్పుడు నీవు ముస్లీమ్‌వైతే ఖురాన్ చెప్పాలి, క్రైస్తవుడివైతే బైబిల్ గురించి చెప్పాలి, హిందువైతే భగవద్గీత చెప్పాలి అని ఎవరూ అనరు, గానీ వేదాలను ఈ మధ్య క్రైస్తవులు, ముస్లీమ్‌లు కూడా పట్టుకున్నారు. ఎందుకంటే భగవద్గీత అనేది ఏ మతమునకు సంబంధించిన గ్రంథము కాదు కనుక **"త్రైగుణ్యా విషయా వేదా"** మూడు గుణములే వేదాలని **"గుణమయి మమ మాయా"** ఆ గుణములే నేను కల్పించిన మాయ కనుక, మూడు గుణములు కల్గిన వేదాలనే మాయ అంటాము, కనుక అందరూ మాయలో పడ్డారు.

ఇప్పుడు స్త్రీ పురుషులలో ఇద్దరిలో ఒక ఆత్మే నడిపిస్తూ ఉంది. అని చెప్పాం. నీవు పురుష ఆకారంలో ఉన్ననూ, స్త్రీ ఆకారంలో ఉన్ననూ

www.thraithashakam.org

నువ్వు అన్నం తింటే జీర్ణం చేసేది ఎవరు? నీవు కాదు. నీవు రుచిని అనుభవించేదే! మిగతా పనులన్నీ లోపలుండే ఆత్మయే చేస్తున్నది. ఆ విధంగా చేసేవాడు నీకు తెలియకుండా ఉన్నాడు. నీవు నిద్రపోతున్నప్పుడు. నీ శ్వాసను ఆడించేవాడెవడు? వాడే! నీలో ఉన్నటువంటి ఆత్మ, నీ ప్రక్కవాడు, నీ పొరుగువాడు, నీ స్నేహితుడు. ఈ విధంగా ఎన్ని పేర్లయినా ఆత్మకు పెట్టవచ్చును.

నీ శరీరములోనే కాదు అందరి శరీరములలోనూ ఆత్మయే నడిపిస్తున్నది. ఆత్మకు శక్తినిచ్చి, ఏర్పాటు చేసిపెట్టినది పరమాత్మ. పరమాత్మ అణువణువునా వ్యాపించి ఉన్నాడు. ఆత్మ శరీరంలో మాత్రమే ఉన్నాడు. శరీరమంతా వ్యాపించి ఉన్నాడు. కానీ శరీరం బయట మాత్రం లేడు. మరి జీవాత్మ అయిన వాడు ఎక్కడున్నాడు? అంటే ఒక్కచోట రవ్వంత ఉన్నాడు అని చెప్పవచ్చును. భృకుటికి మధ్యమున, గుణచక్రములో ఏదో గుణములో జీవుడు ఉందుడు.

శరీరములో ఒక్క దగ్గర ఉన్న జీవుడు, శరీరమంతా నేనే ఉన్నానని భ్రమిస్తున్నాడు. అదియే అజ్ఞానం. శరీరంలో జరిగిన పనులు నీకు తెలుస్తున్నాయి తప్ప నీవేమీ చేయటం లేదు. కానీ నీవే చేస్తున్నాననుకోవటమే పెద్ద పొరపాటు. శరీరంలో నీ కర్మానుసారం ఏది జరగాలో, దానిని నీ శరీరంతో నడిపిస్తూ దేవుడు నీకు అనుభవాన్ని మాత్రమే ఇస్తూ ఉంటే, నీవు మాత్రం అనుభవంతో పాటు ఆ పనిని కూడా నేనే చేశానని అనుకుంటున్నావు.

ఒక శరీరంలో తెలివిగా పనిచేయిస్తుంది. ఇంకో శరీరంలో తెలివి తక్కువవానిగా పని చేయిస్తుంది. ఒక శరీరంలో మంచి సంగీతాన్ని కల్పిస్తుంది. ఇంకొక శరీరంలో మంచి నాట్యం కల్పిస్తుంది. రకరకములుగా

శరీరములను ఆడిస్తూ ఉంది ఆత్మ. వీటికన్నింటికీ ఆదికర్త మాత్రం పరమాత్మ. దేవుడు ఎన్నో రకములైన జీవరాశులను సృష్టించాడు. ఆ జీవరాశులలో మిక్కిలి అజ్ఞాని ఎవరంటే మనిషే అని చెప్పవచ్చును. దీనికి భిన్నంగా మానవజన్మ ఉత్తమమైనది, ఎంతో పుణ్యం చేస్తే గానీ మానవ జన్మ రాదు అంటారు మిగతావారు. కాని మేమేమంటామంటే ఎంతో పాపం చేస్తే గాని మానవ జన్మరాదు అని అంటున్నాము. మిగతా జీవరాశులకంటే నీవు ఎక్కువ సుఖాన్ని అనుభవించవచ్చు కానీ దేవుని మార్గంలోకి వెళ్ళటానికి మాత్రం అన్ని జీవరాశులకంటే నీవు వెనుకబడి ఉన్నావు. అందుకే మనిషికి జ్ఞానం అవసరం. మిగతా జీవరాశులతో పోల్చితే మానవునికి పరమాత్మ జ్ఞానం ఎక్కువ అవసరం.

ఆ విధంగా చెప్తూ అడ్డంగా పెరిగేవి పశువులు, తిన్నగా పెరిగేవి వృక్షములు, దేవుని మార్గంలో ముందున్నాయి అని చెప్పవచ్చును. కానీ క్రిందకు పెరిగేవి కొన్ని ఉన్నాయి. అంటే దేవుని మార్గంలో అధమంలో ఉన్నారు, వారు ఎవరంటే మనుషులే! మనిషి పైకి పెరిగితే కదా, నేను పొడవవుతున్నాను అనుకుంటాడు గానీ, కాదు మనిషి క్రిందకు పెరగటం వలన, ఆ విధంగా ఎత్తు అయినట్లున్నాడు. అందుకే భగవద్గీతలో **"ఊర్ధ్వమూల అధఃశాఖాః"** అన్నాడు. మనిషి శరీరములో మీదకు మూలం ఉంది, క్రిందికి శాఖలున్నాయి అని చెప్పాడు.

పైకి వేర్లు, క్రిందికి కొమ్మలు కల్గిన వృక్షమిది అని మానవున్ని ఉద్దేశించి చెప్పినాడు. అదేమి అన్ని జీవరాశులకంటే తెలివి మాకున్నది కదా! అని మీరంటే నిజమే, కానీ మిగతా జీవరాశులకు లేని గుణముల ప్రభావం మనిషికే ఉన్నాయి. అజ్ఞాన స్థితిలో మనిషి ఉన్నాడు. కావున మనిషి శరీరములో అనేక జ్ఞాన విషయములను గుర్తుగా సమకూర్చి పెట్టాడు

www.thraithashakam.org

దేవుడు. అందులో మనం చెప్పుకున్న కన్ను, కర్మేంద్రియములలో హస్తములో చాలా ప్రశస్తమయిన జ్ఞానం ఇమిడి ఉంది. ఈ విషయములను ఇంతకు ముందే మేము చెప్పియున్నాము. మనిషి శరీర అంతర్గత విషయములు తెలుసుకుంటే ఏ గ్రంథములు అవసరము లేదు. స్వయంగా జ్ఞాని కాగలడు. కానీ శరీరములో ఉన్న విషయములు ఏ ఇతర గ్రంథములలోనైనా వ్రాసిపెట్టబడి ఉన్నవా? దేవాలయములలో ఏ ప్రతిమకైనా హస్తము చూపించినట్లుంటుంది. ఎందుకంటే ఆ హస్తములో ఉన్న జీవాత్మ, ఆత్మ, పరమాత్మల చిహ్నాములు అందులో ఉన్నాయి, తెలుసుకో అని తెలిపేందుకే పెట్టారు కాని అభయహస్తం మాత్రం కాదు. నీకే భయం లేదు నీకు కావలసినవన్నీ నేను ఇస్తానని చెప్పుటకు గుర్తు అని అజ్ఞానంగా చెప్పుకుంటున్నారు.

మనిషి ఉదయం నిద్ర లేచిన దగ్గరనుండి సుఖాలు కోరు కుంటున్నాడు. ఆ సుఖాలు తీరుటకు అనేకమైన దేవతలకు మ్రొక్కుచున్నాడు. ఆ దేవతలలో చాలామంది గలరు. ఆ దేవతలుగాని, బాబాలు గానీ జ్ఞానాన్ని చెపుతాం తెలుసుకోండి అని చెప్పటం లేదు కానీ మా వద్దకు వస్తే కోర్కెలన్నీ తీర్చేస్తాం అని చెప్పుచున్నారు. కానీ వారికొచ్చిన కష్టాలను మాత్రం తీర్చుకోలేరు. ఇది ఎంతటి విచిత్రమో చూడండి!

మనిషి 'ఆశ' అనే గుణాన్ని ఎక్కువగా పెట్టుకున్నాడు. వారి బలహీనతలు పట్టుకుని బాబాలు మీ కోర్కెలు నెరవేరుతాయి అని చెప్పటం జరుగుతూ ఉంది. ఈవిధంగా వీరు, వారు అందరూ అజ్ఞానంలో పడిపోతున్నారు గానీ జ్ఞానం కొరకు ప్రాకులాడటం లేదు. అందుకే మనిషి శరీరములోనే జ్ఞానచిహ్నాములను అమర్చి వాటిని తెలుసుకుంటే మనిషి జ్ఞానాన్ని తెలుసుకోగలడు అనీ అజ్ఞానం ఎక్కువగా ఉన్న మనిషి శరీరంలోనే జ్ఞాన చిహ్నాలను పెట్టాడు.

www.thraithashakam.org

దేవుని విషయములు తెలుసుకునేదానిని ఆధ్యాత్మికత అంటాం. **ఆత్మను అధ్యయనం చేయటమే ఆధ్యాత్మికం.** పరమాత్మ, ఆత్మ, జీవాత్మ ముగ్గురు పురుషులే ముగ్గురుగా పరమాత్మ ఉంటూ, ప్రకృతిని సృష్టించాడు. అంటే పరమాత్మ మొత్తం నాలుగు భాగాలైనట్లు లెక్క. నువ్వు పురుషునివైనా, స్త్రీవైనా, నపుంసకుడువైనా లోపలుండే దానిని గురించి (ఆత్మను) తెలుసుకుంటే దేవుడు నీకు తెలుస్తాడు. అందువలన స్త్రీ శరీరము మీదకానీ, పురుషశరీరము మీదకానీ కన్నును, హస్తమును సమానముగా పెట్టాడు. కన్నులో తెల్లగుడ్డు (పరమాత్మ), నల్లగుడ్డు (ఆత్మ) నల్లటి గుడ్డులో మరికొంత చిన్న గుడ్డు (జీవాత్మ) మూడు భాగములుగా ఇరువురికీ ఒకేలాగ ఉన్నవి కదా! ఈ విషయం ఏ మతానికో సంబంధం లేనిది, ఈ హస్తములోను ఉన్న మూడు గీతలు, (జీవాత్మ, ఆత్మ) కలిసి ఉన్న గీతలు రెండు, వేరుగా ఉన్న ఒక గీత (పరమాత్మ) లాగా ఉన్నవి. ఆడ, మగ, నపుంసకుల్లో సమానంగానే ఉన్నవి గానీ, వేరుగా లేవు కదా!

నీవు ప్రకృతి, పురుషులకు బిడ్డవు (సంతానము). నీకు శాశ్వతమైన తల్లిదండ్రులున్నారు. పరమాత్మ, ప్రకృతి నీకు శాశ్వత తండ్రి, తల్లి. అందుకే వేమన గారు ఒక పద్యంలో చెప్పారు **"తల్లిదండ్రులమీద దయలేని పుత్రుండు. పుట్టనేమి వాడు గిట్టనేమి, పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా విశ్వదాభిరామ వినురవేమా"** అని ఈ పద్యాన్ని మేము రెండో, మూడో తరగతిలో ఉన్నప్పుడు చెప్పారు ఈ పద్యాన్ని మేము చదివి, ఆయనను అడిగాం, ఏమండీ మీరు తల్లిదండ్రుల మీద పద్యాన్ని పిల్లలమైన మాకెందుకు చెప్పారు? మేము చాలా చిన్నపిల్లలం కదా! మామీద తల్లిదండ్రులకే దయ ఉండాలి కదా! అందుకే రూపాయో, అర్ధో ఇస్తే మేము కొనుక్కుని తినే వయస్సు కదా మాది! మాకు మా తల్లిదండ్రుల మీద ఎలా దయ ఉంటుంది? మరి

www.thraithashakam.org

ఈ పద్యం సంగతేంటి? అని అంటే ఆ పద్యాన్ని ఆ టీచర్ ప్రపంచపరమైన అర్థముతో చెప్పారు. అంతే కాకుండా, అందరికీ అదే అర్థం అని సర్ధి చెప్పారు. కానీ దానికి సరైన సమాధానం అది కాదు. తల్లి, తండ్రి అంటే బయటకు కనిపించే తల్లిదండ్రులుగా లెక్క వేసుకున్నారు. వేమన పద్యములన్నీ రెండు విధములుగా ఉంటాయి. అందుకే ఆయన ముందే చెప్పినాడు. నేను చెప్పినదంతా జ్ఞానమే మీకది అర్థం కాదు, కానీ కనిపించే విధంగా నా పద్యాలను మీరు అర్థం చేసుకుంటారు. **“వేమన పద్యములమరు వేయి విధముల అరసి చూడ చూడ చోద్యమగు జ్ఞానంబు, విశ్వదాభిరామ వినురవేమా”** అన్నాడు. పద్యాలు చాలా విచిత్రంగా ఉంటాయి. బాహ్యార్థంగా తీసుకుంటే ఏ ప్రయోజనం లేదు. మీరు పరికించి చూస్తే దానిలో ఆత్మ జ్ఞానమే ఉంది. ఆ విధంగా అర్థం చేసుకుంటేనే లాభం ఉంటుంది” అని అన్నాడు.

అందుకే మేము ఆ పద్యానికి “తల్లి, తండ్రి అంటే ప్రకృతి, పరమాత్మలు, వారి పైన మన ధ్యాస లేకుంటే, మనం ఎన్నిసార్లు పుట్టినా, ఎన్నిసార్లు గిట్టి నా ఒక్కటే” అని వివరించాము. నీవు ఆత్మను గురించి తెలుసుకుంటేనే నీ జన్మ సార్థకమగును. నీవెంత ధనికునివైనా, ఆత్మ జ్ఞానమును తెలియకపోతే సార్థకం లేదు. ఏ విధంగా ఉన్నా నీ జన్మ సార్థకం కానట్లే. ఈ విషయం నేనే కాదు చాలామంది పెద్దలు అదే చెప్పారు. వేటూరి సుందరరామ్మూర్తి గారి ఇంటర్వ్యూ చూశాము. అందులో ఆయన” నేను ఎన్నో పాటలు వ్రాశాను, వ్రాస్తున్నాను. కానీ అదే నా ఆధ్యాత్మిక జీవనానికి అడ్డుపడుతున్నది. నాకెంతో డబ్బుంది, సుఖాలున్నాయి కానీ దేవున్ని తెలుసుకోలేక పోతున్నాను, జ్ఞానము తెలుసుకోవటానికి సమయం లేదని బాధపడుతున్నాను. కానీ వీటన్నిటి నుండి మాత్రం తప్పించుకోలేక

పోతున్నాను" అన్నాడు. ఇంకా "నా జీవితమంతా ఏ పాట ఏవిధంగా రాయాలి, ఏది ముందు పెట్టాలి, ఏ చరణం వెనక్కి పెట్టాలి. ఈ విధంగా నా ఆలోచనలు నాకు వద్దనుకున్నా వస్తున్నవి. దైవవరంగా వెళ్ళుటకు నాకు పెద్ద ఆటంకము. మీకేమో నా పాటలు వినుటకు బాగానే ఉన్నవి కానీ, నేను దైవవరంగా వెళ్ళుటకు ఇవి నాకు ఆటంకమవుతున్నాయని నేను బాధపడుతున్నాను" అని అన్నాడు. అతను ఆ విధంగా అన్నందుకు నేను అతనిని మెచ్చుకుంటున్నాను.

అందుకే మనిషి అజ్ఞానంలో ఉన్నాడని తెలిసి అతనికి అతని శరీరంలోనే జ్ఞాన చిహ్నములను దేవుడు ఇమిడ్చి పెట్టి భూమి మీదకు పంపించాడు. నీకు తల్లిదండ్రులు, ప్రకృతి, పరమాత్మలే అని గుర్తుండేందుకు గాను ఎన్నో చిహ్నాలున్నాయి. నీవు నపుంసకుడవు అని చెప్పేందుకు అనేక చిహ్నాలున్నాయి. జ్ఞానవరంగా మాట్లాడితే అందరం పురుషులం కాదు. మీరాబాయికి ఒక రోజు "ఆడవారితో మాట్లాడరు మా స్వామి!" అని అన్న ఒక శిష్యునికి ఆమె "మీ గురువుగారు పురుషులా, కృష్ణుడొక్కడే ఈ విశ్వమంతటికీ పురుషుడని నేను అనుకుంటున్నాను" అన్నది. ఆ మాటకు ఆ గురువుకు జ్ఞానోదయమై, అందరం ఆడవారమే అని ఒప్పుకుంటూ. ఆమె కాళ్ళ మీద పడ్డారు.

మనందరికీ తండ్రి ఒకడున్నాడు, వాడే దేవుడు. వాడున్నాడు అని తెలుసుకునేందుకు, అతనికి నీవు సంతానము అని తెలుసుకునే నిమిత్తం, మన శరీరంలో స్త్రీలకు, పురుషులకు సమానమైన జ్ఞానాన్ని గుర్తుగా అమర్చి పెట్టాడు. నీవు స్త్రీలను చూస్తావు, నేను పురుషున్ని అని అనుకుంటావు. అటువంటి భావం నీలో తగ్గిపోవాలంటే నీలో శరీరములో స్త్రీలకు ఉన్న చిహ్నాలు పెడితే ఆ భావం తగ్గుతుందని స్త్రీలకు వేసిన ముద్రే నీకు (పురుష

శరీరం పై) కూడా వేసి పంపించాడు. హస్తము చూస్తే అందరికీ ఉన్నాయిలే అనుకుంటారు. స్త్రీలను చూడగానే వీరు స్త్రీలు అనే ప్రత్యేక గుర్తింపు ఎద. ముఖం కనిపించక పోయినా ఎదను చూసి వీరు స్త్రీలు అని చెప్పవచ్చును. ప్రకృతి వలననే నీవు పోషింప బడుతున్నావు. తల్లి వలననే నువ్వు పెరిగి పెద్దయినావు. నీ శరీరమే ప్రకృతి వలన తయారయింది అనే దానికి గుర్తింపుగా దేవుడు, పిల్లలకు ఆహారము నేరుగా తీసుకోలేని సమయంలో తల్లి స్తనములనుండే ఆహారాన్ని అందించాడు. తల్లికి గుర్తుగా స్తనములు ఉన్నవి కదా! ఆ స్తనముల నుండే పాలను అందించాడు. ఆ పాల వలననే నీవు పెరుగుతున్నావు. దానిని కదిలించే చైతన్యకర్తగా ఆత్మ ఉన్నది.

బీజదాత తండ్రి, కనిపించడు. కనిపించేది తల్లి అయిన ప్రకృతే. పిల్లాడికి ముందుగా కనిపించేది తల్లే. తల్లి కనిపిస్తే చాలు కేరింతలు కొడతారు, పాలు దొరుకుతాయని. తండ్రిని గుర్తించలేడు. కొన్నాళ్ళ తరువాత తండ్రిని గుర్తిస్తాడు. ఇది దేనికి గుర్తు ప్రకృతి వలన నీవు పుట్టి పెరుగుతున్నావు అని భగవద్గీతలో చెప్పాడు "నేను నిన్ను ప్రకృతి వలననే పుట్టిస్తున్నాను, ప్రకృతి లోనే చంపుతున్నాను. ప్రకృతితోనే నిన్ను నేను పోషిస్తున్నాను. ప్రకృతికి అధ్యక్షుడినై ఉన్నాను. కనిపించేదంతా ప్రకృతే. నువ్వు ప్రకృతి వలననే పోషింపబడుతున్నావు" అనే దానికి గుర్తుగా, స్తనములనుండి నీకు ఆహారం నీవు చిన్న పిల్లవానిగా ఉన్నప్పుడు వచ్చేటట్లుగా దేవుడు చేశాడు.

స్తనాలు స్త్రీలకే ఉంటాయి, అనే అహం పురుష శరీరధారులకు ఉందేమో అని, అటువంటిది లేకుండా ఉండాలంటే వారికుండే స్తనాల గుర్తులే పురుష శరీరములపైన పెట్టాడు. కాల్చి వేసినట్లు చర్మం ఉన్నట్టు ముద్ర లేదా, అది పురుషులకు, స్త్రీలకు పుట్టినప్పటినుండి సమానంగా ఉంటాయి. పెరిగి పెద్దయిన తరువాత స్త్రీలకు స్తనములు పెరుగుతాయి.

వాటిలోకి పాలొస్తాయి. పురుషులకు రావు. కానీ నేను పురుషున్ని అని నీవు అనుకోకుండా నీకు కూడా స్త్రీకున్న స్తనముల గుర్తులు దేవుడుంచాడు. ఇద్దరికీ ఉన్న ఆ ముద్రలో కూడా ప్రత్యేకమైన జ్ఞాన వివరము ఉన్నది. ప్రతీరోజూ మనం ఎదమీద ముద్రలను చూసుకుంటున్నా అవి కాల్చి ముద్ర వేసినట్లు ఎందుకున్నాయని ఎవ్వరూ ఆలోచించలేదు. ఏ రోజైనా అవి గుర్తుఉండేటట్లు, గుర్తు వచ్చేటట్లు, ఆ విధంగా కాల్చి ముద్ర వేసినాడు. కాల్చుటమే కాకుండా మధ్యలో ఒక లింగాకారాన్ని పెట్టాడు. అది చిన్న ఉండలా కనిపిస్తున్నది. ఆది కొద్దిగా మిట్టగా పెట్టాడు. అది లింగాకారము లకు గుర్తు, పరమాత్మకు గుర్తు. దాని చుట్టూ కాల్చబడిన ప్రాంతము అంతా పాణి మట్టము (ప్రకృతికి) కు గుర్తు.

ఈశ్వరాలయంలో ఉన్న లింగము, పాణి మట్టము ఏ విధంగా ఉన్నదో ఆ ఆకారమే ఇక్కడ ముద్ర కొట్టి పంపించినాడు. అవి ప్రకృతి (స్త్రీ) పరమాత్మ (పురుషుడు) గుర్తులు కదా! నీ తల్లిదండ్రుల గుర్తులు నీ శరీరం పైనే ఉన్నవి. ఆడ, మగవారిలో ఒక్కలాగే ఉన్నవి. అయితే ఆడవారిలో నీవు ప్రకృతితో పోషింపబడుతున్నావన్న గుర్తుగా వారి ఎదలను పెద్దగా పెట్టి వాటిని పాలతో నింపాడు. వీటిని మనమెవరమూ తెలుసుకోవటం లేదు. ఈ విషయంలో ఫలానా మతం అనేది ఏమైనా ఉన్నదా? ఎవరి మత గ్రంథములోనైనా ఈ విషయం ఉందేమో చూసుకోండి, ఉండదు. దేవుడు మనిషికి సంబంధించిన విషయం పెట్టాడుగానీ, మతం గూర్చి దేవుడు పెట్టలేదు.

మొన్న ముస్లీమ్స్‌తో కలిసి మాట్లాడుతున్నప్పుడు, మీతో కలసి మా ఫొటో ఉండవలెను అని జిహ్వానందగారితో ఆలింగనం చేస్తున్నట్లు ఫొటో కావాలి అన్నారు వారు. ఆలింగనములో లింగము ఎక్కడుంది? అని వారిని

ప్రశ్నించాము. ఆలింగనము అని పేరుంది కానీ దాని గురించి ఆలోచించడం లేదు. ఆలింగనములో ఇద్దరి శరీరాల ఎదలు, వాటికి ఉండే లింగాకార ప్రకృతి, పాణిమట్టపు గుర్తులు ఒకటికి, ఇంకొకటి ఎదుటివారివి తగుల్తాయి. ఆ లింగనము, ఆ లింగాకారమైన పరమాత్మ నీకు, నాకు అందరికీ కారణభూతుడై ఉన్నాడు అని తెలిపే నిమిత్తం పూర్వపు ప్రజలు భావించి ఒకరినొకరు ఆలింగనం చేసుకునేవారు. ఇప్పుడు ఆ అర్థంతో చేయటం లేదనుకోండి!

ఈ విషయాలను **"ఎదమీద ముద్ర – తల్లి తండ్రి గుర్తు"** అనే విషయం తెలియుటకు ఏ మతము అవసరం లేదు కదా! ఈ విషయములను తెలుసుకుంటుంటే ప్రతి వ్యక్తి సంపూర్ణమైన జ్ఞాని అగును. శరీరములోనే నీవు బ్రతుకుతున్నావు. శరీరంలోనే గుణములున్నాయి. శరీరమును, నీవు విడిచిపెట్టిన తరువాత, శరీరము ఏ విధంగా వృథా అయిపోతున్నదో, ప్రపంచవరమైన విషయాలు కూడా ఇక్కడే ఉండిపోతాయి గానీ నీ వెనుక రావు. అందుకే మేము ఒక బోర్డ్ వ్రాశాము. "నీ హోదా, నీ పలుకుబడి, నీ ధనము, నీ అధికారం, నీ కీర్తి ఇవన్నీ ఇక్కడే ఉండును, ఏవీ నీతో రావు. నీ శరీరం కూడా నీ మాట వినని రోజుంది జాగ్రత్త!" అని చెప్పాం. నీవు బలాఢ్యుడివి అనుకుంటే కొంత కాలానికి ఆ మాట సరిపోదు.

నీవు దైవత్వమునుండి వచ్చావు. తిరిగి మరలా అక్కడికే చేరాలి, కానీ మధ్యలో నీవు నీకు సంబంధము లేని దానిని పట్టుకుని వ్రేలాడు తున్నావు. ఆలోచిస్తున్నావు, కాలాన్ని వృథా చేసుకుంటున్నావు. జ్ఞానాన్ని వదలివేసి, నాది ఆ మతం, నీది ఈ మతం అని ఎవరు అనుకో మంటున్నారు? నీ శరీరములోనే దేవున్ని తెలుసుకునే జ్ఞానాన్ని చిహ్నాలుగా పెట్టి పంపించాడు. అవి తెలుసుకోవచ్చును కదా! వెంట్రుకలు ఆత్మకి గుర్తుగా

www.thraithashakam.org

మన శరీరంపైన దేవుడు పెట్టాడు. అయితే మా మతంలో గడ్డం పెంచమన్నాడు అని కొందరు గడ్డంపెంచితే, మా మతంలో తలమీద జుత్తు పెంచమన్నారని కొందరంటే, తల మీద జుత్తంతా తీసెయ్యమన్నారని కొందరు, ఈ విధంగా బాహ్య వేషముల ధ్యాస ఉంచాడు మనిషి తప్ప, దేవుడు పెట్టిన జ్ఞాన చిహ్నాములు నీ శరీరం పైనున్నవి తెలుసుకోవచ్చును కదా!

నేనిప్పుడు చెప్పిన విషయములన్నీ మతములకు సంబంధించినవి కావు. నీవు ఏ మతమైనా దేవుని గురించి తెలుసుకో అని చెప్తున్నాము. **"పరమానందయ్య శిష్యుల కథ"** అని ఒక చిత్రము ఉన్నది. దాంట్లో ఉన్న కథానాయకుడు ఎక్కడున్నా గానీ ఒక సమయానికి ఆయన శివలింగానికి పూజ చేయాలి అని నియమముండేది. ఒక రోజు ఆ సమయానికి ఒక వేశ్య వద్ద ఉండటం జరుగుతుంది. అప్పుడు ఆయన, ఆ వేశ్య పడుకొని ఉంటే ఆమె ఎదకు పూజచేస్తాడు. శివలింగానికి పూజచేసినట్లే చేస్తాడాయన. నేనేమీ చెప్పలేదు. ఆ రోజు వారికి కూడా తెలుసు ఎదమీదముద్ర లింగమునకు గుర్తని, ఇప్పుడు సరిపోయింది కదా! నేను చెప్పినది వాస్తవమేనని.

అందువలన నేను చెప్పునది ఏమంటే, మీ శరీరములు ఆరోగ్యంగా ఉన్నప్పుడే, తెలివి బాగా పనిచేస్తున్నప్పుడే, దేవుని వైపు చూపు పెట్టు. ప్రపంచవరముగా ఏమి జరగాలో అదే జరుగుతుంది. ఈ విషయం నీ జాపథకములో (జాతకం)లో ముందే నిర్ణయించబడి ఉంది. దాని గురించి చింత విడిచి పెట్టు. నువ్వు మాత్రం దేవుని గురించి చింతించు, అప్పుడు నీకు దేవుని విషయములు అర్థం అగును. లేకపోతే నీ జీవితమే వృథా అగును.

# 30. ఏక్ నిరంజన్ - అలక్ నిరంజన్

తేది : 05-04-2010

'ఊట ఉండునది ఊరు' అని ఒక అర్థము ఉన్నది. జలము ఎక్కడ ఉంటుందో, మనుష్యులు, జంతువులు అక్కడ నివాసము చేస్తారు. ఆ జలము ఊట ఎక్కడ ఉంటుందో, దానిని 'ఊరు' అందురు. మన శరీరమును కూడా ఊరుగా చెప్పుకొనవచ్చును ఎందుకనగా! మన శరీరములో ఏడు ఊటలు కలవు. ఒక ఊట కనిపించక, ఆరు ఊటలు కనిపించునట్లున్నవి. శరీరములో ఆరు గ్రంథుల వెంబడి ఆరు ఊటలు స్రవించును. ఇంకా బాగా అర్థమయ్యేందుకు ఏడు చెలములున్నాయనుకోండి, ఎందుకంటే! ఊట బయటకు వచ్చినా ఇంకా ఊరుతునే ఉండును కనుక.

వీటిలో ఒక గ్రంథి ఊట కనిపించదు కానీ మిగతా గ్రంథుల ఊటలు కనిపించును. కనిపించని ఒకగ్రంథి ఊట ఉంటేనే మిగతా గ్రంథుల ఊటలు స్రవించును. అదే విధముగా కనిపించని ఒక ఊట లేకపోతే మిగతా చెలములుగా చెప్పుకుంటున్న గ్రంథులు అని చెలములలో ఊటలు ఉండవు. ఈ విధముగా చిన్నగా ఉండి, మన శరీరములో ఉన్న మిగతా ఆరు గ్రంథులను పనిచేయించేది పీయూషగ్రంథి దానినే "గ్రంథి రాజము" అన్నారు. ఎందుకంటే గ్రంథులన్నింటినీ పని చేయిస్తున్నది. గ్రంథులలో గొప్పదిగా, రాజుతో పోల్చి గ్రంథిరాజము అన్నారు. అయితే ఈ విషయము అందరికీ తెలియకపోవచ్చు గానీ జలము ఉంటేనే ఆ ప్రదేశములో నివసించగలము అనే విషయం అందరికీ తెలుసును. అదే విధముగా మనకు కనిపించే విధముగా మన శరీరములో నోటియందు లాలాజలము కలదు, లాలాజల గ్రంథులలో ఊట ఉంది కనుక లాలాజలము ఊరినది. ప్రతి ఊరికి ఒక బొడ్డాయి ఉండును. ఊరుగా ఒక ప్రదేశాన్ని తయారు

www.thraithashakam.org

చేయాలంటే ముందుగా బొడ్రాయిని పెట్టి, దాని ప్రక్కలనుండి ఊరును కడతారు (ఇళ్ళను కట్టుదురు) అదే విధముగా మన శరీములు కూడా అలాంటి అమరికే బొడ్డుగా ఉన్నది. ఎందుకనగా ఊట కల్గినది కనుక మన శరీరమూ ఒక ఊరే!

ఇప్పుడు మన శరీరములో జీవాత్మగా తలలోని గుణచక్రములో ఉన్నాము. ఆత్మకూడా మన శరీరమంతా ఉన్నది. జీవాత్మ అనేవాడు కష్టసుఖములను అనుభవించేందుకు ఉన్నాడు, అనగా మనమే అని అర్థము చేసుకొనవలెను. ఒక ఊరిలో ఒక్కొక్కరు ఒక్కొక్క పని చేస్తున్నట్లు మన శరీరములో కూడా, చెవి వింటుంది, కన్ను చూస్తుంది, నాలుక రుచి తెలియజేస్తుంది. ఈ విధముగా ఉన్నప్పుడు మన శరీరములో ఒకడు 'ఏక్ నిరంజన్' అన్నాడట! అదే శరీరములో మరొకడు 'అలక్ నిరంజన్' అని అన్నాడట!! అదే శరీరములో ఇంకొకడు 'నిరంజన్' అని అన్నాడు.

ఈ మూడు పదములు మన వాడుక భాషలో వాడిన వారున్నారు. నిరంజన్ అనిపేరు పెట్టుకున్న వారున్నారు. అయితే ఈ పదములను ఎవరు వాడినారు? ఏ అర్థములో వాడినారు? ఆ ఊరు ఏది అని తెలుసుకుంటే, నీ శరీరమనే ఊరిలోనే, 24 భాగములు కలవు. ఇవన్నీ వాటి పని అవి చేసుకుంటాయి. ప్రపంచములో ఎలాగయితే ఒక ఊరిలో ఎవరి పనిని వారు చేసుకుంటున్నట్లు, చెవులు వినే పనినే చేయును తప్ప, ఇంకొక పని చేయవు. అలాగే కనులు, నోరు కూడా వాటి పనినే చేయును. అదే విధంగా నీ శరీరములో ఇరవై నలుగురు వారి పనిని వారే చేయుదురు, కానీ ఒకడు మాత్రము అనగా ఒక భాగము మాత్రము శరీరములో కష్టసుఖములు అనుభవిస్తుండడమే వాడి పని అయినప్పటికీ, అన్ని పనులలోనూ, అందరు చేసే పనులలోనూ సంబంధము ఏర్పరచుకుని,

www.thraithashakam.org

అన్ని మాటలు మాట్లాడేవాడైన జీవాత్మ, ఒకసారి 'నిరంజన్' అని అన్నాడట. ఎందుకలా అన్నావు? అని అడిగితే రంజిల్లుట అంటే సుఖపడుట అని అర్థము కలదు "జీవితములో నాకు సంతోషం లేదు" కాబట్టి 'నిరంజన్' అని అన్నాను. నీకు చాలా ధనము ఉందికదా! చక్కనైన తిండి తింటున్నావు కదా! అంటే, లేదు లేదు అని సుఖం కాదు అంటాడట. కనుక నేను 'నిరంజన్' అన్నాడట.

ఇక ఇంకొకడు ఏమన్నాడు, **'ఏక్‌నిరంజన్'** అన్నాడు. అనగా **"నాకు ఒక్క సంతోషం కూడా లేదు"** అన్నాడు. పైవాడు సంతోషం లేదంటే, రెండవవాడు ఒక్క సంతోషం కూడా లేదని 'ఏక్‌నిరంజన్' అన్నాడు. అనగా ఒకడున్నాడు వాడు సంతోషం లేదన్నాడు, ఇంకొకడు ఒక్క సంతోషము కూడా లేదన్నాడు. మరియొకడు ఏమన్నాడంటే **'అలేక్ నిరంజన్'** అనగా "అస్సలు సంతోషమే లేదు" అన్నాడట. అయితే ముగ్గురు ఉన్నారని తెలిసినది. అయితే ఈ ముగ్గురు ఎవ్వరంటే, ఒక ఊరిలో ఎవరి పనివారు చేసుకుంటూ ఉంటే, వీరు ముగ్గురు మాత్రము ఈ విధముగా "నిరంజన్, ఏక్‌నిరంజన్, అలెక్ నిరంజన్ అని మాట్లడినారు.

జీవాత్మ అనేవాడు 'నాకు సంతోషం లేదు' అని చెప్పుకున్నాడు. ఇంకొక ఊరిలో ఉన్న ఇంకొక జీవాత్మ ఏమన్నాడంటే 'ఆత్మ' అనేవాడు ఒకడున్నాడు. నా శరీరములో వాడికి ఒక్కనికి సంతోషము లేదు. 'ఏక్‌నిరంజన్' అతను, కానీ అన్ని పనులను అతనే చేయును అన్నాడు. ఇంకొక ఊరిలో ఉన్న జీవాత్మ ఏమన్నాడంటే 'అలేక్ నిరంజన్' అనగా 'ఆ ఒక్కనికి కూడా సంతోషం లేదు' అన్నాడట. వీటికి అసలైన అర్థము ఏమని పరిశీలించి చూసిన యెడల, మనము అనుభవించేదంతా తాత్కాలిక సుఖమే, ఐదు నిమిషములు సుఖం ఉంటే, అరవై నిమిషములు దుఃఖము

ఉండును. కష్టసుఖములు ఒకదాని తరువాత ఇంకొకటి వస్తూనే ఉండును. **‘కష్టసుఖాల మయం, ఈ జీవుని సమయం’** అయితే సుఖము ఒకటి పొందిన తరువాత మరి కష్టము రానటువంటిది ఒకటి కలదు, నీవు ఎప్పుడైతే ఆత్మ జ్ఞానము తెలుసుకుంటావో, అప్పుడు నీకు శాశ్వత సుఖం ఏర్పడుతుంది. తరువాత మోక్షమనే పెద్ద సుఖం ఏర్పడగలదు. ఈ విధముగా ఆత్మజ్ఞానము కర్మ విధానము తెలుసుకున్న తరువాత నేను ఈ ప్రపంచ విషయములందు రంజిల్లుట లేదు, ఒకవేళ సుఖములు ఇప్పుడు వచ్చిననూ అశాశ్వతమైనవి అని తెలుసుకున్న ఒక జీవాత్మ **‘నిరంజన్’** అన్నాడు.

ఆ శరీరములో, జీవాత్మగా వాడు తెలుసుకున్నది వాస్తవమే కదా! ఇంకొక శరీరములో ఉన్న ఇంకొక జీవాత్మ ఏమన్నాడు. ‘నేనే కాదు, నా వెనుక ఇంకొకడున్నాడు వానికి సంతోషము లేదన్నాడు, అనగా తన గురించి ప్రక్కకుపెట్టి తన పొరుగువాడైన, స్నేహితుడైనటువంటి తన శరీరములో ఉన్న ‘ఆత్మ’ అతనిని గూర్చి చెప్పెను. ఆత్మగూర్చి కొందరికి మన శరీరములో ఉన్నాడన్న విషయం తెలియదు. మన శరీరములో ఊటలున్నాయి అని చెప్పాము. ఊటను తీసివేస్తే మరలా ఊరుతుంది. ఊటను తీసేవాడు ఎవడు? నీవు కాదు. నీ శరీరమునంతటికీ శక్తినిచ్చే ఆత్మయే ఆ పని చేయిస్తున్నది. మరి జీవాత్మవైన నీ వెక్కడున్నావు? శిరస్సులో గుణచక్రములో రవ్వంత భాగమై ఉన్నావు. కానీ నీకు తోడుగా ఉన్న ఆత్మ మాత్రము శరీరమంతా ఉన్నది. కనుక జీవాత్మవైన నీకు ఆత్మ ఒక్కటే కనిపించును. నీవు తెలుసుకో గల్గితే, ఈ విధముగా నీవు నిద్రపోతే శ్వాస ఆడించేదీవాడే నీ గ్రంథులలో ఊటలను స్రవింపజేసేదీ వాడే ఒకటేమిటి, అన్ని పనులను చేయించేది నీతో పాటు ఉన్న రెండవవాడే (ఆత్మయే). జీవాత్మవైన నీవు శరీరములో రవ్వంత ఉండి, ఏ పనీ చేయక, ఊరకనే కష్టసుఖాలను

www.thraithashakam.org

అనుభవించేందుకే ఉంటే, 24 గంటలు పనిచేసే ఆత్మ నీ తోడై ఉండేవాడికి కూడా సంతోషం లేదు, నీకూ సంతోషం లేదు. శరీరములో రెండవ ఆత్మ ఒకటున్నదన్న విషయం పెద్దపెద్ద స్వామీజీలకే తెలియదని ఖచ్చితంగా చెప్పుచున్నాము.

భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగములో క్షర, అక్షర, పురుషోత్తమ అనే మూడు పేర్లు పెట్టి దేవుడు చెప్పితే, క్షరపురుషుడు, అక్షర పురుషుడు, పురుషోత్తముడు అని చెప్పితే, ఈ ముగ్గురూ పురుషులే అని చెప్పితే, ఆ ముగ్గరిని పురుషులుగా లెక్కించకుండా, అర్థముకాక ఇంకొక రకంగా చెప్పుకున్నారు పెద్ద భగవద్గీతను రచించినారు ఒక పెద్ద మనిషి. అందులో క్షరుడు అంటే శరీరము 'నాశనమయ్యేది' అని వ్రాశాడు. దేవుడేమో క్షరుడు అని పురుషవాచక అర్థముతో చెప్పితే, ఇతనేమో 'నాశనమయ్యేది' 'ది' అని స్త్రీవాచక అర్థాన్ని చెప్పెను. శరీరమే కదా నాశనమయ్యేది, కనిపిస్తున్నది కదా అని చెప్పితే అందరూ నిజమే కదా! అనుకుంటున్నారు. దేవుడు 'ప్రకృతిం, పురుషం చైవ' అని చెప్పాడు. ప్రపంచములో స్త్రీ అయినా, పురుషుడైనా, ఏ జీవైనా ప్రకృతిలోనే, వారి శరీరములు తయారైనవి అనగా స్త్రీ తత్త్వమైన ప్రకృతితో మన శరీరములు తయారైతే, మన శరీరము స్త్రీయే కదా! మరి క్షరుడు అని పురుషవాచక అర్థముంటే, అలా అర్థమొచ్చేటట్లు చెప్పకుండా 'నాశనమయ్యేవాడు' అనకుండా 'నాశనమయ్యేది' అని అర్థము చేసుకొని, స్త్రీ తత్త్వమైన శరీరమును నాశనమయ్యేది అని చెప్పుకోవట మేమిటి? అదే విధముగా నాశనము కానివాడు అక్షరుడు అనగా జీవాత్మ అని చాలా భగవద్గీతలలో చెప్పియున్నారు. అదీ తప్పే, పురుషోత్తముడు అంటే పరమాత్మ అని చెప్పినారు, అది వాస్తవమే. కానీ సమస్యంతా క్షరుడు, అక్షరునుని గూర్చి చెప్పిన దగ్గరే వచ్చినది.

క్షరుడు అంటే నాశనమయ్యేవాడు అని అర్థము. భగవద్గీతలో ముగ్గురు పురుషులను గూర్చి **'ద్వావిమౌ పురుషౌ లోకే క్షర, అక్షర, యేవచ'** అని క్షర, అక్షరులని పురుషులని నొక్కి చెప్పినా అర్థము కాలేదు. **'క్షర సర్వాణి భూతాని కూటస్థో క్షర ఉచ్యతే'** అనగా పురుషుడు రెండురకములుగా క్షరుడు, అక్షరుడని పిలువబడుతున్నా క్షరుడు అనేవాడు నాశనము అగు వాడు, అక్షరుడనగా నాశనము కానటువంటివాడు, నాశనమయ్యేవాడు, నాశనము కానివానితో కలిసి ఉన్నాడు అని దేవుడు చెప్పినాడు. అనగా జీవాత్మ, ఆత్మ ఇద్దరూ శరీరములో కలిసివున్నారు. అనగా శరీరము వేరు, ఆత్మ, జీవాత్మ వేరు అని అర్థమయిందికదా! క్షరుడు అనగా నాశనమయ్యే వాడు అనగా జీవాత్మ. అక్షరుడు అనగా నాశనము కానివాడు ఆత్మ. ఇప్పుడు మీరంతా శరీరమే కదా నాశనమయ్యేది, జీవాత్మ ఎట్లు నాశనమవుతాడు? ఏదో శరీరములో మరలా ప్రవేశించి, జన్మ తీసుకుంటా డని దేవుడే చెప్పాడు కదా! అని ప్రశ్నించవచ్చును. జీవుడు ఒక్క చావులో నాశనమగును అని చెప్పలేదు గానీ మోక్షములో నాశనమయ్యేవాడు అని చెప్పెను. మోక్షములో జీవుడు నాశనమయితేగానీ దేవుడు కాడు. ఇక్కడ జీవుడు అనగా సకల జీవరాసుల శరీరములలో ఉన్న పురుషుడైన దేవుని అంశగా లెక్కించవలెనుగానీ, జీవుడు అనే పదము పురుషునికే అని అర్థము చేసుకోరాదు.

శరీరము ఆడదైనా, మగదైనా కావచ్చునుగానీ అందులో ఉన్న జీవాత్మ మాత్రము పురుష అంశగా లెక్కించవలెను గానీ జీవుడు అనే పదము పురుషునికే అని అర్థము చేసుకోవలెను. శరీరము ఆడదైనా, మగదైనా కావచ్చునుగానీ అందులో ఉన్న జీవాత్మ మాత్రము పురుష అంశ కనుక 'జీవాత్మ' అని సమాన పదమును భగవద్గీతలో సైతం దేవుడు వాడెను.

కనుక వేల జన్మల తరువాతో, లక్షణ జన్మల తరువాతో నువ్వు జ్ఞానము తెలుసుకుని, జీవాత్మవైన నీవు మోక్షము పొందితే, జీవాత్మవైన నీవు నాశనమయి దైవత్వాన్ని పొందెదవు కానీ, ఎప్పటికైనా నశించేవాడు 'జీవుడే'. శరీరము ఆడైనా, మగైనా కావచ్చునని అర్థమయినది కనుక 'క్షరుడు' అన్నారు. కానీ అందరూ ఇక్కడే తప్పుచేసి ప్రకృతితో తయారైన స్త్రీతత్త్వమైన శరీరముగా పోల్చుకొని మొత్తము భగవద్గీతనే ప్రక్కదోవ పట్టించినారని ఖచ్చితంగా తెలియుచున్నది. కనుక భగవద్గీత ఏనాడో వక్రగతి పాలయింది. 'రూపం మారిన గీత' అయింది. ఇంకొక భగవద్గీతలో ఇంకొక గ్రంథకర్త నాశనము కానిది, అక్షరుడుగా వున్నది మాయ అని చెప్పారు. అక్షరుడు అని పురుష వాచకం పట్టుకొని నాశనముకానిది అని అర్థము వచ్చే విధంగా 'మాయ' అని స్త్రీని సంబోధించి మరలా తప్పు చేశారు. 'నాశనము కానివాడు' అని పురుషవాచకముతో దేవుడు చెప్పితే, 'నాశనము కానిది' మాయ అని స్త్రీవాచకముతో వీరు చెప్పుచున్నారు. ఇప్పుడు భగవద్గీత మరింత ప్రక్క ద్రోవ పట్టించారు సరికదా మేము చాలా వాస్తవ జ్ఞానము చెప్పామని మురిసిపోవుచున్నారు. రెండవ పురుషుడు ఆత్మ అని తెలుసు కోలేక గందరగోళమయినది. ఆ రెండవ పురుషుని గూర్చి మనము విపులముగా తెలియజేశాము. వానికి సుఖము లేనేలేదని మొదటివాడైన జీవాత్మ అంటున్నాడు. నేను నిద్రపోయిననూ పనిచేస్తున్న అతనికి ఏ సుఖము లేదని 'ఏక్‌నిరంజన్' అన్నాడు. అనగా నా ప్రక్కనున్న 'ఒకనికి సుఖములేదన్నాడు' ఇప్పుడు ఇంకొక ఊరివాడు ఏమన్నాడు, 'అలేక్ నిరంజన్' అన్నాడు. వీరిద్దరు చెప్పినదీ నిజమే కానీ, వీరిద్దరూ చెప్పిన దానికంటే మూడోవానికి అదీ లేదు అనగా ఆ సుఖమూ లేదు, అన్నాడు. వాడిని, సుఖపడినాడు, దుఃఖపడినాడు అని చెప్పటానికి వీలులేదు. ఇక్కడ వీరిద్దరూ

www.thraithashakam.org

సుఖపడటం లేదంటే బాధపడుతున్నారు అని చెప్పటానికి కొంత అవకాశము ఉన్ననూ, మూడవానికి బాధలేదు, సుఖములేదు, కష్టము లేదు, నష్టములేదు కనుక 'అలేక్ నిరంజన్' అని సంభోదించినాడు. వీరికి ఏదీ లేకపోతే, వానికి అంతకూ ఏమీ లేదని చెప్పటం ఇక్కడ ఉద్దేశ్యం

ఈ మూడు మాటలు మనము చాలాసార్లు వినే ఉందుము. కానీ ఈ నిరంజన్ ఎవరు? ఏక్‌నిరంజన్ ఎవరు? అలక్‌నిరంజన్ ఎవరు? అనికానీ, వీటి అర్థము ఏమని కానీ ఎప్పుడూ ఆలోచించలేదు. జీవాత్మ, ఆత్మగా, పరమాత్మగా అర్థమయింది కదా. 'మాయామశ్చీంద్ర' సినిమాలో ఈ 'అలేక్ నిరంజన్' అనే పదము ఒక వ్యక్తి అన్నట్లు పెట్టారు. కానీ అది 'ఏమీ లేనివాడు పరమాత్మ' అని వారికి తెలియదు. ఈ రోజు మనకు ఈ విషయం తెలిసినది. మన శరీరములో జీవాత్మకు నిలయం శిరస్సు, తల అని చెప్పుకున్నాము. అలాగే ఆత్మకు స్థానము, బొడ్డును ఆనుకుని ఉన్న బ్రహ్మనాడిలో ఆత్మ ఉండి శరీరాన్నంతటికీ తన శక్తిని ఇచ్చి చైతన్య పరుస్తున్నట్లు ఊరికి మధ్యలో కూడా బొడ్డు అని పేరుపెట్టారు. బొడ్రాయి అని ఆత్మకు స్థానమైనట్లు నిరూపించుటకు నమూనాగా బొడ్రాయిని ఒక దానిని ఊరి మధ్యలో పెట్టినారు. ఇది శరీరమనే ఊరికి బొడ్డు, దానికి ఆధారము ఆత్మస్థానమైనట్లు నిరూపణగా ఊరికి ఊటలున్నాయి. శరీరము అనే ఊర్లో కూడా ఊటలున్నాయి అని సమానంగా చెప్పవచ్చును.

అయితే మేము ఇప్పుడు చెప్పిన విషయములన్నిటికీ ఆధారము భగవద్గీత క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగమే. ఈ విధముగా ఇతర భగవద్గీతలు వ్రాసిన వారు వక్రమార్గముననుసరించి వ్రాసినారు. ఒక వ్యక్తి భగవద్గీతను 'భగవద్గీతం' అని వ్రాశారు. అంటే అర్జునుడు, కృష్ణుడు పాటలు పాడినారా? భగవద్గీత పాట అయింది. గీత అంటే పాట అని వ్రాసుకున్నారు. గీత

www.thraithashakam.org

అంటే హద్దు, గీతము అంటే పాటే అగును. 'భగవద్గీత'ను 'భగవద్గీతం' అని అనుకోవటమేమిటి? దేవుడు శరీరమనే హద్దును పెట్టి, నీ లోపలున్న వారిని గూర్చి చెప్పినాడు కాబట్టి 'భగవద్గీత' అని అన్నాడని మేము చెప్పాము. ఎన్నో కోట్ల ఆస్తులు సంపాదించి, పెద్ద స్వామీజీగా పేరు తెచ్చుకున్న ఒక స్వామి ఇలా భగవద్గీతను, 'భగవద్గీతం' అని వ్రాయటం ఎంత పొరపాటు. దీనిని విని 33 దేశాలవారు, 120 ఆశ్రమవాసులు ప్రక్కదోవ పట్టినారు. అక్షరున్ని మాయ అని చెప్పి, వ్రాసిన గ్రంథములు ఒక్కరోజులో 20,000 గ్రంథములు వెల్లెను గానీ అసలైన వాస్తవజ్ఞానము తెలుపుతున్న మా **'త్రైత సిద్ధాంత భగవద్గీత'** గ్రంథములు 2000 కాపీలు ఐదు సంవత్సరములైనా ఇంకా వెల్లలేదంటే అసలైన జ్ఞానమునకు ఎంత విలువుందో తెలుస్తున్నది కదూ!

అందుకే భగవద్గీతలో కృష్ణుడు, మీకు శ్రద్ధలేకపోతే మాయా జ్ఞానమే తెలియబడి, మాయనుండి మీరు బయటపడుటకు దుస్సాధ్యము కానీ, నా మీద, నాయందు, శ్రద్ధ కల్గితే "బహూనాం జన్మనాంమంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" ఎన్నో జన్మలు ఎత్తి, చివరికి అసలైన జ్ఞానము తెలియును. అందుకే 'మనుష్యాణాం సహస్రేషు" అనే శ్లోకములో కూడా **"ఏ ఒక్కడో నన్ను, నా జ్ఞానమును యధార్థముగా తెలుసుకొనును"** అని చెప్పాడు కదా! కనుక చాలామంది మాయా జ్ఞానమే తెలుసుకుంటూ, మాయలో పడుతున్నారు. దేవునియందు అసలైన శ్రద్ధ లేదు కనుకనే వారికి నేను దొరకను, పట్టుబడను అని చెప్పాను. కనుక శ్రద్ధలేనివారి కొరకు చాలా భగవద్గీతలు తయారు చేయాల్సిన పని వచ్చింది. ఆ భగవద్గీతలు చదివి, నాకు ఈ భగవద్గీతలు తృప్తినివ్వలేదు, సందేహం నివృత్తి కాలేదు అన్నవారికి కొన్ని ఏండ్లకు ఈ మా భగవద్గీత వారికి చేరును, కనుక అక్షరుడు అనే

www.thraithashakam.org

పదము దగ్గర మాయా జ్ఞానమే చెప్పబడినది కానీ, దేవుని జ్ఞానము చెప్పబడ లేదు. బ్రహ్మ, మహత్‌బ్రహ్మ=మాయ అని వ్రాశారు ఒక వ్యక్తి. అంటే బ్రహ్మ అంటే గొప్పవాడు అనగా దేవుడు అని అసలైన అర్థానికి ఇది వ్యతిరేఖం కాదా? కనుక మనమందరమూ ఇకనుండైనా అసలైన జ్ఞానమును తెలుసుకుంటూ, ముందుకు వెళ్ళాలి. అలాగే రాజవిద్యా రాజగుహ్య యోగము అంటే 'రాజ' గొప్పవాడు అనగా దేవుడని అర్థము.

'రాజకీయం' అనగా దేవుని జ్ఞానము యొక్క పని అని అర్థము. రాజకీయం అంటే నేడు ప్రజాసేవ అని అంటున్నారు. పోనీ అదైనా సక్రమంగా చేస్తున్నారా, లేదు. దేవుని జ్ఞానము ఎవరు తెలుసుకుంటున్నా వారు నిజంగా రాజకీయంలో ఉన్నట్లు. అలా కాకుండా ఉన్నవారు రాజకీయులు కారు. నన్ను ఒక వ్యక్తి రాజకీయములోకి వస్తారా అని అడిగాడు. నేను పెద్ద రాజకీయములోనే ఉన్నాను, అని సమాధానము చెప్పాను. వారి దృష్ఠిలో రాజకీయం అంటే మంత్రులు, పదవులు, వారికి అసలైన అర్థము తెలియదు. అలాగే దేవుని జ్ఞానము తెలుసుకొని, పదిమందికి తెలియజేస్తే నిజమైన రాజకీయం అగును. కనుక డబ్బులున్న రాజకీయం కాదది, జ్ఞానధనమున్న రాజకీయమిది. ఇది నీ వెంట వస్తుంది. కనుక ఈ అసలైన రాజకీయములోకి అందరినీ ఆహ్వానిస్తున్నాము.

## 31. ప్రకృతి - వికృతి

తేది : 05-04-2010

2010 సంవత్సరము వికృతి నామ సంవత్సరము. ఈ వికృతి నామ సంవత్సరము 60 సంవత్సరముల క్రితం వచ్చింది. అనగా మేము

www.thraithashakam.org

పుట్టినప్పుడు వచ్చింది. మరలా ఇప్పుడు అనగా 2010లో వచ్చింది. ఈ వికృతి నామ సంవత్సరముతో మాకు అరవై సంవత్సరములు పూర్తి అగుచున్నవి. అరవై సంవత్సరమలు పూర్తి అయినా గానీ మనము ఏమి సాధించాము? అనే ప్రశ్నకు వస్తే, కొందరు ఎన్ని సంవత్సరాలు జీవించినా గానీ ప్రపంచ విషయాలను గూర్చే పట్టించుకుంటారు. మేము మాత్రము పరమాత్మ జ్ఞానముమీద పరిశోధన చేస్తున్నాము కావున మా జన్మమాత్రము కొంత సార్థకమైనది అని చెప్పగలము. కనుక మీరు కూడా సంపూర్ణమైన జ్ఞానము తెలుసుకుని మీ జీవితాలను కూడా సార్థకం చేసుకోండి అని తెలియజేస్తున్నాము.

ఇప్పుడు వికృతి అనే పదమును వింటే దీనికి వ్యతిరేఖమైన పదము ప్రకృతి అని ఉంది. ఈ ప్రకృతి పరమాత్మకు ప్రత్యామ్నాయంగా ఉంటుంది అనగా రెండవ దిశలో ఉంటుంది. దేవుడు ముందుగా ప్రకృతిని తయారు చేసి ఆ ప్రకృతి చేతనే ఈ ప్రపంచమునంతటినీ తయారు చేశాడు. ఈ విధంగా చర, అచర ప్రకృతి అంతా ఉంది. ఈ విధముగా మనము చెప్పుకుంటూ పోతే దేవునికి వ్యతిరేఖమైనది మాయ అనగా దేవుడే మాయకు ఆజ్ఞ ఇచ్చి, జీవరాశులందరినీ నా వ్యతిరేఖదిశలో తిప్పమని చెప్పాడు. మాయ అన్నా ఒక్కటే ప్రకృతి అన్నా ఒక్కటే. 'వికృతి' అంటే ఎవరు 'పరమాత్మ' అని అర్థము. ప్రకృతి అనే పదానికి వ్యతిరేఖంగా వికృతి ఉంది. ఈ విధముగా అరవై పేర్లుగల్గిన సంవత్సరములలో వికృతి నామ సంవత్సరానికి వ్యతిరేఖమైన పదము 'ప్రకృతి' అనే పేరు కనుక అటువంటి వికృతి నామ సంత్సరములో పుట్టడం మా అదృష్టంగా మేము భావిస్తున్నాము. ఆ విధముగా భావించడమే కాకుండా, వికృతి నామ సంవత్సర ప్రాబల్యము ఏముంటుందంటే, జ్ఞానానికే ప్రాబల్యం ఉంటుంది. కావున మనము ఈ రోజు కూడా జ్ఞానము గురించి చెప్పుకుందాము.

www.thraithashakam.org

ఊరు అనే పదమును మనము తీసుకుందాము. ఇప్పుడు పట్టణాలు అయ్యాయి. పూర్వము పట్టణాలు లేవు, ఊర్లు ఉండేవి. ఊరు అనే పదము ఏ విధంగా వచ్చింది అని తెలుసుకుంటే, ఊరు ఎక్కడైతే ఉందో నీరు అక్కడ ఉన్నట్లు, అంటే నీరు ఎక్కడుంటే అక్కడ ఊరు ఉన్నట్లే అంటే బావి అయినా ఉండాలి, నీరైనా ఉండాలి. కోనేరైనా ఉండాలి, ఏదైనా నీటి ఆధారము ఉంటేనే ఊరు ఉంటుంది. నీరు ఊరుతూ ఉంది కనుక దానిని ఊరు అంటున్నాము. ఊరు అనే పదము ఎక్కడనుండి పుట్టింది? ఊట అనే పదమునుండి పుట్టింది. ఊరు ఉంది అంటే అక్కడ నీటి ఊట ఉన్నది అని అర్థము. ఊర్లో కొందరు నివాసముంటారు. వారిలో అజ్ఞానులు కొందరు, ఎందుకు మనము పుట్టాము అని ఆలోచన చేయకుండా బ్రతికే వారు కొందరు, మనము ఎందుకు బ్రతుకుతున్నాము అని ఆలోచించేవారు కొందరు, కొంత జ్ఞానాన్ని తెలుసుకున్నవారు కొందరు, ఏమాత్రము జ్ఞానము తెలియనివారు కొందరు. ఈ విధముగా చాలామంది చాలా రకాలుగా ఊరిలో బ్రతుకుచున్నారు. ఈ విధముగా ఊర్లో చెడ్డవారూ ఉన్నారు, మంచి వారూ ఉన్నారు. జ్ఞానులూ ఉన్నారు, అజ్ఞానులూ ఉన్నారు. ఈ విధంగా రకరకాల వ్యక్తిత్వాలు కలిగిన వారున్నారు. అదే విధంగా రకరకాల భావాలు కల్గిన వారున్నారు. ఈ విధముగా ఎలాగున్నా సరే దానికి మాత్రము ఊరనే పేరు పెట్టినారు. అలాగే ఎవరినైనా మనము ఏ ఊరు నీది? అనే అడుగుతాము. అంటే ఒక ఊరు కాకుండా, ఎన్నో ఊర్లు ఉన్నాయి. మీ అందరూ చాలా ప్రదేశాలనుండి వచ్చారు. మీ అందరిదీ ఒకే ఊరేనా అంటే ఒక్కొక్కరిది ఒక్కొక్క ఊరు. ఈ విధముగా మనము లెక్కవేస్తే, ఊట కలిగిన ప్రాంతం ఎక్కడైతే ఉందో అక్కడ ఊరు తప్పకుండా ఉంది. ఇప్పుడు భగవద్గీతలో ఒక శ్లోకము తీసుకుందాము క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగంలో 13వ అధ్యాయంలో అర్జునుడు ప్రశ్నించినాడు.

"ప్రకృతిం పురుషంచైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ" అనగా ప్రకృతి అంటే ఎవరు? పురుషుడంటే ఎవరు? క్షేత్రం అంటే ఏమి? క్షేత్రజ్ఞుడంటే ఎవరు? అని అడిగాడు. ఇంతకముందే చెప్పాము. ప్రకృతి పరమాత్మ అని ప్రకృతి స్త్రీ అని చెప్పాము. దానికి సమాధానముగా శ్రీకృష్ణుడు ఏమి చెప్పుచున్నా డంటే,

*శ్లో॥ ఇదం శరీరం కౌంతేయా! క్షేత్ర మిత్యభి ధీయతే! ।*
*ఏతద్యోవేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతితద్విదః ॥*

ఈ శరీరాన్నే క్షేత్రం అని అంటున్నారు. ఈ క్షేత్రాన్ని ఎవరైతే తెలుసుకున్నారో వాడిని "క్షేత్రజ్ఞుడు" అంటున్నారు. ఇప్పుడు మన శరీరమనేది ఉంది కదా! ఈ శరీరములో ఊటలు లేకుండా ఉన్నదా? ప్రతీ శరీరములోనూ ఊటలున్నాయి. ప్రతీ శరీరములోనూ గ్రంథులున్నాయి. ఆ గ్రంథులలో ఊట ఉంది, ఆ ఊటలు ఉంటేనే మనిషి బ్రతుకగల్గుచున్నారు. బయట కూడా ఊట ఉంటేనే ఊర్లో బ్రతుకగల్గుచున్నారు. మనము మళ్ళీ ఊరు దగ్గరకు వచ్చాము. ఈ శరీరమే ఊరు నీకు. ఇందులో ఊటలున్నాయి కావున ఊరు అంటున్నాము. ఈ ఊరిలో ఎంతమంది ఉన్నారు? పనికొచ్చే వారున్నారు, పనికి రానివారూ ఉన్నారు. కొన్ని లక్షల మంది ఉన్నారు. కొందరు తెలివైనవారు ఉన్నారు వారిలో కొందరిని 25 మందిగా చెప్పు కుంటున్నాము. ఈ విధముగా ఊట కల్గినది శరీరము. ఈ ఊరిలో 25 మంది తెలివైనవారున్నారు. కానీ శరీరము అనేది ఊరైతే, ఆ శరీరమును అంతటినీ తెలిసి ఉన్నటువంటివాడు, ఊరు పెద్ద లేదా అధికారి అగును. అతను ఏది చెప్తే అదే జరుగుతుంది. నీ శరీరములో ఊరుంది. ప్రతీ విషయం మేము శరీరమనే హద్దులోనే చెప్పాము. అదంతా నీ శరీరమనే ఊరికి సంబంధించిన విషయమే. ఒక ఊరుంటే, దానికొక బొడ్రాయి

ఉంటుంది. దానికి కొన్ని త్రోవలుంటాయి. ఆ ఊర్లో కొందరు వ్యక్తులు ఉంటారు. వారిని తెలుసుకోవటం మంచిది. అదే విధముగా మన శరీరములో చాలామంది ఉన్నారు. ఈ శరీరమంతా నువ్వే అనుకోవటం చాలా పొరపాటు. మొన్ననే ఒక వాక్యం చెప్పాము. **"నీకేమీ తెలియదని నీకే తెలియదు కావున నీవెవరివో నీకు తెలియదు."** ఆ విధముగా మనకేమి తెలియకుండా మనము కాలము గడుపుచున్నాము. ఈ రోజు కనిపించేది మాత్రమే తెలుస్తూ ఉన్నది. శరీరములో నువ్వు ఒక్కడివే ఉన్నావా? లేదు నీతో పాటు తెలివి తక్కువవారు చాలా ఉన్నారు. తెలివైనవారు 25 మంది ఉన్నారు. ఈ విధంగా తెలివైనవారిని, తెలివితక్కువ వారిని కలిపి కాపలా కాస్తున్నవాడు ఒకడున్నాడు. వాడు క్షేత్రాన్నంతటినీ తెలిసినవాడు. వాడే క్షేత్రజ్ఞుడు. నీ శరీరము అంతా క్షేత్రమయితే అందులో ఉండేవాడు దాని గూర్చి తెలిసినవాడు క్షేత్రజ్ఞుడు అవుతాడు.

నీ శరీరములో నీ వీపు భాగాన్నే నీవు చూడలేవు. ఇక నీ లోపల ఏముందో నీకేమి తెలుస్తుంది! నువ్వు అనేవాడివి 25 మందిలో ఒక్కడివి, నీ పేరు జీవుడు. ఊరంతటికీ కలిపి ఒక పేరు పెట్టుకున్నాము. మనస్సు, బుద్ధి, చిత్తము, అహం అను ఇంద్రియాలు ఉన్నాయి. కనపరాని వాయువులు ఐదున్నాయి. ఈ విధముగా 24+నువ్వు కలిపితే 25 అవుతున్నాయి. ఈ 25 కాకుండా నీ శరీరములో మూల మూలలా తెలిసినవాడు ఒకడున్నాడు. వాడు ఎవ్వడు అంటే, ఊరికి అధికారి. శరీరమనే ఊరికి అధికారినే 'క్షేత్రజ్ఞుడు' అంటారు. ఈ శరీరమే క్షేత్రము "ఇదం శరీరం క్షేత్రం" అని గీతలోనే చెప్పారు. నీ శరీరమే క్షేత్రమయితే శరీరాన్ని ఎవరైతే తెలిసినారో వాడు క్షేత్రజ్ఞుడు. శరీరమంతా ఆత్మ వ్యాపించి ఉన్నది. ఆత్మనే క్షేత్రజ్ఞుడు అని చెప్పవచ్చును. నీవు జీవాత్మవు మాత్రమే, నీవు ఆత్మవు కావు. నీవు

www.thraithashakam.org

శరీరములో ఒక భాగానివి మాత్రమే! మనస్సు, బుద్ధి, చిత్తము అనే భాగాలలాగే నీవూ ఒక భాగానివే!

లోపల నీకు యోచనలు వస్తున్నాయి. ఆ యోచనలన్నీ నీవి కావు. శరీరమంతా నీవు ఉంటే ఎక్కడ ఏమి జరిగినా తెలియాలి కదా! మరి డాక్టర్ల దగ్గర మీరు కాలునొప్పని వెళ్తారు కానీ వారు ఎన్ని మిషన్లు పెట్టి చూసినా కొన్ని విషయాలు వారికి తెలియవు. వాటికి చికిత్స చేసినా గానీ బాగైతే బాగవుతుంది లేకపోతే లేదు. అది కర్మలో ఉంటుంది, శరీరము లోపలున్న అధికారి ఒకడున్నాడు కదా! అతను ఒప్పుకొంటే బాగవుతుంది. ఆ ఆధికారి ఎవరైతే ఉన్నారో, వాడే క్షేత్రజ్ఞుడు, అతడే ఆత్మని గుర్తుంచు కోవలెను.

ఇప్పుడు వాతావరణం ఎండగా ఉంది, చెమటలు వస్తున్నాయి కనుక ఉక్క నీ శరీరానికే, నీకు కాదు. ఊరంతా ఉక్కగా ఉంది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు శరీరము గురించి ఈ విధంగా చెప్తే రకరకములుగా మనము అర్థము చేసుకున్నాము. మేము చెప్పిన ఈ ఊరు అనే మాట మీకు దగ్గరగా ఉంటుంది. ఇప్పుడు నీ శరీరమే నీ ఊరు అని తెలిసినప్పుడు, నీ శరీరములో అధిపతి ఎవరు? అని కూడా మీకు తెలిసిపోతుంది. ముందుగా శరీరమనే ఊరుని గురించి పూర్తిగా తెలిస్తే, ఆ ఊరిలో ఉండే అధికారి గూర్చి తెలుస్తుంది. శరీరమును నడిపించే అధిపతి ఒకడున్నాడు. ఆ విషయం మీకు తెలియదు. నీ శరీరములో నీకు పొరుగువాడు ఒకడున్నాడు. వాడు నీకు హితుడు. అతని పరిచయమును సంపాదించుకొనుటకు నీవు ఎవరిని మోసము చేసినా ఫరవాలేదన్నారు, ఒక గ్రంథములో అన్యాయం, మోసము చేసైనా స్నేహితున్ని సంపాదించుకో. స్నేహితుడే నీకు ముఖ్యం. వాడిని సంపాదించుకోవాలంటే ముందుగా నీ శరీరములో ఉండే అతన్ని

www.thraithashakam.org

గురించి తెలుసుకో, లోపలి స్నేహితున్ని గురించి మనము ఎప్పుడైనా ఆలోచించామా? ఎప్పుడూ బయటనే ఆలోచించాము. భగవద్గీతలో మొత్తము శరీరము గురించి చెప్పాడు. దానిని గీత అన్నాము. గీత అంటే శరీరమనే హద్దు ఆ హద్దు లోపలి దానిని గూర్చి చెప్పేది భగవద్గీత. భగవంతుడు చెప్పాడు కనుక అది **భగవద్గీత** అయింది. ప్రతీ శ్లోకము శరీరము లోపలే వర్తిస్తుంది. బయటకు వర్తించదు.

ప్రపంచ వ్యాప్తంగా అనువదించిన అన్ని భగవద్గీతలలో శరీరము లోపలి విషయమును చెప్పుకోలేదు. సంస్కృతంలో భగవద్గీత చెప్పబడింది. ఆ పాండిత్యము కల్గినవారందరూ ఎన్నో వ్యాఖ్యానాలు వ్రాశారు. ఆ వ్యాఖ్యానములన్నీ శరీరము బయట ఉండే విషయాలతో లంకె వేసారు తప్ప, శరీరము అనే హద్దులో ఎవరూ చెప్పలేదు. కనుకనే భగవద్గీత ఎవరికీ పూర్తిగా అర్థము కాలేదు. భగవద్గీత అంటే 'రూపము మారిన గీత' అయిపోయిందిప్పుడు. భగవంతుడు 'గీత' అనే ఆకారాన్ని ఇచ్చి చెప్పినాడు. భగవద్గీతను మేకప్‌మేన్‌లు చాలామంది పెద్ద మేకప్‌లు చేశారు. దానికి ఒకడు తెల్లని రంగు పూశాడు. అంటే భగవద్గీత అనే భావానికి రంగు పుశాడు. ఇంకొకరు ఈ మేకప్ బాగులేదని తెలుపు నలుపు రంగులు మిక్స్ చేసి మరీ మేకప్ చేశారు. ఈ విధముగా 300 ల మందికి పైగా మేకప్‌మేన్‌లు భగవద్గీతను మేకప్ చేసారు. దాంట్లో పెద్దపెద్ద మేకప్‌మేన్‌ల నుండి చిన్నచిన్న మేకప్‌మేన్‌లు కూడా ఉన్నారు. "గీతా మకరందము" అనేది పెద్ద మేకప్. అలాగే నెలరోజుల క్రితం గీతను ఒక పెద్ద మేకప్ చేశాడు. ఆ పుస్తకము 1200 రూపాయలు. మన గ్రంథము 200 రూపాయలు. ఈ పుస్తకముకంటే చాలా పెద్దది తయారు చేసినాడు ఆయన. దాన్ని ఏ విధంగా మోస్తామని ఒక పెద్ద బ్యాగ్‌నే తయారు చేసారు. ఆ

పుస్తకము 10 కేజీల బరువు వుంది. సరే! ఆ పుస్తకములో ఏమి వ్రాశారు? అని చూస్తే. దేవుడుంచిన ముక్కులేదు, ముఖం లేదు. దేవుడిచ్చిన చెవులులేవు, కళ్ళులేవు చివరికి అది దెయ్యంగా తయారయింది. దేవుడు దానిని మనిషిలాగ సృష్టిస్తే అది దెయ్యంగా తయారయింది. దానిని మీరెట్లు చెప్పుచున్నారు? అసూయతో చెప్పుచున్నారా? అంటే మేము అసూయతో చెప్పటం లేదు. దేవుడు ఏ విధంగా అయితే మేకప్ లేకుండా చెప్పాడో ఆ విధంగా మీరు చూస్తే బాగుంటుంది అని మాత్రమే మేము చెప్పుచున్నాము. వాస్తవమైన దాని రూపం మీకు కనిపించాలంటే దానిని వేసిన మేకప్ అంతా కడిగివెయ్యాలి. అప్పుడు మొట్టమొదట దేవుడు ఏ విధంగా తయారు చేసాడో ఆ రూపం మీకు కనబడగలదు. అసలు అందము ఎటువంటిదో, మేకప్‌వేసిన అందము ఎటువంటిదో మీకు అర్థమవుతుంది. మేకప్ చేసినారని మీరెట్లు చెప్పగలుగుచున్నారు? అని ప్రశ్న వేస్తే మీకు ఉదాహరణ చెప్తాము. మొత్తము 750 శ్లోకములలో ఒక శ్లోకాన్ని తీసుకుంటాము.

శ్లో॥ అనన్యాశ్చిన్త యంతోమాం యేజనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

చివరిలో ఏముంది "యోగక్షేమం వహామ్యహం" అని ఉంది. "అన్య చింతలు ఏమీ లేకుండా, నన్నే ఎవ్వడైతే స్మరిస్తూ ఉంటాడో, వాడి యొక్క యోగాన్ని, క్షేమాన్ని నేనే చూస్తున్నాను" అని ఉంది. అక్కడ ఏమి చెప్పారంటే! ఒక పూజారిగా ఉన్నటువంటి వాడికి చాలా రకములైన కష్టములు వచ్చినవట. అప్పుడా పూజారి చాలా బాధపడి నా చుట్టూ ఉన్న దుర్మార్గులు చాలా ధనవంతులుగా బ్రతుకుచున్నారు. నేనేమో చాలా కష్టాలతో బ్రతుకుచున్నాను ప్రతీరోజూ పూజా మొదలగు అభిషేకాలు చేస్తున్నాను

www.thraithashakam.org

కదా! అనే ప్రశ్న వచ్చిందట. భగవద్గీతలో ఏమైనా సమాధానము దొరుకుతుందేమోననుకొని ఇలా తెరచి చూసినాడంట. ఈ శ్లోకము కనిపించింది అందులో యోగక్షేమాలు చూస్తానని చెప్పినాడు కదా! ఎక్కడ చూస్తున్నట్లు? నా ఇంట్లో పిల్లలకు అన్నము లేదు. వారికి కట్టుకునేందుకు మంచి గుడ్డలు లేవు. నాకు త్రాగేందుకే నీళ్ళులేని పరిస్థితి. ఈ రకంగా ఎన్నో తిప్పలు పడుతుంటే ఈ శ్లోకము పూర్తి అసత్యము, శ్లోకము భగవంతుడే చెప్పినా ఇది పూర్తి అసత్యం అని అనుకొని, కోపం వచ్చి ఒక ముల్లు తీసుకుని శ్లోకము మీద బరికినాడట (గీచినాడు). అది తాటాకుల గ్రంథము అయినందున అది గీతగీతలు పడి చిరిగిపోయింది. తరువాత ఊర్లోకెళ్ళి అడక్కుందామని పోయినాడంట. ఆ ఊర్లో కూడా ఎవరూ ఏమీ ఇవ్వలేదంట. సరే! అని ఇంటికి వచ్చే లోపల ఇంటివద్ద ఏమి జరిగిందంటే, ఒక పిల్లవాడు రెండు భుజాలకు రెండు సంచులతో మొత్తం నాలుగు సంచులు తీసుకుని వచ్చి పూజారి భార్యకు ఇచ్చినాడట. మీ భర్త మా శేట్‌ను అడిగాడు, మా శేట్ మీకు ఇచ్చిరమ్మనాడు, అని చెప్పినాడు. మీ భర్త వెనుకనే వస్తున్నాడు అని చెప్పినాడట. ఆ పిల్లవాడు తెచ్చినవన్నీ తీసుకుని వెళ్తుంటే ఆమె చూసేసరికి, ఆ పిల్లవాడి వీపున గీతలుండి చిన్నగా రక్తం వస్తున్నదట. ఆ గీతలు ఈయన తాటాకు మీద గీచిన గీతలని గ్రంథకర్త వ్రాశాడు. అయ్యో! చిన్నపిల్లాడు, రక్తం ఎందుకు వస్తోందని, ఆ పిల్లాడిని అడిగినదట. మా శేట్ తొందరగా సరుకులు ఇచ్చిరమ్మని చెప్పితే, నేను రావటం ఆలస్యమైనదని కోప్పడి, ఈ విధంగా కొట్టినాడులే అన్నాడట. అయితే ఉండు మందు (ఔషధం) తీసుకువస్తానని ఆమె లోపలికి వెళ్ళిందట. ఆమె మందు తీసుకుని వచ్చే లోపలే అతను పోయినట్లు, మాయమయినట్లు వ్రాశారు. తరువాత ఆమె భర్త వచ్చినాడట. ఆమె

www.thraithashakam.org

ఎదురు వచ్చింది. అప్పుడతనికి మరీ ఏడుపు వచ్చిందట, ఎందుకంటే ఈ రోజు ఆహారం ఏమీ తేలేకపోతినే అని ఏడ్చినాడట. ఆమె ఎందుకు ఏడుస్తున్నారు? మనకిప్పుడు ఆహారము ఉంది, ధనముంది, ఏడ్వవలసిన పనే లేదన్నదట. అప్పుడతను ఎట్లా వచ్చాయి? అని అడిగానాడట. ఈ విషయమంతా చెప్పిందంట. గీతలు గాయం అనే సరికీ ఈయనకు చింపేసిన తాటాకు, చిరిగిలేకుండా చక్కగా ఉందట. అప్పుడు అతను అనుకున్నా డట, **"యోగక్షేమం వహామ్యహం"** అనేది నిజమే! అప్పుడప్పుడు దేవుడు నిద్ర పోతుంటాడు గీతలు గీస్తేగాని ఏమీ ఇవ్వడు అని అనుకున్నాడట. అప్పటినుండి ఈ శ్లోకం ఫరవాలేదు సరిపోయింది అనుకున్నాడట. ఈ విధంగా ఆ శ్లోకానికి వివరణ ఆ గ్రంథములో వ్రాయబడింది. సరే! బాగానే ఉందిగానీ, ఇదంతా ఏదో కట్టుకథ! మన కాయగూరలు,గోధుమపిండి, బిస్కెట్లు, తిన్నతిండి గూర్చి ఎందుకు తక్కువ ఇచ్చావు? అని అడుగుచున్నారు. క్షేమాన్ని గూర్చే ఊహించుకుంటే ఆయన ఎవ్వరికీ ఏమీ తెచ్చి ఇవ్వడు. ఆయన గీతలు పెట్టినాడేమో మీరు పగులగొట్టండి, ఒక సంచీకూడా రాదు. ఎవరి కర్మ ప్రకారము వాడికది జరుగుతుంది. ఈ శ్లోకము గురించి వీరు ఈ విధంగా వ్రాయటం తప్పు. ఈ విధముగా వ్రాస్తే దేవుడు మన క్షేమాలు చూస్తాడని మీరు అనుకుంటారు. మీకు మాత్రము కోరికలు నెరవేరవు. మీకు అప్పుడు దేవునిమీద నమ్మకం పోతుంది. అస్సలు దేవుడే లేడు అనే స్థితికి వస్తారు. దేవునికి, మీ క్షేమానికి ఎటువంటి సంబంధము లేదు.

ఒక వ్యక్తి ఏమన్నాడంటే, మా పాప చనిపోయింది. దేవుడుంటే ఇంత అన్యాయం జరిగేదా అంటే, వాస్తవమే ఆయన అడిగేది, ప్రజల్లో భావము అట్లా ఉంది. దేవుడు అందరినీ కాపాడుతాడు అనే ఉద్దేశ్యం ఉంది కనుకనే దేవుడెందుకు కాపాడలేదు? అని అంటున్నారు. మన

www.thraithashakam.org

దుస్థితులకు, దేవునికి సంబంధము లేదు. దేవునికి సంబంధము ఉందనే దేవునికి మ్రొక్కుతున్నారు కదా! దేవుని దగ్గరకు పోయినారంటే ఏదో ఒక కోరికను పెట్టుకునే వెళ్తున్నారు కదా! ఏ కోరికా లేకుండా ఎవరైనా పోతున్నారా? లేదు, దేవుడు నీ చేతకానివిగానీ, నీ కష్టాలుగానీ తీరుస్తాడు అనే ఉద్దేశ్యంతో మ్రొక్కుచున్నారు. లేకపోతే దేవునితో మనకేమి పని? నీ కోర్కెలు నెరవేర్చుతాడని ఎక్కడైనా భగవద్గీతలో ఉందా? నువ్వు ఈ విధంగా ప్రపంచములో అనేక ఆర్థిక ఇబ్బందులు పడి, నానా తంటాలు పడుతూ ఉన్నావు. ఈ యాతనల నుండి బయటపడేందుకు దేవుని జ్ఞానము కావాలి. దేవుని జ్ఞానము ఎప్పుడైతే నీవు తెలుసుకుంటావో అప్పుడు ఈ కర్మల నుండి బయటపడగలుగుతావు. నీవు పుట్టినప్పటినుండే దేవుడు నిర్ణయించిన నీ కర్మానుసారమే నీవు అనుభవించాలని నిన్ను పుట్టించాడు. ఆ కష్టాలన్నీ నీవు చేసుకున్న కర్మలే. మరి ఆ కర్మలన్నీ నశింపజేసుకోవాలి అని నీవనుకుంటే జ్ఞానమనే అగ్ని కావాలి. **"జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మాసాత్ కురుతే తథా"** అని అన్నారు. మరి ఆ జ్ఞానము ఎట్లు వస్తుంది, దేవుని విషయం తెలుసుకోవటమే జ్ఞానము. అప్పుడు నీ కర్మలు పోతాయి. కానీ మ్రొక్కుకుంటే పోవు. ఎవరి కష్టం తీసివేయటానికిగానీ, లేకుండా చేయడానికిగానీ దేవుడు అధికారి కాడు. "ఎవ్వరి పాపంగానీ, ఎవ్వరి పుణ్యంగానీ నేను తొలగించను, కల్పించను నాకు వాటితో సంబంధము లేదు. మీకు మీ కర్మకే సంబంధము. నీ కర్మ ఏ విధముగా ఉంటే ఆ విధముగానే జరుగుతుంది" అని అన్నాడు. మొట్ట మొదటే పుట్టినప్పుడే నీ బ్రతుక్కు ఒక పథకము వేయబడింది. జాతకం ప్రకారము జరిగి తీరుతుంది అని దేవుడు చెప్పినాడు. ఈ విధంగా దేవుడు మన కష్టాలు తీరుస్తాడు అని గ్రంథకర్తలు చెప్పినందువలన, గీత **'రూపం మారిన గీత'** అయింది.

మేకప్ మ్యాన్‌లు చాలామంది ఈ రోజు తయారయిపోయారు. నేనిప్పుడు ఈ మేకప్‌లన్నీ కడిగిస్తాను. అంటే అసలు రూపం కనిపిస్తుది. ఒకటి తయారు చేయాలంటే ఇంకొకటి తయారు అయిపోయింది. ఈ రకంగా భగవద్గీత మనకు అర్థము కాకుండా పోయినది. భగవద్గీతను బాగా కనిపింపజేయాలని ప్రజలందరికీ బాగా అర్థము అయ్యేటట్లు చేయాలని చేసిన ప్రయత్నం ఇది, వారి ప్రయత్నము వలన భగవద్గీత మనకు అర్థము కాకుండా పోయింది. ఇదంతా ఎందుకు చెప్పుచున్నామంటే, ప్రకృతికి విరుద్ధమైనది వికృతి. ప్రకృతి వరంగా పుట్టినటువంటి వాళ్ళంతా ప్రకృతి వరంగానే బయటనే చూసి వ్రాస్తున్నారు. కనుక మనము వికృతి వరంగా చెప్పుకోవలెను. అంటే జ్ఞానవరంగా దేవుని జ్ఞానమును చెప్పుకోవాలి.

కనుక ఈ వికృతి నామ సంవత్సరములో **"రూపం మారిన గీత"** అనే గ్రంథమును మేము వ్రాయబోవుచున్నాము. కృతిమముగా తయారు చేయబడిన భగవద్గీతను సహజముగా మరలా చూపించటము మా కర్తవ్యము. మీరు వ్రాసిన భగవద్గీత ఉంది, అదే అసలైన భగవద్గీత అని ఎట్లు తెలుస్తుంది. వారి భగవద్గీతే కరెక్ట్ ఏమో ఎట్లా తెలుస్తుంది? మీరు కూడా మేకప్ వేసి ఉంటారు కదా? అని మమ్మల్ని కొందరు ప్రశ్నించ వచ్చును. ఎందుకంటే నేను ఏ మేకప్ చేయలేదు. నేను అన్ని మేకప్‌లను కడిగేస్తే ఏ రూపం మిగులుతుంది, దేవుడు పెట్టిన రూపమే మిగులుతుంది. అందుకు మేము ఏమి చెప్పుచున్నామంటే సంస్కృతము నోటితో పలికేటువంటి భాష. సంస్కృతంలో భగవద్గీత వ్రాయబడింది. మరొక విధంగా సం+స్మృతము అనగా హృదిలో కల్గే భావము. నోటితో పలికే భాషను చూడవద్దండి, హృదిలో కల్గే భావాన్ని చూడండి. అప్పుడు భగవద్గీత అంటే ఏమిటో తెలుస్తుంది. నేను చెప్పుచున్నది సం, కృతమ్ అనే దానిని

గూర్చి చెప్పుచున్నాను. భావము మంచిగా ఉంటే ఫరవాలేదు భాష మంచిగా, చక్కగా ఉన్నా ప్రయోజనము లేదు. స్పష్టంగా నేను పిలిచానను కోండి, ఏముంది మీకు అర్థము కాకపోతే నా భాష స్పష్టంగానే ఉంటుంది. కానీ మీకు అర్థము కావాలి కదా! నేను స్పష్టంగా పలకక పోయినా నా భావము మీకు అందితే చాలు, కనుక నాకు భావము ప్రాముఖ్యంగానీ భాష ప్రాముఖ్యం కాదు. నాకు నోటితో తెలిపే భాష సరిగా తెలియదు. ఎందుకంటే మేము మాట్లాడుతూ కొన్ని అక్షరాలు పదాలు మింగేసి మాట్లాడుతాము. పదాలు కరెక్ట్‌గా చెప్పలేము. నాలో ఆ లోపము ఉందని నేను ఒప్పుకున్నాను. మాకు భాషా పాండిత్యము లేదు భాష తెలిసినవారు బాగున్నారు కానీ వారికి భావము తెలియదు. కానీ నాకు హృదిలో మెదిలే భావము మాత్రము తెలియును.

నేను ఏమి చెప్పుచున్నానంటే **"నీవు మూడు కాసుల పనులు మానుకో ఏడు నాడుల పనులు చేసుకో"** ఇదేమి భాష అనుకోవద్దండి ఇది భాషకాదు భావము. పూర్వము డబ్బులను రూపాయలు అనలేదు కానీ 'కాసులు' అనేవారు. పూర్వము 'కాసుల మూటలు' అనేవారు అంటే డబ్బు మూటలని, పూర్వము డబ్బు రూపాయిలు తెలియవు. ఆ పదాలు లేవు. మూడు కాసులు అంటే మూడుకాసుల పనులేనా మనము చేసేది. ఇప్పుడు మనము ఏదైనా చేస్తే నూరుకాసులు వస్తాయి. నూరుకాసుల పనులు అనుకోవచ్చు కదా! మూడు కాసుల పనులేమి? ఆ విధంగా మూడు కాసుల పనులే అని ఎందుకు అంటున్నాము. అని ప్రశ్న వస్తే, ఎవరైనా స్కూల్‌కి జాయిన్ చేయమని వస్తే అరగంట, గంట చెప్తారు. ఎందుకు ఆ గంట వారు మాట్లాడినా అందులో జ్ఞానము ఏముంది? కూటి కొరకు కోటి విద్యలు అన్ననూ, కోటి విద్యలైనా ప్రారంభమయింది

ఎక్కడనుండి అనిన మూడు గుణములైన సత్వ, రజో, తమో గుణములనుండే కదా! అంటే మూడు గుణములనుండే ఏ పనైనా ప్రారంభమయ్యేది. కనుక **"మూడు కాసుల పనులు మానుకో"** డబ్బులు సంపాదించేవే ఇవన్నీ, ఎన్ని నువ్వు సంపాదించినా విడదీస్తే మూడు భాగములే అగును. తామస భాగము లేదా గుణముననుసరించి ఎన్ని డబ్బులు సంపాదించినా అది మూడు భాగములలో తామస భాగమే అగును. అదే విధంగా రజో, సత్వ గుణ భాగములను అనుసరించి ఎంత సంపాదించినా అవి ఒక్కొక్క భాగమే అగును. కనుక పెద్దలు మూడు కాసుల పనులు మానుకో అన్నారు.

**"ఏడు నాడుల పనులు చేసుకో"** నీ శరీరంలో అనగా నీ ఊర్లోకే వచ్చాము. ఎవరు ఏ పేరుతో పిలిపించుకున్నా అది నీ పేరుకాదు, నీ శరీరము పేరు. మరి నీ పేరో 'జీవాత్మ', ఫలానా సూర్యనారాయణ అంటే అది అతని శరీరము పేరుగానీ లోపలున్న జీవాత్మకు కాదు. కనుక నీవు వేరు, నీ శరీరము వేరు. నీకు రూపము ఉంది, స్వరూపము ఉంది. నీ రూపం వేరు, స్వరూపం వేరు. శరీరం నీ రూపమూకాదూ, స్వరూపమూ కాదు. ఎందుకంటే ఏదో ఒక రోజు నీవు దీనిని విడిచిపెట్టిపోతావు. శరీరము ఇక్కడే ఉంటుంది. వాడు తెల్లవారుజామునే పోయాడు అంటారు. శరీరము మాత్రము ఇక్కడే క్రిందపడే ఉంటుంది. కాల్చేంతవరకో, పూడ్చేంతవరకో. ఈ విషయాలన్నీ జ్ఞానవరంగానే చూడాలి కానీ వీటిని ప్రపంచవరంగా మాట్లాడితే వీడికి తిక్కపట్టింది అంటారు. ఈ విధముగా జ్ఞానవరముగా లెక్కవేసుకుంటే శరీరమే ఒక ఊరు కొన్నాళ్ళు ఇందులో ఉండి మరలా పోతాము మనము. మేము ఇప్పటికి 33 ఊర్లు మారాము. ఏ ఊర్లు అంటే బయట ఊర్లు. లోపల శరీరము అనే ఊర్లు కాదు. శరీరము అనే ఊర్లు ఎన్ని మారామో ఎవరికీ తెలియదు. ఎందుకంటే

మనకి అవేవీ గుర్తు ఉండవు. మేము వికృతి నామ సంవత్సరంలో పుట్టాము. ఇప్పటికి మాకు 60 సంవత్సరములు పూర్తి అయినవి. వికృతి నామ సంవత్సరము ప్రత్యేకత ఏమంటే ప్రకృతికి వ్యతిరేఖము. కనుక ప్రకృతికి వ్యతిరేఖమైన జ్ఞానము చెప్పవలెను. ఏమంటే అదే దేవుని జ్ఞానము. కనుక మీరంతా శరీరములో ఒక భాగమనీ, శరీరమంతా మీరు కాదని, తన మీద తను గుర్తు పెట్టుకుని జ్ఞానము తెలుసుకునుటకు ప్రయత్నం మొదలు పెట్టండి. అందుకే ప్రకృతికి వికృతి జ్ఞానమే అవసరము. కనుక భగవద్గీత మనకు ప్రామాణికం, అందరూ వేదాలు ప్రామాణికం అంటున్నారు. వేదాలలో జ్ఞానము లేదు అంతా ప్రకృతి విషయాలే, అందుకే అన్ని మతాల వాళ్ళకి ఇప్పుడు ఈ వేదం నచ్చుచున్నది. కనుక నీకు స్వచ్ఛమైన జ్ఞానము కావాలి అంటే, భగవద్గీత ముఖ్యము. బయట జ్ఞానము కావాలంటే వేదాలే ముఖ్యము. "ఈ వేదాల వలన నేను తెలియబడను" అని దేవుడు చెప్పినాడు. కాని జ్ఞానము తెలిసినవాడికి మాత్రము నేను తెలియబడతాను. యజ్ఞాల వలన, తపస్సుల వలన, దానాలు వలనగానీ నేను తెలియబడను. ఈ రోజు మెడిటేషన్ అంటున్నారు అది కూడా సరైన త్రోవకాదు. అంటే ధ్యానం వలన కూడా తెలియబడడు. మమ్మల్ని కొందరు ప్రశ్నించారు. మీరెంతసేపు ధ్యానం చేస్తారని. మేము ధ్యానం చేయటమేమి మేము అట్లాంటివేవీ చెయ్యము అని చెప్పాము. అంటే ధ్యానం చేయకుండా ఎట్లా స్వామి అయ్యారు? అన్నారు. అంటే ధ్యానముకు, స్వామికి సంబంధమేమీ మరి ధ్యానం చాలామంది చేస్తారు అయితే వాళ్ళంతా స్వాములా? ధ్యానముకు, దేవునికి సంబంధము లేదు. ఈ మాట క్రొత్తగా, విచిత్రముగా ఉంటుంది. భగవద్గీతలో చెప్పారు ఇది నేను చెప్పినది కాదు. కనుక భగవద్గీత ప్రకారం మీరు నడుచుకోండి. అప్పుడు జ్ఞానము తెలుస్తుంది.

www.thraithashakam.org

# 32. హరికాలు - హరచేయి

తేది : 28-04-2010

సకల జీవరాసులను సృష్ఠించిన దేవుడు, తనకు నిరూపణగా కొన్ని గుర్తులను జీవుల శరీరములో ఇమిడ్చి పెట్టెను. అటువంటి వాటిలో ఎదమీద ముద్రను మనము తెలుసుకున్నాము. ఎదమీద ముద్ర ప్రకృతి, పరమాత్మలకు చిహ్నాము. శరీరము ఆడదైనా, మగదైనా ముద్ర మాత్రము ప్రకృతి, పరమాత్మలకు గుర్తే అది. ఈ ఎదమీద ముద్ర మతమును గూర్చి పెట్టలేదు. పథమును గూర్చి పెట్టినది. మన శరీరములో ఎన్ని గుర్తులు పెట్టినా మనము చూడకుండా బయట ఎన్నో నియమాలు, ఆచారాలు ఏర్పరచుకొని, ప్రాకులాడుతూ ఒక్కొక్క నియమాన్ని, ఒక్కొక్క మతము అంటున్నారు. కానీ మనము ఇప్పుడు చెప్పునది మతమునకు సంబంధించి నది కాదు. మనము చెప్పు జ్ఞానము మతమేదైనా మనిషికి సంబంధించిన జ్ఞానము చెప్పుచున్నాము.

ఇప్పుడు ఇంకొక విషయము గూర్చి తెలుసుకుందాము. మన శరీరమంతా చర్మముతో కప్పబడి ఉన్నది. అయితే 'చర్మము' అనేమాట **'మర్మము'** అనేమాట నుండి పుట్టినది. శరీరము అనే దానిలో ఏముందో తెలియక మూసిపెట్టినది కనుక మర్మమే అగును. అలా రూపాంతరము చెంది చర్మము అయినది. అయితే శరీరములో ఏమి ఉన్నాయని చూచిన కనిపించేవీ ఉన్నాయి, కనపడనివి ఉన్నాయి. వైద్యులు ఎముకలు, రక్తము, మాంసమే కదా ఉన్నవి అనవచ్చును. అయితే అవి మనము చనిపోయిన తరువాత కూడా ఉన్నవి. బ్రతికున్నవారిలో మనస్సు ఉంది, చనిపోయిన వారిలో లేదు. జీవుడు బ్రతికున్న వారిలో ఉన్నాడు, చనిపోయిన వారిలో లేడు. ప్రాణము బ్రతికున్న వారిలో ఉంది. చనిపోయిన వారిలో లేదు.

ఇక్కడ జీవుడువేరు, ప్రాణం వేరు అని గ్రహించవలెను. ఈ విధముగా కంటికి కనిపించని బుద్ధి, చిత్తము, అహం, మనస్సు, జీవుడు, ప్రాణములు (ఐదు) ఇవన్నీ లోపల తెలియకుండా ఉన్నవి. చర్మము మీద లింగప్రతిష్ట (భూమిమీద జరుగక మునుపే) పాణిమట్టము, లింగములు, ప్రకృతి, పరమాత్మలకు గుర్తుగా ఎదమీద దేవుడు సృష్ఠించి పెట్టాడు. మన శరీరమంతా ఉన్న చర్మమునకు, ఎదమీద ముద్ర ఉన్న చర్మమునకు తేడా ఉన్నది. అదే విధముగా హస్తము, పాదమును మనము చూసినట్లైన, మన చర్మములో తేడా కలదు.

ఇప్పుడు హస్తములను ఉదహరించిన హస్తములు ఒకరికి పోలినట్లు ఇంకొకరికి ఉండవు, ఇది మొదటి ప్రత్యేకత. అలాగే రోమములు హస్తములలో ఉండవు. పాదములలో కూడా ఉండవు. ఈ రకంగా ఉండవు కనుకనే పోలీసువారు దోషుల నిర్ధారణకు ఫింగర్ ప్రింటింగ్ పద్ధతులను అవలంబిస్తున్నారు. మన హస్తములో ఉన్న చర్మానికి, హస్తము మినహా ఉన్న చర్మానికి తేడా ఉన్నది. ఇంతకుమునపు హస్తములో మూడు రేఖలు, క్షర, అక్షర పురుషోత్తములకు గుర్తు అని కూడా చెప్పినాము. అదే విధముగా ఇది త్రైత సిద్ధాంతమునకు గుర్తని కూడా చెప్పుకున్నాము. ఇప్పుడు పాదము గూర్చి చెప్పుకుందాము. ఇప్పుడు మనము చెప్పుకుంటున్న అరచేయి “హరచేయి”గా పూర్వము ఉండేది. అదే విధముగా ‘అరికాలు’ అనునది “హరికాలు” గా పిలిచేవారు. కాలగమనములో అవి రూపాంతరము చెందినవి. హరి, హర అనుపదములు వచ్చును. హరి అనగా పాలించు వాడు, నడిపించువాడు అని అర్థము. అదే విధముగా హర అనగా చంపేవాడు, నాశనము చేసేవాడని అర్థము. అందుకే ఏదైనా నాశనము చేసేది చేయితోనే కదా చేసేది!

www.thraithashakam.org

అదే విధముగా కాలు క్రింద పాదభాగములో ఒక తగ్గు ఉండును. అలాగే చేతులకు మధ్యలో తగ్గులు కలవు. హస్తములలో మనం పరిశీలించిన, హస్తములో వ్రేళ్ళ క్రింద భాగము అంతా మిట్ట (ఎత్తుగా) ఉండి మధ్యభాగం పల్లముగా, కొద్దిగా తగ్గు కనిపించును. దీనిని మనము ఇప్పుడు పిలుచుచున్న అరచేతిలో చూడవలెను. నిజముగా అది 'హరచేయి' అదే విధముగా కాలి క్రిందభాగమైన పాదములో కూడా, అనగా అరికాలు (హరికాలు) భాగములో కూడా పాదము అడుగుభాగము చుట్టూ ఎత్తుగా ఉండి, మధ్య భాగము అంతా తగ్గు ఉండును. మన తడికాళ్ళతో అరుగుమీద నడచినచో, పాదము అచ్చు అంతా పడక, కొంత భాగమే పడును, అలా పడని భాగమే తగ్గుగా మనము చెప్పుకుంటున్నాము.

ఇప్పుడు రెండు చేతులకు రెండు తగ్గులు కలవు. రెండు చేతులను కలిపిన ఏమగును? నమస్కారం అగును. దానితోపాటు రెండు తగ్గులు కలిసి, లింగాకారము కనిపించును. అది పరమాత్మకు చిహ్నమే కదా! రెండు కాళ్ళ పాదములను జోడించిననూ, లింగాకారమే కనిపించును. ఇది నా వలననే నీవు జీవింపగలుగుచున్నావు. నేను అంతటా వ్యాపించి ఉన్నాను, నీ పాదములలోనూ నేనే ఉన్నాను మరియు నీ హస్తములలో కూడా నేనే ఉన్నాను. దీనినే భగవద్గీతలో శ్రీకృష్ణుడు క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగములో 14వ శ్లోకములో ఇలా చెప్పాడు.

శ్లో॥ సర్వతః పాణి పాదం తత్ సర్వతోక్షి శిరోముఖమ్ ।
సర్వత శ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥

పరిశుద్ధాత్మ అనునది పాదములు, హస్తములు, ముఖము, శిరస్సు అంతటా వ్యాపించి ఉన్నది. ఇప్పుడు మనము జ్ఞానచక్షువులతో చూచిన కనిపించును. అంతటా ఉన్న పరమాత్మను చూడాలంటే ప్రకృతి కండ్లు

పనికిరావు. ఆ విధముగా ప్రకృతి ఇచ్చిన కళ్ళతో చూస్తే, తలలో వెంట్రుకలు కనిపిస్తాయి. చేతిలో రేఖలు కనిపిస్తాయి. తగ్గులు హస్తములో, పాదములలో కనిపిస్తాయి. కానీ ఎందుకలా కనిపిస్తున్నాయి. ఇప్పుడు **హరి అంటే పాలించువాడు, బ్రతికించువాడని** (హరికాలు), **అలాగే హర అంటే వదిలించువాడు, నాశనము చేయువాడు** (హరచేయి)గా పేర్లతో పిలిచెను. హరి, హర ఎవరనగా పరమాత్మే. కనుక దీనిని కనుక్కునేందుకు అరచేయి (హరచేయి) పైన ఉన్న చర్మమునకు హర (అర) చేతిలో ఉన్న చర్మమునకు తేడా కలదు. ఈ విధముగా చేతిలోనూ, పాదములోనూ ఉన్న అమరిక, హి(ఇ)ందువుల కేనా, క్రైస్తవులకు కాదా, ముస్లీమ్‌లకు కాదా అంటే, దేశములో ఏ మతస్థుడ వైనా సరే, వారికి ఈ గుర్తులుండును. ఎవరికైనా ఈ గుర్తులు లేకుండా లేరు.

ఈ విధముగా చెప్పుకొనిన సర్వత్రా వ్యాపించినవాడు ఒకడున్నాడు. అంతటా వ్యాపించినవాడు, అనేక గుర్తులతో, మనకు జ్ఞానాన్ని ప్రతిష్ఠించి యున్నాడు. మనం వాటిని తెలుసుకో లేకుండా ఉన్నాము. అదే విధముగా మన శరీరములో జ్ఞానము ఉన్నది, మాయ ఉన్నది. అలాగే ప్రకృతి, పురుషులకు గుర్తుగా మన శరీర అమరిక కలదు. అందుకు సూచనగా కుడి, ఎడమ భాగములుగా మన శరీరము విభజించబడినది. పాప, పుణ్యములను కష్టసుఖములను, ప్రకృతి, పురుషులను అను ద్వంద్వములను అనుసరించి నీ శరీరము ఒకవైపు ప్రకృతికి గుర్తుగా ఎడమవైపు, ఒక భాగం పురుషునికి గుర్తుగా కుడి శరీర భాగం విభజించబడెను.

ప్రకృతిని తయారు చేసినదెవరు? పరమాత్మయే. ప్రకృతివేరు, పరమాత్మవేరు అని చెప్పుకున్ననూ, ప్రకృతిలో కూడా ఆవహించి ఉన్నవాడు పరమాత్మయే. నీ శరీరములో కుడి, ఎడమల భాగములలో, పరమాత్మ

ప్రకృతులు భాగములని చెప్పవచ్చును. కానీ ఎడమవైపు ప్రకృతి భాగములో కూడా పరమాత్మయే ఉన్ననూ, అది ప్రకృతి భాగమే అని పిలిచెదము. ఇప్పుడు ప్రకృతి, పరమాత్మలు వేరువేరుగా లేకుండా కలిసిపోయిన ఏమగును? ప్రపంచము లేకుండా పోవును. కంటికి కనిపించే ప్రపంచము వేయి యుగముల కాలముండును. అదే విధముగా కంటికి కనిపించని ప్రపంచము వేయియుగముల కాలముండును. అనగా వేయి యుగముల ప్రకృతి, పురుషులు విభజింపబడి ఉన్నారు. వేయియుగములు ప్రకృతి, పురుషులు విభజింపబడక కలిసి ఉన్నారు. ప్రపంచములో విడివిడిగా ఉన్నారు కావున, విడిపోయినట్లే మన శరీరములో ఇప్పుడు చెప్పుకొనవలెను.

అదే విధముగా ప్రకృతి, పురుషులు కలిసి పోవునప్పుడు పరిస్థితి ఏ విధముగా ఉండునో, ఎవరూ వివరించలేరు. నిద్రను గురించి చెప్పలేనట్లు చెప్పలేము. కానీ విడిగా ఉన్నప్పటి పరిస్థితైనా ఇప్పటి ప్రపంచ పరిస్థితే కావున వివరించవచ్చును. అది అలా ఉండగా, ప్రకృతిలో మనమంతా ఉన్నామని, పురుషుడనేవాడు ఒకడున్నాడనిగానీ అనే విషయం ఎవరికీ తెలియదు మనము మాయలో ఇరుక్కుని, మాయలోనే ఉన్నాము. ప్రకృతి, పురుషులు వేరువేరుగా ఉన్నారని తెలియజేయటం కొరకే నీ శరీరము సూచికగా ఉన్నది, రెండు భాగములుగా విభజించబడి ఉన్నది. అయితే ఇప్పుడు ప్రకృతి అనే భాగము లేకుండా పోయిన ఏమగును? సంపూర్ణమైన పరమాత్మయగును, మోక్షము లభించును అప్పుడు ప్రకృతి అనునది లేదు. ఆ విధముగా ఏకమయ్యే కాలము కూడా ఒకటున్నది. ఆ రోజు సంపూర్ణమైన పరమాత్మ ఏర్పడును. కానీ నీ శరీరములో రెండు భాగములున్నవి. రెండు హస్తములలో రెండు తగ్గులు కలవు. వాటిలో నీవు గీత గీసుకుని చూసిన, నీకు ఒక్కొక్క హస్తములో ఒక్కొక్క తగ్గువున్నది. కానీ రెండు కుడి,

www.thraithashakam.org

ఎడమలుగా వ్యతిరేఖముగా చేతులను కలిపిన ఏకరూపమైన లింగాకార మేర్పడును. ప్రకృతి చివరికి ఉండదు. పరమాత్మయే మిగులును అని చెప్పేందుకు సూచిక కాదా ఇది. వెయ్యియుగముల తరువాత ప్రకృతి లేకుండా పరమాత్మయే మిగిలినట్లు నీవు జ్ఞానము తెలుసుకున్న రోజున, నీ కర్మంతా అయిపోయిన రోజున నీవేమి అవుతున్నావు, పరమాత్మవవు తున్నావు. నీవు ముందు పరమాత్మలో భాగానివే, కానీ ప్రకృతిలో ఇరుక్కున్నావు. తరువాత ప్రకృతినుండి విడివడి పరమాత్మలో ఐక్యమవు చున్నావు. నీవు జీవాత్మ అనే పేరు లేకుండా అయిపోవుదువు. **చంపేవాడు వాడే, పాలించేవాడు వాడే**, అనగా హరుడు వాడే, హరీవాడే కనుక హరకాళ్ళు కలిపినా, హరిచేతులు కలిపిన నీకు తగ్గులు కలుసుకొని ఏకమైన లింగాకృతయిన పరమాత్మ గుర్తు కనిపిస్తున్నది.

కొందరు హరి అనగా కిరీటం ధరిపంచేసి, విష్ణువని వర్ణించి చెప్పారు. హరుడు అనగా జడలు పెట్టి, పామును మెడలో వేసి, శివునిగా చెప్పారు. హరుడు అంటే స్మశానంలో ఉండేవాడని, హరి అంటే ఊర్లో ఉండేవాడని చూపించారు. నిన్ను పాలించువాడు, చంపేవాడు కూడా దేవుడే, కనుక రెండు ఒక్కడే అని తెలియజేసే విధముగా హరకాలులోను, హరచేయిలోనూ రెండూ ఒక్క గుర్తులే ఉన్నవి.

ఇదే విషయమును క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగములో కూడా చెప్పెను. శరీరమనేది క్షేత్రము, ఒక ఊరు, ఒక జాగా అందులో క్షేత్రజ్ఞుడు అనగా నివాసము చేసేవాడొకడున్నాడు. ఊరికి పెద్ద ఒకడున్నాడు. వారిద్దరి గూర్చి చెప్పుచున్నానని, **'పాణిపాదంతత్ సర్వతోక్షి శిరోముఖమ్'** అని చెప్పినాడు. కనుక అక్కడ కూడా చేయి, పాదముల గూర్చి చెప్పెను కనుక, ఈ రోజు మనము ఈ విషయం చెప్పడం వలన, ఇందులో కూడా విశేషమైన

జ్ఞానము ఉంది, మనము ఇన్ని రోజులు ఎందుకు తెలుసుకొనలేదు అని అనుకొనవచ్చును.

ఈ విషయమును ఎప్పటికైననూ తెలుసుకుంటారని పూర్వపు పెద్దలు మనము ఉదయం నిద్రలేస్తూనే ఈ హ(అ)ర చేతిని చూసుకొనమని చెప్పారు. దైవప్రార్థనలో కూడా ఈ చేతులనే జోడించమని చెప్పారు. ఈ చేతులు జోడిస్తే నీ ముఖమునకు ఏమి కనిపిస్తుంది, తగ్గు కనిపిస్తుంది, ఆ తగ్గు పరమాత్మకు చిహ్నామే ఏ ఇతర గ్రంథములలోనూ లేదు. కేవలం భగవద్గీతలో ఉంది, కానీ దానిని ఇంతవరకు ఎవరూ గ్రహించలేదు. కనుక మనకు ఆ విషయం తెలియకుండా పోయింది. అదే విధముగా ప్రతీ జీవి యొక్క కర్మ వేరువేరుగా ఉన్నది. ఏ ఒక్కరి కర్మ ఇంకొకరి కర్మతో పోలిక ఉండదు. ఒకవేళ ఉన్ననూ, కొద్ది తేడా అయినా ఉండును. జ్యోతిష్య శాస్త్రం ప్రకారము చూసిన, 12 లగ్నములు కలవు. ఒక్కొక్క లగ్నాన్ని ఏడు లక్షల భాగాలుగా విభజిస్తే అనగా 12×7=84 లక్షల భాగాలుగా విభజించాలి. (మన జ్యోతిష్య శాస్త్రవేత్తలందరూ ఒక్కొక్క లగ్నాన్ని 9 భాగములుగానే విభజించారు) ఒకదానికొకటి సంబంధము లేకుండా ఉన్నది. ఆ విధానము తెలిసే విధముగా కర్మ ఒకరితో సంబంధము లేకుండా ఎవరి కర్మ వారిదే అన్నట్లు వేరువేరు భావాలు కలిగియున్నారు. అంతా వేరువేరుగా ఉందన్న దానికి గుర్తుగా హరచేయిలోగానీ, హరి కాళ్ళలోగానీ ఉన్న గీతలు, ఒక మనిషికి ఉన్నట్లు ఇంకొక మనిషికి లేవు. అన్నీ గీతలే కానీ ప్రపంచములో ఎవరి గీతలు ఇంకొకరిలాగ ఉండవు. దానినే భగవద్గీతలో **'కర్మవిసర్గః'** అన్నాడు. అనగా చిన్నచిన్న భాగాలుగా, చేసుకుంటూ పోతే, కనిపించరాని భాగాలుగా అయిపోవును. అందువలననే కర్మలు ఒక్కొక్కరికి వేరువేరుగా ఉన్నాయి అన్నారు.

అందరూ ఇప్పుడు నేర నిర్ధారణకు బొటనవ్రేలి ముద్ర తీసుకుందురు గానీ మొత్తము చేయంతా తీసుకున్నా వేరువేరుగానే ఉండును. పెద్దగీతలు మూడు మన హస్తములో జ్ఞానమును తెలియజేయును కానీ వాటి మినహా ఉన్న చిన్న గీతలు మీరు భూతద్దములో పెట్టి చూసినా కనిపించును అవి కర్మలకు గుర్తులు.

హస్తములను హిందూమతములోనే కాదు, క్రైస్తవ మతములో కూడా చేతులు రెండూ ప్రక్క ప్రక్కనపెట్టి చూసుకొని, కళ్ళకు అద్దుకుందురు. మనము ఉదయము లేవగానే చేతులను చూసుకుందుము కానీ ఎవరూ గ్రహించుకోలేదు. ఇప్పుడు నువ్వు ఏ మతస్థుడువైన కావచ్చును, కానీ ఇవన్నీ అందరికీ సమానమే.

ఈ విధముగా శరీరము బయటనేకాక శరీరము లోపలకూడా చాలా విశేషాలు కలవని భగవద్గీతలో కృష్ణుడు చెప్పెను. శరీరమనే గీతలోనే అనగా హద్దులోనే ఇంత మర్మముంటే, శరీరము లోపల ఇంకెంత మర్మముందో తెలియును. కనుక భగవద్గీత ప్రపంచమున విశేషమైన జ్ఞానమును అందజేస్తూ ఉన్నదని మేమంటే మరి కొందరు వేదాలను ఎక్కడికి నెట్టాలి, వైదికమంతటినీ మీరు నాశనము చేస్తూన్నారంటున్నారు. కానీ మేమే అసలైన జ్ఞానమును, దేవుడు అనుకున్న యదార్థభావనను ప్రపంచమునకు మొదట తెలియజేసినది అని ఖచ్చితంగా చెప్పుచున్నాము. ప్రతీ మతమునకు ఒక గ్రంథము ఉన్నది. ఆ గ్రంథమును పట్టుకుని కనీసం దానిమీద విశ్వాసం కలిగివున్నారు. కానీ హిందువులు మాత్రము, భగవద్గీత అనే అసలైన గ్రంథమును ప్రక్కకు పెట్టారు. వైదికమంటారు, వేదాలంటారు మరి అందులో ఏమైనా జ్ఞానము ఉందా అంటే, జ్ఞానము మాదిరే కనిపించునుగానీ జ్ఞానముకాదు, అది మాయ జ్ఞానమగును. దీనికి

ఆధారముగా భగవద్గీతలో ఒక శ్లోకమున్నది అది ఏమనగా! **"గుణమయి మమ మాయా"** అని అనగా **"గుణములే మాయ"** అని అనగా "సత్త్వ, రజో, తమో గుణములే మాయ" అని అర్థము. ఇంకొకచోట **"త్రైగుణ్య విషయాః వేదాః"** అంటాడు. 'మూడు గుణములే వేదములు' అనీ 'గుణములే మాయ' అని చెప్పాడు కనుక, వేదములే మాయ అని మనము కూడా చెప్పుకున్నాము. అదే విధముగా వేదములు తెలుసుకున్న వాడు ఎవ్వడూ మోక్షమును చేరలేదు అని కూడా భగవద్గీతలో చెప్పాడు. అక్షర పరబ్రహ్మ యోగము అను అధ్యాయములో...

శ్లో॥ 28. వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్య ఫలం ప్రదిష్టమ్ ।
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వాయోగీపరంస్థాన ముపైతి చాద్యమ్॥
(జీవాత్మ మోక్షము)

**భావము :- ఈ విషయము తెలిసినవాడు వేదాధ్యాయణము, యజ్ఞాచరణము, తపస్సు, దానము వలన కల్గు పుణ్య ఫలములను అతిక్రమించి మోక్షమును పొందును.** విశ్వరూప సందర్శన యోగము అను అధ్యాయము 48, 53 శ్లోకములలో...

శ్లో॥ 48. నవేదయజ్ఞాధ్య యనైర్నదానైర్న చక్రియాభిర్న తపోభిరుగ్రైః ।
ఏవం రూప శ్శక్యఅహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర! ॥
(నిరాకారము)

భావము :- **వేదముల చేతకానీ, యజ్ఞముల చేతగానీ, దానముల చేతగానీ, ఉగ్రతపస్సుల చేతకానీ ఈ రూపముగల నన్ను తెలియజాలరు. జగతిలో నీవు తప్ప నన్ను చూచిన వారు ఎవరు లేరు.**

www.thraithashakam.org

శ్లో॥ 53. నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా ॥
(నిరాకారము)

**భావము :- "నీవు నన్ను ఎట్లు చూచియున్నావో ఆ దర్శనము దొరకవలెనన్న వేదముల చేతను, తపస్సుల చేతను, దానముల చేతను మరియు యజ్ఞముల చేతను శక్యము కాదు."**

ఈ విధముగా ప్రత్యక్షముగా, నొక్కివక్కాణించి చెప్పిననూ, అది మనము చదివిననూ, అసలైన అర్థము గ్రహింపజాలక, హైందవ మతము అని చెప్పి, భగవద్గీతను వదలి, వేదములను పట్టుకుని ఉంటున్నారు చాలామంది పెద్దలు. కానీ అవి ముఖ్యము కావు. మనిషి శరీరమే ఒక హద్దు, దానినే గీత అంటున్నాము. అదే విధంగా శరీరము లోపల కూడా చాలా జ్ఞాన విషయములున్నవి. ఈ శరీరము అను గీతను తెలుసుకుంటే సంపూర్ణమైన జ్ఞానులవుదురు అని చెప్పుతూ దీనికొరకు 'క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగమని' ఒక అధ్యాయాన్నే దేవుడు కేటాయించాడు.

మీ అందరూ త్రైత సిద్ధాంత భగవద్గీతను చదివే ఉందురు. అందులో క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగమును చాలా విపులముగా వివరించాము. ప్రకృతి పురుషులనేవారు శరీరములోనే ఉన్నారని తెలుసుకొనక చాలామంది బాహ్యంగానే అర్థము చేసుకున్నారు.

శ్లో॥ 20. ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంచైవ విద్ధి ప్రకృతి సంభవాన్ ॥

ప్రకృతి, పురుషులు గురించి ఎందుకు మనకు తెలియలేదంటే పురుషుడైన పరమాత్మ, ప్రకృతిని ముందు తయారు చేసిన తరువాత జీవులను సృష్టించెను. కనుక ముందు వారు పుట్టారు కనుక మనము వారిని తెలుసు

కొనలేకపోతున్నాము. నీ శరీరములో కదిలి, మెదిలే గుణ వికారములు ప్రకృతి వలననే కలుగుతున్నవి. దేవుడు నా చేత ఈ పని చేయించాడు. నిజమేకానీ దేనిద్వారా చేయించాడు, ప్రకృతి ద్వారా, గుణములు వలన చేయించాడు. ఆ గుణములు ఎవరివి? ప్రకృతివే కదా! పనులు చేసేది ఎవరు? ప్రకృతి. చేయించేది ఎవరు? నేను, అనగా పరమాత్మను, నేను కనపడను. మీకు కారణము ప్రకృతి కనిపిస్తూ ఉంటుంది. దాని వెనుక హేతువొకటి ఉంటుంది. ఆ హేతువెవరు అనేది తెలియలేకపోతున్నారు. అదే శరీరములో ఉండే అసలు రహస్యం. నీవేమి అనుకుంటున్నావు, నాలో ఈ గుణములు ఉన్నాయి, ఈ గుణముల వలననే పని చేస్తున్నాను అనుకుంటున్నావుగానీ గుణములను గూర్చి ఈ శ్లోకములో ఏమి తెలుస్తున్నదనగా!

శ్లో॥ కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే ।
పురుషః సుఖదుఃఖానాం భోక్తృతే హేతురుచ్యతే ॥

గుణముల వలన కార్యములు జరుగుచున్నవి. ఆ కార్యములు జరుగుటకు కారణము ప్రకృతే, కార్యమూ ప్రకృతే, అదే విధముగా అందులో వచ్చు సుఖదుఃఖములు అనుభవించేది మాత్రము జీవాత్మయే ఎందుకనగా! శరీరము ఆడైనా, మగైనా వారిలో ఉండే జీవాత్మ పురుషుడే కనుక పై శ్లోకములో 'పురుషః' అని సంబోధించారు. కానీ జీవాత్మయిన నీవు పై పనులును అనుభవించుటయే కాకుండా, పై పనులకు కారణం నేనే అని అనుకుంటున్నందువలన సమస్య ఏర్పడుచున్నది.

శ్లో॥ పురుషః ప్రకృతి స్థోహిభుంక్తేప కృతిజాన్ గుణాన్ ।
కారణం గుణ సంగోస్య సదసద్యోని జన్మసు ॥

భావము :- **గుణములలో ఆసక్తి కలిగి, నేనే అని అనుకోవటం వలన, నువ్వు మంచి, లేదా చెడు యోనులయందు మరల జన్మించవలసి వచ్చు చున్నది.** గుణములు ప్రకృతి సంబంధములు, నేను పురుషుడను. నేను స్త్రీ శరీరమైనా ధరించవచ్చును. పురుష శరీరమైనా ధరించవచ్చు. కానీ పురుషుడైన పరమాత్మ అంశను కనుక నేను పురుషున్నే అని అనుకోకుండా, ప్రకృతిలో నేను ఒక భాగము అనుకుంటున్నాడు. ఆ విధముగా ఉండటం వలన మంచి, చెడు గుణములకు బాధ్యుడై పాప, పుణ్యములను తగిలించు కొని, మరలా జన్మింపవలసి వస్తున్నది.

ఎప్పుడైనా ఎవరైనా గుణముల వలన ప్రభావితులైతే ఉదాహరణకు, క్రోధం కావచ్చు, ఏదైనా గుణం కావచ్చును. అప్పుడు వెంటనే రెండు చేతులు జోడించి తగ్గులను చూసిన మనకు పరమాత్మ చిహ్నమును చూడగల్గినవారమై, మనము జీవాత్మలము అనగా దేవుని (పార్టీ) భాగములోని వారము అని గుర్తుకు వచ్చును. అప్పుడు ప్రకృతి నుండి పుట్టిన గుణముల బారిన పడకుండా తప్పించుకొనవచ్చును. ఎప్పుడైనా మనలో గుణములు చెలరేగినప్పుడు చేయవలసిన పని ఇదే!

## 33. పుట్టుగోసి - మొలత్రాడు

తేది : 27-05-2010

ఆత్మసంయమ యోగము అనే అధ్యాయములో ఒక శ్లోకమును గూర్చి తెలుసుకుందాము. భగవద్గీతలో ప్రతీ అధ్యాయమునకు చివర యోగము అని ఉండటం మనము చూసే ఉందుము. అయితే ఎందుకలా పెట్టారంటే, అన్నిటికంటే యోగము గొప్పది అని తెలిపేందుకు పెట్టారు.

భగవద్గీత గ్రంథమంతా ఒకే యోగాన్ని సూచిస్తున్నది. **యోగము** అనగా 'కలయిక' అని అర్థము. దేవున్ని తెలిసే విధానము మరియు కలిసే విధానము ఉంది. కనుక దీనికి యోగము అని పేరు పెట్టబడినది. అంతేగానీ వ్యాపారములు బాగా జరిగేందుకు కాదు, ధన సంపాదన కొరకు అంతకంటే కాదు. అందుకే భగవద్గీతలో ఆత్మ సంయమ యోగమను అధ్యాయము 46వ శ్లోకములో ఇలా అన్నాడు.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ తస్మాద్యోగి భవార్జున ।
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥

(జీవాత్మ)

**భావము :- "తపస్వికులకంటే యోగి అధికుడు. అట్లే జ్ఞానులకంటే ఉత్తముడు, కర్మములు చేయువారికంటే గొప్పవాడు. కావున నీవు యోగివే కమ్ము."**

తపస్సు చేసేవాడికంటే యోగి అధికుడు. జ్ఞానులకంటే యోగి అధికుడు. కర్మలు చేయువానికంటే, అనగా చెట్లచుట్టూ తిరిగి, యజ్ఞములు చేసి, లేనిపోని కార్యములు చేసి తిప్పలు పడేవానికంటే యోగి అధికుడు, కనుక నీవు యోగివే కమ్ము. అందుకే ప్రతీ అధ్యాయం చివర అదే ఉన్నది, ఇప్పుడు ఈ శ్లోకములో కూడా యోగివేకమ్ము అన్నాడు భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ చెప్పినట్లు మనము కూడా యోగము వైపునకే వెళ్ళాలని ఆశిస్తూ, జ్ఞానము తెలుసుకుందాము. ఈ జ్ఞానము తెలియటం వలన యోగమంటే తెలియును.

ఈ మధ్య కాళహస్తిలో గోపురం కూలిపోయింది. ఈ విషయాన్ని కాలజ్ఞానములో బ్రహ్మంగారు చెప్పారనీ, అందుకే అలా జరిగిందని

www.thraithashakam.org

కొందరంటే, హేతువాదులు అని పేరు పెట్టుకున్న కొందరు అది తప్పని, మేము నమ్మమని వాదించటం మేము టీవీలో చూశాము. హేతువాదులనే వారు చాలా తెలివైనవారట. ఎందుకంటే వారు "ఆవులిస్తే ప్రేగులు లెక్క పెడతారట" ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టడానికి, ఉన్నది ఒక్క ప్రేగువుంటే, ఇక లెక్కపెట్టేది ఏముంది? చిన్న పేగే, పెద్దపేగుగా మారుతున్నది. ఉన్నదంతా ఒక ప్రేగేకదా! ఆవులిస్తే నోట్లో పళ్ళు ఎన్ని ఉన్నవని లెక్కపెట్టే వాడే తెలివైనవాడు మా దృష్ఠిలో, అంతేగానీ ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్ట గలమనేవాడే తెలివితక్కువవాడు. మేము చాలా తెలివైనవారమని చెప్పేవారు, లెక్కాచారం ప్రకారము చెప్పాలి. అవును అనుటకు శాస్త్రబద్ధత కావాలి అంటారు. మరి మీరు కాదు అనుటకు శాస్త్రబద్దత కలదా? అని మేము ప్రశ్నించుచున్నాము. ఇప్పుడు చిన్న ఉదాహరణ చెప్పుకుందాము $4\times4=16$ అని చెప్పుట సత్యము అనునది అందరికీ తెలిసినదే, లేదు లేదు $4\times4=15$ అని ఎవరయినా అంటే, కాదు అది తప్పు, $4\times4=15$ అంటే ఎలా అగును? తప్పంటే ఏ విధముగా తప్పో చెప్పాలికదా! వివరించాలి కదా! $4+4+4+4$ అదే విధముగా, వస్తువులనైనా $4+4+4+4$ పేర్చిన అవి లెక్కపెడితే 16 అగును అని చెప్పితే అది $4\times4=16$ నకు నిరూపణగా ఉన్నది. కనుక $4\times4=15$ అనునది తప్పు అని చెప్పుటకు అవకాశము ఉన్నది. అయితే $4\times4=15$ అనునది తప్పు అని చెప్పుటకు కూడా శాస్త్రబద్ధతతో నిరూపిస్తేనే సత్యము చెప్పినట్లగును. అదే విధముగా ప్రతీ విషయాన్ని హేతువాదులు ఖండిస్తున్నారు. ప్రతీ దాన్ని కాకిలెక్కలు, నిజంకాదు అని వాదిస్తే ఎలాగవుతుంది? శాస్త్రప్రకారము ఇలాగ ఉన్నది, కావున ఇది తప్పు అని చెప్తే సరిపోతుంది. కానీ అలా చెప్పటం లేదే!

www.thraithashakam.org

మీరు పై విషయాన్ని బ్రహ్మవిద్యాశాస్త్రానుసారము సమాధానము చెప్పగలగాలి. కానీ వారికి తెలిసినవి నాలుగు శాస్త్రములే ఇంకనూ రెండు శాస్త్రములయిన జ్యోతిష్యశాస్త్రము, బ్రహ్మవిద్యాశాస్త్రముల గూర్చి అసలు తెలియని వారు మాట్లాడుచున్న మాటలు శాస్త్రీయములు కావు. కనుక టీవీలలో ఈ విధముగా హేతువాదులు అని పేరు పెట్టుకున్న నాస్తికవాదులను, ప్రతీసారి చర్చలలో పాల్గొనునట్లు చేసినందువలన, ప్రజలు మరి కొంచెం పాడయిపోయే అవకాశము ఉన్నది. అందువలన మనము ఏమి చేస్తున్నా మంటే, దేవుడున్నాడని శాస్త్రీయముగా చెప్పుచున్నాము. ఏదైతే శాస్త్రీయత ఉండాలని వారంటున్నారో, శాస్రీయముగానే దేవుడున్నాడని మనము చెప్పుచున్నాము. హేతువాదులు పురాణాలను ఖండిస్తుంటే, మనము ఏ పురాణాన్ని పరిగణలోకి తీసుకోకుండా, శాస్త్రాన్నే తీసుకొని, శాస్త్రముతోనే ముందుకు వెళుతూ, శాస్త్రవిషయములనే చెప్పుచున్నాము.

బ్రహ్మజ్ఞానములో ఎటువంటి అవాస్తవము ఉండదు కనుక, అటువంటి బ్రహ్మవిద్యాశాస్త్రమునే ఆధారముగా చేసుకొని, మేము అసలైన పరమాత్మ జ్ఞానమును తెలియజేస్తున్నాము. మన శరీరము కుడి, ఎడమలుగా విభజింపబడినది. ఒక భాగము ఆత్మకు గుర్తుగా, రెండవ భాగము జీవాత్మకు గుర్తుగా తెలియజేయబడినది. పరమాత్మ వేరుగా లెక్కించబడడు. మన శరీరములో బాహ్యంగా కనిపించే భాగాలుకానీ, శరీరము లోపలుండే భాగములుగానీ రెండుగానే చీల్చబడినవి.

అదే విధముగా కుడి, ఎడమ భాగములైన ఆత్మ, జీవాత్మలను ఆక్రమించి ఉండువాడు పరమాత్మ. అనగా! నీ శరీరమంతా ఆవహించి ఉన్నది. శరీరములోనే క్షరుడు, అక్షరుడు ఉన్నారు. అదే విధముగా పురుషోత్తముడు కూడా నీ శరీరములో ఉన్నాడు, అనేదానికి గుర్తింపుగా

www.thraithashakam.org

ముక్కుకొన భాగములో, లోపల రెండు రంధ్రములుగా విడిగా ఉన్నా, ముక్కులోని కండమాత్రము ఒక్కటే ఉండును. కనుక ఆత్మ, జీవాత్మలలో పరమాత్మ ఆవహించియున్నాడు. ఆ విషయమునకు సంకేతముగా ముక్కుకొన భాగము కలదు. అందుకు పరమాత్మ ఉన్నాడు అని తెలుసు కొనేందుకు ముక్కుకొన భాగములో రెండువ్రేళ్ళను ఉంచి, ఆలోచించడం అనేది మాకు పరిపాటిగా (అలవాటుగా) ఉంది. అందుకే మేము జ్ఞాన విషయము మీకేదైనా చెప్పాలంటే ముక్కు కొన భాగములో దేవుడు ఉన్నా డన్న సంకేతం మీకు తెలియజేసేందుకు, మేము ముక్కుకొన పైన వ్రేళ్ళను ఆనించి, నీవే ఏదైనా జ్ఞాన విషయమును అందజేయాలని అడుగుచున్నట్లు ఉంచుతాము. అదే విధముగా మేము చెప్పే విషయం చిక్కైనది కాకపోతే, తలమీద వెంట్రుకలనైనా చేయినానించి అడుగుతాము. ఎందుకునగా! **ఆత్మకు వెంట్రుక గుర్తు** కనుక. నీకు జ్ఞానవిషయమై ఏదైనా తెలియవలెనన్న నీవు పరమాత్మనైనా అడగాలి, లేదా ఆత్మనైనా అడగాలి.

ప్రతి జీవుడు కర్మబద్ధుడై ఉన్నాడు. నీవు ఎప్పుడైతే జన్మించితివో అప్పటినుండే కర్మచేత బంధించబడి ఉన్నావు. అప్పుడే కర్మ అనే మూటను తలపైన వేసుకొని వచ్చితివి. నువ్వు పుట్టినప్పటినుండే కర్మవుంది కనుక దానిని పుట్టుగోచి అందుము. పొరపాటున మనము కట్టుకునే బాహ్యమైన శరీరమునకు కట్టుకునే గోచీ అనుకోవద్దండీ, అది ఉత్త గోచినే. కానీ మేము చెప్తున్న గోచీముందర 'పుట్టు' అనే పదముంది. దీనిఅర్థము నీవు పుట్టినప్పటినుండే కర్మ అనే మూటతో వచ్చినావు అనే అర్థము అందులో ఉన్నదని గ్రహించగలరు. ప్రతీ జీవునికి ఈ పుట్టుగోచి ఉన్నది. జీవున్ని కర్మ అనే గోచి బంధించబడింది. కనుక కర్మనే **"పుట్టుగోసి"** అని పెద్దలన్నారు. అయితే ఎవరీ పుట్టుగోచి? అనే ప్రశ్నవస్తే, పెద్దలేమి

www.thraithashakam.org

చెప్పినారంటే, ఈ కర్మ అనేది జీవున్ని బంధించింది. కనుక కర్మను త్రాడు అన్నారు. ఎవరికీ త్రాడు క్షరపురుషునికి. శరీరము స్త్రీదైనా, పురుషుని దైనా లోపలుండేవాడు పురుషుడైన పరమాత్మ అంశే కావున, జీవుడనే క్షర పురుషుడు కర్మ అనే త్రాడుతో బంధింపబడినట్లున్నది అని చెప్పేందుకు **'మొగత్రాడు'** అనేవారు. తరువాత ఆ పదము రూపాంతరము చెంది 'మొల త్రాడు' గా మారినది. కనుక **"పుట్టుగోసి"** అనినా, **"మొగత్రాడు"** అనినా ఒకటే అర్థము నిచ్చుచున్నది. కొన్ని ప్రాంతములలో కొందరు నీకు మొలత్రాడంటే తెలియదు. పుట్టుగోచి అంటే తెలియదు, నీతో ఎవడు మాట్లాడుతాడు? అని, మాట్లాడిన సందర్భరములో నీకు ఏ జ్ఞానము తెలియదు అని చెప్పుటకు అలా అంటారు.

ఇప్పుడు ప్రకృతి అనే పదమును గూర్చి తెలుసుకోవాలంటే, ప్రకృతి అనగా మనందరికీ తెలుసు. పంచభూతములతో నిర్మితమైనదనీ, కనిపించే దని తెలుసు. ఆకాశము, గాలి, నీరు, భూమి, అగ్ని అనునవి పంచ భూతములు. ఈ ప్రకృతి వలననే చావు పుట్టుకలు జరుగుచున్నవి. ప్రకృతిలోనే మనిషి బ్రతుకుచూ ఉన్నాడు. సృష్ఠి, స్థితి, లయ అనగా పుట్టించడము, పాలించడము అనగా ఉండునట్లు చేయటం, చంపివేయటం. సృష్ఠి, స్థితి, లయ కారకుడొకడున్నాడు. కారకుడే గానీ పనిచేసే వాడు కాదు. కారణమేగానీ పనితో సంబంధము లేనివాడు. కారకుడు ఒకడున్నాడు ఆయన కనపడడు, ఆయన ఆదేశిస్తాడు. ఆ పనిని ప్రకృతి చేస్తుంది.

ప్రకృతి ఎవరిమాట విని పనిచేయుచున్నది? కారకుడైన పరమాత్మ మాటవిని పని చేయుచున్నది. ఇప్పుడు పరమాత్మ జ్ఞానము భూమిమీద తగ్గిపోతున్నది. అయితే పరమాత్మ జ్ఞానము తగ్గిపోవుట వలన ప్రజలు

www.thraithashakam.org

కర్మలను ఎక్కువ సంపాదించుకుంటున్నారు. ఆ విధముగా పుట్టించేవాడు, సాకేవాడు, చంపేవాడైన కారకున్ని మరచిపోయి, నేనే సంపాదిస్తున్నాను, నేనే అన్ని పనులను చేస్తున్నానని అనుకోవటం వలన తెలివితక్కువ వారుగా తయారవుతున్నారు.

ఒక వ్యక్తి వద్దకు వెళ్ళి మీరు జ్ఞానము తెలుసుకోండి, అజ్ఞానములో ఉండవద్దని చెప్పినా, మాకేం జ్ఞానము వద్దు దానితో మాకేం పనిలేదు అని తెలివి ఎక్కువున్నట్లు చెప్పి, మనల్ని తెలివితక్కువ చేసి మాట్లాడుదురు. ఒక వ్యక్తికి ఉరిశిక్ష పడినది అనుకుంటే, ఎంత కర్మచేసినాడో, ఉరిశిక్ష పడింది అనుకుంటాము. అదే విధముగా ఒక నలుగురు వ్యక్తులు, ఒక వ్యక్తిని రోడ్డు మీద నరికితే, అది పేపర్లోకి వెళ్ళి, ఊరంతా తెలియును. పై రెండు విషయములు అందరికీ తెలియును. అదే రెండు వాహనములు ఢీకొట్టి పదిమంది చనిపోతే, ప్రజలు పై సంఘటనలలో చెప్పుకున్నట్లు పెద్దగా చెప్పుకొనక, అదేదో రోడ్డు ప్రమాదము అని తేలికగా చెప్పుదురు. అదే పెళ్ళి బస్సు పడిపోయి మంచిర్యాల దగ్గర 12 మంది చనిపోయారు. వారందరినీ ఒకవేళ ఉరితీసిన ఎంత సంచలనముంటుంది!

ఈ విధముగా ప్రజలు పాపాలు చేసే విధానమును అనుసరించి, శిక్షలు కూడా వివిధ రకములుగా ఉండునని గుర్తుంచుకోవలయును. కానీ ఎందుకింత పెద్దపెద్ద శిక్షలను సామూహికంగా అనుభవిస్తున్నామని ఎవ్వరూ ఆలోచించడము లేదు. నీవు జ్ఞానమును తెలుసుకునే ప్రయత్నం చేయనంత కాలము నిన్ను ప్రకృతి విడిచిపెట్టదు. ఒక చిన్న అమ్మాయిని బ్రాయిలర్‌లో వేసి చంపినారు కొందరు. వారందరికీ ఉరిశిక్ష వేయవలెనని అందరూ అన్నారు. భూకంపం వచ్చింది ఒక వందమందికి పైగా పెద్దలు, చిన్నపిల్లలు చనిపోయినారు. మరి ఈ విధములైన మరణాన్ని పొందుటకు కారణం కర్మేకదా!

మొన్నటికి మొన్న ఒక పెద్ద రోడ్డు ప్రమాదమును మేము కళ్ళారా చూశాము. మేము అనుకున్నాము కర్మ పరిపక్వమైనది, అమలుకు వచ్చినదని. కొందరు అనుకొనవచ్చును, దేవుడు కఠినాత్ముడు, ఇంతమందిని చంపేశాడని చెప్పుకోవచ్చును. మేము ఏమంటామంటే, అది వారు చేసుకున్న గత జన్మ కర్మ అమలుకు వచ్చినది. అది దేవునికి తెలియదా, తెలుసును. నీ కర్మను అనుభవించాలని కర్మ విధానముంటే దేవుడేమి చేయగలడు? అందుకే దేవుడు గుణాతీతుడు. ఆయన దయామయుడు కాదు, కరుణామయుడు కాదు, కఠినాత్ముడు అంతకంటే కాదు. నీ పాపకర్మ నీవు అనుభవించవలసినదే!

దేవునికి తెలిసే ప్రతీ కర్మ జరుపబడుచున్నది. తీవ్రవాదులు కొందరొచ్చి శత్రువులు కాకున్ననూ ప్రజలను కొందరిని తుపాకులతో కాల్చారు. మరి కాల్చిన వారిలో ఆత్మ, జీవాత్మ, పరమాత్మలులేవా? మరి ఎందుకు ఆ పని చేయుచున్నారు? మరి దేవుడుంటే ఆ పనిని ఎందుకు నివారించటం లేదంటే, నివారించడు, ఎందుకు? కాల్పించుకునేవారు కర్మను అనుభవించాల్సిందే, కనుక ఎవరెవరికి ఎక్కడెక్కడ, ఎంత తగలాలో అంతే తగిలి, అంతే అనుభవించాల్సినది వుంది. ఆ తరువాత, కాల్చిన వారి కర్మ పరిపక్వమైనప్పుడు వారకీ శిక్షపడును. అందుకే పరమాత్మ భగవద్గీతలో **“జంత్రగాడు బొమ్మలను ఆడించినట్లు కర్మప్రకారము నేనే ఆడిస్తున్నాను”** అని చెప్పలేదా!

ప్రపంచములో ఎవరైనా కర్మను అనుభవించక తప్పదు. కానీ జ్ఞానము అనగా ఆత్మజ్ఞానము తెలుసుకున్న వ్యక్తికి జ్ఞానశక్తి కలుగుతుంది. ఆ జ్ఞానాగ్ని, నీ కర్మలను కాల్చివేస్తే అప్పుడు నీవు అనుభవించకుండా తప్పించుకునేందుకు అవకాశము ఉన్నది. అప్పుడు నీకు పుట్టుగోచి లేకుండా

పోవును, తద్వారా నీకు కర్మ అనుభవమే ఉండదు. మరి దైవ జ్ఞానమంటే ఈ రోజు కొందరికి చవకైపోయినది. కాలజ్ఞానములో బ్రహ్మంగారు చెప్పినవి జరుగుచున్ననూ, మాకు నమ్మకం లేదంటే దేనిమీద మీకు నమ్మకం ఉన్నది? కనుక భగవద్గీతను అనుసరించి, యోగాన్ని పొందండి అని తెలియ జేసేందుకు మరియు యోగము చేసే యోగే గొప్పవాడు, తపస్వికంటే యోగి గొప్పవాడని చెప్పినా, సామాన్యులకైతే అర్థము కాలేదు అంటే సరిపోవచ్చు. పండితులు, స్వామీజీలు అని పిలిపించుకున్న వారికి కూడా అర్థము కాలేదు అంటే ఎలాగ? 'తపస్వి అధికో యోగి' అనే సంధిని విడగొట్టలేదు. తపస్వివేరు యోగివేరు అని తెలియలేక పోయారు. తపస్సు వేరు యోగమువేరన్న శ్రీకృష్ణుని యదార్థ భావనను తెలియలేక, తపస్సు యోగము ఒకటే అని అనుకుంటున్నారు.

పై విషయమును ఒక ఉదాహరణగా ఒక యదార్థ సంఘటనను గూర్చి చెప్పెదను. అదేమనగా! ఒక వ్యక్తి నా వద్దకు ఒక కరపత్రాన్ని తీసుకొని వచ్చి ఇచ్చాడు. అందులో చదివిన ఏముంది అనగా "ద్వాదశ వర్షములు, రుద్రభూమియందు తపమాచరించి, యోగి అయినటువంటి శివబాలయోగిగారు విచ్చేయుచున్నారు మన గ్రామమునకు మీ అందరూ వచ్చి దర్శనము చేసుకొనండి" అని వ్రాసినారు. అంటే 12 సంవత్సరములు స్మశానంలో తపస్సు చేసి, శివబాలయోగిగారు మనపట్టణానికి వస్తున్నారు అని వ్రాశారు. అప్పుడు నేను ఏమన్నాను అంటే, ఏమయ్యా! దిబ్బమీద కూర్చొని పూవులు అమ్మినట్టుంది, బజారులో కూర్చుంటే పూలు అమ్మినాడు అంటే అర్థము ఉంది, కానీ పేడ దిబ్బమీద పూలు ఎలా అమ్మెదరు? ఈయన చేసేది తపస్సు, మీరు పేరు పెట్టుకున్నది యోగి. చేసేదొక పని, చెప్పేది ఇంకొకటి. 12 సంవత్సరములు తపస్సు చేస్తే తపస్వి అయినాడు కానీ

యోగి ఎలా అగును? అని అడిగితే తపస్సు అన్నా యోగమన్నా ఒకటే కదా! అన్నాడు. అప్పుడు నేను నీ జేబులో (చొక్కా జేబులో) భగవద్గీతను తీయుము, అందులో ఏమి ఉందో చదువు, ఆత్మసంయమ యోగము అధ్యాయములో 46వ శ్లోకము చదువు ఏముందో! మరి ఆ శ్లోకములో "తపస్విభ్యోధికో యోగి" అని ఉంది. అనగా "తపస్సు చేయువానికంటే యోగి అధికుడు" అని ఉంది కదా! అంటే రెండు ఒకటి కాదా! అన్నాడు. మరి ఇన్నేళ్ళు భగవద్గీత చదివి, ప్రత్యక్షముగా కనిపిస్తుంటే ఒకటికాదా, అంటే నేనేమి చెప్పగలను? అప్పటికే ఆయన వయస్సు 65 దాటిపోయింది. గీతాపారాయణం చేశారు, ఒకటికాదా అంటే ఇప్పుడు ఒకటి కాదనే చెప్పుచున్నాము కదా అని నేనన్నాను. చూడండి, పెద్దపెద్ద వారికే, తపస్సుకంటే యోగము గొప్పదన్న విషయము అర్థము కాలేదు. కనుక ఇటువంటి విషయములన్నీ క్షుణ్ణంగా ఆలోచన చేసుకొని, మనకర్మను పోగొట్టుకునే ఒకే ఒక ఆయుధము యోగము, దానివలన యోగశక్తి లేదా జ్ఞానశక్తి లభించును. ఆ యోగశక్తి వలన మనకర్మలు పోవును. యోగశక్తి అంత గొప్పది అనే దానికి ఏమి నిరూపణ? అని మీరు ప్రశించవచ్చును.

దానికి నిరూపణగా ఒక యదార్థ సంఘటనను వివరించెదము. వెంకటేష్ అనే వ్యక్తి, తీవ్రమైన కడుపునొప్పితో బాధపడుతున్నాడు. నలుగురు డాక్టర్లు, వివిధ రకములైన చికిత్సచేసి మా వలన కాదన్నారు. నీ కడుపులో లోపము ఏమీ లేదు అంటున్నారు. మరి ఆ కడుపునొప్పి ఉంది అని చెప్పుటకు అతని శరీరముపై పొట్టవద్ద అర్ధరూపాయంత పరిమాణంతో బొబ్బలు తేలినవి. ఇక ఆయన నేను చనిపోతాను, బ్రతుకను అని చెప్పి వాపోతున్నాడు. అప్పుడు యోగమునకు ఇంతశక్తి ఉంది అని నిరూపణకు మేము ఒక్కసారి ఆ ప్రదేశమును చూచిన వెంటనే ఆ కడుపునొప్పి, అక్కడున్న

బొబ్బలు నిమిషములో అక్కడ లేకుండా పోయాయి.  అంటే అంత భయంకరముగా అనుభవించే కర్మ, ఒక్క నిమిషములో పోయింది అంటే, యోగశక్తి ఎంత గొప్పదో మనకు అర్థమయింది కదా! అందుకే వేమన ఏమి చెప్పెనంటే, కుమ్మరి కుండలు చేయుటకు ఒక సంవత్సరము పట్టవచ్చును.  కానీ వాటినన్నిటినీ పగులకొట్టుటకు నిమిషము కాలము చాలును.  అంటే నువ్వు ఎన్నో సంవత్సరములు చేసుకున్న కర్మయినా, ఒకే జన్మలో నీవు యోగశక్తి ద్వారా పోగొట్టవచ్చునని వేమనయోగి కూడా స్పష్టంగా చెప్పాడు.

అందువలన పుట్టుగోచి, మొలత్రాడు ఉన్న జీవులందరూ అంటే, కర్మ ఉన్న అందరూ, పోగొట్టుకోవలెనంటే, జ్ఞానాన్ని తెలుసుకొని, యోగాన్ని అచరిస్తే, శక్తి వస్తుంది.  నీవు బయటపడే దానికి అవకాశము ఉండును. కనుక జ్ఞానమనే ఖడ్గముతో నీ పుట్టుగోచిని, మొలత్రాడును తెంపవలెను. పెళ్ళి రోజున కత్తిని ఒకదానిని చేతిలో ఉంచుతారు.  అది ఎందుకంటే జ్ఞానమనే ఖడ్గంతో నీ కర్మను లేకుండా చేసుకో అని చెప్పేందుకే అది పెట్టారు.  ఆ విధముగా ఖడ్గమును పట్టుకోవటమే కాదు, కర్మను తెగ్గొట్టడం కూడా చేయవలెను.

# 34. చమత్కార ఆత్మ

తేది : 26-06-2010

శ్లో॥ అనాశ్రితః కర్మఫలమ్ కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీచ యోగీచ  ననిరగ్ని ర్నచా క్రియః ॥

కర్మ ఫలితముపైన ఆశ పెట్టుకోకుండా కార్యాన్ని ఎవరైతే చేయ

www.thraithashakam.org

గల్గుతారో వారే నిజమైన యోగి లేదా నిజమైన సన్న్యాసి అని చెప్పాడు. పనులను కార్యములు అని అంటాము. కార్యములు చేస్తే ఫలితములు రెండు రకములు ఉంటాయి. ఒకటి కనిపించే ఫలితము, ఇంకొకటి కనిపించని ఫలితము. కంటికి కనిపించని ఫలితము పాపం లేదా పుణ్యం. కనిపించే ఫలితము, ప్రపంచ ధనము, దాన్యము, బంగారు కావచ్చును. అదే విధంగా చేసే పనులు మంచివైతే పుణ్యం వస్తుంది. చేసే పనులు చెడ్డవైతే పాపం వస్తుంది కానీ ఈ ఫలితములు కంటికి కనిపించకుండా కర్మచక్రములోకి చేరును. ఇప్పుడు పాపం, పుణ్యం అనే కర్మఫలం పైన దృష్టిపెట్టకుండా నీవు కార్యములు చేసినా దాని కర్మఫలములైన పాప, పుణ్యములను అంటించుకోకుండా ఉంటే అటువంటి వారిని సన్న్యాసి లేదా నిజమైన యోగి అనవచ్చును.

పై శ్లోకంలో ఇంకా ఏమి చెప్పుచున్నారంటే **"ననిరగ్ని"** అగ్నిలేనటు వంటివాడు మరియు **"ర్నచాక్రియః"** ఏ పనులు చేయనివాడు, జ్ఞానాగ్ని లేనటువంటివాడు యోగి కాడు. సన్న్యాసి కాడు. **పనులు చేయని వాడు కర్మయోగి కానేకాడు.** వాడిని యోగి అనలేము, సన్న్యాసి అనికూడా అనకూడదు. సన్న్యాసి అని ఎవరిని అనవలెను? కేవలము పనులు చేస్తూ వాటిలో వచ్చే ఫలితములైన పాప, పుణ్యములను వదిలిన వాడినే నిజమైన సన్న్యాసి అనవలెను. అంతేగానీ, సన్న్యాసి అంటే పనులు చేయనివాడు మాత్రం కాడు.

ఈ శ్లోకం భగవద్గీత ఆత్మసంయమ యోగం అధ్యాయంలో మొదటి శ్లోకం, ఇందులో అగ్ని అనే పదం వచ్చింది. అగ్ని ఏమిటంటే జ్ఞానాగ్ని అని మనం చెప్పుకున్నాం కదా! అయితే ఈ జ్ఞానాగ్ని ఏ విధంగా వస్తుంది. నీలో జ్ఞానాగ్ని ప్రజ్వరిల్లాలంటే, శరీరముతో చేస్తున్న పనులు ఎవరు

www.thraithashakam.org

చేస్తున్నారనేది తెలియాలి. అప్పుడు నీకు కార్యములలో వచ్చిన ఫలితములు నీకు అంటుకోకుండా పోతాయి. ఎవరు చేస్తున్నారో తెలియకుండా ఏ పని చేస్తున్నా, నేనే చేస్తున్నానని అనుకున్నావా, ఆ కార్యములలో వచ్చు పాప, పుణ్య ఫలితములు నీకే అంటుకుంటాయి. కాని వాస్తవము తెలుసుకుంటే శరీరంలో ఎవ్వరూ ఏ కార్యము చేయటం లేదు. ప్రత్యక్షంగా మనం చేస్తున్న పనులు కనిపిస్తున్నాయి కదా! అని మనం అడుగవచ్చు. వాస్తవమే కనిపిస్తూ ఉంది. మరియు నీ శరీరంతో అన్ని పనులు జరగటం వాస్తవమే, కానీ నీ కాలు కదులుతూ పనిచేస్తున్నది. కాని నీ కాలు నీవే కదల్చుచున్నావా? నోటితో నీవు మాట్లాడుచున్నావంటే ఆ నోటిని కదిలిస్తున్నదెవరు? అసలు మొత్తం శరీరానికి నీకు సంబంధమున్నదా అని చూస్తే, నీవు వేరు, నీ శరీరము వేరని తెలుస్తుంది. నీ శరీరంలో ఉన్న భాగాలు పనిచేస్తూ ఉంటే నీవు అనుభవించడమే చేస్తున్నావు తప్ప, నీవు ఆ పనులు చేయటం లేదు. కానీ నీవే ఆ పనులు చేస్తున్నానని భ్రమిస్తున్నావు.

వీటన్నిటి వెనుక ఉండి నడిపిస్తున్నది ఆత్మ అనేది ఒకటున్నది. అది నీకు, శరీరంలో ఉన్న భాగములకు శక్తి ఇస్తూ ఉంటే, శరీరములో ఉన్న భాగాలన్నీ పనిచేస్తున్నాయి. ఆ పనులను చూసేందుకు కావలసిన శక్తిని ఆత్మే ఇస్తున్నది తద్వారా నీవు చూడగల్గుచున్నావు మరి శరీరములో ఏ పనీ లేకుండా ఏమి చేస్తున్నట్లు అంటే, జీవాత్మవైన నీవు ఒకే పని చేస్తున్నావు ఏమంటే, ఆ పనుల్లో వచ్చే సుఖం లేదా దుఃఖములను అనుభవించడము అనే పని మాత్రమే చేయుచున్నాది.

శరీరం మొత్తాన్ని 25 భాగములుగా లెక్కించుకున్నాము. ఎందుకలా లెక్కించుకున్నామంటే ప్రతీ ఒక భాగం ఒక్కొక్క పనిని చేస్తున్నది. ఎందుకంటే కన్ను చూసే పనినే చేస్తున్నది, చెవి వినేపనినే చేస్తూ ఉంది. అదే విధంగా

www.thraithashakam.org

జీవాత్మగా ఉన్న ఒక భాగమేదైతే ఉందో అది కూడా ఒక పనిని చేయాల్సిందే! అదేమంటే పాప, పుణ్య ఫలములైన దుఃఖము మరియు సుఖములను అనుభవించడమే! ఈ పని తప్ప ఇంకే పనీ లేదు. ఏ పని జరగాలి అని ఉన్నా, జరగకూడదు అని అనుకున్నా నీకు సంబంధములేదు ఎందుకంటే దీనికంతటికీ కర్మ అనేది ఉంది. అందులో ఏది ఉంటే అదే కార్యములుగా జరుగును. ఆ కార్యములు జరుగుటకు శక్తిని లోపలున్న ఆత్మ ఇస్తున్నది. కనుక కార్యములలో కలుగు సుఖ, దుఃఖములను అనుభవించడమే జీవాత్మవైన నీ పని. ఆ విధంగా నీవు కూడా ఒక పనిని చేస్తున్నట్లే, కావున శరీరంలో నీవు కూడా భాగానివే.

మరి మన శరీరంలో పనులు ఏ విధంగా జరుగుచున్నవంటే! మన తలలో గుణములు ఉన్నవి. మన కర్మలో, ఏ సమయంలో ఏ గుణములు పని చేయాలో నిక్షిప్తమై ఉంటుంది. ఆ కర్మ కూడా మన ఎన్నో జన్మలనుండి దాచబడినదే అని గుర్తుంచుకోవలెను. కనుక శరీరం ద్వారా ఆ గుణముల యొక్క ప్రభావం కార్యరూపమై బయటికి కనిపిస్తున్నది. కానీ ఆ కర్మంతా కార్యరూపం దాల్చాలంటే, శరీరంలో భాగాలు పనిచేయాలి, అవి పని చేయాలంటే శక్తి కావాలి. ఆ శక్తిని నీ శరీరంలో ఆత్మ ఇస్తున్నది. ఆ గుణముల వద్దనే, ఏదో గుణంలో జీవుడు లేదా జీవాత్మ ఉంటున్నాడు.

ఈ విధంగా శరీరం ద్వారా పనులు చేయుచున్నది ఆత్మ అని తెలియకపోవటం వలన, శరీరం ద్వారా అన్ని పనులు చేస్తున్నది నేనే అని జీవుడు అనుకోవటం వలన, జీవుడనైన నేను ఒక్క చోటే ఉన్నాను అని తెలియకపోవటం వలన, ఆధ్యాత్మికము అంటే ఏమిటో తెలియకుండా పోయింది. ఎందుకంటే ఆత్మను అధ్యయనం చేయటమే ఆధ్యాత్మికం అంటారు. కొన్నిసార్లు మనం మాట్లాడుతున్నప్పుడు అనుకోకుండా గొప్ప

www.thraithashakam.org

తెలివిగా కొన్ని మాటలు మన నోటినుండి వస్తుంటాయి. మరి ఆ మాటలను మాట్లాడునది లోపలున్న ఆత్మ.

మనము హెూమియోపతి, అల్లోపతి అనే రెండు వైద్య విధానములు తెలిసుకున్నాము. ఈ రెండు విధానాల వలన మందులిచ్చి రోగాన్ని బాగుచేయవచ్చు. కానీ మందులివ్వకుండా కూడా రోగాలు మీరు ఏ విధంగా బాగుచేస్తారు? అని హేతువాది ప్రశ్నకు మేము అల్లోపతి, హెూమియోపతి విధానం కాకుండా **"అందరిపతి"** అనే విధానం మాకు తెలుసు అని మేము చెప్పాం. ఆ విషయాన్ని చెప్పిందువరు? ఆత్మయే! గుణవికారములు మూడు ఉన్నాయి అవి సాత్వికము, రాజసము, తామసము. వీటి యొక్క పనులనే వికారములు అని అంటాము. నీకు క్రోధము అనేది వచ్చిందనుకో ఉచ్ఛ్వాస, నిశ్వాసములు పెరుగుతాయి, దయతో ఉన్నావనుకో శ్వాస నెమ్మదిగా నడుస్తుంది. వీటినే గుణవికారములు అంటాము.

మనం వ్రాసిన గ్రంథాలలో అరిషట్ వర్గము, మిత్రషట్ వర్గములు కలవు. కామ, క్రోధ, లోభ, మద, మత్సర అని ఆరు శత్రువర్గము, అరి అనగా శత్రువు అని చెప్పినారు. కాని మిత్రషట్ వర్గము గూర్చి ఎవ్వరూ చెప్పలేదు. శత్రువులుంటే మిత్రులు కూడా ఉంటారు కదా. కనుక మిత్రవర్గం కూడా ఆరుగురు ఉన్నారు. దయ అనేది కోపము లేదా క్రోధానికి వ్యతిరేఖం అగును, కాని దీని గూర్చి ఎవ్వరూ చెప్పలేదు . అలాగే మత్సరమునకు వ్యతిరేఖ గుణం ప్రేమ, కామమునకు దాన గుణం వ్యతిరేఖం, మదమునకు వినయం వ్యతిరేఖ గుణం, లోభమునకు ఔదార్యం వ్యతిరేఖ గుణము. వీటన్నింటినీ అనగా ఆరు అరిషట్, ఆరు మిత్రషట్ వర్గముల గుణములను వాటి వికారములను (పనులను) గుణ వికారములు అందురు.

ఈ విధంగా మూడు గుణభాగములలో ఒక్కొక్క దానియందు 12 గుణములు కలవని అర్థమవుతున్నది. ఈ గుణముల పనులను గుణవికారములు అందురు. ఈ మూడు గుణవికారములు కాకుండా ఆత్మవలన వచ్చేదానిని **"చమత్కారం"** అంటాము. "చ" అంటే నాలుగు. ఈ మూడు గుణ వికారములైతే నాలుగోది ఆత్మ చమత్కారం. అదేవిధంగా మా నోటినుండి వచ్చిన అందరిపతి అనేది ఎవరిది? ఆత్మది. కనుక నా నోటినుండి వచ్చిన అందరిపతి అనే పదం చమత్కారం. ఆ విధంగా నీలో ఒక ఆత్మ ఉంది అని తెలిసినప్పుడే ఆత్మ శక్తి ఏర్పడుతుంది.

ఈ విధంగా నీ శరీరంలో ఆత్మే అన్ని పనులు కర్మానుసారం చేయిస్తూ ఉంటే, "నేనే చేస్తున్నాను అని ఎందుకు అనుకుంటున్నావంటే, అహం అనేది ప్రత్యక్షంగా నీ శరీరంలో ఉంది. అహం యొక్క పని ఏమంటే, చేస్తున్న (జరుగుచున్న) పనులన్ని నువ్వే చేస్తున్నావని జీవునికి చెప్పటమే దాని పని. ఆ విధంగా అహం ద్వారా బోధింపబడటం వలన జీవునికి ఆ పనిలో వచ్చు పాప, పుణ్యములు వాడి కర్మచక్రంలో నమోదవుతున్నవి. తద్వారా ఆ కర్మను అనుభవించేందుకు మరలా జన్మించవలసి వస్తున్నది. మరి నీవు ఆ పాప,పుణ్యములనుండి తప్పించుకోవాలంటే ఆత్మ అనేది తెలిసివుండాలి. తెలిసి ఉంటే ఏమవుతుంది? నీలో అగ్ని ఒకటి ఏర్పడుతుంది. ఆ అగ్ని దేనికి పనికి వస్తుంది? కర్మ అనే కట్టెలను కాల్చివేసేందుకు పనికివస్తుంది. ఆ అగ్ని కనిపిస్తుందా అంటే, కనిపించే అగ్ని కాదు. అది సూక్ష్మమైనది.

ఆధ్యాత్మిక విద్యలో అన్నీ సూక్ష్మంగానే చెప్తుంటారు, స్థూలంగా చెప్పరు. సిద్ధం అంటే మోక్షం అనుకోక మనం అదొక ఊరు అనుకుంటే ఎలావుంటుంది? అలాకాక ఒక వ్యక్తి మోక్ష మార్గానికి దగ్గరగా ఉన్నాడని

సిద్ధం అంటే మనమెళ్ళి సిద్ధపురం దగ్గర వెతికితే ఎలావుంటుంది? కనుక ఆధ్యాత్మికంలో బాహ్యార్థములుగా కాకుండా అంతరార్థముగా అర్థం చేసుకోవలెను. నాలో ఒకడున్నాడనీ, వాడు కనిపించేవాడు కాదనీ, వాడిని తెలుసుకునేదే జ్ఞానమనీ, దానివలన అగ్ని ఏర్పడుతుందని మనం అర్థం చేసుకోవలెను. ఇవన్నీ నిరూపణకు రాని మాటలని కొందరు అనవచ్చును. ఒక గ్రుడ్డివానిని తీసుకువచ్చి ఒక యోగి ముందర కూర్చుండబెట్టినారట. ఆ యోగి అతని కన్నులను తాకి గ్రుడ్డితనాన్ని తీసేసినారట. జ్ఞానమునకు ఇంత శక్తి ఉంది అని నిరూపణ నిమిత్తం ఆ కార్యం చేయబడింది. అతని శరీరంలో వెన్నుపాము నుండి ప్రాకిన శక్తి , హస్తం ద్వారా ప్రవేశించి, గ్రుడ్డివాని శరీరంలో, తలలో చేరి తలలో కర్మచక్రంలో ఉన్న కర్మను కాల్చివేసింది. అప్పుడు వాడి గ్రుడ్డితనం పోయింది. అక్కడ జ్ఞానాగ్ని అనేది నిరూపణకు వచ్చినది. అతనికి నిరూపణకు వచ్చింది అంటే యోగి వద్ద జ్ఞానాగ్ని ఉన్నట్లే కదా! అతనిలో జ్ఞానాగ్ని ఉందంటే , అతనిలో ఇంకొకరు ఉన్నారని అతనికి తెలుసు. ఇంతవరకు మనకు తెలియనిది ఏమంటే, మన శరీరాలలో అన్ని కార్యములను నడిపిస్తున్నది వేరే ఒకరున్నారు.

మనము ఏదో గుడికి వెళ్ళి మా తప్పులను క్షమించు అని అంటున్నా మంటే ఆ తప్పులను మనం చేస్తున్నట్లే లెక్క. అంటే వాస్తవముగా ఏ పనీ నీవు చేయకపోయినా, అన్నీ నేనే చేస్తున్నాను అని అనుకుంటున్నావు, కనుక అది అజ్ఞానమే. ఈ విధంగా మన ప్రక్కనే ఉండే వాడిని, అనగా జీవుడైన నీ ప్రక్కన నీ తలలో ఆత్మ ఉన్నదని అనుకుంటే, ఆ ఆత్మనే సహచరుడు అని అనవచ్చును, లేదా నీ పొరుగువాడు అనుకోవచ్చును. సహచరుడు అనేవారిని స్నేహితుడు అని కూడా అనవచ్చును. ఈ విధంగా నీ శరీరంలో ఆత్మ నీ సహచరునిగా ఉంది. దానిని గుర్తించలేనందువలన పాప,

పుణ్యములు నీకు అంటుకుంటున్నాయి. వాటిని అనుభవించేందుకు మరలా జన్మించవలసి వస్తున్నది. ఆ కర్మను అనుభవించేందుకు శక్తినిచ్చి ఆత్మే అన్ని పనులు కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములతో చేయిస్తూ ఉంటే మరలా నువ్వే చేస్తున్నావనుకుంటున్నావు మరలా జన్మిస్తున్నావు. కనుక ఒక ప్రక్క కర్మను అనుభవించి దించుకుంటూ మరొక ప్రక్క ఎత్తుకుంటున్నాడు. ఎప్పటికీ ఆత్మే చేయిస్తున్నది అని మాత్రం తెలుసుకోలేక, ఎన్నో జన్మలు ఎత్తి ఈ రోజు ఇక్కడకు వచ్చి ఎన్నో పేర్లు పెట్టుకున్నారు.

మనము ఎప్పటినుండి ఉన్నాం అంటే సృష్టి ఆది నుండి ఉన్నాము. కేవలం ఈ స్థితి ఎందుకు వచ్చింది? అంటే అజ్ఞానంలో ఉండి కర్మలను మూటగట్టు కోవడము వలన వచ్చింది. ఈ విధంగా మూట కట్టుకోకుండా ఉండాలంటే ఆత్మను తెలుసుకోవాలి, ఆత్మను తెలియాలంటే జ్ఞానం అంటే ఏమిటో తెలియాలి, జ్ఞానం మరి ఏ విధంగా తెలుస్తుంది? ధ్యానం వలన తెలుస్తుందా తెలియదు. ధ్యాన విధానంలో ఏదో ఒక మంత్రాన్ని జపిస్తూ ఉండాలి. ఒక పీఠాధిపతి పంచాక్షరి అనే మంత్రాన్ని జపించమంటే అదే మంత్రాన్ని జపిస్తూ 108 పూసలు నడుపుతూ ఉంటారు. పెద్దపూస వచ్చినప్పటికి 108 పూసలు వచ్చినట్లు తెలుస్తున్నదంటే ధ్యాస అనేది రెండింటి మీద ఉంది అన్నమాట. పంచఅక్షరి మంత్రం మీద మరియు పూసలదండ మీద కూడా ఉందన్నమాట. "ఓం నమఃశ్శివాయ" అని అలా జపిస్తూ ఉంటే దానిని 'తపస్సు' అంటాము, ధ్యానం అంటాము. ఆ తపస్సు వలన నీకేమి వస్తుంది? అంటే ఏమొస్తుందో గాని నీ లోపలున్న ఆత్మ మాత్రం తెలియదు. అనేకములనుండి, ఏకమునకు వచ్చావు ఈ పంచాక్షరి మంత్ర పఠనం (జపం) ద్వారా ఏదో ఒకటి మనస్సుకు ఆలోచించడం అనేది ఒక పని. ఇప్పుడు నీ మనస్సులో(తో) చేస్తున్నది కూడా అదే కదా!

అంటే అనేకము నుండి నీ మనస్సును ఏకమునకు తెచ్చావు. కానీ భగవద్గీతలో ఏమి చెప్పబడింది. **"ఏకాగ్రం చెందుము"** అని చెప్పాడు. ఏకాగ్రత అంటే ఏమీలేని స్థితి అంటే సున్నా స్థితి, శూన్యస్థితి. ఒక్కటి కూడా ఉండకూడదు. కానీ నీవేమి చేస్తున్నావు? ఏకాగ్రత చెందలేదు (ఏకముకంటే అగ్రంగా ఉండేది సున్నా) అని తెలియలేక ఒకటి దగ్గరే ఆగిపోయావు. అది ఏకస్థితి (ఏకత) గానీ ఏకాగ్రత కాదు అని తెలియలేదు. ఈ విధంగా ఏదీ తెలియని స్థితిలోకి వెళ్తే నీకు ఆత్మ తెలుస్తుంది. కానీ మానవుడు ఏదో ఒక దానిని గురించి ఆలోచిస్తూ మనస్సును ఏకాగ్రపరచటం లేదు, దానిని ఏక స్థితి అంటారు.

అందుకే భగవద్గీతలో ఏమి చెప్పెనంటే, వేదముల వలనగానీ, తపస్సుల వలనగానీ, యజ్ఞముల వలన గానీ, దానముల వలన గానీ నేను తెలియబడను అన్నాడు. కనుక మనమందరం వీటన్నిటికంటే ప్రత్యేకమైన దానిని (భగవద్గీతను) తెలుసుకుంటే దేవుడు తెలియబడతాడు. కానీ మనం భగవద్గీత గురించి తెలుసుకునే ప్రయత్నం చేస్తున్నామా? అంటే లేదు అని చెప్పవచ్చును.

నీ లోపలున్న శరీర సంబంధాన్నంతటినీ లేకుండా చేసుకో. అప్పుడు నీకు తెలియబడేది ఆత్మే. నీ ఆత్మను నీవు తెలుసుకునేందుకు నీ లోపల గుణాలు అడ్డుగా ఉన్నాయి. ఇంకను చెప్పవలెనన్న చెవులతో వినేటువంటివి, కంటితో చూసినటువంటివి, ముక్కు ద్వారా వాసన చూసేటువంటివి, నాలుకద్వారా రుచి చూసేటువంటివి, చర్మం ద్వారా వచ్చే స్పర్శ జ్ఞానం ఏదైతే ఉందో, ఈ ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా ఏదైతే తెలుస్తూ ఉందో, అవన్నీ నీవు ఆత్మను తెలుసుకునేందుకు అడ్డముగా ఉన్నవి.

నీవు నిన్న చూసిన సినిమా గూర్చి ఈ రోజు గుర్తుకు వచ్చిందనుకో అది వదలితే, రెండవ విషయం ఈరోజు భోజనం గురించి గుర్తుకు వస్తున్నది. అది వదిలితే మరొకటి గుర్తుకు వస్తుంది. ఈ విధంగా అహర్నిశలు ఏదో ఒకటి గుర్తుకు వస్తూనే ఉంటుంది. ఎప్పుడు ఇవన్నీ అడ్డంగా రాకుండా ఉంటాయంటే, మనస్సు పని చేయకుండా ఉండినప్పుడే ఇవేవీ ఆత్మను తెలుసుకునేందుకు అడ్డురావు. అయితే మనస్సు పని తెలియకపోతే నిద్ర వస్తుంది, నిద్రవస్తే ఆత్మను నీవు ఎలా తెలియగలవు? కనుక ఎరుక ఉంటేనే తెలిసేది. ఎరుక ఉంటే ఇవన్నీ అడ్డు వస్తాయి.

మరి ఏ విధంగా ఆత్మ మనకు తెలిసేది? అనేది ప్రశ్నకు. ఈ ఐదు జ్ఞానేంద్రియ విషయములు లేకుండా చేసుకుంటేనే అది సాధ్యమగును. కనుక పంచాక్షరి, అష్టాక్షరి పఠిస్తున్నామంటే అది సరిపోదు. చెవులతో వినేవి ఏవీ మంచివి కావు అని చెప్పాము. అప్పుడు ఈ మంత్రం ఆ మంత్రం అన్నీ వినేవన్నీ కొట్టుకు పోతాయి. చెవులతో వినేవన్నీ పనికి రావంటే సరిపోతుంది. అదే విధంగా కంటితో చూసేవన్నీ వదిలేయాలంటే అన్నీ ప్రకృతి దృశ్యాలు (అన్ని చిత్రపటాలు), దృశ్యాలు కూడా ప్రక్కకు పోతాయి. ఏ ఆకారం నీకు గుర్తుకు వచ్చినా సరే అది దేవుడు కాదు. ఎందుకంటే దేవుడు నిరాకారుడు, రూపరహితుడు, క్రియారహితుడు. కనుక నీవు పంచేంద్రియ రహితుడవైనచో, పంచేంద్రియములకు అతీతుడవైనచో అప్పుడు నీ లోపలున్న ఆత్మ నీకు తెలియబడుతుంది.

ఆత్మ అనేది ఒకటుంది, దానిని నీవు తెలుసుకోవాలంటే అది నీ లోపలనే ఉంది. నీకు సమీపంలోనే ఉంది. అయితే ఆత్మను తెలుసు కుంటానను ఉద్దేశ్యముతో ఎవరిదగ్గరో ఒక ఉపదేశం పొందుతారు. ఉప దేశం పొందారంటే అర్థమేమి? ఆత్మకు అడ్డంగా చెవితో వినే ఒక

మంత్రమును పెట్టినట్లే కదా? అంటే నీవు ఒక మంత్రాన్ని, అనేకత నుండి ఏకతకు తెచ్చావుగాని, ఏకాగ్రత అయిన శూన్యస్థాయిని నీవు పొందలేదు. కనుక నీ యందు మాయ పనిచేసినట్లే లెక్క.

నీవు భగవద్గీతను చదివితే ఆత్మ అనేది నీకు ఎంత దగ్గరగా ఉందో అర్థమవుతుంది. శరీరంలో అన్ని పనులు ఆత్మే చేస్తూ ఉంది. శరీరమంతా ఆత్మ వ్యాపించి ఉంది. మరి నీవెక్కడున్నావు? శరీరంలో ఒక్కచోట ఉన్నావు. గుణచక్రములో ఎక్కడో ఒక దగ్గర రవ్వంతున్నావు. మరి నువ్వు ఏ మంత్రాన్నైనా జపించమని భగవద్గీతలో చెప్పారా? లేదు, కానీ నీ శరీరంలో ఉన్న గుణములను తీసివేసిన, అప్పుడే నీవు నీ ఆత్మను చూడగలవని మాత్రం చెప్పారు.

గాలి లేని చోట దీపం వెలిగినట్లు, నీ మనస్సును కట్టిపడేయాలి అని భగవద్గీతలో చెప్పాడు. అంటే మనస్సును పూర్తిగా దేనియందూ లేకుండా చేసుకో అని మేము చెప్పితే పూర్తిగా దీపం వెలగకుండా చేసుకోమని చెప్పాలి. మేము అలా చెబితే మమ్మల్ని మరీ విడ్డూరంగా చూస్తారు. ఎందుకంటే మిగతావారంతా ఏమి వ్రాసారంటే గాలిలేని చోట పెట్టిన దీపం ఏ విధంగా కదలకుండా వెలుగుతుందో ఆ విధంగా కాక మనస్సును స్వాధీనపరచుకో అన్నారు. కానీ మేము భగవద్గీతలో అదే విషయాన్ని వ్రాస్తే మమ్మల్ని మొదటికే తప్పు అంటారు, కనుక ఆ విధంగాకాక భగవద్గీతలో అందరూ ఏ విధంగా వ్రాసారో ఆ విధంగానే వ్రాసాము. వాస్తవంగా చెప్పాలంటే గాలిలేని చోట దీపం ఎట్లా వెలుగుతుంది? ఆరిపోతుంది, ఆ విధంగా మనస్సు పూర్తిగా లేకుండా పోతేనే నీవు శూన్యస్థితి, లేదా ఏకతపైన వున్న అగ్రత అనగా ఏకాగ్రత వస్తుంది. అప్పుడు నీవు ఆత్మను చూడగలవు.

ఒక వ్యక్తి నాతో ఒక విషయం చెప్పాడు. ఏమంటే, అందరు గురువులు బోధించినట్టు, చెవిలో నాకు నా గురువు చెప్పకుండా తెల్లటి గుడ్డమీద నల్లటి చుక్క పెట్టి చూసుకోమన్నాడు, అని చెప్పినాడు. అదే విధంగా నేను చేశాను. కొన్నాళ్ళకు కన్ను మూసినా, కన్ను తెరిచినా ఆ చుక్కే కనిపిస్తున్నది అన్నాడు. అయితే నిన్న సినిమా చూస్తే, ఈ రోజు కూడా మన కంటికి మరలా ఆ దృశ్యాలు కనిపిస్తుంటాయి. మరి దానికి, దీనికి తేడా ఏమిటి? ఈ సినిమా ఎంతో ఈ బోధ కూడా అంతేకదా! మరొక వ్యక్తి ఏమన్నాడు అంటే చెవులు, కన్నులు, నోరు ముక్కును చేతి వ్రేళ్ళతో మూసేసి, అప్పుడు కన్నులను వ్రేళ్ళతో నొక్కగానే వెలుగు కనిపిస్తుంది. అప్పుడు ఆ వెలుగు దేవుడు అన్నాడట.ఎవరికైనా అలాగే జరుగుతుంది. ఒక రకంగా చూస్తే అది ఇంద్రియాతీతం కాదు కావున ఆ విధంగా కనిపించే దృశ్యం దేవుడుకాదు. ఎందుకంటే **పరమాత్మ రూపనామక్రియా రహితుడు.** ఈ విధంగా మానవులు కాలాన్ని వృథా చేసుకుంటున్నారు. మొత్తానికి ప్రపంచ జ్ఞానమే పూర్తిగా అర్థమయిందేమో గాని పరమాత్మ జ్ఞానం మాత్రం అర్థం కావటం లేదు.

మనలో ఆత్మ ఉంది దానిని తెలుసుకుంటే దానికంటే పెద్దదైన పరమాత్మ లేదా దేవుడు తెలియబడును అనే విషయం ఎవరూ తెలుసు కోవటం లేదు. నీ శరీరాన్నంతటినీ ఆడించేది ఒకటుంది అదే ఆత్మ. నీ శరీరం లోపల, నీ శరీరం బయట, అన్ని శరీరములలో, అంతటా ఉండేవాడు పరమాత్మ. మరి ఆ పరమాత్మను తెలుసుకోవాలంటే, ఎంతో విశాలంగా ఉండేవాడు కనుక నీవు తెలుసుకోలేవు. నీవు ముందు ఆత్మను తెలుసుకుంటే తరువాత పరమాత్మ తెలియగలదు. కనుక ప్రతీ మనిషి ఆత్మను తెలుసుకునే ప్రయత్నము చేయవలెను. ఆ విధంగా ప్రయత్నము చేయకపోతే అది ఆధ్యాత్మికం కాదు.

నేను ఆధ్యాత్మికంలో ఉన్నాను అని అనుకుంటూ ఆత్మను తెలియకపోతే ఏ విధంగా ఆత్మను తెలుసుకోగలవు? ఒక వ్యక్తి చెప్తున్నాడు "మనసే ఆత్మ, బుద్ధే ఆత్మ, చిత్తమే ఆత్మ" అని చెప్పుచున్నాడు. అది ఎలాగవుతుంది. నువ్వు జీవాత్మవు అని ముందు నీకు తెలియవలెను. నీ శరీరంలో ఉండే 25 భాగములను అతిక్రమించి, అధిపతిగా ఉండి, నీ శరీరాన్ని నడిపిస్తూ వున్న ఆత్మను తెలియవలెను.

నీ శరీరంలో జరిగే ద్రవ్య యజ్ఞానికిగాని, జ్ఞాన యజ్ఞమునకు గాని అధిపతి ఆత్మయే. కానీ నీకు వాటిని తెలుసుకోవాలనే ఆసక్తి లేదు. నీవు తినే ఆహారం నీ పొట్టలో ఉండే జఠరాగ్ని ద్వారా అవి కాలిపోతున్నది. అంటే జీర్ణమయిపోతున్నాయి. అదే ద్రవ్యయజ్ఞమంటే. నీవు తినే ఆహారం ద్రవ్యములే కదా. జ్ఞానయజ్ఞమంటే ఏమిటి? ఐదు జ్ఞానములను కాల్చివేయటం. అంటే ఐదు జ్ఞానేంద్రియ విషయములను కాల్చివేయటం. తద్వారా కర్మలు కాలిపోతే ఆ యజ్ఞాన్ని జ్ఞానయజ్ఞం అంటారు. కనుక ఈ రెండు యజ్ఞాలకు అధిపతి ఎవరు? ఆత్మయే. కానీ ఇది ఎవరికీ తెలియదు. ఉదాహరణకు ఒక పొలములో తెగులు వచ్చింది. దానికి మందుకొడితే పోతుంది. అప్పుడు ఆ రైతు ఆ పైరుకి మందు కొడతాడు. మందుకొట్టిన తరువాత ఈ పురుగులన్నీ చచ్చాయి అనుకుంటాడు. నేను చంపియుంటే ఇవి చచ్చిపోయాయి అనే భావన ఈయనకు రాలేదు, మందువలన చచ్చాయి అనుకుంటున్నాడు. ఎప్పుడైనా ఒక జంతువునో, మనిషినో చంపితే నేను చంపాననే భావన వస్తుంది, కానీ ఇన్ని పురుగుల్ని చంపినా నేను చంపాననే భావన రాకుండా ఆ పురుగు మందువలన ఆ పురుగులు చనిపోయాయి అనే భావన వచ్చింది. తద్వారా నిమిత్త మాత్రంగా పని చేసాను అనే భావన ఉన్నట్లే ఉంది, కానీ నేనే చంపాననే అహంభావం లేదు కనుక ఆ

www.thraithashakam.org

రైతుకు ఆ పనిలో వచ్చే పాపపు కర్మ అతనికి రాలేదు. పనిచేసినాసరే "నేనే చంపినాను" అనే భావన లేదు. కొట్టేమందు వలననే చనిపోయాయి అనే భావన ఉంది కనుక అది జ్ఞానయజ్ఞం అయిపోయింది. ఆ విధంగా మనకు తెలియకుండానే మనం జ్ఞానయజ్ఞము చేస్తున్నాము. అదే విధముగా పొట్టలో జరిగేది యజ్ఞం అని తెలియకుండానే ద్రవ్యయజ్ఞం జరుపు కుంటున్నాము. కాని కొన్ని పనుల్లో నేనే చేసాను అనే భావన రావటం వలన ఆ పనివలన వచ్చే కర్మ (పాపం, పుణ్యం) అంటుకుంటూ ఉంది. కనుక అది జ్ఞాన యజ్ఞం కావటం లేదు. కనుక ప్రతీ దానిని యజ్ఞముగా చేస్తే నీకు కర్మ అంటదు.

**"యజ్ఞార్థకర్మనోయత్ర లోకోయం కర్మబంధనః" నీవు చేసే పనిని యజ్ఞసంబంధముగా చేస్తే నీకు కర్మ అంటదు.** యజ్ఞసంబంధం లేకుండా పనిచేస్తే నీ కర్మలు (పాప,పుణ్యములు) అంటును. యజ్ఞసంబంధం అంటే ఏమిటి? వచ్చే కర్మను (పాపం,పుణ్యం) లేకుండా చేసుకోవటం. అది ఏ విధంగా చేయాలి? ఆత్మ చేస్తూ ఉంది నేను కాదు అనే ధ్యాస ప్రతీ నిమిషం నీకు ఉన్నప్పుడు ఆ కర్మ నీకు రాకుండా తప్పిపోయే అవకాశం ఉంది. అందువలన భగవద్గీతలో ఏమి చెప్పారంటే, నీకు యోగి అనే పేరు రావాలంటే, పనులు చేయి, అగ్నిని దగ్గర బెట్టుకో, తద్వారా వచ్చే కర్మంతా అగ్ని వలన కాలిపోతుంది. అగ్ని వలన అలాకాకుండా అగ్ని లేకుండా ఉంటే అవన్నీ నీలో చేరుతాయి. అదే జ్ఞానాగ్ని. అగ్ని లేకుండా యోగికాలేడు, సన్యాసి కాలేడు అని కృష్ణుడు చెప్పాడు. మరి అగ్ని కావాలంటే, ఏమి చేయాలి? ఆత్మ తెలియాలి, ఆత్మ తెలియాలంటే ఏమి చేయాలి? నీవు ఆత్మను వెతకాలి. అది బయట వెతికితే దొరకదు కానీ నీ శరీరం లోపల వెతికితే దొరుకుతుంది.

నీ వెక్కడున్నావో ముందు తెలుసుకో. అప్పుడు నీ ఆత్మ గురించి తెలుస్తుంది. నీవు ఒక్కదగ్గరే ఉన్నావని తెలుస్తుంది. నీవు కానిదంతా శరీరంలో ఉన్నది ఆత్మయే అని తెలుస్తుంది. ఆత్మ శరీరమంతా ఉంది అని తెలియజేయుటకు దేవుడు నీ శరీరముపైన ఎన్నో గుర్తులు పెట్టెను. హస్తములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మల గుర్తులు పెట్టినాడు. అందుకే మన పెద్దలు నిద్ర లేస్తూనే చేతులను చూసుకోమన్నారు. ఆ అలవాటు పూర్వముండేది కానీ ఇప్పుడు లేదు. కనుక ఆత్మను వెతుకుటకు దేహం లోపలనే పరిశోధన చేసేవాడు, ఆత్మను సులభముగా తెలుసుకోగల్గుతాడు. శరీరాన్ని విడిచి బయట ఎక్కడ వెతికినా ఆత్మ తెలియబడదు.

ఆత్మను తెలుసుకుంటే జ్ఞానాగ్ని ఏర్పడుతుంది, అలా ఏర్పడితేనే మన కర్మలనుండి బయటపడే అవకాశముంటుంది. అంతవరకు నీకు దుస్సాధ్యము. ఈ విధముగా ఎవరికీ తెలియని జ్ఞానం మనం ఇప్పుడు చెప్పామంటే అది చమత్కారం, అంటే ఆత్మే చెప్పింది. కనుక ఈ రోజు నుండి మనం ఆత్మను తెలుసుకునే ప్రయత్నం చేద్దాము.

## 35. 1, 2, 3 గురుపౌర్ణమి

తేది : 25-07-2010

'పౌర్ణమి' అనే పదములో ఒక ప్రత్యేకమైన అర్థము ఉన్నది. అంటే పౌరులకు సంబంధించినది. పౌరుషము కల్గినటువంటిది, పురుషత్వం కల్గినటువంటిది, అనగా పురుషునికి సంబంధించినది ఎవడు పురుషుడు ఈ ప్రపంచములో దేవుడు పురుషుడు. దేవునికి సంబంధించిన సంపూర్ణ మైనటివంటి దానిని పౌర్ణమి అని పేరు పెట్టుకున్నాము. "గురు పౌర్ణమి"

అనే పదములో పౌర్ణమి అనే పదము ముందు, గురు అనేది చేరింది. ఇంతవరకు పౌర్ణమి అంటే పురుషునికి సంబంధించినది అని ఎవ్వరూ చెప్పలేదు. ఇంతకుముందు గురువు అంటే ఏమి అనే దానిని గురించి చెప్పుకున్నాము.

గురువు అనే దాని గూర్చి ఇంకా తెలుసుకోవాలంటే బ్రహ్మావిద్యా శాస్త్రమైన భగవద్గీతలోకి వెళ్ళి చూడాలి. అందులో ఒక శ్లోకాన్ని ఆధారంగా తీసుకుని చూద్దాం. రాజవిద్యా రాజగుహ్య యోగము అనే అధ్యాయంలో 2వ శ్లోకము చూసిన...

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖంకర్తుమవ్యయమ్॥

**ఇది పవిత్రమైనది, ఉత్తమమైనది, ప్రత్యక్షమైన ధర్మము, సుఖము లలో కల్లా సుఖమైనటువంటిది. అవ్యయమైనటువంటిది. నాశనము లేనటువంటిది.**

రాజవిద్యా, రాజగుహ్యాలో **'రాజ'** అనే పదము తీసుకుంటే **గొప్పది** అని అర్థము. రాజ అనే శబ్దం గొప్పది అనే విషయం తెలియజేసేందుకు వాడుతారు. కీయము అంటే ఆట, **రాజకీయం అంటే గొప్ప ఆట.** ప్రపంచములో గొప్ప ఆట ఏది? జ్ఞానము. జ్ఞానము తెలిస్తే, నిజమైన రాజకీయం లేకపోతే అది ప్రపంచ రాజకీయం. ఒక వ్యక్తిని "నీ రాజ్యము ఏది?" అని అడిగితే "నా రాజ్యం వేరే వుంది" అన్నాడట. ఎవరికీ అర్థము కాలేదు. సరికదా, ఇతనేమైనా ఈ రాజ్యానికే రాజు అవుతాడేమోనని ఆయనను చంపేసినారు. **రాజవిద్య అంటే గొప్ప విద్య.** దీనికంటే మించిన విద్యలేదు. తరువాత రాజగుహ్యా. గుహ్యా అంటే రహస్యం దీనికి మించిన

రహస్యమూ లేదు. నీకు తెలియబరచేది విద్య, తెలిసేది రహస్యం. నీకు తెలియాల్సిన రహస్యం ఒకటుంది. విద్య అంటే తెలిసేది కదా, 'గుహ్యా' అంటే తెలియనిది కదా! రెండూ వ్యతిరేఖ పదాలు కదా! విద్యలో ప్రశ్న ఉంటుంది, రహస్యంలో జవాబు ఉంటుంది. నీకు తెలియబడనప్పుడు ప్రశ్నగా ఉంటుంది, తెలిస్తే జవాబు అయిపోతుంది. కావున ప్రశ్నగా ఉండేటువంటిదీ ఇదే, జవాబుగా ఉండేదీ ఇదే. ఈ రెండు ఎక్కడున్నాయి? శాస్త్రములో ఉన్నాయి. ఈ శాస్త్రాన్ని చెప్పిందెవరు?

ఒక వ్యక్తి "భగవద్గీత ఎవరు చెప్పారు?" అన్నాడు. శ్రీకృష్ణుడు శ్రీకృష్ణుడు ఎవరు? శ్రీకృష్ణుడు మనలాగే ముక్కు, చెవులతో వచ్చాడు కదా! ఆయనే నీవు తెలుసుకునేది, రహస్యమైనదీ చెప్పాడన్నమాట. అదే రాజవిద్యా రాజగుహ్యాం చెప్పినటువంటి వాడు వ్యక్తి. ఇచ్చట 'గు' అంటే గుహ్యామైనటు వంటివాడు. గుప్తనిధి అనగా రహస్యంగా ఉండే నిధి అని అర్థము. గుహ్యాముచు చెప్పినటువంటి వాడు కనుక గురువు అయినాడు. శిష్యులుంటే కదా గురువు ఉండేది అంటే, గురువుకు శిష్యులుండరు అని మేమంటాము. ఎందుకంటే గురువు అంటేనే గుహ్యామైనవాడైతే, గురువు అని ఎలా తెలుస్తాడు? గురువు ఎవ్వరికీ తెలియడు. తెలియబడనప్పుడు శిష్యుడెట్లు వస్తాడు. నేను గురువు అని పేరు పెట్టుకున్నాను అంటే నేను తెలియబడిపోయాను కదా! మరి నేను గురువును, గుహ్యామును ఎట్లు అవగలను? 'గు' అనే పదము ఆయనకు వర్తించదు. గురువు అంటే ఒక రహస్యమైన వ్యక్తి.

ప్రశ్నవేస్తే, జవాబు వస్తుంది. ప్రశ్న వేసేవాడు విద్యార్థి, జవాబు ఇచ్చేవాడెవడు గురువు. అంటే ఇప్పుడు ఇక్కడ ఇద్దరయినారు. అది మనకు బయటికి కనిపిస్తూ ఉంటుంది అన్నమాట. ఈ విధంగా వారిని

www.thraithashakam.org

గురుశిష్యులనవచ్చు కానీ, ప్రశ్న కూడా గురువే వేస్తాడు, జవాబూ గురువే చెప్తాడు. ఎక్కడైతే ప్రశ్నా గురువే వేసి, గురువే జవాబు చెప్తాడో వాడే గురువు. 'రాజవిద్యా రాజగుహ్య' విద్యను చెప్పిందీ వాడే, రహస్యాన్ని చెప్పిందీ వాడే అతడే గురువు. ఈ గురువు ఎటువంటివాడు? మామూలు మనిషిగా పోల్చుకుందామా? లేక గొప్పవానిగా పోల్చుకుందామా లేక ఇంకా ఏ విధముగా పోల్చుకుందాము? సాక్ష్యాత్ దేవునిగా పోల్చు కుందామా? దేవుడు అంటే రూప, నామ, క్రియా రహితుడు అని చెప్పినాము కదా! మరి ఏ విధంగా ఆయనను అర్థము చేసుకోవాలి?

ఇప్పుడు విద్యాలయములలో ఏవైనా పోటీలు పిల్లల మధ్య పెట్టినప్పుడు, .ఆ ఆటను ప్రారంభించే ముందు 1, 2, 3 అనగానే పిల్లలు పరుగెత్తటంతో ఆ పోటీ మొదలవుతుంది. లేక పాటల పోటీ అయితే, పాటలైనా మొదలవుతాయి. మరి ఇప్పుడు ఎక్కడికి వచ్చింది అంశము అంటే మరలా త్రీ దగ్గరికే వచ్చింది. వన్ దగ్గర నిలబడలేదు, టూ దగ్గర నిలబడలేదు, కానీ త్రీ దగ్గరకు వచ్చినప్పటికీ నిలబడింది లేదా మన మాట ఆగింది. ఎక్కడైనా ఈ 1,2, 3 అనేమాట సహజంగా అంతటా కనిపిస్తూ ఉంటుంది. ఈ "త్రీ" అనే పదము దగ్గరే ఆజ్ఞ మొదలవుతున్నది. ఈ 1, 2, 3 లేదా ఒకటి, రెండు మూడు అన్నా ఏమి సందేశము ఇస్తున్నవంటే! **ఒకటి జీవాత్మ, రెండు ఆత్మ, మూడు పరమాత్మ** ముగ్గురుగా విభజించుకుంటే, మూడు ఏమి తెలియజేస్తున్నది అనగా పరమాత్మను తెలియజేస్తున్నది.

ఇప్పుడు మనకి దేవుడు ఒక పందెం పెట్టినాడు అనుకుందాము. నువ్వు జ్ఞానములో ఎంత వేగంగా పోతావో, అని ఎంతవేగంగా పోవాలన్నా మన ప్రారంభం ఎక్కడ నుండి అంటే, ఒకటో ఆత్మ నీవే అని తెలిసిన రోజు, నీలో రెండవ ఆత్మ ఒకడున్నాడు అని తెలిసిన రోజు, మూడోవాడిని

తెలుసుకోవాలి అని అనుకున్న రోజు అప్పుడు నీవు ప్రారంభమవుతావు. అప్పుడు నీ ఆట మొదలవుతుంది. ఈ వన్, టూ, త్రీ అనే పదాలు బ్రహ్మవిద్యా శాస్త్రంలో ఎక్కడ వినిపిస్తున్నాయి? క్షర, అక్షర, పురుషోత్తములు తెలిసినప్పుడు నీకు తెలుస్తుంది. అప్పుడు నీ ప్రయాణం మొదలవుతుంది. మనకి జ్ఞానమార్గములో పందెం ఎప్పుడు మొదలవుతుంది? 'త్రీ' అనేవాడు అనగా పురుషోత్తముడు అనేవాడి గురించి తెలిసినప్పుడే మొదలవుతుంది. అంతవరకు పోవటానికి వీళ్ళేదు. ప్రపంచములో ఎవరైనా జ్ఞానమార్గములో పోవాలంటే, ఈ మూడు ఆత్మలను తెలుసుకున్నప్పుడు మూడవ ఆత్మను గూర్చి విన్నప్పటినుండే ప్రయాణం మొదలవుతుంది.

ఇంతవరకు ప్రపంచములో మూడు ఆత్మల వివరములు ఎవరికీ తెలియవు. తెలియ కుండా మేము ఆధ్యాత్మిక విద్యలో ఉన్నామంటే ఎంతవరకు సమంజసమో మీరే తెలుసుకోండి. ఆధ్యాత్మికం అంటేనే ఆత్మ గురించి అధ్యయనం చేయటం. ఇలా జరిగినప్పుడు ఆత్మకంటే పెద్దది ఇంకేదో ఉంది అన్న విషయం తెలుస్తుంది. కనుక అప్పుడు మూడు ఆత్మల గురించి వివరము తెలుసుకోవటానికి ప్రయత్నం చేస్తావు.

ఇప్పుడు రూప, నామ, క్రియా రహితుడు దేవుడు అని మనము చెప్పుకున్నాము కదా! ఈ విషయాలన్నీ ఎవరి ద్వారా తెలియాలి? గురువు ద్వారానే తెలియాలి. మరి గురువును ఏ విధంగా లెక్కించుకోవాలి? అంటే, ఒక విధముగా మనిషి, ఒక విధంగా భగవంతుడు. ఒక లెక్కలో చూస్తే దేవుడు. ఎటూ పోల్చుకోలేని స్థితిలో ఉంటాము. మరి ఆయనను ఏ లెక్కలో చూడాలంటే నువ్వు ఎక్కువ ఏ లెక్కలో చూస్తే అదే. ఎక్కువగా మనిషిగానే చూస్తే మనిషే, లేదు ఎక్కువగా ఆత్మగా చూశామనుకోండి ఆత్మే, ఎక్కువ దేవునిగా చూశావు అనుకో మూడో ఆత్మయే. నీవు ఎంచుకునే పద్ధతినిబట్టి నీకు ఆయన అర్థమవుతాడు.

ప్రపంచములో ఫలానా మనిషి గురువు అని చెప్పేందుకు వీలులేదు. గురువు రహస్యమైనటువంటివాడు. ప్రపంచవరముగా ఇంతమంది గురువులలో ఎవరు గొప్పవారు? ఒక విధానాన్ని నేర్పించేవాడు ఎవడైనా గురువే. వాడు బయట ఆధ్యాత్మికత అని పేరు ఉంది కానీ అది ఆధ్యాత్మికం కాదు. ఎవరైతే క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు అనే క్రమంలో దేవుని జ్ఞానము తెలుపుతున్నాడో వాడిదే నిజమైన ఆధ్యాత్మికం. అంతవరకు అది ఆధ్యాత్మికము కాదు. యజ్ఞాలుగానీ, తపస్సులుగానీ, దానాలవలన గానీ, వేదాధ్యయనం వలన గానీ దేవుడు తెలియబడడు, అవన్నీ వ్యర్థం. ఇవన్నీ చేస్తూ దేవుని మార్గము అనుకోవటం పొరపాటు.

మరి ఇందరు గురువులను గురువులనే అందామా అంటే అనాల్సిందే. ప్రపంచ గురువులు అనవచ్చు. కానీ వాస్తవముగా అసలైన దైవజ్ఞానము చెప్పే గురువు ఎవ్వరికీ తెలియడు మరి ఇప్పుడు మనమేమి చెయ్యాలి? సరే! ఇప్పుడు కనిపించే గురువులలో ఎవరు గొప్పవారు? ఒక మనిషిని పూర్తిగా మార్చగలిగినవాడు ఎవడైనా గొప్పవాడే! ఈ విషయం ప్రపంచములోనైనా సరే ఇప్పుడు మీ అందరూ ప్రపంచ మార్గంలో ఆసక్తి చూపించి, నేనుచెప్పు జ్ఞానమార్గములోకి రాలేదంటే త్రోవ తప్పినట్లే కదా! అలా కాకుండా ప్రపంచ విషయాలలో ఆసక్తి తగ్గించి, నేను చెప్పు మార్గం లోకి వస్తే, నా మార్గములోకి మీరు వచ్చినట్లే కదా! కనుక మేము ఎవ్వరమైనా ఈ మార్గములోకి వచ్చేటట్లుగా మార్చగలిగామా? అని చూస్తే మాకంటే ఇంకా గొప్పవాడు ఒకడున్నాడు. మనిషి దైవజ్ఞానము మీద 1 శాతం ఆసక్తి ఉంచి మిగతా 99 శాతం ప్రపంచ ధ్యాసలలో ఉండి నేనే గొప్ప జ్ఞానిని అనుకుంటున్నాడు. మేము ప్రత్యక్షంగా చూస్తున్నాము. ప్రపంచములో ఎవ్వరూ చెప్పని జ్ఞానము, బ్రహ్మవిద్యా జ్ఞానమిది అని చెప్పినా, ఎవరికీ అర్థము కాలేదు సరికదా, వేరే విధంగా ప్రవర్తిస్తున్నారు.

www.thraithashakam.org

బిన్‌లాడెన్ అనే వ్యక్తి మీ అందరికీ తెలుసు. ఆయనేమీ మనలాగా ఎప్పుడూ జ్ఞానము చెప్పలేదు. రెండుమాటలు చెప్పినాడు. ఆయన మాటకు విలువనిచ్చి కొంతమంది ప్రాణాలే ఇచ్చినారు. ఈ విధంగా అయితే ఆయన పెద్ద గురువే, ఎందుకంటే అతను కొందరి వ్యక్తులను మార్చినాడు కదా! అయితే ఇప్పుడున్న గురువులందరిలో ఎవరు పెద్ద గురువు అంటే బిన్‌లాడెన్ పెద్ద గురువు. ఎందుకంటే మేము చెప్పినట్లు ఎవరైనా విన్నారా? ఎవరూ వినలేదు. నేను చెప్పిన విద్య ఎవరికీ అందలేదు. కనుక ఆ రహస్యం తెలియకుండా పోయింది. మూడు సంవత్సరములు జ్ఞానం విని, నాలుగో సంవత్సరం ఇంకో దేవతకు మ్రొక్కితే, నేను చెప్పిన జ్ఞానము వృథా అయినట్లే కదా! ఇతర దేవతలను పుట్టించినవాడు ఇంకో దేవుడున్నాడు, వాడిని ఆరాధించండి అని చెప్తే, విని మరలా ఇతర దేవతలను పూజ చేసినాడంటే ఏమర్థము అయినట్లు. నేనైతే బట్టబయలుగా రహస్యం చెప్తున్నాను గానీ వీళ్ళకు అర్థముకాలేదు కదా! నేను ఇప్పుడు చెప్పు ఉపన్యాసం, మీరు చెవులో దూది పెట్టుకుంటే ఏం చేస్తాం? అది ఏమీ అర్థము కాదు.

దేవుని విధానం మనకి రావాలంటే దేవుని చూపు మనమీదకు రావాలి. గురువు చూపు మనమీద పడాలంటే ఆయన చెప్పిన రహస్యములు తెలుసుకోవటమే ముఖ్యం. మనకు ఎక్కడైతే తెలియని రహస్యములు తెలియబడుతున్నాయో, అక్కడ గురుత్వం ఉన్నట్లు లెక్క. గురువు మాత్రము ఎక్కడా కనిపించడు. గురువును ఎక్కడా ప్రపంచములో గుర్తించలేము, అది సాధ్యం కాదు. ఒకవేళ గుర్తించగల్గితే కొన్ని రహస్యములు తెలియాలి. ఆ రహస్యాలు తెలియనంత వరకు గురువు తెలియడు. గుహ్యాము ఏదైతే ఉందో, విద్ ఏదైతే తెలియబడిందో అప్పుడే సాధ్యపడుతుంది. విద్యార్థి లేడు కావున గురువు కూడా లేడు. మరి ఈ జ్ఞానము బయటకు ఎలా

వస్తుంది? అంటే, ఒకరిని, అడ్డము పెట్టుకున్నాడు. ఎవరిని? అర్జునున్ని, అర్జునున్ని అడ్డం పెట్టుకుని ఆయన జ్ఞానము చెప్పినాడు. చూసే దానికి కృష్ణుడు అర్జునునికి జ్ఞానము చెప్పుచున్నాడు. మరి ఆ సమయంలో అర్జునుడు, కృష్ణుడు ఉన్నారా? విశ్వరూపం చూపినప్పుడు కృష్ణుడు, అర్జునుడు ఉన్నారా? అర్జునునికి అసలుకు అర్థమే కాలేదు. విశ్వమంతా వ్యాపించినిది ఒకటే ఒకటుంది ఈ అర్జునుడు కూడా వాడే, ఆ కృష్ణుడు కూడా వాడే, ఎవరంటే ఈ విశ్వమంతా వ్యాపించినవాడే!

ఈ విధముగా చెప్పుకుంటే ప్రశ్న, జవాబు ఒక్కచోటే ఎక్కడుందో అది గురుత్వం కల్గినటువంటి జాగా అని గుర్తుపెట్టుకోవాలి. తెలుసుకునే వాడూ వాడే, తెలియజేప్పేవాడూ వాడే అని మనము తెలుసుకుని ఇదీ రహస్యమూ, ఇక్కడ చెప్పబడింది మనము తెలుసుకోవాలి. ఒక వ్యక్తి మొన్న టీవీలో చెప్తూ ఉన్నాడు. పుస్తకాల ద్వారా చెప్తే అవి ఏ సత్యమును చెప్పలేవు, అవి చతకిల పడిపోతాయి అని చెప్పాడు. అవి హేతుబద్ధం కావు అని చెప్పాడు. ఇప్పుడు మనమేమి చెప్పుచున్నామంటే, నీవు హేతువాదివో, నాస్తికవాదివో, ఏదో ఒకవాడివి. నీవు సైన్స్ అనే దానిని నువ్వు పుస్తకంలో చూసి చదివి, నేర్చుకున్నావా లేకపోతే, ఏ పైనుండైనా వచ్చిందా అని మేము అడుగుచున్నాము. అలాగైతే మీరు పుస్తకాలు చదివినది కూడా చతికిల పడిపోతుంది అని చెప్పవచ్చా? ఈ విధంగా కొందరు ఏమి చేస్తున్నారంటే, వాస్తవం తెలియకుండా, హేతువాదులమని ఇంకో విధంగా మాట్లాడుచున్నారు.

హేతువాది కానటువంటివారు, సాధారణ మనుషులు ఏమి చేస్తున్నారంటే, దేవుడు అనేవాడు ఒకడున్నాడు. మనకంటే ఎక్కువ పని చేస్తున్నాడు, మనకి సుఖమును ఇచ్చేదానికి, మనకి లాభం చేకూర్చడానికి,

మనలను బాగా చూసుకొనేందుకే దేవుడు ఉన్నాడు అని అనుకుంటున్నారు. మనకి కష్టం కల్గితే దేవుడు గుడ్డివాడా? అని మనము ఆయనను తిట్టడం మొదలెడతాము. నేను న్యాయంగా ఉన్నాను నాకెందుకీ శిక్ష? అనే వారున్నారు. ఇంకొకరు ఏమంటున్నారంటే, మేమంటే ఏదో తప్పు చేసినాము, మా పిల్లలు ఏమి తప్పు చేసినారు, వాళ్ళకు ఎందుకీ శిక్ష? దేవుడిట్లా చెయ్యవచ్చునా? అని అడుగుచున్నారు. విషయమేమంటే, **రూప, నామ, క్రియారహితుడు దేవుడు** అటువంటివాడు దేవుడైనప్పుడు ఈ పనులన్నీ దేవుడు ఎందుకు చేస్తాడు.

నీకు మంచి జరిగినా, చెడు జరిగినా ఏ పనీ దేవుడు చేయడు. ఆ విషయం తెలియక మనము దేవున్ని నిందిస్తున్నాము. తెలియని తనముతో దేవున్ని ఇటువంటివాడు అనుకుంటున్నాము. మనము చనిపోతున్నాము అనినా, పుడుతున్నాము అనినా, ఈ ప్రపంచములో చరిస్తున్నాము అనినా, వీటికన్నింటికీ కారణం ప్రకృతి. అంటే దేవుని గుమస్తాలున్నారు. ఆ గుమస్తాల వలననే ఈ పనులన్నీ జరుగుచున్నాయి. దేవుడు ఏమీ చేయలేదు, అని మనము జ్ఞాపకము పెట్టుకుంటే మనకి అర్థమవుతుంది. రాజు ఎక్కడో ఉంటాడు, రాజుక్రింద పరిపాలన చాలా ఉంటుంది. నీకు శిక్షగా పది కొరడా దెబ్బలు పడినాయనుకో. రాజుకొట్టినాడా, రాజు గుమస్తా కొట్టినాడా?, ఎందుకు ఈ విధంగా కొట్టినావని మరి గుమస్తాను ఏమైనా అడుగుతామా లేక కనిపించని రాజుని అడుగుతావా? రాజు ఏమి చెప్పి ఉంటాడు, "ఎవరైనా తప్పు చేస్తే కొట్టు" అని చెప్పి ఉంటాడు. తప్పు చేస్తే కొట్టు అనేది ఒక ఆజ్ఞ. అందరికీ అదే శాసనం. ఆ శాసనాన్ని ఉపయోగించి కొట్టాడు. కొట్టినవాడిని అడిగితే చెప్పగలడు కానీ రాజు గుడ్డివాడా? అని అడిగితే ఎట్లా అవుతుంది. కనుక రాజును మనము

www.thraithashakam.org

ప్రశ్నించే అవకాశము లేదు, అలాగే దేవున్ని ప్రశ్నించే అవకాశము కూడా లేదు. ఇవన్నీ ప్రకృతి వలననే జరుగుచున్నాయి. రాజు పరిపాలన ఒకటుంది **"ప్రభువు-ప్రభుత్వం"** అనే అంశాన్ని గూర్చి మనము ఇంతకు ముందు చెప్పుకున్నాము.

ప్రపంచములో రాజ్యాంగం వద్దు, ప్రపంచ రాజకీయం వద్దు. ఏది నిజమైన రాజకీయం? అంటే దేవుని రాజ్యాంగములో పంచభూతముల పరిపాలన నిజమైన రాజకీయము. పాలనలో ఐదు భూతములే కాకుండా ఉపభూతములున్నాయి, ఉప భూతములే కాకుండా స్వల్ప భూతములు ఉన్నాయి. మహా భూతములు ఉన్నాయి. తరువాత గ్రహములున్నాయి. గ్రహములు చాలా సంఖ్యలో ఉన్నాయి. ఇవన్నీ పరిపాలిస్తుంటే కార్యములు జరుగుచున్నవి. ఒక ప్రమాదం జరిగిందంటే వెనుక ఎంతో ప్రణాళిక ఉంటుంది. అది నీకు తెలియదు. ఈ విధంగా లెక్కవేసుకుంటే ప్రతీ పనికి ఒక కారణం ఉంది.

అమెరికాలో పెద్ద వర్షం పడింది చాలామంది చనిపోయారు నిజమే, కానీ నీకు తెలియని కారణం ఉంది, అదే రహస్యం! తెలియని విధానము అంతా ఎవరు జరుపుచున్నారు తెలియదు. తప్పు చేస్తే, పోలీసులు వచ్చి, కోర్టులో పెట్టి వేసే శిక్షలు కంటికి కనిపించేవి. కొన్ని శిక్షలు కనపరాకుండా జరుగుచున్నాయి. రోగాలు వస్తే బాధపడటం లేదా, అది బయట వారు వేసే శిక్ష కాదా? ప్రమాదంలో కాళ్ళు విరగలేదా, అది బయట కోర్టువేసే శిక్ష కాదు కదా! కొందరు ఆ ప్రమాదాలలో చనిపోలేదా, ఆ శిక్ష కోర్టులు వేసాయా! ఒక వ్యక్తి ఉరిశిక్ష వలన చనిపోతే ఆశ్చర్యంగా చూస్తాము, కానీ ఒక ప్రమాదంలో పదిమంది చనిపోతే పట్టించుకోము. ఇవన్నీ శిక్షలుకాక ఇంకేమి అవుతాయి? ఇవేవీ మనకి తెలియకుండానే పరిపాలన జరుగుతూ

ఉంది. అంటే నీవు చేసుకునే పాపము రికార్డు అయి అమలు జరుగుతూ ఉన్నది. నీవు తెలియకుండానే అనుభవిస్తున్నావు. అంటే మనకి తెలియని విధానము ఎంతో ఉంది. ఈ వాస్తవాన్ని తెలుసుకోవటమే మన ధ్యేయం.

దేవుడు అనే విషయాన్ని మనము తెలుసుకోవాలంటే ఏమి చెయ్యాలి? దానికో గురుత్వం కావాలి. నీకు ప్రశ్నలు ఎలాగూరావు. ఆయనే ప్రశ్నలువేసి ఆయనే (గురువే) జవాబు చెప్పుతాడు. ఆ విధంగా ప్రశ్న, జవాబు ఎక్కడైతే ఉందో అదే గురుత్వం. గురువు, "నువ్వెవరు?" అని నిన్ను అడిగాడనుకో నా పేరు ఫలానా అంటావు. విడిచిపెట్టు ఆ పేరుని, ఎందుకంటే ఆ పేరు నువ్వు పుట్టిన తరువాత కొన్ని రోజులకి పెట్టినది. అంతకు ముందు నువ్వెవరు? అంటే ఏ పేరూ లేదు. నేనొక మనిషిని అంటావు. అందరూ మనుషులే, కరెక్ట్ అడ్రస్ చెప్పు అంటే నువ్వు చెప్పలేవు. ఈ విధంగా ప్రతీ దానినీ లెక్కించుకుంటే, ఆ రహస్యములు తెలుస్తాయి. ఈ రోజు ఒక వ్యక్తి జన్మించి, గత జన్మలో తనెవరో చెప్పిన దాఖలా కొన్ని ఉన్నాయి. అవి నిజమా, కాదా అని చూస్తే, అవి నిజమే అని తేలాయి. అంటే మనమందరం ఇక్కడ పుట్టామంటే మనందరికీ గతచరిత్ర ఏదో ఉంది, కానీ అది ఎవరికీ తెలియదు. ముందు జన్మలు తెలియవు. ప్రస్తుత జన్మ గురించి మాత్రమే తెలుసు. సరే! ఈ జన్మలో డబ్బులు, ఆస్తి సంపాదించుకోవాలని చూస్తున్నా, అది మనవెంటరాదు. ఒక వ్యక్తి "నీకు జ్యోతిష్యం బాగావచ్చును కదా! ప్రతీ విషయం నాకు ఏమి జరుగుతుందో చెప్పండి. మీకు నెలకు లక్షరూపాయలు ఇస్తాను" అని అన్నాడట. నాకు కావలసిన అవసరం వేరొకటుంది. నువ్వు లక్ష ఇచ్చినావు అనుకో, ఆ లక్ష ఇచ్చిన అర్ధగంటకు నేను చనిపోయాననుకో, ఈ లక్ష ఇక్కడే ఉండిపోతుంది. కాబట్టి నీ లక్ష నాకు పనికిరాదు ఇది ప్రపంచ ధనము, నావెంట రాదు.

జ్ఞానధనం అని ఇంకొకటుంది, అది నాకు కావాలి. నెలకు 10 రూపాయలంత ఇచ్చినా చాలు అన్నాడు. వాడి దగ్గర ఏముంటుంది? జ్ఞానధనము పది పైసలు కూడా లేదు. ఏ విధంగా ఇస్తాడు? ప్రపంచ ధనము కావాలంటే ఎంతైనా ఉంది. పరమాత్మ ధనము లేదు. ఇంకేమి ఇవ్వగలడు?

ఈ ప్రపంచములో ఎంత పెద్ద చదువు చదివినవాడైనా కానీ, ఎంత విజ్ఞాని కానీ, ఎన్ని శాస్త్రాలు చదువుకున్నారు? నాలుగు శాస్త్రాలు చదువుకున్నారు. రసాయనశాస్త్రం, భౌతికశాస్త్రం, ఖగోళశాస్త్రం, గణితశాస్త్రం మాత్రమే. ఈ శాస్త్రాలను చదివాను అంటున్నాడు. ఎక్కడ చదువుకున్నారని అడిగితే విశ్వవిద్యాలయంలో అంటాడు. విశ్వ విద్య అంటే తెలుసునా? విశ్వం అంతటా ఏదైతే వ్యాపించి ఉందో, ఆ దేవుని గురించి తెలుసుకునేదే విశ్వవిద్య. విశ్వవిద్య అంటే ఈ నాలుగు శాస్త్రాలు కాదు. డాక్టర్ అంటే ఏమర్థం? డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ అంటే ఏమిటో తెలియదు. నువ్వు చదివిన చదువొకటి, పెట్టిన పేరొకటి. అన్నిటికంటే ముఖ్యమైన బ్రహ్మవిద్యా శాస్త్రం మాత్రము ఎవరికీ తెలియటం లేదు.

మన శరీరములో ఏడు గ్రంథులున్నాయి. అన్నిటికంటే ముఖ్యమైనది, చిన్నది ఒకటి ఉంది. దానిపేరు గ్రంథిరాజము. రాజు అంటే పెద్ద అని అర్థము. కానీ పరిమాణంలో అది పెద్దకాదు. పనిలో పెద్దది. గ్రంథి అంటే ఊట ఊరునది కదా! అలా జలగ్రంథులు అంటారు. ఇక్కడ ఒక ఊట ఊరుతుంది. మన శరీర గ్రంథులలో ఏదో ఊట ఊరుతున్నది. ఆ ఊటలోనుండి హార్మోన్లు ఉత్పత్తి అవుతున్నవి. అవి శరీరానికి ఉపయోగపడుచున్నవి. ఈ పిట్యూటరీ గ్లాండ్‌లో మాత్రము, ఏ ఊట ఊరుతున్నదో మాత్రము ఇంతవరకు ఎవరికీ తెలియదు. కానీ అది ఇచ్చే సంకేతాలు అనుసరించి మిగతా గ్రంథులు పనిచేయుచున్నవి. అది

www.thraithashakam.org

చిన్నదైనాగానీ, అన్ని గ్రంథులను నడిపించే శక్తి అక్కడనుండి వస్తున్నది. మనిషి చనిపోవాలన్నా గ్రంథులకు అక్కడి నిర్ణయము రావాలి.

షట్ శాస్త్రములలో అన్నిటికంటే చిన్న శాస్త్రమేది బ్రహ్మవిద్యాశాస్త్రం. పెద్దశాస్త్రాలు గణిత, ఖగోళ, రసాయన, భౌతికశాస్త్రాలు, అలాగే జ్యోతిష్యశాస్త్రం పెద్దదే. ఈ శాస్త్రాలు నేర్చుకోవాలంటే 20-27 సంవత్సరాలు పడుతుంది. అయినా ఇంకా తెలుసుకోవలసినది చాలా ఉండిపోతుంది. మనము ఏమి చెప్పుచున్నామంటే, ఒక్క బ్రహ్మవిద్యాశాస్త్రము గురించి తెలుసుకుంటే, చాలా తక్కువ కాలము పడుతుంది. మిగతా శాస్త్రాలు అన్నీ తెలుసుకున్న ఫలితం కూడా వస్తుంది. బ్రహ్మవిద్యాశాస్త్రమే అన్ని శాస్త్రాలను నడిపిస్తున్నది. గురువును తెలుసుకునే శాస్త్రం కూడా బ్రహ్మవిద్యా శాస్త్రములోనే ఉంది. అందుకే **'రాజవిద్యా రాజగుహ్యా'** అని చెప్పినాడు. అంటే విద్య, గుహ్యం రెండూ ఒక దగ్గరే ఉన్నవి.

ఒక భౌతికశాస్త్రవేత్త మన శరీరములో ఉండే కోట్ల ధాతుకణముల గూర్చి చెప్పగలడు. కానీ ఆరవశాస్త్రములో అనగా బ్రహ్మవిద్యాశాస్త్రములో ఉన్న విషయాలను చెప్పగలడా! బ్రహ్మంగారు ఒక తత్త్వం చెప్పినాడు. ఏమంటే, "రెక్కముక్కు లేని పక్షి' అన్నాడు, అలాగే "కాళ్ళు, చేతులు లేనివాడు" అన్నాడు. ఇప్పుడు రెక్క, ముక్కు ఉంటేనే పక్షి అంటాము. కాళ్ళు, చేతులు ఉన్నవాడే మనిషి అవుతాడు అందుకే రెక్కముక్కులేని పక్షి అంటే ఏమిటది? 'కాళ్ళు చేతులు లేనివాడు' అంటే ఏదో కుంటివాడు అని అనుకుంటారు. ఇంకా ఏమన్నాడంటే 'కడవ ముంత చేతబట్టె' అన్నాడు. చేతులే లేవంటే కడవ, ముంత ఎలా పట్టుకున్నట్టు'? అదే కాకుండా బావిలో నీళ్ళన్నీ తోడి పోసినాడంట. మరి భౌతికశాస్త్రానికి సంబంధించినది కదా! మీరు చెప్పండి అని అడిగితే, ఆ ప్రొఫెసర్‌కి ఏమీ తెలియదు.

అదే విధంగా డాక్టర్‌లలో నరముల వైద్యుడు చాలా గొప్ప. కంటికొకడు, పంటికొకడు రకరకముల డాక్టర్స్ ఉన్నారు, కానీ వారిలో న్యూరాలిజిస్ట్, నరాల డాక్టర్ చాలాగొప్ప కదా! అదీ భౌతికశాస్త్రమే కదా! ఒక నరాల డాక్టర్ వద్దకు వెళ్ళి ఒక వాక్యం చెప్పాము. పూర్వము బ్రహ్మంగారు అని ఒక వ్యక్తి ఉన్నాడు. ఆయన ఒకమాట చెప్పినాడు, ఆ మాట మాకు అర్థము కాలేదు. అదేమంటే...

**"ఏటి మీద స్వాతి కొంగ వేటలాడుచూ రాగా, చాటునున్న మీను పిల్ల కొంగను మింగే"** ఇది భౌతిక శాస్త్రమునకు సంబంధించిన వాక్యం కదా! అంటే "తలతోకా లేనిది, ఇదేమి భౌతిక శాస్త్రము" అన్నాడాయన. అదేమిటి, కనిపించకుండా కూడా తలా తోకా ఉండవచ్చు గదా! పైన "కాళ్ళు, చేతులు లేనివాడు" అని ఉన్నది. దీనికి భౌతిక శాస్త్రమునసరించి వివరణ ఇవ్వాలి. ఇంకా "చెప్పినాడు వీరదాసు చోద్యంబుగ, గొప్పవారు దీని భావము విప్పి చెప్పిన చాలు" అన్నాడు. అందుకు ఆ విషయమును మనము వదలివేయరాదు కదా! అందుకే ప్రశ్న, జవాబు రెండూ ఉన్న ఒక వ్యక్తి దగ్గరకు వెళ్తే, పూర్తిగా ఆ విషయం గురించి చెప్పారు. అంటే మనకు 'వెన్నుపాము' మన వెన్నుముక మధ్యలో ఉంది, అందులో ఏడు నాడీకేంద్రాల కనెక్షన్‌లు ఉన్నాయి. దానినే బ్రహ్మనాడి అంటాము. ఈ ఏడు నాడీకేంద్రాలను ఏడు చేపలతో పోల్చినాడు. ఈ ఏడు నాడీ కేంద్రాలన్నీ ఒక్కొక్కటి పని చేయకుండా నిలిచి పోయాయి. నిలిచిపోతే ఏమవుతుంది? అప్పుడు శరీరమంతా మొద్దుబారి పోతుంది. నరాలు ఏవీ పనిచేయలేదు. అంటే ఈ ఆరూ చేపలను తింటూపోయింది కొంగ. ఏడో చేప ఒకటి ఉంది, తినడానికి పోయింది ఏదైతే కొంగ ఉందో, దాన్ని ఆ ఏడో చేప మింగేసింది. ఇక్కడ కొంగను గురించి ప్రక్కకు పెడితే, ఆరు నాడీకేంద్రాలు

పని చేయకుండా నిలిచిపోయినా, ఏడవ నాడీకేంద్రం మాత్రము పని చేయకుండా నిలిచిపోలేదు. బ్రహ్మంగారు సమాధిలో కూర్చున్నారు. పైన బండతో కట్టినారు, లోపల గాలిలేదు. ఒకవేళ ఉంది అటే ఒక గంటవరకు పని చేస్తుంది తరువాత మరి గాలి అందులో ఉండదు. ఆ విధంగా కూర్చున్నప్పుడు ఒకటో కేంద్రము నుండి ఆరవ కేంద్రము వరకు నిలిచిపోయాయి. చివరికి ఏడవకేంద్రం మాత్రము ఆగకుండా కొన్ని సంవత్సరాలపాటు అలాగే ఉండిపోయింది. ఆయన ముందే చెప్పినాడు అలాగే నిలిచిపోతుంది, ఏడవ కేంద్రము వద్ద నిలిచిపోదని తెలుసు. కాబట్టి ఆ తత్త్వంలో చెప్పినాడు. ఆ విధంగా ఎలా బ్రతికెను? అని భౌతికశాస్త్రవేత్తను అడిగితే, శాస్త్రము ప్రకారము ఊపిరి ఆడకపోతే బ్రతికే అవకాశమే లేదు అంటున్నారు. ఆ విధంగా ఆ సమాధిలో ఉండటం అసాధ్యం అంటున్నారు. అది శాస్త్రబద్ధమే, ఏ శాస్త్రము అనగా బ్రహ్మవిద్యా శాస్త్రం. మరి వాళ్ళనంతా గుండెమీద చెయ్యి వేసుకుని మేథావులని చెప్పమనండి. వారికి అర్థము కాదు.

ఈ ప్రపంచములో ఎవరు మేథావి, ఎవరు ప్రత్యేకం అంటే ఎక్కడైతే ప్రశ్న ఉందో, ఎక్కడైతే జవాబు ఉందో వాడే మేథావి. అటువంటి వాడిని మనమేమి అంటున్నాము 'గురువు' అంటున్నాము. ఈ గురుపౌర్ణమి సందర్భముగా గురువు అనే దానికి క్రొత్త నిర్వచనం తెలుసుకున్నాము. గురువెలాగూ కనిపించడు, వెతకవద్దు. ఆ విధంగా వెతికేకంటే, ఎక్కడైతే మూడోది అనగా 1,2,3 లో మూడవ వాడి సమాచారము ఉండునో అక్కడే గురువు ఉన్నాడని తెలుసుకోవచ్చును. ఈ విధంగా ఈ రోజు పెద్దపెద్ద ఆలయాలలో పూజలు చేస్తున్నారు. గురువు ఎవరో మాత్రము తెలియదు. గురువు అని పూజలు చేస్తున్నారుగానీ, ఆ పూజల్లో అర్థము మాత్రము

www.thraithashakam.org

తెలుసుకోలేక పోవుచున్నారు. ఇంక ఈ సంవత్సరముకంటే ముందు సంవత్సరం బాగా చేస్తాము అని పూజలు చేస్తున్నారు కానీ, అర్థము మాత్రము తెలియదు. గురువును ఎవ్వరూ గుర్తించలేరు అంటే ఒక ఆకారాన్ని పెట్టి గురువని పూజ చేయటం మంచిదికాదు. అందుకే మాకు కూడా మీరు ఎవ్వరూ మ్రొక్కవద్దని చెప్పడానికి కారణం. కనుక గురువును ఎవ్వరూ గుర్తించలేరు. గురువుకు ఎక్కడా శిష్యులుండరు అని మనము ముందే చెప్పుకున్నాము. మరి ఇప్పటినుండి గురువుని వెతికితే చివరికి మరణ సమయంలో ఆయన దొరుకుతాడు. అప్పుడేమి ప్రయోజనము? అప్పుడే అసలైన ప్రయోజనము ఉంది. ఈ ప్రపంచములో దేవున్ని ఎవరైనా చూశారా? అంటే ఎవరూ చూడలేదు. దేవున్ని నేను చూశానని ఎవరైనా చెప్తే, అది పూర్తి అసత్యం. గురువు అనే పురుషున్ని గుర్తు చేసేది కావున గురుపౌర్ణమి అగును. కనుక ఇప్పటినుండి ప్రత్యేకంగా ఉండే విధంగా ప్రయత్నం చేయండి.

## 36. కర్మలేని కృష్ణుడు - కర్మవున్న కృష్ణుడు

తేది : 01-09-2010

శ్రీకృష్ణుడు జన్మించాడు ఈ రోజున. ఒక జననం ప్రపంచంలో జరిగింది అంటే జీవుడు ఎవరైనా సరే అంతకుముందు చనిపోయివుంటేనే మరలా జన్మం జరిగేది ఉండును. బ్రహ్మవిద్యాశాస్త్రం ప్రకారం ఒకచోట చనిపోయిన జీవుడు మరొకచోట జన్మించును. మనమందరమూ పుట్టిన రోజును పండుగగా చేసుకుంటున్నాం, అదే విధముగా మేము జరుపుకుంటున్న పుట్టినరోజు సందర్భములో కూడా మేము చెప్పాము. మీరు పుట్టినరోజు అని మనకు తెలిసిన విధంగా అనుకుంటాముగానీ,

www.thraithashakam.org

వాస్తవంగా చనిపోయిన రోజుకూడా అదే ఎందుకంటే నీవు పుట్టిన క్షణమునకు ముందే నీవు చనిపోయి ఉంటావు. ఆ ఒక్క క్షణము జరిగిన ముందు విషయమును మరచిపోయి, ఒక క్షణము జరిగిన తర్వాత విషయమునే మనిషి గుర్తుంచుకుంటున్నాడు. ఇదంతా సాధారణముగా మనుషులకు జరిగే విషయములు.

అదే విధంగా శ్రీకృష్ణుడు జన్మించాడు. ఆ దినమును జన్మాష్టమి అంటున్నాము. ఎవరైనా పుట్టాలంటే ముందు క్షణము చనిపోయి ఉండవలెను కానీ శ్రీకృష్ణుడు మన మాదిరిగా చనిపోయి మరలా జన్మించాడా అంటే కాదు అని చెప్పుతాము. ఎందుకు? అంటే ఆయన భగవంతుడు, మనం మనుషులము. ఆయనా మనిషే కదా! భగవంతుడు అని పేరు పెట్టారు అంతే కదా? అని ప్రశ్నిస్తే, నిజమే! మనవలె మనిషిలా కనిపించే వ్యక్తియే. కానీ మనం ఎన్నో పాప పుణ్యములు చేసుకుంటూ, ఆ పాప పుణ్యముల ఫలితములను అనుభవించేందుకే ఈ భూమిమీద పుట్టు చున్నాము. కానీ శ్రీకృష్ణుడు పుట్టిన తరువాత కూడా నేను చేసే పనులలో ఏ పాపము అంటదు, మీకు కూడా పాపపుణ్యములు అంటని విధానమును చెప్పుచున్నాను అన్నాడు. అందుకే అర్జునునికి యుద్ధములో ఆ విషయాన్నే చెప్పాడు. మనుషులను చంపితే హత్యాపాపం వచ్చుననుకుంటున్నావు కదా! వాస్తవమే కానీ చంపినా నీకు పాపం అంటని విధానాన్ని చెప్తాను విను! అన్నాడు. అది ఎటువంటిది అంటే నేనూ అలాగే ఉన్నానని చెప్పేందుకు "తామరాకుపైన నీరు తామరాకుకు అంటనట్లు" నేను చేస్తున్న ఏ పనులైనా అందులో పాప, పుణ్యకర్మలు నాకంటవు అని చెప్పాడు.

కర్మను అంటించుకోకుండా ఉండు విధానాన్ని చెప్పిన శ్రీకృష్ణుడు కర్మ అంటించుకుని వచ్చాడంటారా? ఆయన గ్రంథములు చదవలేదు,

ఎక్కడా ఏమీ నేర్చుకోకుండా కర్మఅంటుకోని విధానాన్ని చెప్పాడంటే ఆయన అంతకుముందే తర్ఫీదు అయినాడన్నమాట, మరి ఆ రహస్యాలన్నీ తెలిసిన వ్యక్తిగా శ్రీకృష్ణుడుగా పుట్టినవాడు, గత జన్మంలో పాపం చేసుకుని పుట్టాడంటారా? అని ప్రశ్నించుకుంటే, అతని దగ్గర ఉన్న విధానమంతా కర్మలు చేసుకోని విధానమే. ఆయనను తెలిస్తే ఆయన కర్మలేని వ్యక్తే అగును. కర్మలేకపోతే ఎవ్వరూ పుట్టరు అని ఒక శాసనం ఉంది. అంటే కర్మలేకపోతే శ్రీకృష్ణుడు పుట్టకూడదు. కనుక కర్మ ఉంటేనే పుట్టవలెను అనేది వాస్తవము. ఈ రెండు వాస్తవమెట్లు అగును.

శ్రీకృష్ణుని జీవన విధానాన్ని తీసుకుంటే, ఆయన ఎన్నో పనులు చేశారు, 17 సార్లు యుద్ధం చేసి 18వ సారి యుద్ధంలో ఓడిపోయి పారిపోయాడు. మధురనుండి గుజరాత్‌కు పారిపోయి ద్వారక దగ్గర సముద్రం ఒడ్డున పట్టణం కట్టుకున్నాడు. మరి అది కర్మయే కదా! రాత్రికి రాత్రి తెలియకుండా పారిపోయాడు. **"నహి కక్షిత్ క్షణమపి"** అని ఏ పనైనా కర్మ ఉంటేనే జరుగును అని ఆయన చెప్పినప్పుడు, మరి ప్రతి క్షణము కర్మ అమలు జరుగుతూ పని జరుగుచున్నప్పుడు, శ్రీకృష్ణునికి కూడా కర్మ ఉంది అని నిరూపణ వున్నట్లే కదా! కర్మ ప్రకారం ఆయన 126 సంవత్సరములు బ్రతికినాడు. ఎన్ని సంవత్సరములు బ్రతకాలనేదీ కర్మలిస్టులో ఉంటుంది. మరి ఎన్ని సంవత్సరములు బ్రతికినా, ఎన్ని కార్యములు ఆయన చేసినా, కర్మ అంటని విధానమునే ఆయన అవలంబించి నాడు. అదియూ వాస్తవమే! కానీ కర్మ ఇంతకుముందు జన్మలో ఉంటేనే కదా ఇప్పటి జన్మ ఉండును. అది శాసనము కదా! అంటే వాస్తవమే. ఈ జన్మలో ఆయన పనులు చేసినా కర్మ అంటడం లేదు. కానీ ఇప్పటి జన్మ ఆయనకుందీ అంటే గత జన్మలో ఆయన పనులు చేస్తే, కర్మ అంటివుంటేనే

కదా ఈ జన్మ వచ్చేది. గతజన్మలో ఆయనకు కర్మ అంటినదా? అని ప్రశ్నవచ్చును. అంటే ఆయన గతజన్మలో ఎక్కడా జన్మించలేదు!

శ్రీకృష్ణుడు ఒక శరీరములో ఇంతకుముందు ఉండి చనిపోయే మనలాంటి వ్యక్తికాదు. అణువణువునా వ్యాపించిన శక్తి ఆయన, పరమాత్మ శక్తి. దేవుడు అని ఎవరినైతే అంటున్నామో, దేవుడు ఎక్కడున్నాడంటే? ఇక్కడ, అక్కడ అని లేకుండా అంతటా వ్యాపించినవాడు దేవుడు. ఆ దైవం భూమిమీదకు వచ్చినటువంటి రూపము శ్రీకృష్ణుడు, ఆయనను భగవంతుడు అంటున్నాము. శ్రీకృష్ణ భగవాన్ అనీ అంటున్నాము. భగవాన్ అంటే భగమునుండి పుట్టినటువంటివాడు. తల్లి గర్భమునుండి పుట్టినటు వంటివాడు అని అర్థము. అయితే తల్లిగర్భమునుండి మనం కూడా పుట్టినాము కదా అని అనుమానం రావచ్చునుగానీ, ప్రపంచములో ఎవ్వరూ తల్లిగర్భమునుండి పుట్టలేదు. ఆ విధముగా పుట్టినటువంటివాడు ఒక్క కృష్ణుడే ఆయన తల్లిగర్భములో సజీవముగా ఉన్నానని తెలిపే నిమిత్తం ఎదురు కాళ్ళతో పుట్టినాడు. అందరిలాగ తలతో పుట్టలేదు. కాళ్ళతో పుట్టడమే కాకుండా, పూర్తి పుట్టక ముందే కాళ్ళు ఆడించినాడు. గర్భములో శరీరమున్నట్లే కాళ్ళు బయటికి వచ్చినప్పుడు ఒక కాలు రెండుసార్లు, రెండవ కాలు ఒక్కసారి ఆడించి పుట్టినాడని ఇంతకుముందర చెప్పియున్నాము. దానికే ఎదురు కాళ్ళతో పుట్టెను అని చెప్పినాము. ఎందుకలా పుట్టినాడంటే, తల్లిగర్భములోనే సజీవముగా ఉన్నానని తెలిపే నిమిత్తమే ఆ విధముగా చేశాడు. లేకపోతే అందరిమాదిరే పుట్టియుండేవాడు. కనుక తల్లిగర్భము నుండి సజీవముగా పుట్టాడు. కనుక ఆయనను 'భగవాన్' అంటున్నాము. మనమైతే ఒకచోట చనిపోయి, ఇంకొక తల్లి శరీరము నుండి ప్రసవించబడిన శరీరములో చేరుచున్నాము. కానీ అంతకుముందే తల్లి శరీరములోని

www.thraithashakam.org

గర్భంలోకి చేరే అవకాశమే లేదు. ఇది సైన్స్‌లో ఒక పెద్ద మలుపు. అందుకే ఏ శాస్త్రవేత్తయినా తల్లిగర్భములో ఉన్న శిశువుకు ప్రాణం ఉందని నిరూపించగలరా? అని సైంటిస్ట్‌లకు సవాల్ విసిరాము.

మీరంతా చదివే చదువుకు సైన్స్ అని పేరు పెట్టుకున్నారు కానీ అది సామాన్యశాస్త్రమది, జనరల్‌సైన్స్ అని దాని అర్థం. అంటే మీరు చదువుచున్నది సాధారణ సైన్స్ అన్నమాట. అంతేగానీ అసామాన్య శాస్త్రముకాదు. మీరు చెప్పుచున్నది సామాన్యశాస్త్రము. మేము చెప్పుచున్నది "అసామాన్య శాస్త్రము లేదా సూపర్ సైన్స్" అంటారు. ఎప్పటికైనా ఈ గర్భస్థ శిశువుకు ప్రాణంలేదు అనే నిరూపణ మీ సైన్స్‌కు పెద్ద మలుపు ఇదేదో ఇతను మొండిగా చెప్పుచున్నాడనుకోకుండా, ఇది మీ అందరికో పెద్ద సవాల్ అని చెప్పుచున్నాము. ఇదే కాదు వర్షం అనేది సూర్యుడు ఎండద్వారా నీటిని ఆవిరిని చేసి వర్షం కురిపిస్తున్నాడనే మాటను కూడా మేము వాస్తవము కాదు అని చెప్పుచున్నాం. ఏ శాస్త్రవేత్తయినా గానీ ఒక లీటర్ నీటిని తీసుకుని మేఘము తయారు చేస్తారా? నిరూపణ చేయగలరా? అని మేము సవాల్ విసురుచున్నాము. ఇటువంటి విషయములు చాలా ఉన్నాయి.

తల్లిగర్భమునుండి నేరుగా సజీవముగా పుట్టినటువంటివాడు శ్రీకృష్ణుడు. ఆయన ఇంతకుముందు ఒకచోట చనిపోయి మరలా పుట్టలేదు. అంతటా శక్తిగా వ్యాపించిన వ్యక్తి ఆయన. అంతటా వ్యాపించిన ఆ పరమాత్మ శక్తి, ఆయన జన్మింపబోయే తల్లిగర్భములో కూడా ఉంది. కనుక ఆ శక్తే శిశువుగా, సజీవముగా పుట్టెను. కర్మ ఉంటేనే కదా పుట్టేది. కర్మ ఉంటేనే కదా, ప్రతీ పని జరిగేది. అంటే ఆయన గతజన్మలలో సంపాదించుకునే కర్మకాదు. ఆయన స్వయంగా వ్రాసుకుని వచ్చిన కర్మ అది. మనిషి

మాదిరిగానే భూమిమీద ఉండి, తననెవరూ గుర్తించకుండా, దైవమే మనిషిగా పుట్టెను అని తెలియకుండా ఉండాలని క్రొత్తగా, ఈ క్షణములో ఏమి జరగాలి, ఆ క్షణంలో ఏమి జరగాలి అని ముందే కర్మను నిర్ణయించుకొని పుట్టినటువంటివాడు శ్రీకృష్ణుడు.

ఈ విధముగా నిర్ణయించి వ్రాసిపెట్టుకుని జన్మించటం అనే విషయము ఒక్క దైవానికే సాధ్యమగును. ఆ దైవమే శ్రీకృష్ణుడు. అందువలన ఆయనను "భగవాన్" అని అన్నాము. ఈ రోజు చాలామంది భగవాన్ అని వారి పేర్ల ముందర పెట్టుకున్నారు. వీరంతా మరి భగవాన్‌లేకదా అంటే వీరంతా శరీరమునుండి బయటకు వచ్చిన తరువాత పుట్టినవారు. శ్రీకృష్ణుడు శరీరమునుండే సజీవముగా వచ్చినటువంటి వాడు. వీరంతా ఒకచోట చనిపోయి మరియొక శిశుశరీరమునందు పుట్టాడు. ఆ శిశువు శరీరము తల్లిగర్భము నుండి బయటకు వచ్చిన తరువాత పుట్టినటు వంటివారు. ఈ విధంగా పేర్లు పెట్టుకున్నంతమాత్రాన వీరు భగవాన్‌లు కారు. శ్రీరామ అని పేర్లు పెట్టుకున్నంతమాత్రాన మనం శ్రీరాములదువు తామా, దశరథ పుత్రులదుగుదుమా? కాదు. అదే విధముగా భగవాన్ అని పేర్లు పెట్టుకున్నంత మాత్రాన భగవాన్‌లు కారు. భగవంతుడు ఈ ప్రపంచములో శ్రీకృష్ణుడు మాత్రమే అగును. మరి ఆయన కేంద్రమేది? అంటే విశాలమైన ఈ విశ్వమంతా ఆయన కేంద్రమే. అంతటా వ్యాపించినవాడు ఆయనే కనుక అటువంటి జన్మను, ఆయన పోయిన తరువాత గుర్తించగలిగితే, అదియునూ ఆయన చెప్పిన జ్ఞానం ద్వారా మనం ఆయనను గుర్తించి, ఆయన పుట్టిన రోజును ఒక పండుగగా చేసుకుంటున్నాము.

మరి మీరు శ్రీకృష్ణుడు చాలా గొప్పవాడు, నిజమైన దైవము, భగవాన్ అని అంటున్నారు. మనుష్యులలో గొప్పవారు ఉండవచ్చును గానీ

www.thraithashakam.org

దైవంమాత్రం కాదు అంటున్నారు. మరి ఈ రోజు భగవాన్ అని పేరుపెట్టుకుని ఉన్న మనుష్యులలో కొందరు ఎంతో సత్ప్రవర్తన కలిగి, ఎన్నో నీతి నియమములు పెట్టుకొని, యోగం చేస్తూ కాలం గడుపుచున్నారు కదా! ఎక్కడ ఎవరితోనూ సంబంధము పెట్టుకోలేదు కదా! ఆశ్రయములకే పరిమితమయ్యారు కదా! ఎంతవరకు మాట్లాడాలో అంతవరకే మాట్లాడి, ఎంతవరకు పని చేయాలో అంతవరకే చేసి, క్రమశిక్షణతో బ్రతుకుచున్నారు కదా! మరి భగవాన్ పేరుపెట్టుకున్నవారు, మీరన్నట్లు నిజంగా భగవంతులు కాకపోయినా అంత క్రమశిక్షణ ఉంటే, నిజముగా భగవంతుడైన శ్రీకృష్ణుడు అన్నీ పనికిమాలిన పనులే చేశాడు కదా! అని మీరు అడుగవచ్చును.

శ్రీకృష్ణుడు మోసాలు చేశాడు, దగాలు చేశాడు. అబద్దాలు చెప్పాడు. కౌరవులకు, పాండవులకు తగవులు పెట్టినాడు. ఎనిమిది మంది భార్యలు కల్గియున్నాడు. అదియునూ రాధ అని ఒకామె భార్యల లిస్టులో లేకపోయినా, రాధాకృష్ణ అని పేరుకల్గి ఉన్న చరిత్ర వుంది. అదియునూ కాకుండా గోపికల విరహవేదనను, పుట్టపర్తి నారాయణాచార్యులుగారు పాటలను రచించారు. 14 భాషల్లో పండితుడాయన ఆయన అడవుల్లో కూర్చొని వాటిని వ్రాసాడు. అడవుల్లో ఒక్కపూట మాత్రమే భోజనం చేసి, వ్రాసిన ఆ పాటలు మేము చదివాము. ఆ పాటల్లో ఆయన గోపికల విరహవేదనను వివరించాడు. అందులో ఒకపాట "ఏడే అల్లరి వనమాలి" ఈ విధంగా ఆ పాటలన్నీ చూస్తే, భర్తలను సైతం విడిచిపెట్టి, ఈయన దగ్గరకు వచ్చినట్లు ఆయన పాటలను వ్రాశాడు, జరగడం కూడా వాస్తవముగా ఆ విధముగానే జరిగింది.

సరే! ఇవన్నీ జరిగినవి వాస్తవమే అని మీరు అంటున్నారు. వాస్తవమే కానీ భగవాన్ అని ఇంతమంది స్వామీజీలు పేరు పెట్టుకుంటే

వారందరినీ చిన్నగా తీసేస్తున్నారు మీరు, వీరందరినీ కాదని శ్రీకృష్ణుడే గొప్పవాడని మీరెట్లు చెప్పుచున్నారు? ఆయన భగవంతుడెట్లయినాడు? మీరేదో కథలల్లి చెప్పుచున్నారు. దానిని వినాల్సిందేనా? కృష్ణుడు పిల్లాడుగా ఉన్నప్పటినుండీ దొంగతనములే చేశాడు. చోరుడు, జారుడు అన్ని పేర్లు ఆయనకే మరి! ఆయన జన్మదినమును శ్రీకృష్ణాష్టమిని ఎందుకు గొప్పగా చేస్తున్నారు? పెద్దవారు మీకది తగునా? అని నన్ను మీరు అడుగవచ్చును. ఏదో దొంగతనం చేసినాడంటే పిల్లాడు తెలీదు అనుకోవచ్చు కౌరవులకు, పాండవులకు తంటాలు పెట్టాడంటే కౌరవులు మంచివారు కాదులే, అందుకే ఆ విధంగా చేశాడు అనుకోవచ్చు. ఇవన్నీకాక ఎవరి భార్యలతో భర్తలతో పోట్లాటపెట్టడం తగునా? అని ప్రతీ మగాడు అడుగుతాడు. ఈ ప్రశ్నను న్యాయంగా చర్చించితే మనం కూడా ఆ విషయమును అడుగవలసిందే కానీ ఆయనేమి చెప్తున్నాడంటే, నిజమే, మీరు చెప్పుచున్నవన్నీ వాస్తవమేకానీ నా పండుగనే చేసుకొంటున్నారు. దేనికో తెలుసునా? భగవాన్ కనుక నేను పాపములు చేసినా, అంటని విధానంతో చేస్తున్నాను. పాపం అంటని విధానంతో పాపములు చేస్తే, వేరే పాపాలు ఏవైనా చేయవచ్చు కదా, ఈ పాపాలే ఎందుకు చేయవలెను? నేను ఏ పనిచేసినా, ఏమి మాట్లాడినా జ్ఞానసంబంధమై ఉంటుంది. జ్ఞానము తెలుసుకునే దానికే నేను ఆ పనిని చేస్తున్నాను. కృష్ణుడు చేసిన ఏ పనిలోనైనా, ఎంత విమర్శించినా తర్కించి చూస్తే అందులో దేవున్ని చేరే జ్ఞానమే ఉంటుంది.

ప్రపంచములో చాలామంది స్వామీజీలున్నారు. పెద్దపెద్ద జ్ఞాన విషయములు చెప్పుచున్నారు. కానీ పెద్ద స్వామీజీవలె నేను ఎప్పుడూ ఉండలేదు. ఆయన జీవితంలో ఎప్పుడైనా ఎవరైనా కృష్ణున్ని స్వామీ అని ఎవరైనా అన్నారా? ఆయనను ఎవరైనా గురువన్నారా? మరి అంత పెద్ద

www.thraithashakam.org

స్వామీజీలను కాదని ఈయన భగవద్గీత చెప్పాడు. మరి ఆ భగవద్గీతను కొట్టివేయగలమా? మరి ఈ పెద్ద స్వామీజీలు అందరూ ఈ భగవద్గీతను విడిచిపెట్టేసారు. కొందరైతే దానిని పూజచేసి, పారాయణ చేసేవారు. అంతేగానీ దానిలోని వాస్తవ భావాన్ని గ్రహించి ఎవరూ ఆచరించటం లేదు. ఇప్పుడు అన్ని జ్ఞానములకంటే భగవద్గీతే గొప్పది అని ప్రచారం చేస్తున్నాము. అయినా భగవద్గీతలో ఏ స్వామీజీ చెప్పినా సరే ప్రకృతి జ్ఞానమునే చెప్పుచున్నారుగానీ పరమాత్మ జ్ఞానము చెప్పటం లేదు.

ఏ స్వామీజీ చెప్పినా వేదాలను, ఉపనిషత్‌లను చెప్పుచున్నారు. ఇవన్నీ ప్రకృతికి సంబంధించిన జ్ఞానములే. విశ్వవిద్యాలయములలో మీరంతా పట్టాలు (డిగ్రీలు) పుచ్చుకుంటున్నారు. అది ఏమి జ్ఞానమంటే ప్రకృతి జ్ఞానమే. ఇదంతా నాలుగు శాస్త్రములైన గణిత, ఖగోళ, రసాయన, భౌతికశాస్త్రముల జ్ఞానమేగానీ, పరమాత్మ జ్ఞానము కాదు. పురుషుడనేవాడు ప్రపంచములో ఒక్కడే ఉన్నాడు. వేరే పురుషులెవ్వరూ లేరు కనుక భర్తలుగా కల్గిన భార్యలందరూ ప్రపంచములో నావద్దకి వస్తున్నారంటే వారికంటే నేను ఒక్కడినే గొప్ప పురుషుడనని గుర్తుంచుకోండి అంటున్నాడు. శ్రీకృష్ణుడు పురుషుడు, మిగతా స్త్రీలలో ప్రకృతి తత్త్వముండుట వలన ప్రకృతి పురుషుని వైపు పోవలసిందేనని తెలియునట్లు బయటి ప్రపంచములో అలా జరిగింది. భర్తలు లేనివారు నావద్దకు వచ్చినారంటే పెద్ద గొప్పేమీకాదు. భర్తలున్నవారు సైతం నావద్దకు వచ్చినారంటే ఏమి అర్థం? ఈ పురుషులకంటే ఆ పురుషుడే గొప్పని అర్థం. అదే విధముగా దేశములో ఎన్ని జ్ఞానములున్నా నా జ్ఞానమే గొప్పది అని తెలిపే నిమిత్తము స్త్రీలంతా నావద్దకే వచ్చారు. నా వద్దకు వచ్చిన ఏ స్త్రీతోనైనా శరీర సంబంధము పెట్టుకోలేదు. మీరంతా పొరపాటు పడ్డారేమో, శరీర సంబంధము నాకవసరములేదు ఎందుకంటే నాకు

ఎనిమిదిమంది భార్యలున్నారు. మీరు గ్రుడ్డివారు ఏదైనా అనుకుంటారు. శరీర సంబంధం కోసమే ఇందరిని పెట్టుకున్నారేమో అని అనుకోవచ్చును. కానీ నాకు ఏ కోరికాలేదు, అవసరము లేదు. ఏ పని జరిగినా నాకు నష్టమూ లేదు, లాభము లేదు అని శ్రీకృష్ణుడు చెప్పటం జరిగినది. మరి ఇందరితో ఈయనకు ఏ సంబంధముంది అంటే జ్ఞానసంబంధముంది.

ప్రపంచములో భర్త ఒక్కడే! అందరికీ, ఆయనే జగద్భర్త, శ్రీకృష్ణుడు. "ప్రపంచములో భర్త ఒక్కడే" అని భగవద్గీతలో కూడా చెప్పబడింది. దీని ప్రత్యక్ష నిరూపణ నిమిత్తం స్త్రీలు నావద్దకు వచ్చారు. అంతేకాదు ఏ చిత్రపటమైనా (ఫోటో) చూడండి. ఆడవారే ఆయన చుట్టూ ఉంటారు. ఆవు మాత్రమే ఆయనవద్ద ఉంటుంది, అదీ ఆడదే. కృష్ణ మందిరముపైన ఒక చిత్రముంది, అందులో మగవారూ ఉన్నారు. కానీ వారంతా ఆడవారువలె ఉన్నారు. ఈ విధముగా ఎందుకున్నారంటే ప్రపంచములో ఎవరు పురుషులు, ఎవరు స్త్రీలు? భగవంతుడు ఒక్కడే పురుషుడు. శరీరాలు మనమంతా ఏమి ధరించినాగానీ, అంటే స్త్రీ శరీరాన్ని ధరించినా, పురుష శరీరాన్ని ధరించినా మనమంతా ఆడవారమే! పురుషశరీరము మనం ధరించాము కదా! మనమంతా మగవారమే అనుకోవటం చాలా పొరపాటు.

ప్రకృతికి సంబంధించి మనమంతా పుట్టాము కనుక మనమంతా ఆడవారమే, ఆడతనమే వర్తించును. మగవారైనాగానీ అందరమూ స్త్రీలమే అని ఇదివరకే మేము తెలియజేశాము. ఎప్పటికైనా ప్రపంచములో నిరూపణ నిమిత్తము, స్త్రీలంతా ఆయనవద్దకు చేరారు. అదే విధముగా మనమంతా స్త్రీలమే కావున అందరము ఆయనవద్దకు చేరాలనే ప్రాకులాడవలెను. దేవుని వద్దకు పోవాలనే కదా, మనం ఇంత జ్ఞానం నేర్చుకుంటున్నది. ఇంతదూరం వస్తున్నదీ అందుకే కదా! మీరంతా ప్రకృతికి సంబంధించినవారే. పరమాత్మ

లోకి చేరాలనే మనమంతా ఇక్కడకు చేరాము. ఈ విషయములు ప్రత్యక్షముగా కనిపించే విధంగా ఆయన పురుషునిగా ఉండి, చుట్టూ స్త్రీలను పెట్టి చూపించాడన్నమాట. ఆయన గొప్ప పురుషుడు అని తెలిపేందుకు భర్తలను విడిచిపెట్టి వచ్చిన స్త్రీలను చూపించాడు. కానీ శరీర సంబంధం అవసరము లేదు. నాకే పనులయందు ధ్యాసలేదు. నాకీ పనులవలన లాభం వస్తుందనీ లేదు, నష్టం వస్తుందనీ లేదు. నేను నిమిత్తమాత్రంగా ఈ ప్రపంచములో చరిస్తున్నాను అన్నాడు శ్రీకృష్ణుడు. నాకేదీ అవసరము లేదు అని ఆయన అన్నప్పుడు, వారి భర్తలను మోసం చేసేపని ఎందుకు చేశాడు అని అడుగవచ్చు. కాని అక్కడ ఏమి జరిగిందంటే, బయటకు అర్థము అయ్యే విధంగా, ఏ రోజుకైనా మనం దేవునివద్దకు చేరవలసిందే. మీరు ఏ దేవునికి మ్రొక్కినా చివరికి అసలైన దేవునివద్దకు రావలసినదే. మేమూ చిన్నప్పుడూ ఏడోతరగతి పాసయితే ఇదిస్తాను. అందిస్తానని చెప్పి మ్రొక్కినవారమే. తరువాత దేవతలంతా పనికిమాలినవారే, వారు నిజమైన మగతనం లేనివారే, మగతనముండే మగవాడు ఒక్కడే మనందరికీ అవసరము, అని వారందరినీ విడిచిపెట్టి అసలైన దైవాన్ని ఆశ్రయించాము, ఆరాధిస్తున్నాము. దైవ జ్ఞానం తెలుసుకోవటం వలన ఏమైనది ఈ రోజు ఏ మతంవారితోనైనా మాట్లాడగల్గుచున్నాము, జ్ఞానమును ఒప్పించగలుగుచున్నాము. ఎవరైతే అసలైన దైవ జ్ఞానము తెలుసుకుంటున్నారో, అనుసరిస్తున్నారో ఏ ముస్లీమ్ అయినా మా మాటను తీసి వేయటంలేదు, ఏ క్రైస్తవుడైనాగానీ మా మాటను తీసివేయటం లేదు.

ఈ విధముగా శ్రీకృష్ణున్ని గూర్చి చెప్పుకుంటే కృష్ణుడు ఎక్కడనుండి వచ్చి పుట్టినాడంటే, అణువణువునా వ్యాపించినవాడు ఆయన కర్మ వలన పుట్టినాడు అనుటకు అవకాశము లేదు. తరువాత ఆయన చేసే పనులు

మంచివికావు అనుటకు కూడా అవకాశమే లేదు. ఆయన చేసే పనుల్లో జ్ఞానముంది. ఆయన మాటల్లో జ్ఞానముంది నీకు అర్థముకాక ఇష్టం వచ్చినట్లు మాట్లాడుచున్నావు. ఎవరో భక్తులు నాలుగుచక్రములు నుదుటిపైన ధరించి వస్తూవుంటే, కొందరు వ్యక్తులు వారిని ప్రబోధానంద స్వామివద్దకా మీరు వెళ్ళుచున్నారు? అని అడిగానరంట. "అవును" అన్నారట ఆ భక్తులు. ఆ స్వామివద్దకు ఎందుకు వెళ్ళుచున్నారు? ఆ స్వామి చాలా పనికిమాలిన వాడు అన్నారట. దానిని "ఏ విధంగా" అని భక్తులు అడుగగా, ఆ స్వామి ఆడవారందరినీ మోసం చేస్తాడు అని వారు అన్నారట. "అయితే మాక్వెరికీ ఆ విధంగా మోసం ఏమీ చేయలేదే" అని భక్తులన్నారట. ఇంకా వారేదో చెప్పినా, ఈ భక్తులందరికీ అవన్నీ అబద్ధములు అని తెలిసిపోయింది. ఈ విధముగా ప్రపంచములో ఎవరికీ తెలియని ప్రత్యేకమైన జ్ఞానము చెప్పుచున్న మమ్ములనే ఈ విధముగా అంటున్నారంటే, శ్రీకృష్ణునివలె ఏమీ చేయలేదు, చేస్తే ఇంకా గందరగోళమయ్యేది. ప్రపంచవరముగా సత్ప్రవర్తన కలిగి ఉన్నాగానీ మాకు నిందలు తప్పలేదు. ఇదివరకు మేము చెప్పాం మగతనములో రెండు రకములు కలవని. పాము మగతనం, గాడిద మగతనం. గాడిదది తన్నులు తినే మగతనం, మగపామును చూచి ఆడపామే వెంటబడుతుంది. నేనెప్పుడూ పాము మగతనం ఉండేవాడినే. గాడిద మగతనం కాదు. ఇదంతా బాహ్యంగా స్త్రీ, పురుష శారీరక సంబంధం కాదు.

శ్రీకృష్ణుడు ఏ విధంగా పుట్టాడు, ఎందుకు పుట్టాడు? అనే విషయములు తెలుసుకున్నాము. అదే విధంగా ఆయన ఎందుకు పనులు చేశాడంటే, పనులు చేస్తే ఆయనను మనం గుర్తించకుండా ఉంటామని పనులు చేశాడు. ఆయనను ఎవరూ భగవంతుడని గుర్తించకుండా

ఉండాలంటే, ఈ పనులన్నీ చేసి తీరవలసిందే. అటువంటి పనులు చేయటం వలన ఆయనను చెడ్డవాడే అందరుగానీ మంచివాడు అని అనరు. మంచివాడు అని ఎవరంటారు? నిజమైన జ్ఞానం తెలిసినవారికి ఆయనలో మంచితనమేమిటో, గొప్పతనమేమిటో తెలియును.

అదే కాదు దైవము ఏ రోజు భూమిమీదకు భగవంతునిగా వచ్చినా గానీ, ఆ భగవంతుడు ఎవరిచేత గుర్తించబడడు. ఆయనే గురువు. ప్రపంచములో ఎవరు గురువు? భగవంతుడే గురువు. భగవంతుడు ఎవరి ద్వారా గుర్తించబడడు, అంత రహస్యముగా ఉండును. 99 మందికి ఆయనలో చెడ్డ కనిపించిదనుకో ఒక్కనికి ఆయనలో మంచి కనిపించినా 99 మంది అభిప్రాయమే లెక్కకు వచ్చును. ఈ ప్రపంచములో ఎవరైనా 99 మంచి పనులు చేసి, ఒక్క చెడ్డపని చేస్తే, వాడు చెడ్డవాడే అనే ఈ కాలములో భగవంతుడు 99 చెడ్డపనులు చేసి, ఒక్క మంచిపని చేస్తే ఆయనను ఇంకేమి గుర్తించగలరు? కృష్ణుడు ఎన్ని చెడ్డపనులు చేసినట్లు బాహ్యంగా కనిపించినా, ఆయన భగవంతుడే. ఆయనను మనం గుర్తించగలిగాం కనుక మనమంతా ఆయన చెప్పిన జ్ఞానమైన భగవద్గీతను, అదియే బ్రహ్మవిద్యాశాస్త్రమును తెలుసుకునేందుకు ప్రాకులాడుచున్నాము. ఈ విషయములు మిగతావారికి తెలియక పురాణములు పట్టుకున్నవారు కొందరు, వేదాలు పట్టుకున్నవారు కొందరు, చరిత్రలను కొందరు పట్టుకున్నారు. వీటన్నిటినీ పట్టుకుని ఆయన గొప్ప, ఈయన గొప్ప అని చెప్పుకుంటూ నిజమైన దేవున్ని అసలైన జ్ఞానమును వదలివేస్తున్నాము.

వేదాతీతుడైన దైవాన్ని వదలివేసి, వేదాల్ని పట్టుకున్నాము. వేదాలలో నీవు ఇరుక్కున్నావా, నిన్ను నీవు తెలియుట అశక్యము అని ఆయనే చెప్పాడు. **“వేదాలవలన, యజ్ఞముల వలన, తపస్సుల వలన, దానముల వలన నన్ను**

**తెలుసుకొనుటకు శక్యము కాదు"** అని భగవద్గీతలో చెప్పినాడు. కానీ దేవున్ని తెలుసుకోవాలని అందరూ ఆయన నిషేధించిన వేదాలు, యజ్ఞాలు, తపస్సులు, దానములతోనే ఆ ప్రయత్నం చేస్తున్నారు. ఈ విషయములను భగద్గీతలో విశ్వరూప సందర్శన యోగములో 48వ శ్లోకములో, 53వ శ్లోకములలోనూ వివరించారు. అక్షర పరబ్రహ్మయోగం 28వ శ్లోకములో కూడా ఈ మాటనే కృష్ణుడు చెప్పాడు. కృష్ణుడు చెప్పిన మాటలను చూచినప్పటికీ, ఏది సక్రమమైన మార్గమో ఆలోచన చేయకుండా ఉన్నాము. కనుక ఆయన చెప్పిన ప్రకారం మనం అనుసరిస్తే, ఆయన చేసిన పని చూడకుండా, ఆయన చెప్పే జ్ఞానమును మాత్రమే తెలుసుకోవలెను, దానినే అనుసరించవలెను. అప్పుడు కృష్ణుడు పరమాత్మ, కృష్ణుడు భగవాన్ అని తెలియును. కృష్ణుడు పుట్టకముందు పరమాత్మ, పుట్టిన తరువాత భగవాన్. ఆయనను అనుసరించే స్త్రీలంతా మనమే. మనమంతా ప్రత్యక్షముగా ఇప్పుడు తెలియదుగానీ, మనమంతా కృష్ణుని వెంటపడినవారమే. ఆయన ఎవరినీ పిలువలేదు. పిల్లన గ్రోవి ఆయన ఊదితే అందరూ పోయినారని వ్రాశారు. కొందరు ఊదకపోయినా పొదల్లో వెతుక్కుంటూ పోయారు. అంటే ఆయన ఏమీ ఊదనట్లే కదా! ఊదితే కనిపించేవాడే కదా! కనిపించ లేదంటే, వెతుకుతున్నారంటే, ఆయన ఏమీ ఊదనట్లే కదా! ఈ విధముగా ఆయన చెప్పిన జ్ఞానము చాలా గొప్పది. ప్రపంచ విషయములన్నిటికంటే గొప్పది. వేదాలు, యజ్ఞలు, తపస్సులు, దానాలు ఇవన్నీ నిన్ను ప్రపంచము వైపుకు తీసుకువెళ్ళేవి. ఇవి కాకుండా ఒకే యోగం దేవునివైపు తీసుకు వెళ్తుంది.

హి(ఇ)ందువులే కాదు, క్రైస్తవులు కూడా ఆ విధముగానే ప్రవర్తిస్తున్నారు. క్రైస్తవులు అందరూ ప్రభువు చెప్పిన మాటలు ఎవరూ

వినడంలేదు, విన్నారుగానీ అర్థం చేసుకోవటంలేదు, వేరే మార్గములో పోవుచున్నారు. అందుకే ఆయన నేను చెప్పినమాటలు మీకేమి అర్థముకావు వేరొక కాలంలో పరిశుద్ధాత్మ వచ్చి చెప్పేంతవరకు కూడా మీకు అర్థముకావు అని కూడ చెప్పినాడు. ఆ విధముగా ప్రభువు చెప్పిన జ్ఞానము అర్థము కాలేదు, భగవద్గీత అర్థము కాలేదు. తరువాత ఖురాన్‌లోకి వెళ్తే, ముహమ్మద్ ప్రవక్త చెప్పిన వాక్యాలు ముస్లీమ్‌లకి అర్థము కాలేదు. అర్థంకాక అపార్థం చేసుకొని ఇంకో విధంగా ఆచరిస్తున్నారు. ఈ ముగ్గురు అనగా శ్రీకృష్ణుడు, ఏసుప్రభువు, ముహమ్మద్‌ప్రవక్త చెప్పిన విషయములు అసలైన భావన మనకు అర్థము కాలేదు. కనుక మనం ఈ రోజు తెలుసుకున్న ఈ జ్ఞానముతో మనము దేవుని మార్గమునకు వెళ్ళవచ్చు. పరమాత్మను చేరే మార్గం, మూడు దైవ గ్రంథములలో సంపూర్ణముగా ఉంది. మతాతీతముగా అందరూ తెలుసుకుంటే మంచిది అని చెప్పుచూ ముగిద్దాము.

# 37. క్షమించరాని పాపము

తేది :- 22-09-2010

ఈ రోజు జ్ఞానపరీక్ష కార్యక్రమములో భాగంగా మొదటి ప్రశ్నతో ప్రారంభిద్దాము. ఆరుశాస్త్రములలో సంపూర్ణ, అసంపూర్ణ శాస్త్రములు ఏవి? ఈ మధ్యకాలములో పెద్దపెద్ద స్వామీజీలు వారి ఉపన్యాసాలలో వారు ఏది చెప్పిననూ శాస్త్రబద్ధముగా చెప్పుచున్నాను అని అంటున్నారు. ఆ విధంగా వారు అంటున్నారుగానీ అవి శాస్త్రబద్ధమా కాదా అని మాత్రము ఎవరూ తెలుసుకోవటం లేదు. ఒక పురాణ విషయాన్ని చెప్పి ఆ విషయాన్ని శాస్త్రము ఇట్లా చెపుతున్నది అని మనము అంటుంటారు. ఏదో ఒక పుస్తకములో విషయాన్ని చెప్తూ శాస్త్రము ఇట్లా చెపుతున్నది అని అంటారు.

www.thraithashakam.org

ఆ విధంగా చెప్పేమాట, శాస్త్రమా, కాదా అని మనము ఆలోచన చేయడం లేదు. వాళ్ళు చెప్తూ ఉంటే మనము వింటూ ఉన్నాము. వీరు శాస్త్రము అనే పదాన్ని ఊత పదంగా వాడుచున్నారు.

వాస్తవముగా లెక్కవేసి చూస్తే శాస్త్రములు ఆరున్నాయి, పురాణములు 18 ఉన్నాయి, వేదములు నాలుగున్నాయి. ఈ వేదములలో చెప్పే మాటైనాగానీ శాస్త్రమిలా చెప్పింది అని అంటున్నారు. ప్రత్యేకమైన ఒక జాతిని తీసుకువచ్చి ఈ జాతిలో చేర్చి శాస్త్రము అని చెప్పడము విడ్డూరం కాదా! కాబట్టి శాస్త్రాలు మనము లెక్కించుకుంటే ఆరు శాస్త్రాలున్నాయి అందులో ప్రపంచానికి సంబంధించిన శాస్త్రాలు ఐదైతే, ఒక శాస్త్రము మాత్రము దేవునికి సంబంధించినటువంటిది. ఆ ఒక్క శాస్త్రము పెద్దశాస్త్రము, కావున దానిని బ్రహ్మవిద్యాశాస్త్రము అని అంటున్నాము. బ్రహ్మ అంటే అర్థమేమంటే పెద్ద అని అర్థము. దేవున్ని తెలుసుకునేది పెద్ద విద్య కనుక ఆ శాస్త్రాన్ని బ్రహ్మవిద్యా శాస్త్రము అని అంటాము. సృష్టి మొదటిలో పుట్టినటువంటిది బ్రహ్మవిద్యాశాస్త్రము. మిగతావన్నీ తరువాత వచ్చాయి. ముందుపుట్టిన శాస్త్రం వెనక్కి వచ్చింది. తరువాత పుట్టిన శాస్త్రాలు ముందుకు వచ్చాయి. ఈ ఆరు శాస్త్రాలలో సంపూర్ణమైన శాస్త్రమేది? అంటే ఒకే ఒక్క శాస్త్రము అది బ్రహ్మవిద్యా శాస్త్రము. మిగతా ఐదు శాస్త్రాలు అసంపూర్ణముగా ఉన్నాయి.

ఎవరు ఎన్ని పరిశోధనలు చేసినా గానీ, ఇంకా కొత్త సిద్ధాంతాలు కనిబెడుతున్నారు. కొత్తకొత్త విషయాలు తెలుస్తూ పోతున్నాయి కానీ పూర్తిగా ఏ శాస్త్రము సంపూర్ణముగా బయట పడలేదు కానీ అన్నింటికంటే ముందు పుట్టినది, సంపూర్ణగా బయటపడిన శాస్త్రము ఒకే ఒకటి కలదు బ్రహ్మవిద్యా శాస్త్రము. అది సృష్టి ఆదిలోనే చెప్పబడింది. మిగతా శాస్త్రాలు

www.thraithashakam.org

గణితశాస్త్రము, ఖగోళ శాస్త్రము, రసాయన శాస్త్రము, భౌతికశాస్త్రము, జ్యోతిష్యశాస్త్రము. ఈ ఐదింటిలో జ్యోతిష్య శాస్త్రము చాలా వెనుకబడి ఉంది. భౌతికశాస్త్రము సంపూర్ణముగా తెలియడలేదు. అందుకనే గర్భస్థ శిశువుకు ప్రాణం ఉంది అని పొరపాటు పడుచున్నారు. ఖగోళ శాస్త్రము ఉంది అదీ సంపూర్ణంగా తెలియబడలేదు. అందువలన నీరు ఆవిరై మేఘములు లోపలికి వెళ్తూ ఉన్నాయని చెప్తున్నారు. మనము ఈ విషయము చెప్తే, ఇంత అసత్యమా? అన్నట్లు ఉంటుంది కానీ వాస్తవముగా ఒక చుక్క నీరు కూడా ఆవిరైపోలేదు పైకి. ఈ విషయాలన్నీ పూర్తిగా తెలియాలంటే సంపూర్ణముగా ఇంకా పరిశోధించబడి కొన్ని విషయాలు తెలిసిన రోజు తెలుస్తుంది. ప్రస్తుతానికి అవి అసంపూర్ణమైనవి. కాని సంపూర్ణమైన శాస్త్రము బ్రహ్మవిద్యా శాస్త్రము మాత్రమే. అదే విధముగా రెండవ ప్రశ్నను చూసినట్లైన బ్రహ్మవిద్యా శాస్త్రము చెప్పినది దేవుడా? మనిషా? బ్రహ్మవిద్యా శాస్త్రాన్ని సృష్టి ఆదిలోనే సూర్యునికి చెప్పాడు అని చెప్పుచున్నాము. దేవుడే చెప్పాడు అని అనుకున్నాము కూడా. మిగతా ఐదు శాస్త్రములు ఎవరు చెప్పారు? ఈ ఐదు శాస్త్రాలను మనిషి మాత్రము చెప్పలేదు.

ఒక శరీరములో ఒక జీవుడు నివసిస్తున్నాడు. ఇంకా చెప్పాలంటే శరీరములో 25 భాగాలున్నాయి ఈ 25 భాగాలలో జీవుడు కూడా ఒక భాగము. నీ శరీరములో కన్ను, ముక్కు ఎలగైతే భాగాలుగా ఉన్నాయో అదే విధముగా జీవుడు కూడా ఒక భాగమే. కన్ను చూస్తూ ఉంది అంతే రెండో పని చేయదు, చెవి వింటూ ఉంది రెండవ పని చేయదు ఈ విధముగా మన శరీరములో 25 భాగాలు 25 పనులు చేస్తున్నట్లు గుర్తిస్తున్నాము, జీవుడు కూడా ప్రత్యేకమైన పని నిమిత్తమే శరీరములో ఉన్నాడు. కేవలము అనుభవాలు అనుభవించేందుకు మాత్రమే వున్నాడు.

కన్ను మూసుకుంటే లోపలున్న జీవునికి ఏమీ తెలియదు. చెవి వినకపోతే ఏమీ తెలియదు, ఏమి తెలియనివాడు శాస్త్రాన్ని ఎట్లు కనిపెట్టగలడు? మరి దేవుడు క్రియారహితుడు. ఆయన చెప్పడు, కనిపెట్టడు. దేవుడు రూప, నామ, క్రియారహితుడు. జీవుడు చెప్పలేదు, దేవుడూ చెప్పలేదు మరి ఎవరు చెప్పినట్లు? నీ శరీరములో ఆత్మ అనేది ఏదైతే ఉందో అది చెప్పింది. "త్రైత సిద్ధాంతము" ప్రకారము ఈ శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ ఉన్నారు. వీరి ముగ్గురులో మధ్య ఉన్న ఆత్మ చెప్పింది.

ఇక మూడవ ప్రశ్న చూస్తే భగవద్గీత శాస్త్రమా? వేదమా? పురాణమా? ఇతిహాసమా? ఏది? వీటిలో శాస్త్రములు ఆరు అని తెలుసు, పురాణములు 18 అని తెలుసు. ఇతిహాసములు రెండు అని తెలుసు అవి రామాయణ, మహాభారతాలు. ఇతిహాసము అనగా గడచిన చరిత్ర అంటాము. చరిత్ర శాస్త్రము కాదు. భగవద్గీత వేదము కాదు, పురాణము కాదు, ఇతిహాసము కాదు. భగవద్గీత బ్రహ్మ విద్యాశాస్త్రము. ఇప్పుడు ఈ విధముగా విడదీయకుండా కొందరు అన్నీ శాస్త్రాలే అని చెప్పుకుంటున్నారు అది పెద్దపొరపాటు. మన ఇళ్ళలో పశువులు ఉంటాయి. అందులో కొన్ని ఆవులుంటాయి, గేదెలుంటాయి, ఎద్దులుంటాయి. పశువులు అనేవి ఒకటే మాటలాగ అనిపించినా వాటిని విడివిడిగానే ఆవులు, గేదెలు, దున్నలు, ఎద్దులు అని చెప్పుకున్నట్లే వేదాలను, పురాణాలు విడివిడిగా చెప్పాలి. పశువులు అనేవి ఒకటే అయినా విడివిడిగా చెప్పినట్లు, పుస్తకాలు ఒకటే అయినాగానీ ఆ పుస్తకములలో ఏవి పురాణాలు, ఏవి వేదాలు, ఏవి ఇతిహాసాలు, ఏవి శాస్త్రములు అని మనము గుర్తించి చెప్పుకుంటే, అప్పుడు అసలైన జ్ఞానము అర్థమవుతుంది. భగవద్గీత అనేది శాస్త్రమునకు సంబంధించినది. ఏ శాస్త్రమునకు సంబంధించినది అంటే బ్రహ్మావిద్యా శాస్త్రమునకు సంబంధించినదని చెప్పవచ్చును.

www.thraithashakam.org

ఇక నాల్గవ ప్రశ్న. ధర్మములు శాస్త్రములలో కలవా? వేదములలో ఉన్నాయా? పురాణములలో ఉన్నాయా? ఇతిహాసములో ఉన్నాయా? ప్రతి శాస్త్రానికి ధర్మములుంటాయి, అదే విధముగా ఆరు శాస్త్రాలకు ధర్మములు ఉంటాయి. ప్రకృతికి సంబంధించిన శాస్త్రాలలో ప్రకృతి ధర్మములు ఉంటాయి. కనుక ధర్మములు శాస్త్రములలో ఉండును అని తెలియవలెను. ఐదవ ప్రశ్న ఏమనగా! విశ్వాసముగల కుక్క మనిషిని చూసి తోక ఆడిస్తుంది దేనికి? అందమైన నెమలి మనిషిని చూసి పురివిప్పి ఆడుతుంది దేనికి? కుక్క నన్ను విశ్వాసముగలదాన్ని అని అనుకుంటున్నావేమో, కాదు నన్ను నమ్మవద్దు అని తోకను "కాదు" అనే సూచనగా అడ్డముగా ఆడిస్తుంది. నమ్మవద్దు అని కుక్కతోక ఆడిస్తే ఎవరిని నమ్మాలి, విశ్వాసము అని ముందు అన్నప్పుడు విశ్వాసము అనేది ఎవరిమీద చూపాలి? దేవుని మీద చూపండి అని కూడా చెప్తున్నట్లుంది. ఎవరిమీదా నీవు విశ్వాసము చూపించకు, నీ విశ్వాసము దేవునిమీద చూపు అని, కుక్క తన తోక ఆడించడము ద్వారా సూచిస్తున్నది. ఇక నెమలి విషయానికి వస్తే, అందమైనదని మనము దానివైపు చూస్తుంటే ఆ ఇష్టము దేనిమీద పెట్టాలంటే, నెమలి పింఛములో మధ్యలో నల్లటి గుర్తు ఉంది చూడండి, దానిమీద నీ ఇష్టము పెట్టుకో అని దాని పింఛాన్ని చూపిస్తున్నది. నీ ఇష్టము ఆత్మమీద పెట్టుకోవలెను నన్ను చూసినట్లు నా ఆత్మను చూసుకో, తరువాత ఈ ఆత్మ ఎటువంటిది అంటే అందరి శరీరాల్లోనూ అది ఉన్నది అనే విషయాన్ని తెలియజేసేందుకు నెమలి పురి అంతా విప్పి ఎన్నో పింఛాలను చూపుతూ ఉంది. ఆత్మ చుట్టూ గుణములు ఉన్నాయి కనుక ఆ గుణాలను విడిచిపెట్టి గాఢంగా చూపిన నల్లని గుర్తుని నెమలిపింఛంలో ఆత్మగా గుర్తించి దానిని చూసుకో అని నెమలి తెలియజేస్తూ ఉంది.

ఈ విధంగా కుక్క, నెమలి కూడా మనకు జ్ఞానాన్ని తెలియజేస్తున్నట్లే అందుకే కృష్ణుడు నెమలి పింఛాన్ని ధరించి చూపించాడు. తామస, రాజస, సాత్త్విక అనే మూడు గుణభాగముల గుర్తుగా మూడు వలయాలు, మూడు రంగులు నెమలి పింఛంలో కనిపిస్తున్నాయి. ఈ గుణ భాగాలకు అతీతంగా ఇంకొక వలయము గాఢమైన నల్లనిరంగు కూడా నెమలిపింఛంలో ఉంది. అది గుణాతీతమైన ఆత్మకు గుర్తుగా ఉంది. నేను కూడా గుణాతీతుడనే (ఆత్మనే) అని తెలియజెప్పేందుకు కృష్ణుడు నెమలి పింఛాన్ని ధరించాడు. నెమలికూడా మీరిట్లా ఉండండి అని చెప్పినట్లు మనకు తన పింఛాన్ని చూపిస్తున్నది. కృష్ణుడు నేనిట్లా ఉన్నాను అని చెప్పాడు. నెమలి మీరిట్లా ఉండండి అని చెప్తున్నది. శ్రీకృష్ణుడు నేను తామసున్ని కాను, రాజసున్ని కాను, సత్వగుణం గల్గిన వాడిని కాను. నేను గుణాతీతుడను అని చెప్పేందుకే నెమలిపింఛాన్ని శాశ్వతంగా ధరించి చూపించాడు. మరి ఇంతమంది ఉన్నారు. శ్రీకృష్ణుడు నెమలి పింఛాన్ని ఎందుకు ధరించాడో స్వామీజీలు ఎవరైనా తెలుసుకొన్నారా ఏదీ పెట్టుకోకుండా నెమలి పింఛాన్నే ఎందుకు పెట్టుకున్నాడు? **"చాతుర్వర్ణం మయా సృష్టం గుణకర్మ విభాగశః"** అనే శ్లోకములో నేను గుణములు అనుసరించి నాలుగు వర్ణాలను సృష్టించానని, గుణ కర్మలు మూడు, గుణములు లేనిది ఒకటి, గుణాలు కర్మలు ఉండే వాటిలో మీరున్నారు. గుణాలు, కర్మలు లేని మధ్య భాగంలో ఆత్మగా నేనున్నాను అని నెమలిపింఛము పెట్టి చూపించాడాయన. ఈ విధముగా నెమలిపింఛానికి గొప్ప అర్థముంది.

ఇక ఆరవ ప్రశ్న ఏమనగా "స, రి, గ, మ, ప, ద, ని, స" అనే స్వరాలలో సప్తస్వరాలు అంటారు పలకటం మాత్రము ఎనిమిదిగా పలుకుతారు. అలా ఎందుకంటున్నారు? 'సరిగమపదనిస' అని అంటున్నారు

www.thraithashakam.org

గానీ 'సరిగమ పదని' అని ఎందుకు నిలబెట్టలేదు. 'సరిగమపదనిస' అని పలికితే ముందు అక్షరము 'స' చివరి అక్షరము కూడా 'స' అనే ఉంది. నీ ముందూ నేనే ఉన్నాను, నీ వెనుకా నేనే ఉన్నాను. మిగతా స్వరాలు ఆరు మధ్యలో ఉన్నాయి. అంతటా నేనే ఉన్నాను, ముందు, వెనుకా కూడా మనలో గుణాలు ఎన్ని ఉన్నాయి? ఆరు ఉన్నాయి అదియే 'షట్‌వర్గం'. అరిషట్ వర్గం కావచ్చు, మిత్రషట్ వర్గమూ కావచ్చు. ఈ ఆరు వర్గాలలో ముందు ఉండేదీ నేనే, వెనుక ఉండేదీ నేనే. గుణములకు అతీతంగా అటువైపైనా, ఇటువైపైనా నేనే ఉన్నాను. నాకు తెలియకుండా ఎవరూలేరు అనే విషయం తెలిసిన సంగీత జ్ఞానులు వారు 'స' అనే అక్షరాన్ని చివరిలో (వెనుక) కూడా పెట్టారు. దేవుని భావాన్ని తెలిపేందుకు "సరిగమపదనిస" అని పెట్టారు. ఈ విధంగా ఎనిమిది స్వరాలు చెప్పారు.

ఇక ఏడవ ప్రశ్న ఏమనగా! కాలజ్ఞానమును ఎవరు చెప్పారు? అంటే బ్రహ్మంగారు వ్రాశారు అనేది జవాబు. అయితే భగవద్గీతలో అర్జునునికి శ్రీకృష్ణుడు విశ్వరూపమును చూపించాడు. అప్పుడు అర్జునునికి కృష్ణుడెవరో అర్థముకాక అన్ని వైపులా నీవే ఉన్నావు. "ఎవరు నువ్వు" అని అర్జునుడు అడిగాడు. ఆయన "కాలోస్మి" అని అన్నాడు. "నేనే కాలాన్ని" అని అన్నాడు. **"కాలోస్మి లోక క్షయో"** అని అన్నాడు. "అందరినీ నాశనము చేసే కాలాన్ని నేనే" అని అన్నాడు. కాలము అంటే దేవుడు అని అర్థము "కాలజ్ఞానము" అంటే ఏమి "దేవుని జ్ఞానము" అని అర్థము. దేవుని జ్ఞానాన్ని ఎవరు చెప్పాలి? దేవుడే చెప్పాలి. దేవుని జ్ఞానము ఏ మనిషీ చెప్పడు. అది శాసనము కనుక కాలజ్ఞానాన్ని దేవుడే చెప్పును.

ఎనిమిదవ ప్రశ్న లోచనకు, ఆలోచనకు ఏమి తేడా గలదు? లోచనం అంటే చూడటం, ఆలోచన అంటే మనస్సుతో చూడటం. కంటితో చూచిన

www.thraithashakam.org

దానిని 'లోచనం' అంటారు. ఒకటి బహిరంగంగా చూసేది, ఇంకొకటి అంతరంగంగా చూసేది. ఒక సినిమా చూస్తున్నావు. సినిమాను లోచనముల ద్వారా చూస్తున్నావు. అనగా కంటితో చూస్తున్నావు. దానిని మరలా జ్ఞాపకము ద్వారా చూస్తే అది ఆలోచన ద్వారా జరుగుచున్నది. లోచనకు, ఆలోచనకు తేడా ఏంటంటే ఒకటి స్థూలము, రెండవది సూక్ష్మము. ఒకటి కంటి ద్వారా చూస్తే, ఇంకొకటి మనస్సు ద్వారా చూస్తున్నాము.

ఇక తొమ్మిదవ ప్రశ్న ఏమనగా! "నీకు రోషముందా? మీసముందా?" "ఇచ్చట రోషమనగా! పౌరుషము అని అర్థము. పౌరుషము అనగా పురుషత్వము కలిగినది. పురుషత్వము కల్గినది ఏది? జ్ఞానము. నీకు దైవజ్ఞానము అంటే పౌరుషం ఉన్నట్లు అంతేగాని రోషము అంటే అలిగిపోయేది కాదు. అది రోషమే కాదు. ఒక సామెత ఉంది "పౌరుషానికి మంగళ కత్తులు మ్రింగినట్లు" అని. పౌరుషం అంటే జ్ఞానము అని అర్థము కదా! దైవజ్ఞానము కొరకు మంగళకత్తులు మ్రింగారు. మంగళం అనగా శుభకరమైనటువంటిది. ఇక్కడ కత్తులు, ఖండించేది అంటే జ్ఞాన ఖడ్గం అని అర్థము. నీ కర్మను ఖండిస్తే, జ్ఞానమార్గములోకి నీవు వస్తే, నీ కర్మను, జ్ఞానము ద్వారా ఖండన చేస్తే, పౌరుషమునకు, దేవునికొరకు ముందుకు పోతావు. మీసము అంటే పురుషులకు ఉండేది కాదు అది అందరికీ ఉండేది. మీసము అంటే అర్థమేమిటి? వెంట్రుక అని అర్థము. **వెంట్రుక అంటే ఆత్మ** అని అర్థము. ఈకలు అన్నా, వెంట్రుకలు అనినా, మీసములు అనినా ఒకటే అర్థము. కనుక మీసము అందరికీ ఉంది అని అని చెప్పవచ్చును.

చివరి ప్రశ్న ఏమనగా! **"ఊరు"** అనేది ఊట అనే పదము నుండి వచ్చింది. ఊటను ఊరుట అంటారు కదా! తద్వారా ఊరు అనే పదము

www.thraithashakam.org

వచ్చింది. మన శరీరములో ఎన్నో ఊటలు ఊరుతున్నాయి. మొత్తము ఏడు ఊటలున్నాయి. కనుక శరీరము అంతటినీ మనము ఊరు అంటున్నాము. శరీరము అనే ఊరిలో మనము ఉన్నాము. అందుకే నీ ఊరిలో (శరీరములో) వీధిలైట్లు ఎన్ని ఉన్నాయి? ఎన్ని బావులున్నాయి అని అడిగాము? అంటే వీధిలైట్లను నాడీకేంద్రాకు బదులుగా చెప్పుకున్నాము. స్రవింపబడిన ఊటలను (రసములను) బావులుగా చెప్పుకోవచ్చును. కనుక ఏడు వీధిలైట్లు, ఏడు బావులుగా మన శరీరాన్ని చెప్పుకోవచ్చు. ఊరుంది, ఆ ఊరిలో నీవుండే స్థానము కూడా ఉంది. నీ ఊరిలో నీవు తలలో ఉన్నావు. నీ ఇంట్లో లైట్లు అని నేను అడగకుండా, నీ వీధిలో లైట్లు ఎన్ని, అని అడిగాను. తలలో జీవునిగా నీ ఇళ్ళు ఉంది. తలనుండి క్రింది భాగము అంతా వీధి. ఆ వీధిలో ఆరులైట్లు ఉన్నాయి, ఇంటిలో ఒక లైటుంది అంటే తలలో కనుక ఏడు అని జవాబు వ్రాస్తే తప్పవుతుంది. ఇక్కడ బావులకు కూడా వీధిలో ఆరు బావులున్నాయి. ఇంట్లో (తలలో) ఒక బావి ఉంది. దానినే గ్రంథిరాజము (పిట్యూటరీ) గ్రంథి ఉంది. గ్రంథిని బావి అని అంటాము. జీవుడుగా నీవు రవ్వంత తలలోనే ఉన్నావు కనుక అది నీ బావి అవుతుంది. అది నీ ఇల్లు కనుక ఒక్కటే అని చెప్పాలి.

ఇప్పుడు మనము క్షమించే పాపము, క్షమించరాని పాపము గురించి మాట్లాడుకుందాము. మనుషులు పని చేస్తారు. ఆ పని చేసేందుకు 'కర్మ' అనేది కారణము. "కర్మ కారణముచ్యతే" కర్మను కారణంగా చెప్పవచ్చును. ప్రతీ పనికి ఒక కర్మ కారణంగా ఉంది. ఆ కారణం చేత కర్మ జరుగుతూ ఉంది. భగవద్గీతలో అర్జునుడు "యుద్ధం చేయను నాకు పాపము వస్తుంది" అని అన్నాడు. అప్పుడు కృష్ణుడు ఏమి చెప్పాడంటే, ప్రతీ కర్మకు ఒక కారణం ఉంటుంది, ఆ కారణం ప్రకారము ప్రతీ పని చేయాల్సి వస్తుంది.

www.thraithashakam.org

నీవు చేస్తాను అనేది లేదు, చేయను అనేదీ లేదు. ఏది జరగాల్సి ఉంటే అదే జరిగితీరుతుంది. దానినే విధి అంటారు. ఆ విధి ప్రకారము ఆ పని జరగాల్సిందే. నీవు చేయను అన్నా కుదరదు, నేను చేస్తాను అనినా జరగదు. జరిగే కర్మ లేకపోతే జరగదు, జరిగే కర్మ ఉంటే జరుగక మానదు. కనుక పనులు చేయుటయందు అధికారము ఎవరికీ లేదు. ఫలితము మీద అధికారము ఉంది" అని మాత్రము చెప్పాడు. మనవాళ్ళంతా పనులు చేయుటయందే అధికారము కలదు కానీ ఫలితము మీద అధికారము లేదు అని వ్రాశారు. కానీ భగవంతుడు ఏమి చెప్పినాడు, ఫలితము మీద అధికారము ఉంది అని చెప్పినాడు. పనులయందు అధికారము లేదు అని చెప్పెను. యుద్ధరంగములో వారంతా చనిపోవాల్సి వుంది. నీవు యుద్ధం చేయనని ప్రక్కకు వెళ్ళాలనుకున్నా నీవు వెళ్ళలేవు. ఎందుకంటే నీకు పనులయందు అధికారము లేదు. కర్మ వస్తుందా రాదా అనేది నీ భావము మీద ఆధారపడివుంది. కర్మ అనగా పాపము లేక పుణ్యము సంపాదించుకోవటం నీపైన ఆధారపడి ఉంది. అంటే ఒక పనిని మనము చేస్తూ ఉంటే మనకు తెలియకుండా ఒక ఫలితము వస్తుంది, అది కనిపించదు. కనిపించే ఫలితము ఒకటి వస్తుంది, కనిపించని ఫలితము ఒకటి వస్తుంది. కనిపించే ఫలితము డబ్బు రావచ్చు, ధాన్యము రావచ్చు ఏదైనా రావచ్చును. కనిపించని ఫలితము మాత్రము, మంచి పనైతే పుణ్యం వస్తుంది, చెడ్డపనైతే పాపము వస్తుంది.

ఈ పాపము పుణ్యం వచ్చేందుకు చేసే పనికి కర్మ ఒకటి ఉంది. ఆ కర్మ ఇంతకు ముందు జన్మలలో చేసుకున్నది, అది మన కర్మచక్రములో నమోదయింది. ఆ కర్మచక్రం జరిగేకొద్దే ఆ పని జరుపబడుతుంది. ఆ పని జరిగినప్పుడు ఈ విధానమంతయూ తెలియకపోతే, క్రొత్త కర్మ వస్తుంది.

www.thraithashakam.org

నీవు చేసిన పని మంచిదైతే పుణ్యం, చెడ్డపనైతే పాపము వస్తుంది. ప్రతీ కార్యానికి కర్మ అంటుకుని రావటం నిజమే, కానీ నువ్వు అంటించుకోకుండా ఉండేదానికి ఒక విధానము ఉంది. పని జరిగేందుకు కర్మ కారణం అని తెలియక "నేనే ఈ పనిని చేస్తూ ఉన్నాను" అని అనుకుంటావు. అలా అనుకుంటే మాత్రము ఆ కర్మ నిన్ను చుట్టుకుంటుంది. నేను నిమిత్త మాత్రంగా ఉన్నాను. నేను చేసేవాడిని కాను అని నీవనుకుంటే నీకు ఏ కర్మ అంటదు, కానీ అలా కాకుండా నేనే చేస్తున్నాను అనుకుంటే పాపము లేదా పుణ్యం అంటుకోక తప్పదు. పాపము అంటుకుంటే భయంకరమైన కష్టాలు వస్తాయి. ప్రపంచములో చాలామంది అనుభవిస్తున్న కష్టాలన్నీ పాప ఫలితాలే వాటిని చూసిన తరువాత మనకి పాపభీతి ఏర్పడాలి. అది పాపము వలన వస్తున్నది అని తెలిస్తే పాపభీతి వస్తుంది. పాపము వలన ఈ కష్టాలు వస్తున్నాయి అని తెలియకపోతే పాపాన్ని లెక్కపెట్టరు. నువ్వు పట్టించుకున్నా, పట్టించుకోకపోయినా పాపము నిన్ను వదలిపెట్టదు. తప్పు చేస్తే అది నీ తలలో కర్మచక్రములో నమోదయి సమయము వచ్చినప్పుడు ఆ శిక్షను అనుభవింపక తప్పదు.

ప్రపంచవరంగా చేసిన పాపము ఏదైతే ఉందో అది మనము కష్టం రూపంలో అనుభవించవచ్చు లేదా దానిని అనుభవించకుండా జ్ఞానమార్గము ద్వారా కాల్చివేయవచ్చు కూడా. కర్మనిర్మూలనా విధానము జ్ఞానముద్వారా ఈ విధంగా ఉంటుంది. "యధైధాంసి సమిద్ధోగ్ని భస్మసాత్కురుతేర్జునా" అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పాడు. ఏ విధంగా కట్టెలను అగ్ని కాల్చివేస్తుందో, ఆ విధంగానే జ్ఞానము అను అగ్ని ద్వారా నీ కర్మలను కాల్చివేయవచ్చు, అది జ్ఞానాగ్ని. ఆ విధంగా జరుగకపోతే ఆ కర్మలను అనుభవించాల్సిందే. ఈ విధంగా ప్రపంచవరంగా సాధారణంగా చేసుకున్న

కర్మలను అనుభవించే పద్ధతి ఇది. దీనినే "క్షమించబడే కర్మ" అంటారు. అంటే జ్ఞానమార్గము ద్వారా నశించబోయే కర్మ కనుక దీనినే క్షమించబడే కర్మ అంటాము. జ్ఞానము ద్వారా కూడా నశింపని కర్మలుంటాయి. అవి క్షమింపరాని కర్మలు. అంటే క్షమించే కర్మ, క్షమింపరాని కర్మలు రెండుంటాయి. **"శ్రీకృష్ణుడు దేవుడా? భగవంతుడా?** అనే గ్రంథములో "క్షమించే కర్మ, క్షమించబడని కర్మ" రెండు రకముల కర్మల గురించి వ్రాయటం జరిగింది. క్షమించరాని కర్మల గురించి వ్రాస్తూ, భగవంతుడు భూమిమీదకు వచ్చినప్పుడు, ఆయన జ్ఞానాన్ని తెలియజేసేటప్పుడు నాకు సహకరించనివాడు నాకు విరోధి, నా పక్షములో లేనటువంటివాడు నాకు విరోధి, నా గుంపును చెడగొట్టువాడు కూడా నాకు విరోధి. ఇక భగవంతుడు చెప్పిన మరొకమాట ఏమిటంటే, ప్రపంచపరమైన కర్మ ఏదైనా క్షమించ బడుతుంది. ఆత్మ సంబంధముగా చేయబడిన పాపము ఎట్టి పరిస్థితిలోనూ క్షమించబడదు. దైవసంబంధంగా చేయబడిన పాపము క్షమింపబడదు. **"దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు"** అనే గ్రంథములో కూడా ఈ విషయమై వివరించటం జరిగింది. అందులో కొన్ని రోగాలు శరీరములో ఔషదం (మందు) ద్వారా పోతాయి, కొన్ని రోగాలు మందు ద్వారా కాకుండా మంత్రము ద్వారా పోతాయి. కొన్ని రోగాలు ముందు ద్వారా గానీ, మంత్రము ద్వారా కూడా పోకుండా ఉంటాయి. అటువంటి రోగాలు జ్ఞానాగ్ని (జ్ఞానము) ద్వారా పోతాయి. జ్ఞానం కల్గిన వ్యక్తి ఒకమాట చెప్పినా, లేదా తనలో తాను రోగాన్ని తగ్గిపోమని చెప్తే, ఆ మాటకు కట్టుబడి పోతాయి. కానీ కొన్ని రోగాలు, మాటవలన, మందు వలనగానీ, మంత్రము వలన గానీ పోవు. వాటిని తప్పక అనుభవించి తీరాల్సిందే. దానినే క్షమించరాని పాపము అంటారు. ఆ పాపము వ్యాధి రూపంలో ఉంటుంది. ఈ

www.thraithashakam.org

విధంగా చూస్తే క్షమింపరాని కర్మయొక్క అనుభవము (ఫలితము) ఎంత భయంకరమైనదో తెలుస్తుంది. ఒక జన్మతో ఆ పాపము యొక్క అనుభవం అయిపోదు. దేవుని జ్ఞానాన్ని భూమిమీద చెప్పేవాడు భగవంతుడు, దేవుడు రూప, నామ, క్రియారహితుడు. మరి దేవుని జ్ఞానము దేవుడే చెప్పాలి, అదీ మనుషలకే చెప్పాలి, మరి ఆ విధంగా చెప్పితేనే మనుషలకు అర్థమవుతుంది. కనిపించేవాడే చెప్పాలి. కానీ ఆ పని చేయనివాడు దేవుడు. దీనిని అనుసరించి కనిపించేవాడు దేవుడు కాదు. అటువంటప్పుడు దేవుడూ కాక, మనిషీ కాకుండా వచ్చు వాడినే “భగవంతుడు” అంటాము. ఆ భగవంతున్నే మనము గురువు అంటాము. ఆ గురువు కొన్ని లక్షల సంవత్సరాలకు భూమిమీదకు వస్తాడు. ఆయన ఎల్లప్పుడూ భూమిమీద ఉండడు. గురువు రహస్యంగానే ఉంటాడు. ఆయన ఎవరికీ తెలియబడడు. తెలియబడేవాడు గురువు కాదు. అటువంటి గురువు భూమిమీదకు జ్ఞానము చెప్పుటకు వచ్చినప్పుడు సహకరించనివారు, ప్రతిపక్షముగా ఉన్న వారందరూ దేవునియెడల చేసుకున్న పాపమవుతుంది. ప్రపంచ సంబంధ పాపము ఈ జన్మలో చేసినది వచ్చే జన్మలో అనుభవిస్తే పోతుంది. లేనిచో ఎంతోకొంత జ్ఞానము తెలుసుకున్నా ఆ కర్మను లేకుండా చేసుకోవచ్చును. కానీ దైవసంబంధమైన పాపము క్షమింపబడదు. కనుక ఏ విధమైన పనులు చేయటం వలన దైవ సంబంధమైన పాపము వస్తుంది అనే విషయాన్ని తెలుసుకోవటం ఎంతో ముఖ్యము. ఆ పాపాన్ని అనుభవించుటకు ఈ యుగమందు, రాబోవు యుగమునందు కూడా అనుభవించాల్సిన పనివస్తుంది.

ఇక చివరిగా చెప్పాల్సింది ఏమంటే, దైవ సంబంధమైన పాపాన్ని అసలు చేయవద్దండి అలాగని ప్రపంచవరమైన పాపము చేసినా ఫరవాలేదని

మా ఉద్దేశ్యం కాదు. ప్రపంచవరమైన పాపము చేయకూడదనే మేము జ్ఞానాన్ని చెప్పేది, మీరు వినేది. అందుకు భగవద్గీతలో చెప్పిన కర్మయోగ రహస్యాన్ని తెలుసుకుని పనులు చేస్తే మనము నిజమైన యోగులమవుతాము, నిజమైన సన్న్యాసులమవుతాము" అని భగవద్గీతలో ఆరవ అధ్యాయములో "ఆత్మ సంయమయోగము"లో మొదటి శ్లోకములో...

శ్లో॥ అనాశ్రిత కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
ససన్న్యాసీచ యోగీచ ననిరగ్ని ర్నచాక్రియః ॥

నిజమైన సన్న్యాసి, నిజమైన యోగి అని ఎవరిని అంటారంటే అగ్ని కల్గినటువంటివాడిని, అంటే జ్ఞానమనే అగ్ని కలిగి ఉండాలి. అంతేగానీ పనులు మానుకున్నవాడిని సన్న్యాసి అని అనకూడదు. పనులు చేస్తూ ఆ పనుల్లో వచ్చే ఫలితాలైన పాప, పుణ్యాలను, వాటిని జ్ఞానమనే అగ్నితో కాల్చివేసేవాడినే నిజమైన సన్న్యాసి, నిజమైన యోగి అనాలి. అటువంటి వాడు "అనాశ్రితః కర్మఫలం కార్యకర్మ కరోతియః' పాపపుణ్య ఫలితాలను అంటుకోకుండా "కార్యం కర్మ కరోతి యః' కర్మప్రకారము పనులు చేయును. వెనుకటి జన్మ కర్మ ప్రకారము పనులు చేస్తాడు. ఆ కర్మవారికి అంటదు. ఎందుకు అంటదు అంటే అగ్ని ఉన్నది. పనులు చేస్తూ ఉన్నా అగ్ని ఉంది కనుక వాడే నిజమైన యోగి మరియు నిజమైన సన్న్యాసి. ఇన్నాళ్ళు జ్ఞానము వినినా సరే మరలా మనము మాయలో పడిపోతున్నాము. అలా మాయవైపు పోకుండా జ్ఞానము వైపునకు మాత్రమే వెళ్ళేందుకు ప్రయత్నం చేయండి. ఆ ప్రయత్నంలో భాగంగా, దేవుని కార్యక్రమములలో పాల్గొని దైవజ్ఞానము పదిమందికి అందేటట్లుగా చేయడం దేవుని సేవగా అనుకొని పనిచేయటం మంచింది.

# 38. మాయకుడు-అమాయకుడు

తేది : 16-10-2010

మన శరీరములో ఎన్నో అవయవములు కలవు. బయటకు కనిపించే అవయవములు కొన్ని, బయటకు కనిపించకుండా ఉన్నవి కొన్ని గలవు. బయటకు కనిపించే అవయవములను ఖరీదుకడితే తక్కువ వెల ఉండవచ్చుగానీ, బయటకు కనిపించక శరీరములో ఉండే అవయవముల వెల కడితే ఎక్కువ ఉండును. గుండె ఉన్నదనుకో చాలా ఖరీదైనది. ఆపరేషన్ చేయాలంటేనే ఖరీదు అయిన పని. ఒకవేల గుండెను కొనాలంటే యాభై లక్షలిచ్చినా ఇచ్చేవారు ఉండరు. ఒక కాలేయము, ఒక కిడ్నీ ఈ విధముగా లెక్కవేసుకుంటే వీటి ఖరీదు చాలా ఎక్కువ ఉండును.

అదే విధముగా బయటకు కనిపించే అవయవములైన కన్ను, చెవి, ముక్కు వాటి యొక్క ఆపరేషన్ (శస్త్ర చికిత్స) ఖరీదు మనకు తెలిసినదే. అదే విధముగా బట్టతల ఉన్న వ్యక్తి తలమీద వెంట్రుకలు మొలిపించాలంటే ఎనిమిది లక్షలు ఖర్చుయినట్టు మొన్న టీవీలో ఒక వైద్యుడు చెప్పగా విన్నాము. మరి దేవుడు ప్రతీ వ్యక్తికి జుత్తు ఉండేటట్లు పంపించినాడు. మరి దేవుడు అన్ని కొత్త అవయవములను పంపించెను కదా! మరి అది ఎంత ఖరీదైన పని.

ఇప్పుడు దేవునితో మనకేమి పని? అనే స్థాయికి మనిషి దిగజారాడు. మరి దేవుడిచ్చిన అన్ని అవయవములను వాడుచూ మనిషి, దేవున్ని. మరి దేవుడు ఒక అవయవమును తీసుకుంటే, ఆ అవయవము పని చేయటం లేదని వైద్యుని వద్దకు పోవును. మరి దేవుడు ఇంత ఖరీదైన వస్తువులను మన శరీరంలో, శరీరం పైన ఉంచి ప్రపంచములోనికి పంపిస్తే,

www.thraithashakam.org

అతని పని మనమేమైనా చేస్తున్నామా? మన పని మనము చేసు కుంటున్నామా?

మరి అసలైన దేవున్ని వదలి ఎవర్నో దేవున్ని ఆరాధస్తే అతనికి కోపము రాదా? అంటే గుణాతీతుడు దేవుడు కావున అతనికి కోపము కూడా రాదు. ఆయనను మీరు తిట్టినా ఏమీ అనుకోడు కానీ, అతని పరిపాలన ఉందే, అందులో పరిపాలకులు మాత్రము వదిలిపెట్టరు. దేవుని పరిపాలన ఉన్నదని ఈ మధ్య "దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు" అను గ్రంథములో మేము వ్రాశాము. ఇది నూటికి నూరుశాతము వాస్తవం. కాని ఇంతవరకు ఆ పరిపాలనా విధానమును ఎవ్వరూ తెలుసుకొనలేదు. దేవుడు శిక్షలు వేస్తాడు అంటే యమలోకములో అంటున్నారు. యమలోకాన్ని ఎవరైనా చూశారా? ఎవరూ చూడలేదు. ఉంది అని భ్రమలో పడి యమ లోకము ఎక్కడో ఉన్నదని అనుకుంటున్నారు.

కానీ దేవుని పరిపాలనా విధానమంతయూ ఈ భూమిపైనే జరుగు చున్నదని ఇంతవరకు ఎవ్వరూ చెప్పలేదు, కానీ మేమే ఇప్పుడు చెప్పుచున్నాము. ఇప్పుడు మీకు సులభంగా ఈ విషయము చెప్పిననూ, ఇది చాలా పెద్ద విషయము. ఈ విషయములన్నింటినీ ఈ మధ్య మేము వ్రాసిన గ్రంథములో వచ్చినవి. అవి చదివిన కొందరికి భయంకరమైన రోగములు పోయినవి. మేము గొప్పగా చెప్పుకుంటునట్టు మీకు అనిపించినా, మేము గొప్పగా చెప్పినా, చెప్పకున్ననూ ఉన్న వాస్తవము అదే.

మేము చెప్పు విషయములన్నియూ రహస్యమైనవి. సృష్ఠి ఆది నుండి ఉన్న రహస్యములను మేము చెప్పుచున్నాము. అంటే మీరు చెప్పుచున్న విషయములు ఏ వేదంలో ఉన్నాయి, ఏ పురాణములో ఉన్నాయి? అని అడుగవచ్చు. ఏ వేదంలో, పురాణాలలో లేవనే మేము మొదటినుండీ

www.thraithashakam.org

చెప్పుచున్నాము. శాస్త్రాలలో ఉన్నాయా అంటే ఐదు శాస్త్రాలలో ఎక్కడా ఉండవు. ఒకే ఒక్క శాస్త్రములో ఉండును, అదే ఆరో శాస్త్రము బ్రహ్మవిద్యాశాస్త్రంలో ఉన్నాయి. కానీ అవి అందులో వెతికితే కనిపిస్తాయి. ఆ పనిని ఇప్పుడే ప్రారంభించమని మేము చెప్పుచున్నాము.

దేవుడు చాలా గొప్పవాడు అని తెలిసినప్పటికీ దేవుడెవరో తెలియదు. దేవుని పరిపాలన ఎదురుగా ఉన్నప్పటికీ ఆ పరిపాలన ఏదో తెలియదు. మరి ఇంతటి అజ్ఞానములో మనమంతా ఎందుకున్నాము? అంటే, మనమంతా నడిచే ప్రవర్తన గుణముల వలనే ఉండును. దేవుడు వేరు, గుణములు వేరు. గుణములు మూడు భాగములుగా ఉన్నవి, అవి తామసము, రాజసము, సాత్త్వికము ఈ మూడు గుణ భాగములలో మరలా ఒక్కొక్క భాగములో ఆరు మంచి గుణములు, ఆరు చెడ్డ గుణములు కలవు. అనగా ఆరు మిత్రవర్గము, ఆరు శత్రువర్గము కల్గినవిగా ఉన్నవి. దీనినిబట్టి మన శరీరములో మంచి, చెడు రెండు రకముల గుణములు కలవు. మరి మంచి గుణములైనా, చెడు గుణములైననూ మనిషిని దేవునివైపు వెళ్ళకుండా చేయునవే, కనుక భగవద్గీతలో ఆ గుణములనే **'మాయ'** అని అన్నారు.

మాయ, దేవుడు అనేవి రెండు కలవు. దేవుడు అనేది జ్ఞానముతో కూడి ఉంటుంది. మాయ అనునది గుణములతో కూడి ఉండును. గుణముల వలన మనము చేసే పనుల వలన దేవునివైపు వెళ్ళకుండా మాయవైపు ఉన్నాము. కనుక దైవత్వం తెలియదు, దేవుడు తెలియలేదు. అతని పరిపాలనా విధానము తెలియలేదు. వాస్తవమైన దైవాన్ని తెలుసు కోవాలని ప్రయత్నం చేస్తున్నాము. కనుక మనము మాయ నుండి తప్పించు కుంటే దేవుని దగ్గరకు మనము చేరవచ్చును. కుందేళ్ళను పట్టుటకు వల వేశారట ఆ కుందేళ్ళు ముందుకు పోవాలని వెళ్ళి ఆ వలలో ఇరుక్కున్నా

www.thraithashakam.org

యట. ఆ కుందేళ్ళ వలల దగ్గర, ఒక అడుగు ముందుకు కుందేళ్ళు గెంతితే ఆ వలలో పడకుండా అవి తప్పించుకోవచ్చు. కానీ అవి ఆ వలవద్ద ఎగిరిపోకుండా వలలో దూరిపోవాలని చూస్తాయి. అప్పుడు వలలో చిక్కుకొంటాయి.

కుందేళ్ళకు అహం ఎక్కువ అందుకే ఆ వలలోనుండే దూరి పోగలను అని అనుకుంటుందేమో! ఆ విధముగా రాలేక ఆ వలలోనే చిక్కుకొనును. ఆ విధముగా మనము మాయ అనే వలనుండి తప్పించు కోవాలంటే మార్గము ఉంది. కుందేళ్ళు, వల ఉన్న అడుగు ఎత్తు భాగాన్ని ఎగిరిపోతే ఆ వలను దాటిపోగలవు. మనము గుణములు మూడు భాగాలుగా ఉన్నాయి ఆ మూడు భాగాలను జయిస్తే, నాలుగో భాగములోకి పోగలము. అయితే కుందేలు వలలో చిక్కినట్లు మాయలో మనిషి చిక్కిపోయాడు. గుణముల దాటిపోకుండా గుణములలో దూరి అందులోనే ఉండిపోయాడు. నాలుగో స్థానంలోకి మనము వెళ్ళకుండా, సత్వ, రాజస, తామస గుణములలోనే ఉన్నాము. వాటియందు ఒక్కొక్క దానిలో ఆరుమంచివి, ఆరుచెడ్డవి అనే 12 గుణములు కలవు. ఈ పన్నెండు గుణాలను తామసగుణము అనే భాగం నుండి దాటితే, రాజస భాగంలో కూడా 12 గుణాలుంటాయి. అది దాటితే సాత్త్విక భాగంలో మరలా 12 గుణాలుంటాయి. అప్పుడు వాటినీ దాటితే 12×3=36 గుణాలను (గుణ విభాగాలను) దాటిపోతే నాలుగో భాగములోనికి వెళతాడు. అందులో ఆత్మ ఉంది, అదే దైవత్వం. అందుకే వేమనయోగి **“వాడు, వాడు, వాడు వాడుకాదు”** అనగా సాత్త్వికుడు, రాజసుడు, తామసుడు, ఆత్మను వాడుకాదు అనగా, ఆత్మ తామసుడు కాదు (వాడు), రాజసుడు కాదు (వాడు), సాత్త్వికుడు (వాడు) కాదు అని అర్థము. చూడండి, ఆ పద్యములో ఎంత పెద్ద జ్ఞానము ఉన్నదో!

ఆ విధముగా మూడు గుణ భాగాలలోనే మనము చిక్కుకొని ఆత్మస్థానానికి జీవాత్మలమైన మనము చేరటంలేదు. ఒకవేళ ఎవరైనా ఆ మార్గము గూర్చి చెప్పిననూ, దానితో మాకు అవసరము లేదు అనీ, నాకు తీరికలేదు అనీ అంటున్నాడు. ఉదాహరణకు నీవు ఒక వ్యక్తికి నాలుగు వస్తువులను ఇచ్చావనుకో, వాటితో వాడు వంటవండుకొని తింటున్నాడు. ఒక్క నిమిషం నా దగ్గర పని చేయరా అంటే నాకు తీరిక లేదు అంటాడు. అంటే నీ వస్తువులతో వంట వండుకొని తిని, నీ కోసం పని చేయమంటే, అదియూ కొద్ది సమయమే అని చెప్పినా తీరకలేదంటే, అప్పుడు నీవేమంటావు? నా వస్తువులు నీకెందుకివ్వాలి అని అనుకోవా? అప్పుడు ఆ వస్తువులను ఒకటి కూడా ఇవ్వక మానివేస్తావు కదా! అలాగే దేవుడు ఆ విధంగా చేయకపోయినా, దేవుని పరిపాలనలో ఉన్నవారు మాత్రము వదిలిపెట్టరు.

దీనిని గూర్చి భగవద్గీత, విజ్ఞానయోగములో....

శ్లో॥ 13. త్రిభిర్గుణమయైర్భావైరేభి సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥

ఈ ప్రపంచములో ఉన్న జగతి అంతా మూడు గుణాలలో చిక్కుకుని ఉన్నది. ఆ గుణాలలో ఐక్యమైపోయి, నాశనములేనటువంటి నన్ను గూర్చి తెలుసుకోలేకపోవుచున్నారు. ఈ గుణములనే మాయ అంటున్నాము. మరి ఈ గుణములను తయారు చేసిందెవరు? నేనే! అందులో చిక్కుకునేటట్లు చేసిందెవరు? నేనే! కానీ వాటిని దాటి రావల్సింది మాత్రము నా దగ్గరకే.

శ్లో॥ దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరన్తితే ॥

అనగా నేనే ఆ గుణములను తయారు చేసి పెట్టాను, ఆ గుణములను "మాయ" అంటాము. నేను తయారు చేసితిని కావున అది నా మాయే అందుకే భగవద్గీతలో 'మమ మాయా' అన్నాను. నా మాయను మీరు దాటాలంటే కష్టసాధ్యమే, దుస్సాధ్యమే మూడు రకముల వలలు వేశాము. ఏ విధంగా మీరు దాటగలరు? బ్రహ్మంగారు ఒక తత్త్వంలో చెప్పినారు, ఏమంటే.

**"దాటలేరన్న, ఇల మూఢ జనులు మూడు కాల్వలు దాటలేరన్న"** అంటే, ఎందుకు దాటలేము మూడేంటి, నాలుగైనా దాటగలము అంటే, అవి బయటకు కనిపించే కాల్వలు కావు. నీ శరీరములో కనిపించక ఉన్న తామస, రాజస, సాత్త్విక అనే గుణముల కాల్వలు అని అర్థము కాకపోతే అంతే! మరి మూడు గుణాలను దాటలేవని మీరే చేస్తే ఇక వినేదేముంది అని మీరంటారనే, దాటేదానికి అవకాశము ఉంది. **"మాయా మేతాం తరన్తితే'** మాయను దాటి తరించవచ్చు ఎప్పుడు అంటే **'మామేవయే ప్రపద్యంతే'** ఎవరైతే నన్ను ఆరాధిస్తాడో వాడే 'మాయా మేతాం తరన్తితే' మాయనుండి తప్పించుకోగలడు. కనుక మనం నిత్యం మాయలోనే పడి పనులు చేస్తున్నా, మాయ అంటే ఏమిటో తెలియకపోతే, మాయను ఎలా జయిస్తాము?

అసలు ఈ మాయ అంటే ఏమిటి? ఎక్కడుంటుంది? దీనిని దాటాలంటే ఎవరిని ఆశ్రయించాలి, దానివలన ప్రయోజనము ఏమిటి? అని తెలుసుకుంటే అప్పుడు సులభంగా మాయను జయించవచ్చును. దేవున్ని మర్చిపోతే ఏ విధంగా నీకు తెలియును? అని మేము ప్రశ్నించు చున్నాము. ఈ రోజు విజయదశమి, చూడండి ఎంతమంది అమ్మవారి దర్శనమునకు వెళ్ళారో, మనం మాత్రము ఇక్కడుండిపోయాము. మరి

www.thraithashakam.org

ఏది జ్ఞానము అంటే, బాహ్యంగా అదే జ్ఞానంగా కనిపించవచ్చుగానీ వారు దేవున్ని ఆరాధించటం లేదు. దేవుడు అనే భ్రమతో వేరే వారిని పెట్టిరి. ఆ విధముగా అసలైన దేవున్ని వదలి అందరినీ దేవుళ్ళుగా మ్రొక్కటం మొదలుపెట్టారు.

దేవుడు పురుషుడు కదా! మరి స్త్రీని ఎట్లా పూజిస్తున్నారు? స్త్రీని పూజిస్తే దానికి ప్రతి రూపమైన మాయకు పూజించినట్లే కదా! మాయ అనినా, ప్రకృతి అనినా, ప్రకృతితో పుట్టిన గుణములన్నా అన్నీ ఒకటే అర్థము. మరీ స్త్రీ ఆకారాన్ని పెట్టి పూజిస్తే ఏమవుతుంది? మాయారాధనే అగును. కనుక పురుషుడైన దేవున్ని మరచి, నానారకాల పూజలు చేస్తున్నాము. నానా రకాల యజ్ఞాలు చేస్తున్నాము. కానీ ఇవన్నీ సరైన పద్ధతులా దేవుడు ఎక్కడా ఈ పద్ధతులను అంగీకరించలేదు. ఇవన్నీ మాయా పద్ధతులే అగును. కనుక మాయలో ఉండి, గుణములతో నిత్యం పనిచేసే వాడిని మనము ఏమంటాము **"మాయకుడు".** అంటే మాయతో కూడుకున్న వాడని అర్థము. లేదు మాయ మనకొద్దు, గుణములు పని చేసినా, ఎవరు చేయిస్తున్నారో, అది తెలుసుకుని, దైవత్వం ఇటువంటిదని తెలుసుకొని, మాయకు అతీతముగా ఉండే శక్తిని తెలుసుకొని నీవు పనులు చేస్తే నీకు సంబంధము ఉండదు. అందుకే భగవద్గీతలో, ఆత్మ సంయమ యోగములో...

శ్లో॥ 1. అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతియః ।
స సన్న్యాసీ చ యోగీ చ ననిరగ్ని ర్న చాక్రియః ॥

ససన్యాసీచ, యోగీచ అంటాడు. అంటే నీవు పనులు చేయటం మానవద్దు కానీ, ఫలితము గూర్చి ఆలోచించకుండా పనిచేయి. అహంకారం

విడిచిపెట్టి నీవు పనిచేస్తే, నీకు కర్మ అంటదు. అప్పుడు నీవు నిజమైన సన్న్యాసివి, యోగివి కాగలవు అన్నాడు. ఆ విధముగా గుణములకు అతీతుడై, మాయను జయించి పనులు చేస్తున్న వ్యక్తిని మనం ఏమనాలంటే **"అమాయకుడు"** అనవలెను. కానీ అమాయకుడు అని ఇప్పుడు ఎవరిని అంటున్నాము? ప్రపంచములో ఉండే బుద్ధి తక్కువ వారిని అమాయకులు అంటున్నాము. ప్రపంచములో ఇరుక్కొని బాగా పనిచేసేవాన్ని ఏమంటున్నాము? చాలా తెలివైనవాడు అని అంటున్నాము. ఇప్పుడు మాట్లాడేదంతా వ్యతిరేఖముగా ఉంది కదా! అంటే అమాయకుడు అనగా నిజమైన యోగి అని అర్థము. మాయకుడు అనగా కర్మలను తగిలించుకుని పనులచేత గుణములలో ఇరుక్కున్నవాడు. ఇలా గుణములలో ఉన్నవాడు, గుణములలో లేనివాడు అని రెండు విధములు కలవు అని చెప్పుకొన వచ్చును.

మరి మీరంతా అమాయకులా, కాదా! మరలా అనుమానము వస్తున్నదా, అయితే మీరు వింటున్నారో లేదో తెలియకపోయినా నేను చెప్పుచున్నాను చూడండి. కనుక నేనే నిజమైన పెద్ద అమాయకుడను. కనుక మీకు రోగము ఉంది, మేము జ్ఞానము అనే ఔషధమును పోస్తున్నాము. మరి దానిని ఉమ్మివేస్తారో, నోరు మూసుకుని లోపల ఉంచి, ఆ రోగము తగ్గేటట్లు చేసుకుంటారో మీ ఇష్టం. మేము పెద్ద అమాయకులము, కనుక మేము చెప్పే జ్ఞానమును విని ఆచరిస్తే మీరు కూడా చిన్న అమాయకులై, తర్వాత పెద్ద అమాయకులు కావచ్చు.

ఇటువంటి బాహ్యార్థంగా దైవజ్ఞానమునకు వ్యతిరేఖముగా వాడే మరొక పదమును తీసుకుందాము. అదేమంటే పరాయివాడు, తనవాడు అని అంటుంటాము. కానీ పర, తన మాటలలో 'పర' అనే పదాన్ని

www.thraithashakam.org

తీసుకుంటే అర్థమేమంటే “వేరు వాడు”. కానీ మనకు సాధారణమైన మాటల్లో మనకు ఏమి అలవాటయ్యిందంటే, పర అంటే వేరు అని తెలిసినాగానీ, పరమాత్మ అంటే ఆత్మకంటే వేరుగా ఉన్నవాడు అని తెలిసినాగానీ, పరలోకం అంటే వేరే లోకము అని తెలిసినాగానీ, దేవుడు చాలా ‘ధర్మపరుడు’ అని అంటున్నాము. ధర్మపరుడు అంటే ధర్మమునకు వేరుగా ఉండేవాడు, అంటే ధర్మాలు అతనివద్ద లేవనే కదా! అర్థము. ప్రపంచములో ఒక అజ్ఞాని ఉన్నాడనుకుందాము. అతన్ని అధర్మపరుడు అని అంటున్నారు. అంటే అధర్మాలకు వేరుగా ఉండేవాడు. అనగా నిజమైన ధర్మాలను తెలిసినవాడు అని అర్థము ఉంది. మరి మనము వాడే సందర్భము తప్పేకదా! అధర్మపరుడు అని ఎవరిని అనాలి, దేవున్ని అనవలెను. ధర్మపరుడు ఎవరు పూర్తి అజ్ఞాని ఎవరైతే ఉన్నారో వారిని అనాలి. అనగా ధర్మములకు ప్రక్కనున్నవాడు, వేరుగా ఉన్నవాడనే కదా! ఈ విధముగా మన భాషలో, జ్ఞానము అనేది అర్థము కాకుండా పోయినదానివలన, ఎవరిని ధర్మపరుడనాలో, ఎవరిని అధర్మపరుడనాలో తెలియకుండా పోయింది. కనుక బయట యజ్ఞాలు, యాగాలు చేసేవారెవరైనా వారంతా ధర్మపరులే అంటే ధర్మాలకు దూరంగా ఉన్నవారే! కనుక ఎవరు జ్ఞాని, ఎవరు అజ్ఞాని అని తెలుసుకునేందుకు అవకాశము లేదు. కానీ ఒక వ్యక్తి మాట్లాడే మాటలలోనైనా అతడు జ్ఞానా, అజ్ఞానా అని తెలుసుకోవచ్చా అంటే, ఆ సమర్థత కూడా లేదు. బయట వేషమునే పరిగణించి ఒక వ్యక్తిని జ్ఞానిగా లెక్కించుదురు.

కనుక దైవత్వం గురించి తెలియాలంటే ముందు మాయ గురించి తెలియవలెను. అప్పుడు సులభముగా దేవున్ని గురించి తెలియును. కొంతమంది మాయజోలికే వెళ్ళవద్దు అంటుంటారు. మాయ గురించి

www.thraithashakam.org

నీకు తెలియకపోతే దైవత్వం గురించి ఏమి తెలుసుకుంటావు? మాయను దూరంగా పెట్టుకో అంటే అదేదో తెలిస్తే కదా దూరంగా పెట్టుకునేది, ఇంతకు ముందు మేము చెప్పాము బ్రహ్మయోగము చేయవలెనన్న మనస్సును జయించాలి, కర్మయోగము చేయాలంటే అహమును జయించాలి (అహం లేకుండా చేసుకోవాలి). జయించాలంటే ఏమి చేయవలెను? వారిని ఓడించాలి. ఓడించాలంటే ఏమి చేయాలి? యుద్ధం చేయవలెను? మరి వారెవరో తెలియకుండా యుద్ధం ఏ విధముగా ఎవరితో చేయుదువు? వారితో యుద్ధం చేయాలంటే ఏమి చేయవలెను? వారు ఎక్కడుంటారో తెలియవలెను, వారిని ఎదురుగా వెళ్ళి కొట్టగలమా లేక వెనుకనుండైనా కొట్టగలమా? లేదా వారు నిద్రపోయినప్పుడైనా కొట్టగలమా? ఆలోచించి మరి ఏదో ఒక ఉపాయముతో వారిని ఓడించాలి. ఈ విధముగా ఒక శత్రువును ఓడించాలన్న ఎంతో ఆలోచించి వాడిపై దాడిచేస్తాము కదా! అట్లాగే మన శరీరములో 36 గుణ విభాగములుగా ఉన్న మాయను ఓడిస్తేనే మనము అవతలకు వెళ్ళగలము. కనుక మాయ అనే దానిని గూర్చి సంపూర్ణముగా తెలుసుకొని, ఆ మాయ అనేది ఎక్కడో లేదు అది మన తలలోనే ఉందని తెలుసుకుని, జయించాలనే విషయం మనకు తెలిస్తే, మనము సులభంగా దైవత్వం గురించి తెలుసుకోవచ్చును.

ఈ విధముగా మాయను జయించిన వ్యక్తి జ్ఞానవరంగా **'అమాయకుడు'** అగును. గుణాలను జయించకుండా, గుణాలు అంటే కూడా తెలియకుండా అందులోనే ఉండిపోయినవాడిని **"మాయకుడు"** అని అనవలెను. మరి మాయను దేవుడే తయారు చేశాడు కదా! మరి మాయ ఎంత పెద్దది? అంటే నీకంటే పెద్దది అని చెప్పవచ్చును. ఎంత పెద్దది అంటే నూరింతలు పెద్దదా అంటే కాదు నూరుకంటే వేయి రెట్లు పెద్దది.

వేయివంతులు కాదు, ఇంకా లక్షవంతులు పెద్దది. కాదు దానికంటే పెద్దది కోటివంతులు పెద్దది. అందుకే అతను "కూటికొరకు కోటివిద్యలు" అన్నాడు.

మన శరీరములో రెండు రకములయిన యజ్ఞములు జరుగుచున్నవి. ఒకటి ద్రవ్యయజ్ఞము, రెండవది జ్ఞానయజ్ఞము అని చెప్పాడు. అందుకే భగవద్గీతలో... "శ్రేయోహి ద్రవ్యమయీ యజ్ఞాత్, జ్ఞానయజ్ఞం పరంతప" అనగా **"ఈ ద్రవ్యయజ్ఞంకంటే జ్ఞానయజ్ఞం శ్రేష్టమైనది అర్జునా"** అన్నాడు శ్రీకృష్ణుడు. ఎందుకు జ్ఞానయజ్ఞం శ్రేష్టమైనది. మన శరీరములో జఠరాగ్ని ద్వారా ఆహారమును జీర్ణము చేస్తే, అది ద్రవ్యయజ్ఞం. ఈ ద్రవ్యయజ్ఞం వలన ఏమి వస్తున్నది? కనిపించని ఫలితములైన పాప, పుణ్యములు రెండూ వస్తున్నవి. ఎందుకంటే ఆ ఆహారాన్ని సంపాదించేందుకు చాలా రకములైన పనులు చేయవలసి వచ్చును కదా! కనుకనే "కూటికొరకు కోటి విద్యలు" అన్నారు. మరి కనిపించని పాపపుణ్యములు రెండునూ మరి దేనివలన పోవునంటే, జ్ఞానయజ్ఞం వలన పోవును. కానీ ప్రతీరోజు మనము ద్రవ్య యజ్ఞ చేయుచున్నామా, జ్ఞానయజ్ఞము చేయుచున్నామా? అంటే ద్రవ్యయజ్ఞమే చేయుచున్నాము. అంటే పాప, పుణ్యములను సంపాదించుకునే ద్రవ్యయజ్ఞమే చేస్తున్నామన్నమాట! వాస్తవముగా మీరే లెక్కకట్టుకోండి. ద్రవ్యయజ్ఞాన్ని పుట్టిన ప్రతీ జీవీ చేయుచున్నది. మనము మరి జ్ఞాన యజ్ఞమును ఏ విధముగా చేయవలెను? అది బయటకు కనిపించే బాహ్యా యజ్ఞముగా భగవంతుడైన శ్రీకృష్ణుడు చెప్పలేదు. కానీ తలలో జ్ఞానయజ్ఞం చేయమన్నాడు. కనుక దీనిని ఏ విధముగా చేయవలెనన్న విషయములో మనము చిక్కుకుని ఉన్నాము, కనుక నీవు జ్ఞానయజ్ఞం చేసి బయటపడు అని దేవుడు చెప్పాడు. మాయ నీకంటే ఎంత గొప్పదంటే కోటిరెట్లు గొప్పది అని. "కూటికొరకు కోటి విద్యలు" అనే వాక్యమును అనుసరిస్తే

తెలుస్తున్నది కదా! మరి అటువంటి **మాయను నీవు దాటాలంటే, నన్నే ఆరాధించాలి, నన్నే స్మరించాలి, నన్నే తెలుసుకోవాలి.** అప్పుడు నిన్ను నేను ఆ మాయ నుండి దాటింపచేయగలను అన్నాడు. కనుక దేవుడు చెప్పిన ఉపాయమిది. కనుక దైవజ్ఞానమును మనము తెలుసుకోవాలి. అనగా ముందుగా దేవుని పరిపాలనా విధానము తెలిసి ఉండవలెను. దేవుని పరిపాలన ఎక్కడుందంటే మాయ సామ్రాజ్యములో ఉన్నది.

మానవుడు ఇవేమీ తెలుసుకునే ప్రయత్నం చేయకుండా, అన్నీ నేనే చేస్తున్నానని తనమీద వేసుకుంటున్నాడు, తద్వారా దేవుడు లేనేలేడు అని బాగా ప్రపంచ చదువులు చదువుకున్నవారు అంటుంటే, మరి దైవత్వం గురించి తెలిసేదెలాగ అని ఇంజనీర్‌గానున్న ఒకాయన, ఇంకొకవ్యక్తికి **"దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు"** అనే గ్రంథాన్ని ఇచ్చి చదవమంటే, ఏమయ్యా! ఇంజనీరింగ్ చదివి, ఈ కాలంలో దెయ్యాలు భూతాలు ఉన్నాయంటే ఏమనుకోవాలి? ఎంతటి అమాయకులు మీరు? అన్నాడట. వాస్తవం తెలియని స్థితి వారిది. ఈ విధముగా వారు "అమాయకులు" అన్న పదములో వాస్తవ అర్థము ప్రకారము మనల్ని వారు పొగిడినట్లే! వారి అర్థము ప్రకారము మనల్ని తిట్టినట్లు. మీకు చైతన్యం రావాలి అంటూ ఆ వ్యక్తి, "ఈ సెల్‌ఫోన్‌లో మాట్లాడుచున్నామంటే సాంకేతికత ఎంత అభివృద్ధి చెందిందో చూడు" అన్నాడట సైన్స్ అభివృద్ధి చెందలేదని ఎవరన్నారు? ఇంకా అభివృద్ధి చెందాలని మేము అంటున్నాము.

ఈ మధ్య టీవీలో ఒక వార్తలో చెప్పుచున్నారు. అది ఏమంటే యాభైకేజీల మంచు గడ్డ ఆకాశము నుండి క్రిందపడిందట. మరి అంత బరువున్న మంచుగడ్డ క్రిందపడితే పడిన ప్రదేశము ఏమవనవలెను? పడిన మంచుగడ్డ కూడా తునాతునకలై పోవలెను కదా! మరి ఆ మంచుగడ్డ

అలా కాకుండా ఎవరో తెచ్చిపెట్టినట్లు ఉన్నది. క్రింద ఉన్న జీవరాశులు పైకి పోయినా సజీవముగానే ఉంటాయి, కానీ స్థూలముగా కనిపించవు. ఏ మంత్రగాడు అక్కడున్నాడు కనపడకుండా చేసేందుకు? ఎంతపెద్ద ఫ్రిజ్ ఉంది, అంతపెద్ద మంచుగడ్డ వచ్చేందుకు. ఈ ప్రశ్నలకు మీ దగ్గర జవాబులేదు. సైన్స్ అభివృద్ధి చెందలేదు అని మేము అనడము లేదు. ఇంకా అభివృద్ధి చెందాల్సివుంది అని మాత్రమే మేము చెప్పుచున్నాము.

కనుక ఇంతకు ముందే మేము చెప్పాము. ప్రపంచములో ఐదు శాస్త్రములు **'గణిత, ఖగోళ, రసాయన, భౌతిక, జ్యోతిష్య'** శాస్త్రములు అంసపూర్ణములు. ఒక్క ఆరవ శాస్త్రమైన బ్రహ్మవిద్యాశాస్త్రము సంపూర్ణమైన శాస్త్రము. ఇప్పుడు నేను మైక్‌లో మాట్లాడుచున్నాను అంటే మీకు శబ్దం వినిపిస్తూ ఉంది, అంతే ఇంకా మీకు దీని గురించి తెలియాల్సి ఉంది. ఇప్పుడు మీకు ఒక యదార్థ సంఘటనను వివరిస్తాను. ఒక ఇంట్లో గ్యాస్ పొయ్యి వెలిగించాలని గ్యాస్‌పైప్‌ను ఓపెన్ చేసి, ఏదో పనిమీద దానిని వెలిగించక మరచిపోయి వదిలేశారు. ఆ ఇంటికి కిటికీలు మూసివేయటంతో రూమంతా గ్యాస్‌తో నిండిఉందన్నమాట. బయట కూర్చున్న వారికి గ్యాస్‌వాసన వచ్చి తెలిసింది. దానితో పాటు 700 కిలోమీటర్ల దూరములో ఉన్న వ్యక్తికి ఈ వాసన వెళ్ళిందట. మరి అక్కడికి ఆ వాసన ఏ విధముగా వెళ్ళింది? ఎలా వెళ్ళింది? అని మేము ప్రశ్నించుచున్నాము. సైన్స్ ద్వారా చెప్పండి చూద్దాము.

మరి అలాగే స్వైన్‌ఫ్లూలాంటి వ్యాధులు వస్తున్నాయి అంటున్నారు. ఇంతకుముందు లేని క్రిమి ఇప్పుడు ఎక్కడనుండి వచ్చిందో చెప్పవచ్చు కదా! మరి మీరే చెప్పుచున్నారు కదా! తల్లి తండ్రి ఉంటేనే జీవము పుట్టును అని తల్లి తండ్రి లేకుండా అమీబా క్రిమి ఎలా పుట్టిందో జవాబు చెప్పగలరా?

కనుక సైన్స్ జవాబులు చెప్పలేనివి కొన్ని విషయములు కలవు. సైన్స్ చెప్పలేని విషయములకు బ్రహ్మవిద్యాశాస్త్రము జవాబు చెప్పగలదు. ఇప్పుడు బ్రహ్మవిద్యా శాస్త్రమును తెలుసుకుంటే మిగతా ఐదు శాస్త్రములు సులభమగును. కనుక అన్నింటికీ దైవమే శరణ్యము. తద్వారా ఎన్నో ప్రశ్నలకు జవాబులు దొరకగలవు. అదే విధముగా 'జాపథకము' అనేది 'జాతకము'గా మారింది అని మేమే చెప్పితిమికానీ ఇంతవరకు ఎవ్వరూ ఆ విధంగా చెప్పలేదు కదా! మరి బ్రహ్మవిద్యాశాస్త్రము తెలియటం వలన మాత్రమే మేము జ్యోతిష్యశాస్త్రము గురించి చెప్పగలుగుచున్నాము. కనుక మీరు కూడా బ్రహ్మవిద్యాశాస్త్రాన్ని నేర్చుకునే, ప్రయత్నము చేస్తారని ఆశిస్తున్నాము.

## 39. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు

తేది : 21-11-2010

ప్రస్తుతము దేవుడు, దేవతలు రెండూ ఒకటే అనే అర్థముతో భావిస్తున్నవారు చాలామంది ఉన్నారు. కానీ మేము మొదట్నుంచీ చెప్పుచున్నదేమంటే దేవుడు వేరు, దేవతలు వేరు. దేవుడు అనే పదానికి వ్యతిరేఖ పదము దెయ్యము. దేవతలకు వ్యతిరేఖము రాక్షసులు అగును. ఇప్పుడు దేవతలు, దేవుడు వేరువేరని అర్థమయినది కదా! దెయ్యము, రాక్షసులు వేరువేరని మనకు అర్థమవుతున్నది. మనందరికీ దేవుడు ప్రత్యేకమైనవాడు అని తెలుసు. దేవునికి పేరు లేదు, దేవుడు అంటే వెతకబడేవాడు అని తెలుసుకున్నాము. దేవునికి పెద్ద అనేదే పేరు. సందర్భము వచ్చినది కావున ఒక విషయమును చెప్పదల్చుకున్నాము. నాకు

మా తల్లితండ్రులు పెట్టిన పేరు పెద్దన్న. ఆ పేరు కొన్నేళ్ళు చెలామణి అయినది. గురువుగా మారిన తరువాత మన ఇ(హి)ందూ సాంప్రదాయము లలో పేరు మారిపోతుంది. అంటే గురువును తండ్రిగా భావించుకుని, వారికి పుట్టిన బిడ్డగా భావించి క్రొత్తపేరు మరలా పెట్టుదురు. కనుక మా తల్లిదండ్రులు మాకు పెట్టిన పేరు పెద్దన్న, గురువు పెట్టిన పేరేమంటే **'ప్రబోధానంద'.** తరువాత రేషన్‌కార్డు వ్రాయటం కొరకు కొందరు వచ్చారు. నా పేరు పెద్దన్నగా వ్రాసుకుని, కులం పేరు దగ్గర మాదిగ అని వ్రాసినారు. అదేమిటి, కులంపేరు అసలు అడగనే లేదు, మీరే వ్రాసేసినారు అని అడిగితే "పెద్దన్న పేరుగల వారందరూ మాదిగలే ఉంటాడు" అని వారన్నారు. పోనీ! మా తల్లి దండ్రులు, తెలివి తక్కువకో, తెలివి ఎక్కువకో ఆ పేరు పెట్టినారు కనుక అలాగే ఉండనీలే అని చెప్పాము. అయితే ఈ పేరును నాకెందుకు పెట్టినారంటే, మా పెద్దలు పెద్దమ్మ అనే ఆడదేవతను పూజించేవారు. అందువలన నాకు ఆ దేవత పేరు పెట్టుకోవాలనే ఉద్దేశ్యముతో పెద్దన్న అని పేరు పెట్టారు. మొట్టమొదట మరి పెద్దమ్మ అనే దేవత ఉందా అంటే, మొట్టమొదట ఆ దేవత కల్పించబడింది. తరువాత అది దేవతగా అందరికంటే పెద్ద దేవుడు, అని స్త్రీవాచకముతో చెప్పాలంటే పెద్దమ్మ అని, పురుషవాచకముతో చెప్పాలంటే పెద్దన్న అని, పరమాత్మను కొన్నిసార్లు పులింగముగా చెప్పవచ్చును, కొన్నిసార్లు స్త్రీలింగముగా చెప్పవచ్చును. దేవున్ని రెండు రకములుగా చెప్పుకునే విధానము ఉంది కావున, అటువంటి విధానములో దేవున్ని స్త్రీగాను, పురుషునిగానూ కూడా చెప్పవచ్చును కనుక పెద్దమ్మ అని పేరు పెట్టారు. పెద్ద అనగానేమి? దేవుడు. దేవున్ని పురుషుడు అని చెప్పుటకు వీలులేదు, స్త్రీ అని చెప్పుటకు వీలుపడదు. కావున రెండు రకములుగా అతనిని పిలవటం మొదలుపెట్టారు. ఆ విధంగా

www.thraithashakam.org

పెద్దమ్మ  అని పేరుపెట్టి, మరలా దేవున్ని స్త్రీ అని అనుకుంటారేమో అని ఆ పెద్దమ్మకు మీసాలు పెట్టారు, కోరలు పెట్టారు.  మీసాలు, కోరలు ఎవరికి ఉంటాయి, పురుషునకే ఉంటాయి.  కావున సందర్భానుసారము స్త్రీగా చెప్పవచ్చును, పురుషునిగా కూడా చెప్పుటకు అవకాశము కలదు. ఆ విధంగా దేవునికి మారుగా ఉన్న పెద్దమ్మ పేరు తరువాత దేవతలకు పెట్టినారు.  వారు  ఆ విధంగా పిలువబడటం వలన, దేవునికే ఆ పేరు ఉందన్న విషయము తరువాత తరాలవారికి తెలియకుండా పోయింది. ఈ దేవతలే ఆ పేర్లతో చెలామణి అగుచున్నారు.  రాముడు అనేవాడు లేక పూర్వమే 'రామ' అనే పేరు కలదు.   ఆ పదాన్ని మనము మార్చుకుని రాముడు అని ఒక వ్యక్తికి పేరుపెట్టుకున్నాము.  పెట్టుకున్నంత మాత్రాన ఆ వ్యక్తినుండే  ఆ పేరు వచ్చింది అనుకోవటం పొరపాటు.  అదే విధంగా పెద్దమ్మ అనే పేరు, దేవతకు పెట్టుకోవచ్చునేమో గానీ  అది దేవుని హోదాను చూపు పదము.

అదే విధానాన్ని తెలియజెప్పుటకు మేము వ్రాయు గ్రంథములలో పరమాత్మను ఉద్దేశించి కొన్నిసార్లు స్త్రీవాచకముతో అది, ఇది అని చెప్పుచుంటాము.  కనుక దేవతలకు, రాక్షసులకు అతీతమైన వాడు దేవుడు. అతనికి వ్యతిరేక పదము దెయ్యము.  అనగా దేవుడు, దెయ్యము అని రెండు విధానాలు గలవు.  ఆ పద్ధతిలో మనము ఆలోచిస్తే మనము దేవున్ని ఆరాధిస్తున్నామా? దేవతల్ని ఆరాధిసున్నామా? అని మనము వెనక్కి తిరిగి చూసుకుంటే, ప్రపంచములో నూటికి నూరుపాళ్ళు దేవతలనే ఆరాధిస్తున్నారు. దేవున్ని ఆరాధించటం లేదు.  దేవతలని కాకుండా ఇంకెవరినైనా ఏదైనా ఆరాధిసున్నారంటే దెయ్యాలను ఆరాధిస్తున్నారు.  పూర్తిగా దేవున్ని వదలివేశారు.  దేవుడంటే ఎవరు? అనే విధానము కూడా తెలియకుండా

పోయింది. దేవుని గురించి చెప్పినా, ఇదంతా తెలివితక్కువ వారు మాట్లాడే విధానమని, అది మూఢనమ్మకమని అనేవారూ ఉన్నారు. పాతకాలంలో మాట్లాడే మాటలు తప్ప, నవీనకాలములో దేవుడు అనేమాట లేనే లేదని అంటున్నారు. దేవుడులేడు అనేవారికిగానీ, దేవుని విధానము తెలియనివారికి గానీ మేము ప్రశ్నిస్తున్నదేమంటే, ప్రతి మనిషీ అన్నీ నేనే చేస్తున్నానని, చేస్తున్న పనులన్నింటికీ నేనే కారణమనీ, దేవుడేమీ చేయటం లేదు, మనుషులే అన్నీ చేస్తున్నారని, సైన్స్ అభివృద్ధి చెందిన దానివలన అన్నీ మనిషే కనుక్కొని, సౌకర్యవంతమైన సాధనాలు కనిపెట్టి, సుఖంగా ఉంటున్నామని వారు చెప్పుచున్నారు. ఈ విధముగా బాగా చదువుకున్న వారు ఉంటే, ఇక సాధారణ జీవనాన్ని సాగిస్తున్నవారంతా అన్నీ మేమే చేస్తున్నామని అనుకుంటున్నారు. అదే విధముగా ఏదో పండుగరోజు ఒక గుడికి పోయి అదే దేవుడని మ్రొక్కుచున్నవారు, ఆ గుడిలో ఉన్నది దేవుడా కాదా అని యోచించక అదే దేవుడని మ్రొక్కుచున్నారు. ఈ విధముగా మనిషి ఎందుకనుకుంటున్నాడంటే, పుట్టినప్పటినుండి అదే అలవాటయింది కనుక. మధ్యలో మనమిప్పుడు జ్ఞానము తెలుసుకోండి, దేవుడనేవాడు ఎటువంటి వాడో తెలుసుకోండి, అని చెప్పుచున్నాము. కానీ అనుభవరీత్యా చిన్నప్పటి నుండీ చేయుచున్న దానికే విలువుంటుంది కానీ మధ్యలో నెలకో, పదిహేను రోజులకో చెప్పుచున్న మా జ్ఞానానికి విలువుండదు. దేవుడు అనేవాడు మూడు భాగములుగా విభజించబడి ఉన్నాడు. జీవాత్మయైన నీవు ఒక భాగంగా, ఆత్మ అనేది రెండవ భాగంగా, అంటే నీవెక్కడుంటావో, నీతో పాటు ఉండేది, రెండవ ఆత్మ. మూడవ భాగము అణువణువునా వ్యాపించి ఉండేది అదే పరమాత్మ. ఈ విధంగా ఆత్మ, జీవాత్మలు జోడాత్మలుగా ఉన్నాయని, హస్తములో రెండు రేఖలకొనలు కలిసి ఉండునట్లు పెట్టబడినది.

www.thraithashakam.org

వాస్తవముగా ఎవరికీ ఈ విషయము తెలియదు. నువ్వెవరు? అంటే జీవాత్మను అని తెలియక పోయినా పేరు ఒకటినున్నది అని మాత్రము తెలుసు. కానీ నీ శరీరములో రెండవ ఆత్మ ఒకటి ఉన్నదని మాత్రము తెలియదు. అయితే మీరు చెప్తే సరిపోతుందా, రెండవ ఆత్మ మా శరీరములో ఉన్నదని మాకెట్లు తెలుస్తుంది? అనగా మన శరీరములో రెండవదిగా ఆత్మ అనేది, జీవాత్మవైన నీతో ఉన్నదన్న విషయము తెలిసే విధంగా పరిశోధన చేయాలంటే, శరీరము లోపలే ఈ పరిశోధన చేయవలెను. మన శరీరములో కాళ్ళు, చేతులు అవయవాలన్నీ ఉన్నాయి. ఈ విషయాన్ని మన శరీర రూపములోనే అర్థము చేసుకోవాలి కనుక ఇది చెప్పాల్సి వస్తున్నది. మన చేతులు కదిలిస్తే కదులుచున్నవి. కాళ్ళు కదిలిస్తే కదులుచున్నవి. అదే విధంగా నీ శరీరములో కండరాలు కదులుచున్నాయి. ఆ కండరాలు నీకు తెలిసి కొన్ని కండరాలు కదులుచున్నవి కనుక, ఇవన్నీ నేనే కదల్చుచున్నాను అని అనుకుంటున్నారు. నీవు ఇక్కడనుండి అక్కడకు పరుగెత్తాలి, పరుగెత్తే యోచనవస్తుంది. పరిగెత్తుదువు. నేను అనుకుంటే కదా పరిగెత్తాను అని ప్రతి మనిషి అనుకుంటున్నాడు. కానీ వాస్తవంగా జీవాత్మ అనేవాడు ఏ పనినీ చేయలేనటువంటివాడు, కానీ ఆ ఆలోచన నీకు తెలుస్తున్నది, పరిగెత్తేది. తెలుస్తున్న దానివలన అన్నీ నేను చేస్తున్నానని మనుష్యులంతా అనుకుంటున్నారు. లోపల పరుగెత్తాలని ముందే నిర్ణయం ఉండును. చిన్నపనైనా, పెద్దపనైనా ఆ పని జరగటానికి కావలసినది ముందే నమోదయి ఉన్నది. కానీ లోపల బుద్ధి చేసే పనిని, మనస్సు చేసే పనిని, చిత్తం చేసే పనినీ నీవే చేశాను అని అనుకోవటం వలన, నేనే నిర్ణయం తీసుకున్నాను, నేనే పరుగెత్తగల్గుతున్నాను అని మనిషి అనుకుంటున్నాడు. ఒక్క విషయం మాత్రము వాస్తవము. ఏమంటే జీవాత్మవైన నీకు అన్ని

విషయములు తెలుస్తున్నవి, అంతే నీ పాత్ర. ఆ విధంగా తెలుసుకోవటం అనే శక్తి మాత్రమే ఉందిగానీ, ఏ పనినీ జీవాత్మలుగా ఉన్న మనుష్యులు ఆ ఒక్క పని తప్ప ఏమీ చేయటం లేదన్న విషయం తెలియకపోవటమే పెద్ద సమస్యయింది. ఇప్పుడు ఒక సినిమాను ఉదాహరణగా తీసుకుందాము. ఒక సినిమాలో కథానాయకి నిద్రిస్తుండగా మెడలో ఆమెకు ఎవరో తాళికట్టారు. ఆమె నిద్రనుండి లేచి చూచేసరికి మెడలో తాళి ఉన్నది. అప్పుడామెకు ఈ తాళికట్టినా దాన్ని త్రెంచమని ఒక బొమ్మచెప్తూ ఉన్నట్లు, రెండవ బొమ్మ ఈ తాళిని ఎవరు కట్టినా తాళి తాళే కావున త్రెంచవద్దు అని చెప్పును. మధ్యలో ఈమె వింటూ ఉంటుంది. అప్పుడు ఏదో ఒక నిర్ణయం జరుగుతుంది. త్రెంచవద్దనో, త్రెంచేయమనో ఏదో ఒక నిర్ణయం అమలు జరుగును. వ్యాపారంలో ఒక వ్యక్తికి నష్టం వస్తే ఏమి చెయ్యాలనుకుంటుంటే ఈ పని చేయు, ఈ పని చేయకు అని నీకు లోపలున్న బుద్ధి చెప్తూ ఉంటుంది. నీవద్ద ధనంలేదు. ధనం ఉన్న వ్యక్తి ప్రక్కనే నిద్రపోతున్నాడు. ఆయన దగ్గర ఉన్న డబ్బును దోచుకోమని ఒక ప్రక్క ఆలోచన వస్తూంటే, వద్దు ఆ పని చేయకు అని లోపలున్న బుద్ధి చెప్తూ ఉంటుంది. ప్రక్కనే మరలా ఏమీకాదు తీసుకో అని కూడా అదే బుద్ధి చెప్తూ ఉంటుంది. రెండు విధాలుగా లోపల బుద్ధితో చర్చ జరుగుతూ ఉండును. దానిని లోపలున్న చిత్తం నిర్ణయిస్తుంది. చిత్తం నిర్ణయించిన పనిని ఆదేశంగా బయటకు వస్తే ఆ పని జరుగుతూ ఉండును. కాని బుద్ధి చేసే పనిని నీవే చేశాననుకుంటున్నావు. చిత్తము చేసే పనిని నేనే చేశాననుకుంటున్నావు. లోపల గుణములిచ్చిన యోచనను కూడా నీవే చేశాననుకుంటున్నావు. ఈ విధంగా "నేనే చేశాను" అనే భావన నీకు వస్తున్నది. ఇవే కాకుండా జీవాత్మవైన నీ ప్రక్కనే (శిరస్సులో) అహము

అనేది ఒకటున్నది. వీటన్నంటికీ నీవే కారణము, నీవే చేసితివని అది చెప్తూ ఉన్నది. దుర్యోధనుని వెనుక శకునిలాగా, అంటే శకుని దుర్యోధనునికి మంచిగా మాట్లాడుతూనే అపకారము చేసేవాడు. ఆ విధంగా అహం అనేది నీ శరీరములో ఉండి, నిర్ణయం నీదే, ఆలోచన నీదే, నీకొచ్చే ఆలోచన ప్రకారము నీవు పని చేయుచున్నావు ఇంకెవరున్నారు లోపల, అని ఈ విధముగా అహంభావము పొందినవాడివై అన్నీ నేనే చేస్తున్నాను అనుకుంటున్నావు. కనుక ఇవన్నీ నీకు తెలిసి జరుగుచున్న పనులవి. కనురెప్ప నేను అల్లాడిస్తే అల్లాడింది అంటున్నారు. ఈ పని నీకు తెలిసి జరుగుచున్న పని కనుక, అట్లానే అనుకోవడానికి అవకాశము ఉంది, అదే విధంగా చేతులు అల్లాడించటం, మాట్లాడటం అనేవికూడా ఆ విధంగానే లెక్కకు వచ్చును. కానీ నీకు తెలియక జరిగే పనులు చాలా ఉన్నాయి నీ శరీరములో వాటి గురించి నీవు ఏమాత్రము యోచన చేయలేదు. నాకు తెలియకుండా ఎందుకు జరుగుచున్నాయి? నా శరీరములో నాకు తెలియకుండా పనులెట్లు జరుగుచున్నాయి? ఈ విషయము గూర్చి ఎవ్వరూ ఏమాత్రము యోచన చేయటం లేదు. నీకు తెలిసి నీ శరీరంతో ఒక పని జరిగితే నువ్వే చేశానంటున్నావు. ఆ క్షణంలో ఒక పని జరగాలని నిర్ణయం ఉంది. నీవు బాత్రూమ్‌కి వెళ్ళి మూత్రవిసర్జన చేయాల్సి ఉంది. దానిప్రకారము కదిలి చేయాల్సి ఉంది, అదే జరుగుతుంది. దానికంటే ముందు మూత్రము వచ్చినట్లు తెలుస్తుంది వెళ్ళాలి అని తెలుస్తుంది, వెళ్తావు. బాత్రూమ్‌నుండి బయటకు వస్తావు. ఆ విషయము నీకు తెలిసి జరుగుచున్నది. కావున నీవే మూత్రవిసర్జన పనిని చేసానంటున్నావు. కానీ నీకు తెలియకుండా శరీరములో ఎన్నో పనులు జరుగుచున్నాయి. గుండెకొట్టుకుంటూ ఊపిరి తిత్తులు కదులుచూ ఉన్నాయి నీకు తెలుస్తున్నదా తెలియలేదు. వీటన్నంటినీ

అనిచ్ఛాదీన కార్యక్రమములు అంటాము. అంటే నీ అధీనంలో లేకుండా జరిగే పనులు అంటాము. ఒక రోగము నీ శరీరములో పది రోజులు అభివృద్ధి చెంది బయటకు ఒకరోజు వస్తే, ఫలానా రోగము వచ్చిందని తెలుస్తున్నది. మరి శరీరములో నీకు రోగం ఎందుకు వచ్చింది? నీకు తెలియకుండా వచ్చింది. మనిషి నాకీ ఆహారం కావాలి అనుకుంటున్నాడు. డబ్బులు ఖర్చుపెట్టి ఆహారాన్ని తెచ్చుకొని తింటున్నాడు, నా ఇష్టము, నా డబ్బులు ఖర్చుపెట్టి నేను తింటున్నాను అనుకుంటున్నాడు. ఆ విధంగా నీవు కొని, తినాలని వ్రాసిపెట్టబడి ఉంది కావున ఆ పని జరిగింది. కానీ నీవు ఆ వ్రాతను మరచిపోయావు. ఆ నిర్ణయాన్ని మరచిపోయావు. నేనే చేస్తున్నాను అని అనుకుంటున్నావు. కానీ లోపల మనస్సు, బుద్ధి, చిత్తము, అహముల యొక్క ప్రమేయం ఉండి గుణములను రేకిత్తుస్తున్నవి, కనుక ఇవి ఇచ్ఛాదీన కార్యములు. సరే జీర్ణాశయములోనికి పోయిన తరువాత జరిగే కార్యము అనిచ్ఛాదీన కార్యము, నీ ఇష్టం లేదు. నీకు తెలిసి జరుగవచ్చు, నీకు తెలియకుండా జరుగవచ్చు కానీ ఏ విధముగా జీర్ణమవు తున్నదో తెలియదు. నీ లోపలికి పోయిన తరువాత నీవు తుంచలేదు, రుబ్బలేదు, ఏమీ చేయలేదుగానీ, మెత్తగా తయారై జీర్ణమవు తున్నది. ఎవరు జీర్ణం చేస్తున్నారో తెలియదు. ఏ విధంగా జీర్ణం చేస్తున్నారో తెలియదు. జీర్ణం చేస్తున్నాడు కావున సరిపోతున్నది. ఒకరోజు జీర్ణం కాకుండా పోయిందనుకో, నీ శరీరమే కదా, నీ ఇష్టమే కదా, మరి ఆ వ్యవస్థ జరుగకుండా ఎందుకు వాయిదాపడింది? అజీర్ణం అవుతున్నది, బయటకు వస్తున్నది కదా! మరి నీ ప్రమేయం అందులో ఏమున్నట్లు? ఈ విధంగా నీ శరీరములో నీకు తెలియకుండా ఎన్నో కార్యములు జరుగుచున్నవి. కానీ ఆ విషయములను మాత్రము మనిషి యోచించటం లేదు. మన శరీరములో ఎన్నో కార్యములు మనకు తెలియకుండానే జరుగుచున్నవి.

www.thraithashakam.org

మరి మన శరీరములో ఉష్ణోగ్రత ఆ విధంగా హెచ్చుతగ్గులు లేకుండా అదే వేడి స్థిరీకరణ ఎవరు చేస్తున్నారు? నీవు చేయగలుగు చున్నావా? మనం ఊపిరి పీల్చుకున్నప్పుడు మన శరీరములోకి ప్రవేశించిన ఆక్సిజన్ (ప్రాణవాయువు) సమక్షములో ఆహారం మండును. ఆ మంట వలన నీకు శక్తితో శరీరమంతా వేడి ప్రవహించి, నీ శరీరములో ఉష్ణోగ్రత స్థిరంగా ఉంటున్నది. మరి ఈ విషయము నీకు తెలియకుండా జరుగు చున్నది. ఒక్కసారి ఉష్ణోగ్రత నీ శరీరములో ఎక్కువయిందనుకో, దానిని ఏమంటాము? జ్వరం అంటాము. ఉష్ణోగ్రత నీ శరీరంలో తగ్గిపోయింద నుకో శీతలం అంటాము. అదే విధంగా గుండె ఎక్కువగా కొట్టుకుంటే (బి.పి) ఎక్కువయింది అంటాము. గుండె తక్కువగా కొట్టుకుంటే బి.పి తక్కువయింది అంటాము. ఈ విధంగా లెక్కవేసుకుంటే ఎన్నో కార్యములు జరుగుచున్నవి. మరి వీటన్నింటికీ కారణమెవరు? నీ శరీరము మొత్తము నడిపించే వాడొకడున్నాడు శరీరము బయటగానీ, శరీరంలోపలగానీ నడిపించేవాడు అతనే, అతను ఆ విధముగా నడిపించేది కూడా కర్మనిర్ణయం ప్రకారమే. అతను కూడా స్వయంగా ఏమీ నడిపించ లేదు. కర్మనిర్ణయం ప్రకారమే నడిపిస్తున్నాడు. కానీ మనిషి తనకు తెలియక జరిగే పనులు శరీరములో జరుగుచున్నను, తెలిసి జరిగే పనులును మాత్రము తానే చేస్తున్నాను అనుకుంటున్నాడు. కావుననే పాప, పుణ్యములు మనిషికి తగులుకుంటున్నవి. తెలియక జరిగే పనులకు మన శరీరములో ఏ పాపము, పుణ్యములు అంటవు. ఆ విధంగా పాపపుణ్యములకు మనిషి తెలిసి చేసే పనులను సైతము కర్మప్రకారము లోపలున్న ఆత్మయే నడిపిస్తున్నప్పటికీ, నేనే చేస్తున్నాను అని అనుకోవటం వలన, ఆ పాపపుణ్యాలను మనుషి అనుభవిస్తున్నాడు.

www.thraithashakam.org

ఒక మనిషికి రోగమెందుకు వస్తున్నది? అది పాపము చేసుకుంటేనే వస్తున్నది. ఆ రోగమొచ్చి బాధపెట్టేది ఎవరు? లోపలున్న ఇంకొకరు. దేవుడు, ఆత్మ, జీవుడని ఇంతకు మునుపు మనము చెప్పుకున్నాము. ఇప్పుడు బాధపడేవాడు జీవుడు, బాధపెట్టేవాడు దేవుడా? కాదు, ఎందుకంటే ఆ విషయము చెప్పుటకు ఒక సిద్ధాంతము ఉన్నది. అదేమంటే దేవునికి పేరుగానీ, రూపంగానీ, పనిగానీ లేదు. ఏ పనీ చేయనివాడు నిన్నేందుకు బాధపెట్టును? మరి నీ విషయంలో ఏమీ జోక్యం చేసుకోడు. చేసుకునేది మరి ఎవరంటే, నీ శరీరము లోపల పనులన్నింటినీ, నీ కర్మ చిట్టా ప్రకారము నడిపిస్తున్నవాడు ఆత్మయే. నేను ఈ జ్ఞానమునంతటినీ చెప్పుచున్నాను, అంటే ఎవరు కారణం రెండవ ఆత్మయే ఇక మూడోవాడు జీవుడు. వాడు కేవలము వింటూ ఉండవలెను. మీరు దూరంలో ఉన్నారు కావున కొంత ఆలస్యముగా విందురు, నేను దగ్గరగా ఉన్నాను కావున తొందరగా వినగల్గుచున్నాను. నీకూ క్రొత్త విషయమే, నాకూ క్రొత్త విషయమే చెప్పేవాడిని నేను కాను, చెప్పేవాడు నా ప్రక్కనుండేవాడు. అన్ని పనులు చేసేవాడు కూడా ఆత్మనే. కావున నిన్ను కదలించి, చేతులను కదలించి చేసేవాడు ఆత్మయే. నేనెవరిని అంటే, తనలో ఒక్కోచోట ఉండేటటువంటి జీవున్ని మాత్రమే కావున అన్ని పనులకు నేను కారణము కాను జ్ఞానము తెలిస్తే ఈ విషయము తెలుస్తుంది జ్ఞానము తెలియకపోతే అన్ని పనులకు నేనే కారణము అని అనుకోవటానికి అవకాశము ఉంది తద్వారా శరీర యంత్రాంగము తెలియకుండా పోతుంది ఆ కారణంగా నీకు దేవుడెవరో తెలియకుండా పోవును.

కానీ జ్ఞానము తెలుసుకోవటం ద్వారా నీ శరీరములో రెండవ ఆత్మ గురించి తెలియబడుతుంది, అప్పుడు ఆ ఆత్మను ఎవరు ఆజ్ఞవేసి

నడిపించారు? ఆత్మకు అంత శక్తిని ఎవరిచ్చారు? ఆ విధానాన్ని ఎవరు ఏర్పరిచారు? ఎందుకు ఆ విధానాన్ని ఉంచారు? అనే ప్రశ్నలు వస్తాయి. ఒకడున్నాడు, సాక్షీభూతముగా, ఏ పనీచేయక నిమిత్త మాత్రంగా వున్నాడు, అతనే పరమాత్మ. జీవుడు శరీరములో దేని నిమిత్తమైయున్నాడు? దేని నిమిత్తమై జన్మలు మారుతున్నాడు? అనుభవించే నిమిత్తమే! ఏ పనీ చేయలేడు. ఒక వ్యక్తి దొంగతనము చేసాడనుకోండి వాస్తవముగా వాడు చేయలేదు, జీవునికి సంబంధము లేదు. నేనే చేశాననుకోవటం వలన ఆ పాపము వచ్చింది. దానిని అనుభవించాల్సింది వచ్చినది. మన గత జన్మలలో మనము చేయని పనులన్నిటినీ నెత్తిన వేసుకోవటం వలన, ఆ పాపాలను చేసుకున్నాము, ఆ పాపాలను అనుభవించేందుకు ఈ శరీరము లోనివి వచ్చాము. మరి వాటిని అనుభవింపజేసేందుకు రెండవ వాడైన ఆత్మశక్తి అవసరము. అంటే రెండు అవసరము. ఒకటి అనుభవించే వాడు, అనుభవింపజేసేవాడు. అనుభవించేవాడు జీవుడు లేదా జీవాత్మ, అనుభవింపజేసేవాడెవడు ఆత్మ. అతనే దండనాధికారి మనల్ని దండించే వాడు. ఆత్మ **"నేనే దండిస్తున్నాను"** అని చెప్పినను మనం అతనిని లెక్కచేయం. కనుక శరీరంలో అనుభవించేవాడెవడు జీవాత్మవైన నువ్వే.

ఒక లడ్డూ ముక్కను మనం నోట్లో పెట్టుకున్నాం అనుకుందాం. ఆ విధంగా పెట్టాలంటే, చేయి సహాయం అవసరం కదా, చేయి ఆ లడ్డూను నోట్లోపెట్టింది. నాలుక కదిలింది చప్పరించింది, తిన్నది కడుపులోకి పోయింది. తరువాత నీకేమీ తెలియదు కానీ ఇప్పుడు నీ చేయి కదిలింది, నాలుక, నోరు కదిలాయి అన్ని కదలికలు ఎవరివనుకున్నాం ఆత్మవే కానీ దీని(లడ్డూ) రుచిని అనుభవించేదెవరు, జీవుడు (జీవాత్మ) అయిన నీవే. అనగా రుచిని అనుభవించడానికే జీవుడున్నాడు కానీ రుచిని అనుభవించ

దానికి ముందు జరిగిన కార్యములు (పనులు) మాత్రం జీవుడైన నీవు చేయలేదు కాని నీ శరీరములో ఉన్న ఆత్మయే చేయించినది. ఇవన్నీ నీకు తెలిసి జరగడం అనే ఒక్క కారణం వలన, అన్నీ నేనే చేసితినని జీవుడు అనుకుంటున్నాడు. ఇది ఎవరికీ తెలియని పెద్ద రహస్యము.

మనిషంతా మభ్యపడేది ఇక్కడే, నేనే చేస్తున్నాను, 'నేను' అనుకోవటం పొరపాటు. కనుకనే మనము దేవతలు, దేవున్ని గుర్తించలేకపోయాము. నీ శరీరములో ఉండే స్థితులను తెలుసుకున్నపుడే, నా స్థోమత ఇంత ఉందని తెలుసుకున్నప్పుడే, నేను ఈ పనిని చేయగల్గుతున్నానా, లేదా అని అర్థమవుతుంది, అంత పనిని చేయలేదు అని తెలిసినప్పుడు తరువాత అంత పనికి కారణమెవ్వడు? అని యోచన వస్తుంది. కానీ ప్రతీ వ్యక్తి, ప్రతీ నిమిషము పనిని చేస్తున్నారు. అందుకే భగవద్గీతలో శ్రీకృష్ణుడు **"నహి కశ్చిత్ క్షణమపి"** అనే విషయాన్ని చెప్పాడు కదా! గుణాల వలన ఆ పనులను చేస్తున్నారు. ముందే నిర్ణయించిన కర్మప్రకారము ఈ పనులను బుద్ధి, చిత్తం, అహంకారము ఈ పనులను ఆత్మ సహాయంతో జరుపుచున్నవి. ఈ విధంగా పనులు జరుగుచున్నప్పుడు అందులో సుఖ దుఃఖాలు అనుభవిస్తున్నదెవరు? జీవుడే. ఈ విషయము తెలియని దానివలన, పాపాలు పుణ్యములు మనకు వస్తూ, కర్మచిట్టాలో చేరిపోయి, మనము వాటిని సంపాదించుకుంటున్నట్టవుచున్నది.

ఈ పాప, పుణ్యములనుండి బయటపడాలంటే ఏమి చేయాలి? మీరు ఏదో దేవునికి మ్రొక్కి, నాలుగైదు కొబ్బరికాయలు కొట్టి, నేను ఈ పాపము చేసితిని, ఈ పాపం పోవాలి అనుకుంటే అది పోదు. తప్పనిసరిగా శిక్ష ఉంటుంది, అనుభవించితీరాల్సిందే. అది ఇప్పుడు చేస్తే, ఇప్పుడే రాదు. అది కర్మరీత్యా క్రమం ప్రకారము రావాల్సిందే. ముందుకర్మ

దానివెనుకల తర్వాత కర్మ, అంతకుముందు సంపాదించుకున్న కర్మ ఈ విధముగా, అవి అమలుకు వచ్చినప్పుడు మనము వాటిని అనుభవించెదము. అప్పుడు దాని స్థితిగతులు, దాని తీవ్రత మనకు అర్థమగును.

ఈ విధముగా మనకు ఏదీ తెలియని స్థితివలన పూర్తి అజ్ఞానములో ఉండిపోయాము. తెలిసిన స్థితిలోకి వస్తే జ్ఞానము అగును. తెలిసిన స్థితి ఏమిటి? నేను ఏ దానికీ కారణంకాదు, ప్రతీ దానికి కర్మేకారణం, కొన్ని పనులు నాకు తెలిసి జరుగుచున్నాయి, కనుక నేనే ఆ పనులను చేస్తున్నాను అని అనుకుంటున్నాను, పొరపాటుపడి తెలియకుండా జరిగే పనులు ఉన్ననూ, అవి నా ప్రమేయం లేకుండా ఏ విధముగా జరుగుచున్నవో నేను తెలియలేకపోయాను.

జలుబు చేసింది అనుకో, నీ ముక్కే, నీతలే మరి నీకు జలుబు ఎందుకు వచ్చింది? క్రిములు అనగా వైరస్ వలన వచ్చింది, ఆ వైరస్‌ను మనము ఎందుకు నియంత్రించలేకపోతున్నాము? ఇంత పరిజ్ఞానము పెరిగిన తర్వాత నీ చేయి పనిచేయకుండా పోయిందనుకో, నీచేయే అయితే ఎందుకు నీవు ఎత్తలేకపోతున్నావు? నీ చేయి ఆ శక్తిని కోల్పోయింది అంటావు. ఏ శక్తితో కదులుచున్నా ఇంతవరకు? ఆ శక్తిని నీవు తెలుసుకోగలిగితే సరిపోతుంది. ఆ విధంగా తెలుసుకోవాలంటే ఏమి చేయాలి? నేనెవరు, అనేటువంటిది జ్ఞాపకము పెట్టుకుంటే, నీ వెనుక ఉండేవారెవరో తెలియును. **"నేనెవరు?"** అని ఎవరికివారు ప్రశ్నించుకోవటం లేదు.

ఈ విధముగా రెండవవాడైన ఆత్మను గురించి అధ్యయనము చేయటమే ఆధ్యాత్మికము. ఆత్మ గురించి ఎప్పుడైతే నీవు తెలుసుకున్నావో దేవుడెవరో తెలుస్తుంది. దేవుడనే వాడు ప్రత్యేకమైనవాడు దేవతలతో దేవునికి ఎటువంటి సంబంధము లేదు అని తెలుస్తుంది. ఆ దేవుడే సకల సృష్టిని

సృష్ఠించాడని తెలుస్తుంది. కానీ ఏమాత్రము పని లేకుండా ఉన్నాడు, సృష్ఠించడము కూడా ఒక పనే కదా! అని నన్ను మీరు ప్రశ్నించవచ్చును. కానీ దేవుడు ఏమాత్రము పని చేయలేదన్నది వాస్తవమే. ఎందుకంటే సృష్ఠిని సృష్ఠించక ముందు పనిచేసినాడు. అది మనకు సంబంధము లేదు. సృష్ఠించిన తరువాత నేను మరి పనిచేయను అన్నాడు. అప్పటినుండి పనిచేయటం లేదు. సృష్ఠి పూర్తయిన తరువాత ఆయనను కనుక్కునేందుకు రూపం లేదు. సృష్ఠి తయారైన తరువాత ఆయనకు పేరూలేదు. మరి ఇంత సృష్ఠి ఎట్లా ఈ విధంగా జరుగుతూ పోతున్నది? ఎవరిని పెట్టి పని చేయించాలో, ముందే నిర్ణయించి పెట్టాడు, వారు ఈ పనులన్నీ చేస్తున్నారు. నీ శరీరములో ఆత్మ చేస్తూ ఉంది కదా! బయట కార్యక్రమములు ఎవరు చేస్తున్నారు? భూకంపములు వస్తున్నాయి, సునామీలు వస్తున్నాయి, రకరకాల పంటలు పండుతున్నాయి మరియు కొన్నిచోట్ల అవి ఎండిపోతున్నాయి, మరి ఇటువంటి వాటిని ఎవరు చేస్తున్నారు? ముందే నిర్ణయించబడి పెట్టినారు, వారినే దేవుని పాలకులు అంటాము. వారే చేస్తున్నారుగానీ దేవుడేమీ చేయడు అన్న విషయము మాత్రము ఎవరికీ తెలియదు. నీ శరీరములో ఉండేవాడే నీకు తెలియకపోతే, బయట కార్యక్రమములు చేసేవాడు నీ కెట్లు తెలుస్తాడు?

బయట మేమెన్నో పరిశోధనలు చేశాం, భూకంపములు ఎందుకు వస్తున్నాయో తెలుసుకుంటున్నాము, సునామీలు ఎట్లు వస్తున్నాయో తెలుసు కుంటున్నాము అంటున్నారు, ఏమిటీ వీరు తెలుసుకునేది? వచ్చిన తరువాత తెలుసుకుంటున్నారు? అప్పుడు వచ్చింది అంటున్నారు. ముందే వస్తుంది అని, రాదని గానీ చెప్పలేక పోవుచున్నారు? ఎందుకు వస్తున్నదో ఇప్పుడు వారందరూ చెప్పగలుగుచున్నారా? అదే విధముగా రాకుండా ఏమైనా చేయ

గలుగుచున్నారా? నీవు చెప్పితే వినేవారు కాదు అక్కడున్న పాలకులు వాళ్ళు ఇష్టం వచ్చినట్లు వారు చేస్తున్నారు, కనుక ఆ పరిపాలన గురించి మీకు తెలియటం లేదు. పరిశోధనలు ఎట్లు ఉన్నాయంటే, భూకంపం ప్రారంభమయిన తరువాత, నష్టము జరిగిన తర్వాత దాని ప్రభావము ఇంత ఉందని అని మాత్రమే చెప్పగలుచున్నాము. ఇదే కాదు ఏదైనా, అవి వచ్చిన తరువాతే పరిశోధనలు పనికి వస్తున్నాయి కానీ అవి రాకుండా నివారణ ఉపాయములు మాత్రము కనుక్కోలేక పోతున్నారు.

ఒక సూర్యకిరణ వేగం ఒక సెకండుకు ఒక లక్ష ఎనభై ఆరువేల మైళ్ళు (3,00,000 కి.మీ) అనగా ఇరవై ఏడు లక్షల సంవత్సరాలు కాంతివేగము అనగా ఒక సెకండుకు ఇంత వేగము అంటే, 27 లక్షల సం॥ కాంతివేగము. ఎంతదూరము, చాలాదూరము అగును కదా! మరి అంత దూరమునుండి ప్రయోగము జరిపినా, ఈ విశ్వానికి అంతు దొరకలేదు. చివరికి 30 లక్షల సం॥ కాంతివేగాలు వెనక్కిపోయి చూశారు, కానీ అక్కడకూడా విశ్వం అంతు దొరకక, ఆ ప్రయోగాన్ని విడిచిపెట్టేశారు. పెద్దపెద్ద శాస్త్రవేత్తలు సైతము, ఈ విశ్వాన్నంతటినీ ఏదో ఒకటి నడిపిస్తూ ఉంది అన్నారు. అంత పెద్ద శాస్త్రవేత్తలే ఒప్పుకుంటుంటే, చిన్న శాస్త్రవేత్తలు మాకన్నీ తెలుసు అంటున్నారు. కాంతి సంవత్సరమంటే ఎంత, ఒక సెకండుకు ఇంత వేగం అయితే కొన్ని లక్షల మైళ్ళ కాంతివేగాల వెనక్కి వెళ్ళి చూసినాగానీ అర్థముకాని పరిస్థితి నెలకొన్నది. దీనికంతటికీ కారణము ఒక శక్తి అని వారు అంటున్నారు, దేవుడు అని మనము అంటున్నాము అంతే తేడా! దిక్కులేని స్థితిలో వారు శక్తి అంటున్నారు, వెతికితే దొరకలేదు కావున శక్తి అంటున్నారు. మేము ఆ పేరు కూడా పెట్టలేదు, వెతకబడేవాడే, దొరికేవాడు కాదు, ఆత్మనుండి వేరుగా ఉండేవాడు అని చెప్పాము. ఫలానావాడు అని చెప్పలేము.

www.thraithashakam.org

నీవు అంతదూరము వెళ్ళాలిసిన పనేలేదు, అంతటా ఉన్నాడతను. మనము వెతకటంలేదు, దేవున్ని తెలుసుకోవాలంటే ఆత్మను సృష్ఠించి, నిన్ను సృష్ఠించినవాడు అతనే అని తెలుసుకోవాలి. ఆ విధముగా నీవు తెలుసుకోవాలంటే మొదటి సోపానము ఏమంటే, నీ వెనుక ఉండే పనులు ఎవరు చేస్తున్నారో తెలుసుకోవాలి. నీవు శరీరములో ఒక భాగమై తలలో రవ్వంతున్నావు. శరీరమంతా వ్యాపించిన వాడు ఆత్మ. కనుక వీడిని గురించి తెలుసుకుంటే నిన్ను, నన్ను, అందరినీ అన్నింటినీ సృష్ఠించినటు వంటి పరమాత్మ లేదా దైవము నీకు తెలియబడును. అంతవరకు తెలియుటకు ఏమాత్రము వీలులేదు. మాట వరుసకు నీ వెనుక ఉండేవాడు అని ఆత్మను అంటున్నాము. నీవు దానిని తెలియలేకపోయావు. కనుక ఆ విధముగా అనాల్సివచ్చింది. కానీ నీ ముందుండి నడిపించేవాడే ఆత్మ అనవలెను. అతన్ని తెలుసుకోవటమే ఆధ్యాత్మికము. ఎప్పుడైతే నీ శరీరములో ఉండేవారి గురించి తెలుసుకుంటావో అప్పుడే ఆధ్యాత్మిక విద్య నేర్చినట్లు అగును, అప్పుడు నీకు దైవము ఎటువంటిదో అర్థమవుతుంది. ఈ విధముగా నీ శరీరములో అన్నిటినీ తెలుసుకునే నిమిత్తమే ఈ దేవాలయములన్ని నిర్మించబడి ఉన్నాయి. ఆ దేవాలయములకు పోతే అర్థము ఏముంది అక్కడ ఉన్నవన్నీ మన శరీరములో ఉన్నవే ఉన్నవి. దేవాలయములో ఉన్న ప్రతిమ చేయి చూపించినట్టుగా నిర్మిస్తే, నీకేమీ భయములేదు నేనున్నాను అని చెప్పుచున్నాడు అని, అభయం ఇస్తున్నాడని అని కొందరు అంటున్నారు. దానికి **"అభయహస్తం"** అని పేరు పెట్టారు. కానీ అది అభయహస్తము కాదు. నీ లోపలున్న ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ఆదిగాగల ఐదింటినీ నిలబెట్టుకో, అప్పుడు నీవెవరో తెలుస్తుంది. కన్ను, ముక్కు, చెవి, నాలుక,

చర్మము ఇవన్నీ పనిచేస్తుంటే నీవే పని చేశావని భ్రమిస్తున్నావు. అలాగైతే చెవిలో దూదిపెట్టుకో, కళ్ళకు గంతలు కట్టుకో, అప్పుడు నీవైన జీవాత్మవు చీకటిగదిలో ఉన్నట్లు ఉంటావు. శరీరములో, నేనే చూస్తున్నాను, వింటున్నాను అని అంటే ఎలాగవుతుంది? కన్ను చూపిస్తే చూడగల్గు తున్నావు, నీ చెవి వింటూ ఉన్నది ఆ శబ్దాన్ని తీసుకువచ్చి, నీకు వినిపిస్తే, నీవు లోపల వినగలుగుతున్నావు. కానీ ఎవరూ ఆ విధముగా అనుకోవటం లేదు. అన్నీ నేనే చేస్తున్నాను అని అనుకుంటున్నారు.

మన శరీరములో ఇష్టము, అయిష్టము అనేవి రెండు ఉన్నవి. నీ కిష్టమైన పనులు మాత్రము నీకు తెలిసి జరుగుచున్నాయి, కొన్ని పనులు నీకు తెలియకుండా జరుగుచున్నవి. నీకు వాంతి వచ్చిందనుకో ఎవరైనా ఆపగల్గుతారా? నీ శరీరమే, నీ పొట్టే మరి ఎందుకు వాంతిని ఆపలేక పోయావు? కనుక ఏదైనా ఒక మంచిపనైనా, చెడ్డపనైనా జరగాలంటే వెనుక ఒక నిర్ణయం, కర్మచిట్టా ఉంటుంది. కొందరు నీలో అరిషట్‌వర్గములు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర అనే చెడు గుణముల వలననే ఆ పనులు జరుగుచున్నవని అంటున్నారు. నిజమే, చెడుగుణములే వాటివలననే కానీ చెడు పనులే ఎందుకు జరగాలి? అని నేనడుగుచున్నాను. ఒకడు ఒక దొంగతనము చేస్తాడు. ఆ చేయటం అనేది ప్రారబ్ధంలో నిర్ణయించబడి ఉంటుంది. దానిననుసరించే ఆ పని జరుగుచున్నది కానీ జీవునికి ఆ విషయము తెలుస్తున్నది. కావున నేనే ఆ దొంగతనము చేస్తున్నానని అనుకుంటున్నాడు. అర్జునునికి శ్రీకృష్ణుడు ఒక విషయము చెప్పాడు అర్జునా! అది చెడ్డపనో, మంచిపనో ముందే వ్రాసిపెట్టబడి ఉంది, వీరంతా నీ చేత చనిపోవాలనే కర్మ వీరికుంది చనిపోతారు. నీవు యుద్ధం చేయమని చెప్పటం లేదు. యుద్ధము చేస్తే వచ్చే పాపము, పుణ్యము

రెండూ లేకుండా ఎట్లా చేయాలో చెప్పుచున్నాను. అంతేకానీ యుద్ధము చేయమనిగానీ, యుద్ధము చేయవద్దనిగానీ నేను చెప్పను అలా చెప్పేందుకు నేను రాలేదు. కానీ యుద్ధము చేస్తే వచ్చే పాప, పుణ్యములకు అతీతమైన జ్ఞానాన్ని మాత్రము నేను చెప్పుచున్నాను అని శ్రీకృష్ణుడు అన్నాడు.

మీరు ఎన్నో సంవత్సరములనుండి ఏ పని చేసినా నేనే చేస్తున్నాననే భావనతో చేయటం వలన, నేనిప్పుడు మీకు కర్మసిద్ధాంతము గూర్చి చెప్పిన, నేను ఈ విధముగా అనుకొని చేస్తే, ఏ పాపముగానీ, పుణ్యముగానీ రాదట అని మీరు అనుకుంటున్నారు. నేను చేసినాగానీ, పుణ్యం, పాపం రాదు అని "నేను చేసినాగానీ" అంటున్నాడంటే పుణ్యముగానీ, పాపంగానీ రాక తప్పదు. అమెరికాకు, ఆఫ్ఘనిస్తాన్‌కు యుద్ధం జరగాలంటే ముందే కర్మ నిర్ణయించబడి ఉన్నది. యుద్ధము జరగకూడదంటే ఎలాగ? జరగాల్సిందే. ముందే నిర్ణయించిబడి ఉన్నదని తెలుసుకోవటమే ఆధ్యాత్మికము అదే జ్ఞానము. దీనిని తెలుసుకునే ప్రయత్నంలో భాగమే దేవాలయ నిర్మాణాలలో వాడే చిహ్నములు కానీ దేవాలయానికి పోయి, నీకింత ఇస్తాను, నువ్వు నాకు ఆ పని చేసిపెట్టు అని మ్రొక్కితే ఆ విగ్రహాల్లో ఉండేవి జీవులే కనుక, మీకు ఎటువంటి సహాయం చేయలేరు. విగ్రహములలో దేవతలు కూడా కర్మను అనుభవించు జీవులే. కనుక మన శరీరములో తెలుసు కోవాలసిన విషయములు చాలా ఉన్నాయి. వాటిలో ఇచ్ఛ, అనిచ్ఛ కార్యక్రమములు ఒక భాగమని అర్థమయింది కదా!

# 40. బయటి సమాజం - లోపలి సమాజం

తేది : 21-12-2010

ఈ రోజు పౌర్ణమి సందర్భముగా క్రొత్త విషయాన్ని తెలుసుకుందాం. ఈ మధ్య మాకు గుండెపోటు వచ్చింది. మూడవమారు గుండెపోటు వస్తే ఎవ్వరూ బ్రతకరట. కానీ మాకు నాల్గవమారు వచ్చినా, బ్రతికాము. దేవుడు మమ్మల్ని ఇంకా కొంత జ్ఞానాన్ని చెప్పమని అనుమతించినట్లుంది. అందుకే ప్రమాదస్థాయినుండి మరలా మీకు క్రొత్త జ్ఞానాన్ని తెలిపేందుకు ఈ స్థాయికి నన్ను ఆ దేవుడు తెచ్చాడని భావిస్తూ ఈ రోజు 'సమాజం' అనే పదమును గూర్చి తెలుసుకుందాము. ఇక్కడ 'సమాజం' అనే పదములో 'జం' అనగా పుట్టినటువంటిది. 'సమా' అనగా సమానముగా పుట్టునటు వంటిది. అనగా బయట మనకు కనిపించే మనుషులందరినీ సమాజం అంటాము కదా! ఎందుకంటే మనుషులందరూ ఒకే ముక్కు, రెండు కళ్ళు, ఒక నోరు ఈ విధముగా అవయవములన్నీ ఒకేలా ఉండును. ఈ విధంగా మానవ సమాజం ఒకటుందని అందరికీ తెలుసు. కానీ సమాజం రెండు రకములు ఉన్నదని చాలామందికి తెలియదు. కనిపించే సమాజం ఒకటి, కనిపించని సమాజం ఇంకొకటి. కనిపించని సమాజంలో బుద్ధి, చిత్తం, మనస్సు, అహం ఇవన్నీ బయటకు, కనిపించక పోయినా, అవి నీ శరీరము లోపలున్నవి కనుక అది కనిపించని సమాజం అందురు. నేను అద్దములో చూచుకున్నాను అంటే, అద్దములో నీ శరీరాన్ని చూసుకున్నావు గానీ నిన్ను కాదు. నీవు అనే జీవాత్మవు శరీరములో తలలో ఉన్నావు, నీ ఆకారము నీకే తెలియదు. మనస్సు ఉంది, పని చేస్తున్నది, ఉన్నట్టు తెలుసు, అది పనిచేస్తున్నదనీ తెలుసు, అందరూ అది ఉన్నదని అంటున్నారు. కానీ ఏ విధముగా ఉందో తెలియదు. ఎక్కడ ఉండేది తెలియదు? ఎప్పుడు

www.thraithashakam.org

ఏ పని చేస్తున్నదో తెలియదు? మనస్సు అనేది నిద్రలో ఎక్కడుంది? స్వప్నములో ఎక్కడుంది? మెలుకువలో ఎక్కడుంది? తెలియదు. ఇదంతా కనిపించని సమాజం. ఈ విధముగా 14 భాగాలు నీతో పాటు నీకు కనిపించకుండా నీ లోపల ఉన్నారు. నీతో కలిపితే మొత్తము పదిహేను మందవుతారు. ఇదంతా కనిపించని సమాజం. కనిపించే సమాజం ఎంతమంది ఉన్నారు, చాలామంది ఉన్నారు. బయటి సమాజంలో ఇందరున్నారు అని చెప్పడానికి అవకాశము లేదు గానీ, లోపల సమాజంలో మాత్రము పదిహేనుమంది ఉన్నారని మాత్రము చెప్పవచ్చును. బయటి సమాజంలో ఒక మనిషి సక్రమంగా బ్రతకవలెనన్న లోపల సమాజం గురించి తెలిసియుండాలి. బయట సమాజం గురించి, లోపల సమాజం గురించి తెలిసినప్పుడు మనిషి సక్రమంగా బ్రతకగలడు. మనిషి తనకు ఇష్టం వచ్చినట్లు పాపాలు చేస్తూ బ్రతుకుతున్నాడంటే, బయటి సమాజం గురించి మాత్రమే అతను తెలుసుకున్నాడు. బయటి సమాజమే అంతా అనుకుంటున్నాడు. నేను ఒక వ్యక్తిని అనుకుంటున్నావు కనుకనే నీవు నీ ఇష్టం వచ్చినట్లు బ్రతకలేకున్నావు. ఎందుకంటే నీ కర్మ ప్రకారమే మంచి ఫలితములైనా, చెడు ఫలితములైనా ఉండునని తెలియదు, కనుక ఎవరైనా బీదవారు కావాలని అనుకుంటున్నారా, అందరూ కావాలనే కోరుకుంటున్నారు. మరి అందరూ ధనికులు అవుతున్నారా? లేదు సమస్యలు లేనివారు ఎవరైనా ఉన్నారా అంటే లేరు. అందరికీ సమస్యలు ఉన్నాయి. మరి సమస్యలు ఎందుకున్నాయి? కర్మనుబట్టి ఉన్నాయి. నీ ఇష్టం ప్రకారము బ్రతకాలనుకున్నా బ్రతకలేవు. మనిషి పరిపూర్ణముగా, సక్రమంగా బ్రతకాలంటే రెండు సమాజముల గురించి తెలియాలి. లోపల సమాజం గురించి తెలియాలంటే జ్ఞానము, ధర్మము గురించి తెలియాలి. బయటి

సమాజం గురించి తెలియాలంటే నీతి, న్యాయం గురించి తెలియాలి. బయటి సమాజంలో నీతి, న్యాయంగా బ్రతకాలంటే, లోపలున్న సమాజం పైనే అది ఆధారపడి ఉంటుంది. పాప, పుణ్యములు సంపాదించు కోకుండా ఉండాలంటే లోపలున్న సమాజం గురించి తెలియాలి. పాపపుణ్యములు ఏ విధముగా వస్తున్నాయి? బయట చేసే పనుల వలన వస్తున్నాయి. అవి రాకుండా ఉండాలంటే లోపలున్న సమాజం గురించి తెలియాలి. శరీరము లోపలున్న మనస్సు అంటే ఏమిటి? బుద్ధి అంటే ఏమిటి, చిత్తం అంటే ఏమిటి? అహము అంటే ఏమిటి? జీవుడు అంటే ఎవరు? ఎక్కడుంటాడు? ఇత్యాది విషయములు తెలియాలి. ఇవన్నీ తెలిసినప్పుడు సంపూర్ణమైన జ్ఞానము తెలియబడుతుంది. కానీ ఇప్పుడు సంపూర్ణమైన జ్ఞానము మనకు లేదు. బయట సమాజంలో ఉన్నతమైన ఒక శాస్త్రవేత్త ఉన్నాడనుకోండి, ఎవరైనా లోపల సమాజం గురించి తెలియకపోతే, అతనిది సంపూర్ణమైన జీవితం కాదు. అబ్దుల్‌కలాం గారు ఒకమాట చెప్పారు **"మన విజ్ఞానానికి ఆధ్యాత్మికత తోడు చేసుకున్నప్పుడు మాత్రమే సంపూర్ణత ఏర్పడుతుంది, లేకపోతే ఏర్పడదు"** అని చెప్పెను. పెద్దశాస్త్రవేత్త ఒక మంచిమాట చెప్పినాడు. వాస్తవమే అది, ఒక్క బయటి సమాజం గురించి మాత్రమే నేను తెలుసుకుంటాను అంటే కుదరదు. బయటి సమాజం గురించి ఎలాగూ తెలుస్తుంది. లోపల సమాజం గురించి మాత్రమే తెలుసుకోవాలి. నేను అనే వ్యక్తిని లోపల ఏ విధముగా ఉన్నానో తెలుసుకుంటేనే గొప్పతనము. అది తెలియని దానివలన గొప్పతనం లేకుండాపోయింది. మేము ఇది వరకు చెప్పాము ఒక రోగాన్ని మనిషి పొమ్మని శాసించవచ్చు. 'పో' అంటే పోతుంది. కొందరికి రోగాలు మందులు వాడినా తగ్గచ్చు, పెరగవచ్చు లేదా ఆ రోగంతో చనిపోవచ్చును కూడా. ఇది బయటి సమాజములో

ఉండే పరిస్థితి, బయటి సమాజంలో నీకు సమస్య లొచ్చినా, బాధపడేది మాత్రము లోపలే, ఎందుకంటే నీవు ఉండేది శరీరము లోపల, మరి నీవు బాధపడని విధానాన్ని గురించి తెలియాలంటే లోపల సమాజం గురించి తెలుసుకోవలెను. బయట సమాజములో ఒక వ్యక్తి గురించి తెలియాలంటే ఏ ఊర్లో ఉంటాడు? ఏ విధంగా అక్కడికి చేరవలెనో తెలుసుకుంటాము. అదే విధముగా లోపల సమాజములో నీ (చిరునామా) అడ్రస్ ఎక్కడ? ఇది నీవున్న శరీరము, శరీరము లోపల నీవెక్కడున్నావు అంటే, త్రైత సిద్ధాంత గ్రంథములు చదివినవారు ఏమైనా చెప్పగలరేమోగానీ మిగతావారు చెప్పలేరు, తెలియదు. శరీరములో మన చిరునామా (అడ్రస్) మనకే తెలియదు. మోకాళ్ళలో ఉన్నామా? మోచేతిలో ఉన్నామా? కాళ్ళలో ఉన్నామా? ముక్కులో ఉన్నామా? కంటిలో ఉన్నామా? తెలియదు. ఇవన్నీ మాటలకేంగానీ నీ మనస్సు ఎక్కడుంది? అదియునూ చెప్పలేం. ఒక ఆధ్యాత్మికవేత్త ఒకడు, నీ మనస్సును నీ నొప్పిపైన పెట్టుకో అని చెప్పుచున్నాడు వాస్తవమే. కానీ ఆ మనస్సు ఇంతకుముందు ఎక్కడుంది? ఎక్కడ పెట్టాలి? ఫలానాచోట అది ఉంది అంటే, దానిని తీసుకుని ఇంకొక దగ్గర పెట్టవచ్చు. లేదు ఇక్కడుంది, నొప్పి ఉన్న మోకాలుపై పెట్టాను అన్నావనుకో దానికి నిరూపణ ఏమి? మన శరీరములో మన మనస్సు ఎక్కడ కేంద్రంగా ఉందో తెలియదు. మేమెప్పుడూ భజనలు చేయండి, పూజలు చేసుకోండి అని చెప్పము. ఎందుకంటే అవన్నీ బయటి సమాజపు పనులు. మేము చెప్పేది కేవలము నీ గురించి, ఉదాహరణకు నేను ఒక గుమస్తాను పెట్టుకున్నాను. వాడికి రోజుకి వందరూపాయలు ఇస్తానన్నాను. కనుక నేను ఎక్కడుండమంటే అక్కడ వాడు ఉంటున్నాడు. కనుక నా గుమస్తా నాకు కనిపిస్తున్నారు అంటున్నాను. ఇప్పుడు నా బుద్ధి అని నీవు

అంటున్నావు కదా! గుమస్తాను నా గుమస్తా అని అన్నందుకు అతన్ని నేను చూపించినట్లు నా బుద్ధి అనిన నీవు నీ బుద్ధి ఎక్కడుందో చెప్పగలవా? నీ కాళ్ళు, చేతులు తీసేస్తే మొండెం మాత్రము ఉంటుంది. అందులో కనీసం నీ అడ్రస్ చెప్పగలవా? కాళ్ళు తీసినా మనిషి బ్రతకగలడు, చేతులు తీసినా మనిషి బ్రతకగలడు. అప్పుడైనా అతని చిరునామా చెప్పమనండి? నీ అడ్రస్ తెలియదు, చిత్తం చిరునామా తెలియదు, బుద్ధి చిరునామా గురించి తెలియదు, నీ అహం చిరునామ (అడ్రస్) కూడా తెలియదు. నా బుద్ధి, నా చిత్తం, నా మనస్సు, నా అహం అని 'నా' అని చెప్పుకుంటున్నావంటే, నీకు దగ్గర వారే కదా! వారంతా. మరి వారి అడ్రస్ మాత్రము నీకు తెలియకుండా పోయింది. నీవు ఈ బయటి సమాజంలో పాపాలు సంపాదించుకోకుండా ఉండాలంటే, నీవు పుట్టినందుకు సార్థకత ఏర్పడా లంటే, ప్రతి మనిషి లోపల సమాజం గురించి తప్పనిసరిగా తెలిసియుండాలి. నీవెక్కడున్నావు అంటే, తలలో మధ్య భాగంలో, భృకుటి మధ్యమున ఉన్నావు. ఈ విషయములను వేమనయోగిలాంటివారు కూడా చెప్పారు. మరి అక్కడ ఏముంది అని తెలుసుకుంటే నాలుగుచక్రముల చట్రము ఒకటుంది. అందులో క్రింద చక్రమును మాయా చక్రమని అంటున్నాము. ప్రపంచములో మాయ అని అంటున్నాము కదా! అది ఎక్కడుంది? అంటే నీ తలలో ఉంది అని అర్థమయింది కదా! దీన్ని తెలుపుటకే కృష్ణుడు నెమలి పింఛమును పెట్టుకున్నాడు. ఎందుకంటే అందులో మాయా చిత్రముంది. అందులో మాయాతీతుడై ఏ విధముగా ఉన్నాడో తెలిపాడు. ఈ మాయా చక్రములో నాలుగు భాగములు కలవు. ఇది మీరు నెమలి పింఛమును చూసిన మీకు నాలుగు భాగములు కన్పించును. అందుకే నెమలి పింఛములను విప్పి చూపించేది. నీవు మాయలో ఉన్నావు అని చెప్పటం

కొరకు. ముదురురంగు భాగమైన ఆత్మభాగాన్ని కూడా చూపుటకొరకు, అంతేగానీ నెమలి అందము చూపే దానికి కాదు. అందంగా పురివిప్పింది అని మనము అనుకుంటున్నాము, కానీ అది అందము కొరకు కాదు. జ్ఞానమును తెలుపుటకు అని తెలియవలెను. నెమలి పింఛములో మధ్య ముదురు రంగులో నేనున్నాను అని చెప్పటం కొరకు కృష్ణుడు పింఛమును ధరించాడు. ముదురురంగు కల్గిన భాగాన్ని అనుసరించి క్రిందకు మూడు ఆవరణలు కలవు. అవి క్రింద ఆవరణ నుండి వాటి పేర్లు తామసము, రెండవది రాజసము, మూడవది సాత్త్వికము, మధ్యలో ఉన్నది ఆత్మ భాగము అంటాము. ఈ నాలుగు భాగములో జీవుడు ఏదో భాగములో ఉంటాడు. అనగా నీవు ఆ మాయా చక్రములో, శిరస్సులో ఏదో ఒక భాగములో ఉన్నావు. చివరి భాగములో నీవు ఉన్నావనుకో నిన్ను తామసుడు అంటాము. రెండో భాగములో ఉంటే రాజసుడు, మూడవ భాగములో ఉంటే సాత్త్వికుడు అంటాము. నాల్గవ భాగములోకి నీవు వెళ్ళితే **యోగి** అంటాము. ఈ నాల్గు రకముల మనుషులనే నేను సృష్ఠించాను, వారే ఈ భూమిమీద ఉన్నారు. **"చాతుర్వర్ణం మయా సృష్టం గుణకర్మ విభాగశః"** అని చెప్పాను, నాల్గు భాగముల వారు ఉన్నారని నేను చెప్పాను. కానీ భూమిమీద ఉండేవారంతా ఈ మూడు భాగల్లోనే ఉంటారు. ఈ మూడు భాగాల్లో అనగా తామస, రాజస, సాత్త్విక భాగములలో ఎందులోవున్నా మాయలో ఉన్నట్టే! బయట ఒక బోర్డులో **"నీ అడ్రస్ నీకు తెలుసునా?"** అని కలదు. దానిని చూచిన ఒక వ్యక్తి నాది ఫలానా ఊరు, ఫలానా వీధి అని నా అడ్రస్ నాకు తెలుసు. ఈ మాత్రము దానికి "నీ అడ్రస్ నీకు తెలుసునా" అని వ్రాయటమేమి?" అని అడిగాడు. మేమడిగింది బయటి అడ్రస్సా, లోపలి అడ్రస్సా, నీవెందుకు బయటి అడ్రస్ అనుకోవాలి? నీవు

సమాధానము చెప్పలేని ప్రశ్నను నేను అడిగాను? రెండు సమాజాలు ఉన్నాయని తెలియక పోతే వచ్చే సమస్య ఇదే, నేనడిగింది ఒకటి? నీవు చెప్పింది మరొకటి. పూర్వము ఒక వ్యక్తి అడిగాడట "నీవు రాజువని చెప్పావట" అని. "అవును" అని చెప్పాను. నేను రాజునని చెప్పింది బయటి రాజ్యానికి కాదు, లోపలున్న రాజ్యానికి రాజునని చెప్పెను. బయటనున్న రాజ్యానికే రాజునని అంటున్నాడేమోనని, ముందే ఆయనను చంపేయాలనుకున్నారు. తెలియకపోతే ఇటువంటి సమస్యలే వస్తాయి. కనుక జీవుడనేవాడు ఒక గంట తామసంలో ఉంటే, ఇంకొక గంటలో రాజసంలో ఉంటాడు. మరియొక గంటలో సాత్త్వికములోకి వెళ్ళవచ్చును. ఒక గుడికి పోయిన వ్యక్తి, ఐదు నిమిషముల పాటు సాత్త్వికంగా ఉంటే, బయటకు రాగానే కొన్ని గంటలపాటు తామసుడుగా ఉంటాడు, ఎక్కువ సమయం తామసంలో ఉన్నాడు, కనుక వాడు తామసుడే అగునుగానీ సాత్త్వికడు కాదు. కనుక జీవుడు శరీరం (ఆడైనా, మగైనా) ఏ గుణములో ఎక్కువగా ఉంటే అదే గుణము పేరుతో పిలువబడును.

భగవద్గీతలో దేవుడు **"గుణమయి మమ మాయా"** అన్నాడు. **గుణములతో కూడుకున్నదే నా మాయ** అన్నాడు. నేనెంత పకడ్బందీగా ఆ మాయను తయారు చేయాలో అదే విధంగా తయారు చేశాను. గుణములే మాయ అంటే అవి ఎన్ని ఉన్నాయి? 12 ఉన్నాయి. ఆరు మంచి గుణములు, చెడ్డవి (అరిషట్) వర్గములు. 'అరి' అనగా శత్రువర్గములు' అవి ఏమనగా! "కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములు". ఇదే విషయాన్ని భాగవతంలో ప్రహ్లాదుడు చెప్పాడు తండ్రితో "నా శత్రువెక్కడ' అని "ఎందుకు అడుగుచున్నావు, నీ లోపల నీ ముందరే ఆరుగురు శత్రువులున్నారు, వారిని ముందు జయించు" అన్నాడట. మరి వారు కనిపించరు, ఎందుకంటే

www.thraithashakam.org

వేరేగా కనిపించేది ఏమున్నది? నీవు అనేవాడివి అక్కడే ఉన్నావు. కనుక అంటే గుణములలోనే జీవుడనే నీవు ఉన్నావు. వారినే మాయ అంటున్నాము. దానిలో నీవు తగులుకుంటున్నావు. ఏ విధముగా తగులుకుంటున్నావంటే **"మమైవాంశో"** అంటే నాయొక్క అంశే జీవుడు అన్నాడు. దేవుడు జీవాత్మ నా యొక్క అంశే అన్నాడు. అంతేకాక "ద్వా విమౌ పురుషౌ లోకేక్షర, అక్షర ఏవచ" అనగా ఇద్దరు పురుషులున్నారు క్షరుడు, అక్షరుడు అని వారినంటాము. అదీకాక పురుషోత్తముడు ఒకడున్నాడని ప్రక్క శ్లోకములో "ఉత్తమ పురుషస్త్వన్యః" పరమాత్మే త్యుదాహృతః" అని కూడా చెప్పారు. మొత్తము ముగ్గురు **"జీవాత్మ, ఆత్మ, పరమాత్మ"** దీనినే త్రైత సిద్ధాంతమని మనము చెప్పుచున్నాము. **'క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు"** భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగములో 16, 17 శ్లోకములలో ఈ విషయాన్ని చెప్పారు. దాన్ని త్రైత సిద్ధాంతము అనే పేరుతో ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించినాము. అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతములను కాదని త్రైత సిద్ధాంతము గొప్పది. దానిని దేవుడే చెప్పినాడు అని మనము చెప్పుకుంటున్నాము. ఈ త్రైత సిద్ధాంతము అని వినగానే, వీరెవరో క్రైస్తవులు, మనం హిందువులం అని కొందరు అంటున్నారు. మన గురించి మన భగవద్గీత గురించి మనకి పూర్తిగా తెలిస్తేనా! తెలియదు. మనకు భగవద్గీత అసలుకు అర్థము కాలేదు, త్రైత సిద్ధాంతాన్ని దేవుడే ప్రతిపాదించి చెప్తే, ఇది క్రైస్తవులది అనడము చూస్తే, మరి మనదేమిటో తెలియదు. అర్థము కాలేదు వారికి తద్వారా ఈ మూడు ఆత్మల గురించి మరచిపోయాము మనము. నీవు జీవాత్మవు, శరీరములో నీవు నివాసమున్నావు. నీ ప్రక్కనే ఒక ఆత్మ ఉంది, అది శరీరమంతా ఉన్నది. జీవాత్మవైన నీ వెక్కడున్నావు? నీ గుణచక్రములో, తలలో నీవు రవ్వంతగా ఉన్నావు. గుణచక్రములో

మాత్రమే నీవుంటే, శరీరమంతా ఆక్రమించి ఆత్మ ఉన్నది. అనగా తలవెంట్రుకనుండి, కాలిగోటివరకు ఆత్మ ఆవహించి ఉంది. మూడవ ఆత్మ పరమాత్మ శరీరము లోపలా ఉంది, బయటా ఉంది, అంతటా ఉంది. కానీ శరీరములోపల ఉండేవి మాత్రము రెండే రెండు ఆత్మలు. అవి "జీవాత్మ, ఆత్మ". ఈ రెండు ప్రకాశవంతముగా ఉన్నవి. ఎందుకంటే పరమాత్మచే శోభించినవి కనుక పరమాత్మ అంశచే పుట్టినవి కనుక వీరికి ప్రకాశము ఉంది. ఆత్మకు ప్రకాశం ఉంది, ఎంతవరకు అంటే శరీరమంతా వ్యాపించి ఉంది. ఆత్మ నివాసమెక్కడ బ్రహ్మనాడి. అనగా తలమధ్యలో ఉన్న బ్రహ్మనాడి. సూర్యుడొక్కడు ఈ లోకమును ప్రకాశింపజేయునట్లు, తలమధ్యలో ఆత్మ దాని కిరణముల ద్వారా శరీరమంతా ప్రకాశింపజేస్తున్నది అని భగవద్గీతలో చెప్పెను. జీవాత్మకు కూడా వెలుగుంది. అనేమాట క్రొత్తగా మేమే ముందుగా చెప్పుచున్నాము. వజ్రానికి కొంత వెలుగుంటుంది. అది చీకటిలో కూడా ప్రకాశిస్తుంది. గుడ్డి వజ్రానికి కూడా కొంత వెలుగుంటుంది. అంటే వజ్రంలోనే కొంత ప్రకాశము ఉంటుంది. అదే విధముగా గుడ్డివజ్రానికి కొంత మాత్రమే ప్రకాశమున్నట్లు జీవాత్మకు కొంత ప్రకాశముంది. అసలైన వజ్రానికి పూర్తి ప్రకాశము ఉంటుంది. అదే విధముగా ఆత్మకు పూర్తి ప్రకాశం ఉంటుంది. కనుక శరీరమంతా దాని ప్రకాశము ఉన్నది. కానీ జీవాత్మకు కొద్ది ప్రకాశమే ఉంది కనుక శరీరమంతా ఆవహించి లేదు. కనుక జీవాత్మ మూడు గుణములలో ఉన్న ప్రాంతమును దాటితే ఆత్మ భాగములోకి చేరితే యోగి అగును. ఈ విధంగా తామసుడు, రాజసుడు, సాత్వికుడు, యోగిగా జీవుల్ని విభజించి దేవుడు చెప్పితే, స్వామీజీలు అని పేరు పెట్టుకున్న వారంతా "బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు" అని చెప్పుకున్నారు. అంటే కులముల

www.thraithashakam.org

పేర్లు వ్రాసుకున్నారు. కానీ **'గుణకర్మ విభాగశః'** అని దేవుడంటే 'కుల కర్మ విభాగశః' అని వారికి అర్థమయినట్లుంది. పోనీ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అని చెప్పి, శూద్రులంటే రెడ్డి, చౌదరీలు, బలిజ, కాపు ఇత్యాది అన్నీ కులములు వచ్చేస్తాయి అందులోకి, కానీ తర్వాత మరలా ఆలోచించి మాల, మాదిగ కులములను శూద్రులు అని అనకుండా మరల వారిని వేరు చేసి, వారిని పంచములు అన్నారు చూడండి. నాలుగు కాక ఐదవ వారని చెప్పారు. అట్లు చెప్పడము ఎంత నీచమైనదో! వారిని శూద్రుల్లో కలిపితే మనకి కలంకమన్నట్టు, వారు మనుషులే కాదు అన్నట్లు వారిని పంచములు అని ఐదవ పేరు పెట్టారు. ఇది ప్రపంచవరముగా చాలా అన్యాయం. కులముల పేర్లు చెప్పుటయే అన్యాయం. భగవద్గీతలో దేవుడెక్కడైనా ఈ కులముల పేర్లు చెప్పినాడా? ఎవరినైనా తేడాగా పుట్టమని పుట్టించాడా? అందరికీ అవయవములు ఒక్కలాగే ఉన్నవి కదా!. ఆ విధంగానే పుట్టించినాడు కదా! దానినే సమాజం అని పేరు పెడితే నీవు నీ ఇష్టం వచ్చినట్లు నీ స్వార్థముతో నీవు రెండవ వాడివి, నేను మొదటివాన్ని అంటే ఏ విధంగా ఉంటుంది. ఇట్లు బయట సమాజం ఎందుకు సరిగ్గా లేదంటే లోపల సమాజం గురించి తెలియకనే ఈ విధముగా వుంది. మనముందరయుండే "సమాజం" అనే పదమునకు అర్థమేముంది.

త్రైత సిద్ధాంతమును తెలుసుకున్న వారందరికీ ఈ నాలుగు వర్ణాలు, గుణకర్మలు ఏమిటో స్పష్టముగా తెలియును సాత్త్వికము, రాజసము తామసం, యోగము. ఈ నాలుగు గురించి తెలియును. తద్వారా శ్రీకృష్ణుడు నెమలి పింఛం ఎందుకు పెట్టుకున్నాడో తెలియును. ఈ గుణములు మొత్తము 6+6=12 అని చెప్పాము. అవి నీ తలలోనే ఉండును అని చెప్పాము. 12 గుణములతో పాటు గుణములాంటిదే కానీ గుణము కానిది ఛాయా

గుణం ఒకటుంది. దానినే **"శ్రద్ధ"** అంటాము. దీనిని కలిపితే 13 అగును. ఇప్పుడు మనిషి మాయలో ఎట్లుపడుచున్నాడు? ఒక వ్యక్తి ఉన్నాడనుకుందాము. డబ్బును చూసి అందులో పడతాడు. డబ్బును చూసి ఆశ అనేది పుట్టి దానిని ఏ విధంగానైనా లాగాలని యోచన వస్తుందన్నమాట. అంటే ఆశ అనే గుణములో ఆ వ్యక్తి పడినట్లే లెక్క. ఆశ అనేది ఒక గుణమే కావున, గుణములతో కూడుకున్నదే మాయ కావున ఆయన మాయలో పడినట్లే లెక్క. ఆ వ్యక్తి యొక్క తమ్ముడు బాధపడుతున్నాడని ఏ విధంగానైనా అతని బాధ తగ్గే విధంగా ఆ పనిని వేరే వారికి చెబుదాం అనుకున్నాడట. డబ్బు చూసి కావాలనుకున్నాడు. అది ఆశ అదే మాయ. తమ్ముడు పని చేస్తుంటే బాధపడి, వేరే వారికి ఆ పనిని అప్పజెప్పటం మోహ గుణం అదీ కూడా మాయ. మాయ అనేక రూపాల్లో కలదు. అంటే ఇదే భగవద్గీతలో శ్రీకృష్ణుడు జ్ఞానాన్ని చెప్పేముందు అర్జునునికి ఏ గుణం ఉంది మోహగుణము. నా వాళ్ళు, నా అనే గుణము తగులుకున్నది. ఈ మాయ అర్జునునికి ఒక్కడికే తగులుకున్నదా? అందరికీ ఈ మాయ ఉన్నది. కనుక ఆ రోజు శ్రీకృష్ణుడు అర్జునునికి చెప్పినది అర్జునునికే కాదు మొత్తము మనందరికీ. మరి ఈ మాయ మనందరికీ ఏ విధంగా తగులుకుంటున్నదంటే నాలుగు భాగములలో (చక్రములలో) నాలుగు శ్రద్ధలు కలవు. నాలుగు భాగములలో, మూడు భాగములలో మాయ గుణముల రూపములో ఉన్నది. ఒక్క భాగములో మాత్రము మాయ ఉండదు. మాయకు అతీతమైనది కావున దానిని యోగము అన్నాము. ఆత్మ భాగము అన్నాము. దాంట్లోకి నీవు వెళ్తే దేవుడు తెలుస్తాడు. మిగతా మూడు భాగాల్లో ఉంటే నీవు మాయలో ఉన్నట్లే. ప్రపంచములో మాయ, దేవుడు రెండే ఉండేది. కనుకనే నెమలి పింఛములో మధ్య భాగాన్ని

చాలా ముదురు నీలం రంగులో ఆత్మస్థానము, యోగస్థానము సూచించే విధంగా మాయకు అతీతమైన ఆవరణగా అది చూపబడుతున్నది. అందుకే ఆ ముదురు రంగు ఆవరణలోకే నీవు వెళ్ళాలని సూచిస్తున్నట్టుగా ఉంది. మిగతా ఆవరణలు నెమలిపింఛములో అంత ముదురుగా నిర్ధిష్టముగా లేవు. ఎందుకంటే ఆ ఆవరణలు అంతా మాయా ఆవరణలే కనుక వాటికి అంత నిర్ధిష్టత సూచించబడలేదు. అందుకే శ్రీకృష్ణుడు నేను యోగస్థానంలో మాయాతీత ఆవరణములోనే ఉన్నట్లు, మాయలో తాను లేనట్లు తెలిపేందుకే ఆయన చిన్నప్పటినుండి, చనిపోయినంత వరకు ఆ నెమలిపింఛమును శిరస్సుపైన ధరించెను. శ్రీకృష్ణుడు 126 సంవత్సరములు బ్రతికెను. ఆయన 90వ సంవత్సరములో భగవద్గీతను చెప్పెను. అందుకే మన గ్రంథము ఒక దానియందు శ్రీకృష్ణుడు 90 సంవత్సరముల వయస్సుతో ఉన్న చిత్రమును **"శ్రీకృష్ణుడు దేవుడా? భగవంతుడా?"** అనే గ్రంథపు ముఖ చిత్రమునందు ముద్రించితిమి. ఈ విధముగా ఆయన భగవద్గీత చెప్తూ అన్ని గుణములయందు అన్ని శ్రద్ధలు కలవు అని చెప్పెను. అనగా మూడు గుణములలోను మూడు శ్రద్ధలున్నాయి. గుణరహితమైన భాగములో కూడా ఒక శ్రద్ధ ఉన్నది. ఇప్పుడు తామసుడు ఎట్లు మాయలో పడ్డాడంటే జీవుడున్నాడు కదా! జీవునికి కొంత వెలుగుంది కదా, గుణ విభాగాలు 12 ఉన్నాయి కదా, జీవుడు ఒక దగ్గరున్నాడు కదా, ఇప్పుడు ఒక గుణ భాగముతో కూడితేనే కదా జీవుడు ఆ భాగములో ఉన్నాడనుకునేది మరి ఇది ఏ విధంగా జరుగుచున్నది? గుణములున్నవని తెలుసు, జీవుడున్నాడనీ తెలుసు. ఏ గుణ ప్రభావంనకు లోనైతే ఆ గుణప్రభావము జీవునికి వస్తుందనీ తెలుసు. అయితే ఆ గుణం ఎందుకు తగులుకుంటున్నదని మనము ప్రశ్నించుకోలేదు. ఇప్పుడు ఎన్నియో గుణ విభాగములున్నవి కదా! వాటిలో ఆ క్షణంలో ఆ

ఒక్క గుణమునకే ఎందుకు తగులుకోవాలి? సంబంధము కలగవలెను అంటే కర్మానుసారమే తగులుకుంటున్నది. అదీ వాస్తవమేగానీ ఆ ప్రక్రియ ఏమి అని ఆలోచించిన, ఈ శ్రద్ధ అనేది ఒకటుంది అని చెప్పాము చూడండి. ముఖం చూసుకునే అద్దం ఒకటుంటుంది చూడండి. అద్దములాంటిది ఈ శ్రద్ధ అనేది. ఉదాహరణకు ఇక్కడ ఎండలేదనుకోండి, కొంచెం దూరంలో ఎండ ఉన్నది మరి అక్కడ ఎండను ఇక్కడకు తేవాలంటే అద్దము ద్వారా సాధ్యమగును అనగా అద్దము సూర్యకిరణములను వంచి ఇక్కడికి పంపిస్తున్నది. అద్దము ఆ పనిని ఎండ ఉంటేనే చేయగలదు. ఇప్పుడు తామస గుణభాగంలో ఉండే శ్రద్ధ ఉంది, రాజసభాగంలో కూడా శ్రద్ధ ఒకటుంది. అదే విధంగా సాత్త్విక భాగంలో ఉంది. గుణరహితమైన ఆత్మ భాగంలో కూడా శ్రద్ధ ఉంది. ఇప్పుడు మూడు గుణ విభాగములలో ఉన్న శ్రద్ధలు మూడు అద్దములవలె ఉన్నవి. జీవుడు వెలుగై ఉన్నాడు. కనుక జీవుని యొక్క వెలుగు శ్రద్ధ అనే అద్దము మీద పడితే, శ్రద్ధ మీద నుండి గుణ భాగముమీద పడును. ఆ గుణం మీదకు పంపించేది మాత్రము వాడు చేసుకున్న కర్మప్రకారము పంపించును. ఈ అద్దాన్ని తిప్పేది కర్మ, జీవుడుకుండే వెలుగును వాడు చేసుకున్న గతజన్మల ప్రకారము అది ఆయా శ్రద్ధలమీదకు తద్వారా, ఆయా గుణములపైకి పంపించి కార్యములను జరిపించును. అంటే జీవుని యొక్క వెలుగు గుణభాగములలో డైరెక్ట్‌గా పడుచున్నదా అంటే లేదు. శ్రద్ధను మధ్యవర్తిగా పెట్టి కర్మానుసారము జీవుని వెలుగును ఆ గుణం మీద శ్రద్ధ పడునట్లు చేస్తే, ఆ గుణప్రభావము జీవునికి తగులుకుంటున్నది. ఇప్పుడు ఒక గుణమునకు జీవుడు ఏ విధముగా సంబంధపడుచున్నాడో అర్థమయినది కదా! ఇంతకుముందు ఈ విషయములు ఏమైనా తెలుసునా అంటే తెలియదు. శ్రద్ధ అంటే

www.thraithashakam.org

ఒకటుంది అని తెలుసునుగానీ ఏ పని చేస్తున్నది అనేది తెలియదు. ఈ విషయములన్నీ శ్రీకృష్ణుడు సాత్త్విక శ్రద్ధ, తామస శ్రద్ధ, రాజస శ్రద్ధ అని చెప్పెను కానీ, ఆ శ్రద్ధ ఏ విధముగా పని చేస్తున్నది అనే విషయము మాత్రము రహస్యం. కనుక లోపలి సమాజం గురించి తెలుసుకొని బయటి సమాజం గురించి తెలుసుకుంటే మనిషి సక్రమంగా బ్రతకగల్గుతాడు. లేకపోతే భగవద్గీతను అపార్థము చేసుకున్నట్లగును. ఒక వ్యక్తి భగవద్గీతలో చెప్పిన ఒక విషయాన్ని అపార్థము చేసుకున్నాడు, శ్రీకృష్ణుడు శరీరము మీద అభిమానము విడిచిపెట్టండి అని చెప్పెను. శరీరం మీద అభిమానం పెట్టుకోవద్దని అన్నాడని గుడ్డముక్కలు (శరీరంపైన బట్టలను) విప్పివేసాడట ఆ వ్యక్తి. అంటే శ్రీకృష్ణుడు చెప్పినది ఒకటైతే అతను అర్థము చేసుకున్నది ఇంకొకటన్నమాట. శరీరము వేరు, శరీరములో భాగాలు వేరు, అందులో ఉండే విషయాలను తొలగించాలని చెప్పాడుగానీ గుడ్డలు తీసివేయమని చెప్పలేదు. **"చాతుర్వర్ణం మయాసృష్టం"** అని చెప్పితే మనము ఇంకొక విధముగా బ్రహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అనుకొన్నట్లున్నది. అలా అర్థము చేసుకుంటే ఏ విధముగా వాస్తవం అవుతుంది. ఈ విధంగా ద్వంద్వార్థములు తీసుకుని అర్థము చేసుకుంటే బయటి సమాజంలో సరిగ్గా బ్రతకలేము, లోపలి సమాజం గురించి మొదటికే తెలియదు. ఇప్పుడు "నువ్వు దేనికొచ్చావు?" అని నేను ప్రశ్నిస్తే, దానికి జవాబుగా ట్రైన్‌కి వచ్చాను అంటాడావ్యక్తి. నేను ఆ జవాబును ఆశించి అడగ లేదు కానీ 'నీవు ఏ పనికోసము ఇక్కడకు వచ్చావు' అనేది నా ప్రశ్నలోని ఉద్దేశ్యం. నేను రెండుగంటల ట్రైన్‌కి వచ్చాను అనేది అతనికది సమాధానమే కానీ నా ఉద్దేశ్యములో అది కాదు కదా! ఈ విధంగా జ్ఞానము తెలుసుకోవడంలో కూడా సరిగ్గా అర్థము చేసుకుంటేనే ముందుకు వెళ్ళగలము లేకపోతే

www.thraithashakam.org

అజ్ఞానపు పనులు చేయుటకే మరలా మొదలుపెడతాము. ఆ విధంగా అర్థము చేసుకుంటామనే ఉద్దేశ్యముతో, కృష్ణుడు పనులు చేయాల్సిన అవసరం లేకపోయినా, పనులు చేసే విధానము చూపించుటకు పనులను చేసి చూపించినా, అర్థము చేసుకొనక మనము అపార్థము చేసుకున్నాము. శ్రీకృష్ణున్ని ఆ లెక్క ప్రకారము చూస్తే మనకు భగవద్గీత అర్థము కాలేదు. ఆ విధంగా తామసంలో ఉన్న వ్యక్తికి, తామసంలో ఉన్న శ్రద్ధ అనే అద్దం గుణభాగములో ఆ జీవున్ని కర్మానుసారం ఇరికించినట్లు, అలాగే రాజసంలో కూడా జరుగును. సాత్త్విక గుణ భాగములో కూడా ఆ విధముగానే జరుగును. అందుకే మూడు గుణములే మాయ కనుక ఆ మాయలోనే జీవుడు మునిగి తేలుతున్నాడు. అందుకే శ్రీకృష్ణుడు **"మమ మాయా దురత్యయా"** అన్నాడు. ఇప్పుడు నేను చెప్పబోయే విషయం రహస్యములోకెల్ల రహస్యం. ఇంతవరకు ఏ స్వామీజీ చెప్పని రహస్యం ఏమంటే నాల్గవ భాగము ఒకటుంది అని చెప్పాము కదా! దానినే ఆత్మ భాగమని, నెమలిపింఛములో ముదురు నీలి రంగు మధ్యభాగం ఏదైతే ఉందో అది నీ శిరస్సులోనే ఉందని చెప్పుకున్నది ఏదైతే ఉందో దానిలో కూడా శ్రద్ధ ఒకటుంది అని తెలియజేశాము కదా! ఆ శ్రద్ధ కర్మకు అతీతమైనది. అది ఏ కర్మకూ లొంగని శ్రద్ధ. దానిని ఎవరూ శాసించలేరు. అటువంటిది **నాల్గవ భాగములో ఉన్న శ్రద్ధ.** ఆ శ్రద్ధ ఎవరి ఆధీనములో ఉందంటే కర్మ ఆధీనంలో మాత్రము లేదు. కానీ **జీవుని ఆధీనములో ఉంది.** అది నీ ఇష్టం. దాంట్లోకి జీవుడు వెళ్తే ఆ శ్రద్ధను నీవు నీ ఇష్టం వచ్చినట్లు పెట్టుకోవచ్చు. ఆ శ్రద్ధ అనే అద్దము యొక్క ఫోకస్ ఎక్కడపడుతుందో తెలుసా? నాల్గవ భాగములో ఉన్న ఆత్మయొక్క ఫోకస్‌ను జీవుడవైన నీ మీద ప్రసరింప చేస్తుంది. అప్పుడు ఆత్మ అంటే ఏమిటో అర్థమగును. అంటే ఇంతకు ముందు మూడు గుణ

భాగములలో ఉన్న శ్రద్ధలు జీవుని యొక్క ఫోకస్‌ను గుణంపైకి ప్రసరిస్తే, నాల్గవ భాగములో మాత్రము శ్రద్ధ అనే అద్దము ఆత్మ అనే ఫోకస్‌ను జీవుని పైకి ప్రసరింపజేసింది. అప్పుడు ఆ వ్యక్తికి ఆత్మ అంటే ఏమిటో తెలుస్తుంది. అప్పుడు ఆ వ్యక్తిని యోగి అందుము. తామస గుణభాగంలో ఉంటే తామసుడు అంటాము. రాజస భాగములో ఉంటే రాజసుడు అంటాము. సాత్త్విక భాగములో ఉంటే సాత్త్వికుడు అంటాము. ఈ విధంగా మాయలో మానవుడు చిక్కుకుంటున్నాడు. మరియు తెలుసుకుంటే మాయకు అతీతముగా కూడా ఉండగలడు. దానినే స్వయం శ్రద్ధ అంటాము. దానినే భగవద్గీతలో శ్రీకృష్ణుడు **"శ్రద్ధవాన్ లభతే జ్ఞానమ్"** అన్నాడు. అంటే నాల్గవ స్థానములో జ్ఞానము ఉంది కనుక నీకు దానిలోనే స్వతంత్రత ఉంది. కర్మాతీతమైన శ్రద్ధ అందులో ఉంది. దానిలో నీ శ్రద్ధను ఉపయోగించుకుంటే నీకు జ్ఞానము లభించును. దానినే ఆత్మజ్ఞానము అందుము. ఎందుకంటే నీ శిరస్సులో నాల్గవ భాగపు గుణ చక్రములో ఆత్మ ఉంది కనుక, దానిని నీవు నీ స్వయం శ్రద్ధతో తెలుసుకునే స్వతంత్రత జీవునిగా ఉంది కనుక దానిని తెలుసుకోవటమే ఆత్మజ్ఞానము అగును. నాకు జ్ఞానము ఎట్లు తెలుస్తుంది అనుకోవద్దు, అక్కడకు నీవు మూడు గుణాలను దాటిపోయి, గుణాతీతుడవై, నాల్గవ భాగంలోని శ్రద్ధను ఉపయోగించుకుంటే నీకు ఆత్మ జ్ఞానము లభ్యమవుతుంది.

ఇదంతా రహస్యమే కానీ నీవు తెలుసుకోక, నాల్గవ భాగంలోకి చేరకపోతే రహస్యమే. ఈ విషయములు ఇంతవరకు ఎవ్వరూ చెప్పలేదు. నాల్గవ భాగములోనే మనకు ఆత్మజ్ఞానము మాత్రము తెలియుచున్నది. మూడు భాగములలో ఉన్న శ్రద్ధ నిన్ను మాయలో ముంచుచున్నది. నీకు దానిపైన అధికారము లేదుకానీ, నాల్గవ భాగములో ఉన్న శ్రద్ధ మాత్రము

www.thraithashakam.org

నీ ఆధీనములో కలదు. దానిని నీవు ఎంత ఉపయోగించుకొంటే అంత ఆత్మజ్ఞానము తెలియును. కానీ మూడు గుణములలో ఉన్న మూడు శ్రద్ధలను, గుణములను నీవు దాటలేవు ఎందుకంటే **"మమ మాయా దురత్యయా"** అన్నాడు. కానీ నాల్గవ భాగములో ఉన్న ఆత్మ భాగంలోకి చేరితే మాత్రము "తరన్తితే" తరించి పోగలవు. అందుకే వీరబ్రహ్మంగారు కూడా ఒకమాట చెప్పారు. **"మూడు కాల్వలు దాటలేరన్న ఇల మూఢ జనులు, మూడు కాల్వలు దాటలేరన్న"** మరి దాటాలంటే ఏమి చేయాలి? ఒక ఉపాయం ఉంది. అదేమంటే మూడు గుణభాగములలో ఉన్న మూడు శ్రద్ధలనే అద్దములకు బురదపూయవలెను. ఏమగును అప్పుడు జీవుడు అనే ఫోకస్‌ను మరి ఏ గుణముయందు ప్రసరింపజేయలేవు. అప్పుడు జీవుడు గుణాతీతుడగును. అప్పుడు ప్రపంచపు శ్రద్ధ తగ్గి, అంటే సత్వరజో, తమో గుణములనే మాయ మీద శ్రద్ధ తగ్గును. అప్పుడు దేవుడిమీద శ్రద్ధ వస్తుంది. అంటే నీకు జ్ఞానము తెలుస్తుంది. కనుక ఈ రోజు మనిషి ఏ విధముగా మాయలో ఇరుక్కుంటున్నాడు, మాయనుండి ఏ విధముగా బయటపడవలెను అనే క్రొత్త విషయమును తెలియజేశాము. అంతేకాకుండా బయటి సమాజంలో సక్రమముగా బ్రతకాలంటే లోపల సమాజం గురించి తెలుసుకుని తీరాలి. ఈ విధముగా తెలుసుకోకపోతే మనిషి తప్పుడు మార్గంలో ప్రవర్తిస్తాడు. తద్వారా వాడు "నేను తప్పుడు మార్గంలో ప్రవర్తిస్తున్నానన్న" విషయం కూడా వాడికి అర్థముకాదు. ఈ విషయంలో చాలామంది పొరపడుచున్నారు. కనుక మీరంతా లోపలి సమాజం గురించి ముఖ్యముగా తెలుసుకోండి. తరువాత బయటి సమాజంలో ఏ విధంగా బ్రతకాలో అర్థమగును.

www.thraithashakam.org

# 41. సహజ మరణం - తాత్కాలిక మరణం

<u>తేది : 19.01.2011</u>

ప్రతీమాసం మనము ఒక క్రొత్త విషయాన్ని చెప్పుకుంటున్నాము. ప్రతీ విషయం సంచలనాత్మకమే. ఇంతవరకు కనీవినీ ఎరుగని విషయాలే చెప్పుకుంటున్నాము. ఆ బోధలనే గ్రంథరూపములో కూడా వ్రాస్తున్నాము. కొందరు ఈ గ్రంథాలను చదివి ఇక్కడకు రావడము జరిగింది. వచ్చిన తరువాత, మమ్మల్ని సర్వసాధారణంగా చూడటం జరిగింది. నన్ను చూచిన తరువాత వారికోక అనుమానము వచ్చింది. ఈ గ్రంథాలను వ్రాసిన వ్యక్తి, ఈ వ్యక్తీ ఒక్కరేనా? గ్రంథాలను వ్రాసిన వ్యక్తిని గొప్పగా ఊహించు కున్నారు. కనపించే వ్యక్తి సర్వసాధారణంగా ఉండటం, అడ్డపంచె కట్టుకుని, బనీను గుడ్డ వేసుకుని వున్నాడు. అందువలన ఊహించు కున్నంత గొప్పవాడుగా కనిపించక పోయేసరికి అనుమానము వచ్చింది? గ్రంథాలు వ్రాసిన వ్యక్తి వేరేగా ఇంకొకరు ఉండి ఉంటాడు అని అనుకుంటారు. అంటువంటివారు స్వామి ఉన్నారా? అని స్వామినే అడుగుతారు. లేదని సమాధానము ఆ స్వామినుండే వింటారు. ఒక్కొక్కప్పుడు స్వామి స్వామిలాగ ఉంటాడు, ఎప్పుడుంటాడు? ప్రతీ పౌర్ణమికి ఉంటాడు. ఆ రోజు ఉపన్యసిస్తాడు. అదీ వాస్తవమే. మధ్యలో లేకుండా ఉండేదీ వాస్తవమే.

అందుకే వ్యక్తిని చూసి మనము జ్ఞానాన్ని లెక్కించుకుంటే, మనకంటే వేషములోనూ, భాషలలో బాగా కనిపించేవారున్నారు. వాక్చాతుర్యంతోనూ, అన్ని రకాలుగా బాగా కనిపించే వారున్నారు. అందుకే మేము ఏమి చెప్తున్నామంటే, పైకి కనిపించే స్థూలాకారాన్ని చూసి లెక్కించుకోవద్దండి. స్థూలాకారమును కాకుండా లోపలనుండి వచ్చే జ్ఞానము ఎటువంటిది అనే విషయంపైన దృష్టిసారించాలి. ఇంతకుముందే మేము చెప్పాము, ఒక

వక్తిని మూడు రకములుగా విభజించవచ్చును. అదే త్రైతము అని చెప్పాము. ఒకటి జీవాత్మగా, రెండు ఆత్మగా, మూడవది పరమాత్మగా విభజించవచ్చు. కానీ ఎప్పుడు ఎవరు మాట్లాడుచున్నదీ చెప్పలేము. స్థూలముగా ఒక వ్యక్తి ఉన్ననూ, ఆ వ్యక్తిలో ఎవరు మాట్లాడుచున్నది ఎవరికీ అర్థముకాదు. కొన్నిసార్లు కొన్ని విషయాలు మీరు మాట్లాడుచుంటారు. కానీ మీకు ఆ విషయం తెలియకుండానే మాట్లాడుతారు. మీరు జ్ఞానము చెప్తూ, ఎవరికీ తెలియని జ్ఞానాన్ని చెప్పేస్తూ ఉంటారు. ఎప్పుడూ మాట్లాడని విషయాలు కూడా మాట్లాడుతూ ఉంటారు. మరి ఆ విషయాలు మీరు మాట్లాడలేదు అనే దానికి కూడా ఏ ఆధారము ఉండదు. మాట్లాడుతూ కనిపిస్తున్నాను! కదా అనే సాక్ష్యం నీకుంది. నీకు తెలియని విషయాలు కూడా మాట్లాడినావు నీవు మాట్లాడలేదు అనే దానికి కూడా సాక్ష్యం ఉంది. కానీ ఎటూ తేల్చుకోలేని పరిస్థితి ఎదురవుతుంది. ఒక గురువు దగ్గర కొందరు శిష్యులుండే వారు. ఆ శిష్యులు కోర్టుకు వాయిదాకి వెళ్ళి ఏమి చెప్పాలా? అని ఆలోచిస్తున్నా రంట. అప్పుడు ఆ గురువుగారు అన్నారట. ఇప్పుడెందుకు ఆలోచిస్తున్నారు. కోర్టుకు వెళ్ళినప్పుడు ఏం మాట్లాడాలో అదే మాట్లాడించబడుతుంది. అదే మీరు మాట్లాడుదురు. మీ నిర్ణయం ఏమీ లేదు అని దాని అర్థము. ఆ విధముగా లెక్కించుకుంటే మూడు భాగములున్నాయి, మూడు చైతన్యాలున్నాయి అంటారు. అవే జీవాత్మ, ఆత్మ, పరమాత్మ.

అందుకే మేము ముందే చెప్తూ ఉంటాము. మేమూ మీలాంటి మనుష్యులమే, మాకు మ్రొక్కవద్దండి. మాకు మ్రొక్కితే ఏమీ ప్రయోజనము లేదు. దేవున్ని మ్రొక్కండి, దేవున్ని మ్రొక్కితే దేవున్ని ఆరాధించి సేవ చేసినట్లవుతుంది. కానీ మమ్మల్ని నమస్కరిస్తే ఏమీ ప్రయోజనము లేదు. మేము, మీరు సమానమే అని చాలాసార్లు చెప్పాము. మనిషి ఎప్పుడూ

దేవుడు కాడు అని కూడా బోర్డుపైన వ్రాశాము. మాకు ఏమీ తెలియదు అనే దానికి ఇది నిరూపణ. సంచలనాత్మక విషయాలు ఎట్లా చెప్తున్నారు? అని మమ్మల్ని మీరు ప్రశ్నించవచ్చు. స్థూలముగా నేను చెప్పినట్లు మీకు కనిపించుచున్నాను. కానీ చెప్పే వ్యక్తి ఇంకొకడు ఉన్నాడు. అయితే మనిషిలో ఎంతమంది వ్యక్తులు ఉంటారు? మీకు తెలిసినా, తెలియకపోయినా ముగ్గురు (ఆత్మలు) ఉంటారు, ఉన్నారు. ఒకడు లోపల, బయటా అంతటా ఉంటాడు. ఇద్దరు మాత్రము లోపలే ఉంటారు. ఆ ఇద్దరిలో ఒకడు శరీరములో అంతటా వ్యాపించి ఉన్నాడు. ఇంకొకడు శరీరములో ఒక రవ్వంత ఉన్నాడు. నేను కూడా ఒక రవ్వంత ఉన్నవాడినే కనుక నాకేమీ తెలియదు. శరీరము అంతటా వ్యాపించి ఉన్నవాడు మాట్లాడితే మాట్లాడ వచ్చు. వాడు ఎటువంటి రహస్యాన్నైనా చెప్పవచ్చు. మీరు శరీరము దాని ఆకారమును చూడవద్దండి, కానీ శరీరములోపలవాడు చెప్పిన జ్ఞానము సత్యమా, కాదా? అని మాత్రము చూడండి.

ప్రతీ మనిషి పాపము మరియు పుణ్యము చేసి భూమిమీద పుడుచున్నారు. నీవు భూమిమీద పుట్టావంటే నీకు ఒక చరిత్ర ఉంది. అది ఏమంటే పాపపుణ్యాల చిట్టా అనే చరిత్ర. మనిషి పాపపుణ్యములను అనుభవించేదానికి పుట్టి, మరల పాపపుణ్యాలను సంపాదించుకుంటున్నాడు. దానిని అనుభవించేందుకు మరలా జన్మలు తీసుకోవలసి వస్తున్నది. ఒక మనిషి భూమిమీద పుట్టాడు అంటే కారణం కర్మ. అంటే పాపపుణ్యముల విషయములే. ఈ జ్ఞానము ఏ ఒక్కరికో సంబంధించినది కాదు. ప్రతీ ఒక్కరికి సంబంధించినదే పాపపుణ్యములకు ప్రతిఫలితముగా కష్టసుఖాలను అనుభవించాల్సిందే. ఇప్పుడు పాపములు అనే విషయం గురించి చర్చిద్దాం. మనిషి పుట్టినప్పటినుండి పాపఫలితంగా ఎన్నో రకముల రోగములున్నాయి.

మనిషి పుట్టినప్పటి నుండి పాపఫలితములను అనుభవిస్తున్నాడు. అది చనిపోయినంత వరకు అది జరుగుతూనే ఉంటుంది. జీవుడు కష్ట, సుఖముల రూపములో పాపపుణ్యములను అనుభవిస్తున్నాడు. ఇందులో క్రొత్త ఏముంది? అని అనుకోవద్దండి. ఈ విషయాన్ని సరిక్రొత్త కోణంలో వివరిస్తాము. ఇప్పుడు కొందరు చావుపుట్టుకలు కర్మనుబట్టే (అనుసరించే) ఉండును అంటుంటారు. కానీ ఇక్కడ మేము ఏమి చెప్తున్నామంటే చావు పుట్టుకలు సహజమైనవే, అంటే అందరికీ ఉన్నటువంటివే. బ్రతికి ఉన్నంత వరకే నీకు కష్టమూ, సుఖము. మరణములో ఏమీ లేవు. పుట్టిన తరువాతనే కష్టము మరియు సుఖము. పుట్టుకలో ఏమీ లేవు కాబట్టి ఈ మధ్యలో ఉండేవి పాపపుణ్యముల అనుభవాలేగానీ, ఈ పుట్టుకగానీ, చావుగానీ ఏవీ కూడా పాపపుణ్యములకు సంబంధము లేదు. ఈ రెండు సహజంగా జరిగేటటువంటివి. కనుక చావును, పుట్టుకను కర్మకు లెక్కవేయరాదు. మరి కొందరు సుఖంగా చస్తున్నారు, కొందరు కష్టంగా చస్తున్నారంటే, ఉండేంతవరకు కష్టముందికానీ, చనిపోయేటప్పుడు కష్టంలేదు. మీరు మా గ్రంథమైన **'మరణ రహస్యము'** ను చదివే ఉంటారు. బ్రతికి ఉన్నంత వరకే జ్ఞాపకాలు ఉంటాయిగానీ తరువాత లేవు. **చావు, పుట్టుకలు కర్మకు అతీతమైనవి.** ఇప్పుడు ఈ ప్రపంచములో అందరూ ఏమి పొరపడు చున్నారంటే దేవుడూ, భగవంతుడు ఒక్కడే అనుకుంటునట్లు గానే ఈ చావు, పుట్టుకలు కూడా కర్మను అనుసరించే ఉంటాయి అనుకుంటున్నారు. అలా అనుకొని ఒకరికి కష్టమైన చావు ఉంటుంది. మరొకరికి సులభమైన, సుఖమైన చావు ఉంటుంది అని అనుకుంటున్నారు. చావులో కష్టాలు, సుఖాలు ఏమీ ఉండవు, ఏ అనుభవాలు ఉండవు. మనమెక్కడైనా ఆ విధముగా చెప్పామా? సిద్ధాంతములో ఎక్కడైనా ఉన్నాయా? అజ్ఞానములో

అయితే చాలా చెప్పుకోవచ్చు. యమభటులు ఇద్దరు వచ్చేవారున్నారు. నలుగురు వచ్చే వారున్నారు అని అంటుంటారు. కొన్నిసార్లు స్వయముగా యమధర్మ రాజే వస్తాడని కూడా చెప్పుకోవచ్చును. శాసనములతో కూడుకున్న శాస్త్రములో ఈ విధముగా ఎక్కడా లేదు. మేము 1980 లోనే వ్రాసిన గ్రంథములో వాస్తవము వ్రాసాము. 30 సంవత్సరముల క్రితమే **"మరణంలో ఏ విధమైన కష్టము గానీ, సుఖముగానీ లేదు"** అని వ్రాశాము. అదే విధముగా పుట్టుక కూడా కష్ట సుఖాలకు అతీతంగా ఉంది. చనిపోయేటప్పుడు ఏ అనుభవము లేదు. చావు, పుట్టుకల మధ్య ఉండేవే అనుభవాలు. ఈ రెండింటి మధ్యలో ఉన్న అనుభవాలు రకరకములుగా ఉండవచ్చు. ఒక వ్యక్తికి రెండవ వ్యక్తికి వ్యత్యాసములు ఉండవచ్చు ఈ పాపమును అనుభవించే వాటిలో రకరకములైన పద్ధతులుండవచ్చు. అందులో రోగము అనునది ఒకటి. రోగము పాపసంబంధమైనది. పాపమును రోగము ద్వారా అనుభవించాల్సిన పరిస్థితి వస్తుంది.

ఒక మనిషికి ఒక రోగము వచ్చిందనుకో ఆ రోగమునకు ఒక పేరు పెడతాము. ఇంకొకరికి అదే రోగము వచ్చిందనుకోండి, ఉదాహరణకు ఇద్దరికీ టైఫాయిడ్ అనే రోగమే వచ్చిందనుకోండి. వారిద్దరూ ఆ రోగబాధను అనుభవించే విధానములో వ్యత్యాసము ఉంటుంది. అదే విధముగా ఇద్దరికీ మలేరియా వ్యాధి ఉన్నప్పటికీ, ఒక వ్యక్తి రోజూ జ్వరంతో బాధపడితే, ఇంకొక వ్యక్తి మూడు రోజులకొకసారి ఆ వ్యాధితో బాధపడుతాడు. వ్యాధి ఒకటే అనుభవాలు వేరు. ఆ వ్యాధితో ఒకరికి, ఇంకొకరికి ఎంత బరువు మోపాలి 20 కేజీల బరువా (తీవ్రత), 70 కేజీల బరువా లేదా టన్ను బరువా అంటే (అంత తీవ్రతతో) అనుభవించాలా అని నిర్ణయం మేరకు నీచే అనుభవింపజేసేది రోగము. మీరేమి అనుకున్నా సరే, రోగము

www.thraithashakam.org

వ్యక్తిత్వము కలిగినటువంటిది. రోగము కూడా మీలాంటిదే. గ్రహించుకునే శక్తి దానికి ఉంది. ఎంత అనుభవింపజేయాలో లెక్కాచారము చూసి, నీచే అనుభవింపజేస్తుంది. పొరపాటుగా, ఈ రోగము ఈ మందు ద్వారా పోతుంది అని అనుకున్నారనుకోండి, అది పోదు. మందువేస్తే రోగము పోతుంది అని గ్యారంటీ ఏమీ లేదు. ఈ మధ్య టీవీ ఛానల్‌లో చెప్తుంటే విన్నాము. **"మనిషి ఎంత ఎత్తు ఎదిగినా కానీ ప్రకృతి ముందర దేనికీ పనికి రాడంట"** 1912వ సంవత్సరములో టైటానిక్ అనే పడవ మునిగి పోయింది. 99 సంవత్సరముల క్రితం పెద్ద ఓడ, దానిలో 2200 మంది ప్రయాణికులున్నారు. అన్ని సౌకర్యాలు కల్పిస్తూ నిర్మించిన ఓడది. ఆ ఓడలో స్విమ్మింగ్‌పూల్స్ ఉన్నాయి. బజారులున్నాయి, అలాంటి ఓడలో ఐదు అంతస్థులున్నాయి, అంత పెద్ద ఓడను, మానవుడు చాలా తెలివిగా తయారు చేశాడు. అన్ని సుఖ, సౌఖర్యాలు ఉండేటట్లుగా నిర్మించాడు. అంతపెద్ద ఓడ సముద్రములో మునిగిపోయింది. 700 మందిని రక్షించగలిగారు. కానీ 1500 మంది అందులో నిలిచి సముద్రములో మునిగిపోయి, చనిపోవటం జరిగింది. అంతపెద్ద ప్రమాదం ఎందు కొచ్చిందంటే వారి కర్మ అలా ఉంది. కానీ అక్కడవారు చెప్పేదేమంటే 'ఎంత విజ్ఞానము పెరిగినాగానీ, ప్రకృతి ముందర మనిషి చాలా చిన్నవాడు' అన్నది వాస్తవమే. సకల జీవరాసులు ఈ ప్రకృతిలో భాగములే రోగము కూడా ప్రకృతిలో భాగమే. దేవుని ఆజ్ఞతో అది పని చేస్తుంది. దేవుని ఆజ్ఞలో ప్రకృతి పని చేస్తుంది. ప్రకృతి ఆజ్ఞలో భూతములు పనిచేస్తున్నవి. భూతములు అంటే దెయ్యములు అనుకోవద్దండి. ఈ మధ్య వచ్చిన సినిమా 'నాగవల్లి' లో, ఒక వ్యక్తి దెయ్యాలు లేవు భూతములు లేవు అన్నాడు. ఆ విధముగా అన్నాడంటే దెయ్యాలు భూతములు రెండు వేరువేరనే కదా!

దీనికొక వివరణ ఉంది మరియు దానికొక వివరణ ఉంది. దేవుడు, భగవంతడు ఒక్కరే అనుకున్నట్టు, దయ్యాలకు భూతములకు మనిషి ఇంకా తేడా తెలియలేదు. ఆధ్యాత్మికరంగంలో భూతముల విషయమే మరచి పోయారు. దయ్యాల విషయమూ మరచిపోయి, అదంతా మోటుపద్ధతి, తెలివితక్కువ పని, మనకు సంబంధము లేని విషయము అని వదలివేశారు. కానీ మానవ జీవితములో పూర్తి సంబంధము కలిగివున్నవి భూతములు, మీరు అందరూ దయ్యాలే! ఎందుకంటే శరీరము ఉండే దయ్యాలు మీరు, శరీరము లేని దయ్యాలు వారు. నిన్ను పరిపాలన చేసేవి భూతములు. అంటే దయ్యాలు వేరు, భూతములు వేరు. రోగము ఒక భూతమే. రోగము ఒక్కటే అయినా ఒక్కొక్కరిని ఒక్కొక్కరకంగా హింసిస్తుంది. కానీ నిజమైన యోగి అయినటువంటివారు ఎవరైతే ఉన్నారో జ్ఞానశక్తి ఉన్నటువంటి వాడు ఎవరైతే ఉన్నారో, వారి మాటలను భూతములు తు.చ తప్పకుండా, తప్పనిసరిగా గౌరవిస్తాయి. ఈ మాటమీకు క్రొత్తగా ఉండవచ్చుగానీ, ప్రత్యక్షముగా కొంతమంది ఇక్కడున్నవారు చూసే ఉంటారు. ఒక క్యాన్సర్ బాధితుడు (పేషెంట్) రెండు, మూడు రోజుల్లో చనిపోతాడు అని, డాక్టర్లు నీకు మందులేమీ పని చేయవు అని ఇంటికి పంపించన వ్యక్తిని, అతనిలో ఉండే క్యాన్సర్‌కు చెప్పిందే మంటే, జ్ఞానము అభివృద్ధి అయ్యే నిమిత్తము దేవునిశక్తి ఇంతటిది అని తెలిసే నిమిత్తము, ఇతను జ్ఞానమార్గములోకి ప్రవేశిస్తే, ఇతడు దేవున్ని విశ్వసిస్తే ఓ క్యాన్సర్ నీవు ప్రక్కకుపో! జ్ఞానాన్ని, దేవుని విశ్వసించకపోతే చంపేయ్ ఫరవాలేదు. అప్పుడు ఆ క్యాన్సర్ పేషెంట్ దేవున్ని విశ్వసిస్తానని, జ్ఞానాన్ని తెలుసుకుంటానని అని అంగీకరిస్తే, ఆ క్యాన్సర్ అనే రోగ భూతము ఆ వ్యక్తిని క్షమించి, ఆ శరీరమునుండి బయటకు పోయింది. ఇప్పుడు ఆ వ్యక్తి ఆరోగ్యంగా ఉన్నాడు. ఈ సంఘటన జరిగి

10-12 రోజులవుతుంది కదా! మరి ఇప్పుడు ఏమంటారు? జ్ఞానానికి ఇటువంటి శక్తి ఉంది అనే విషయం అర్థమయింది. అంటే జ్ఞానాన్ని భూతములు కూడా గౌరవిస్తాయి. దైవజ్ఞానమునకు విలువనిచ్చే మనిషి దీనికి మించినది మరియొకటి లేదు అనుకుంటాడు. తెలియకపోతే ఇష్టము వచ్చినట్లు లెక్కపెట్టు కుంటున్నాడు. దైవత్వం అనేది అడుగు అంటినట్లు చేస్తున్నారు. ఈ జ్ఞానము అనేది తెలియకుండా పోయింది. కానీ మేము ఏమి చెప్పుచున్నామంటే జ్ఞానము చాలాగొప్పది. మిమ్మల్ని హింసించే భూతాలే గౌరవిస్తున్నాయి. గౌరవించటము వలననే ఈ జ్ఞాన విషయం తెలుస్తుందని నిరూపణ నిమిత్తము ఆ భూతము ప్రక్కకు పోయింది.

ఇప్పుడున్న కొందరు విజ్ఞానులు చాలా రోగాలను మేము కనుక్కుంటున్నాము, వాటికి మందులూ కనుక్కుంటున్నాము, తద్వారా ఆ రోగక్రిములు చనిపోతున్నాయి. రోగము రాకుండా పోతున్నది అని భౌతికశాస్త్రము అనగా వైద్యశాస్త్రము చదివిన డాక్టర్‌లు చెప్పుచున్నారు. వాస్తవమే, మేమూ అదే చెప్పుచున్నాము. ఒక రోగము ఉంటే, అది మందు (ఔషధము) ద్వారాగానీ, మాటద్వారాగానీ, మంత్రము ద్వారాగానీ పోతుంది అని చెప్పాము. అన్నీ మందుల ద్వారా పోతున్నాయా పోవు. కొన్ని మంత్రాల ద్వారా పోతాయా అంటే అలాగ కూడా కొన్ని వెళ్ళవు. కానీ ఒక చిన్నమాట మీద మాత్రము వెళ్ళిపోతాయి. కానీ మందుద్వారాగానీ, మంత్రము ద్వారా గానీ, మాటద్వారాగాని పోని పాపాలు, క్షమించరాని పాపాలు అని అంటాము. ఆ పాపాల పరిపాలనలోకి రోగ భూతాలు వెళ్ళవు. ఈ విషయాన్ని దేవుడే చెప్పాడు. కనుక అవి తిరుగులేనివి, ఆ పాపాలను రెండు యుగముల పర్యంతము అనుభవించాలి. అవి క్షమించరాని పాపములు. ఇప్పుడు ఒక రోగముంది అనుకోండి, ఇప్పుడు దానికి ఒక

www.thraithashakam.org

మందు కనిపెట్టాము. ముందే టీకాలు కనిపెట్టారు. మశూచి వచ్చింది. మశూచినే పెద్దమ్మ అంటారు. దానికి వ్యాధినిరోధక టీకాలు శాస్త్రజ్ఞులు కనిపెట్టి, ప్రజలందరికీ దానిని ఇచ్చేశారు. పుట్టిన పిల్లలకు కూడా ఇచ్చేసారు. అప్పుడు ఆ రోగము జీవితములో రాకుండా పోయింది. ఆ రోగము ఎటువంటిదో, భూమిమీద తెలియకుండా పోయింది. ఈ రోగము ఎక్కడైనా ఉందని చెప్తే లక్ష రూపాయలిస్తామని ఛాలెంజ్ చేశారు శాస్త్రజ్ఞులు. కొన్నాళ్ళ వరకు ఆ రోగము కనిపించలేదు. ఇప్పుడు మీరు భూతమంటారు, ఎక్కడుంది? మేము మశూచిని సర్వనాశనము చేశాము అని ప్రశ్నించవచ్చు. ఇది ప్రశ్నే, మరి కొన్నేళ్ళకు ఆ వ్యాధి మరలా ఈ మధ్య కనిపించింది. మరి ఇప్పుడు ఎక్కడనుండి వచ్చింది? దానికి జవాబు లేదు. ఆ రోగము పూర్తి అణిగిపోయి ఎక్కడో ఒకచోట ఉండి మరలా వచ్చింది. అదే విధంగా క్రొత్త రోగము ఒకటి బయటపడుతుంది. దానికొక పేరుపెడతాం, ఒక రోగము క్రొత్తది వస్తే, ఆరునెలలు పరీక్ష చేసి, ఇదేదో క్రొత్తది అనుకున్నాము. ఈ రోగము ఇంతకుముందు వచ్చినదికాదు, క్రొత్తది అని తెలుసుకునేందుకు ఆరు నెలలు పట్టింది. ఈ రోగాలు వీటి గురించి మీరెందుకు చెప్పుచున్నారు అంటే, మీ శరీరములో జరిగే ప్రతీదీ ఆధ్యాత్మికమే. నీ శరీరము అంతా ఆత్మ నిండుకుని ఉంది. నీ శరీరములో ప్రతీ విషయము ఆధ్యాత్మికమే ఏదో గుడికిపోయి, పది టెంకాయలు కొట్టేస్తే ఆధ్యాత్మికము కాదు, అది జ్ఞానము కాదు. దేవుడు తెలియబడడు. నీవు జ్ఞానివికావు. నీకు ఏ రోగము భయపడదు.

ఈ మధ్య 1500 పందులను అమెరికాలో కాల్చివేశారు. ఎందుకంటే ఆ పందులకు ఒక వ్యాధిసోకింది. ఆ వ్యాధితో పందులూ చనిపోతున్నాయి. దానితోపాటు వాటిని సాకిన మనుషులూ చనిపోతున్నారు.

ఈ రోగము ఏమిటీ అని తెలుసుకునే దానికి ఆరునెలల కాలము పట్టింది. ఆ క్రిమికి ఏ రోగముల పోలికలు లేవు. ఆరు నెలలపాటు అది విస్తరిస్తూ పోయింది కదా! దానికేమి మందులు లేవు. పందుల వలన ఈ వ్యాధి వస్తున్నది కావున పందులను నియంత్రించాలి, పందులకు దోమకుట్టితే దోమకు క్రిములు అంటుకొని వచ్చాయి. కావున పందులను ఊరిబయటకు తోలారు. ఈ వ్యాధితో మెదడు బాగా వాచిపోయేది, చాలామంది చిన్నపిల్లలకు ఈ వ్యాధి వచ్చి చనిపోయారు దానికి అల్లోపతిలో మందులేదు. హోమియోపతిలో మందు కనుక్కున్నారు. హోమియోపతి మందు వాడితే అది తగ్గిపోయింది. ఆ రోగము వ్యక్తిలో అణిగిపోయినాగానీ అది అణిగిపోయే ముందు ఏదో ఒక అవయవలోపము చేసి వెళ్ళిపోయేది. కన్నుగానీ, చెవుగానీ, చేయిగానీ లేదా కాలు అయినాగానీ సాధారణంగా ఎవ్వరైనా ఈ వ్యాధివస్తే బ్రతకరు. కానీ ఒకవేళ బ్రతికితే ఏదో ఒక భాగము పనిచేయటం మానేసేది. అదే విధంగా అమెరికాలో కూడా ఈ పందులను ఒక వ్యాన్‌లో వేసుకొనిపోయి ఒక గుంతలో వాటిని పడవేసి కాల్చేసి, మన్నుతో కప్పేశారు. మొత్తము పందులన్నీ చంపేశారు. పందులకు ఈ వ్యాధి ఎట్లా వచ్చిందనేది తెలియలేదు. అది కనుక్కునేందుకు ఏడు నెలలకాలము పట్టింది. అంటే వ్యాధిని కనుక్కునేందుకు ఆరునెలలు, దేనివలన వస్తుందో కనుక్కునేందుకు ఏడునెలలు పట్టింది, అది క్రొత్త రోగము. అంతకుముందు ఎక్కడ పుట్టింది? ఎవ్వరికీ అర్థము కాలేదు. అంటే ముందే ఆ రోగము ఒక జీవరాశిలో ఉంది. అది రిజర్వుడుగా ఉంది. నీటిని ఒక రిజర్వాయర్‌లో నిల్వవుంచినట్లు ఒక జీవరాశి ఆ క్రిమికి రిజర్వాయర్ అయింది. అక్కడనుండి పందుల వైపుకు వచ్చి, వాటి శరీరములో దూరి, పందులనుండి మనుషలకు వచ్చింది. పందులవలన

www.thraithashakam.org

వస్తున్నదని పందులను చంపారు. మరి ఆ రోగము ఆగిపోయిందా, ఆగలేదు. ఎందుకంటే దాని రిజర్వాయర్ ఒకచోట ఉంది. మరి ఒక రోగము క్రొత్తగా పుట్టిందంటే, ఆ రోగము నీకు కనిపిస్తే ఆ రోగము ముందే ఈ భూమిమీద ఉంది. కానీ అది ఎవరి శరీరములోకీ ప్రవేశించ లేదు, ఎవరి శరీరములోనూ అది బయటపడలేదు. కావున తెలియలేదు. అంటే ఒక శరీరములో ఉంది. వేరే శరీరములోకి రాలేదు మనకి ఎన్నో జీవరాశులున్నాయి కదా, ఏదో ఒక జాతిలో అది రిజర్వ్‌గా ఉంటుంది. ఈ మధ్య స్వైన్‌ఫ్లూ అనే క్రొత్త జబ్బు వచ్చింది. ఈ స్వైన్‌ఫ్లూ అనేది వంద సంవత్సరాల పూర్వమే ఉంది. ఏదో ఒక జీవిలో రిజర్వ్‌గా ఉండి ఇప్పుడు అది బయటకు వచ్చింది. మరి మందు మరలా కనుక్కున్నారు. ఎయిడ్స్ రోగము ఉంది అది 30-40 సంవత్సరాల క్రిందట వచ్చింది అంటున్నారు. ఇది ఐదారు వందల సంవత్సరాల నుండి మనిషిలో ఉంది. తరువాత బయటకు వచ్చింది. వచ్చిన తరువాత దానికి మందు కనుక్కునేందుకు ప్రయత్నం చేస్తున్నారు. మందు మాత్రము ఇంతవరకు కనుక్కోలేదు. దాని క్రిమి ఫోటో చూసినట్లైన చాలా అందంగా ఉంటుంది. సన్‌ఫ్లవర్ ఎట్లా ఉంటుందో అట్లే ఉంటుంది. ఇప్పుడు మీకు బాధించే వ్యాధులే కాకుండా ప్రపంచములో ఎన్ని రోగాలయితే ఉన్నాయో అంతకు రెట్టింపు రోగాలు రిజర్వ్‌లో ఉన్నాయి. మిమ్మల్ని ఎవ్వరూ కాపాడలేరు. 2012 సంవత్సరములో భూకంపము వచ్చి చనిపోతారు అంటున్నారు కదా. అంతవేగంగా మనుష్యులు చనిపోవటానికి వీళ్ళేదు అన్నమాట. అందుకే రోగాలు మాత్రము క్రొత్తగా వస్తాయి. కొన్ని జంతువులు అంతరించి పోయాయి అంటున్నారు. నిజమే కొన్ని జాతులు మాత్రము క్రొత్తగా వచ్చాయి అలాగే క్రొత్త రోగాలు కూడా వస్తాయి. ఇప్పటికంటే రెట్టింపు రోగాలొస్తాయి. పందులకు వచ్చే

రోగము వలన పందులను నియత్రించారు కదా! అసలా రోగము ఎక్కడినుండి వచ్చిందో కనుక్కున్నారు. తలక్రిందులుగా వ్రేలాబడే పెద్ద గబ్బిలాలలో రిజర్వ్‌గా ఉంది ఆ రోగము. అది ఎప్పుడైతే బయటకు వస్తుందో అది ప్రపంచవ్యాప్తంగా విస్తరించుకుంటుంది. ప్రపంచ వ్యాప్తంగా వచ్చిందనుకో, దానికెక్కడా మందులేదు. వ్యాధి వచ్చిన నాలుగు ఐదు రోజుల్లో చనిపోతారు. ఈ విధముగా మనుషుల్లో నాలుగైదు రోజుల్లో చంపేసే వ్యాధి (రోగ క్రిమి) ఒక్కటి సిద్ధంగా ఉంది. నేను బయటికి వచ్చి మీ పని చెప్తాను అంటుంది. నీవు పాపాలు చేస్తున్నావు కదా! నిన్ను ఐదు రోజుల్లో చంపేసత్తా నా దగ్గర ఉంది అంటున్నది. ఇంకా పది రోజుల్లో చంపే క్రిములున్నాయి. 20 రోజుల్లో చంపే క్రిములున్నాయి. ఒకే ఒక్క రోజులో చంపే రోగాలు కూడా రెడీగా ఉన్నాయి. కనుక తెలుసుకుని ఇప్పటికైనా జాగ్రత్తపడుదాము. మేము ఏమీ అబద్దము చెప్పటం లేదు. ఇవన్నీ వాస్తవాలే. ఈ విధముగా ఏదైనా రోగము వస్తే మనము చనిపోతాము కదా! ఇదంతా మరణానికి ముందు జరిగే తతంగము. నీవు జీవిగా ఉండేటప్పుడు జరిగే విషయాలు చెప్తున్నాము తప్ప కథలు కావివి. మీ శరీరానికి మీ ఆత్మకు సంబంధించిన విషయాలే చెప్తాము. నీవు ఏదోరోజు చనిపోవాల్సి ఉంది. అది నీ కర్మకు అతీతంగా ఉంటుంది. గత 30 సంవత్సరాల క్రితం వ్రాసిన **“మరణ రహస్యము”**లో ఏదైతే వ్రాశామో, అదే మాట ఇప్పుడు కూడా చెప్పుచున్నాము.

మరణము ఎన్ని రకములు? కాలమరణము, మరియు అకాల మరణము అని చెప్పుకున్నాము. సాత్త్వికమరణము, రాజసమరణము, తమోగుణమరణం, యోగమరణం అని వ్యక్తులనుబట్టి మరణములు నాలుగు రకములు. యోగి అనేవాడు మరణం పొందవచ్చు, మరణం తరువాత

కర్మ అయిపోతే మోక్షమును పొందవచ్చు లేదా యోగైనా సరే జన్మించ వలసిందే. కానీ మొత్తంగా మరణాన్ని విభజిస్తే కాల మరియు అకాల మరణములు రెండు రకాలు. వీటి గురించి మా గ్రంథములలో చదివేవుంటారు. ఇప్పుడు మేము చెప్పే క్రొత్త విషయమేమంటే మరణములో కూడా **"తాత్కాలిక మరణం"** అని ఇంకొకటి ఉన్నది. ఇది నిజమేనా? మీరు చెప్పినదానికి ఆధారము ఏమైనా ఉందా? అని అడుగవచ్చును. ఈ మధ్య టీవీ ఛానల్‌లో ఒక వార్త వచ్చింది. కాశ్మీర్‌లో ఒక ముస్లీమ్ వ్యక్తి చనిపోయాడు. ఇస్లామ్ ఆచారము ప్రకారము పూడ్చి పెట్టారు. మూడు నాలుగు రోజుల తరువాత పోలీస్ కేస్ వచ్చింది. చనిపోయిన వ్యక్తి మామూలుగా చనిపోలేదు, ఎవరో మర్డర్ చేసినారు అని ఎవరో కేస్ పెట్టారు. పోలీసులు వచ్చి పూడ్చిన చోటనుండి శవాన్ని తీసి, మార్చురికి తీసుకపోయి శవపరీక్ష కోసం టేబుల్ మీద పరుండబెట్టి తలవద్ద ఎక్కడ పగలగొట్టాలా అని పరీక్ష కొరకు తలమీద కొట్టేందుకు కొద్దిగా చర్మాన్ని తీయబోయేసరికి నిద్రనుండి లేచినట్లు లేచి నన్నెవరు కొడుతున్నారు? మీరంతా ఏమి చేస్తున్నారని ఆ ముస్లీమ్ వ్యక్తి అడిగాడట. నాలుగైదు రోజుల క్రిందట పూడ్చిపెట్టిన తరువాత ఆ విధంగా అతను బ్రతికేసరికి డాక్టర్‌కు ఏమీ అర్థము కాలేదు. నాలుగు రోజుల క్రితము పూడ్చిబెట్టిన అతను నన్నెందుకు పరీక్ష చేస్తున్నారు? అని ప్రశ్నిస్తున్నాడు. "నువ్వు చనిపోయావు కదా!" అని అంటే "నేనెక్కడ చనిపోయాను, బాగానే ఉన్నాను కదా" అని అతనన్నాడు. ఈ విధంగా డాక్టర్ తిరిగి బ్రతికిన ముస్లీమ్ వ్యక్తివైపు చూస్తే, ఆ ముస్లీమ్ వ్యక్తి అక్కడున్న మిగతావారివైపు చూస్తున్నాడు. ఇక చేసేదేమీ లేక ఎలాగో బ్రతికినాడులే అని డాక్టర్ అతన్ని పంపించేశాడు. అలా పంపించిన తరువాత వారి ఇంటికెళ్ళిన తరువాత వీడియోలో

చూపించి, అతను చనిపోయిన తరువాత తీసిన దృశ్యాలను చూపించారు. చూపిస్తే అది చూసి అదేమో నాకేమీ అర్థము కాలేదంటాడు. అది అయిన వెంటనే పార తీసుకుని పొలానికి పోతుంటే, ఒక వ్యక్తి ఆపి, ఇదేమి నువ్వు చనిపోయావట కదా మరలా ఎట్లా బ్రతికావంటే, అదేమో నాకేం తెలియదు, వీరంతా అంటున్నారు. నేనైతే బాగానే ఉన్నాను కదా! అన్నాడు. మరిక్కడ చనిపోయినది వాస్తవమా? కాదా? వాస్తవమే ఇదెక్కడి క్రొత్త పద్ధతి అని అడుగవచ్చు. ఇదేం క్రొత్త పద్ధతి కాదు. పాత పద్ధతే కానీ మీకది తెలియదు. కాబట్టి క్రొత్త పద్ధతే. దీనిని ఎవరైనా ఖండించగలరా? మేము చెప్పే విషయములన్నీ శాస్త్రబద్ధముగా ఉంటాయి. జననము శాస్త్రమే, మరణమూ శాస్త్రమే. మరణములో మూడు రకములు ఉండటం శాస్త్రమే. కాల, అకాల, తాత్కాలిక మరణములు మూడు శాస్త్రములే. ఏసుప్రభువు లాజర్ అనే వ్యక్తిని చనిపోతే, లాజర్ 'లే' అంటే లేచాడు కదా! అది తాత్కాలిక మరణమే. కృష్ణుడు సాందీపుని కొడుకును బ్రతికించలేదా, అది ఏ మరణము తాత్కాలిక మరణమే. బ్రహ్మంగారు ఒక వ్యక్తిని తిరిగి బ్రతికించలేదా అదీ తాత్కాలిక మరణమే. ఇలాంటి తాత్కాలిక మరణమునకే ఒక ఉదాహరణ చెప్తాను. ధృవప్రాంతములో గడ్డకట్టుకుపోయే మంచుప్రాంతములో ఒక వ్యక్తి నడుస్తూ ఉండగా, ఆ మధ్యలో సీల్‌చేపలు రంధ్రం చేసుకుంటూ ఉంటాయి. అలా నడుస్తున్న ఒక వ్యక్తి ఆ రంధ్రంలో పడిపోయి చనిపోయాడు. ఆ నీళ్ళలో ఆ విధముగా చనిపోయిన తరువాత మూడు గంటల వరకు ఎవ్వరూ చూడలేదు. తరువాత వారి సంఘములో ఒక వ్యక్తి లేడు అని తెలుసుకుని అతన్ని వెతికి పట్టుకునేందుకు నాలుగు గంటల కాలము పట్టింది. అతన్ని ఆ రంధ్రములో కనుక్కొని అతనిని హాస్పిటల్ తీసుకువెళ్ళేందుకు మరోగంట కాలము పట్టింది. అక్కడకు తీసుకువెళ్ళిన

తరువాత శరీరమంతా గడ్డకట్టుకు పోయింది. శరీరమంతా నీలిరంగుగా మారింది, శ్వాసలేదు, చనిపోయి అప్పటికి నాలుగైదు గంటలైంది. డాక్టర్లు అతను చనిపోయినట్లు నిర్ధారణ చేశారు. ఒక డాక్టర్ మాత్రము విభిన్నముగా ఆలోచించాడు. అతనికి వైద్యం చేయటం మొదలు పెట్టాడు. మిగతా డాక్టర్స్ హేళన చేశారు. చనిపోయినవాడికి వైద్యం చేయడమేమని, రక్తమును లోపలకు పంపించి రక్తప్రసరణను మళ్ళీ ప్రారంభించే పరికరాలు ఉన్నాయట ఆ హాస్పిటల్‌లో అలా గంటకాలము తరువాత చిన్నగా శ్వాస రావటం ప్రారంభమైంది. కొద్దిగా గుండె కదిలి, మరలా ఆగి సర్దుకొని పూర్తిగా గుండెకొట్టుకుని లేచి కూర్చున్నాడు. నాలుగైదు గంటల తరువాత, చనిపోయిన వ్యక్తి లేచి కూర్చొనుట జరిగింది. అతను తర్వాత కొంతకాలము జీవించటం జరిగింది. ఈ విషయము 'నేషనల్ జియోగ్రాఫీ ఛానల్ వారు రాత్రి 11 గంటలకు "ట్రూస్టోరిస్' అనే ప్రోగ్రాంలో చూపించారు. ఇది గంట ప్రోగ్రామ్. అక్కడ వారు **"మరణాన్ని జయించిన సైన్స్"** అని వ్రాసుకున్నారు. వారి లెక్కలో అది కరెక్టేగానీ, ఇది తాత్కాలిక మరణము అని మనము పేరుపెట్టాము. అది వారికి తెలియదు 'టెంపరరీ డెత్' గురించి వారికి తెలియదు. చనిపోయిన వారిని బ్రతికించాము అని ఆ డాక్టర్లు గొప్పగా చెప్పుకున్నారు.

ఇంకొక సంఘటన అటువంటిదే జరిగింది. ఒక ఇంట్లో ఒక వ్యక్తి చనిపోయాడు. ఆ ఇంటి అందరికీ ఆ వ్యక్తి అంటే చాలా ఇష్టము. అయినప్పటికీ చనిపోయిన వ్యక్తిని పూడ్చటమో, కాల్చటమో ఏదో చేయాలి. కానీ వారంతా ఆ వ్యక్తిని ఇంట్లోనే అలా ఉంచుకున్నారు, రెండు రోజులకు ఆ వ్యక్తి మరల లేచి కూర్చున్నాడు. ఈ విషయం పేపర్లో వచ్చింది. మరి ఇవన్నీ ఏమిటి, బయట ప్రపంచమునకు తెలిసింది కాబట్టి ఇవి ఉన్నాయని

తెలిసింది. తాత్కాలిక మరణము పొందినవారిని పూడ్చిపెట్టడమో, కాల్చడమో చేస్తే నిజంగానే వాడు చనిపోవచ్చును.

తాత్కాలిక మరణము పొందిన వ్యక్తికి, శవమునకు స్నానము చేయిస్తే వాడికి తెలియదు, మామూలుగా ఉన్న వ్యక్తికి నీళ్ళు పోస్తే వాడు స్పందిస్తాడు కదా! మరి చనిపోయాడు కనుకనే స్పందించలేదు కదా! అంటే నిజమే కానీ తాత్కాలిక మరణము పొందిన వ్యక్తి ముందు స్పందించక పోయినా తరువాత స్పందించి లేవగలడు. ఇదొకటి ఉందా అంటే, ఉందనే చెప్పవచ్చును. తాత్కాలిక మరణమునకు ఒక యదార్థ విషయము చెప్పుచున్నాము. నాగుపాము కరచి చనిపోయిన వ్యక్తి నిజంగా చనిపోడు వాడు తాత్కాలిక మరణం పొందుతాడు. వైద్యం తెలిసివుంటే వాడిని బ్రతికించవచ్చు. కానీ మనమేమి చేస్తున్నాము. పాము కరిచిన వ్యక్తిని చనిపోయాడనుకుని, పేపర్లో కూడా వేసి **"పాముకాటుతో వ్యక్తి మృతి"** అని అతనిని పూడ్చివేయటమో, కాల్చివేయటమో చేసేస్తాము. వాడిని మాత్రము తిరిగి బ్రతికించవచ్చు. అంటే శ్వాస ఆడలేదు, రక్తం గడ్డకట్టుకు పోయింది, రక్తనాళాలలో రక్తప్రసరణ లేదు, గుండె కొట్టుకోలేదు, బ్రతికి ఉన్నాడు అనేందుకు అవకాశమే లేకపోయినా వాడు బ్రతకవచ్చు. అదే తాత్కాలిక మరణము.

ఇప్పుడు మీరు నన్ను ఒక ప్రశ్న వేయవచ్చు, మరణ సిద్ధాంతములో శ్వాస ఆగగానే జన్మముగానీ, లేక సూక్ష్మముగా (దయ్యాముగానో) ఉండటం జరుగుతుందని వ్రాశారు. మరిప్పుడు తాత్కాలిక మరణము అంటున్నారు. ఇదేమి? అని అడుగవచ్చు, ఎప్పటికీ మేము ఒక్కటే చెప్పుచున్నాము, మనకు శ్వాస బయటకు, లోపలకు తీసుకుంటున్నాము కదా! మనకు ఆఖరిశ్వాస లోపలికి పోక ఆగిపోతే, అది మరణమగును. ఆ శ్వాస ఇంకొక శరీరములో

ఎక్కి, మొదటి శ్వాసతో ఆ శరీరములో అప్పుడే వచ్చిన శిశుదేహములో ప్రవేశించి మనము మరలా పుడుతున్నాము. అలాకాకుండా శ్వాసలోపలకు ప్రవేశించి, నిలిచిపోతే తాత్కాలిక మరణము, శ్వాస బయటకు పోతే మరణం. ఇలాంటి మరణాలు జరిగాయి. మేము చెప్పేది సత్యము. నూటికి నూరుపాళ్ళ సత్యము. మరి ఐసు గడ్డలో చనిపోయిన వ్యక్తి బ్రతికినాడు కదా! నాలుగుగంటల తరువాత, అలాగే కాశ్మీర్‌లో ముస్లీమ్ వ్యక్తి బ్రతికాడు కదా! నాలుగు రోజుల తరువాత, ఆ సి.డి కూడా మనదగ్గర ఉంది. మరి ఇవన్నీ సత్యాలుకావా? బ్రహ్మంగారు కూడా అలాగే చనిపోయిన వ్యక్తిని బ్రతికించలేదా? అతనికి తెలుసు ఆ వ్యక్తి చనిపోలేదని, ఆ కార్యము పెద్ద కార్యం కాదు. అతను ఎలాగూ చనిపోలేదని తెలుసు, కావున లోపలున్న వాడిని బయటకు పిలిచినాను అని అనుకున్నాడాయన. ఈ విషయాలు చరిత్రలో చాలా ఉన్నాయి. అంటే పూర్వపు వాళ్ళకు మనిషి పూర్తిగా చనిపోయాడా లేదా అనే సత్యము తెలుసుకోగల సమర్థత ఉందన్నమాట. ఈ మధ్య మన దగ్గరికి మన సభ్యుడే, భక్తుడే కడుపునొప్పి అని వచ్చినాడు ఇంతకుముందు డాక్టర్ వద్దకు పోతే "అపెండిసైటిస్' అని కడుపు కోసి వైద్యము చేశారు. కానీ కడుపునొప్పి మాత్రము అట్లాగే ఉంది అతనికి ఆరోగ్యశ్రీ అన్నారు, పొట్టకోశారు, కుట్టారు కానీ కడుపునొప్పి మాత్రము అట్లాగే ఉంది. అప్పుడు అతను, మేమూ అది దయ్యామో ఏమో అనుకున్నాము. అప్పుడు వారు ఫోన్ చేశారు, ఫోన్లో అతను ఏమీ మాట్లాడలేకపోతున్నాడు. సరే ఇక్కడకు రండి చూద్దాము అని చెప్పాము. చూస్తే అతనికి జీర్ణాశయంలో అల్సర్ అంటే పుండు వచ్చింది. ఆ బాధ అంతటా వ్యాపించటం వలన అలా జరిగింది అది తెలియలేదు. యోచన చెయ్యబట్టి అది అల్సర్ అని తేలింది. అది బయటకు చూపిస్తే అది

నిజంగానే అల్సర్ అయింది. ట్రీట్‌మెంట్ ఇస్తే తగ్గింది. అంటే శరీరము యొక్క తత్త్వం పూర్తిగా తెలిస్తే, రోగాలు కనుక్కోవచ్చు, చచ్చినాడా, బ్రతికి ఉన్నాడా అని కూడా తెలుసు కోవచ్చు. కనుక ఈ విధంగా మరణాలు మూడు రకాలు అని తెలిసినవి కదా! సరే ఈ విషయముతో ఇంతటితో ముగిద్దాము.

## 42. ప్రపంచ శ్రద్ధ - పరమాత్మ శ్రద్ధ

తేది : 19.03.2011

జ్ఞానంమీద ఆసక్తి ఉంటే జ్ఞానము తెలియబడుతుంది. జ్ఞానము మీద ఆసక్తి లేకపోతే జ్ఞానము తెలియబడదు. దీనిని శాస్త్ర ఆధారముగా చెప్పుకుంటే భగవద్గీతలో **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్"** చెప్పెను. శ్రద్ధవలన జ్ఞానము లభిస్తుంది. భగవద్గీతను ఇంకా పరిశీలిస్తే **"కర్మావాన్ లభతే కార్యమ్".** ఒక కర్మవలన నీకు లభించేది కార్యమ్ ఒక పని జరిగింది అంటే దేనివలన జరుగుతుంది? కర్మవలన జరుగుతుంది. నీకు జ్ఞానము తెలియాలంటే శ్రద్ధవలననే దొరుకుతుంది. శ్రద్ధ లేకపోతే నీకు ఏమాత్రము జ్ఞానము తెలియదు. ఇప్పుడు మనమంతా దేవుని జ్ఞానము తెలుసు కోవాలని ఇక్కడికి వస్తున్నామా? లేకపోతే పదిమంది నిన్ను చూసి, దేవుని జ్ఞానములో వీడు ఉన్నాడు అని అనుకునేందుకు వస్తున్నామా? లేకపోతే పద్ధతి ప్రకారము వెళ్దాం, ఎప్పుడో ఒకప్పుడు జ్ఞానం లభిస్తుందిలే అని వస్తున్నామా? దొరికితే దొరికింది లేకపోతే లేదు అని ప్రపంచ జ్ఞానముతో లేక్కవేసుకుంటున్నామా? జ్ఞాన విషయంలో ఈ విధముగా అనుకోవటం చాలా పొరపాటు. ఎంతకావాలో, ఎంత దొరకాలో అంతే దొరికేది ప్రపంచ జ్ఞానమే. మనం చేసుకునే కర్మలో ఏది ఉంటే అదే కార్యంగా బయట జరుగుతుంది.

పుట్టినప్పుడే ప్రారబ్దకర్మ అనేది ఒకటుంది. అందులో ఉండేదే జీవితంలో జరిగితీరుతుంది. ప్రారబ్దకర్మను తీసుకుని అనుభవించేందుకే భూమిమీద పుట్టుచున్నాము. పుట్టిన దగ్గరనుంచి చనిపోయేంతవరకు ఏ కష్టం అనుభవించాలి? ఎంత సుఖం అనుభవించాలి? దానికి సంబంధించి ఈ ప్రపంచములో ఏ కార్యాలు జరగాలి అనేది మొత్తము ఆ ప్రారబ్దకర్మలో ఉంటుంది. ఆ విధంగా లిఖించబడినట్లే ఏమాత్రము ఎక్కువ తక్కువ లేకుండా అదే జరిగితీరుతుంది. ప్రపంచ విషయాలన్నీ నీకు అనుభవానికి వచ్చేటటువంటివి. కానీ జ్ఞాన విషయాలు మనము తెలుసుకొనుట అనేది ఎక్కడా లిఖించబడి ఉండదు. జ్ఞానము కర్మకు ఆధీనములో ఉండేది కాదు. నీ వెంట వచ్చేది జ్ఞానం ఒక్కటే. కావున కర్మవలన జ్ఞానము లభించదు. నాకు దేవుని జ్ఞానము ఎంత ప్రాప్తి ఉంటే అంతే వస్తుంది అనుకోవటం పొరపాటు. మనమ ఏ విధముగా శ్రద్ధ పెట్టుకుంటే ఆ విధముగా మనకు జ్ఞానము లభిస్తుంది. తక్కువ శ్రద్ధ ఉంటే తక్కువ, ఎక్కువ శ్రద్ధ పెట్టుకుంటే ఎక్కువ జ్ఞానము లభిస్తుంది. కావున జ్ఞానము మీద ఎంత శ్రద్ధ పెట్టుకుంటే అంతే జ్ఞానము లభిస్తుంది.

భగవద్గీతలో దేవుడు ఏమి చెప్పినాడు **"బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే"** ఎన్నో జన్మలు ఎత్తుతూ, జ్ఞానముమీద శ్రద్ధ పెంచుకుంటూ మరలా జన్మలు ఎత్తుతూ ఉంటే, అప్పుడు ప్రపంచానికి అంతటికీ దేవుడనేవాడు ఒకడున్నాడు అనే విషయం తెలుస్తుంది. అప్పుడు అసలైన దేవుని జ్ఞానము తెలుస్తుంది. అంతవరకు రకరకాల జ్ఞానాలున్నాయి. ప్రపంచములో ఇప్పుడు చూస్తున్నాము కదా! ఎందరో జ్ఞాన విషయాలు చెప్పుచున్నారు. కానీ ప్రపంచానికంతటినీ నడిపిస్తున్న దేవుడు ఒక్కడే అనే విషయం తెలియదు. అందువలన ఎన్నో జన్మల సంస్కార బలముచేత

చివరకు అసలైన జ్ఞానాన్ని తెలుసుకోగలుగుతావు. భగవద్గీతలో ఏదైతే నిజమైన జ్ఞానము అని చెప్పబడిందో అదే అసలైన జ్ఞానము. అందరూ భగవద్గీత చెప్తున్నారు కదా! అందరిదీ అసలైన జ్ఞానమేనా? అని ప్రశ్నించవచ్చు. భగవద్గీతలో చెప్పినట్లు దానిని చెప్పినవారు నడుచుకోలేదు. మిమ్మల్ని నడిపించలేదు. భగవద్గీతలో దేవతార్చన చేయవద్దండి, దానివలన మీకు మోక్షము దొరకదు అని చెప్తే, వారు దేవతార్చన చేస్తున్నారు. మీచేత కూడా చేయిస్తున్నారు. అజ్ఞానములో దింపి, అదే సక్రమమైన మార్గము అని చెప్తున్నారు. అందువలన అసలైన జ్ఞానము తెలియాలంటే, మేము చెప్పేదంతా మీకు వ్యతిరేఖంగా కనిపించవచ్చు గానీ, ఇప్పుడు మీరు తెలియు మూడు ఆత్మల జ్ఞానమే అసలైన జ్ఞానము. కొందరు జ్ఞానమును తెలియుటకు ప్రయత్నిస్తూ ప్రపంచములో ఇటువంటి జ్ఞానము ఉందని తెలియక, మా జ్ఞానాన్ని కూడా సక్రమమైనది కాదు, వీరు దేవుడులేదని చెప్తున్నారు అని అంటున్నారు. మేము ఆ విధముగా చెప్తున్నామా? లేదు కదా! అయినా వారు ఆ విధముగానే ప్రచారము చేస్తున్నారు. వీరి జ్ఞానము ప్రచారం చేయవద్దండి. వీరి గ్రంథాలు చదవవద్దండి అని ప్రచారము చేస్తున్నారు. అదే పనిగా దేవుడు లేడని మేము చెప్పలేదు, దేవుడున్నాడు. మీరు గ్రుడ్డివారై దేవుని కనుక్కోలేక, దయ్యాన్ని పట్టుకుని దేవుడు అనుకుంటున్నారు. దయ్యాలను పట్టుకోవద్దు, దేవున్ని పట్టుకోండి అని మేము చెప్తున్నాము. భగవద్గీతలో ఫలానా శ్లోకములో ఈ విధముగా చెప్పాడు అని మేము చెప్తున్నాము. నువ్వు నడచేదారి సక్రమమైనది కాదు, కాబట్టి నీ దారి మార్చుకో. దేవుడు చెప్పినట్లు విను, అతను చెప్పిన జ్ఞానము తెలుసుకో. మరి దేవుని జ్ఞానము కావాలంటే శ్రద్ధ కావాలి. శ్రద్ధ ఇప్పుడు ఎలా వస్తుంది, నాకు మొదటినుండి శ్రద్ధలేదు. ఇక్కడున్న వారందరికీ మొదట

www.thraithashakam.org

శ్రద్ధ ఉందా? లేదు. మేము మొదట జ్ఞానము మీద శ్రద్ధను కల్పించగా, ఇప్పుడు కొందరు జ్ఞానము తెలియుటకు సిద్ధపడ్డారు. జ్ఞానము తెలుసుకునేందుకు కనీసం కొంత శ్రద్ధ అయినా మీకు ఎలా వచ్చింది? ఇంత పెద్ద జ్ఞానము మనము తెలుసుకునేందుకు, అర్హులమేనా? అంటే అర్హులము కాదు. మరి మనకు జ్ఞానము ఎలా వచ్చింది? అంటే సూత్రము చెప్పుకున్నాము కదా **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్"** అని కనుక శ్రద్ధ వలనే వచ్చింది. ఆ విధంగా శ్రద్ధలేకపోతే, శ్రద్ధను పెంచుకోండి అని మేము చెప్తున్నాము. నేను ఏమి చేయాలి? అని ఒక వ్యక్తి వచ్చాడు. నాకు ఉపదేశము కావాలి, నేను ధ్యానం చేస్తాను, నాకు మోక్షం కావాలి అన్నాడు. అందుకు నేను ఉపదేశము వలన నీకు మోక్షము రాదు. నీకు నేను ఏదో మంత్రము చెప్పాననుకో నేను గురువునైపోతాను. నా లెక్కలో నీవు మోక్షమునకు వెళ్తావు. ఎందుకు నేను చెప్పినది జ్ఞానము కాదు. మంత్రము చెప్పువాడు మధ్యముడు అని వేమనయోగి చెప్పినాడు. దేశానికి యోగి అయిన వేమన **"మంత్రము చెప్పువాడు మధ్యముండు"** ఒంగోమని, లెమ్మని చెప్పేవాడు అంటే **"కర్మను చెప్పువాడు కడగురుడు" "ఊరుకోమనేవాడు ఉత్తముండు".** ఆ ధ్యానం చేయండి, యజ్ఞం చేయండి అని అంటారు. అవి ఏవీ వద్దు. ఒకే ఒక సూత్రము చెప్తున్నాము. అదే జ్ఞానము తెలుసుకోండి. ఉపదేశాలు లాంటివి మేము ఎవరికీ ఇవ్వలేదు. దానివలన మీకేమీ లాభము లేదు. మీకు లాభం వస్తుందని తలంచినా గానీ, మా లెక్కలో దానివలన లాభం ఏమీ లేదు. మీకు ఆ మంత్రముతో ఏ ప్రయోజనమూ లేదు. తెలుసుకోవలసినది జ్ఞానము. జ్ఞానము కావాలంటే శ్రద్ధ కావాలి. శ్రద్ధ మనకుందా? నేను ముప్ఫై ఏళ్ళనుండి ఒక మంత్రమును జపిస్తున్నాను. నాకు దానిమీద శ్రద్ధ ఉంది. మంత్రమును జపించేవారికి మంత్రము మీద ఉండే ఆసక్తిని తగ్గించి, జ్ఞానము మీద శ్రద్ధను పెంచాలంటే,

ఏదో ఒకటి చేయాలి. మీకు చెప్పాలి అది చిన్నది, ఇది పెద్దది అని చెప్పాలి. ఆ విధముగా చెప్తే వింటాడా? మనిషి ఒకవేళ వినేటట్టు నటించినా, పూర్తిగా వింటారని నమ్మకము లేదు" అని చెప్పాను.

ఇంకా కొందరు శ్రద్ధ ఏమాత్రము లేనటువంటివారున్నారు. శ్రద్ధ ఉన్నవారికి కూడా మాయ అడ్డమొచ్చి, ఉన్న శ్రద్ధను కూడా లేకుండా చేసేస్తుంది. జ్ఞానము తెలుసుకుందామనుకున్నా తెలుసుకోకుండా చేసేస్తూ ఉంది. జ్ఞానానికి దూరం చేసేస్తూ ఉంది. ఒకవేళ ఇక్కడకు వచ్చి మీరు ఏమైనా శ్రద్ధను పెంచుకుంటారేమోనని మిమ్మల్ని జ్ఞానము ముందరకు రాకుండా చేస్తుంది. జ్ఞానమునకు వ్యతిరేఖమైనది మాయ అనేది ఉంది. శ్రద్ధను కలగనివ్వదు. ఒకవేళ శ్రద్ధ ఉన్ననూ దానిని చిన్నాభిన్నం చేసేయ గలదు. అనుమానాలు తెప్పిస్తే చాలు, శ్రద్ధ అనేది దానంతట అదే తగ్గి పోతుంది. ఈ విధముగా శ్రద్ధ లేకుండా చేస్తే, అజ్ఞానములోకి మానవుడు పడిపోతాడు. ఒకసారి దేవుడు భగవంతుడిగా వచ్చి ధర్మములు తెలియజేసి పోయాడు. తరువాత కొన్నాళ్ళకు ధర్మములు తెలియకుండా పోయాయి. ఈ విధముగా ధర్మములు తెలియకుండా పోవటానికి కారణమేమి? ఒకే ఒక మాయ దానిని ఆటంకపరుస్తోంది. అంటే మన శ్రద్ధను హరింపజేస్తూ ఉన్నది. శ్రద్ధ ఎక్కడుంది? తలలోనే ఉంది. మాయ ఎక్కడుంది? మన తలలోనే ఉంది. మాయ ఏ రూపములో ఉంది? గుణముల రూపములో ఉంది. ఇది మాయ అని కనిపించకుండా, ఆలోచన రూపంలో, గుణముల రూపంలో ఉంది. ఒక గుణం పనిచేస్తుంది అప్పుడు ఆలోచన వస్తుంది, దానినిబట్టి, ఈ జ్ఞానమనేది మంచిదికాదు అని ప్రపంచ విషయాలే మంచిగా కనబడేటట్లు చేస్తుంది. ఈ విధముగా జ్ఞానాన్ని దూరం చేస్తూ, ప్రపంచ విషయాలకు దగ్గర చేస్తూ ఉంది అది మాయ, అదే గుణాల ప్రభావము.

భగవద్గీతలో ఏమి చెప్పెనంటే **"గుణమయి మమ మాయా"** అంటారు. అంటే "నా మాయ" అంటాడు. మరలా దానిని ఎవరో సృష్ఠించారు అని అనుకోకుండా, గుణాలరూపములోని ఆ మాయను తయారు చేసింది ఎవరు? నేనే అంటాడు దేవుడు. ఏదో ఒక సమస్య తెచ్చి, దానికి తగ్గ ఆలోచన తెచ్చి దానినే ఆలోచించేటట్లు చేసి, జ్ఞానాన్ని తక్కువ చేసి, ప్రపంచ విషయాల్ని ఎక్కువ చేసి, ప్రపంచ విషయాలపైనే ఎక్కువ శ్రద్ధ చేసేది మాయయే. మాయ నాపై ప్రభావము చూపిస్తుందా, ఎక్కడుందో అంటే మాయ అనేది కనిపిస్తుందా, కనపడదు. ఏమాత్రము మనకు తెలియ నివ్వకుండా మనల్ని ముంచేస్తుంది. అందరూ శ్రద్ధాహీనులై పోతున్నారు. మనకు దైవజ్ఞానము తెలియకుండా పోతున్నది. మరి ఈ మధ్య చాలా గుడులు, గోపురాలు కట్టబడుతున్నాయి. భక్తి ఎక్కువ పెరిగింది కదా! ఇంతకు ముందుకంటే భక్తి పెరిగింది కదా. వేలకువేలమంది కాశీకి పోతున్నారు. వేలకువేలమంది అయ్యప్పవద్దకు శబరిమలకు పోతున్నారు. మరి చాలా భక్తి పెరిగింది కదా అంటే వాస్తవమే, ఇదంతా ఎవరిమీది భక్తి అంటే మాయమీద భక్తి. మాయభక్తి దేవున్నుంచి దూరంచేసి, దేవుడు కానటువంటి వారిపైన మిమ్మల్ని మొక్కేటట్టు చేస్తుంది, శ్రద్ధగా దేవతల గురించి డబ్బులు ఖర్చుపెడతాము. జ్ఞానము దగ్గర పది రూపాయల పుస్తకము కొనమంటే మాత్రము బరువుగా కనిపిస్తుంది. ఒక గుడికి పోతాము, లక్ష రూపాయలు హుండీలో వేసేస్తాము. 200 రూపాయలు పెట్టి గ్రంథము కొనమంటే శ్రద్ధ తక్కువ. ఈ విధముగా శ్రద్ధ అనేది తగ్గిపోయి, తద్వారా కోరికలు పెరిగిపోయి, ఈ దేవతలు ఆ కోరికలు నేరవేరుస్తాయి అనే నమ్మకముతో, మాయ వైపుకు పోయి, మాయ భక్తిలో మనము ఇరుక్కుపోయి, ***"భక్తిర్వ్యభి చారిణీ"*** అని భగవద్గీతలో చెప్పినట్లు

www.thraithashakam.org

భక్తిలో వ్యభిచరిస్తున్నాము. మనందరికీ భర్త ఒక్కడే జగద్భర్త, అంటే అడ దేవతలను విడిచిపెట్టి మనమేమి చేస్తున్నాము? రకరకములైన మగ దేవతలను పట్టుకున్నాము. ఒక దగ్గరకు పోయి నీవే నాకు గొప్ప అని మ్రొక్కుతారు. ఇంకోదగ్గరకు పోయి నీవే గొప్ప అని వేరే దేవునికి మ్రొక్కుతారు. ఒక దేవతకు మ్రొక్కితే, ఆయన క్రింద సేవ చేసే దేవతలకు మ్రొక్కుతాము. ఎవరు పెద్దో, ఎవరు చిన్నో అర్థముకాకుండా పోయి, అసలైన దేవున్ని వదలివేసి, మాయా దేవతల్నే కొలిచి మాయలోనే పడిపోతున్నాము. అసలైన జ్ఞానము తెలియకుండా పోయింది. **"బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే"** "నీవు ఎన్నో జన్మలు ఎత్తితేగానీ అసలైన జ్ఞానము తెలుసు కోలేదు" మేము చెప్పుచున్న జ్ఞానము అందరికీ అర్థముకాదు. ఎంతో లోతుగా ఆలోచిస్తేగానీ అర్థముకాదది, మరి శ్రద్ధ లేకపోతే జ్ఞానమురాదు నిజమే. మరి ఆ శ్రద్ధ కలిగేది ఎట్లు? మీకు శ్రద్ధ లేదని తెలుసు కానీ ఎందుకు చెప్పాలి జ్ఞానము? అని ప్రశ్న వేస్తే, జవాబు ఏమి చెప్పాలంటే, నీకు శ్రద్ధ లేకపోతే నీకు జ్ఞానమురాదు. నా ప్రక్కనుండి నాది కరెక్టే. నీ ప్రక్కనుండి నీదీ కరెక్టే. నీ వైపునుండి నీవు శ్రద్ధ లేకపోతే నీవు జ్ఞానాన్ని తెలుసుకోలేవు. కానీ నేను ఏమి చేయవచ్చు, ప్రయత్నము చేసి, ఆ జ్ఞానాన్ని ఎక్కించవచ్చు. నువ్వు మందు (ఔషధము) తినమంటే తినవు. టాబ్లెట్ వేసుకోమంటే వేసుకోవు. టాబ్లెట్ వేసుకోకపోతే రోగము పోదు. కానీ ఆ టాబ్లెట్ వేసుకునే శ్రద్ధ ఉందా? మందును (ఔషధం) చూస్తూనే ఆమడ దూరము పారిపోతున్నావు. కనుక మేమేమి చేయాలి, పిల్లలు మందును త్రాగకపోతే, పట్టుకుని, బలవంతంగా ఎలాగో ఒకలాగ త్రాగిస్తాము కదా! ఈ మందు వాడిలోకి పోయి, పనిచేసి, వాడి శరీరములో నుండి ఆ రోగము పోతున్నది. వాడు ఆ ఔషధము (మందు) ను

తీసుకోకపోతే రోగము పోనట్లే. అలాగే నీకు శ్రద్ధ లేకపోతే జ్ఞానము తెలియదు. కానీ బలవంతంగా మందును రోగమునకు తినిపించినట్లు జ్ఞానాన్ని కూడా చెప్తే ఏమవుతుంది. వాడియొక్క అజ్ఞానమనే రోగం పోతుంది. ఇక ఆ విధంగా చేయాలి. నీకు శ్రద్ధ ఉంటే నీకు జ్ఞానము తెలియబడుతుంది. కానీ అది ఎలాగూ లేదు కనుక, అసలైన జ్ఞానము మాసిపోయే అవకాశము ఉంది. అసలైన జ్ఞానము తెలియాలంటే దేవుడే ఆ జ్ఞానాన్ని మనకి అంటించాలి, దేవుడే మనకు శ్రద్ధ వచ్చేటట్టు చేయాలి. మనకు ఎలాగూ ఆ శ్రద్ధరాదు. కనుక దేవుడే మనకు శ్రద్ధను కలిగించి, జ్ఞానాన్ని తెలియజేస్తే, ఆ జ్ఞానము మనం తెలుసుకుని పదిమందికీ చెప్తే, కొంత జ్ఞాన విస్తీర్ణం పెరిగిపోతుంది. ప్రపంచములో జ్ఞాన విస్తీర్ణం పెరిగిపోవటం వలన, ధర్మాలు తిరిగి అభివృద్ధిలోకి వస్తాయి, తద్వారా అధర్మాలు అణిగిపోతాయి. ఇప్పుడు పరిస్థితి ఏమిటి? ఎక్కడ చూసినా అన్యాయాలు, అక్రమాలు, అజ్ఞానము పెరిగిపోయి, మాయ పూర్తిగా పేరుకుపోయింది. మనుషులందరూ ఆ దేవతలకు పూజచేస్తూ ఉంటే దేవతలకు ఏడుపువస్తున్నది. ఇంత నీచులందరూ మమ్మల్ని పూజచేస్తే వారి పూజలు మేము అందుకోవలసి వస్తున్నది కదా! అని వారు బాధపడు చున్నారు. వాడు పదిమందికి మోసము చేసివచ్చి నాకు మ్రొక్కుతారు. దేశంలో నాకంటే భక్తిపరుడు ఇంకెవరూ లేరని అనుకుంటున్నాడు. పూర్తి అబద్ధం చెప్పి మ్రొక్కుతాడు.

ఒక వ్యక్తికి మేము అడిగాము ఏమయ్యా! నూటికి నూరు అబద్దాలే ఆడుచున్నావు అంటే, ఏ చేస్తాము మాట్లాడి మాట్లాడి ఆ విధంగా అలవాటై పోయింది. బయట ప్రపంచములో ఏ విధముగానైనా మాట్లాడు కానీ జ్ఞాన విషయంలో కూడా అలాగే మాట్లాడితే ఎలా అంటే. అలవాటు

www.thraithashakam.org

అయిన తరువాత ఎక్కడైతేనేం అలాగే మాట్లాడుతాము అంటారు. ఇటువంటి నీచులు పదిమందితో వెళ్ళి ఆ దేవతకి మ్రొక్కుతారు, ఒక్కరు వెళ్తే ఆ విగ్రహాన్నే ఎత్తుకెళ్తారు. ఇటువంటి నీచులు ఆ దేవతలకు మ్రొక్కినప్పుడు, కొందరు దేవతలు ఎంతో కొంత జ్ఞానము ఉన్న దేవతలు ఉంటారు కదా! వీళ్ళను చూసి దుఃఖమొచ్చి వీళ్ళ చేతుల్లో చిక్కినాము కదా అని ఆ దేవతలు బాధపడుతారు.

మొన్న ధర్మవరంలో వీరబ్రహ్మంగారు విగ్రహంనుండి కళ్ళలో నీరు కారాయి. ఆయన వీళ్ళంతా మ్రొక్కుతూ ఉంటే ఏడ్చినాడు. వీళ్ళంతా ప్రొద్దున లేచిన దగ్గర నుండి రాత్రి నిద్రించేవరకు ఏమి చేస్తున్నారు? ఆయన గమనిస్తుంటాడు కదా! ఇంతమంది అజ్ఞానులు నన్ను మ్రొక్కుచున్నారా, నేను జ్ఞానము తెలిసినవాడిని భవిష్యత్ చెప్పినవాడిని అని లెక్కపెట్టుకోకుండా వీళ్ళంతా తయారయినారు కదా! భూకంపాలు, సునామీలు వస్తే ఆయనకు వాటి స్థితి తెలుసు, రోగాలు వస్తే పరిస్థితి తెలుసు. చేసిన పాపాలకు వారికిపడే శిక్షలు మరియు వీరి భవిష్యత్ ఆయనకు తెలుసు కదా! అయ్యో! వీరంతా భవిష్యత్‌లో చాలా శిక్షలు అనుభవిస్తారని బాధపడ్డారేమో లేకపోతే వీరంతా మ్రొక్కుతున్నారని ఏడిచారో తెలియదు. తీరా ఆయన బాధపడి ఏడిస్తే, రోజూ రెండు గంటలు భజనచేస్తే, ఆ రోజు మాత్రము 8 గంటల కాలము భజన చేశారు. వీరు భజన చేస్తుంటే ఏడుస్తున్నాడు ఆయన. భజన చేస్తే ఆ నీరు ఏమైనా ఆగిందా లేదు. అంటే మన మనుషుల్లో ఏదో లోపం ఉంది. మనకు తెలియకుండా ఏవో తప్పులు చేస్తున్నామని మనకు తెలియటం లేదు. ఆ పరిస్థితిలో మనకు జ్ఞానమంటే ఏమిటో తెలియరాలేదు. ఒకవేళ జ్ఞానము గురించి చెప్తే, అది జ్ఞానమే కాదు అని అంటారు. వినేవారికి కూడా మీరు చెడిపోవుచున్నారని చెప్తారు.

www.thraithashakam.org

ఇటువంటి పరిస్థితుల్లో దేవుడు ఏమి చేయాలనుకున్నాడంటే, వీరికి జ్ఞానము రాదు, జ్ఞానము తెలుసుకునే శ్రద్ధలేదు కనుక ఆ శ్రద్ధను నేనే ఏదో రకంగా కలుగజేయాలి. అంటే దేవుడు పని చేసేవాడు కాదు అని ముందే చెప్పుకున్నాము. కనుక మరి ఎవరు చేస్తారు ఆ పనిని? ఆయన క్రింద ఉండేవాడు చేయాలి. ఆయన పరిపాలనలో ఉండేవారు ఆ పనిని చేయాలి.

చాలా సంవత్సరముల క్రితము దగ్గరదగ్గర 40 మంది ప్రయాణీకు లుండే ఓడను దేవుని పరిపాలకులు మాయం చేసినారు. ఊరంతా ఓడను లేకుండా చేశారు. 5500 టన్నులు బరువుగల్గిన పెద్ద నౌక ఒక నిమిషంలో మాయమైపోయింది. అంత పెద్ద ఓడ ఎక్కడికి పోయింది. ఇటు బ్రిటిష్ దేశము, అటు అమెరికా దేశము రెండూ పరిశోధన చేసినా, ఏమాత్రము అర్థము కాలేదు. ఇంతవరకు దానిజాడ తెలియదు. 1938వ సంవత్సరములో ఇది జరిగింది. అంటే 70,80 సంవత్సరాల తరువాత కూడా ఇప్పటికీ తెలియలేదు. లెక్కలేనన్ని ఓడలు పోయాయి, విమానాలు పోయాయి అయినా ఎవరు ఆ పనిని చేస్తున్నారు, ఎలా పోతున్నారు? అని మాత్రము ఎవరికీ తెలియదు. ఒక్క విషయము చెప్తున్నారు ఏమంటే ఆ సముద్రమునకు తెలుసు, ఆ దేవునికి తెలుసు. ఆ ఓడ ఏమయిందో అంతటితో అది నిలిచిపోయింది. ఇప్పుడు ఆ నలభైమంది ఎక్కడికి పోయారు. మన లెక్కలో ఏమాత్రము ప్రపంచ జ్ఞానము లేకుండా చేసి, వేరే ధ్యాసలోకి పంపించి, అక్కడ జ్ఞానము అనే దానిని తెలియజేసి, జ్ఞానము మీద పూర్తి శ్రద్ధను కలిగించి, పూర్తిగా వారికి అభ్యసింపజేసి, తర్ఫీదు ఇచ్చి, దేవుని జ్ఞానమంటే ఇటువంటిదని చెప్పి తరువాత మనలోనే, మనమధ్యలో అక్కడొకన్ని అక్కడొకన్ని విడవటం జరిగింది. ఆ విధంగా వారు జ్ఞానము తెలియచేయటం మూలంగా కొద్దిగా మనకు శ్రద్ధ కలుగుతుంది. మనుషుల్లో

శ్రద్ధ లేకుండా పోయినప్పుడు, ఇప్పుడుండే గురువులు ఎవరూ జ్ఞానము గురించి తెలియజెప్పనప్పుడు దేవుడే చర్య తీసుకుని ప్రజలకు జ్ఞానాన్ని అందజేయాలి. అందుకే ఆయన బెర్ముడా ట్రయాంగిల్ ప్రాంతానికి పోయిన ఎవరినీ కనిపించకుండా చేస్తున్నాడు. దేవుడు నేరుగా చేయలేదుగానీ ఆయన పరిపాలకులతో చేయిస్తున్నాడు. ఎన్నో విమానాలు, నౌకలు కనిపించకుండా పోయాయి. వాటిని నడిపినవారు కూడా పోయారు. వీరంతా ఎక్కడికి పోయారు? నౌకలు విమానాలు ఎక్కడికి పోయాయో వీరు కూడా అక్కడికే పోయారు. కానీ వారు ఎక్కడికి పోయినదీ ఎవ్వరికీ తెలియదు. మేము ఈ విషయాలన్నింటినీ వ్రాసి **"త్రైతాకార రహస్యము"** అనే గ్రంథములో వివరించాము. ఎందుకంటే సముద్రములో మూడుకొనల విస్తీర్ణంతో ఆ స్థలము ఉన్నది. జీవాత్మ, ఆత్మ, పరమాత్మకు సంబంధించి మూడు కోణములు ఉన్నవి. వాటి గుర్తింపుగా మూడు కోణాలున్నవి. ఆ కోణముల మధ్య విస్తీర్ణములో సముద్రపు నీరుంది. ఆ ప్రాంతానికి పోయిన వారందరూ జ్ఞాన విషయాలు తెలుసుకునే భూమిలాంటి ఇంకొక గోళమునకు పోయారు. అంటే భూమిలాంటి గ్రహములు చాలా ఉన్నాయి. మనలాంటి మనుషులు అక్కడ కూడా ఉన్నారు. జ్ఞానము సంపూర్ణముగా తెలిసినవారు చాలామంది ఉన్నారు. మనకంటే జ్ఞానములో ముందున్నవారు ఇతర గ్రహాలలో కూడా ఉన్నారు. మన శాస్త్రజ్ఞులు మాత్రము ఇంకా పూర్తిగా చెప్పలేదు కానీ మేము మాత్రము చెప్పుచున్నాము. ఆ విధముగా గ్రహాంతవాసులు ఉన్నారు కాబట్టే దేవుడు సూర్యునికి జ్ఞానము చెప్పాల్సి వచ్చింది లేకపోతే మనకే నేరుగా చెప్పి ఉండేవాడు. సూర్యుడికే ఎందుకు చెప్పెనంటే వారికీ, మనకీ అందరికీ చెప్పగలిగేటట్టు ఆయనకే చెప్పటం జరిగింది. ఆ విధముగా ఈ భూమండలానికి కూడా జ్ఞానాన్ని అందజేశాడు.

www.thraithashakam.org

వీరినందరినీ తీసుకుపోయి ఇంకొక గోళంలోనికి పంపటం జరిగింది. అక్కడున్న జ్ఞానులతో కలిసిపోయిన వారంతా జ్ఞానము తెలుసుకోవటం జరిగింది. అసలైన జ్ఞానాన్ని పోయిన వారంతా జీర్ణింప చేసుకున్నారు. జ్ఞానముతో వచ్చి, భూమిమీద పుట్టి, తమ జ్ఞానాన్ని చెప్పి, మనుషులకు శ్రద్ధ కలిగేటట్లు చేశాడు. అందువలన జ్ఞానము అభివృద్ధి అవుతూ వస్తున్నది, కనుక అధర్మాలు చెలరేగిపోకుండా, దేవుడు బ్రేక్‌వేసి (నియంత్రించాడు) ఉంచాడు. అధర్మాలు తొందరగా చెలరేగకుండా ఒకవేళ అలా ఉంచకపోతే దేవుడు భగవంతుడిగా ప్రతీ 200,300 సంవత్సరలకోకసారి అవతరించాల్సి ఉంటుంది. కనుక అలా కాకుండా భగవంతుడుగా వచ్చేటప్పటికి పూర్తిగా అధర్మాలు చెలరేగకుండా, కొంత దైవజ్ఞానము, ధర్మాలు ఉండేటట్లు దేవుడు పై ఏర్పాటు తన పరిపాలకుల ద్వారా చేయిస్తున్నాడు. ఏ విధంగా అంటే, మనల్ని కనపడని లోకాలకు తీసుకువెళ్ళి, అక్కడ జ్ఞానము తెలియజేసి అక్కడ మరణించి ఇక్కడ పుట్టేటట్లు చేస్తున్నాడు. కానీ ఇక్కడ చనిపోయిన మనిషి అక్కడికి మాత్రము పోవటం లేదు. డైరెక్టుగా అక్కడికి వెళ్తున్నారు. ఎక్కడ జరిగింది అంటే బెర్ముడా ట్రయాంగిల్‌లో జరిగింది కదా! చాలామంది పోయారు కదా! వాళ్ళంతా డైరెక్ట్‌గా పోయారు. ఏ వయస్సులో ఉన్నవారు ఆ వయస్సుతోనే పోయినారు.

మేము **"త్రైతాకార రహస్యము"** అనే గ్రంథములో వ్రాసాము. బ్రిటన్ నుండి అమెరికా వస్తున్న 40 మంది ఉన్న ఓడ మార్గమధ్యలో కనిపించకుండా పోయింది. ముక్కోణపు ఆకారములో చిక్కుకోవటం వలన, అది మాయం అవటం జరిగిపోయింది. మాయం అంటే ఇంద్రజాలం, మహేంద్రజాల మాయ కాదు. మేఘములు కనిపిస్తూ ఉంటాయి. చూస్తూ ఉండగానే అవి మాయమై పోతాయి అక్కడ కూడా మేఘము అడ్డుగా వచ్చింది,

మేఘము ప్రక్కకు కూడా పోయింది. ఒక మాంత్రికుడు ఒక వస్తువును గుడ్డతో కప్పి, ఆ గుడ్డను తీయగానే ఆ వస్తువు కనిపించదు. అదే విధముగా దేవుడు ఏమి చేశాడంటే ఒక మేఘము అలా వచ్చింది. కనిపించే పెద్ద నౌక కనిపించకుండా పోయింది. అది ఎక్కడికి పోయిందో ఎవరికీ తెలియదు. అంత పెద్ద నౌక అంతమందితో, కొన్ని లక్షలు, కోట్ల మైళ్ళ దూరంలో ఉన్న ఇంకొక గోళంలోకి కొన్ని నిమిషములలోనే పోయింది. నెలలు, సంవత్సరములు పట్టలేదు. కొన్నికోట్ల మైళ్ళ దూరంలో ఉన్న గోళంవద్దకు కొన్ని నిమిషములలోనే పోయింది. ఇప్పుడు మేము చెప్పు మాట అబద్ధం అని అనుకుంటారేమోనని ఒక మేఘము ఏమి చేసిందంటే, విమానాన్ని ఒక దానిని కొంత దూరం తీసుకుపోయి, తరువాత భూమిమీదనే విడిచిపెట్టింది. ఆ విధంగా విడిచిపెట్టడం వలన పైలెట్‌కు అర్థము కాకుండా పోయింది. నేను బయలుదేరిందెక్కడ, చేరింది ఎక్కడ? అంటే 180 కి.మీ దూరంలోకి వచ్చాడు. ఎంత టైమ్‌లో వచ్చాడంటే 3 నిమిషములలో వచ్చాడంట. వాడి విమానం పోయే స్పీడెంత 240 కి.మీ గంటకు వెళ్ళగలదు. అదే స్పీడ్‌తో వెళుతున్నదంట. అంతకంటే స్పీడు పోలేదు. కానీ అప్పుడు మాత్రము గంటకు 3500 కి.మీ స్పీడుతో అక్కడకు చేరిపోయింది. ఇప్పటి టెక్నాలజీలో విమానం గంటకు 1000 కి.మీ కంటే ఎక్కువ పోలేదు. కానీ ఆ రోజు 3500 కి.మీ. గంటకు పోయింది. ఇది ఎలా పోయింది? వందల కిలోమీటర్లు పోయే సమర్థత కల్గిన విమానం వేల కిలోమీటర్ల స్పీడు ఎట్లా పోయింది? ఎంత స్పీడు అయినా పోగలదు. చాలా తక్కువ సమయంలో అనేది జరిగి తీరాలంటే, ఈ విధంగా జరగాల్సిందే అనే నమూనాగా జరిగి తీరింది. ఈ విధముగా ఒకటి దేవుని పరిపాలనలో ఎన్నో గ్రహాలు, ఎన్నో భూతాలు, ఎన్నో ఉపభూతాలు,

ఎన్నో ఉపగ్రహాలు అనేవి కొన్ని కోట్ల కొలది ఉన్నాయి. వీటిలో ఏదో ఒకటి ఈ రకంగా, జ్ఞానం కలిగే నిమిత్తం, కొన్ని ప్రాంతాలలో అంతుపట్టని విధంగా చేస్తున్నాయి ఆ సమాచారము తెలుస్తూ ఉంది.

సునామి రోజు ఏమి చేయాలో అర్థము కాకుండా పోయింది. అంతపెద్ద సునామీ ఎలా వచ్చింది? అంతపెద్ద భూకంపము ఎలా వచ్చింది? ఈ రోజు అంతమంది జనం ఎట్లు చచ్చిపోయారు? లక్షల ఇళ్ళు ఎట్లు కూలిపోయినాయి? ఆ దేశం విడిచిపెట్టి ఇంకొక దగ్గరకు పారిపోయేటట్లు చేసింది. చాలా రేడియేషన్ శక్తి విడుదలై సమర్థులు, మేథావులు అనుకున్నవారు కూడా పారిపోయారు. భూకంపం, సునామీలను ఏ మనిషైనా సృష్టించగలడా? అవి చేసినంత పనిని మనుషులెవరైనా చేయగలరా? మరి ఇంత పని ఎట్లు జరిగింది?

సునామీ వచ్చింది అంటే, వచ్చింది అని మనము సులభముగా చెప్తున్నాము. అంత వేగంగా అంటే 800 కి.మీ స్పీడుతో వచ్చిందట. విమానంకంటే స్పీడు. మామూలు విమానం 600 కి.మీ స్పీడుతో పోతే, ఇది 800 కి.మీ స్పీడుతో ఎట్లు వచ్చింది? అని మేము ప్రశ్నిస్తునాము. మీరేదో జవాబు చెప్పినా, సరైన జవాబు కాదు. సముద్రములో ఉన్న పెద్ద పెద్ద స్టీమర్లు కాగితం పడవల మాదిరి ఊర్లోకి వచ్చి పడ్డాయి. మరెట్లు అవి అలా వచ్చాయి? ఈ పనిని ఎవరు చేశారు? మీరంతా పేరుపెట్టి ప్రకృతి వైపరీత్యం అంటారు. ఈ లెక్క ప్రకారం చూస్తే ఏదో తెలియని తతంగం జరిగి, ఇంతపెద్ద ఆస్తి, ప్రాణ నష్టం జరిగింది. ఇవన్నీ మన కర్మను బట్టి వచ్చేవి. ఎప్పుడైతే జ్ఞానము లేదో, నాకు చాలా మేధస్సు ఉంది, తెలివి ఉంది మన తెలివికొద్దే మనము ఎన్నో కనిపెడుతున్నాము. ఏ దేవుడు ఏమి చేస్తున్నాడు అని ఎప్పుడైతే అతను అనుకున్నాడో, నీ

తెలివి ఎంత మటుకు ఉందో చూసుకో అని అతని ప్రయోగం చూపించాడు. ఎవరు? దేవుడు. అణురియాక్టర్లు పెట్టారు. అణురియాక్టర్లు పగిలిపోయి ఈ రోజు అవే సునామీకంటే పెద్ద నాశనాన్ని తీసుకువచ్చాయి. వీరికే కాకుండా పొరుగు దేశాలైన చైనా, రష్యాకు కూడా ఈ రేడియేషన్ ప్రభావం తాకింది. వారూ రేడియేషన్‌కు అల్లాడినారు. ఇప్పుడు ఏ భూతము వారిని కబళించేసింది? అంటే మన వెనుక ఎంతో పెద్ద తతంగం జరుగుతూ ఉంది. మనకు తెలియని తతంగాలు చాలా ఉన్నాయి. తెలియదు అని శాస్త్రజ్ఞులు విడిచిపెట్టిన విషయాలు ఉన్నాయి. ఆ విషయాలన్నింటినీ మేము తెలుసుకోవాలనుకున్నాము. వాటినే ఒక గ్రంథరూపంలో వ్రాశాము, అదే **"త్రైతాకార రహస్యము"** అనే గ్రంథము.

ఫ్లైయింగ్‌సాసర్స్ అని మీరు పేరు వినే ఉంటారు. అవేవో విమానాల మాదిరి వస్తూ ఉంటాయి. అంటే వేరే గోళం నుండి వస్తారు. వేరే గోళం నుండి మనుషులు విహార యాత్రకు వస్తుంటారు. భూగోళమునకు వారి వాహనాల ద్వారా వస్తారు అని చాలామంది అనుకుంటున్నారు కదా! మీరనుకున్నట్లు అవి ఏ వాహనాలు కావు, అవి కూడా గ్రహాలే. మిమ్మల్ని శిక్షించేందుకు ముందే పోతాయి. అంటే భూమిమీద ఏ ఉపద్రవాన్ని లేదా ప్రమాదాన్ని తెచ్చిపెట్టి మీ పాపానికి తగిన శిక్షను ఎట్లు వేయాలి అని (చెక్) తనఖీ చేసుకుని వెళ్తాయి. గ్రహాంతర వాసులు (ఏలియన్స్) అంటారు. గ్రహాంతవాసులు కూడా మనలాంటి మనుషులు కారు. వారూ గ్రహలే, వారు భూమిపైకి వస్తున్నారు. వస్తే ఏమి చేస్తున్నారు? ఈ విధంగా బాధలు పెట్టేందుకు ప్లాన్‌వేసి పోతున్నారు. ఆ ప్లాన్‌ను పద్ధతి ప్రకారమే అమలు చేస్తున్నారు, అంటే నీవు ఎవరికీ తెలియకుండా చేసిన పాపం, చెల్లుతుందిలే అనుకున్నా, ఆ పని వెనుక ఉండే పాపాన్ని లెక్కించుకుని,

దానిని అమలు పరిచేందుకు ఎన్నో కళ్ళు నీపై కాచుకుని ఉన్నాయి. ఎంతోమంది నీపై నిఘాపెట్టుకుని ఉన్నారు. మీ పాపము చెల్లుబాటు కాదు. నీ పాపాన్నీ తప్పకుండా నీవు అనుభవించాల్సిందే! అవి రోగము రూపంలో రావచ్చు, ప్రకృతి వైపరీత్యంగా రావచ్చు, ఇంకో రూపంకావచ్చు, శత్రురూపంలో కూడా రావచ్చు.

టీవీలో ఈ మధ్య ఒక విషయాన్ని చూశాము. అది అడవి. అందులో గిరిజనులున్నారు. అక్కడ దేవత పూజ జరుగుతున్నది. అందులో దేవరపోతు అను దానిని బలి ఇస్తారు. ఆ దేవరపోతును కట్టేసినారు. ఒక 20 మంది కట్టెలతో దానిని కొడుతున్నారు. అంటే దానిని ముందే చంపకుండా దానిని చుట్టూ తిప్పి కొడుతున్నారు. అంటే ఒక జీవుడు తన్నులు తింటూ ఉన్నాడు. కొందరు జీవులు అంటే దానిని శత్రురూపంలో కొడుతూ ఉన్నారు. అంటే అనుభవించేది ఆ దేవరపోతులో వున్న జీవుడే. కొడుతున్న వారూ జీవులే. దున్నపోతు ఆకారంతో ఉన్నవాడూ జీవుడే కదా! చివరికి ఆ తన్నులు తినీ, తినీ అర్ధగంట తరువాత, అలిసిపోయి, మెత్తగా అయిపోయిన తరువాత అప్పుడు కొడవళ్ళు తీసుకుని దానిని నరికినారు. ఒక దేవత కొరకు అంత పని చేశారు. అంటే మనము చేసుకునే పాపాలకు శిక్షలు ఏ రూపములోనైనా రావచ్చు. ఈ రోజు మనము అనుభవిస్తున్న శిక్షలన్నీ మన పాపాలే. ఎన్ని రూపాల్లో వస్తున్నాయో మనకు తెలియదు. కాబట్టి మనము శ్రద్ధను పెట్టుకుని, జ్ఞానాన్ని తెలుసుకుంటే, ఈ కర్మలను, శిక్షలను తప్పించుకునేందుకు అవకాశము ఉంటుంది లేకపోతే లేదు. నేను నమశ్శివాయ, నమఃశ్శివాయ అని పంచాక్షరి మంత్రాన్ని జపిస్తాను అన్నా, జపించినా, జపించిక పోయినా ఒక్కటే తప్పు చేస్తే నీవు పూజించే శివుడినైనా శిక్షించక తప్పదు. ఎవరు? దేవుని పరిపాలకులు.

ఒక దగ్గర శివుడే "ఏమి చేస్తాను. నా కర్మ నా కష్టాలు నాకున్నాయి. స్మశానంలో నా కష్టాలు నాకున్నాయి. నీవు అనుకోవచ్చు, నేను చాలా గొప్పవాడినని. నా కష్టాలు నాకున్నాయి" అన్నాడట. అందుకే వారిని ఆశ్రయించినా, వారికీ కష్టాలు తప్పవు, మనకీ కష్టాలు తప్పవు. అయితే ఎవరిని ఆశ్రయించాలి. అంటే అందరినీ పుట్టించిన వాడిని, మనందరికీ నాయన, తండ్రి ఎవరో, వాడే భర్త, రెండూ ఆయనే. తండ్రీ ఆయనే, భర్త ఆయనే జగద్భర్త అంటాము, తండ్రి అంటాము, పరమాత్మ, పరంధామ అని ఎన్ని రకాలుగా ఉచ్చరించినాగానీ, అసలైన ఆ దేవున్నే తెలుసుకుంటే, అప్పుడు అసలైన జ్ఞానము తెలియబడుతుంది. అసలైన జ్ఞానము తెలియటం కొరకు ఏమి చేయాలి? శ్రద్ధకావాలి. శ్రద్ధ లేకపోతే జ్ఞానమయమైన పని కాదది. మరి అసలైన దేవునిపైన ఏ విధముగా శ్రద్ధ ఉండాలి? మరి నా శ్రద్ధ దేవునిపైనో, దయ్యంపైనో ఎక్కడ ఉందో, మరి ఆ పొరపాటు ఎట్లు తెలుస్తుంది? అని నన్ను ప్రశ్నించవచ్చు. నేను మాయ పని చేస్తున్నానని మీరు అంటున్నారు. ఎట్లు నేను తెలుసుకునేది? అని నన్ను ప్రశ్నించ వచ్చును.

అందుకే దేవుడు మీరంతా ఆ విధంగా పొరపాటు పడతారేమోనని, పొరపాటు పడకుండా ఉండాలని భగవద్గీతలో నాలుగు శ్లోకాలలో చెప్పినాడు. ఏ వ్యక్తి అయినా **"యజ్ఞముల వలనగానీ, వేదాలు చదవడం వలనగానీ, దానాలు, ఉగ్రతపములు చేసినందు వలనగానీ, దేవున్ని తెలియ లేవు"** అని అన్నాడు. ఇంతవరకు ఏవైతే పట్టుకుని ఊగిసలాడుచున్నారో అవి పనికిరావు అని చెప్పుచున్నాడు. కాబట్టి మనకి పనికి వచ్చేది ఏది. విశ్వరూపసందర్శన యోగంలో 48, 53 శ్లోకాలను ఆధారము చేసుకుని చూస్తే మనము చేసినదంతా తప్పే! ఇది ప్రబోధానందస్వామి చెప్పినమాట

www.thraithashakam.org

కాదు. ఇది దేవుడు చెప్పిన మాట. ఇవన్నీ చెప్పేది నిజమేనా? అని ప్రశ్నిస్తున్నారు. నేను క్రైస్తవమతము గురించి చెప్తున్నాను అంటున్నారు. మేము అసలైన హిందూ మతానికి సంబంధించి భగవద్గీతను గురించి బోధిస్తున్నామని తెలుసుకోవటం లేదు. ఇందూ ధర్మముల గురించి చెప్తున్నాము. ఆ జ్ఞానాన్నే ఇప్పుడు మేము చెప్తున్నాము తప్ప ఇంకేమీ కాదు. ఈ జ్ఞానాన్ని అనుసరిస్తే కర్మలు తొలగిపోవుటకు అవకాశము ఉంది. ఈ రోజు జపాన్ దేశంలో వచ్చిన భూకంపములో చిన్నలు, పెద్దలు, ముసలి వారు, చిన్నచిన్న పిల్లలు అందరూ చనిపోయారు అందరినీ దయా దాక్షిణ్యాలు లేకుండా చేసి శిక్షించిది కదా! మరి వీటన్నింటినుండి తప్పించుకోవాలంటే జ్ఞానము కావాలి. జరుగబోయే విపత్తులనుండి బయటపడాలంటే, జ్ఞానము కావాలి. జ్ఞానము కావాలంటే మనకు శ్రద్ధ కావాలి. జన్మత శ్రద్ధ లేదు, కనుక ఆయన ఇస్తే ఉంటుంది, ఎంత ఇస్తే అంతే ఉంటుంది. మనం చేతులెత్తేసి, నాకేమీ తెలియదు అని అనుకుంటే మంచిది. మనకు ధైర్యం ఉంటే ఎలాగైనా జ్ఞానాన్ని తెలుసుకోగలం అనే శ్రద్ధ ఉంటే మంచిదే.

ఆశ అనే గుణం ఉన్నది. కోపము అను గుణం ఉంది. ఇటువంటి గుణాలున్నాయి కానీ శ్రద్ధ లేదు. గుణాలను విడిచిపెట్టి జ్ఞానము మీద శ్రద్ధ కలిగించుకుంటే బాగుంటుంది. అటువంటి శ్రద్ధ లేకపోతే వేరేవారి ద్వారానైనా వస్తుంది అనే ఉద్దేశ్యంతో వారిమీద నమ్మకం కలిగి వారి ద్వారానైనా శ్రద్ధను కలిగింప చేసుకుని జ్ఞానం తెలుసుకుంటే మంచిది. ఇప్పటి పరిస్థితిలో అదే మంచిది.

పూర్వము ఎట్లా ఉండేదంటే, మంచి జ్ఞానము (దైవజ్ఞానము) కలిగి ఉండేవాళ్ళు చాలామంది ఉన్నారు. దానికొక సామెత చెప్పేవారు. అది

ఎప్పుడూ వాడుతూ ఉంటాము. కానీ ఇప్పుడు వేరే అర్థముతో వాడేస్తున్నాము. “ఒక్క వెంట్రుక చూపించి, మొత్తము గొంగడి (కంబళి)ని ఆక్రమించు కున్నారు” అంటే ఒకడు “వెంట్రుక చూపించి, మొత్తము గొంగడినే ఎత్తుకెళ్ళాడు” అని దాని అర్థము. గొంగడి అంటే వెంట్రుకలతో తయారు చేసినది. మనము ఒక వెంట్రుకను చూపిస్తే, మొత్తము గొంగడినే ఆక్రమించు కుంటాము. గొంగడి (కంబళి) ఉంటుంది. కొన్ని కోట్ల వెంట్రుకలతో తయారు చేయబడుతుంది. కొన్ని కోట్ల వెంట్రుకలు కలిస్తే గానీ ఒక గొంగడికాదు, కాని మనము ఒక వెంట్రుకను చూపించి, మిగతా గొంగడి కూడా నాదే అంటాము. అంటే ఇప్పుడు ఈ రకంగా అర్థము చేసు కుంటున్నారు. అయినా సరే పూర్వము మాత్రము వెంట్రుకను ఆత్మకు గుర్తుగా చెప్పుకున్నారు. ఒక వెంట్రుక ఒక ఆత్మ అనుకుంటే నీ శరీరములో ఒక ఆత్మ ఉంది. అనేక శరీరాల్లో అనేక ఆత్మలున్నాయి, అనేక ఆత్మలను కలిపితే ఒక గొంగడి అవుతుంది. నీది ప్రత్యేకమైన వెంట్రుకనే, “ఈ వెంట్రుకను చూపి మొత్తము గొంగడినే ఆక్రమించు” అంటే నీలో ఉన్న ఆత్మను తెలుసుకోగలిగితే, అన్ని శరీరాలలో ఉన్న ఆత్మల గురించి తెలిసి పోతుంది. ఆత్మ అనేక రూపాలలో అనేక శరీరాలలో ఉన్నా కానీ అది ఒక్కటే. వెంట్రుక ఒక్కటే. గొంగడిగా తయారు చేయబడుతుంది లేదా ఒక్కటిగా వెంట్రుకగా ఉండిపోతుంది. ఇదంతా పూర్వము వారు తెలుసుకున్నారు. కానీ మనకి మన శరీరములో ఉండే ఆత్మ గురించే తెలియడం లేదు. అసలు ఆత్మ అంటూ ఒకటి ఉందని ఏమాత్రము తెలియడం లేదు. ఎవరు చెప్పుకున్నా జీవాత్మ గురించి చెప్పుకుంటున్నారు. పరమాత్మ గురించి చెప్పుకుంటున్నారు. మధ్యలో ఉన్న ఆత్మను మాత్రము వదలిపెట్టారు. ఆత్మ సమాచారము మాత్రము ఎవరి దగ్గరా లేదు, ఎందుకు లేదు? అంటే, ఆత్మ అంటే జీవాత్మ అనైనా అనుకుంటారు, లేకపోతే పరమాత్మ

www.thraithashakam.org

అనైనా అనుకుంటారు తప్ప, ఇది ప్రత్యేకంగా శరీరములో ఉంది అని మాత్రము తెలియదు. కాబట్టి, అన్ని శరీరాలలోనూ ప్రత్యేకంగా ఉంటూ ఏక స్వరూపంగా ఉన్న ఒక ఆత్మ ఉంది. దీని గురించి ప్రపంచములో ఎవ్వరికీ తెలియదు అని భగవద్గీతలో చెప్పబడింది. భగవద్గీత వచ్చి 5000 సంవత్సరాలు దాటినా ఆత్మ ఎవ్వరికీ అర్థము కాలేదు. జీవాత్మకు పరమాత్మకు మధ్యలో ఆత్మ ఉన్నది, శరీరమంతా వ్యాపించి ఆత్మ ఉంది. జీవాత్మవైన నీవు ఏమీ చేయలేవు, తలదువ్వకున్నా, ముఖం కడుగుకొనినా, చిన్న పని చేసినా, పెద్ద పని చేసినాగాని ఆత్మేచేయాలి. జీవాత్మవు నీవేమీ చేయలేవు. కానీ అన్నీ జీవాత్మ చేస్తున్నది అని అనుకుంటున్నారు. కనుక ఈ పని చేయండి, ఆ పని చేయండి అని, పాపము పోతుంది అని, ఫలితము వస్తుందని చెప్తున్నారు. ఏ పనీ నీవు చేయటం లేదని మాత్రము చెప్పటం లేదు. కనుక మనము ఏమి చెప్తున్నామంటే ఆత్మ అనే దానిని ప్రత్యేకంగా తెలుసుకోగలిగితే, మనకి జ్ఞానము అర్థమయినట్లే. అది తెలియాలంటే ప్రత్యేకమైన శ్రద్ధ కావాలి. ఆ శ్రద్ధ వచ్చినప్పుడే అసలైన త్రైత సిద్ధాంతాన్ని, మూడు ఆత్మల వివరాన్ని తెలుసుకుంటాము. త్రైత సిద్ధాంతము ఎక్కడ పుట్టింది? ఇక్కడే పుట్టింది. ఇంతకుముందు ఎక్కడా లేదు. ద్వైతం ఉంది, అద్వైతం ఉంది, విశిష్టాద్వైతము ఉంది. ఇవి అర్థమయినాయిగానీ, త్రైతము అర్థంకాలేదు. మూడు ఆత్మల విషయం ఎవ్వరికీ తెలియదు. కాబట్టి, మధ్యనుండే ఆత్మ గురించి తెలియాలంటే శ్రద్ధ కలిగిన జ్ఞానము కావాలి. కనుక శ్రద్ధ కావాలని కోరుకోవాలి. శ్రద్ధ లేనటువంటి వారు కూడా శ్రద్ధ పెంచుకుని జ్ఞానము తెలుసుకోండి. ప్రపంచ విషయాల జోలికి పోవద్దండి. ప్రపంచ మాయ నుండి బయటపడండి, జ్ఞానాన్ని తెలుసుకోండి అని తెలుపుతూ ముగిస్తున్నాము.

www.thraithashakam.org

# 43. యోగీశ్వరుల వారి జన్మదిన సందేశము

తేది : 05-04-2011

**"త్రైతాకార రహస్యము"** అనే గ్రంథములో, ప్రపంచమునకు తెలియని రహస్యములు ఎన్నో ఉన్నవి. గ్రహాంతరవాసులు ఏ గ్రహంనుంచి వస్తున్నారు? వాళ్ళు ఎవరు? అనే విషయం గూర్చి ఈ గ్రంథములో కలదు. అలాగే ఫ్లయింగ్ సాసర్స్ అంటే ఏమిటి? ఎగిరే పళ్లెములు అంటే ఏమిటి? అవి ఎక్కడనుండి వస్తున్నవి? అనే విషయము మనకు క్షుణ్ణంగా తెలియదు. వేరే గ్రహము నుండి ఈ గ్రహాంతరవాసులు, ఫ్లయింగ్‌సాసర్స్ వచ్చి పోతున్నారు అనే కథనాలను పేపర్స్‌లో చూసే ఉంటారు. అవి వాస్తవమా, కాదా? అందులో సత్యమేమిటి? అనే విషయాల గూర్చి కూడా ఈ గ్రంథములో ఉంటాయి. ఈ మధ్య జపాన్‌లో పెద్ద భూకంపమొకటి ఏర్పడింది. జపాన్‌లో భూకంపము ఏర్పడడానికి ముందు, బెర్ముడా ట్రయాంగిల్‌కు పూర్తిగా వ్యతిరిక్తదిశలో ఉన్న ప్రాంతంలో భూకంపాలు వచ్చే అవకాశము ఉంది అని మేము చెప్పటము జరిగింది. ఎప్పుడో వస్తాయని చెప్పాముగానీ, వెంటనే వస్తాయని చెప్పలేదు. ఇండోనేషియా నుండి జపాన్ దేశము వరకు ప్రభావము ఉంది. బెర్ముడా ట్రయాంగిల్‌కు పూర్తి వ్యతిరిక్తంగా ఉంది. కానీ చెప్పిన మర్నాడే సునామీ రావటం, భూకంపం రావటం అల్లకల్లోలం జరిగిపోయింది. ఇక్కడ రావటం వాస్తవమే. ఎంతోమంది చనిపోవటం వాస్తవమే, కోట్లాది రూపాయలు నష్టం అయినదీ వాస్తవమే, కానీ దాని వెనుక జరిగే ప్రక్రియ ఏమిటి? అంత భయంకరంగా రావడానికి కారణం ఏమిటి? ఒక వస్తువును కదిలించాలంటే కొంత బలం కావాలి కదా! అక్కడ స్టీమర్స్, లారీలు ఇష్టమొచ్చినట్లు పోతున్నాయి. మీరంతా ఆ దృశ్యాలను చూసే ఉంటారు.

అంత భయంకరమైన శక్తి ఎలా వచ్చింది? విమానం వెళ్తే 600 కి.మీ స్పీడులో వెళ్తుంది. సముద్రములో అలల రూపంలో వచ్చే నీరు వేగం ఎంత అంటే 800 కి.మీ స్పీడంటే, అంత స్పీడుగా నడిపించింది ఎవరు? మరి అంత స్పీడుగా ఎట్లు వచ్చాయి? ఇవన్నీ ప్రశ్నలు వేసుకుని చూస్తే, సైన్స్ ప్రకారము ఎన్ని రకాలుగా, ఎన్ని కారణాలు చెప్పుకున్నా, అవన్నీ పూర్తి వాస్తవము కావు. సైన్స్ పరిశోధకులు చాలామంది చెప్తున్నారు. "మేము పరిశోధనలు చేశాము. ఈ విధంగా జరిగి ఉండవచ్చు అని చెప్పుకుంటున్నారు. కానీ మా పరిశోధనకు మించి, పిడిగుపాటులాంటి వ్యవహారం జరిగిపోయిందక్కడ. మేము ఇంత వేగంతో నీళ్ళు వస్తాయి అనుకుంటే అంత స్పీడుకంటే రెండు రెట్లు వేగంతో వచ్చాయి, అంత స్పీడుతో ఎందుకు వచ్చాయో మాకు తెలియదు" అంటున్నారు. అంటే తెలియనిదేదో జరిగింది అని వారు కూడా ఒప్పుకుంటున్నారు. ఆ తెలియని తత్త్వము ఏమిటి? అనేది మేము ఈ గ్రంథములో చెప్పాము. సునామీలు, భూకంపాలలో ఉండే రహస్యమేమిటి అనే విషయమూ తెలుస్తుంది. తరువాత వీటికన్నింటికీ వెనుక ఉన్న మూలశక్తి ఏమంటే దైవశక్తి తప్ప, ఏమీలేదు అని చెప్పటం జరిగింది. ఆ దైవశక్తిలో ఎన్నో విభాగాలున్నాయి అని చెప్పాము. దేవుని పరిపాలనలో మనకు తెలియకుండా కోట్లాది మంది ఉన్నారు అని చెప్పాము. వారు చేసే అనేక పనులలో ఈ పని ఒకటి, ఇంకా ఎన్ని పనులు జరుగు తాయో మనకి తెలియకుండా. ఈ 'బెర్ముడా ట్రయాంగిల్' అనే విషయంలో కూడా అంచనాలకు అందని విషయాలు చాలా ఉన్నాయి. ఒక్కసారిగా కొన్ని నిమిషములలో 5500 టన్నుల బరువు కల్గిన ఒక పడవ కనిపించ కుండా పోయింది అని ముందే చెప్పుకున్నాము. మరి అంత పెద్ద పడవ ఎలా కనిపించకుండా పోయింది?

ఎక్కడకు చేరింది, ఏమయింది? అనే విషయాలు కూడా చర్చించబడ్డాయి. ఈ **"త్రైతాకార రహస్యము"** అనే గ్రంథములో అది ఎట్లు పోయింది అనే విషయాన్ని ఎవరూ చెప్పకున్నా, మనమే చెప్పుకున్నాము. ఈ గ్రంథము పేరే రహస్యము, "త్రైతాకార రహస్యము", త్రైతం అంటే మూడు అని అర్థము. బయటికి మూడు కోణాలే, కానీ మూడు కోణాలు అంటే **'జీవాత్మ, ఆత్మ, పరమాత్మ** అనే మూడింటికి మధ్యలో ఉండే రహస్యము. ఎవరికీ తెలియని రహస్యము అందులో ఉంది అని చెప్పటం కోసమే సముద్రము మీద ఒక ప్రాంతం ఏర్పడింది. ఆ ప్రాంతంలో ఇవన్నీ జరుగుచున్నాయి. బెర్ముడా అనేది మనకి ముఖ్యము కాదుగానీ, త్రైతాకారము (ట్రయాంగిల్) అనేది ముఖ్యము. బెర్ముడా అనేది ఒక దీవి. దానికి దగ్గరగా ఇది ఉండటం వలన బెర్ముడా ట్రయాంగిల్ అన్నారు. ట్రయాంగిల్ అంటే మూడు ఆత్మల మధ్యలో ఉండే రహస్యమని, అక్కడ విమానాలు మాయమై పోతున్నాయి, స్టీమర్లు మాయమైపోతున్నాయి, ఏమైపోతున్నాయి, దానిని పరిశోధించాలని పోయిన మనుషులు కూడా అంతుచిక్కకుండా పోయారు, తిరిగి రాలేదు. మరి అంతపెద్ద రహస్యము ఎక్కడ ఉంది? అది మన శరీరములోనే ఉంది. నీ శరీరాన్ని నీవు పరిశోధించగలిగితే మూడు ఆత్మల విషయము తెలుసుకోగల్గితే, పెద్దపెద్ద శాస్త్రజ్ఞులకు తెలియని రహస్యాన్ని, మనం ఈ రోజు తెలుసుకోవచ్చు. మనము సులభంగా చెప్పవచ్చు. ఇదంతా దేనికి ముడిపడి ఉంది? మూడు ఆత్మల విషయానికి. ఇది మూడు ఆత్మల విషయమే కాబట్టి, ఈ రోజు భూకంపాలను గురించి చెప్పాము. సునామీల గురించి చెప్పాము. ఏలియన్స్, ఫ్లయింగ్‌సాసర్స్, క్రాప్‌సర్కిల్స్ గూర్చి కూడా చెప్పాము.

క్రాప్‌సర్కిల్స్ అంటే పెద్దపెద్ద పొలాల్లో బొమ్మల ఆకారం తెలియకుండా ఏర్పడుతోంది. అంటే కొన్ని నిమిషాల్లోనే బొమ్మలు ఏర్పడు

తున్నాయి. ఈ మధ్య నేషనల్ జియోగ్రఫీ ఛానల్‌వారు పరిశోధన చేశారు. ఈ గ్రంథము వ్రాసిన తరువాత వారు పరిశోధన చేశారు. వారు చెప్పున్నది ఏమిటంటే, ఆకాశములో విపరీతమైన కాంతులు కనిపిస్తున్నాయి. ఆ కాంతులు ఏమిటి అనేది తెలియదు. చాలా స్పీడుతో ఆ లైట్లు వెళ్తున్నాయి. వీటి వెనుక ఏదో రహస్యం ఉంది. ఇది తెలియని రహస్యం అని చెప్తున్నారు. ఎప్పటికీ ఇవి తెలియని రహస్యాలే అని చెప్తున్నాము. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అనే విషయాలు తెలియనంతవరకు ఎవరికీ తెలియని రహస్యాలే. ఎందుకంటే నీలో ఉన్న జీవాత్మ, ఆత్మ, పరమాత్మ విషయాలు తెలియనంత వరకు రహస్యాలే. ఈ రోజు ప్రతీ విషయాన్ని క్షుణ్ణంగా చెప్పగలిగిన మేధావులంతా ఎందుకు చెప్పలేక పోవుచున్నారు? ఎందుకంటే ఆత్మజ్ఞానము తెలియకపోవటము వలన చెప్పలేక పోవుచున్నారు.

ఈ మధ్య టీవీలో ఒక విషయం వచ్చింది. అందులో 84 సంవత్సరాల వయస్సుగల వృద్ధుడు, 73 సంవత్సరములనుండి ఆహారం, నీళ్ళు తీసుకోవటం లేదు అని చెప్పారు. దానిని తెలుసుకునేందుకు 30-40 మంది డాక్టర్లు బృందంగా వెళ్ళి, మూడు నెలలుగా అతనిని పరీక్షించి చూశారు. ఏమి జరుగుచున్నదీ చూశారు. అతను వాస్తవంగా నీళ్ళుగానీ, ఆహారంగానీ తీసుకోవటం లేదని వారు చెప్పారు. తరువాత, ఇదంతా వాస్తవమే అయినప్పటికీ అతను ఏ విధంగా బ్రతుకుచున్నాడో? అర్థము కావటం లేదు అని చెప్పారు. ఏ విధముగా బ్రతుకుచున్నాడు అనేది భౌతికశాస్త్రానికి అంతుచిక్కని రహస్యము. ప్రతీ వ్యక్తికి భౌతికశాస్త్ర రీత్యా, ఇటు ఆహారం కావాలి, అటు ప్రాణవాయువు కావాలి. కానీ ఈయన ఏమాత్రము ఆహారం తీసుకోవటం లేదు. ఆహారం తీసుకోకుండా బ్రతుకగలుగుచున్నాడు. ఈ విషయం గూర్చి తెలియాలంటే భౌతికశాస్త్రరీత్యా

తెలియబడదు. ప్రపంచ సంబంధ శాస్త్రాలు ఐదున్నాయి. ఐదులో భౌతికశాస్త్రము ఒకటి. ఈ విషయం భౌతికశాస్త్రమే అయినప్పటికీ, దీనిలోని రహస్యం తెలియబడదు. ఎందుకంటే మన శరీరములో భౌతికమే కాకుండా, అభౌతికమైన ఆత్మ కూడా ఉన్నది. అభౌతికమైన జీవాత్మవైన నీవు కూడా నివాసం చేస్తున్నావు. నీవెవరో, నీ ఆత్మ ఎవరో తెలియనంతవరకు, శరీరములో గల అన్ని విషయాలు తెలుస్తాయి అనటం అవివేకం. వ్యక్తి 73 సంవత్సరాలు ఆహారం, నీరు తీసుకోకుండా ఎలా బ్రతుకుచున్నాడు? అంటే దానికి జవాబులేదు. జవాబు కావాలంటే ఒకే ఒక ఆధ్యాత్మిక విద్య (ఆత్మను) తెలుసుకోవటం ద్వారా సమాధానము సులభంగా చెప్పవచ్చు. ఈ విధంగా ఈ విషయాన్ని తీసుకుని ఆధ్యాత్మిక శాస్త్రరీత్యా, బ్రహ్మవిద్యా శాస్త్రరీత్యా **"ఆహారం తినని మనిషి"** ఎట్లా బ్రతుకుచున్నాడు అనేది **"త్రైతాకార రహస్యం"** గ్రంథములో వివరించడము జరిగింది. ఇంతవరకు భౌతికశాస్త్ర మేథావు లెవరూ చెప్పని రహస్యాన్ని వివరించడము జరిగింది. అమెరికా దేశములో ఫ్లోరిడాకు సమీపములోగల బెర్ముడా దీవి ప్రక్కన ఉన్న సముద్రంలో ముక్కోణపు ఆకారములో ఉన్న ప్రాంతంలో ఎన్నో వింతలు జరుగుతున్నాయి. అక్కడకు చేరిన విమానాలు, ఓడలు కనిపించకుండా పోయాయి. అవి అందులో మునిగిపోయినాయా, కాలిపోయాయా అనేది ఇంతవరకు తెలియదు. ఎన్నో వేల పడవలు పోయాయి. ఎన్నో విమానాలు కనిపించకుండా పోయాయి కానీ గుర్తింపుకు వచ్చినవి 1950 నుండి మాత్రమే తెలిసింది. 1950 నుండే ఇవన్నీ పోతున్నట్టు తెలుసుకొని, ఇవి ఫలానా చోట పోతున్నట్లు మాత్రము తెలియదు. 1950లో పోతునట్లు తెలిసినా, అప్పటినుండి పరిశోధన చేసినా ఇంతవరకు సుమారు 80 సం॥ల నుండి సమాధానము లేదు. మేము ముందే చెప్పాము. మేము ఏది వ్రాసినా

www.thraithashakam.org

క్రొత్తగా వ్రాస్తాము. మొదటినుండి అటువంటి గ్రంథాలే వ్రాశాము. ఇప్పుడు కూడా అటువంటి రహస్యాన్నే గ్రంథముగా వ్రాశాము.

తరువాత **'మరణ రహస్యము'** గ్రంథములో "తాత్కాలిక మరణము, కాలమరణము, అకాలమరణము" అనే మూడు రకముల మరణాలు ఉన్నాయని వివరించాము. అదే విధముగా "నిద్ర, మెలుకువ, స్వప్నము" అని మూడు ఉన్నాయి. ప్రతీ మనిషికి జననం ఉంది, ప్రతీ మనిషి తిరిగి మరణించాలి. భగవద్గీతలో శాస్త్రపద్ధతిగా **"జాతస్యహిధ్రువో మృత్యుః, ధృవం జన్మ మృతస్యచ"** అని చెప్పారు. ఎప్పటికైన చావవలసిందే, చచ్చినవాడు తిరిగి జన్మించాల్సిందే. ప్రతీ మనిషికీ ఇది అనివార్య కార్యము ఎవరూ దీనిని ఆపలేరు. చనిపోయిన మనిషిని ఎవరూ బ్రతికించలేరు.

చావుపుట్టుకల విషయానికి వస్తే, మనకు బాధకరమైన విషయమే మంటే సత్యసాయిబాబాగారు ఆసుపత్రిలో ఉన్నారు. రాత్రినుండి కష్టమైన పరిస్థితిలో ఉన్నారు. చనిపోయారని పుకార్లు వచ్చాయి. డాక్టర్లు మేమేమీ చెప్పలేము అని చెప్పారు. అంతా గందరగోళ పరిస్థితి. అతనికి ఇప్పటికి 85 సం॥లు ఆయన తన గత జన్మదినం రోజున, 96 సం॥లు బ్రతుకుతానని చెప్పారట. గతంలో మనము ముప్పై సంవత్సరాలనుండి చెప్తున్నాము. సత్యసాయిబాబాగారు 96 సం॥లు బ్రతుకుతాడు, 96 సంవత్సరాలు అతనికి ఆయుష్షు ఉన్నాకానీ, 92వ సం॥లో అతను మరణం పొందుతారు అని చెప్పాము. 96 సం॥లు వాస్తవమే కానీ ఆయనకు ముందే 92 సం॥లో ఆయన చనిపోతాడని జ్యోతిష్యశాస్త్రరీత్యా చెప్పాము. అంతేగానీ బ్రహ్మవిద్యాశాస్త్రం ప్రకారము కాదు. కానీ ఇప్పుడతనికి 87 సం॥లే ఇంకా అతను 5 సం॥ల వరకు చనిపోవటానికి వీళ్ళేదు. కానీ చనిపోతారు అంటున్నారు. చావు అంటే ఏమిటి? ఆయన చనిపోతే మీరేమి చేస్తారు.

www.thraithashakam.org

అని మమ్మల్ని అడుగవచ్చు. నేనేమి చేయనుగానీ నామాట మాత్రము ఎప్పటికీ వాస్తవమే. ఎందుకంటే అది నేను చెప్పినది కాదు. నా ప్రక్కనుండే ఆత్మ చెప్తున్నది. జీవునిగా నాకేమీ తెలియదు. ఆత్మగా ఆయనకు అన్నీ తెలుసు. ఆయన చెప్తున్నదే నేను చెప్తున్నాను. 96 సం॥లు బాబాగారు బ్రతుకుతారు అనేది అనుమానమే, కానీ 92 సం॥లు మాత్రము బ్రతుకుతారు. చనిపోతే ఎట్లా అంటే చనిపోయినా బ్రతికే ఉంటారు. చనిపోయిన తరువాత బ్రతకటమేమిటి? అక్కడే ఉన్నది రహస్యం. **'మరణ రహస్యం'** అనే ఈ గ్రంథములో చాలా ప్రశ్నలకు జవాబు దొరుకుతుంది. గతములో 2000 సం॥ల పూర్వము ఏసుప్రభువు చనిపోయిన తర్వాత మూడు రోజులకు లేచి వచ్చాడు అని చెప్పారు. కానీ అందరూ అతనిని దయ్యం అనుకున్నారు. కానీ అతను చూడండి, ఎక్కడ దెబ్బలున్నాయో అక్కడ గుర్తులున్నాయి, నేను చనిపోలేదు అని చెప్పాడు. కానీ అతనిని దయ్యంగానే లెక్కవేశారు. ప్రభువు చనిపోయి మూడు రోజుల తరువాత వచ్చాడు అని చెప్తున్నారు. శుక్రవారము మధ్యాహ్నము 10 గంటలకు సిలువవేయబడితే, 3 గంటలకు చనిపోతే, 5 గంటలకు దించి గుహలో పెట్టారు. చనిపోయాడా అంటే చనిపోయాడు. బయటికి మన లెక్కలో చనిపోయినట్లే, ఆయన మాత్రము ఏమి చెప్తున్నాడు, నేను చనిపోలేదు, నేను విశ్రాంతి తీసుకున్నాను. శనివారం అంతా విశ్రాంతి తీసుకున్నాను. విశ్రాంతి దినము గడచిన తరువాత, ఆదివారము ఉదయము ఆరుగంటలకే లేచి వచ్చాడాయన. ఈయన "చనిపోయి తిరిగివచ్చాను" అంటే, లేదు అన్నారు జనాలు. "చూడండి శరీరంతో వచ్చాను, ఏ శరీరముతోనైతే పడిపోయానో, ఆ శరీరముతోనే లేచి వచ్చాను" అని అన్నాడు. అదే కాకుండా మిగతావారు చనిపోయినప్పుడు, ఈయన లేపగలిగినాడు. వారిని,

www.thraithashakam.org

"వారు నిద్రిస్తున్నారు" అని చెప్పి మరీ లేపి బ్రతికించినాడు. చనిపోయాడు అని చెప్పటం లేదు. కానీ చనిపోయాడు అని మనము అనుకుంటున్నాము. చావు-బ్రతుకు విషయం మనకు తెలియదు. మనము ఎంతవరకు చూస్తున్నాము. ఊపిరి ఆడుతూ ఉంటే బ్రతికినాడు. ఊపిరి ఆడకపోతే చనిపోయినాడు. అలాగే కదిలితే బ్రతికాడు, కదలకపోతే బ్రతికిలేడు అని అంటాము. కానీ మనిషి కదలకున్నా, ఊపిరి ఆడకున్నా బ్రతికివున్న స్థితి ఒకటి ఉంది. దానినే **"తాత్కాలిక మరణం"** అంటున్నాము. ఈ విధముగా కొద్దిసేపు విశ్రాంతి తీసుకుని రావటం అన్నమాట.

ఈ విషయం వాస్తవమా కాదా! అని మనకు తెలిసిన కొన్ని విషయాలు వ్రాసాము. ఈ గ్రంథము బయటికి తెలిసిన తరువాత మహబూబ్ నగర్ జిల్లాలో గద్వాల్ ప్రాంతములో ఒక బ్రాహ్మణ కుటుంబములో ఉన్నవారు చెప్పినారట. మా కుటుంబములో 80 సం॥ల వయస్సు కలిగిన ఒక వృద్ధురాలు ఉండేది. ఆమె ఉయదం 6 గంటలకు చనిపోయింది. ఆమెను సాయంత్రం ఐదుగంటలకు స్మశానముకు తీసుకువెళ్ళాము. బంధు సమేతంగా అక్కడ ఆమెను గుంతలో పెట్టేముందర ఆమె లేచి కూర్చున్నదంట. అంటే ఉదయం 6 గంటలకు చనిపోయిన ఆమె సాయంత్రం ఆరు గంటలకు లేచి కూర్చొంది. ఆమె లేచి, ఇక్కడకు ఎందుకు తీసుకువచ్చారు? అని ప్రశ్నించింది. వారు "నీవు ఈ విధముగా చనిపోయావు" అని అన్నారు. బ్రతికి ఉంటే నన్ను చనిపోయావు అంటారేమిటి? అని ఆమె కొట్లాడిందట. ఇది వాస్తవముగా జరిగిన విషయంగా వారు పుస్తకము చూసి చెప్తున్నారు. ఈ గ్రంథము వ్రాసిన తరువాత కరెక్షన్ కొరకు విశాఖపట్నము పంపించాము. అక్కడ డాక్టరుగారు ఆ గ్రంథాన్ని చదివి, ఆయన మా అనుభవంలో కూడా ఒక విషయం

జరిగింది. అదేమంటే ఈ డాక్టరువద్దకు చనిపోయాడని ఒక పేషెంట్‌ను తీసుకువచ్చారట. ప్రొద్దున గవర్నమెంట్ డాక్టర్‌వద్దకు తీసుకుపోయి, వారు చనిపోయింది అంటే నమ్మకం కుదరక, మన డాక్టర్ గారి దగ్గరకు తీసుకువస్తే, ఈయన కూడా చనిపోయింది అని చెప్పారట. తరువాత ఆమెను ప్రక్కనే ఉన్న పల్లెకు తీసుకుపోయారు. రాత్రి అవటం, మరియు వర్షం పడటం కారణంగా ఆమెను స్మశానానికి తీసుకు వెళ్ళలేదు. అలా మూడు రోజులపాటు వర్షం రాడటం వలన ఆమెను ఇంటి ముందర వరండాలో ఉంచారు. ఆమె ఉన్నట్టుండి లేచి కూర్చున్నది. నన్ను ఈ వరండాలో ఎందుకు పడుకోబెట్టారు? అని అడుగగా అక్కడున్నవారు "నీవు మూడురోజుల క్రితం చనిపోయావు" అని చెప్పారట. ఆమెను మరి మనిషనాలా, దయ్యం అనాలా అంటే, డాక్టర్‌గారు కూడా మరలా ఆమెను విచారించారట. నీకు యమధర్మరాజుగానీ, యమభటులుగానీ ఏమైనా కనిపించారా? అని అడిగారట. నాకెవ్వరూ కనిపించలేదయ్యా నేను నిద్రపోయాను, మరలా లేచాను నిద్రపోయిన దానిని చనిపోయారు అని చెప్పటం వింతకాదా? అని అడిగింది. ఆమె లెక్కలో నిద్రపోవటమే, మన లెక్కలో చనిపోవటం. అంటే మనకి పుట్టుక తెలుసు, చనిపోవటం తెలుసు. మధ్యలో ఉండే "తాత్కాలిక మరణం" గూర్చి తెలియదు. కాబట్టి చాలామంది, చనిపోక నిద్రలోకిపోతే, శ్వాస ఆడకుండా, కదలకుండా నిలిచిపోతే వాడిని చనిపోయాడని పూడ్చి పెట్టేసాము. తరువాత వాడికి తెలివివస్తే, అప్పుడు వాడు నా ఆస్తిపాస్తుల కొరకు నన్ను ముందే పాతిపెట్టారనుకోడా? ఈ గ్రంథము చదివితే **"జనన మరణ సిద్ధాంతమునకు"** అనుబంధముగా ఈ **"మరణ రహస్యము"** గ్రంథము ఉంటుంది. ఒకసారి చనిపోతే తిరిగి మరలా ఆ శరీరముతో బ్రతికే అవకాశము లేదు. కానీ చనిపోయిన వ్యక్తి

మరల అదే శరీరంతో మూడు రోజులు, నాలుగు రోజుల తరువాత బ్రతకడమేమిటి? అని ప్రశ్నించవచ్చు. అంటే చనిపోతే అని చెప్పలేదు. చనిపోకపోతే అవకాశము ఉంది. మనకి ఇప్పుడు మెలుకువ ఉంది, నిద్ర కూడా ఉందా, స్వప్నం ఉందా. కానీ స్వప్న విషయం ఎవ్వరికీ తెలియదు. అలాగే తాత్కాలిక మరణము గూర్చి కూడా తెలియదు. ఏసుప్రభువు కూడా పాతశరీరము నుండి లేచి నేను చనిపోలేదు అని చెప్పాడు. మేము అదే విషయం ఇప్పుడు చెప్తున్నాము కానీ దానిని ఎవ్వరూ గుర్తించటము లేదు.

ఇప్పుడొక చిన్న విషయమేమనగా ఇప్పుడు మీరంతా భౌతికంగా నా ముందు ఉన్నారు, కనిపిస్తున్నారు. అదే కాకుండా ఇక్కడే అభౌతికంగా చాలామంది ఉన్నారు. మా ముందర ఉండేవారికి, కనిపించే దృశ్యంపైనే చూపు ఉంటుంది. మాకు మాత్రము కనిపించని దృశ్యంపైన కూడా చూపు ఉంటుంది. అంటే ఒకటి భౌతికము, రెండు అభౌతికము. భౌతికము మీద (కనిపించే వాటిపైన) అభౌతికము మీద (కనిపించని వాటిపైన) కూడా మాకు చూపు ఉంటుంది. మరణరహస్యంలో తాత్కాలిక మరణం గురించి వ్రాయగలిగాము. అంతేకాకుండా బెర్ముడా ట్రయాంగిల్ విషయాన్ని కూడా వ్రాయగలిగాము. ఇప్పుడు భౌతికంగా మీరు వేయిమంది ఉన్నారనుకోండి ఇక్కడ. అభౌతికముగా ఇంతకు పదింతలు ఉన్నారు. అంటే 10,000 మంది ఎక్కువగా ఉన్నారు. మీరు ఏమి చెప్పినా మేము నమ్మాల్సిందేనా అని అనుకోవద్దండి. ఎందుకంటే మేము చెప్పితే నమ్మాల్సిన పనిలేదు కానీ, మీరు యదార్థాన్ని తెలుసుకుంటే నమ్మగలరు. మనకి జ్ఞానదృష్టి ఉంటే తప్పకుండా అభౌతిక విషయాలు తెలుస్తాయి. తప్పకుండా మేము చెప్పేవి ఎప్పటికైనా, ఎక్కడైనా నిరూపణకు వస్తాయి. ఇప్పుడు కనిపిస్తున్న

www.thraithashakam.org

"జన విజ్ఞానవేదిక" వారు మరొకరు మరొకరు అంతా సైన్స్ తప్ప మిగతాదంతా మూఢనమ్మకమే అంటున్నారు. కానీ పెద్ద సైంటిస్ట్లు మాత్రము సైన్స్ సమాధానము చెప్పలేనవి చాలా విషయాలు ప్రపంచములో ఉన్నాయి అంటున్నారు. సైన్స్ వివరించలేని విషయాలు ఉన్నాయని వారు ఒప్పుకుంటున్నారు. కానీ పూర్తి సైన్స్ తెలియనివారు వీరు అన్నింటికీ సైన్స్ సమాధానము చెప్తుంది అంటున్నారు

ఎక్కడో ఎందుకు 84 సం॥లు కల్గిన మనిషి గత 73 సం॥ నుండి ఆహారం తీసుకుకోవటం లేదు అనే దాని గురించి చెప్పాము! దానిని గూర్చి టీవీలో చర్చబెట్టారు. ఒక నాస్తికవాదిని పెట్టారు ఆయన డాక్టర్ సమరం. మా సమక్షములో ఆయనను ఉంచండి ఆయన అన్నము తింటున్నాడో లేదో చెప్తాము అంటున్నాడు. అంటే దొంగగా ఆయన తింటున్నాడని ఈయన ఉద్దేశ్యం. 30 మంది డాక్టర్లు పరీక్ష చేశారంటే, మేము నమ్మము, మీరు కూడా వాళ్ళతో కుమ్మక్కయి ఉంటారు అంటున్నారు. బ్రతికేదానికి అవకాశం లేదు, మేము నిరూపణ చేస్తాము. మా సమక్షములో పెట్టండి అంటాడు. అంటే ఇది అబద్ధం అని చెప్పుటయే వారివంతు అయిందికానీ, ప్రతీ దానికి శాస్త్రబద్దత ఉంది అని మనము చెప్తున్నాము. వారు శాస్త్రబద్ధత లేదు అంటున్నారు. అంటే వారికి కొన్ని శాస్త్రబద్దతలే తెలుసు, వారికి తెలియని శాస్త్రము కూడా ఉన్నది. బ్రహ్మవిద్యాశాస్త్రము ఒకటుంది. అది అభౌతికాన్ని కూడా మనకు తెలియజేస్తుంది. ఆ శాస్త్రములో తప్పుంటే తప్పని చెప్పవచ్చు. ఒప్పుంటే ఒప్పని చెప్పవచ్చు. ఆ రకంగా ఆహారం తినని మనిషి ఉండటం వాస్తవమే. భౌతికంగా మనిషి బ్రతకాలంటే ఆహారం, నీరు అవసరమే, అవసరము లేదు అని మేమూ చెప్పడం లేదు. ఆహారము లేకుండా బ్రతికే దానికి వీలుంది అంటే ఆధ్యాత్మికత అవసరము. నేనిప్పుడు

ఈ ప్రదేశంలో 10,000 మంది అభౌతికంగా ఉన్నారన్నాను, ఉన్నారని నీవు తెలుసుకునే దానికే ఆధ్యాత్మికం అవసరము. దీనికొరకు పెద్ద కసరత్తు చేయాల్సిన అవసరము లేదు. బుద్ధితో జ్ఞానాన్ని గ్రహించుకో, దీనివలన ఇది సత్యం అని తెలుస్తుంది. ఇంతటితో ఈ సమావేశాన్ని ముగిద్దాము.

## 44. సేవాశాతం

తేది: 19-04-2011

సేవ అనే విషయంలో చాలా సంశయములున్నవి. అసలు సేవ అనే పదం ఎక్కడ సార్థకం అవుతుందనగా, దేవుని సేవలో ఏ వ్యక్తి అయినా ఉన్నప్పుడు, ఆ సమయంలో ఆ వ్యక్తి యొక్క కర్మ ఏదైతే జరుగవలెనని వ్రాసియున్నదో అది జరుగక ఆగిపోవును. దానితో పాటు ఆ కర్మకు అనుబంధంగా ఉన్నది కూడా జరుగకుండా ఆగిపోవును అనే విషయాన్నీ చాలాసార్లు మేము చెప్పాము. అయితే దేవుని సేవలో ఉన్నప్పుడు ముల్లుగుచ్చుకునే కర్మ జరుగకూడదు కదా అన్న ప్రశ్న వచ్చింది. మరి ఈ విధంగా దేవుని సేవలో ఎందుకు జరిగింది? అని ప్రశ్న వేస్తే, జ్ఞానమంతా ఉత్తదే అనే సంశయం వచ్చినట్లయింది. కానీ దేవుని మాట ఎప్పటికీ అసత్యం కాదు. భగవద్గీతలో చెప్పినది, శాస్త్రబద్ధంగా సత్యమే అయి ఉంటుంది కానీ అసత్యము కాదు.

ఇప్పుడు చెప్పేది ఏమంటే సేవ అంటే ఎటువంటి సేవ? సేవ అనే పదము మనం విన్నాముకానీ ఎన్ని విధాలుగా ఉన్నది, సేవలో ఎన్ని శాతాలు ఉన్నవి? అన్నిటికంటే పెద్దసేవ ఏది? సేవలో తరగతులున్నాయా లేదా? వీటన్నింటినీ మీరు గ్రహించలేదు. దేవుని సేవలో ఐదుశాతము

www.thraithashakam.org

పని చేసేవాడూ దేవుని సేవ చేస్తున్నానంటాడు. మరీ మిగతా 95 శాతం ఏమి కావాలి? ఇంకొకరు 25 శాతం మాత్రమే దేవుని సేవ చేస్తున్నారు 75 శాతము ఏమి చేస్తున్నట్టు, అని లెక్క పెట్టుకోవటం లేదు. ఈ విధంగా సేవలో శాతాలున్నాయి. ఇంకా 99 శాతము దేవుని సేవ చేసినాగానీ 1 శాతము తక్కువ ఉన్నట్లే. నూటికి నూరు శాతము మాత్రము కాదది. నూటికి నూరుపాళ్ళు సేవ ఉంది. అది ఏదంటే, దేవుడు భగవంతుడై ధర్మాలు తెలియజేశాడు. **దైవ ధర్మాలను ఇతరులకు తెలియజేయటమే నిజమైన నూటికి నూరుపాళ్ళు (నూరు శాతం) సేవ అగును.** దానికి అనుబంధముగా ఎన్నో సేవలున్నాయి. అవన్నీ తక్కువ శాతం ఉన్నవిగా లెక్కవేయవచ్చును. ఒక వ్యక్తి ఒక బాధను అనుభవించినప్పుడు, నీవు ఆ సమయములో నీవు దేవుని పని చేస్తున్నావు, కదా! అందువలన ఆ సమయములో నీవు అనుభవించే కర్మ శాతం 20 శాతం మాత్రమే ఉంది. 80 శాతం కర్మ అనుభవము తగ్గింది అని అనుకొందాము. అంటే ప్రారబ్ధంలో ఏది జరగాలో అది జరుగుతుంది, కానీ వాటి తీవ్రత మాత్రము తగ్గిపోతుంది. దేవుని సేవలో లేకపోతే మొత్తము 100 శాతము ఆ బాధను అనుభవించవలసిందే. మరి ఆ విషయం మాకెట్లా తెలుస్తుంది? అంటే మీకెట్లా తెలుస్తుంది, తెలియదు. మరీ మీరు దేవుని సేవ ఎంతశాతం చేస్తున్నారని అడిగితే అది కూడా తెలియదు, కనుక సేవలో చాలా భాగాలున్నాయి. మనము ఎంతశాతం దేవుని సేవ చేస్తున్నాము అనే దానిని అనుసరించి మనము అనుభవించే శాతం ఉంటుందని చెప్పవచ్చును.

దేవుని సేవ అనగానే అంతా ఒక్కటే అనుకుంటున్నాము. కానీ దానిలో ఎంతశాతం అని మాత్రము గుర్తించుకోలేకపోయాము. ఒక రోజు నేను ఇంజెక్షన్ చేసుకుంటే దానికున్న సూది గుచ్చినట్లు అసలు బాధ లేదు.

www.thraithashakam.org

అంటే ఇంతకుముందు అనుభవించిన బాధ ఇప్పుడు అనుభవించటము లేదు అంతే. మాకు 18 సంవత్సరములనుండి షుగర్‌వ్యాధి ఉన్నది. 300 పైనే ఎప్పుడూ ఉంటుంది. అయినా మేము దానిని గురించి చింత చేయము. శరీరములో ఒక అధిపతి ఉన్నాడు వాడేం చేస్తాడో చేయనివ్వండి, కుంటివాన్ని నడిపించగలడు, గ్రుడ్డివాడి చేత చూపించగలడు. అన్నీ అతని ఇష్టము, మన చేతిలో ఏమీ లేదు. మనము అనుకున్నట్టు ఏదీ జరుగదు. అందువలన షుగర్ రోగం వలన అనేక శరీర భాగాలు చెడిపోతాయి వాస్తవమే. ఎయిడ్స్ కంటే షుగర్ రోగము పెద్దది. మరి అన్ని అవయవములు నాలో పని చేస్తున్నాయంటే ఎవరి చాకచక్యము. లోపలున్న వాడి అనుమతితో, అతని వలననే జరుగుచున్నాయి. ఈ జ్ఞానాన్ని మీకు చెప్పుచున్నానంటే అధిపతి ఎవరు? ఆత్మే అని చెప్పుచున్నాము. శరీరములో అన్నింటికీ అధిపతి ఆత్మే అని చెప్పాము. అందుకే యమధర్మరాజు ఎవరంటే మీ ఆత్మయే, అంతేగానీ ఇంకెవరో కాదు. యమలోకం ఎక్కడో లేదు. నీ ఆత్మ నీ శరీరములో ఎంతశాతం కర్మ అనుభవించాల్సి ఉందో, అంతే అనుభవింపజేయగలదు. దేవుని సేవలో మనము భాగస్థులమైతే నీ కర్మ క్షమించబడే అవకాశము ఉన్నది. భగవద్గీతలో శ్రీ కృష్ణుడు కూడా అలాగే చెప్పెను. జ్ఞానాగ్ని వలన కర్మలన్నీ నశించిపోవును అని చెప్పాడు. నీవు ఈ రోజు మధ్యాహ్నం రెండుగంటల సమయంలో ఒక కష్టాన్ని అనుభవించే కర్మ అనుభవము లోకి రానున్నది అనుకుందాము. ఆ సమయంలో నీవు దేవుని సేవ చేస్తున్నావనుకో, ఆ కర్మ అనుభవించాల్సి వచ్చినా చాలా తక్కువ శాతం మాత్రమే అనుభవించగలరు. మీరు ఏమనుకున్నా ఇది నూటికి నూరుశాతం వాస్తవం. కానీ ఇవేవీ మనిషికి తెలియవు కనుక, దానికి దెబ్బ తలిగింది అనుకుంటున్నాము ఎంత తగలాలో నీకు తెలుసునా? మరి దేవుని మాట

www.thraithashakam.org

అసత్యం అని ఎట్లా అనుకుంటావు. ఈ మధ్య డిస్కవరీ ఛానల్‌లో చెప్తుంటే విన్నాము. ఏదైనా వస్తువుగానీ, జీవిగానీ పైనుండి క్రిందకు పడేస్తే ఎంత దెబ్బ తగులుతుంది అని మాత్రము చెప్పలేము అంటున్నారు. నీవు క్రిందపడేది వాస్తవమేగానీ నీకెంత దెబ్బ తగులుతుంది అని మాత్రము ఎవరూ, విజ్ఞానవేత్తైనా చెప్పలేడు. ఇప్పుడు మనము అనుభవించే కర్మలలో తీవ్రత ఏ పూజలు చేసినా పోదు, ఎన్ని యజ్ఞాలు చేసినా పోదుగానీ ఒక్క జ్ఞానము వలన మాత్రమే ఆ కర్మంతా జరుగకుండా పోయేందుకు అవకాశము కలదు. **సేవా శాతమును బట్టి కర్మ అనుభవించే శాతము తగ్గును.** కనుక అందరూ దేవున్ని చేరే జ్ఞానాన్ని తెలుసుకోండి జ్ఞానము తెలుసుకుంటున్నారు నిజమే కానీ దానిని ఎంతవరకు ఆచరణలో పెడుతున్నామో అనేది కూడా కావలెను. అయితే అన్నింటికంటే గొప్పపని ఏది? దేవుని జ్ఞానాన్ని ప్రచారము చేయటమే. అదే ఉత్తమమైన సేవ అవుతుంది. అయితే యోగము చేసినప్పుడు కూడా కర్మ జరగకుండా పోతున్నదే అని మీరు ప్రశ్నించవచ్చును. సరే ఆ యోగము మాత్రము నూటికి నూరు శాతము చేస్తున్నారా అంటే బ్రహ్మయోగములో మనస్సు చలించకుండా నిలబడుతూ ఉందా? లేదు. నీవు గంట కూర్చుంటే అది ఒక నిమిషమో, రెండు నిమిషములో నిలబడును. మరీ మిగతా 58 లేదా 59 నిమిషములు ఏమైనట్లు? నీవు కొన్ని సంవత్సరాలు ప్రయత్నము చేస్తే అది కొన్ని నిమిషముల యోగమవుతుంది. ఇది బ్రహ్మయోగము పరిస్థితి. ఇక కర్మయోగము పరిస్థితి ఏమంటే, ఇది తెలుసుకుంటే సులభమే. దీని విధానము అర్థముకాకపోతే అంతకంటే కష్టం ఇంకొకటి ఉండదు. ఎప్పుడూ నీవు ఎరుకలో ఉంటే కర్మయోగములో ఉన్నట్లే, లేకపోతే లేనట్లే. అందుకే మేము చెప్పే జ్ఞానము నేను చెప్పటం లేదు నా లోపలున్న దేవుడే

చెప్పుచున్నాడని మేము ఒప్పుకుంటున్నాము. కావున ఆ విధంగా నీవు కూడా నీ గురించి నీవు తెలుసుకోగలిగితే, అప్పుడు నువ్వుకావు అని తెలుస్తుంది. ఈ విధముగా కర్మయోగములో, బ్రహ్మయోగములోనే కాకుండా దేవుని ధర్మములతో కూడిన జ్ఞానాన్ని ప్రచారము చేయడం కూడా ఒక యోగము అవుతుంది. అదే భక్తియోగము అంటాము. భగవద్గీతలో భక్తియోగములో...

శ్లో॥ అభ్యాసేప్య అసమర్థోసి మత్కర్మ పరమోభవ ।
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి ॥

నా గురించి నీవు పనిచేయి, 'మదర్థమపి కర్మాణి' నా కొరకు నీవు పనిచేస్తే 'కుర్వన్ సిద్ధి మవాప్స్యసి' నీకు మోక్షసిద్ధి లభిస్తుంది. కర్మపోవటం అనేది కర్మయోగము, బ్రహ్మయోగములో కూడా జరుగుచున్నది. భక్తి యోగములో కూడా పోతుంది. అదేమి అంటే దేవుని సేవ చేసే విధానములో అని చెప్పవచ్చును. ఆ సేవ ఎట్లా ఉండాలంటే, సంపూర్ణ భావంతో ఉండాలి. మరి మీకు ముళ్ళు గుచ్చుకుంటేనే అలా బాధపడి దైవజ్ఞానము తప్పుగా అర్థము చేసుకుంటే, మేము కూడా చాలాసార్లు క్రిందపడ్డాము, మాకు తలకాయ నొప్పి వస్తున్నది. అలాగైతే మేము కూడా జ్ఞానము చెప్తు ఉంటే నాకు ఇట్లే అవుతున్నదనుకుంటే, రేపటినుండి మీకు జ్ఞానమే చెప్ప కూడదు అంటే ఎట్లా అవుతుంది. అందుకు మేమేమనుకున్నామంటే ఇంకా ఏదో పెద్దగా తగలవలసింది, చిన్నగా తగిలింది కనుకనే మేము మీ ముందర ఉన్నాము అని చెప్పుచున్నాము. ఉదాహరణకు ఇప్పుడు ఇక్కడున్న ఒక వ్యక్తికి లారీ వచ్చి గుద్దింది. గుద్దుకున్న గోడ అంతా కూలింది కానీ ఆయనకు ఏమీ కాకుండా కేవలం కాలుమాత్రమే విరిగింది అంటే ఏమని అర్థము. అతను చనిపోవలసింది, ఆ కర్మనుండి తప్పించబడ్డాడు. అతని

కర్మ 80 శాతము లేకుండా పోయి 20 శాతము మాత్రమే అనుభవించాడు. ఆ ప్రమాదం జరిగిన నిమిషంలోనే చెప్పాము. అక్కడికి పోయి చూస్తే అట్లే జరిగింది. అందుకే దేవుని సేవ అని చెప్పి మేము ఉచితముగా కూడా గ్రంథాలు పంచుతూ ఉంటాము. జ్ఞానమును పంచడము ఉత్తమోత్తమ మైన సేవ అది. మన లెక్కలో సేవ అయినా కొందరి లెక్కలో మాత్రము అది సేవకాదు. ఎవరైనా ఒక హుండీలో పదివేల రూపాయలు వేస్తే, అదెక్కడికి వెళ్తుందో తెలియదు. అది ఎంతో తెలివితక్కువ అని మనము అంటుంటాము. మనకేమో జ్ఞానప్రచారము అవసరము. వారికేమో అది అర్థముకాదు. మేము జ్ఞాన ప్రచార నిమిత్తము కొన్ని గ్రంథాలను ఉచితముగా పంచదల్చాము. ఒక పోలీస్ ఆఫీసర్ వద్దకు పోతే అతనికి గ్రంథము ఇచ్చి జ్ఞానము తెలుసుకోండి అంటే, ఏమి మాకు జ్ఞానము తెలియదా, ఇంతవరకు జ్ఞానము లేకుండా బ్రతికామా? అని అన్నాడు. తరువాత హైకోర్టులో ఒక న్యాయశాఖాధిపతికి **'దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు'** అనే గ్రంథము ఇస్తే, ఏమి దెయ్యాలు భూతాలు అని చెప్పి, మూఢనమ్మకాలను మీవలె మేము నమ్మాలా, ఇక్కడ నుండి వెళ్ళకపోతే మీ మీద కేసు పెడతాము అన్నాడట. ఒక దగ్గర మన గ్రంథాలు ఉచితముగా ఇస్తుంటే క్రైస్థవ ప్రచారకులని అన్నారట. అలా ఇవ్వడము సేవ అని మనము అనుకొంటే అది వారికి మతప్రచారమైనది.

ఈ విధముగా సేవ అనే భావము ఉన్ననూ అది వారి లెక్కలో సేవే కాదు. ప్రోత్సహించటం లేదు సరికదా నిరుత్సాహ పరుస్తున్నారు. దైవజ్ఞానము అంటే ఏమిటో తెలియని వారు అజ్ఞానముతో ప్రవర్తిస్తున్నారు. ఈ రోజు నేను జ్యూడిషియల్ ఆఫీసర్‌ను అని అంటే, నీవు నీ లోపల ఉండే రోగమునకు ఆఫీసర్‌వా అని అడుగుచున్నాను. నీవు మలవిసర్జన

www.thraithashakam.org

చేయడానికే నిర్భలుడువి, బయట మాత్రము పెత్తనము చెలాయిస్తారు. ఎక్కడ ఏమి మాట్లాడినా గానీ దేవుని జ్ఞానమువద్ద మాత్రము చిన్నగా మాట్లాడవద్దు. నీవు ఎంత పెద్ద హోదాలో ఉన్నాగానీ, నీ శరీరము కూడా నీ మాటను వినని రోజు వస్తుంది జాగ్రత్త. మేము జ్ఞానము చెప్తూ ఉంటే సంస్కృతము రాని ప్రతీవాడు జ్ఞానము చెప్పేవాడే అని ఒకరన్నారట. సంస్కృతానికి జ్ఞానానికి సంబంధము ఏమిటి? భాషకీ, జ్ఞానానికి సంబంధము ఏమిటి? భావము ముఖ్యము, జ్ఞానము ముఖ్యము. భాషలో పాండిత్యము ఎవరికి కావాలి? అటువంటి వారినందరినీ ఆత్మ గుర్తు పెట్టుకుని, వారికెంత శిక్ష వెయ్యాలో ఆ రకంగానే శిక్షిస్తుంది. మొన్న 2004లో సునామీ వచ్చింది. సముద్రము అంతా పొంగింది. ఆ సమయంలో ఒక వీడియోగ్రాఫర్ తాటిచెట్టు ఎక్కినాడు. ఇంతలో ఒక తల్లి బిడ్డను పట్టుకుని కొట్టుకు వెళుతున్నది. ఆ వీడియోగ్రాఫర్ ఎట్లాగో ఆమె బిడ్డను ఆమెనుండి లాగగల్గినాడు ఆమైతే నా బిడ్డను బ్రతికించగలిగాను అనుకున్నది. తరువాత ఆమె చనిపోయింది. ఆ వీడియోగ్రాఫర్ ఎట్లాగో బ్రతికి తరువాత చెప్తున్నాడు. నేను ఆ బిడ్డను రక్షించగలిగానుగానీ, తరువాత మేమిద్దరం ఆ టైమ్‌లో బ్రతుకుతామో లేదో అనిపించింది అని అన్నాడు. అంటే ఆత్మ తల్చుకుంటే కొలతపెట్టి మరీ శిక్ష వేయగలదు. మరి ఇంత శిక్షలు ఎందుకేసినాడు, దేవునికి న్యాయంలేదు అని అంటున్నారు. న్యాయంలేదుగానీ లెక్కాచారం మాత్రము ఉంది. ఒకవేళ దేవుని సేవ చేయకపోయినా ఫరవాలేదు గానీ, దేవుని సేవ చేసేవారినెవరినైనా అడ్డుపడినా, విమర్శించినా భయంకరమైన పాపము వస్తుంది. మేము ఉచితంగా పుస్తకాలు పంచుతూవుంటే పరమత ప్రచారమన్నారు. ఎందుకంటే ఉచితముగా పంచేవారంతా వారి దృష్టిలో క్రైస్తవులే **"మరణరహస్యము,**

**త్రైతాకార రహస్యము"** అనే గ్రంథాలు ఇస్తే వారు పుచ్చుకోలేదు సరికదా, తిరిగి మీరే చదువుకోండి అని చెప్పి, హనుమాన్ ఛాలీసా అను చిన్న పుస్తకమును ఇచ్చి పంపించినారు. అంటే మనకి ఆ మాత్రం జ్ఞానము కూడా లేదని వారి ఉద్దేశ్యం అన్నమాట.

కనుక చివరిగా చెప్పేదేమంటే, దేవుని జ్ఞానము ఉత్తమమైనదని, దేవుని సేవకు ఆటంకం పరచవద్దని వారిని ప్రోత్సహించవలెనని, సేవలో తరగతులున్నాయని తెలుసుకుని, ఇతరులకు దానిని తెలియజేయమని చెప్తూ ముగిస్తున్నాము.

## 45. దేవుని జ్ఞానము - మాయ మహత్యము

తేది : 17-05-2011

పరమాత్మకు ప్రకృతి దేవుని ఆజ్ఞ ప్రకారము వ్యతిరేఖమైనది. జ్ఞానానికి మాయ మహత్యము వ్యతిరేఖమైనది. అంటే పరమాత్మ జ్ఞానానికి మాయ మహత్యమే వ్యతిరేఖమైనది. మాయ అనగా ప్రకృతి. పరమాత్మ మొట్టమొదట ఏమీ లేనప్పుడు ప్రకృతిని సృష్ఠించాడు. సృష్ఠించినప్పుడే ప్రకృతికి ఒప్పందము పెట్టాడు. దేవుడు సృష్ఠించకముందు ఏమైనా చేయగలడు కానీ సృష్ఠించిన తరువాత ఏమీ చేయడు. పేరు లేనటువంటి వాడు, ఆకారము కూడా లేనటువంటి వాడు దేవుడు. దేవుడు కనిపించడు, ప్రకృతి కనిపిస్తుంది, కనిపించి పనిచేస్తున్నప్పటికీ తెలియకుండా ఉండేదానిని మాయ అంటాము. ఒక వస్తువును కనిపించకుండా చేశాము అంటే మాయం చేశారు అంటాము. 'మాయము' అను పదమునుండే 'మాయ' అను పదము పుట్టింది. ఉన్నదే నీకు కనిపించకుండా పోతే ఏమవుతుంది

www.thraithashakam.org

మాయం అయిపోయింది అంటాము. మాయం అయిపోతుంది అనే పదములోనే మాయం అయిపో+ఇంది అంటే ఉంది అనే అర్థము అంతర్గతముగా ఆ పదంలో ఉంది కానీ నీకు కనిపించలేదు. దానిని మాయం అయిపోయింది అని అంటాము కానీ అది ఉంటుందది. ప్రకృతి మనకు కనిపించకుండా చేసే పనులను మాయ అంటాము, పరమాత్మను దేవుడని కూడా ఎట్లా అంటున్నామో అదే విధముగా ప్రకృతిని మాయ అనవచ్చును, మాయను ప్రకృతి అని కూడా అనవచ్చును. మరి ప్రకృతిని లేదా మాయను సృష్టించింది ఎవరు? దేవుడే.

దేవునితో సమానమైన బలం కూడా మాయకు ఇవ్వబడింది. ఒక ఆట జరగాలంటే సమ ఉజ్జీ ఉంటేనే ఆట జరుగుతుంది. ఏదైనా ఒక ఆట క్రికెట్ కావచ్చు, ఇంకొక ఆట కావచ్చు ఏదైనా సరే, ఎదురు ఎదురుగా ఉంటేనే ఆట జరుగుతుంది. అందరూ ఒక ప్రక్కే ఉంటే ఆట జరుగదు. కనుక జగన్నాటకము అనేది జరగాలంటే నాయక, ప్రతి నాయకులు అనగా హీరో మరియు విలన్ ఇద్దరూ ఉండాలి కనుక ఆ రెండు స్థానములలో దేవుడు, మాయ ఉన్నారు. నాకు వ్యతిరిక్త దిశలో ఉండు అని మాయను దేవుడు నిలబెట్టినాడు కనుక, ఏ పని చేస్తున్నా మాయ దేవునికి వ్యతిరేఖమే చేయాలి అదే దాని పని కూడా. దేవునికి వ్యతిరిక్తముగా చేయటమే మాయకు కర్తవ్యము. అది దేవుడు పెట్టిన పనే. దేవునికి వ్యతిరేఖమైతే దేవునికి కోపము రాదా? అంటే అదేమీ లేదు. అది అతని ఆదేశమే కదా!

పరమాత్మకు ప్రకృతి భార్యగా ఉన్నది కనుక ప్రకృతి, పరమాత్మలు భార్యాభర్తలు. వారిద్దరికీ పుట్టిన సంతానమే మనము సర్వజీవరాశులకు బీజదాతనగు తండ్రిని నేను, ప్రకృతి తల్లి అని భగవద్గీతలో దేవుడే చెప్పెను. ప్రకృతి పరమాత్మకు భార్య అయినాగానీ దేవునికి వ్యతిరిక్తముగానే

ఉండాలి. మాయ ఎట్లు దేవుని జ్ఞానానికి వ్యతిరేఖము చేస్తూ ఉంది అంటే మహత్యం ద్వారా ఆ పనిని చేయగలదు. ఒకప్రక్క జ్ఞానము ఒక ప్రక్క మహత్యము ఉంటే మీ అందరూ ఎటువైపు వెళ్తారు చూడవలెను. వంద సంవత్సరాలు జ్ఞానము చెప్పినా ఒక్క మహత్యం ఎక్కడైనా, ఎవరైనా చేస్తున్నారంటే మనుష్యులు అక్కడికే పరుగెడతారు. వందసంవత్సరాలు జ్ఞానము తెలుసుకున్నా ఒక్క రోజులోనే ప్రక్కకు మాయ పంపించగలదు. ఇక్కడకు 20 సంవత్సరాలనుండి జ్ఞానము తెలుసుకున్నవారున్నారు. ఒకే ఒక్క సంఘటనతో ప్రక్కకు పోయిన వారున్నారు. ఇదంతా మాయయొక్క చాకచక్యం. మరి ఇప్పుడు మాయగొప్పదా? జ్ఞానము గొప్పదా? ప్రకృతివైపు నీవు చూసావా మాయగొప్పది. నీవు భజన చేసుకుంటూ అటే పోతావు తర్వాత ఇటురావు. అటు (మాయ) వైపు చూడకుండా జ్ఞానము వైపే చూసావో జ్ఞానమే గొప్పదిగా కనిపిస్తుంది. ఆ విధముగా మాయ మహత్యాన్ని తీర్చిదిద్దింది. మేము ఇప్పుడు స్వచ్ఛమైన జ్ఞానమే చెప్తూ ఉన్నాము. ఎక్కడా మహత్యాలు గురించి చెప్పటం లేదు.

జ్ఞానానికి కర్మను కాల్చే శక్తి తప్ప మరేమీలేదు. కర్మను కాల్చేశక్తి ఉంది అని చెప్పేందుకు భగవద్గీతలో కర్మలను కట్టెలుగా పోల్చి, జ్ఞానాన్ని అగ్నిగా పోల్చి ఏ విధముగా అగ్ని కట్టెలను కాల్చివేస్తుందో **"జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్".** అదే విధంగా జ్ఞానాగ్ని సర్వకర్మలను కాల్చివేస్తుంది, ఈ మాట భగవద్గీతలో జ్ఞానయోగములో చెప్పబడింది. దేవుని మాట ఎప్పటికీ అసత్యం కాదు. ఆ విధముగా కర్మలు జ్ఞానము వలన నశిస్తాయి తప్ప, ఆ విధంగా ఉండే ప్రక్రియ తప్ప అది మహత్యం మాత్రము కాదు. ఎక్కడైనా నిరూపణ నిమిత్తము నమూనాగా జ్ఞానము వలన కర్మలు నశిస్తాయి అని చూపించినా చూపించవచ్చునుగానీ అది ఎప్పటికీ మహత్యము

కాదు. రెండవసారి మరలా చేయబడదు. కానీ మహత్యం అనేది ఎట్లు ఉంటుంది అంటే ఏ కోరిక కోరినా నెరవేరుతుంది.

ఇప్పుడు ప్రబోధానంద స్వామి జ్ఞానము చెప్పుచున్నాడు. ఎంతో పరిశోధన చేసి ప్రతీ నెల కొత్త జ్ఞానాన్ని చెప్పుచున్నారు. ఈ విధముగా చెప్పటం వలన దేవుడు చాలా గొప్పవాడు అని తెలుస్తుంది. నేను గొప్ప కాదు, దేవుడు గొప్పవాడు అని తెలుస్తుంది. తద్వారా దేవుని మార్గాన్ని అనుసరించేందుకు అవకాశముంది. దేవుడు గొప్పవాడు అని అనుకోకుండా జ్ఞానమే తెలియకుండా అక్కడకు వెళ్తే మీకేమి తెలియదు అని అనిపించాలంటే దానికొరకు ప్రకృతి లేదా మాయ ఏమి చేస్తుందంటే, ఎవరినో ఒకరిని ఎన్నుకొని వాడిని గురువు మాదిరిగా తయారు చేస్తుంది. అక్కడ చిన్న మహత్యాలు బయలుదేరుతాయి, తద్వారా గురువు ద్వారా ఈ విధముగా జరుగుచున్నాయి అని మభ్యపెడుతుంది. ఆయన ఆ విధంగా ప్రపంచ జ్ఞానాన్ని చెప్తూ ఉంటాడు. రామాయణమో, భారతమో, పురాణాలో ఏవో చెప్తూ ఉంటాడు. ఏది సరైన జ్ఞానము, ఏది సరైన జ్ఞానము కాదో తెలియదు కనుక, ఆత్మ జ్ఞానాన్నే జ్ఞానము అనుకోకుండా ఏదైనా జ్ఞానముగానే అనిపిస్తుంది. అది పురాణ జ్ఞానము అని మనకు తెలియకుండా ఉంటుంది గానీ శాస్త్రబద్ధమైనది జ్ఞానము అని తెలుసుకోలేము.

ఇప్పుడు ప్రకృతి ఒక వ్యక్తిని ఎన్నుకుంటుంది అని చెప్పాము కదా! ఆ వ్యక్తి ద్వారా కొన్ని మహత్యాలు జరిగేటట్లు ఏర్పాటు చేస్తుంది మాయ. అక్కడకుపోతే మన కోరికలు నెరవేరుతాయి అనే విధంగా చేసిపెడుతుంది. అందుకే కదా అందరము ప్రాకులాడేది, చెప్పేది జ్ఞానము అవునా కాదా!యని చూడరు. కనుక అందరూ అక్కడకు వెళ్ళటానికే ప్రయత్నం చేయుదురు. కనుక మాయవైపునకే ఎక్కువమంది వస్తున్నట్లు తెలుస్తుంది. కనుక అసలైన

ఆత్మజ్ఞానము వద్దకు చాలా తక్కువమందే వస్తారు. జ్ఞానము తెలుసుకుంటే ఏమి వస్తుంది? ఏమిటి ప్రయోజనము. మా సంసారం అభివృద్ధి చెందుతుందా? మనకేమైన కష్టాలు పోతాయా? అని ఇన్ని ప్రశ్నలు వస్తాయి. అందుకే మేము ముందే చెప్పాము. మీరు ఇక్కడకు వస్తే జ్ఞానము తప్ప మరేమీ తెలియదు. మీ కోరికలు ఏమీ నెరవేరవని చెప్పాము. కనుక ప్రపంచవరమైన కోరికలు ఎక్కడ నెరవేరుతాయో అక్కడకే వెళ్తారు కనుక మాయ కోరికలు నెరవేర్చే విషయములో ముందంజ వేస్తుంది. నేను నాకు తెలిసిన జ్ఞానాన్ని తెల్పటం తప్ప మీ కోరికలకు నేనేమీ చేయలేను. అదంతా కర్మ ఆధీనములో ఉంటుంది. దానివలన ఇవన్నీ సంభవిస్తాయి తప్ప ఎవరి కర్మలు తీసివేసేది కాదు. **"ఎవరి పాపమునుగానీ, పుణ్యమును గానీ తీసివేయడు ఈ ఆత్మ"** అని భగవద్గీతలో ఈ వాక్యాన్ని చెప్పాడు. మీరు చేసుకున్నది మీరు అనుభవించాల్సిందే.

కర్మను పోగొట్టుకోవాలంటే మీరు జ్ఞానము ద్వారా మీరే తొలగించుకోవాలసిందే. నేను జ్ఞానం చెప్తాను, ఆ జ్ఞానము చాలా గొప్పది. అనుభవించే కర్మలు అనుభవానికి రాకుండా పోవును. గత జన్మలో చేసుకొన్న పాప, పుణ్యములు తొలగిపోయేందుకు అవకాశము ఉంది. అంతేగానీ కోర్కెలు నెరవేరటం మాత్రము లేనే లేదు. కానీ మాయ జ్ఞానం దగ్గరకు పోతే వ్యాపారాలు అభివృద్ధి చెందాయి, అక్కడకు పోతే పోయే కాంట్రాక్టు కూడా మరలా తగిలింది, డబ్బులు వస్తున్నాయి, అక్కడకు పోవటం వలన ఆటలో ఓడిపోవాల్సింది కానీ గెలిచాను. ఈ విధముగా ఆలోచింప జేస్తుంది మాయ. ఈ విధముగా ఎన్నుకోబడిన వ్యక్తికి ఏమీ తెలియదు. తనకు ఏ జ్ఞానము తెలియదు అనే విషయము తెలుసు, కానీ ఏదో రకంగా అతను బయటకు కనిపిస్తూ, పేరు ప్రఖ్యాతుల గూర్చి ప్రాకులాడుతూ ఉంటే

యాదృచ్ఛికంగా పేరు ప్రఖ్యాతులు వచ్చేస్తాయి. మాయ వలన ఒక వ్యక్తి నాలుగు ఆటలు నేను గెలవాలి అని మ్రొక్కుకున్నాడు. కానీ ఆ విధముగా మ్రొక్కినట్లు ప్రకృతితో ఎన్నుకోబడిన గురువువలెనున్న వ్యక్తికి ఏమీ తెలియదు కానీ ఆ విధముగా అనుకున్నట్లు మాయకు మాత్రము తెలుసు. కనుక నాలుగు ఆటలు గెలిపించింది. కానీ ఈ వ్యక్తి ఏమనుకున్నాడు ఆ స్వామే గెలిపించాడు అని అనుకున్నాడు. అప్పుడు ఈ వ్యక్తి ఏమనుకుంటాడు ఈ ఆత్మజ్ఞానాలు నాకు ఎందుకు? అని ప్రక్కకుపోతాడు. అప్పుడు మాయ ఎవరినైతే ఎంచుకుందో వారి దగ్గరకు కొందరు వెళ్ళకపోయినా సరే కోరికలు నెరవేరినట్లు చేయగలదు.

ఒక అమెరికా భక్తుడు మాయ గురువు దగ్గరకు వచ్చి మ్రొక్కిపోయాడు. మన దగ్గరకు మన జిల్లా భక్తులే రారులెండి, అమెరికా భక్తులు ఎట్లు వస్తారు? ఆ అమెరికా వ్యక్తితో ఇంకొక వ్యక్తి చెప్పాడంట నీవు ఆ స్వామినే మ్రొక్కుకుని యజ్ఞము చేయి, నీ కోరికలు నెరవేరుతాయి. నీవు ఇంకా గొప్ప శాస్త్రవేత్తవుతావు. తద్వారా నీవు పేరుపొందుతావు అని చెప్పాడు. యజ్ఞాల విషయము అమెరికా వారికి తెలియదు. కనుక నేను ఋత్విక్కులను పంపిస్తాను అన్ని చెప్పి అతనితో కొందరు ఋత్విక్కులను పంపిస్తే ఆ అమెరికా వ్యక్తి తీసుకువెళ్ళాడు. అమెరికాలోనే యజ్ఞము పెట్టాడు. యజ్ఞగుండంలోనికి అగ్నివేయాలి కదా! అందుకు వారు రెండు కట్టెలను రాపిడి చేస్తారు తద్వారా అగ్ని పుడితే దానిని అగ్నిగుండంలో వేస్తారు. ఆ పనిని చేసేందుకు పూనుకున్నప్పుడు ఒక శబ్దము వినిపించింది. “మీరు నావద్దకు వచ్చారు కదా! మీరేమో అగ్ని కోసము శ్రమపడవద్దు, నేనే ఆ అగ్నిని మీవద్దకు పంపిస్తున్నాను” అని వినిపించింది. ఆ స్వామి ఉండేది ఇండియాలో, యజ్ఞము జరిగేది అమెరికాలో, కానీ ఇండియానుండి

అగ్నిని పంపిస్తానని శబ్దము వినిపించింది. అంతకంటే ఇంకేముంది అబ్బ! మనము ఏ స్వామి దగ్గరికైతే వెళ్ళామో, ఆ స్వామి మనకు అగ్ని పంపిస్తాడట అని అనుకుంటాము. అప్పుడు మీదనుండి చిన్న పొగవచ్చి, అది అలాగే పెద్దదై, చక్కగా గుండంలో పడి మంట అవుతుంది. ఆ విధముగా అగ్ని చెప్పినట్లే వచ్చింది. ఆ స్వామి ఎంత మహత్యము, ఎంత గొప్పవాడు, సాక్ష్యాత్తూ దేవుడే. ఎందుకంటే నేను ఇక్కడ యజ్ఞము చేస్తుంటే ఆయనకు తెలిసింది. అప్పుడు ఎవరు గొప్ప? నెలనెలా 'జ్ఞానము చెప్పేవాడు గొప్పా? సంవత్సరముకొకసారి అగ్నిని ఇచ్చినా సరే వారు గొప్పా? సరే యజ్ఞం చేశావు, నీ బుర్రకు ఏమైనా ఎక్కిందా? ఆయన చాలా గొప్పవాడు అని తెలిసింది. అంతే!

ఇక్కడ ఉన్నవారి బుర్రకు జ్ఞానము ఎక్కుతూ ఉంది. దేవుడు గొప్ప అనే విషయం ఇక్కడ వారి బుర్రకు ఎక్కుతూ ఉంది తప్ప, నా మాటకు ఏమీ గొప్పలేదు కానీ అక్కడ ఏమి జరిగిపోయింది, పెద్ద మహత్యం జరిగినది. ఆ విషయము ఆ దేశములో ఒక పట్టణములో జరిగితే, ఆ దేశమంతా ప్రాకిపోయింది. ఫలానా స్వామీజీగారు మాకు యజ్ఞానికి ఇండియానుండి అగ్నిని పంపించాడు అని మొత్తము పేపర్లో ప్రింట్ వేశారు. టీవీల్లో చెప్పారు. ఆ విషయాలన్నీ అక్కడున్న అమెరికా వారు చూసి, పదిమంది ఆ స్వామీజీని చూడడానికి వచ్చారు. ఒక్కరి వలన ఎంతమంది వచ్చారో చూడండి. వాస్తవముగా ఏమి జరిగింది? మనము ఇంత జ్ఞానము చెప్తున్నా ఏ మహత్యం జరుగలేదు.

సాధారణమైన వ్యక్తికి ఎలా వచ్చింది అనే విషయాన్ని తీసుకుంటే, ఎవరు చేశారు ఇదంతా! ఇంతకూ విషయమేమంటే, ఆ స్వామీజీకి ఈ యజ్ఞం గూర్చిగానీ, అగ్ని ఇచ్చిన విషయముగానీ ఏమీ తెలియదు. మరి

ఇదంతా చేసిందెవరు? ప్రకృతి లేదా మాయ. ఎవరైనా పొరపాటు పడతారేమోనని ఫలానా స్వామీజీని చెప్తున్నాను అని చెప్పింది. కానీ అసలు స్వామీజీకి మాత్రము ఏమీ తెలియదు. అ స్వామి పేపర్లో చూసి ఇట్లా జరిగిందా? అని అనుకున్నాడు. మీరు అగ్నిని పంపించారు స్వామీ అంటే, అవును నేనే పంపించాను అని అంటాడు. కానీ ఈయనకు తెలిసి ఏ మహత్యాలు జరుగలేదు. ఇక్కడ మనము ఏమి చెప్తున్నామంటే, ఒక మాంత్రికుడుంటాడు. అతను ఒక మంత్రాన్ని చెప్తాడు. ఉదాహరణకు ఒక పాముమంత్రము ఉంది అనుకోండి. పాము కరచిన వ్యక్తికి మంత్రించే విధానము ఒకటి ఉంటుంది. ఆ మంత్రాన్ని చెప్పి, గ్లాసుతో నీరు ఇస్తారు త్రాగమని, అది త్రాగితే ఆ శరీరములో విషం పనిచేయకుండా పోతుంది. అతను చనిపోడు కానీ మాంత్రికునికి మంత్రము ఉచ్చాటన చేసి, నీరును ఇచ్చేదే తెలుసు కానీ ఏ విధముగా ఈ మంత్రము శరీరములోకి చేరి ఆ విషాన్ని పని చేయకుండా చేసిందో తెలియదు. ఎలా చనిపోకుండా చేసింది అనే విషయం ఏమాత్రము తెలియదు.

అదే విధంగా ఒక స్వామీజీవద్ద ఒక మహత్యం జరిగితే, అది ఆ స్వామీజీ వలననే జరిగింది అని అనుకుంటాము, కానీ వాస్తవముగా తనకు ఏమీ తెలియదు. అందరూ అతని దగ్గరకు పోతే కోరికలు నెరవేరుతాయి అని అంటూ ఉంటే, ఓహో! నావద్దకు వస్తే కోరికలు నెరవేరుతాయి అని అతను అనుకుంటాడు తప్ప అతనికి కూడా తెలుసు అతని వలన నెరవేరటం లేదని, కానీ నాలో ఏదో శక్తి ఉంది అని అనుకుంటాడు గానీ, అతనికి నిజంగా ఆ శక్తిలేదు. ఈ విధముగా మాయ అనేది మనుషులను మభ్యపెట్టేందుకు ఇటువంటి మహత్యాలను ఒక వ్యక్తినుండి వచ్చేటట్లు చేస్తుంది. తద్వారా అందరి దృష్టి అతని మీదకు వెళ్ళేటట్లు ప్రయత్నము

www.thraithashakam.org

చేస్తుంది. ఆ వ్యక్తిని మనము దైవము అంటాము, గొప్పవాడు అంటాము. అతనిని వదలి ప్రక్క దేవుడున్నాడనే ధ్యాస లేకుండా పోతుంది. ప్రపంచాన్ని సృష్టించిన సృష్టికర్త ఒకడున్నాడనే విషయాన్ని సైతము మనము మరచి పోతాము. మహత్యము చేసే అతనొక్కడే దేవుడంటాము. అతను కూడా దానికి తగినట్లే నడచుకుంటాడు. అతనికి తెలుసుకానీ ఏదో జరుగుతుంది జరగని అని అనుకుంటాడు. ఇదంతా మాయ చేస్తున్నది.

ఈ విధముగా చేయటం వలన పూర్తిగా ప్రజలు దేవుడు అనే విషయాన్ని మరచిపోతారు. 'దేవుడు' అనే వాని వైపునకు చూడకుండా, దేవున్ని మరచిపోవునట్లు చేయాలంటే ఈ విధంగా ఒక వ్యక్తి ద్వారా ఇవన్నీ జరిగేటట్లు చేయాల్సిందే. అప్పుడు దేవుని జ్ఞానాన్ని ఎవరూ లెక్కబెట్టుకోరు కానీ మాయ మహత్యాన్నే లెక్కబెట్టుకుంటారు. కానీ జాగ్రత్తగా లెక్కబెడితే జ్ఞానమే గొప్పగా కనిపిస్తుందిగానీ, గ్రుడ్డిగా లెక్కబెడితే మాయ జ్ఞానమే గొప్పగా అనిపిస్తుంది. మనిషికి తెలియకుండా ఏదో ఒక మహత్యం జరగుతూ ఉంది. ఆ విధంగా మహత్యాలు జరుగుచున్న స్వామివద్దకు వెళ్తూ ఉంటే మధ్యలో ఒక పెద్ద ప్రమాదం జరుగుతుంది. అక్కడ దెబ్బలు తగిలి ఒకడు పడిపోతాడు, వాడిని ఆసుపత్రిలో పెడతారు. వాడు చావుబ్రతుకుల్లో ఉన్నాడనుకుందాము అప్పుడు ఆ వ్యక్తికి ఈ స్వామిజీ ఆకారము కనిపించి, నీకేం కాదులే, బాగా అవుతుంది అని చెప్పినట్లు అనిపించింది అనుకో, వాడికి నిజంగానే బాగయింది అనుకో, నన్ను ఆ స్వామీజీయే రక్షించాడు అని ఆ వ్యక్తి అంటాడు. నిజమే ఈ విషయము జరిగింది, కానీ ఆ విధముగా కనిపించింది మాయయే. కానీ స్వామీజీ మాత్రము ఇక్కడే ఉన్నాడు. రాత్రి ఈ స్వామికి జ్వరం వస్తే నిద్రపోయాడు. కానీ పొద్దున ఆ వ్యక్తి వచ్చి స్వామీ, నన్ను కాపాడావా? ఆసుపత్రికి వచ్చి

www.thraithashakam.org

రక్షించావా అంటే, అట్లానా? అని ఆయన అంటాడు. అప్పుడు ఈయనే గొప్ప, ఈయనే దేవుడు అని అంటారు. ఈ విధముగా మనిషిని దేవున్ని చేస్తుంది మాయ. వ్యక్తిని మనము "నీవు జ్ఞానము తెలుసుకో" అంటే, ఇంకేం జ్ఞానమండీ, ఆసుపత్రికి వచ్చి నన్ను రక్షిస్తే ఇంకొక దేవుడా, ఆయనను మించిన దేవుడా? జ్ఞానంతో నాకేం పని ఆయనే దేవుడైతే అంటాడు. ఈ విధముగా అసలైన దేవుని వద్దకు పోకుండా మాయ పెద్ద ఆటంకం అయింది.

ఈ విధముగా ప్రచారము అవటం వలన నేను ఐదు లక్షలు ఇస్తే, మరొకరు పది లక్షలు, ఇంకొకరు ఐదు కోట్లు, పదికోట్లు ఆయనకు కుమ్మరిస్తారు. తద్వారా ఆయన సంసారి అగును. ఆయన సన్యాసైతే మనము ఆయనను సంసారిని చేస్తాము. కానీ మేము మాత్రము జ్ఞానమే చెప్తాము తప్ప మరేమీలేదు. వీరంతా జ్ఞానము తెలుసుకోమంటే తెలుసుకోరు, మహత్యాలవైపే పరిగెడుచున్నారు. ఏ విధంగా వీరిని జ్ఞానమువైపు మళ్ళించటము అని ఆలోచించి గ్రంథాలు తయారు చేశాము. గ్రంథాలను ఉచితంగా ఇస్తాము అనినా గానీ వద్దు, వద్దు అంటారు. అట్లా స్వామీజీలవద్దకు పోయిన వారికి మీరు గ్రంథాలివ్వండి తీసుకుంటారేమో, అని అంటే వారు ఇలా అంటారు. ఎందుకయ్యా! సాక్ష్యాత్తూ ఈయన దేవుడు. ఈయనను పెట్టుకుని మరలా ఈ పుస్తకాలు మాకేం అవసరము అంటారు. అవన్నీ విడిచిపెట్టి నీవే ఇటువైపురా! నీకు ఏమి కావాలంటే అది జరిగి తీరుతుంది అని మమ్మల్నే తిరిగి పిలుస్తారు. ఆ విధముగా మాయ, మనిషి పేరు చెప్పి ఒకసారి, ఆకారాన్ని చూపించి ఇంకొకసారి, ఆ మనిషివైపే అందరూ చూసేటట్లు చేస్తుంది తప్ప దేవునివైపు చూచేటట్లు చేయదు. దేవునికి వ్యతిరిక్తముగా నడచుకోవాలి, దేవునివైపుకు పోకుండా చేయాలి అనేదే దేవునితో మాయ చేసుకొన్న ఒప్పందము. "నీవు నీ ఇష్టము

www.thraithashakam.org

వచ్చిన పనిని చేసుకో నేను మాత్రము ఏ పనీ చేయను" అని దేవుడు చెప్పాడు. కనుక నేను ఇతనిని షావుకారిని చేస్తాను అంటే, చేసుకో అంటాడు దేవుడు. ఆసుపత్రిలో ఉండే రోగిని ఆరోగ్యంగా ఉన్నట్లు లేపుతా అంటే, లేపుకో. అగ్నిని సృష్ఠించి అగ్నిగుండంలో వేస్తాను అంటే వేయి. ఈ విధముగా అన్ని అవకాశాలు నీకిచ్చాను, నేను మాత్రము ఏమీ చేయను. కానీ "జ్ఞానము మాత్రము నాదొక్కటే" అని చెప్పినాడు. మరి ప్రజలకు మహత్యాలే రుచిగా ఉంటాయి కదా! కనుక ప్రజలందరూ ఆ వైపుకే పోతారు. మనిషినే నమస్కరిస్తారు, మనిషిని గూర్చే భజన చేస్తారు, మనిషి ఫోటోలనే మ్రొక్కుతారు. ఈ విధముగా వ్యక్తి పేరునే వ్యాపారంగా పెడతారు. ఈ విధంగా ప్రజలు దేవునివైపు పోకుండా, సృష్ఠికర్తను పూర్తిగా మరచి కనిపించకుండా ఇవన్నీ చేస్తున్న మాయవైపుకే పోవటం జరుగుతూ ఉంది. కనుక దేవుని జ్ఞానము అభివృద్ధి కావటం లేదు. దేవుని జ్ఞానము ఏమాత్రము తెలియకుండా పోయింది. ఈ రోజులలో **'మతాలు'** అనే క్రొత్త రోగము వచ్చింది. ప్రతీ మతానికి దైవ గ్రంథాలుకాక ప్రక్క గ్రంథాలు కూడా పెట్టుకున్నారు. దైవ గ్రంథాలలో చెప్పింది ఒకటైతే మనకు అర్థమయింది ఇంకొకటి. అక్కడ కూడా మాయ పని చేసింది. భగవద్గీత 5000 సం॥ పూర్వమే చెప్పబడింది కానీ ఈ రోజుకు మనకు దానిని గూర్చి అర్థము కాలేదు. దాంట్లో కూడా మాయ పని చేసింది. మాయ మతాన్ని పెంచింది కానీ దేవునివైపు మాత్రము పోనివ్వలేదు తద్వారా దేవున్ని మరచిపోయి మనుషుల్ని గొప్పగా చెప్పుకోవటం జరుగుతూ ఉంది. అలా కాకుండా ఉండాలంటే దేవుని జ్ఞానము గురించి తెలుసుకునే ప్రయత్నం చేయాలి. అప్పుడు మాయ మహత్యము యొక్క గుట్టు రట్టువుతుంది. అంటే మాయ యొక్క గుట్టును మనము ఇప్పుడు విప్పుతున్నాము. ఒక వ్యక్తిని

www.thraithashakam.org

సంపూర్ణముగా దేవుడని నమ్మినా, మహత్యం గురించి చెప్పినా అది అతని మహత్యంకాదని ఆయనకీ తెలుసు. బయటికి మాత్రము నటిస్తుంటాడు. అతనికీ, దైవ జ్ఞానానికి ఎటువంటి సంబంధము ఉండదు అని ఒక రహస్యాన్ని బయట పెడుచున్నాము కదా! మహత్యాలు ఎవరినుండి జరిగినా, ఈ వ్యక్తి వలననే జరుగుచున్నాయి అనటము పొరపాటు. ఇదంతా చేసేది మాయ. కనుక నీవు దేవునికి వ్యతిరేఖ దిశలో పోతున్నావు. ఇది మాత్రము నూటికి నూరు పాళ్ళు నిజము. ఇంత పెద్ద మహత్తు కలిగిన దేవునిగా, ప్రశంసింపబడిన వ్యక్తి విమానంలో పోతూ ప్రపంచముతో సంబంధము తెగిపోయి, పోతూ, పోతూ దారి తప్పాడు అనుకుందాము. సరైన దారి దొరకడం లేదు. మరి అంత పెద్ద వ్యక్తి ఎట్లు పోయాడు? అంటే కర్మ కొద్దీ పోయాడు అనుకుందాము. ఈ విధంగా త్రోవ తప్పిపోయి పారాచ్యూట్ సహాయంతో క్రిందికి దిగితే అది ఆ స్వామిజీగా పేరుపొందిన వ్యక్తిని అడవిలో దిగునట్లు చేసింది. అడవిలో ఇరుక్కున్నాడు. చీకటి పడింది ఆఫ్రికా అడవులు అనుకుందాము. అక్కడ అన్నీ మృగాలే, వాసనపట్టి చంపేస్తాయి కనుక స్వామిగానున్న వ్యక్తి నేను ఏమి చేయాలి? “దేవుడా ఎట్లాగో నన్ను కాపాడు” అంటున్నాడు. ఇనాళ్ళూ దేవుడిగా చలామణి అయి దేవున్ని తలచనివాడు. ఇప్పుడు దేవుడా ఎట్లాగైనా కాపాడు అంటున్నాడు. ఇంతలో పులిగాండ్రింపు వినిపించింది. ఎట్లాగో చెట్టు ఎక్కినాడు. చేతులు, కాళ్ళు గీరుకుపోయాయి. అటువంటి భయంకరమైన సన్నివేశంలో చిక్కుకున్నాడు. ఇక్కడ దేవునిగా చలామణి అవుతున్న వ్యక్తి మామూలు పులైతే చెట్టు ఎక్కదు గానీ చిరుతపులైతే చెట్టు ఎక్కగలదు. సరే ఇక్కడ ఈయన పరిస్థితి ఈ విధముగా ఉంటే, ఒక వ్యక్తి ఇంట్లో స్వామి ఫోటోనుండి బంగారు నాణేలు రాలుతూ ఉన్నాయి. ఆ స్వామికి అక్కడ

ప్రాణం పోతూ ఉంటే, ఆయనకు చమట్లు వస్తున్నాయి. ఇక్కడేమో, "అబ్బ స్వామి ఫోటోనుండి బంగారు నాణాలు రాలుతున్నాయి" అని ఈయన అనుకుంటున్నాడు. ప్రజలందరూ ఆ మహత్యాన్ని చూస్తున్నారు. మాయ మాత్రము అసలు ఆయన ఎలాగుంటే నాకేమి? ఈయనను గొప్పగా చూపించాలంతే అని అనుకుంటుంది. ఈయన మాత్రము, "దేవుడా నన్ను ఎలాగైనా బ్రతికించు" అని అంటున్నాడు. వ్యక్తికి, మహత్యానికి సంబంధం లేదు అనే దానికి ఇది నిరూపణ. ఈ విధముగా మాయ ఇంకొక రాష్ట్రములో ఒక భక్తుని ఇంటిలో అదే స్వామి ఫోటోనుండి నెయ్యి కారుతున్నట్లు చేసింది అనుకుందాము. అక్కడ బంగారం ఖరీదైనదే, ఇక్కడ నెయ్యి ఖరీదైనదే. ఈ పని మాయే చేసింది ఎందుకంటే దేవుడే ఇచ్చాడు ఈ వరము. జ్ఞానము లేకుండా నీవేమైనా వ్యతిరేఖంగా మాట్లాడితే నిన్ను బీదవాడిగా చేయగలదు. జ్ఞానము ఉంటే మాత్రము అలాగ చేయలేదు. ఎందుకంటే **"పతి ఒప్పిన సతి యొప్పును"** అని వేమనయోగి చెప్పాడు, పరమాత్మ ఒప్పుకుంటే ప్రకృతి ఒప్పుకుంటుంది. పరమాత్మ దృష్ఠిలో నీవు మంచివాడివైతే ప్రకృతి దృష్ఠిలో కూడా నీవు మంచి వాడివే. అయితే 'పతి ఒప్పిన' అంటే అతను సామాన్యంగా ఒప్పుకుంటాడా, జ్ఞానము సంపూర్ణముగా తెలుసుకొని జ్ఞానము ప్రకారము నడుచుకుంటే ఒప్పుకుంటాడు. మాయ ఏ విధముగానైనా మహత్యాన్ని చేయగలదు. పరమాత్మ జ్ఞానానికి మాయ వ్యతిరేఖముగా ఉంటుంది. మాయ మహత్యాలు చేసి ప్రక్కకు పంపించే ఏర్పాటు చేస్తుంది అని మనము గ్రహించగల్గితే మాయ ఉచ్చునుండి బయటపడగలము. మరి మాయ వలలో పడనివారు ఎవరైనా ఉన్నారా అంటే, జ్ఞానము తెలియకపోతే మాత్రము దాంట్లో పడి తీరుతారు. పడకముందు తెలిస్తే ఫరవాలేదుగానీ మాయలో పడిన తరువాత తెలిస్తే, వాడింట్లో బంగారు

నాణెలు పడితే వాడు ఇక రాడు. కొందరు ఈ జ్ఞానములోకి వస్తే మా పిల్లలు పోట్లాడుకుంటున్నారు, పోకపోతే పోట్లాడటం లేదు అంటారు. ఏదో ఒక సాకు చెపుతారు. కనుక మాయనుండి మనము బయటపడాలంటే జ్ఞానము గురించి తెలుసుకోవాలి. అయితే ఇప్పుడు ఆ స్వామి ప్రాణ భయముతో ఉంటే ఒక సింహం వచ్చింది. చెట్టు ఎక్కలేక పోయింది, అతన్ని చూసింది వెళ్ళింది. తరువాత చిరుతపులి వచ్చింది. చిరుతపులి ఏం చేస్తుందంటే ఎప్పుడైనా వేటాడిన జంతువును క్రిందపెడితే మిగతా జంతువులు ఊరుకోవని చెట్టెక్కి తింటుంది. కనుక చిరుత పులి ఈయనను చూచి సర్రున చెట్టెక్కింది, ఆయనను చంపేసింది. తిని, హాయిగా పులి నిద్రపోయింది. అయితే ఫోటోలోనుండి మాత్రము బంగారు నాణేలు పడుచున్నాయి. ఇంకొకరి ఇంట్లో ఫోటోలో నెయ్యి కారుతుంది. ఇంకొకరి ఇంట్లో ఫోటోనుండి తేనె కారుతోంది. ఈయనేమో చనిపోయాడు. ఇప్పుడు ఆ వ్యక్తికి, దీనికీ ఎటువంటి సంబంధము లేదు. ఆ వ్యక్తి చనిపోయిన విషయము కూడా మనుషులకు తెలియదు. తరువాత అడవిలో ఆయన వేసుకున్న గుడ్డలు దొరకటం వలన ప్రమాదవశాత్తు ఆయన చనిపోయాడు అని అందరూ అనుకున్నారు. గుడ్డలు తెచ్చి సమాధి చేశారు. సమాధి చేసినా సరే, ఈ మహత్యాలు అక్కడక్కడా జరుగుతూనే ఉన్నాయి. ఉన్నప్పుడూ జరిగాయి, పులి చంపేసిన తరువాత జరిగాయి. సమాధి చేసిన తరువాత కూడా జరిగాయి. కానీ మనుష్యులు ఆ మహత్యాలను చూసి చనిపోయిన అతనిని ఇప్పుడు కూడా దేవుడే అంటున్నారు. ఆయన చనిపోయాడని మనము అనుకోకూడదు. ఉన్నాడు, ఉన్నాడు కనుకనే ఇవన్నీ జరుగు చున్నాయి అంటారు. ఈ విధంగా దేవునివైపుకు పోకుండా ఇన్ని మార్గాలు ఉన్నాయి. కనుక ఈ విషయాన్ని తెలుసుకున్నవారు బయటపడతారు.

తెలియనివారు అట్లే అట్లే ఉంటారు. దేవుని జ్ఞానములో ప్రశ్న ఉంటే జవాబు ఉంటుంది. కానీ జవాబులేని ప్రశ్నలున్నాయంటే అది దేవుని జ్ఞానము కాదు. దేవుడు సర్వత్రా వ్యాపించినవాడు. ఆయనకు పేరు లేదు, ఆకారములేదు, పనీలేదు. పేరు, ఆకారము పని చూపించేది ప్రకృతి, మాయ. కనుక మహత్యాలు మాయ పనిగా తెలుసుకొని, దైవజ్ఞానాన్ని తెలుసుకోండి. ఈ దైవజ్ఞానాన్ని ఎవరైతే తెలుసుకుంటారో, వారు తప్పనిసరిగా దేవునివైపుకు పోగలరు. ఒకవేళ ఈ జన్మలో ఆయుష్షు అయిపోయినా గానీ మరు జన్మలో పరమాత్మ జ్ఞానము లభ్యమవుతుంది. ఎటువంటి నష్టము జ్ఞానమార్గములో జరుగదు. కనుక దేవుని జ్ఞానము అన్నిటికంటే గొప్పది, దైవజ్ఞానమునే అనుసరించండి అని చెప్తూ ముగిస్తున్నాను.

# 46. టక్కుటమారా - ఇంద్రజాల మహేంద్రజాల - గజకర్ణ గోకర్ణ

తేది : 15-06-2012

ఇప్పుడు మీరు చెప్పినదంతా మేము నమ్మవలెనా, మీరు చెప్పినదంతా మేము నమ్మి తీరాలా? అని మీరు ప్రశ్నించవచ్చును. ఒకరు నమ్మినా నమ్మకపోయినా గానీ, ఒక సూత్రం కలదు. అదేమంటే ఏది శాస్త్రబద్ధమో దానిని నమ్మితీరవలసిందే, దానితోపాటు అవి శాస్త్రబద్ధము కావున అది నెరవేరితీరుతుంది. శాసనములతో కూడుకున్నది కావున అది శాస్త్రబద్ద మైనది. కనుక, ఇప్పుడు చెప్పేమాటకు శాస్త్రబద్దత అనే భూతద్దాన్ని దేవుడిచ్చాడు. దానితో అది వాస్తవమా కాదా అని వివరించుకోవాలి.

www.thraithashakam.org

'అబద్ధము' అనే పదమునకు అర్థము తెలుసునా బద్ధము కానిది అబద్ధము. ఒక కారణంలేక, ఒక క్రమపద్ధతి లేక 'అ' అంటే లేదు అని అర్థము. బద్ధము కానిది అది అనగా అబద్ధము అనగా ఒక క్రమ పద్ధతి లేనిది. బద్ధము కానటువంటిది అబద్ధము అనగా సత్యముకానటువంటిది, ఎక్కడా కట్టుబడి లేనిది. అబద్ధము దానిష్టం ఈ రోజు ఒక మాట మాట్లాడవచ్చు రేపు ఇంకొక మాట మాట్లాడవచ్చు.

నిజము అనే దానికి ఎంత అర్థమున్నది. 'జ' అంటే పుట్టుట, నిజ అంటే పుట్టకుండా ఉండునది, లేదు అని అర్థం. నిశ్శబ్ద అనగా శబ్దము లేనిది అని అర్థము. అలాగే నిజ అనగ పుట్టుక లేదు అని అర్థం కదా. అనగా ఇది నిజము అనేది మారేది కాదు. కాని అబద్ధము అనేది ఎప్పుడైనా, ఎక్కడైనా మారవచ్చును. ఎందుకంటే ఒక క్రమపద్ధతి లేనిదే అబద్ధము. ఈ విధముగా నిజమునకు, అబద్ధమునకు ఇంత తేడా ఉన్నది. ఈ విషయాన్నే ఒక సందర్భములో చెప్పియున్నాము. అది ఏమనగా దేవుడు దేనికీ కట్టుబడి లేడు, మనమంతా కర్మతో కట్టబడి ఉన్నాము. దేవుడు ఏ కర్మతోను బంధింపబడిలేడు. కనుక దేవుడు అబద్ధముగా ఉన్నాడు. **నిజంగా దేవుడు లేడు, అబద్ధముగా దేవుడున్నాడు.** ఆయన ఇప్పుడు పుట్టినవాడు కాడు, ముందునుండి ఉన్నాడు. నిజంగా లేడు అందుకే దేవుడు అబద్ధముగా ఉన్నాడు. అటువంటి వాడు దేవుడు. అదే విధంగా అత్య అనే పదమునకు జీవింపజేయటం అనే అర్థము ఎక్కడుంది అంటే, ఎవరో ఒకరు ఒక పదమునకు అసలైన అర్థము చెప్పితే, అది నిఘంటువులోకి చేరుతుంది. పదములకు పూర్తి అర్థములు నిఘంటువులో లేవు.

అందుకే నేను చెప్పుచున్నది నిజమనుకోవచ్చును లేదా అబద్ధమను కోవచ్చును. కానీ శాస్త్రబద్ధత అనుసరించి మీరు ఆ పదాలకు అర్థములను

చూచుకోండి అని మాత్రము చెప్పగలను. గాంధారి అనే ఆమె ధృతరాష్ట్రుని భార్య. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు. గాంధారి ఏమి చేసిందంటే, నా భర్త గ్రుడ్డివాడు కదా, కనులు కనిపించటం లేదు అని ఆమె కూడా కనులకు గుడ్డలు కట్టుకున్నది. మీ అందరూ ఏమంటున్నారు, ఆమె చాలా పతివ్రత, నా భర్తకు లేని కనులు నాకెందుకు? అని గుడ్డలు కట్టుకుంది అని అనుకుంటున్నారు. నేనేమి అనుకుంటానంటే, నాకు కనులుంటే ఈయనికి సేవ చేయాలి. నేను కండ్లకు గంతలు కట్టుకుంటే నాకు ఇంకొకరు సేవ చేస్తారు అని ఆమె తెలివిగా ఆ పని చేసింది. కనుక ఈ విషయాన్ని రెండు విధములుగా అర్థము చేసుకొనుటకు అవకాశము కలదు. కానీ ఏది సత్యమైనది అనేది మాత్రము ఎవరికి వారు చూసుకోవలసిందే!

మహత్యము అనగా గొప్పగా జీవింపచేసేది అని అర్థము ఉంది కదా! అయితే ఈ మహత్యములు ఎన్ని రకములు కలవు. మహత్యములు మూడు రకములుగా ఉన్నవని చెప్పవచ్చును. 1) టక్కుటమారా 2) ఇంద్రజాల, మహేంద్రజాల, 3) గజకర్ణ, గోకర్ణ. ఈ మూడు కూడా రెండురకములలోకే వచ్చును. ఈ మూడింటిని మనుషులు నేర్చుకుని చేయవచ్చును. ఈ టక్కుటమారా అనేది ఏ విధంగా ఉంటుందంటే ఉదాహరణకు ఒక రూపాయి బిల్లను ఒక చేతిలో అందరికీ చూపించి మరల చూపించేటప్పుడు అది చేతిలో కనిపించకుండా చేస్తారు. మరలా ఆ చేతిని చూపించేటప్పటికి ఆ రుపాయి కనిపిస్తుంది. కానీ రూపాయి నా చేతిలోనే ఉంటుంది. కానీ మీకు కనిపించదు దానినే హస్తలాఘువం అంటారు. ఈ విధంగా చిన్న వస్తువులను మాయం చేస్తే **'టక్కు'** అంటారు. పెద్ద వస్తువులను చేస్తే **'టమారా'** అంటారు. ఈ విధముగా నైపుణ్యత, తెలివితో చేసేవిగా చెప్పవచ్చును.

www.thraithashakam.org

ఇంద్రజాల, మహేంద్రజాల విద్యలున్నాయి. వీటిలో ఇంద్రజాలంలో పెద్ద వస్తువులను సృష్టిస్తారు, లేకుండా కూడా చేస్తారు. ప్రాణంతో ఉన్న జీవులను సృష్టించి మాయం చేస్తే **"మహేంద్రజాలం"** అంటారు. ప్రాణంతో లేని పెద్ద వస్తువులను సృష్టిస్తే **"ఇంద్రజాలం"** అంటారు. అలాగే వాటిని మాయం చేసినా ఇంద్రజాలమే అంటారు. ఇక గజకర్ణ, గోకర్ణ అనే వాటిని వివరించుకుంటే, కర్ణ అంటే చెవి అని అర్థము, గజము అంటే ఏనుగు అని "గో" అంటే ఆవు అని అర్థము. గజము అనగా ఏనుగు తన చెవిని, ఈగ, దోమ వాలితో తోలుకొనును, లేదా అల్లాడించునుగానీ ఆవు చెవిని త్రిప్పినట్లు ప్రక్కలకు ఏనుగు తన చెవిని త్రిప్పలేదు. ఆవుకు వినికిడి శక్తి, ఏనుగుకంటే ఎక్కువ అని చెప్పవచ్చును. ఏనుగు చెవులు ఎటుప్రక్క ఉంటే అటుప్రక్క మాత్రమే వినగలవు. అన్ని వైపులా చెవును ఆవులా త్రిప్పి వినలేదు.

అదే విధంగా ఏదైనా ఒకదాని శబ్దాన్ని వినటాన్ని "గజకర్ణం" అంటారు. అనగా ఎక్కడో ఉండే శబ్దాన్ని వినడాన్ని గజకర్ణం అంటారు. పూర్వం అస్త్రాలు అనేవి ఉండేవి, అంటే ఒక బాణమునకు (లేదా) కర్రలాంటి పుల్లకు మంత్రం చెప్పి, విసిరితే అగ్ని వచ్చేది, లేదా వర్షం కురిసేది. ఇటువంటి అస్త్రవిద్యలను కూడా గజకర్ణ విద్యలలోకి చేర్చవచ్చు. ఇవన్ని స్థూలంగా ఉండేవి. ఇక సూక్ష్మంగా ఉండేవి అనగా మనిషియొక్క మనోభావాన్ని తెలుసుకోగల్గేవి, అలాగే బాణామతి, చేతబడులు, చిల్లంగి లాంటివి కూడా గోకర్ణవిద్యలు అనవచ్చును. ఈ విధంగా ఈ విద్యలన్నీ మనిషి నేర్చుకుని చేసేటటువంటివి. ఇందులో టక్కుటమారా అనేది మంత్ర విద్యకాదు, హస్తలాఘవం లేదా నైపుణ్యతతో చేసేవి. కానీ మిగిలిన ఇంద్రజాల మహేంద్రజాలం, గజకర్ణ-గోకర్ణ విద్యలు మంత్రముల వలన

www.thraithashakam.org

వచ్చును. కానీ ఈ మూడూ మహత్యముల క్రిందకి వచ్చును. ఈ విద్యలనే రోడ్డుమీద చేస్తే గారడి విద్య అగును. అదే విద్య ఆశ్రమములలో స్వాములు చేస్తే మహత్యం అగును. అయితే హేతువాదులు అనుకునేవారు వీటినన్నిటినీ ట్రిక్కులు, మ్యాజిక్‌లుగా భావిస్తున్నారు. అయితే టక్కుటమారా అనేవి మాత్రమే ట్రిక్కులు, నైపుణ్యతలు అని చెప్పవచ్చునుగానీ మంత్రవిద్యలు ఏవైతే ఉన్నవో అనగా మహేంద్రజాల ఇంద్రజాల, గజకర్ణ గోకర్ణ విద్యలు ట్రిక్కులు, మ్యాజిక్‌లు కావు. హేతువాదులకు ఈ విద్యలు ఉన్నట్టు కూడా తెలియదు కనుక మొదటిదైన టక్కుటమారా క్రిందకే లెక్కగడుతున్నారు.

ఒక స్వామీజీ ఉన్నారనుకోండి ఆయన మద్రాసులో సముద్రం వద్దకు (బీచ్) వెళ్ళినాడు అనుకోండి. ఆ స్వామీజీ వెంట చాలామంది వెళ్ళారు. ఆయన అక్కడ ఏమి చేసెనంటే, ఒక వ్యక్తిని పిలిచి, ఒక ప్రదేశాన్ని చూపించి, అక్కడ ఇసుక తియ్యి అని చెప్పెను. అప్పుడు ఆ వ్యక్తి ఇసుక తీయగా, అతనికి భగవద్గీత దొరుకుతుందని ఆ స్వామి చెప్పగా, అట్లే దొరికింది. అబ్బ! స్వామి చెప్పినట్లే దొరికిందని సంతోషపడినాడు. తరువాత దానిని అందరూ మహత్తుగా అనుకోవటం జరుగును. అయితే ఆ భక్తులలో ఒక విదేశీ భక్తుడుకూడా ఉన్నాడు. ఒక విధంగా ఆయన సైంటిస్ట్. ఈ మహత్యములు నిజమా, కాదా అని పరిశోధించేందుకు ఆయన వచ్చెను. ఆయన కూడా దీనిని చూడటం జరిగింది. అప్పుడు ఆ స్వామి అనుకోకుండా ఆ విదేశీ భక్తున్నే ఈసారి పిల్చి, నీకు నేను బంగారు గొలుసు ఇవ్వదల్చుకున్నాను, ఇప్పుడు నువ్వు ఎక్కడ త్రవ్వినా నీకు అది లభించును అన్నాడు. ఈయన పరిశోధన నిమిత్తం వచ్చెను కనుక స్వామి ఉన్న దిక్కును కాకుండా పూర్తిగా ఎడమ వైపునకు వెళ్ళి అక్కడ ఇసుకను త్రవ్వగా, బంగారు గొలుసు దొరికింది. అప్పుడు పరిశోధనా నిమిత్తం వచ్చిన వ్యక్తి ఏమనుకున్నాడు

అంటే, భగవద్గీత అయితే ముందురోజు ఒక జాగా దగ్గర పెట్టి తీయించాడు అనుకుంటే, ఇప్పుడు ఈ బంగారు నగ నాకిష్టమొచ్చిన చోట త్రవ్వినా ఎట్లు లభించింది? అని అనుకొని దానిని మహత్యమే అని ఆ శాస్త్రవేత్త అనుకోవటం జరిగింది. ఇప్పుడు హేతువాదులు ఏమనుకున్నారు. భగవద్గీత ముందే ఉంచి ఆ భక్తుడు చేత తీయించారు నమ్మకం కలిగించటం కొరకు విదేశీ భక్తుని చేత కూడా నగను విదేశీయుడు పెట్టిన చోటనే, అతని చేత స్వామి భక్తుడు ఒకటై తీయించారు అని అనుకోవటం జరిగింది. ఈ విధంగా విదేశీ భక్తుడు, స్వామి కుమ్మక్కయిపోయి ఈ తతంగాన్ని చేసారు అని అనుకున్నారు.

ఇప్పుడు వాస్తవముగా భగవద్గీత అక్కడ ఉన్న విషయం స్వామికి కూడా తెలియదు. భగవద్గీత అక్కడ త్రవ్వి తీయు అన్నమాటే తెలుసునుగాని అక్కడ అతను చెప్పినట్లుగా భగవద్గీత ఏవిధంగా వచ్చిందో తెలియదు. ఎందుకంటే ఈ స్వామి దగ్గర ఒక విద్య ఉంది. అ ఇంద్రజాల విద్యలో ఒక భాగమది. ఈ విషయం హేతువాదులకు తెలియదు, కనుక ఇవన్నీ మోసపూరితమైన పనులే అని అనుకున్నారు. ఈ విషయం మర్నాడు వార్తా పత్రికల్లో వచ్చింది, **"మహాత్యమా – మోసమా"** అనే శీర్షికతో. ఇందులో హేతువాదులు, నాస్తికులు ఈ విషయాన్ని మోసమే అని తేల్చిచెప్పారు. మరునాడు విదేశీ భక్తుడు దీనిని ఖండిస్తూ, పేపర్‌లో వచ్చునట్లు చేసి, నేను శాస్త్రవేత్తను, మహత్యములపై పరిశోధన చేసినవాడిని, కానీ నాకు ఇష్టమొచ్చినచోటే నేను త్రవ్వినాను, కానీ నాకు బంగారు నగ దొరికిందని ఆయన పేపర్‌కు సమాచారం ఇచ్చెను. ఈ విధంగా కొందరు మహత్యమంటే, ఇంకొందరు మోసం అనుకోవటం జరిగింది.

ఈ విధంగా ఇంద్రజాల మహేంద్రజాల విద్యలున్నప్పటికీ ఎవరికీ వీటి వివరం తెలియదు. కానీ స్వామి అయిన ఆ వ్యక్తికి తెలుసు, ఏం

తెలుసు అంటే, తను ఏమి చెప్తే అది జరుగుతుంది లేదా దొరుకుతుంది అని తెలుసుగానీ, ఏ విధంగా జరుగుతుందన్న వివరం మాత్రం తెలియదు. అదే విధంగా కడుపునొప్పి మంత్రం తెలిసిన వ్యక్తి, అతను మంత్రం చదివితే ఎదుటి వ్యక్తికి కడుపునొప్పి పోతుంది అని తెలుసుగానీ, ఎట్లు పోతుంది అని మాత్రం తెలియదు. మరి ఇవన్నీ వాస్తవముగా జరిగిన విషయములే కదా! మరి అప్పుడు అది శాస్త్రమే అగును కదా! మరి అది ఏ శాస్త్రము?

"గఖరభౌజ్యోబ్ర" అను సూత్రం అనుసరించి గణిత, ఖగోళ, రసాయన, భౌతిక, జ్యోతిష, బ్రహ్మవిద్యా శాస్త్రములు అనునవి ఆరు కలవు. పూర్వపు రోజుల్లో మనుష్యులకు రోగమొస్తే ఉదాహరణకు కడుపునొప్పి వచ్చిందనుకోండి. దానిని తగ్గించుటకు వైద్యసదుపాయం ఇంతగా అభివృద్ధి చెందని రోజులు, కావున ఒక ఆకు రసముతీసి త్రాగించిన, ఆ వ్యక్తికి కడుపునొప్పి తగ్గేది. అప్పుడు అక్కడ ఉన్నవారంతా కడుపునొప్పికి ఈ ఆకు రసం వేస్తే తగ్గుతుంది అని తెలుసుకున్నారు. కనుక వారంతా మనలెక్కలో పెద్ద శాస్త్రవేత్తలనే చెప్పవచ్చును. ఈ విధంగా పూర్వము కొన్ని ఆకుల రసాలను ఎక్కడ రోగమొస్తే అక్కడ పూసుకునేవారు. పూర్వము ఆ వైద్యాన్ని **"రసపట్టు"** అనేవారు. తరువాత రసపట్టు అనే పదం పోయి వైద్యం అనే పేరు వచ్చింది. వాస్తవముగా ఆ పదం సరిపోదు ఎందుకంటే వైద్యం అంటే తెలుసుకొనుట, తెలియుట అనే అర్థము కలదు. రోగాలకు సంబంధించిన పదం కాదది. కానీ పదాల వాడుకలో ఎలాగో అలవాటయింది. కనుక ఈ మందులలో రసాయనములు ఉన్నవి. కనుక దీనిని "రసాయన శాస్త్రము" అనవచ్చును. ఈ విధంగా రసపట్టును వాడే రోజులలో ఇంకొంచెం ముందుకుపోయి మాట లేదా మంత్రమును వాడటం మొదలు పెట్టారు. ఈ విధంగా తేలుకుడితే మంత్రము పనిచేస్తున్నది, ఆకు

రసము పనిచేస్తున్నది. అప్పుడు **"ప్రతి ఆకు ఔషదమే, ప్రతి మాట మంత్రమే"** అనే నానుడి వచ్చింది. ఈ రెండు రసాయన శాస్త్ర సంబంధమే అంటే ఎవ్వరూ ఒప్పుకోరు. మాట లేదా మంత్రం రసాయన శాస్త్ర సంబంధమే అని మేమే ముందు చెప్పుచున్నాము. ఉదాహరణకు చింతకాయ అనే మాటను అంటే మీ నోట్లో నీళ్ళు ఊరుతాయి. చింతకాయ అనేది మంత్రం. మాటైనా దీని ప్రభావం ఉంది కదా! ఇప్పుడు ఎవరినైనా లం–కొడకా అని తిట్టినామనుకోండి! ఆ వ్యక్తి వెంటనే స్పందిస్తాడు, కోపం అవుతాడు అంటే మాటే మంత్రంలాగ పని చేసినట్లే కదా! ప్రతి మాటా మంత్రమే.

మాటలవలన మనిషిలో మార్పు వస్తున్నది అని నిరూపణ జరుగుతున్నది. ఇది శాస్త్రబద్ధమైన విషయమే అగును. అదే విధంగా కొన్ని రకములైన పదముల కూడికను పఠించి వాటి ప్రభావాన్ని పరీక్షించి, అవి నిరూపణకు వచ్చిన తరువాత పదిమందికి చెప్పేవారు. అవే ఇంద్రజాల, మహేంద్రజాల, గజకర్ణ–గోకర్ణ విద్యలు. ఆ రోజుల్లో ఒక బాణాన్ని విడిచిపెడితే అది అక్కడ ఉన్నదంతా నాశనం చేసేది. వాటికి అస్త్రాలు అని పేరు పెట్టారు.

మొట్టమొదట మనం వివరించుకున్న విషయంలో ఆ భగవద్గీత గ్రంథం అక్కడకు ఎట్లా వచ్చిందన్న విషయం ఆ స్వామికి కూడా తెలియదు. కాని ఆ గ్రంథములో రవీంద్ర పబ్లికేషన్స్ అని, ఎక్కడ తయారయిందో ఆ పేరు ఉన్నది. అదే విధంగా ఆ పుస్తకంలో 34వ పేజిలో తప్పు ప్రింట్ అయినట్లు, అదే పబ్లికేషన్స్ మిగతా గ్రంథాల్లో అదే తప్పు కనిపిస్తున్నది. కావున ఆ స్వామీజీ ఏమీ క్రొత్తది సృష్టించలేదన్న విషయం తెలుస్తున్నది. మరి ఏ విధంగా జరిగింది అని ఆలోచిస్తే తెలియునది ఏమనగా!

మంత్రమును నియమానుసారం ఇన్నిసార్లు పఠిస్తే, దానికి ఖగోళంలో ఎన్నో వేల గ్రహాల్లో ఏదో ఒకటి ఆ వ్యక్తి ఈ పని చేయాలని కోరుకుంటాడో, అప్పుడు సూక్ష్మంగా ఆ గ్రహము ఆ పనిని చేసితీరును. కనుక ఈ భగవద్గీత గ్రంథాన్ని ఆ స్వామి ఇంట్లో ఉన్నదానిని తెచ్చి సూక్ష్మంగా ఇక్కడ పడేస్తున్నది. ఏదైనా సరే అలాగే జరుగును. అదియునూ ఏ వస్తువైతే స్వామి చెప్పునో అది తప్పక స్వామి లేదా మంత్రం చెప్పేవాడి ఇంట్లో లేదా ఆశ్రమంలో ఉన్నదే తేగలదు. కానీ ఎవరు ఏ విధంగా తెచ్చారని ఆ స్వామికి కూడా తెలియదు, కానీ అది మాత్రం అతను చెప్పిన చోటుకి వచ్చును. కనుక ఇవన్నీ మహత్యములు కావు, మంత్రముల వలన జరుగునవే అని అర్థం చేసుకోవలయును. ఇక మూడో విధానమైన మహత్యమును మాయ లేదా ప్రకృతి చేయును. అది ఎలాగంటే హస్తలాఘవముకాక, ఇంద్రజాల, మహేంద్రజాల, గజకర్ణ-గోకర్ణ విద్యలతో సంబంధము. లేని పనులను మాయ చేయగలదు.

ఈ పనులు ఎలాగుంటాయంటే, ఒక వ్యక్తిని ఉన్నతంగా చూపించాలంటే మాయ ఆయన చేయలేని పనులను ఆయనచేతనే చేయించి అతనికి తెలియకుండా ఆ మహత్యాన్ని ఆయనే చేసినట్లు, అతన్ని భ్రమింపచేయును. ఉదాహరణకు ఒక పేరుపొందిన సినిమా నటునికి ఒక పెద్ద జబ్బు చేసింది. అతను హాస్పిటల్‌కు పోయినాడు. అతనికి ఆరోగ్యం బాగుండాలని అభిమానులందరూ దేవతలకు టెంకాయలు కొడుతున్నారు, యజ్ఞములు చేస్తున్నారు. ఈ విధంగా జరుగుతున్న సమయంలో ఆ నటునికి ఒక స్వామీజీ కలలో కనిపించి, ఈ రోగాన్ని నీకు లేకుండా ఈ రోజు చేస్తున్నాను, రేపు నీవు ఇంటికి పోవచ్చు అని చెప్పెను. నిజంగానే ఆ నటునికి మరునాడు ఆ రోగం పోయింది. ఆ విధంగా అతను బయటికి

వచ్చి, ఫలానా స్వామి చెప్పినాడు తగ్గుతుందని, ఆయన చెప్పినట్లు నాకు తగ్గిందని అంత పెద్ద హీరో చెప్తే ఏమవుతుంది దేశంలో అందరికీ తెలిసిపోతుంది. అప్పుడు ఆ హీరో ఆ స్వామి దగ్గరకు పోయి నమస్కరించా డనుకో ఏమవుతుంది, ఆ స్వామి ఆ దేశమంతటికీ తెలిసిపోగలడు. వాస్తవముగా ఈ స్వామీజీకి ఏమీ తెలియదు. మరి ఎవరు ఆ హీరోకి చెప్పినట్లు అంటే మాయే (ప్రకృతి) చేసింది. అప్పుడు ఆ స్వామీజీకి ఉన్న ఏ విద్యద్వారా జరిగింది అంటే ఏ విద్యవలనా జరగలేదు. మరి జరిగిన ఈ విషయాన్ని మహత్యం అనవచ్చును. దీనిని హేతువాదులు సైతము మోసము అనలేరు, ఖండించలేరు. మరి ఈ మహత్యాలు ఎందుకు జరుగుచున్నాయి, అంటే మనిషి దేవుని వైపునకు పోకుండా మాయ చేసే పనియే మహత్యం అగును. ఎందుకు పోకూడదు? అంటే దేవునికి ఇష్టంలేదు నీ పైన, కనుక అందుకే వేమన శతకంలో **"పతియొప్పిన సతియొప్పును"** భర్త ఒప్పుకుంటే భార్య ఒప్పుకుంటుంది. పరమాత్మ ఒప్పుకుంటే ప్రకృతి ఒప్పుకుంటుంది, అంటే మాయ ఒప్పుకుంటుంది. నువ్వే తెలివి తక్కువ వాడివి. పరమాత్మకు నువ్వు ఇష్టుడవు కాకపోతే ఆయన మాయకు తప్పుకోమని చెప్పడు అందులో కృష్ణుడు భగవద్గీతలో **"దైవీ హ్యేషా గుణమయి మమ మాయ దురత్యయా"** అన్నాడు. అనగా అది నేను సృష్టించిన మాయే అన్నాడు. కనుక ఆయనే కాపలా పెట్టాడు. ఆయనకు ఇష్టం వచ్చిన వారిని మాయను వదలమని చెప్తాడు. లేకపోతే వదలి వద్దని చెప్తాడు. కానీ నీవేమైనా నాదగ్గరకు రావాలంటే, మాయను దాటి రావాలంటే **"మామేవయే ప్రపద్యంతే మాయమేతాం తరన్తితే"** ఎవడైతే నన్ను ఆరాదిస్తాడో, నన్ను నమ్ముకుంటాడో నన్నే శరణువేడునో అప్పుడు నా మాయ వారిని విడిచిపెట్టును. మరి ఇప్పుడు నీవు జ్ఞానం వైపు ఎందుకు వెళ్ళకూడదు? అంటే నీవు దేవునికి సరిపోయే పనులేమీ చేయలేదు. దేవున్ని చేరే భావం

నీ యందు లేదు. మాయ బాగా అడ్డువస్తున్నది లేకపోతే దేవుని దగ్గరకు పోయేవాన్ని అని కొందరంటారు. కానీ వారు దేవున్ని సరైన మార్గంలో శరణువేడుతున్నారా లేదా అని చూచుకోవటం లేదు.

దేవుడు తాను భూమి మీదకు వచ్చి తన జ్ఞానాన్ని చెప్పగలుగుచున్నాడు. ఆయన జన్మ తీసుకుని వచ్చి చెప్పగలుగుచున్నాడు. భగవంతుడిగా వచ్చి తన జ్ఞానాన్ని ప్రచారం చేయాలంటే **మూడుసార్లు** రావాలని చెప్పాడు. **మాయ** ఎన్నిసార్లు వస్తుందంటే, **ఐదుసార్లు** వస్తుంది. దేవుడు మూడు భాగాలుగా ఉన్నాడు జీవాత్మ, ఆత్మ, పరమాత్మగా, కనుక మూడుసార్లు అవతారం దాల్చి వచ్చును. ప్రకృతి ఎన్ని భాగాలుగా ఉంది ఐదు భాగాలుగా ఉంది. అగ్ని, గాలి, నీరు, భూమి, ఆకాశము కనుక మాయ ఐదుసార్లు రాగలదు. దేవుడు భగవంతునిగా రాకముందు ఒకసారి వస్తుంది, వచ్చి మార్గం సులభం చేసుకుంటుంది. ఆయన వచ్చిన తరువాత ఆయనతో పాటు ఇంకొకసారి వస్తుంది. ఆయనున్నప్పుడే ఇంకొక రెండు మార్లు వచ్చి (నాలుగుసార్లు పూర్తిచేసుకుని) ఆయన పోయిన తరువాత ఇంకొకసారి వస్తుంది. మొత్తం ఐదుసార్లు వచ్చును. వచ్చిన ప్రతీసారి చాలా జాగ్రత్తగా ఎవరికీ తెలియకుండా తన పనిని చేయును.

## 47. అద్వితీయుడు-ద్వితీయుడు

తేది : 15-07-2011

శ్లో॥ ఓం గురుబ్రహ్మ గురు విష్ణుం గురు దేవో మహేశ్వర ః
గురు సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురువే నమ ః ॥

బ్రహ్మకు గురువు, విష్ణువునకు గురువు, మహేశ్వరునికి గురువైనటువంటి వాడు, ఈ ముగ్గురు పూజించేవాడు ఎవడైతే ఉన్నాడో, వాడు సాక్షాత్

www.thraithashakam.org

పరబ్రహ్మ. అనగా అసలైన దేవుడు. ఆ దేవునికి నేను నమస్కారం చేస్తున్నాను. ఇప్పుడు చెప్పిన, తెలుసుకున్న దానికి కొంత వ్యత్యాసముగా అనిపించినా, ఏది వాస్తవమో మీరే తెలుసుకొనవచ్చును. **"గురు సాక్షాత్ పరబ్రహ్మ"** అని ఉంది. అనగా గురువు సాక్షాత్ పరమాత్మ. దేవుడు అని మేము చెప్పుచున్నాము. దేవుడెటువంటివాడు కనిపించడు. రూపములేదు, వినిపించడు, పేరులేదు. ఏ కార్యము చేయనటువంటి వాడు. ఎవరు పరబ్రహ్మ? దేవుడు రూప, నామ, క్రియా రహితుడు. పరమాత్మ దేవుడైతే, సాక్షాత్ దైవము ఎవరు? గురువు.

గురువు కనిపించునా, అంటే ఒక ఉదాహరణ చెప్పెదను, ఒక గీత ఉన్నది అనుకుందాం ఒక వ్యకి ఇది ఆ గీతను చెరపకుండా ఆ గీతను తుడవకుండా అనగా గీతను చెరపకుండా ఆ గీతను (లైన్‌ను) చిన్నదిగా చేయమన్నాడట. ఒక వ్యక్తి ఇది ఎలా సాధ్యం, తుడవకుండా ఎలా గీతను చిన్నదిగా చేయగలము? అని తప్పుకున్నాడట. ఆ ప్రయత్నాన్ని ఇంకొక వ్యక్తి నేను చెయ్యగలనని చెప్పి, ముందున్న గీత ప్రక్కన పెద్ద గీత గీసాడట. ఆ విధముగా గీత ప్రక్కన మరింత పెద్దగీత గీయటం వలన ముందున్న గీత చిన్నదైనట్లే కదా! ఈ విధముగా ఒక గీతను చిన్నది అంటున్నామంటే దాని ప్రక్కన దానికంటే పెద్ద గీత ఉంటేనే కదా! చిన్నగీత అని చెప్పుటకు అవకాశం ఉండును. అలా కాకుండా ఏదో ఒక్క గీతే ఉండెననుకో ఏది పెద్దది, ఏది చిన్నది అనే ప్రసక్తే ఉండదు. ఎలా ఉన్నది అలాగే ఉండును. అలా కాకుండా అదే గీతను తుడవకుండా పెద్దది చేయమంటే ఆ గీతకంటే ఇటుప్రక్కన చిన్నగీత గేస్తే ఆ ముందున్న గీత పెద్దదవుతుంది. ఈ విధముగా మూడు గీతలైనట్లు బొమ్మలో చూపించిన మాదిరిగా ఉండును, ఈ విధముగా మధ్యనున్న గీతను తుడవకుండా దానికంటే పెద్ద గీత గీసి, చిన్న గీత

www.thraithashakam.org

అనిపించవచ్చును. ఇటు ప్రక్క చిన్న గీత గీసి, పెద్దది అని కూడా అనిపించవచ్చును.

ఈ విధముగా దేవుడున్నాడు అనుకుంటే, దేవుడు చిన్నా పెద్దా అంటే, చిన్నే అనే దానికి గాని, పెద్దే అని చెప్పుటకు గాని అవకాశం లేదు. మరి ఒక్కడుగా ఉన్నదేవుడు, దేవునికంటే పెద్దవాడు ఎవరూ లేరని అన్ని గ్రంథములు చెప్పుచున్నవి. అన్ని మతములలో చెప్పినట్లుగానే హిందూ మతములో కూడా, "దేవునికంటే గొప్పవారు ఎవరూ లేరు" అని ఒక పదముతో చెప్పవలెనని బ్రహ్మ అన్నారు. బ్రహ్మ అంటే పెద్ద అన్నది స్వచ్ఛమైన అర్థం. ఎందుకనగా! మనల్ని ఆయన పుట్టిస్తే మనం పుట్టాము. కనుక ఆయన విషయంలో ఎంత పెద్ద అన్నది మనం తెలుసుకొనలేము. ఆయన సృష్టికర్త. సృష్టికర్త అంటే సృష్టించినవాడు కదా! అంటే అది ఒక పనే కదా! మరి దేవుడు రూప, నామ, క్రియా రహితుడు అనగా ఆకారముగానీ, పేరుగానీ, పనిగానీ లేదంటూనే, పని చేసినట్లు సృష్టికర్త అంటున్నాము కదా అని ప్రశ్నిస్తే, అయితే అర్థము చేసుకొనవలసింది ఏమంటే, మనం పుట్టిన తరువాత ఆయన మనకు రూప, నామ, క్రియారహితుడగును. కానీ మనమెవ్వరమూ పుట్టక మునుపు ఆయన ప్రకృతిని సృష్టించి తరువాత మనల్ని సృష్టించాడు. కనుక, నీవు జన్మిస్తున్నావు, పెరుగుచున్నావు, వృద్ధాప్యం వస్తుంది, చనిపోవుచున్నావు. ఇవన్నీ ఎవరు చేస్తున్నారు? దేవుడు చేస్తున్నాడా? దేవుడు ఏ పని చేయటం లేదు. మరి ఎవరు చేస్తున్నారు? ప్రకృతి చేస్తున్నది. దేవుని ఆధీనంలో ఉన్న ప్రకృతే అన్నీ చేయుచున్నది. కనుక మనమందరం ప్రకృతి వలననే పుట్టాము, పెరిగాం, చనిపోవు చున్నాము. దేవుడు ఇంద్రియాతీతుడు. ఎంతటి వారికైనా ప్రపంచ జ్ఞానము ఐదు జ్ఞానేంద్రియముల ద్వారానే తెలియును. కన్ను, ముక్కు, నాలుక,

www.thraithashakam.org

చెవి, చర్మము అనే ఐదు ద్వారాల వలన మాత్రమే నీవన్నీ తెలుసు కుంటున్నావు. అదియూ ప్రకృతిలో భాగాలనే.

కానీ ఇవేవీ తెలియక, దేవునికి న్యాయం లేదు, నీతి లేదు అని దేవున్ని కొందరు దూషిస్తుంటారు. ఆయనకు పనేలేదు అంటే, ఆయన పనిచేసినట్లు మనం అనుకుంటున్నాం. ఒక వ్యక్తి నేను దేవునికి లక్ష రూపాయలు ముడుపు వేసినా, నాకేమీ మంచి జరగటం లేదు. నా ప్రక్కనున్న వాడు ఏ ముడుపు వెయ్యకపోయినా, వాడికి మంచే జరుగుచున్నది అంటాడు. దేవుడెప్పుడైనా, ఏదైనా చేస్తానని నీకు చెప్పెనా? కానీ దేవుడెటువంటివాడు, నీకు తెలిసినా తెలియక పోయినా దేవుడు ఏ పనీ చేయడు. నీకెప్పుడైనా దేవుడు కనిపించాడా, నీకు కనిపించేదంతా ప్రకృతి దృశ్యమే. మీరే కాదు ఇంతవరకు బ్రహ్మర్షులుగానీ, జ్ఞానులుగానీ, యోగులుకానీ ఎవ్వరూ దేవున్ని చూడలేదని మేము ఖచ్చితముగా చెప్పుచున్నాము. మరి దేవుని విషయములు ఎవరైనా చెప్పుచున్నారంటే, వారింతకు మునుపు ఎవరైనా చెప్తే అది విని చెప్పుచున్నారు, గానీ స్వయముగా ఎవరూ చెప్పలేరు. మరి ఎవరో చెప్పిన జ్ఞానాన్ని వీరు చెప్పు చున్నారంటున్నారు కదా! మరి అతనికి చెప్పినవాడు స్వయముగా చెప్పినాడా, అంటే ఆ విషయాన్ని గ్రంథములలో చదివి, అర్థము చేసుకుని ఆయన స్వయముగా చెప్పిన విషయములా లేక ఇంతకుముందు ఎవరో చెప్పిన విషయములా అని బేరీజు వేసుకోవలసింది మీరే. మరి దేవుని విషయములు ఎవరికీ తెలియవని మీరు ఖండించినప్పుడు మరి మేమంతా దేవుని విషయములు పట్టుదలతో నేర్చుకొనవలెనని మేము అనుకుంటే ఏమి తెలుసుకోగలమని మీరు ప్రశ్నించవచ్చును. దీనికి సమాధానమేమనగా, ప్రజలెవ్వరికీ తన విషయం తెలియదనుకున్న దేవుడు, ప్రపంచాన్ని ఎప్పుడైతే పుట్టించాడో, అప్పుడే సృష్ఠిఆదిలోనే తన జ్ఞానమును

చెప్పెను. పుట్టించిన తరువాత పనిచేయకూడదు కనుక, ఆ విషయములు మనము ఒకరి ద్వారా ఒకరం తెలుసుకున్నాము. ఇప్పటికీ దానిని తెలుసుకునేందుకు అవకాశము ఉన్ననూ, ఇప్పటి ప్రజలు దానిని ప్రక్కకు పెట్టి, సొంతంగా మనకు ఇష్టం వచ్చినట్లు చెప్పటం మొదలు పెట్టాము. దేవుడనుకొని ప్రకృతి విషయములను చెప్పుకుంటున్నారు. మరి దేవుని జ్ఞానమేది అంటే, దేవుని చేత చెప్పబడేదే దేవుని జ్ఞానము.

ఇప్పుడు మరలా ఈ విషయం తెలియవలెనన్న మనం మూడు గీతల విషయమునకు వెళ్ళెదము. దేవుడు మూడు గీతలు గీచి ముందే పెట్టెను. తెలుసుకునేముందు **"ద్వితీయుడు"** అనే పదమును గూర్చి తెలుసుకుందాము. ద్వితీయుడు అనగా రెండవవాడు, అద్వితీయుడు అనగా మొదటివాడు, అనగా దేవుడు. ఇప్పుడు రూప, నామ, క్రియారహితుడైన దేవుడు తనలోని అంశను ఒక రూపముగా మార్చి, ఒక శరీరము ధరించి భగవంతునిగా వస్తాడు. ఎందుకంటే ఆయన చెప్పిన జ్ఞానమును జ్ఞాపకం చేసి, మరలా తెలియజేయును. ఆ విధముగా వచ్చినవాడే గురువు లేదా భగవంతుడు. సృష్టి ఆదిలో చెప్పిన జ్ఞానమిది అని మరలా తెలియజేయుటకు ఆయన భూమిమీదకు గురువుగా వచ్చును. ఆయనే 'ద్వితీయుడు'. అప్పుడు ఆయన మాట్లాడుతూ ఉంటే ఆయన శరీరము ద్వారా మనకు వినిపిస్తూ ఉన్నది, దేవుడేమగును? భూమిపైకి వస్తే భగవంతుడగును. భగవంతుడు అంటే భగము నుండి వచ్చినవాడని అర్థము కలదు. అనగా తల్లిగర్భము నుండి సజీవముగా వచ్చినటువంటి వాడు. ఇంతవరకు ఏ జీవరాసైనా భూమిమీద, తల్లిగర్భమునుండి సజీవముగా రాలేదు. ఇది లోకవిరుద్ధముగా అనిపించవచ్చును కానీ, తెలియకపోతే అట్లే అనిపించును. జ్ఞానము తెలుసుకుంటే అది వాస్తవమే అనిపించును. తల్లిగర్భములో శిశువు కదలటం

వాస్తవమేగానీ దానికి ప్రాణము మాత్రము లేదు. ఇప్పుడు శాస్త్రవేత్తలు అని అంటున్న వారందరూ నాలుగు శాస్త్రములే అనగా, గణిత, భౌతిక, రసాయన, ఖగోళశాస్త్రములే నేర్చుకున్నారు. కానీ బ్రహ్మవిద్యాశాస్త్రము గూర్చి తెలియదు, భౌతికవాదులకు భౌతికముగా ఉన్నదే తెలియును కానీ అభౌతికముగా జరుగు విషయములు గూర్చి పూర్తిగా తెలియదు. ఏ వైద్యుడైనాగానీ నాకు శరీరములో అన్ని భాగములు తెలుసు, పరీక్షశాలలో అన్నింటికీ వైద్య పరీక్షలు చేయవచ్చును అంటారు. మరి అభౌతికమైన బుద్ధిని, చిత్తమును, అహంకారము అను వాటిని ఏ పరీక్షలో నిర్ధారించగలరో చెప్పమనండి!

ఒక వ్యక్తికి బుద్ధి జిత్తులమారిదనుకో, మరి వైద్యులు ఆ బుద్ధిని పరీక్షించి వాని జిత్తులమారితనాన్ని తెలుసుకోవచ్చును కదా! వారి గుండెను నీవు పరీక్షించవచ్చు. ఎందుకంటే అవన్నీ కనిపించును. కనపడని మనస్సు, బుద్ధి ఎటువంటివో, ఉన్నాయి, లేవు అనటానికి వీల్లేదు కానీ భౌతిక శాస్త్రవేత్తలకు ఇది సాధ్యము కాదు. అది అభౌతికమను విషయములను తెలియజేయుటకు బ్రహ్మవిద్యాశాస్త్రమునకే సాధ్యమగును. కనుక బ్రహ్మ విద్యాశాస్త్రమును తెలిసినవారే, ఆధ్యాత్మికవేత్తలు. కనుక భగవంతుడుగా శ్రీకృష్ణుడుగా వచ్చినప్పుడు, నేను గర్భములో సజీవముగా పుట్టితిని అని చెప్పుటకు ఎదురుకాళ్ళతో పుట్టటమేకాక, కాళ్ళను కదిలించి పుట్టాడు. ఈ విధమైన సందేహం వస్తుందని ఆ విధముగా కాళ్ళు అల్లాడించి బయటకు వచ్చెను. కనుక అతనిని భగవంతుడు అంటున్నాము. ఆ విధముగా భగవంతునిగా వచ్చినవాడే గురువు. అనగా రెండవవాడు, మొదటి వాడు రెండవవాడిగా వస్తున్నాడు. అంటే గురువు 'ద్వితీయుడు' ఎందుకంటే దేవుడు తనస్థాయినుండి మన స్థాయికి వచ్చి జ్ఞానము చెప్పుచున్నాడు కనుక

'ద్వితీయుడు' అయినాడు. అద్వితీయుడు అనగా రెండూకానివాడు అనగా దేవుడు. కొన్నాళ్ళు ఉండే 'ద్వితీయుడు' మరల అద్వితీయుడే అగును. ద్వితీయముగా కనిపిస్తున్న భగవంతుడు వాస్తవముగా అద్వితీయుడే. మొదటివాడు అని అంటున్నామంటే రెండవవాడు ఉండటం వలనే కదా ఆయనను మొదటివాడు అనేది. అనగా అద్వితీయుడు అని అంటున్నామంటే ద్వితీయుడు ఉండటం వలననే కదా అని అనవలసివచ్చినది.

ద్వితీయుడైన గురువు లేదా భగవంతుడు ఎప్పుడొస్తాడు? ధర్మములు భూమిమీద తెలియకుండాపోయినప్పుడు, ధర్మములు తెలిపే నిమిత్తము ఆయన ద్వితీయుడుగా అనగా భగవంతునిగా రావలసిన పని వస్తుంది. అదియునూ కొన్ని వేల, లక్షల సంవత్సరాలకు వచ్చును. **"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!"** అని చెప్పాడు కదా! మరి ఆయన వచ్చినట్లు మనకు తెలిస్తే ఆయనను గురువు అనవచ్చును. కానీ ఆయన వచ్చినట్లు ఎవరికీ తెలియదు, తెలియబడడు. ఒకవేళ ఎవరైనా ఈయనే భగవంతుడు, గురువు అని తెలుసుకుంటే, వానికున్న ఎన్ని జన్మకర్మలైనా లేకుండా పోవును, మోక్షము పొందగలడు. కానీ అది జరుగుటకు అవకాశము లేదు. ఎందుకంటే, ఈయన భగవంతుడని ఎవరినైనా నేను నిలబెట్టి చెప్పిన, ఎవరూ నమ్మరు. ఆయన కాదు అనేదానికి వెయ్యి ప్రశ్నలు వచ్చును. జవాబు దొరకదు. కనుక గురువు అనేవాడు ఎక్కడా గుర్తింపబడడు. గురువు గుర్తింపబడేవాడు కాదు. రహస్యంగానే ఉండిపోయేవాడు. కనుక గురువెవరో తెలుసుకోలేని పరిస్థితుల్లో గురువుకు శిష్యులుంటారా? గురువే కనపరాకుంటే శిష్యులెలా ఉంటారు? కనుక గురువుకు శిష్యులుండరు అని మేము **"గురు ప్రార్థనామంజరి"**లో వ్రాశాము. కనుక మనము గురువును కలిసినా అనగా రెండు, మూడుమార్లు కలిసినచో అతను

www.thraithashakam.org

అర్థముకాదు. ఒకవేళ అర్థమైనట్లు అనిపించినా మాయ ఎన్నో సంశయాలు లేవనెత్తి అతను గురువుకాదు అనిపించును, కానీ గురువుమీద నిజమైన శ్రద్ధవుంటే, జ్ఞానము తెలుసుకోవలెనని శ్రద్ధ బలీయముగా ఉంటే, అటువంటి వానికి మాత్రము, దేవున్ని తెలుసుకునే అవకాశం ఉన్నది.

ఈ మధ్య కర్నూల్ ప్రాంతములో ఒక వ్యక్తి కాల, కర్మచక్రములు ధరించిన మన సభ్యున్ని ఇవేమిటి ఈ విధముగా పెట్టారని అడిగాడు. మన సభ్యులు వివరము చెప్పితే, దానిని గూర్చిన సమాచారము ఉన్నదా? ఉంటే ఇవ్వగలరా అని అడిగాడు. అలాగే అని మన సభ్యులు భగవద్గీత, 'గురువు' గ్రంథములను ఇచ్చారు. భగవద్గీతను చూసి, ఆయన "ఇటువంటి భగవద్గీతలు డెబ్బైవరకు చదివాను. కానీ ఈ భగవద్గీత వద్దు" అన్నాడట. అదే విధముగా "గురువు" అనే గ్రంథము చూసి, గురువు గురించి నాకు చాలా తెలుసు, అది వద్దన్నాడట. మరి అన్నీ నాకు తెలుసంటే, గ్రంథములు చదవకపోతే సమాచారము ఏ విధముగా తెలియును? 'నేను తెలుసుకోవాలి' అనే వారికి ఏదైనా తెలుస్తుందిగానీ, 'నాకన్నీ తెలుసు' అనేవారికి లభించదు. అదే విధముగా గురూపదేశాలు, గురుపూజలు ఇవన్నీ కల్పితములేగానీ వాస్తవము కాదు, ఎందుకనగా! ఒక గురువు ఉంటాడనుకుందాము. ఆయనవద్దకు వచ్చి, గురూపదేశము అని ఉపదేశము పొందుదురు. అంతే అది పొందగానే మరి గురువుతో ఏమి పని? గురువుతో ఏ సంబంధము ఉండదు. ఎందుకంటే జ్ఞానము తెలుసుకోవలెనన్న అవసరము లేదు. అక్కడ అందుకు వారు తెలిపిన ఒక మంత్రాన్ని జపించుకుంటూ ఉందురు. కానీ దేవుడు భగవద్గీతలో ఏమి చెప్పెను, **"శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్"** అన్నాడు. అంటే నీవు అభ్యాసం చేసేదానికంటే ముందు జ్ఞానము తెలుసుకో అన్నాడు. కనక దానినే మేము అనుసరించి ఇంతవరకు 40 సంవత్సరముల

నుండి ఎవరికీ నేను ఉపదేశము ఇవ్వలేదు. ఉపదేశము ఇమ్మని కొంతమంది నన్ను అడిగారు. "నాకే ఏ ఉపదేశము లేదు. నేను ఏమి ఇచ్చెదను. ఒకవేళ నేనిచ్చితిని అనుకో, నీవు తీసుకుంటావు, వెళతావు అంతే, దానివలన ఉపయోగం లేదు" అని అన్నాను. మరి "నేను ఎలా జపం చేయాలి?" అని ఒకరు అడిగాడు. "నీకు జపం చేయమని ఎవరు చెప్పారు. అవన్నీ వృథాప్రయాసలే" అని మేమన్నాము.

మా వద్దకు 30 సంవత్సరములు జపంచేసిన ఒక వ్యక్తి తిరుపతి నుండి వచ్చాడు. ఆయనను "మీరు 30 సంవత్సరముల నుండి జపం చేసారట కదా" అని మేమంటే, "చాలా బాగా చేశాను, ఒకే ధ్యాసతో" అని అతను అన్నాడు. అప్పుడు, "దేవుడు అదే వద్దు అన్నాడు కదా! ఒకే ధ్యాసవద్దు, ఏకాగ్రత కావాలి అన్నాడు కదా!" అని అన్నాను. ఏకము అంటే ఒకటి, ఆ ఒకటిపైన కూడా నీకు ధ్యాస లేకుండా ఉండవలెనని దేవుడు ఏకాగ్రత అని అన్నాడు. అనగా 'సున్న' స్థాయి అంటే ఏది లేని స్వచ్ఛమైన స్థితి అని ఆయన భావము అంటే, ఏకముపైన అగ్రత అనగా పై స్థాయి అనగా ఒకటిపై స్థాయికి నీవు వెళ్ళితే నీకు దేవుడు తెలియబడును అని చెప్పినాడుగానీ, ఒకదాన్ని ఆధారము చేసుకొని నీవు మెడిటేషన్ చేస్తే నీవు ఏకములో ఉంటివి కానీ ఏకము పైనున్న శూన్యము పొందలేదు కనుక నీవు దేవున్ని పొందలేవు అని చెప్పాము.

మమ్మల్ని చాలామంది ప్రశ్నించారు "రోజుకు ఎన్నిమార్లు మీరు ధ్యానం చేస్తారని", "అదేమిటి! రోజుకి నిమిషం కూడా ధ్యానం చేయను" అని చెప్పాను. మీరు ధ్యానం చేయటం వలన మీకేమి తెలియదో అది జ్ఞానము తెలుసుకోవటం వలన లభించును. అదే ముఖ్యము దేవున్ని తెలుసుకునేందుకు, ధ్యానము పనికి రాదు. మంత్రజపము పనికి రాదు.

www.thraithashakam.org

జ్ఞానము తెలుసుకుంటే దేవుని గూర్చి క్రొత్తక్రొత్త విషయములు తెలుస్తూ ఉంటాయి. ధ్యానంలో ఏమి తెలియును? ఏమీ తెలియదు.

కనుక గురుబోధలు గురు ఉపదేశములు అని చెప్పి కాలమును వృథా చేసుకోకుండా, దేవుడు ఏదైతే బ్రహ్మవిద్యాశాస్త్రమని, ఆరవశాస్త్రమని చెప్పాడో, ఆ విషయమునే చెప్పటానికి 'ద్వితీయుడుగా' ఎవరైతే వచ్చి తెలియజేశారో, అది తెలుసుకొంటే, దానివలన మన మనస్సు ఏకాగ్రతకు వెళ్ళును అంతేగానీ ఏకత పొందదు, ఏకంగా ఏకాగ్రతే పొందును. ఏకాగ్రతను వదలి ఏకమైన నమఃశ్శివాయనో, ఇంకొకటో, ఇంకొకటో పట్టుకొని జపిస్తే దానివలన ఏమీ ప్రయోజనము లేదు. కాలమును వృథా చేయకుండా, జ్ఞానాన్ని నేర్చుకుంటే ఏ ధ్యానము చేయవలసిన అవసరము లేదు. వేమన అదే విషయాన్ని చెప్పాడు. "ఊరకుండమని చెప్పేవాడు ఉత్తమ గురుడు" అని అన్నాడు. కనుక ఏ సాధన లేకుండా మనము యోగాన్నీ పొందవచ్చును. జ్ఞానమును తెలుసుకుంటే దేవుడు అనే అద్వితీయుడు, ద్వితీయుడిగా వచ్చి తెల్పిన అసలైన జ్ఞానము తెలియును. తద్వారా అద్వితీయుడు తెలియును. అద్వితీయుడనగా దేవుడు, ద్వితీయుడనగా భగవంతుడు, గురువు. తృతీయుడనగా ఎవరు నువ్వే (మీరే) అనగా జీవాత్మ. ఇప్పుడు అద్వితీయుడనగా పరమాత్మ, ద్వితీయుడనగా ఆత్మ, తృతీయుడనగా జీవాత్మ.

## 48. తల్లి

తేది : 10-12-2011

భూమిపైన ఏ మనిషికైనా దేవున్ని తెలుసుకోవాలంటే ముందు మాయను గూర్చి తెలుసుకోవలెను. లేకపోతే దేవుడు తెలియబడడు.

www.thraithashakam.org

ఎందుకు తెలియబడదు? ఇంతవరకు “మాయ మిమ్మల్ని ప్రక్కకు పంపిస్తుంది, దేవుని దగ్గరకు పంపించదు” అన్నారు. “మరల” ఇప్పుడు మాయ తెలిస్తేనే దేవుడు తెలుస్తాడు అనటం విచిత్రముగా ఉంది? మాయతో ఏం పని? దేవునితోనే కదా మనకు పని? అని “మీరు ప్రశ్నించవచ్చును? దానికి మా జవాబు ఏమనగా!

తండ్రి ఎవరు అనేది తల్లికి మాత్రమే ఆ రహస్యం తెలియును. ఇప్పుడు తల్లిపాత్ర ప్రకృతిది, తండ్రిపాత్ర పరమాత్మది. ప్రకృతి, పురుషులకు (పరమాత్మ) పుట్టినటువంటి వారమే మనమంతా. అంటే ప్రకృతి సర్వ జీవరాశులకు తల్లిగా ఉన్నది, పరమాత్మ తండ్రిగా ఉన్నాడు. ప్రకృతి జనితములైనవే గుణములు, ప్రకృతి అనేది పంచభూతములుగా ఉండి, వాటితోనే నీ శరీరము తయారు చేయబడినది. ప్రకృతి లేదా పంచ భూతములతో తయారు చేయబడినవే గుణములు. ఈ గుణములనే మాయ అంటాము. ప్రతీ మనిషి తలలో ఈ గుణములున్నవి. అంటే తలలో ‘మాయ’ ఉన్నట్లే కదా! గుణముల రూపములో మాయ ఉన్నది.

పరమాత్మ తనను చేరే ధర్మాలను గూర్చి చెప్పేందుకు భగవంతుని రూపంలో వస్తాడు. అంటే దేవుడు భగవంతుడగును. దేవుడు భగవంతుడైతే, ప్రకృతి మాయ అగును. ఈ మాయ ఒక వ్యక్తిని దేవునివైపు పంపించగలదు లేదా దేవునికి వ్యతిరేఖదిశలోకైనా పంపించును. దేవుడు భగవంతుడిగా వచ్చినా సరే, ఆయన తలలో కూడా గుణములు కలవు. భగవంతుని తలలో ఉన్న మాయ దేవునివైపుకు పంపించగలదు. ఇతరుల తలలో ఉన్న మాయ వ్యతిరేఖ దిశలో పంపించగలదు. ఒకే మాయ రెండు విధములుగా పని చేస్తున్నదని మనకు తెలియుచున్నది. మాయ రెండు భాగములుగా ఉంది. అది ఏదో తెలిస్తే దేనిని ఆశ్రయించి, దేనిని వదలివేయాలో తెలియును.

www.thraithashakam.org

దేవున్ని ఒక్కసారిగా ఎవ్వరూ ఆశ్రయించలేరు. దేవుడు అంటే వెతక బడేవాడు, దేవుడలాడబడేవాడు. మరి ఆయన ఏ విధంగా తెలియ బడతాడంటే, ప్రకృతి వలననే తెలియాలి. ప్రకృతి నాకు భార్యవంటిది అని భగవద్గీతలో చెప్పాడు కదా! మరి తల్లి వలననే తండ్రి తెలియాలి. ప్రకృతి వలననే పరమాత్మ తెలియవలెను. మరి ప్రకృతిని మనము మాయ అంటున్నాము. ఈ మాయ ఏ విధముగా ఉందంటే, దేవునివైపు పంపించే మాయ, దేవునికి వ్యతిరేఖ దిశలో పంపించే మాయగా రెండు రకములుగా ఉంది.

నువ్వు దేవుని మీద శ్రద్ధ కలిగియుంటే నిన్ను మాయ దేవునివైపు పంపిస్తుంది. నీకు శ్రద్ధ లేకపోతే నిన్ను దేవునివైపు పంపించదు. నువ్వు నీ తండ్రిని, పరమాత్మని తెలుసుకోవాలని ఎంత శ్రద్ధ ఉంటే ఆ శ్రద్ధను అనుసరించి అటువంటి వాడిని దేవునివైపు పంపించేందుకు మాయ ప్రయత్నం చేస్తుంది. ఆ మాయ కూడా మనతో ప్రత్యక్షంగా మాట్లాడలేదు గానీ గుణముల రూపములో కలదు. నీకు జ్ఞానము తెలియాలంటే ఇంకొక మనిషి ద్వారా తెలియాలి. ఆ మనిషి తలనుండే రావాలి, తలలో ఉండే గుణములనుండే రావాలి. మరి గుణములు అంటే మాయే కదా! మరి మాయ దేవునివైపు ఎందుకు పంపిస్తున్నది? అంటే దేవునివైపు పంపించే మాయ కూడా ఉన్నది. ఈ మాయ శ్రద్ధ కలిగిన వానిని మాత్రమే దేవునివైపు పంపిస్తుంది. శ్రద్ధలేనివానిని, నీవు దేవునివైపే ఉన్నావని నమ్మించి, చాలా దూరం తీసుకువెళ్ళి విడిచిపెడుతుంది. దేవునివైపు కాకుండా, చాలాదూరం వెళుతున్నామన్న సంగతి ఎవ్వరికీ తెలియదు. అందరికీ దేవునివైపే వెళు తున్నామనే భావననే కలిగిస్తుంది మాయ. మాయే రెండు విధములుగా పని చేస్తున్నది అని **'తల్లి-తండ్రి'** అనే గ్రంథములో వివరించటం జరిగింది.

అందులో ఒక ప్రశ్న వచ్చింది. తల్లినుండే తండ్రి రహస్యము తెలియునట్లు, ప్రకృతి జనితమైన మాయనుండే పరమాత్మ తెలియును. **"మాయను ఎవరైతే తెలియలేడో, అటువంటివాడు దేవున్ని తెలియలేడు"** అని ఆ గ్రంథములో చెప్పటం జరిగింది. ఇంతవరకు దేవుని మార్గమునకు మాయ ఆటంకము అని చెప్తూ, మాయ తెలియనిది దేవున్ని తెలియలేడు అని ఇప్పుడు అంటున్నారు కదా! ఇది ఎంతవరకు సమంజసం అని మేమే ప్రశ్న వేసుకుంటూ, మేమే సమాధానము కూడా చెప్తున్నాము. మేము అప్పుడు, ఇప్పుడూ అదే మాటను చెప్తున్నాము. దేవుని మార్గమునకు ఆటంకం కలిగించే మాయను విడిచి పెట్టండి, అప్పుడు నీకు దేవునిమార్గము తెలుసుకునేందుకు అవకాశము ఉంటుంది. మరి ఆ దేవున్ని తెలుసుకు నేందుకు ఏది తోడ్పడుతుంది. మాయే తోడ్పడును. ఏ మాయ? దేవుని దగ్గరకు పంపించే మాయ? అంటే ఒకే మాయ నిన్ను అటుగా చేస్తుంది, ఇటుగా కూడా చేయును. అందుకే ఏ మాయ దేవునివైపు పంపిస్తున్నది. ఏ మాయ దేవునివైపు పంపించటం లేదు అనే విషయాన్ని తెలియాలంటే, మాయ గురించి నీవు పూర్తిగా తెలుసుకోవలసిందే. మరి వేదాలు దేవుని మార్గము చేరుటకు పనికిరావు అని దేవుడే చెప్పాడు కదా! మరి వేదాలే మాయ అని చెప్పాడు కదా, మరి మనము దానినే ఆశ్రయిస్తే, దేవునివైపుకు పంపించని మాయే కదా అది. మరి దానిని విడిచిపెడితే మీరు మాయను విడిచిపెట్టినట్లే కదా! నాలుగు వేదాలను విడిచిపెట్టండి. ఎందుకనగా! అవి గుణములతో కూడుకొన్నవి. గుణములే మాయ. అందుకు అందులో ఇరుక్కోవద్దు అని చెప్పినచో, మీరు ఇప్పుడు నన్ను ఒక ప్రశ్న వేయవచ్చును అదేమనగా! "మీరు మాయను విడిచిపెట్టమన్నారు, వేదాలే మాయ అన్నారు. మరి వాటిని విడిచిపెడితేనే మరి మాయను మీరు తెలుసుకోకపోతే దేవుడు తెలియబడడు" అంటున్నారు. మరి ఏ మాయ అది? అని ప్రశ్నించవచ్చును.

వేదములు మాయే అని చెప్పాడు దేవుడు. గుణ విషయములు ఏవైతే ఉన్నాయో అవే నిన్ను దేవునిమార్గమునుండి ఆటంకపరుస్తాయి. మరి ఏ మాయలోనైనా గుణవిషయములే కదా! ఉండేది అంటే గుణ విషయములే ఉన్నాగానీ, గుణములకు అతీతముగా ఉండే విషయాలు లేవు కదా! అందుకే పూర్వము నుండి ఒక మాట అనేవారు నాలుగువేదాలు ఒక రకమైతే, ఐదవ వేదము ప్రత్యేకమైనది, అంటే 'పంచమవేదం' ఒకటుంది అని చెప్పేవారు. పంచమ వేదం అంటే ఏమిటి అనగా, కొందరు భాగవతమన్నారు, కొందరు భారతమన్నారు. కానీ భారతం ఇతిహాసం, భాగవతం పురాణం అగును కానీ వేదం ఎట్లగును? ఒకటి చరిత్ర, ఇంకొకటి 18 పురాణాలలో ఒకటవుతుంది కనుక వేదం అనే పేరు వీటికి తగదు. మరి రెండూ వేదములు కానప్పుడు పంచమవేదం ఏది? పంచమవేదం అనే మాట ఉందికానీ, అది ఏది అనేది మాత్రము వాస్తవముగా ఎవరికీ తెలియదు. ఎందుకు తెలియదు?

మరి నాలుగు వేదాలు ఎవరు వ్రాశారు? పురాణాలు ఎవరు వ్రాశారు? వ్యాసమహర్షి వ్రాశారు అనేది జవాబు అగును. నాలుగు వేదాలు భూమి పుట్టినప్పుడు, సృష్టి జరిగినప్పుడే ఉన్నాయనటం పొరపాటు. ద్వాపర యుగములో అవి తయారైనవి. అంటే పాఠ్యపుస్తక రూపంలో తయారు చేయబడ్డాయి అవే వేదాలు. ఈ వేదాలు దేవుని మార్గములో పనికిరావు. వ్యాసుడు నాలుగు వేదాలు వ్రాసి, 18 పురాణాలు వ్రాసిన తరువాతే, పూర్తి అధర్మములు చెలరేగినాయని, దేవుడు భగవంతునిగా పుట్టాల్సిన పని వచ్చింది. ఆ విధంగా పుట్టిన తరువాత వేదాల వలన మీరు దేవున్ని చేరలేరని చెప్పాడు. ఇవన్నీ వాస్తవమేకానీ మీరు చెప్పిన వేదం ఏమిటి? మీరు చెపుతున్నది వేదం కాదా? అని ప్రశ్నించవచ్చును. పద్ధతి ప్రకారము

దానిని మేము వేదమనే చెప్పాలి. పద్ధతి ప్రకారము ప్రకృతి వలననే దేవున్ని తెలుసుకోవాలి అని చెప్పాలి, పద్ధతి ప్రకారము తల్లి వలననే తండ్రి తెలుస్తాడని చెప్పాలి. సూత్రము ప్రకారము వేదాలు లేదా మాయ వలనే దేవుడు తెలుస్తాడు అని చెప్పాలి. మాయను వదలమంటారు. మాయను ఎందుకు తెలుసుకోమంటారు? అని ప్రశ్నించవచ్చును. నిజమే మాయను వదలమన్నది వాస్తవమే, నాలుగు వేదాల రూపంలో ఉన్న మాయను వదలివేసి, ఒక్క వేదరూపంలో ఉన్నటువంటి, దేవునివైపు పంపించే మాయ ఏదైతే ఉందో దానిని తెలుసుకోండి. అటువంటి వేదం ఏదైనా ఉందా అంటే మాకైతే తెలియదు. ఈ మధ్యన ఏమి తెలిసిందంటే వీరబ్రహ్మంగారు తమ కాలజ్ఞానాన్ని వ్రాస్తూ, కొన్ని విషయాలు వ్రాసారు **"ప్రబోధాశ్రమము ఉన్నతమైన జ్ఞానము కలది"** అని వ్రాయటం జరిగింది. మరి అతనిలో ఉన్న ఆత్మశక్తి భవిష్యత్‌లో జరుగు విషయములను ఏ విధముగా వ్రాయటం జరిగిందోకానీ, మన ఆశ్రమం పేరే ఆయనచే వ్రాయించటం జరిగింది. తరువాత ఇంకొక విషయము **"ప్రబోధాశ్రమము వారికి శయనాధిపతి గుణములు కల్గియున్నారు"** అని వ్రాయటం జరిగింది. **"శయానాధిపతి ఆనంద గురువుగా ఉన్నాడు, ఆది గురువుగా ఉన్నాడు"** అని కూడా చెప్పటం జరిగింది. ఆయన వ్రాతలో శయనాధిపతి, ఆనంద గురువుగా మారినాడు. ఈ విధంగా ఆనంద గురువు అనే మాటతో చాలా వ్రాశాడు, వ్రాస్తూ **"ఆయన నీకు గురువే, నాకూ గురువే"** అని కూడా వ్రాశాడు. **"నేను కొన్నేళ్ళకు ప్రబోధ ఆశ్రమమును వచ్చి ఆనంద గురువును ఆశ్రయిస్తాను"** అని కాలజ్ఞానములో వ్రాశారు. ఈ విషయములేవీ తెలియక ముందే మేము చెప్పాము, 1980లో నేను ఒకసారి బ్రహ్మంగారి మఠమునకు వెళ్ళినప్పుడు ఆయన నిద్రలో శరీరమును వదలి జన్మ తీసుకున్నారు.

www.thraithashakam.org

ఇప్పటికి అతని వయస్సు 36 సంవత్సరములు. ఆయన ఎప్పుడొస్తాడేమో గానీ, "తనను తాను తగ్గించుకొనువాడు హెచ్చింపబడును" అనే ఉద్దేశ్యము ప్రకారము జ్ఞానమును చెప్పే గురువుగా, ఎక్కడా కనిపించకూడదు అనేది నాకిష్టముగా ఉండును. మమ్మల్ని చాలామంది చాలారకములుగా పోల్చినా, ఏదోరకముగా ఖండిస్తూనే వచ్చాము. కానీ బ్రహ్మంగారు చెప్పిన వాక్యాన్ని ఖండిస్తే ఆయనను చిన్నబుచ్చినట్లవుతుంది. కనుక ఆయన చెప్పింది నూటికి నూరుపాళ్ళు సత్యమే. ఎందుకంటే పేరుపెట్టి చెప్పారు. పేరు పెట్టకపోతే మనము తప్పించుకునేందుకు అవకాశము ఉండేది. కానీ పేరుపెట్టడము వలన మేము తప్పించుకొనుటకు అవకాశము లేకుండాపోయింది. తప్పకుండా ఆయన చెప్పిన దానిని ఒప్పుకుని తీరవలసిందే. మాయ వలనే దేవుడు తెలియబడతాడు అనే వాక్యాన్ని వ్రాసినప్పుడు నా జీవాత్మ ఆత్మను ప్రశ్నించినప్పుడు సమాధానము వచ్చినప్పుడు మేముగా చెప్తాము. కనుక **"నేను'** కు **"మేము"** కు తేడా కలదు. 'నేను' అంటే నేను జీవుడను, మేము అంటే 'నేను, నా ఆత్మ ఇద్దరము కలిసి' అని అర్థము. నా ఆత్మకు అన్నీ తెలుసుకానీ, నేను, నీవు అందరము ఒక్కటే. మనమేమి? అందరము తెలియనివారమే. ఈ విషయము నాకే పరిమితము కాదు. అందరిలోనూ ఇద్దరిద్దరు ఉన్నారు. వారే జీవాత్మ, ఆత్మలు. జీవాత్మ ఎక్కడుంటే అక్కడ తప్పకుండా ఆత్మ ఉంటుంది. ఒక ఆత్మ ఏ శరీరములోనూ ఉండదు. ప్రతీ శరీరములోనూ జోడాత్మలు కలవు. వాటినే ఆత్మ, జీవాత్మ అంటున్నాము. శరీరం లోపల, శరీరము బయట అంతటా ఇంకొక ఆత్మ కలదు. దానినే పరమాత్మ అంటాము. నీ శరీమునకు, నా శరీరమునకు మధ్యలో శూన్యము ఉంది కానీ, ఆ శూన్యములో ఆత్మ, జీవాత్మలు లేవుగానీ, వాటికి పరంగా ఉన్న పరమాత్మ కలడు. కనుక జీవాత్మగా ఉన్న నేను ప్రశ్నిస్తే, ఆత్మగా

ఉన్నవాడు వెంటనే సమాధానము చెప్పటం జరిగింది. ఏమనంటే నాలుగు వేదముల వలననే దేవుడు తెలియబడును. ఐదవదయిన **'పంచమ వేదం'** దానివలననే దేవుడు తెలియబడుతాడు. ముందునువ్వు మాయను తెలుసుకుని దానిని దాటిపోవలెను. మాయ అనుకూలించకపోతే ఎవ్వరూ దేవున్ని చేరలేరు. మరి ఆ మాయ గుణముల రూపములో కలదు. అందుకే బ్రహ్మంగారు "మూడు కాల్వలు దాటలేరన్న" అన్నాడు. మూడు కాల్వలు అంటే మూడు గుణములు, అనగా తామస, రాజస, సాత్త్విక అనే మూడు కాల్వలు అని అర్థము. "మూడు కాల్వలు దాటలేరన్న ఇల మూఢజనులు మూడు కాల్వలు దాటలేరన్న" అంటే మూఢంగా ఉండే జనులు ఈ మూడు గుణములను దాటలేరు. అంటే మాయను దాటలేరు అని అర్థము.

ఈ గుణచక్రములోనే ఇంకొక చక్రముంది. అనగా ముఖముమీద పెట్టుకున్న నాలుగుచక్రముల బొట్టులో క్రింద చక్రమే గుణచక్రముగా ఉంది. అందులో మూడు భాగములు కలవు (తామస, రాజస, సాత్త్విక) ఈ మూడు గుణములు కలిసి, నాలుగు వేదములలో కలవు. ఈ గుణచక్రము ఎన్ని భాగములుగా ఉంది అంటే నెమలి పింఛము చూస్తే నాలుగు భాగములుగా ఉన్నట్లు మనకి కనిపిస్తుంది. ఇదేమి క్రొత్తమాటలాగ ఉందని ఎవ్వరూ అనుమానముపడవద్దు. గుణచక్రములో మధ్య భాగాన్ని లెక్కిస్తే నాలుగు భాగములే కలవు. ఆ మధ్యభాగము కూడా మాయాచక్రం (గుణచక్రం)లో అంతర్భాగమే కదా! గుణచక్రము అంతా మాయ ఆవహించి ఉన్నప్పుడు. మధ్యభాగములో కూడా మాయ ఆవహించినట్లే కదా. మూడు భాగములలో ఉన్న మాయ నిన్ను అజ్ఞానములో ఉంచి, దేవునివైపు వెళ్ళకుండా చేస్తుంది. తద్వారా నిన్ను జన్మలకు పంపిస్తుంది. కానీ ఈ మూడు భాగములు దాటిన తర్వాత ఉన్న మధ్యభాగము ఉంది, దానిలో

www.thraithashakam.org

కూడా ఒక గుణం ఉంది అనుకుందాము. అది నిన్ను దేవునివైపుకు పంపే గుణంగా ఉంది. అనగా గుణచక్రములో ఉన్న నాలుగు భాగములలో, మొదటి (క్రిందిది అనుసరించి) మూడు భాగములు దేవుని వ్యతిరిక్త దిశలో పంపించును. ఒక భాగము దేవునికి అనుకూల దిశలో నడుపుతుంది. గుణచక్రములో మొదటి మూడు భాగములను, నాలుగు వేదముల సారాంశముగా చెప్పుచున్నాము. నాలుగో భాగంలో ఉండే భాగాన్ని పంచమ (ఐదవ) వేద సారాంశముగా చెప్పుచున్నాము.

ఆ ఐదవ వేదమే భూమిమీద ఎవరికీ తెలియదు అని చెప్పారు? ఎవరు చెప్పారు? బ్రహ్మంగారు చెప్పారు. "సాంద్ర సింధూ వేదము భూమి మీద లేదు" అని అన్నారు. ఈ విషయం నాకూ ఇప్పుడే తెలిసింది. బ్రహ్మంగారు ఈ వేదం భూమిమీద లేదు అని కాలజ్ఞానములో వ్రాశారు. ***"సాంద్రసింధూ వేదమునకు కర్త ఆనంద గురువు"*** అన్నాడు. సమగ్రంగా (సంపూర్ణంగా) చెప్పేవాడు ఆనందగురువే అని ఆయన వ్రాశారు. కనుక, మేము ముందునుండే చెప్పుచున్నాము. మేము చెప్పు జ్ఞానము, ఇంతకు ముందర ఎవ్వరూ చెప్పనిదే చెప్పుచున్నాము అది మా సిద్ధాంతం. ప్రపంచములో వ్రాయని జ్ఞానమునే చెప్పుచున్నాము. కనుక మనము చెప్పుచున్న, వ్రాస్తున్న గ్రంథములన్నీ **"సాంద్రసింధూ వేదము"** గా ఉన్నాయనడము సత్యమే. **సాంద్రసింధూ వేదము అంటే దేవునివైపుకు పంపించే జ్ఞానమే కదా!** మరి ఎక్కడా చూడలేదే అంటే, ఆ పేరు కనిపించదు గానీ మేము వ్రాసిన గ్రంథములన్నీ దానినే సూచిస్తున్నవి. ఇదంతా మనల్ని మనము పొగడుకున్నట్లే. అయినా దానికొక ఆధారము మాత్రము ఉంటుంది. సాంద్రసింధూ వేదంలో ఏముంటుంది అంటే, సకల జనులు ఆచరించే పద్ధతి ఉంటుంది. **"సాంద్రసింధూ వేదమార్గమువైపున సకల**

**జనులు నడిచేరయా"** అని కాల జ్ఞానములో వ్రాశారు. సాంద్రసింధూవేదము ప్రతీవారికి ఆమోదయోగ్యమవుతుంది. సకల జనులు అంటే సకల మతాలు కనుక ఎవరైనా తప్పక ఒప్పుకోవలసి వస్తున్నది. ఒక్క సాంద్రసింధూ వేదమైతేనే మూడు మతాలకు సరిపోతుంది. మూడు మతాలవారు ఇప్పుడు ఇక్కడ మేము వ్రాసిన, చెప్పిన విషయములను అంగీకరిస్తున్నారు. కనుక మేమే ఆ సాంద్ర సింధూవేద కర్తలమని చెప్పవలచి వస్తుంది.

"సాంద్రసింధూవేదము"లో వేదము ప్రకృతి సంబంధమైనది. ప్రకృతి సంబంధమునుండే దేవున్ని తెలుసుకోవాలి. ప్రకృతికి సంబంధించినదే గుణచక్రము. ఈ గుణచక్రములో నాలుగో భాగమునుండి తెలుసుకోవాలి సాంద్రసింధూవేద సారాంశము అందులో కలదు. కనుక మధ్యలో ఉన్న ప్రత్యేక గుర్తింపు కల్గిన నెమలి పింఛమును శ్రీకృష్ణుడు తలమీద ధరించాడు. నెమలి పింఛములో బాగుగా కనిపించే భాగము అదే కదా! సాంద్ర అంటే చిక్కనైనది, ఎంత చిక్కగా ఉంటుందో అంత చిక్కన, సింధు అంటే సముద్రము అని అర్థము కలదు. సింధు అంటే జ్ఞానము అని కూడా అర్థము కలదు. సాంద్రత కల్గిన సముద్రములాంటి జ్ఞానమును చెప్పుచున్నాము. సముద్రంలో ఉప్పు సాంద్రత ఎక్కువగా ఉండును. అంటే సాంద్రత కల్గినదే సముద్రము. జ్ఞాన సాంద్రత కల్గిన బోధను మనము పరమాత్మగా చెప్పుకున్నాము.

ఈ విషయాన్ని **"సిలువ దేవుడా"** అనే గ్రంథములో పరమాత్మను సముద్రంతో పోల్చి చెప్పాము. పరమాత్మ నుండి (సముద్రం నుండి) ఏర్పడిన వర్ష బిందువులన్నీ నదులైనాగానీ, అవి నదులే అని చెప్పటం జరిగింది. నదుల్లో ఎటువంటి సాంద్రత లేదు. నీటికున్న ధర్మము నదికి, సముద్రమునకు ఉన్నప్పటికీ, సముద్రము సాంద్రత ఉన్నటువంటిది. నది నీరు సాంద్రత లేనటువంటిది. సాంద్రసింధూ వేదమంటే కేవలము

www.thraithashakam.org

పరమాత్మ గూర్చి స్వచ్ఛముగా చెప్పిన జ్ఞానము కలది. ప్రపంచములో సముద్రము భాగభాగములుగా ఉన్ననూ, అంతటినీ సముద్రమనే అందుము. అన్ని దేశాలచుట్టూ ఆవహించి ఉండేది సముద్రము. నేనంతటా ఉన్నాను, మీరు నాలో ఉన్నారు అని చెప్తున్నది సముద్రము. అదే విధముగా దేవుని మధ్యలోనే, దేవునిలోనే మనము ఉన్నావు. ఈ విధముగా సాంద్రసింధూ వేదం తెలిసినవారు, ఏ మతంలో ఉన్న నిగూఢ విషయాలనైనా చెప్పగలరు. ఎందుకంటే అదే సాంద్రసింధూ వేదమగును. మతాలలో తెలియని విషయములను ఈ సాంద్రసింధూ వేదం తెలియజేస్తుంది. ఒక స్వామి గురించి తెలియవలెనన్న అతను చదివిన పుస్తకాలనైనా చదవాలి, అతను వ్రాసిన పుస్తకములనైనా చదవాలి. అవేవీ చేయకుండా స్వామికేమి తెలుసులే అని తిట్టితే మహాపాపము వస్తుంది. స్వాములంతా దొంగలెట్టవుతారు? స్వామి అని పేరు పెట్టుకున్నవారిలో అజ్ఞానము చెప్పేవారుంటారు. జ్ఞానము చెప్పే వారుంటారు. ఒక పుస్తకములో ఒక పుడక (పుల్ల) పెట్టి చెప్పేది జ్యోతిష్యమే. ఒక చిలుకను ఉపయోగించి అది తీసిన కాగితాన్ని చదివితే అదీ జ్యోతిష్యమే. ఈ విధముగా పంచాంగము చూసి చెప్పేదీ జ్యోతిష్యమే. ఇదంతా జ్యోతిష్యం కాదు. కానీ ఏదో ఒకటి మాత్రము నిజమైన జ్యోతిష్యమై ఉండును. ఈ విధంగా చాలామంది స్వాములు జ్ఞానమని పేరుపెట్టుకుని, వారివారి భుక్తి (ఆహారము) కొరకు వేరేవేరే పనులు చేయవచ్చును. అటువంటివారు కొందరుంటే అందరినీ అదే కోవలో ఉంటారని చెప్పు కోవటం పొరపాటు. ఆ విధంగా చెప్పుకోవటం వలన భరించలేని పాపము వస్తుంది. ఒక పని చేస్తే కనిపించే ఫలితము వస్తుంది, కనిపించని ఫలితము కూడా ఒకటి వస్తుంది. అది పాపమో, పుణ్యమో అయి ఉండును. ఒకమాటో, ఒక పనో మనము చేస్తే అది ఒక పుణ్యానికో, ఒక పాపమునకో దారి తీస్తుంది.

మేము ఏ విధానములో ఉన్నామో ఇతరులకు తెలియనప్పుడు, తెలుసుకొని మాది చెడు విధానమైతే మమ్ములను దూషించినా ఫరవాలేదు కానీ, మంచి విధానమైతే దానిని దూషిస్తే భయంకరమైన పాపము వస్తుంది. మేము హిందూమతములో ఉన్ననూ, మిగతా అన్ని మతాలగూర్చి చెప్పు చున్నాము. అన్ని మతాలలో ఉండే దేవున్ని , ఒకే విధముగా చూస్తున్నాము. మా విధానము అది అయినప్పుడు, దానిని గ్రహించుకోని వ్యక్తులు, ఇతను హిందువు అని ఇతర మతస్థులు ఏదో విషయములో కక్షసాధింపు చర్యగా ఏమి చేయాలి అని వారు చూస్తుంటారు. ఇతర మతస్థులు మతద్వేషం వలన వారు ఆ విధంగా చూశారు అనేది సత్యమైనాగానీ, హిందూమతము లోనే "మాకంటే ఇతను తెలిసినటువంటి వాడా" అని అసూయతో చూసేవారు కొందరున్నారు. మేము ఇంత పెద్ద జ్ఞానాన్ని చెప్తున్ననూ, అంత పెద్ద బ్రహ్మంగారు తన కాలజ్ఞానములో మమ్ములను గొప్పగా చిత్రించి వ్రాసిననూ, మీరే మాత్రము గ్రహించుకోకుండా, చిన్నచూపు చూస్తూ, మమ్మల్ని ఇబ్బంది పెట్టాలని ప్రయత్నం చేస్తే, వారికే నష్టం అవుతుంది. ఇప్పటికీ ఏమీ కాదు. కానీ పాపము మాత్రము మూటకట్టుకున్నట్లే! తరువాత, అది అనుభవించినప్పుడు "నేనేం పాపము చేశానో" అని అనుకుంటే సరిపోదు. ఎవరు ఏదైనా రోగం వచ్చి బాధపడుతూ ఉన్నారంటే తప్పు చేయనిదే శిక్షపడదు. కానీ ఏ తప్పు చేస్తే ఆ శిక్ష పడిందో మాత్రము తెలియదు కనుక ఏ తప్పు చేయకుండా జాగ్రత్తపడవచ్చు కదా! జ్ఞానమును తెలుసుకొని, జ్ఞానమునకు విలువ నివ్వండి. ఆ విధంగా జ్ఞానము తెలిసిన వారికి విలువ ఇవ్వగలరు. ఆ రోజు శ్రీకృష్ణుడు భగవంతునిగా వస్తే ఆయనను హేళనగా కొందరు మాట్లాడారు. అందుకే ఆయన ఒక శ్లోకంలో **"అవజానన్తి మాం మూఢా"** నన్ను మూఢులు అవమానిస్తున్నారు అన్నాడు.

**"మానుషీం తను మా(శ్రితం"** శరీరం ధరించిన నన్ను చూసి, **"పరంభావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్"** నేను ఈ భూతజాలమునన్నిటికీ పెద్దను, అధిపతిని నా మహత్యం తెలియక, మూఢులు నన్ను అవమానం చేస్తున్నారు అని చెప్పాడు.

ఆ విధంగా దేవుడే భూమిమీదకు వచ్చినప్పుడు, మనలాగే ముక్కు, ముఖం ఉన్న మనిషే కదా అని లెక్క లేకుండా మాట్లాడితే భయంకరమైన పాపము వస్తుంది. అది అనుభవించినప్పుడు ఆ పాపము ఎంతటిదో తెలియును. అంతవరకు ఎంత పాపము సంపాదించుకున్నామో ఎవరికీ తెలియదు. మేము కూడా ధైర్యంగానే చెప్తున్నాము. మేము చెప్పిన జ్ఞానము భూమిమీద ఇంతవరకు లేదని, మేము చాలాసార్లు చెప్పాము. మీరు చాలా అదృష్ట వంతులు ఈ జ్ఞానాన్ని వింటున్నారు. పెద్దపెద్ద స్వామీజీలు అంతా ఉన్నారు. వారికి తెలియని జ్ఞానాన్ని మేము చెప్తున్నాము అంటే గొప్పే కదా! గుండెమీద చేయివేసి ధైర్యముగా చెప్పుతున్నాము. ఎవరికీ తెలియని జ్ఞానమును మేము చెప్తున్నాము. ఇంతకు ముందు మేము చెప్పిన విషయములు చెప్పబడి ఉండవు. మరి అటువంటి గొప్ప జ్ఞానము తెలుసు కుంటున్నప్పుడు, మీరెంత గొప్పగా చూడాలి. తెలిసినవారు ఆ విధంగా గొప్పగానే చూసుకుంటున్నారు. కానీ అజ్ఞానులు ఏదో విధంగా ఇబ్బంది పెట్టాలనే చూస్తుంటారు. నిన్నగాక మొన్న ఒక ఎలక్ట్రికల్ ఆఫీసర్ ఒకాయన వచ్చి కరెంటుబిల్లు మీకెందుకు తక్కువ వస్తున్నది? ఇది మందిరం కదా! ఇన్నిలైట్లు, ఇంత హాలు ఉంది, బిల్లు చూస్తే తక్కువ వస్తున్నది అని అడిగాడు. దానికి సమాధానముగా ఇది మందిరమే కానీ రోజూ అన్ని లైట్లు, అన్ని ఫ్యాన్లు వేయరు. నెలకొకమారే వేస్తారు అంటే, అది ఎలాగవుతుంది? లైట్లు, ఫ్యాన్లు లెక్కపెట్టి బిల్లు వేయాలి అన్నాడు. **"నీ అధికారము, నీ**

www.thraithashakam.org

**హోదా కొంతకాలమే, నీ శరీరమే నీ మాట వినని రోజుంది జాగ్రత్త"** అని మేము చెప్పాము కదా! అది వారికి తెలియదు. ఉద్యోగం కొరకు వాడి కాళ్ళు, వీడికాళ్ళు పట్టుకుని ఉద్యోగం వచ్చిన తరువాత, కండ్లు నెత్తి మీదకు పోతాయి. ఆ విధముగా మనుష్యులు తయారయినారు. అప్పుడు మేము మొత్తము ఏడు మీటర్లు పెట్టాము. ఏడు మీటర్లకు వచ్చిన బిల్లు కడుతున్నామంటే, ఎంతైన సరే మీకింకా ఎక్కువ బిల్లే రావాలి అంటాడు. ఏదో ఒకటి మాట్లాడాలి. ఇంకొకడు అంటాడు మీది బైపాస్ ఉన్నట్లు మేము రిపోర్టు వ్రాస్తాము. మీరు అదే అని సంతకం పెట్టండి. ఈ విధముగా మాకు తెలియక పెట్టాము అని వ్రాయండి అంటే మనము ఆ విధంగా చేయకపోయినా ఆ విధంగా చేసినట్లు వ్రాయమంటారు. వాడికేవి కేసులు దొరకక మనము దొంగతనము చేసినట్లు వ్రాసుకుని పోతారంట. మేము రిపోర్టు వ్రాస్తే 20,000 అవుతుంది. లేక మీరు మేము చెప్పినట్లు చేస్తే 5 లేదా 6 వేలతో సరిపోతుంది అంటాడు. అంటే ఏమిటంటే ఐదారువేలు వారికిస్తే సరిపోతుంది. ఈ విధంగా ప్రతి డిపార్టుమెంట్ ఇట్లాగే ఉన్నాయి.

ఈ విధముగా దేవుని వలననే నీవు బ్రతుకుతున్నావు. కనుక నీవు పాపము చేస్తే, దేవుడు వేసే శిక్షలను అనుభవించవలసి వస్తుంది. భయంకరమైన సునామీలు, తుఫాన్‌లు వస్తున్నవి దానిని ఎవరూ ఆపలేరు. ఆ శిక్షలలో ఎవరూ రక్షించేవారుండరు. ఒకరికొకరు దిక్కు తెలియకుండా చనిపోవాలసిన పని వస్తుంది. అది కర్మసిద్ధాంతంలో ఉండే పద్ధతి. కనుక ఇప్పటినుండి ఏ మనిషి నాకు అధికారము ఉంది అని, అధికార అహంకారంతో నేనేమైనా చేయగలను అని అనుకుంటే, నీ అధికారము ఎన్నాళ్ళు ఉంటుంది, కొన్ని రోజులే. తరువాత నీవు దేవుడు అనే అధికారి

చేతిలో ఉన్నావు. కనుక నిన్ను అతను ఇష్టం వచ్చినట్లు చేయగలడు, చేయించగలడు. దక్షిణాఫ్రికాలో పుడితే కట్టుకొనుటకు దుస్తులు కూడా ఉండవు, అక్కడ నిన్ను పుట్టించినాడనుకో మృగముల మధ్యన బ్రతకాల్సి వస్తుంది. ఏ మృగం పట్టుకున్నా నిన్ను చీల్చి, చీల్చి తినేస్తుంది. ఆ విధముగా నీవు ఏ దేశములోనైనా పుట్టవచ్చు, ఏ చిత్రహింసలైన అనుభవించాల్సిన పని వస్తుంది. కనుక ప్రతి మనిషి దేవుని విషయంలో జాగ్రత్తగా ఉండండి. దేవుడు లేడంటారు కొందరు. దేవుడెవడు అతని అడ్రస్ ఏంటి? అంటాడు ఇంకొకడు. ఆయన అనుకుంటే నీ అడ్రస్ ఉంటుందా? నీ అడ్రస్ నీకు ముందు తెలుసునా? ఈ విధంగా మాట్లాడి పాపాన్ని మూట కట్టుకునేందుకే చూస్తున్నారు. దేవుడే దిగివచ్చినా అతన్నే అవమానం చేసేవారున్నారు. అటువంటి వ్యక్తులు మమ్మల్ని కూడా ఇబ్బంది పెడుతున్నారు. మిగతా గ్రహాలు ఏమైనా ఆ విషయాన్ని విన్నా, చూసినా మిమ్మల్ని వెంటాడి చంపేస్తాయి. ఆ విధంగా కర్మ మూటకట్టుకుని, భయంకరమైన పాపాల్ని అనుభవించుటకు జన్మింప పనివస్తుంది. మనము ఎక్కడా తోక తిప్పినాగానీ, జ్ఞానమువద్ద, దేవునివద్ద తోక తిప్పరాదు, అహంకారంగా ప్రవర్తించరాదు. జ్ఞానులను చిన్నతనంగా చూడరాదు, చూస్తే భయంకరమైన పాపము వచ్చును.

# 49. కలియుగము

<u>తేది : 09-01-2012</u>

ప్రతీ నెల మేము చెప్పు ఉపన్యాసములలో ప్రతీసారి ప్రపంచములో ఎవ్వరూ చెప్పని క్రొత్త విషయాన్నే చెప్తూ వచ్చాము. మేము చెప్పే విషయాలు ఇంతకుముందు ఎవరూ చెప్పనివై ఉంటాయి. లేదా ఎవరైనా సరిగ్గా

చెప్పకపోయినా వాటిని సవరించి సరిగ్గా చెప్పటం జరుగును. ఒక స్వీట్ స్టాల్‌లో అన్నీ స్వీట్స్ ఉన్నప్పటికీ, ఒక్కొక్క స్వీట్‌లో ఉండే రుచి కొద్దిగానైనా తేడా ఉండును. వందమంది వాటిని తిని 99 మంది తియ్యగా ఉన్నాయని, ఒక్కరు మాత్రము తియ్యగా లేవు ఇవి అన్నాడనుకోండి. అప్పుడు వాడిని ఏమనాలి. వాడికి రోగము వచ్చిందనో లేక వాడి నాలుక రుచిని గ్రహించలేకపోతోందనో అనుకోవాలి. లేదా వాడు ఆ స్వీట్స్ పూర్తిగా అసలు తినకుండా అయినా అలా చెప్పి ఉండాలి. ఆ విధంగానే కొందరు మేము వ్రాసిన గ్రంథాలు చూసి, మేము చెప్పిన బోధలు చూసి కొందరు అసూయపడుచున్నారు. ప్రజలలో కొందరు ప్రపంచములోనే తెలియని విషయాలివి మనకు తెలుస్తున్నాయని సంతోషపడుతూ ఉంటే, బోధకులుగా ఉన్న కొందరు అసూయపడి ఇందులో ఏమి సారంశముందని, అంటూ మమ్మల్ని విమర్శిస్తున్నారు. అటువంటి వారికి మైండ్ (బుర్ర) పని చేయలేదు అని అనుకోవాలి అటువంటి వారిని లెక్క పెట్టాల్సిన అవసరము లేదు. కానీ అటువంటి వారు మా గ్రంథాన్ని ఏది చదివినా సరే తప్పకుండా మారుతాడు. ఒకవేళ అసూయతో బయటికి మాట్లాడినాగానీ లోపల హృదయంలో ఒప్పుకొని తీరవలసిందే. ఎందుకంటే ఇవి క్రొత్త బోధలు అని ఒప్పుకొని తీరవలసిందే. అటువంటి బోధలు దేవుడు మాకు అందిస్తున్నాడు. మేము మీకు అందిస్తున్నాము. కాలము దైవస్వరూపము. "మీరెవరు?" అని భగవద్గీతలో శ్రీకృష్ణున్ని అర్జునుడు అడిగితే విశ్వరూప సందర్శన యోగంలో **"కాలోస్మి"** నేను కాలాన్ని అన్నాడు. మనముందరే ఆ కాలము ఉన్నప్పటికీ దానిని మనము చూడలేము. అలాగే కాల స్వరూపమైన దేవున్ని కూడా చూడలేము. దేవున్ని ఎవ్వరూ చూడలేరు. కాలాన్ని ఎవ్వరూ చూడలేనట్టు దేవున్ని ఎవ్వరూ చూడలేరు. కాని కాలాన్ని

www.thraithashakam.org

నాలుగు భాగములుగా విభజించారు. వేయి యుగములు ఒక పగలు, వేయి యుగములు ఒక రాత్రి అని చెప్పారు.

వారానికి ఏడు రోజులున్నట్లే ఆదివారము మొదలై శనివారంతో అంత్యమైనట్లుగానే, యుగములకు నాలుగు పేర్లు గలవు. కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము మరియు కలియుగము. ఈ విధంగా నాలుగు యుగములకు పేర్లు పెట్టబడినవి. కలియుగము అన్నిటికంటే చిన్నది 4,32,000 సంవత్సరములు కేటాయించబడినవి. దానికంటే పెద్దది ద్వాపరయుగము 8,64,000 సంవత్సరములు. ద్వాపరయుగముకంటే పెద్దది, మూడు కలియుగాల కాలం కలిపితే వచ్చే కాలము త్రేతాయుగము 12,96,000 సంవత్సరములు అగును. ఇక అన్నిటికంటే పెద్దది కృతయుగము 17,28,000 సంవత్సరములు. వీటన్నింటినీ కలిపితే అంటే ఇప్పుడున్న కలియుగము కాలానికి 4,32,000 సంవత్సరములకు పదింతలు 43,20,000 సంవత్సరములు అగును. ఈ నాలుగు యుగాలు 250 మార్లు జరిగితే దేవునికి ఒక పగలు అగును. ఈ విషయం అందరికీ తెలుసు. దీనిలో క్రొత్తదనము లేదు. అయితే ఇప్పుడున్నటువంటి కృతయుగము, త్రేతా యుగము, ద్వాపరయుగము, కలియుగము అనే మాటలలో ఏమైనా మార్పు జరిగినవా అని మనము చూసినట్లైన, **కాలము దైవస్వరూపము** కనుక వాటికి దేవుని పేర్లే పెట్టబడి ఉన్నవి. కృతయుగము అని మనము అంటున్నాము. కానీ అది తప్పు 'కృత' అంటే చేయబడినటు వంటిది, 'కృత్' అంటే చేసినవాడు దేవుడు. చేయబడినది ప్రపంచము. మనము ఏమి చెప్పుచున్నాము ప్రపంచము పేరు చెప్పుచున్నాము. దేవుని పేరు చెప్పడములేదు. అది కాలము కనుక దేవుని పేరే పెట్టాలి. కృత్ యుగము అయితే అది చివరికి పలకడంలో కృతయుగము అయిపోయింది.

సృష్టించినవాడు సృష్టికర్త అయితే సృష్టింపబడినది సృష్టి. సృష్టించినవాడు 'కృత్', సృష్టింపబడినది కృత మరి కృత్ సత్యమా కృత సత్యమా అంటే 'కృత్‌యుగము' సత్యము.

ఇక రెండవది త్రేతాయుగము. త్రేతా అంటే అర్థమే లేదు దాని పేరు త్రైతాయుగము అని ఉండేది. త్రైతా అంటే మూడు అంటే మూడుగా విభజింపబడినది. దేవుడు మూడుగా విభజింపబడినాడు. కాలము కూడా మూడు భాగములుగా విభజింపబడినది. వర్తమాన కాలము, భూతకాలము, భవిష్యత్ కాలము. దేవుడు జీవాత్మ, ఆత్మ, పరమాత్మలుగా విభజింపబడినట్లు, కాలముకూడా మూడు భాగములుగా ఉన్నది. కృతయుగమును, కృత్ యుగముగా, త్రేతా యుగమును త్రైతాయుగముగా సవరించి ఇంతవరకూ ఎవ్వరూ చెప్పలేదు. చెప్పేది ఇక్కడినుండే జరుగుచున్నది. దేవుని హోదాకు ఏ విధమైన భంగము వాటిల్లకుండా ఉన్న పేర్లుగా ఉన్నవి. కృత్‌యుగము, త్రైతాయగముగా చెప్పబడినవి.

ఇక ద్వాపర అంటే రెండింటికి వేరుగా ఉండేది 'ద్వా' అంటే రెండు 'పర', అంటే వేరుగా ఉండేది. అంటే జీవాత్మ, ఆత్మ కానటువంటిది, ఏది? ద్వాపర ఎవరు? పరమాత్మ) ఈ విషయం మన హస్తంలో కూడా పెట్టబడింది. రెండు గీతలు మన చేతిలో కలిసి ఉండి ఒక గీత (రేఖ) మాత్రము అలా కాకుండా వేరుగా ఉన్నట్లు మనము చూడవచ్చు కనుక ద్వాపర అని కాలానికి దేవునిపేరే పెట్టబడినది. కాలము దైవస్వరూపము కావున కాలానికి దేవుని పేర్లే పెట్టినారు. దైవ స్వరూపమునకు వ్యతిరేఖముగా ఏ పేర్లు లేవు.

ఇక చివరిదైన కలియుగమును తీసుకుంటే, కలి అనగా నాశనము, కలిపురుషుడు అంటే నాశనము చేయువాడు. దేవుడు 'కాలోస్మి' అనే మాటను చెప్పిన ప్రక్కనే 'లోకక్షయో' అని నాశనము చేయువాడను నేనే

www.thraithashakam.org

అని చెప్పబడింది. ఆ విధంగా నేను కాలాన్ని నేను వృద్ధి చేయుచున్నాను, నాశనమూ చేయుచున్నాను అని అదే శ్లోకములో చెప్పెను. సృష్ఠించే వాడెవడు? దేవుడు. నాశనము చేసేవాడెవడు? దేవుడు. పాలించేవాడెవడు? దేవుడే. సృష్ఠి, స్థితి, లయకర్త దేవుడు. అందుకు సృష్ఠికి మొదటికర్త అయిన దేవుని పేరుతో 'కృత్ యుగము' అని వచ్చింది. సృష్ఠిని తయారు చేసినటువంటి వాడు అని ముందు పెట్టబడింది. చివరిలో నాశనము చేసేవాడూ దేవుడే అని కలియుగమని చివరిలో పేరు పెట్టెను. ఈ విధంగా మొదట్లో 'కృత్' అని పెట్టడానికి చివరిలో 'కలి' అని పెట్టడానికీ అర్థమున్నది. అంటే పుట్టించేవాడూ ఆయనే, చంపేవాడూ ఆయనే

దేవున్ని కృపాసాగరుడు, కరుణా మయుడు అని అంటే ఏమవు తుంది? అవి వర్తించవు. కృప, కరుణ మన తలకాయల్లో ఉన్నాయి. దేవునికి తలకాయేలేదు కనుక కృప, దయ, ఏమీ ఉండవు. ఆ విధముగా చెప్తే తప్పు అవుతుంది. దేవున్ని ఒక మనిషిగా లెక్కగట్టినట్టుగును. దేవుడు ఇదే అని నిర్ధిష్ఠంగా చెప్పటానికి లేదు. ద్వా+పర అంటే రెండింటికి పరంగా ఉండేవాడు అనే తప్ప ఇలాంటివాడు అనుటకు వీలులేదు. పేరులేదు. కలియుగము అంటే కలి అంటే నాశనము చేసేవాడు, ఎవరు? దేవుడు. ఇది అతను ఉన్నాడు అనుటకు చిహ్నము లేదా గుర్తు మాత్రమే కానీ అది అతని పేరు కాదు. అతని హొదాకు సంబంధించిన గుర్తు. కాలము దైవస్వరూపము కావున కాలమునకు దైవసంబంధ పేర్లే పెట్టినాము.

ఇప్పుడు దేవుని గూర్చి జ్ఞానము మనము ఎందుకు చెప్పు కుంటున్నాము? అంటే దేవునిలో కలిసిపోయేందుకు. జన్మరాహిత్యం చేసుకోవాలి. జన్మలు లేకుండా ఎక్కడకు పోవాలి? దేవునిలోకి ఐక్యం కావాలి. 'దేవుడు' అను పదము తర్వాత, అతనిలోకి ఐక్యం కావాలి అనేది

రెండవ పదమై ఉండవలెను. ఆ విధంగా ఉండేందుకు పూర్వపు పెద్దలు ఏమి చేశారంటే, 'దేవుడు' అనే పేరు ఎప్పుడైతే వస్తుందో అప్పుడు వెంటనే వారు 'యోగము' అనే పదము వాడేవారు. కృత్ అంటే దేవుడు సృష్టించేవాడు వాడిలోనికి నువ్వు కలిసిపో దానినే 'యోగము' అంటారు. "కృత్ యోగము", కృతయుగము కాదు. ఈ కృతయుగము అనునది మధ్యలో మార్పుచెందినది. 'యోగము' అనే పదము పోయి యుగము అనే పదముగా మారిపోయింది. ఇంతవరకు ఎవ్వరూ దీన్ని సవరించి చెప్పలేదు. ఇక్కడనుండే చెప్పబడుచున్నది. అందుకు మీరు జ్ఞాపకం పెట్టుకోండి. ఇదేమి ఇందులో ఏమి సారాంశముంది, ఏమి రుచివుంది అంటే, నీ తలకాయ చెడిపోయిందని అర్థము. ఈ విధముగా అసలు విషయాన్ని చెప్తే ఓర్చుకోలేక పోతున్నారు.

దేవుడు అనే పదము వచ్చిందంటే, దానిలో కలిసిపో అనే అర్థము ప్రక్కన ఉండి తీరాలి, అది శాసనము. కనుక కృత్ అంటే సృష్టించినవాడిలోకే నేను కలిసిపోవాలి అనే అర్థము వచ్చేటట్లు 'కృత్ యోగము' అని నేను ఉచ్ఛరించుకోవలెను. "కృతయుగము" అనే అర్థహీనమైన మాటను చెప్పకూడదు. ఇటువంటి పొరపాట్లు ఎక్కడైనా ఉంటే వాటిని సవరించి చెప్పటం మా వంతు, కావున మేము చెప్పవలసిన పని వచ్చింది. తరువాత త్రైతా అంటే మూడవ వాడు, అంటే ఎవరు? పురుషోత్తముడు అని జ్ఞాపకము చేసుకోవాలి. క్షరుడు అక్షరుడు అను ఇద్దరు పురుషులున్నారు. ఇద్దరి పురుషులకంటే ఉత్తమమైన ఇంకొక పురుషుడు ఉన్నాడు, వాడే పురుషోత్తముడు, మూడవవాడు. ఆ మూడవవాడు ఎవరైతే ఉన్నాడో వాడిని త్రైతా అన్నారు అంటే మూడవవాడు. దేవుడిలో కలిసిపో అనే విధంగా "త్రైతాయోగము" అని అన్నారు. నేడు త్రైతా యోగము పోయి, 'త్రేతా

యుగము' అయింది. పెద్దపెద్ద వారంతా ఇట్లాగే చెప్పుచున్నారు. సామాన్యులను విడిచిపెడితే, మేము జ్ఞానులము, పండితులము, యోగులము అని రకరకములుగా ఉండే, వాళ్ళంతా యుగము అంటున్నారుంటే, ఇది యోగము అని ఎందుకు కనుగొనలేకపోయారో? ఏవో అర్థములేని మాటలు చెప్తూ కాలాన్ని వ్యర్థం చేసుకుంటున్నారు. అటువంటి పరిస్థితి మనకు రాకూడదు. అందరికీ మంచి జ్ఞానము తెలియాలని ఉద్దేశ్యముతో మేము ఈ వివరము మీకు చెప్పాల్సిన పని వచ్చింది.

ఇక 'ద్వాపర' అనే పదము అలాగే ఉందికాని యోగము అనే పదము మారిపోయి 'ద్వాపరయుగము' అయిపోయిది. మేము ఇప్పుడు 'కలియుగము' అనే గ్రంథము వ్రాశాము. 'కలియుగమనే' పేరు పెట్టాము. కలియోగము అని పెడితే అదేదో అనుకుంటారు. 'కలియుగము' అంటే ఇదేదో కలియుగమట, మనకు తెలిసిన కలియుగము గురించి ఏమి వ్రాశారో చూద్దాం అని చూస్తారు. కనుక మీ భాషనే నేను మాట్లాడాల్సిన పని వచ్చింది. అలా మాట్లాడకపోతే మీకు అర్థము కాదు. గ్రంథములోపల మాత్రము అసలైన 'కలియోగము' అనే దానిని గూర్చి చెప్పటం జరిగింది. కాలము ఎన్ని రకములుగా విభజింపబడింది? మూడు రకములుగా, దేవుడు మూడు రకములుగా విభజింపబడినాడు (క్షర, అక్షర, పురుషోత్తములు) కాలమును కూడా భూతకాలము అన్నారు. ఇక్కడ భూతము అంటే జీవుడు కనుక భూతకాలము, జీవుని కాలము. ఇప్పుడు క్షణక్షణము నడిపిస్తున్న వర్తమాన కాలము కలదు. దానిని నడిపించు ఆత్మకలదు ఆత్మకాలము. ఇక భవిష్యత్‌కాలము, అది దేవుని కాలము ఎందుకంటే అది ఏ విధంగా జరుగుతుందో ఎవ్వరికీ తెలియదు. దేవుడు ఏ విధంగా ఉంటాడో తెలియదు, భవిష్యత్తు తెలియదు. ఆ కాలన్నే దేవుని కాలంగా, భవిష్యత్తు కాలంగా

చెప్పబడింది. చూడండి! మూడు కాలములు చాలా బాగా సరిపోయినవి కదా! మూడు ఆత్మలున్నవి, మూడు ఆత్మలకు సంబంధించిన కాలముల విభజన ఉంది. ఈ విధముగా కాలము అను దానికి క్రొత్త అర్థాన్ని ఇస్తూ ఆ పేర్లు కూడా ప్రత్యేకముగా పెట్టబడినవి.

ఇటువంటి నాలుగు కృత్, త్రైతా, ద్వాపర, కలియోగములు 250 సార్లు జరిగితే వేయియుగములు అవుతాయి. ఈ వెయ్యి (యో) యుగాలైతే ఒక ప్రళయమవుతుంది, ప్రళయం వస్తుంది. మరొక వెయ్యియుగముల కాలము ఈ ప్రపంచం ఉండదు. అంటే ఉన్నదంతా నాశనమవుతుంది. లయము అంటే ఉన్నది లేకుండా పోయేది ప్రభవము అంటే లేనిది అక్కడ ఉండేది, పుట్టేది. ఈ విధముగా ప్రభవము మరియు ప్రళయము అని పేర్లు పెట్టినారు. వేయియోగాల కాలము ప్రభవము ఉంటుంది, మరొక వేయి యోగాల కాలము ప్రళయం ఉంటుంది. కాలములో ప్రభవ కాలమునే పగలు అంటారు. ప్రళయ కాలమును రాత్రి అంటారు. దేవునికి ఒక పగలు + ఒక రాత్రి కలిపి ఒక దినమైనట్లు లెక్క. మరి ఇప్పుడొక ప్రశ్న వస్తుంది. అదేమంటే దేవునికి ఒక పగలు ఒక రాత్రి అని చెప్పితే ఒక దినము అని చెప్పి, దేవుడు ఒక అంచనాకు దొరికినట్లయింది కదా! ఆయన ఆయుష్షు ఎంత ఉందో తెలియదుగానీ అతని ఆయుష్షులో ఒక రోజు తరిగినట్లు తెలుస్తుంది కదా! మనకి ఉన్నట్లే దేవునికీ లెక్కాచారము ఉంది. మనకి ఉన్నట్లే అతనికీ ఆయుష్షు ఉంది. ఎంతో తెలియదు. కానీ ఒకరోజు ఆయుష్షు అయినట్లు తెలుస్తున్నది కదా! ఏదో ఒకరోజు ఆయన ఆయుష్షు అయిపోతుంది కదా! మరి ఆయన కూడా మనలాగ చనిపోవాల్సిన పని వస్తుంది కదా! అని మన ప్రశ్న రావచ్చును.

www.thraithashakam.org

అందుకు ఇప్పుడు మనమేమి చెప్తున్నామంటే **"దేవుడు నిజంగా లేడు కానీ అబద్ధంగా ఉన్నాడు.** ఇప్పుడు "నిజంగా, అబద్ధంగా" అనే పదములను తీసివేస్తే "దేవుడు లేడు", "దేవుడు ఉన్నాడు" అనే పదములు మిగులును. ఆయన ఎటువంటివాడు 'రూప, నామ, క్రియా రహితుడు'. అంటే పేరూ లేదు, పనిలేదూ, రూపము అంతకూ లేదు. పోనీ ఎలాగో ఉన్నాడు గానీ అతనికో రోజు గడిచిపోయినట్లే కదా! అని మనము అనుకూంటే 'అజోపి' అని భగవద్గీతలో అంటాడు. అంటే నాకు పుట్టుకే లేదంటాడు. ఇక ఆయుష్షు గడిచిపోవటమెప్పుడు? అతను పుడితే కదా! గడిచిపోయేది. మరి ఇవన్నీ ఎందుకు చెప్పినారన్న ప్రశ్న వస్తుంది? ఇది శాస్త్రబద్ధమైన మరియు హేతుబద్ధమైన ప్రశ్న. మరి దీనికి జవాబు ఏమంటే మనకు బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములు మన శిరస్సునందు కలవు. మనము దీనినే నుదుటిపైనే ధరించాము. వీటిలో మొదటిచక్రము బ్రహ్మచక్రము. ఈ బ్రహ్మచక్రము రెండు భాగములుగా కలదు. ఒక భాగము ప్రపంచము సృష్ఠి, ఒక భాగము ప్రపంచము లయము అని చెప్పాము. అంటే ఒక చుట్టు తిరిగితే అంటే 2000 (యో) యుగములు కాలమగును. అంటే సగము చుట్టు పగలుగా ఉంది, సగము చుట్టు రాత్రిగా ఉంది. ఎవరికి, జీవునికి? దేవునికి ఆ చక్రాలు లేవు, తిరగడం లేదు. కాబట్టి **ఆ లెక్క నీకు, దేవునికి కాదు.** నీ ఆయుస్సును తెలుసుకునేందుకు ఆ విధంగా ఉంది తప్ప, దేవునికి ఆయుష్షు లేదు. దేవుడు ఏమీ లేనటువంటివాడు, ఏమీ కానటువంటివాడు. దేవుడు శక్తిమయుడు, యుక్తిమయుడు. మన దగ్గర ఒక్కటి కూడా లేదు. ఈ ప్రపంచములో దేవున్ని ఎవ్వరూ చూడలేదు కనుక ఈయన ఫలానా అని ఇంత ఆయుష్షు ఉందని చెప్పేందుకు అవకాశము లేదు. మరి ఈ రాత్రి,

పగలు లెక్కలు ఎవరి గురించి చెప్పినవి? అంటే మనగురించి చెప్పినవి. 4,32,000 సంవత్సరములు కలియుగము అని చెప్పితే, ఈ 4,32,000 సంవత్సరములను హెచ్చించుకుంటూ పోతే, నాలుగు యుగాల కాలము పదింతలు ఎక్కువైతే ఎంతైతే ఉందో, జీవుని కాలము కూడా అంతే ఉంది. దేవుడు మూడు రకములుగా ఉన్నాడు అని మనము చెప్పుకున్నప్పుడు ప్రత్యక్షంగా మూడు రకములుగా ఉండేటట్లు మనుషులను ఏర్పాటు చేశాడు. దేవుడు ఇలా ఉన్నాడని ఎట్లైతే చెప్పినాడో ఆ విధానము మీకు తెలియాలంటే, ఆ మాట మీకు సత్యం కావాలంటే బయటికి కనిపించి తీరాలి. ప్రత్యక్షంగా దానికొరకు పురుషుణ్ణి, స్త్రీని మరియు నపుంసకులను సృష్టించాడు.

నేను పురుషుణ్ణి, నేను ప్రకృతితో కలిస్తే పుట్టినటువంటివాడు జీవాత్మ. ప్రపంచములో ఏ జీవరాశి పుట్టినన్నూ, వారికి తల్లి ప్రకృతి, తండ్రి పరమాత్మ. ఇక్కడ కూడా మూడు రకముల స్థితిగతులను చూపించినాడు. బిడ్డలకు తల్లిదండ్రుల పోలికలు వచ్చునట్లు చేశాడు. మనలో ప్రకృతి, పురుషుల లక్షణములు ఉన్నవి. కానీ వాటిని మనము గుర్తించలేకున్నాము. కనుక పగలు, రాత్రులు మనకు ఉన్నవి. పగలు ప్రపంచము వ్యక్తం అవుతున్నది. రాత్రి ప్రపంచము వ్యక్తము కాలేదు. అప్పుడు నువ్వు అనే వాడివి లేనే లేవు. వ్యక్తం అయినవాడు అవ్యక్తం అయినాడు. రాత్రి నిద్రపోయి పగలు మేల్కొంటున్నారు. దేవుడు కలియుగాన్ని 4,32,000 సంవత్సరముల కాలంగా పెట్టారు కదా! రోజులో 12 గంటల కాలమునకు 43 వేల సెకండ్లు అవుతాయి. పది దినములలో ఉండే పది పగలు కాలమునకు 4,32,000 సెకెండ్లు. 20 రోజుల పగలు కాలమునకు 8,64,000 సెకండ్లు అవుతాయి. 40 రోజులకు వచ్చే పగటి కాలపు మొత్తం సెకండ్లకు కృతయుగ కాలం సరిపోతుంది. ఈ విధంగా

www.thraithashakam.org

నూరు పగటి కాలములు 43 లక్షల 20వేల సెకండ్లు. ఈ విధంగా 108 కోట్ల సంవత్సరములు ఒక పగలు అన్నాము కదా! అలాగే 108 కోట్ల సెకెండ్లు నీకు ఒక పగలుగా గుర్తింపబడుతూ ఉంది. జీవులకు కర్మదినంగా సరిపోతుంది.

జీవునికి కర్మవుంది కనుక కర్మదినము అంటున్నాము. దేవునికి కర్మలేదు కావున దినము అన్నాము. నీకుండే కర్మ దినాన్ని చెప్పడము కొరకు ఆ విధముగా చెప్పబడిందిగానీ దేవుని గురించి చెప్పినది కాదు. మేము **"కలియుగము"** అనే గ్రంథమును కూడా వ్రాశాము. అందులో ఈ లెక్క అంతా వ్రాశాము చూడండి. 108 కోట్ల సెకండ్లు నీకు ఒక కర్మదినము అవుతున్నది. 108 కోట్ల సెకండ్లు అంటే ఎంత కాలమవుతుంది? 69 సంవత్సరముల 5 నెలల పది రోజుల వరకు పనులు చేస్తూ, పాప పుణ్యములను సంపాదించుకుంటూ వుంటావు. ఒక పని చేస్తే కనిపించ కుండా వచ్చే పాప పుణ్యమలు. కనిపించే ఫలితము డబ్బుగానీ, దాన్యంగానీ వస్తాయి. ఈ పాప, పుణ్యములను ఆగామికర్మ అంటాము. ఒక జన్మలో క్రొత్తగా సంపాదించుకునే కర్మను **ఆగామికర్మ** అంటున్నాము. ఈ జన్మలో అనుభవించాల్సిన కర్మను **ప్రారబ్ధకర్మ** అంటాము. ఆ విధంగా ప్రారబ్ధము గాక, ఆగామికర్మ కాకుండా మిగిలివున్న కర్మను సంచితకర్మ అంటారు. ఇవన్నీ తెలిసినప్పటికీ, క్రొత్త విషయమేమంటే కర్మదినము అనేది అంటే ఎవరైనా 69 సంవత్సరాల 5 నెలల పదిరోజులు కర్మను సంపాదించుకోవటం జరిగిన తరువాత ,అంటే **69 సంవత్సరాల, 5 నెలల పదిరోజుల అనంతరం ఆగామికర్మంతా సంచితంలోకి చేరును.** అంత వరకు ఆగామికర్మగానే ఉంటుంది. ఇది క్రొత్త విషయం. మరలా జన్మ తీసుకున్నప్పుడు ప్రారబ్ధము నిర్ణయించబడుతుంది. ఎక్కడనుండి అనగా సంచితంనుండి. ఇప్పుడు

ఈ లెక్కంతా మనిషికే సంబంధముగానీ దేవునికి కాదు కనుక ఆయనకు ఆయుష్షు లేదు. నీ కర్మను నిర్ణయించి పెట్టేందుకే ఈ లెక్క. జీవునితో సంబంధమంతా మొదలవుతున్నది. జీవుడు ఎక్కడున్నాడు? గుణములలో, గుణచక్రములో ఉన్నాడు. 6 మంచివి, 6 చెడ్డవి మొత్తము 12 గుణములు కలవు. 12 గుణములు 9 భాగములుగా విభజింపబడినవి. సంఖ్యలో 9 పెద్దది కనుక 9 భాగములుగా విభజింపబడినవి. 108 గుణములు కలవు. ఇక్కడ 108 లెక్క మొదలైంది. కాలములో పెద్దదది సంవత్సరం, చిన్నది సెకండు. చిన్నగా చెప్పుకునే జీవుని కాలాన్ని కూడా కాలానికి చిన్నగా చెప్పుకునే సెకండ్లతోనే 108 కోట్ల సెకండ్ల కాలంగా చెప్పి, దానిని జీవునికి 69 సంవత్సరాల, 5 నెలల పదిరోజుల కాలాన్ని ఒక కర్మదినంగా చెప్పబడింది. అందరికంటే పెద్ద దేవుడే అనే దానికి పెద్దదైన సంవత్సరములో ఆయనను సూచించి చెప్పుచున్నాము. 108 కోట్ల సంవత్సరములు ఒక పగలు అంటే, 108 కోట్ల సెకండ్లు మనకు ఒక పగలు, ఏ పగలు అంటే కర్మ అనే పగలు. అనగా ఆగామికర్మ సంచితకర్మగా మారేందుకు పట్టే సమయాన్ని ఒక కర్మపగలుగా నిర్ణయించబడింది.

కలియుగము అని పేరు ఉన్నట్లుగానే కలియుగాంతము అనే పేరు కూడా కలదు. ఈ మధ్య 2012వ సంవత్సరములోనే కలియుగం అంతమయిపోతుంది అని చెప్పారు. టీవీలో చర్చకూడా పెట్టి, ఈ సంవత్సరము తప్పకుండా కలియుగము అంతమయిపోతుంది అని చెప్పారు. ఇది వాస్తవమా? కాదా? అని కొందరు అడిగారు. మీరు జ్ఞానము చెప్పుచుంటారు కదా! తెలియని రహస్యములెల్ల చెప్పుచుంటారు కదా! మరి ఈ కలియుగం పోతుంది అంటున్నారే? పోతుందా? అని మమ్మల్ని అడిగినారు. ఆ చర్చలో కలియుగం 4,32,000 సంవత్సరాలు, ఇప్పటికి

5,150 సంవత్సరాలు అయింది ఇంకా చాలా ఉంది. కనుక 4,32,000 సంవత్సరాలు అయిన తరువాత కలియుగం అంతము అయిపోతుంది అని ఒక వ్యక్తి చెప్పుచున్నాడు. ఆ మాట వాస్తవమే అయితే మనము విభిన్నముగా, వెరైటీగా చెప్పాలి ఈ ప్రపంచలో ఏ విధంగా అయితే ఉందో, ఎన్ని యుగాలు గడిచినా, ఎంతకాలము గడిచినా ఈ విధంగానే ఉంటుంది. మీరందరూ అనుకున్న ప్రళయం రాదు. మీరనుకున్న ప్రళయం ఎప్పటికీ రాదు. అదేమి వేయియుగాలు అయిన తరువాత ప్రళయం వస్తుందని మీరు కూడా చెప్పారు కదా! అంటే మీరు అనుకుంటున్నట్టు మాత్రము కాదు. భూమి ఆకాశము ఒకటి అయిపోయి అంతా సర్వనాశనము అయిపోతుంది అని అందరూ అంటున్నారు కదా! ఆ విధంగా కాదు అని మేము అంటున్నాము. ప్రళయము వస్తుందని మేమూ చెప్పుచున్నాము. ఏమీ లేకుండా పోతుంది అని మేమూ చెప్పుచున్నాము కానీ మీకు మాత్రము అది అర్థము కావటం లేదు. దేవుడు ఏది చెప్పాడో అదే మేమూ చెప్పుచున్నాము. **"కలియుగము ఎప్పటికీ యుగాంతము కాదు"** ఈ విషయాన్నే మేము **'కలియుగము'** అనే గ్రంథములో పూర్తి వివరణ ఇచ్చాము. 108 కోట్ల సంవత్సరములు ఒక పగలు అని చెప్పటం నిజమే, తరువాత ప్రళయం రావటం నిజమే, తరువాత ప్రభవం జరగటం నిజమే కానీ ప్రళయం రావటం మీరనుకున్నట్టు మాత్రము రాదు. ఇదేమి క్రొత్తగా ఉంది? అంటే క్రొత్తగా ఉండేదే జ్ఞానమంటాము. 250 మార్లు ఈ కలియుగము వస్తే, 250వ మారైనా అంతమై పోవాలి కదా! అప్పుడది యుగాంతము అవుతుంది కదా! అని మీరు అనుకోవచ్చు. అలా అర్థము చేసుకోకూడదు. కలియుగము ఎప్పటికీ యుగాంతము కాదు, అంతమై పోతుంది అనుకోవటం పొరపాటు.

నేనొక వ్యక్తిని భగవద్గీతలో ఏ అధ్యాయాన్ని చదువుచున్నావు అనే ఉద్దేశ్యంతో, భగవద్గీత ఎక్కడ చదువుచున్నావు అని అడిగాను. అంటే ఇంట్లోనే చదువుచున్నాను అని ఆ వ్యక్తి సమాధానము చెప్పాడు. ఇంట్లో కాకపోతే వీధిలోనూ, బజారులోనూ చదువుతారా? అతనికి అతనిమాట కరెక్టే, నాకు మాత్రము తప్పు. నా ఉద్దేశ్యము వేరు, అతని సమాధానము వేరు. చాలామంది చాలా విషయాలలో పొరపడుచున్నారు కానీ సందర్భము అనుసరించి అర్థము చేసుకోవలెను. ఈ విధంగా తప్పుగా అర్థము చేసుకోవటం వలన జ్ఞానము అంతా అర్థము కాకుండా పోయింది. కనుక కాలానికి అంతంలేదు, దేవునికి అంతం లేదు కనుక కలియుగము ఎప్పటికీ అంతము కాదు. ఈ విషయాన్ని మీరు "కలియుగము" గ్రంథంలో వివరంగా వుంది తెలుసుకోండి.

## 50. దివ్య ఖురాన్ - హదీస్

తేది : 07-02-2012

ఇస్లామ్ మతములో ప్రత్యేకించి ఒక గ్రంథము ఉంది. అది పవిత్ర ఖురాన్ గ్రంథము. అది దైవగ్రంథము, దేవునికి సంబంధించిన సంపూర్ణ సమాచారము అందులో ఉంది. దేవునికి సంబంధించిన సంపూర్ణ సమాచారము ఇం(హి)దూ మతములో భగవద్గీతయందు, క్రైస్తవ మతములో బైబిలుయందు, ఇస్లామ్ మతములో పవిత్ర ఖురాన్‌యందు చెప్పబడి ఉండగా, ప్రతీ మతములో ఉన్నటువంటి వారు, మా దేవుడు ప్రత్యేకమైనటు వంటి వాడు, అని అనుకుంటున్నారు. ప్రతీ మతంలోనూ సృష్ఠికర్త దేవుడే అంటున్నారు. అలా అంటూనే మమ్మల్నందరినీ సృష్ఠించినవాడు మా దేవుడు, మిమ్మల్ని సృష్ఠించినవాడు మీ దేవుడు అంటున్నారు. ఇది చాలా

www.thraithashakam.org

పొరపాటు. ఈ విధంగా భావములలో తేడావచ్చి, ద్వేషాలు తెచ్చిపెట్టుకొని ఒకరినొకరు హింసించుకునే స్థితికి వచ్చారు. ఇది మంచి పద్ధతి కాదు. మీ దేవుడే మా దేవుడు మేమూ, మీరు ఒక్కటే అనే ఐకమత్యం కలిగివుండవలెను. ఒక మతములోనున్నవారు ఇంకొకరి మతములో ఉన్న గ్రంథములను తెలుసుకుంటూ, మమేకం అయి దేవుని గురించి తెలుసుకోవాలని ఎవ్వరూ చేయలేని పనిని మేము చేస్తున్నాము. ఎవరి మతము గురించి వారు చెప్పుచున్నారు. ఒక హిందూమతస్థుడు ఇస్లామ్ మతము గురించి చెప్పడమేమిటి? అంటే 'ఇందూ' అంటే జ్ఞాని కనుక జ్ఞానికి ఏ మతంలో జ్ఞానాన్నైనా తెలుసుకునే అర్హత ఉంది. పవిత్ర ఖురాన్ గ్రంథములో ఈ జ్ఞానమంతా సర్వమానవాళిది అంటే అందరిదీ. ఇది ముస్లీమ్‌ల గ్రంథమే అంటే ఎట్లా అవుతుంది? ఈ గ్రంథములో ఉన్న జ్ఞానము ప్రతీ ఇందువుకీ, క్రైస్తవునికీ మరియు ప్రతీ ముస్లీమ్‌కు సంబంధమే, సమానమే. కనుక అందరూ మాట్లాడేందుకు, అందరూ తెలుసుకునేందుకు హక్కు ఉంది. కనుక దేవుని జ్ఞానాన్ని కొనియాడుతూ, ఇస్లామ్ గ్రంథములో ఉన్న జ్ఞానాన్ని తెలుసుకుని, హెచ్చుతగ్గులు ఉంటే సవరించుకుని, అందులో పొరపాట్లు ఉంటే సరిదిద్దుకుని ముందుకు పోవాలనే ఉద్దేశ్యముతో మనము ఈ ప్రయత్నం చేస్తున్నాము.

ఇక్కడ మన ఇస్లామ్ సోదరులు కొందరు, మా మత గ్రంథములో దేవుని ప్రార్థన ఎక్కువవుంది, దైవజ్ఞానము తక్కువవుంది అని చెప్పినారు. మేము ఏమి చెప్పామంటే, దైవజ్ఞానమూ ఉంది, ప్రార్థనా ఉన్నాయి అని చెప్పాము. మరి మాకు తెలియటం లేదంటే, మీరు ఆ వాక్యాలు అర్థము చేసుకుంటే అర్థము అవుతుంది. ఇందూమతములో ఏదైతే ఉందో ఇస్లాం మతములో అదే ఉంది. ఇస్లాంమతములో ఏదైతే ఉందో, అదే ఇందూ

www.thraithashakam.org

మతములో ఉంది. అదే క్రైస్తవములో కూడా ఉంది. ఇదే విషయం పైన **"కలియుగము"** అనే గ్రంథములో వ్రాశాము. తులం బంగారుతో ఒక డాలర్ (బిళ్ళ)ను తయారు చేశామనుకుంటే, ఇంకొక తులం బంగారుతో ఇంకొక డాలర్‌ను తయారు చేస్తే, పరిమాణంలో రెండింటిలో ఏమైనా తేడా కనిపిస్తే కనిపించవచ్చు. కానీ బంగారం మాత్రము తులమే ఉంటుంది. రెండింటిలోనూ బంగారమే ఉంటుంది. వ్యత్యాసం ఏమీ ఉండదు. అలాగే మేము చెప్తున్న దేవుడు మరియు జ్ఞానము ఇస్లామ్ మతంలో ఏదైతే ఉందో, అదే జ్ఞానము ఇందూమతములో, క్రైస్తవ మతంలో కూడా ఉందని చెప్తున్నాము. ముస్లీమ్ అంటే అర్థమేమిటి? 'దేవునిపై విశ్వాసము ఉన్నవాడు' అని అర్థము. అలాగే దేవుని జ్ఞానముపై, దేవునిపై విశ్వాసము ఉన్నవాడిని 'ఇందూ' అని కూడా అందురు. కనుక ఇస్లామ్ మతంలో ఉన్న జ్ఞానాన్ని తెలుసుకున్నా మనము ఇందువులమే, ముస్లీమ్‌లమే అంతేకానీ ముస్లీమ్ అంటే వేరు, ఇందూ అంటేవేరు, క్రైస్తవము అంటే వేరు కాదు. "ఇందూ' అనినా జ్ఞానియే, 'ముస్లీమ్' అనినా జ్ఞానియే, పేర్లు వేరయినాగాని అర్థము ఒక్కటే. నేను ఇప్పుడు నిజమైన ముస్లీమ్‌ను జ్ఞానాన్ని తెలుసుకొన్నాను. కనుక నేను ముస్లీమ్‌నే. ఏ ముస్లీమ్ అయినా 'ఇందూ' మతములో ఉన్న జ్ఞానాన్ని తెలుసుకుంటే అతను నిజమైన ఇందువే.

పవిత్ర ఖురాన్ గ్రంథము చాలా గొప్పది. పవిత్రమైన వాక్యాలు ఉన్నాయి. ఆ పవిత్ర వాక్యాలను గ్రంథరూపంలో కూడా వ్రాశాము. ఇస్లామ్ మతంలో చాలామంది చాలా వాక్యాలు చెప్పుకొనినా గానీ అందులో సంపూర్ణతలేదనే భావంతో, దానిని సరైన భావంతో చెప్పాము. చెప్పాలనుకున్నాము. కావున ఆ గ్రంథములో ఉన్న వాక్యాలను చెప్పాల్సిన పని వచ్చింది.

ఇప్పుడు మా దగ్గరకు వచ్చినవారంతా మత ప్రమేయంతో ఎవరూ రావటంలేదు. మా దగ్గరకు ముస్లీమ్‌లు, క్రైస్తవులు, హిందువులు అందరూ వస్తారు. మీరు ఇందూ మతస్థులై ఉండి వేరే మతం గూర్చి చెప్పడమేమిటి? అని కొందరు ప్రశ్నించారు. మేము చెప్పే దైవజ్ఞానములో బాంబులు పెట్టి, మతద్వేషంతో జనాలను చంపే జ్ఞానము చెప్పటం లేదు. అన్ని మతాలలో ఉన్న అసలైన దైవజ్ఞానాన్ని చెప్పుచున్నాము. మీ దగ్గరకు వచ్చే వాళ్ళంతా మతద్వేషంతో వస్తున్నారు. మతాలు వేరు అంటూ వస్తున్నారు.

ఈ కార్యక్రమంలో ముఖ్యఉద్దేశ్యము ఏమనగా! "ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ" వారు ఏమి చెప్పుచున్నారంటే, "మేము అందరికీ ఖురాన్ గ్రంథములోని జ్ఞానాన్ని చెప్పాలనుకుంటున్నాము. కావున అందులో చిక్కు ప్రశ్నలకు జవాబు చెప్పండి. ఎవరైనా ప్రశ్నిస్తే తిరుగులేని సరైన జవాబు చెప్పేటట్లు చేయండి." అని మమ్మల్ని అడగటం జరిగింది. అందుకు ఎదురాడని జ్ఞానాన్ని చెప్పటానికి మనము సిద్ధంగా ఉండాలి. మేము చెప్పేది ఏమంటే ఇందూ గ్రంథములో దేవుని గురించి ఏమి చెప్పబడిందో, ఇస్లామ్ గ్రంథములో కూడా అదే చెప్పబడింది. మనము అర్థము చేసుకోలేక పోతున్నామంతే. మేము **'కలియుగము'** అనే గ్రంథములో కూడా చెప్పాము. ఒక తులం బంగారుతో తయారు చేసిన ఒక డాలర్ తయారు చేశాము. ఇంకొక తులం బంగారుతో రెండో డాలర్ తయారు చేశాము. కానీ రెండు డాలర్లు పరిమాణంలో తేడా వచ్చినట్లు చేశాము అనుకోండి. పరిమాణంలో తేడాయే గానీ రెండు డాలర్లలో ఉండే బంగారం మాత్రం తులం బంగారంగానే ఉన్నట్లు, మూడు మతాలుగా చెప్పుకుంటున్న మూడు గ్రంథములలో కూడా ఉన్న దైవజ్ఞానము ఒక్కటే. పరిమాణంలో చిన్న గ్రంథము, పెద్ద గ్రంథముగా కనిపించినా మూడు గ్రంథములూ ఒక్కటే.

మేము ఇందూమతములో ఏ దేవుడైతే ఉన్నాడని చెప్తున్నామో అదే దేవుడు ఇస్లామ్ గ్రంథములో కూడా ఉన్నాడని చెప్తున్నాము. దేవుని మీద విశ్వాసము ఉన్నవాడినే ముస్లీమ్ అంటున్నాము. ఇస్లామ్ మతము గురించి పూర్తిగా తెలుసుకున్న మనము ఇందువులమే. ముస్లీమ్ అనినా, ఇందూ అనినా రెండూ ఒకే అర్థము వచ్చే పదాలుగానే చెప్పుచున్నాము. ముస్లీమ్, ఇందూ అని వేరువేరుగా చెప్పుకోనవసరం లేదు. రెండూ ఒక్కటే అంటే పేర్లు వేరైనా అర్థము ఒక్కటే. ఇస్లామ్ మతము గురించి నేను తెలుసుకున్నాను కనుక నేను పూర్తి ముస్లీమ్‌నే. అలాగే ఏ ముస్లీమ్ అయినా ఇందూజ్ఞానాన్ని తెలుసుకోవచ్చును. భగవద్గీత హిందువుది కాదు, ఖుర్ఆన్ ముస్లీమ్‌లది కాదు. రెండూ అందరి సొత్తని చెప్పవచ్చును. పవిత్ర ఖురాన్ గ్రంథములో దేవుని జ్ఞానము ఉన్నది. అందులో ఉన్న వాక్యాలు చాలా పవిత్రమైనవి. అందుకే ఆ పవిత్ర వాక్యాలనే ఒక గ్రంథరూపములో వ్రాశాము. ఇస్లామ్‌లో ఈ గ్రంథము గురించి చాలా వ్యాఖ్యానములు చెప్పిననూ, అవి సంపూర్ణంగా వుండి అర్థము కాలేదు. కనుక పూర్తి అర్థంతో చెప్పాము.

పవిత్ర ఖురాన్ గ్రంథములో కొన్ని సూత్రాలను చెప్పుకున్నట్లయిన, అందులో ప్రతీదీ దేవునికి సంబంధించిన వాక్యాలేగానీ మరొకటి కాదు. కనుక అవి తెలుసుకునే ప్రయత్నం చేద్దాం. మీరు ఇందూమతజ్ఞానాన్ని విడిచిపెట్టేసి, ఇప్పుడు ముస్లీమ్స్ గురించి మాట్లాడటం సబబేనా? అని అడిగితే, ఎందుకు మాట్లాడకూడదు? ముస్లీమ్ గ్రంథములో కూడా ఇందూ జ్ఞానమే కలదు. అలా అనుకోకపోవటమే పెద్ద అజ్ఞానము. మావద్దకు ముస్లీమ్‌లు, హిందువులు ఇద్దరూ సోదరభావంతో వస్తున్నారు. మీవద్దకు వారు రావటం లేదు. కారణం మీకు రెండు మతాలు వేరువేరుగా

కనిపిస్తున్నాయి కనుక. మా వద్దకు జ్ఞానము తెలుసుకోవాలని వస్తున్నారు. మీ వద్దకు మతము అనే ద్వేషము పెట్టుకుని వస్తున్నారు. ఎటువంటి దురాగతం జరుగకుండా అందరూ సమానంగా ఉండాలంటే, ముస్లీమ్‌లు హిందువులు ఇద్దరమూ ఒక్కటే అని అర్థము చేసుకోవాలి. ఆ విషయము తెలియజేసేందుకే ఈ కార్యక్రమాన్ని పెట్టి, మీకు తెలియజేయటం జరుగుతున్నది. కార్యక్రమములో ముఖ్య ఉద్దేశ్యం ఏమిటంటే, ఖురాన్ విషయంలో ఎంతవరకు అవగాహన ఉంది? అనే విషయంలో దీని గురించి చెప్పాలనుకుంటున్నాము.

ముహమ్మద్ ప్రవక్తగారు నిరక్ష్యరాస్యుడు. అయినాగాని ఈ రోజుల్లో ఏ సైంటిస్ట్ చెప్పలేని విధానాన్ని చెప్పగలిగినాడు. ఆయన పరమపదించి 1400 సం॥లు అయినాగానీ, ఆయన ఆ రోజు చెప్పిన రహస్యాలను ఏ సైంటిస్ట్ చెప్పలేకపోవుచున్నారు. అంతగొప్ప రహస్యాలను తెలియజేసిన ప్రవక్తగారు ఆ రోజు నిరక్షరాస్యుడైనా, ఆయన నోటివెంట పవిత్రవాక్యాలు రావటం జరిగింది. ఆ పవిత్ర వాక్యాల గూర్చి తెలుసుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాము. అవి 30 అధ్యాయములలో, 114 సూరాలలో 6236 ఆయత్‌ల రూపములో ఉన్నాయి. అందులో ప్రతీ వాక్యము ఎంతో జ్ఞానముతో కూడుకుని ఉంది. ఖురాన్ గురించి పూర్తిగా చెప్పాల్సి వస్తే మనకి ఆ శక్తి చాలదనే చెప్పాలి. ఎందుకంటే భగవద్గీతలో ఎంత సారాంశము ఉందో అంతే సారంశము ఖురాన్ గ్రంథములో కూడా ఉంది. ఖురాన్ గ్రంథములో ప్రజలకు ఎంతవరకు అవగాహన ఉంది అని చూస్తే, ఇస్లామ్ మతములోనే ఐదుశాతము మాత్రమే అర్థమయ్యింది. మిగతా 95 శాతం అర్థము కాలేదు. ముస్లీమ్‌లు అంతా వారి పెద్దలు చెప్పినట్లు నడువడమే తప్ప, పూర్తి సమాచారాన్ని వారు స్వీకరించడం లేదు. మరి ఈ రోజు ముస్లీమ్ మతంలోనే

ఆచరణలు ఎక్కువని చెప్తున్నారు కదా! అంటే వారి ఆచరణ అంతా ఏ విధంగా ఉందంటే హదీస్ వాక్యాల మీదనే ఉంది. కానీ ఖురాన్ వాక్యాల మీద లేదు. అయితే హదీస్‌లంటే ఏమిటి? సంస్కృతి, సాంప్రదాయాలు అని ఏ మాటలైతే ఉన్నాయో ఆ మాటలు ముస్లీమ్‌లలో కూడా ఉన్నాయి. హిందువులలో సాంప్రదాయాలున్నాయి. ఆచరిస్తున్నారు కానీ వాటి వివరములు తెలియవు. అదే విధముగా హదీస్‌లున్నాయి. కానీ వాటి వివరము తెలియదు. హిందువులలో సాంప్రదాయాలు ఏ విధముగా వచ్చాయి అంటే, పురాణముల వలన, వేదాల వలన వచ్చాయి. కానీ భగవద్గీతలో అటువంటి సాంప్రదాయములు ఏమీలేవు. భగవద్గీతలో ఒక్క జ్ఞాన సాంప్రదాయం తప్ప మరేమీ లేదు. ఈ సాంప్రదాయాలు అనేవి ముస్లీమ్‌లలో, హిందువులలో, క్రైస్తవులలో కూడా కలవు. ఈ సాంప్రదాయాల వలనే మనము వేరువేరుగా ప్రవర్తిస్తున్నాము, వేరువేరు మతాలుగా చీలి పోయినాము. ఈ సాంప్రదాయాలు వేరుగా వున్నా, మూల గ్రంథములలో వున్న జ్ఞానము మాత్రము ఒక్కటే.

ఇస్లామ్ మతములో ఉన్నటువంటి చిన్నచిన్న పొరపాట్లను సరిచేసుకుంటే సంపూర్ణమైన జ్ఞానాన్ని తెలుసుకోనవచ్చును. ఈ ఖురాన్ గ్రంథము 1400 సంవత్సరముల క్రితము జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్త గారికి తెలియజేశారు. తరువాత అది పవిత్రమైన గ్రంథముగా తెలియ బడింది. అదే విధముగా మనిషితో మనిషి ప్రవర్తించే విధానాన్ని, సలామ్ చేసుకునే విధానాన్ని, ఆ రోజే మంచి పద్ధతులన్నీ నేర్పించాడు. తరువాత కొంత కాలానికి దేవునిలోకి వెళ్ళిపోవటం కూడా జరిగింది. ఆయన పరమ పదించిన 120 సంవత్సరముల తరువాత, ముహమ్మద్ ప్రవక్తగారు బ్రతికి ఉన్నప్పుడు ఆయన దగ్గర ఉన్న శిష్యులు ఒకరు ఈ హదీస్ గ్రంథములను

వ్రాయటం జరిగింది. ప్రవక్తగారు ఉన్నప్పుడు ఈ విధంగా చెప్పినారు, ఈ విధంగా మనము ఆయన విధానాలను పాటించాలని హదీస్ గ్రంథాలను రచించి ఇచ్చాడు. అంటే ఖురాన్ గ్రంథము వేరు, హదీస్ గ్రంథము వేరు అని మనకు అర్థమవుతున్నది కదా! అంటే ఖురాన్ గ్రంథము ప్రవక్తగారు చెప్పితే, హదీస్ గ్రంథము ఆయన శిష్యులకు శిష్యుడైన ఒకరు తరువాత వ్రాసినది.

ఆ విధంగా జరిగిన తరువాత 190 సంవత్సరముల తరువాత ఇమామ్ బుకారీగారు, ఇమామ్ ముస్లీమ్గారు రెండు హదీస్ గ్రంథములు వ్రాయడం జరిగింది. అయితే ఇమామ్ బుకారీగారు రచించిన గ్రంథమే మంచి ప్రచారము పొందినది. ఈ గ్రంథము 6 లక్షల హదీస్లతో వ్రాయటం జరిగింది. అది ప్రామాణిక గ్రంథమే అయినప్పటికీ, అందులోని 7397 వాక్యాలను ఏరి మరలా వ్రాయటం జరిగింది. అంటే 6 లక్షల నుండి 7397 వాక్యాలను మాత్రమే వేరు చేశారు. కానీ ఇప్పుడు 2602 మాత్రమే మిగిలి ఉన్నవి. అదే విధముగా ఇమామ్ ముస్లీమ్గారు కూడా నాలుగు లక్షల హదీసులను సేకరించారు. అంటే ఇమామ్ బుకారీగారు ఆరు లక్షల హదీసులు సేకరిస్తే, ఈయన నాలుగు లక్షలు సేకరించాడు. అయితే ఇది అవసరము లేదు. దీనికి జవాబు చెప్పలేని పరిస్థితి వస్తుంది అని అనుకొని, ప్రవక్తగారి బోధకి భంగం కలుగుతుందేమోనని మొత్తము 4 వేల హదీసులను మాత్రమే అతను వేరు చేశాడు. ఈ విధముగా హదీసులు అనేటువంటివి వ్రాయబడ్డాయి.

ఖురాన్ వేరు, హదీసులు వేరు మరల వీటిలో ఏవి కరెక్ట్, ఏవి కరెక్ట్కాదు అని లెక్క వేసుకుంటే, ముస్లీమ్లు అందరూ వేటిని లెక్కవేసు కుంటున్నారు అంటే ఖురాన్కంటే హదీసులనే ఎక్కువగా లెక్కవేసు

కుంటున్నారు. ఇమామ్ బుకారీగారు వ్రాసిన హదీసులను ఇమామ్ ముస్లీమ్‌గారు ఒప్పుకోవటం లేదు. ఇమామ్ ముస్లీమ్ గారు వ్రాసినది ఇమామ్ బుకారీగారు ఒప్పుకోవటం లేదు. ఈ విధముగా 600 వాక్యాలలో అభిప్రాయ బేధాలు వచ్చాయి కనుక వాటిని కూడా తీసేస్తే దగ్గర దగ్గరగా 1900 వాక్యాలే ఉన్నాయి. ఈ 1900 హదీసులలో ఏవి యదార్థం అని లెక్కవేసుకుంటే, ప్రతీ ఒక్కరూ అన్నీ సత్యమే అని నమ్మే పరిస్థితి వచ్చింది. కానీ ఒకప్పుడు ఆరు లక్షలుగా ఉన్న హదీసులను, హదీసు పండితులే, ప్రవక్తగారికి మరియు ఖురాన్ గ్రంథానికి భంగం కలుగుతున్నదని తీసివేశారు. కనుక దీనివలన ఖురాన్ వేరు, హదీసులు వేరు అని తెలియుచున్నది. ఇప్పుడు ముస్లీమ్‌లు అందరూ హదీస్‌లనే ఆచరిస్తున్నారు. ఖురాన్‌ను ఆచరించేవారు 5 శాతము మాత్రమే మిగతా 95 శాతము మంది ముస్లీమ్‌లు హదీసులనే ఆచరిస్తున్నారు.

ఖురాన్ గ్రంథము తరువాత హదీసు గ్రంథము అవసరమే కానీ అందులో యోగ్యం కలిగినవి ఎన్ని? అయోగ్యత కలిగినవి ఎన్ని? అని మనము తెలుసుకొని, వాటిని ఆచరిస్తూ పోతే మంచిది. ఈ ఖురాన్, హదీసులు అనేవి క్రొత్త పదాలుగా పునాదిలాంటిది. ముస్లీమ్ సోదరులతో మాట్లాడాలంటే ఇవి తెలుసుకొనే మాట్లాడాలి. ఇదేమి ఇతను భగవద్గీత అన్నాడు, జ్ఞానము అన్నాడు మరలా ఇస్లామ్ అని చెప్పి, ఇందులో దూరినాడేమి? అని అనుకోవద్దు. మాకు అన్నీ ఒక్కటే, మేము అందరితోనూ మాట్లాడుతాము. **"ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ"** వారు అడిగిన కొన్ని ప్రశ్నలకు జవాబులు చెప్పగలిగాము. వాటినే మేము ఇప్పుడు చెప్పుచున్నాము. మీరు కూడా వాటిని అర్థము చేసుకోగలరు. కనుక ఒకరికొకరు ద్వేషాలు పెంచుకోకుండా, మీ దేవుడు వేరు, మా దేవుడు

వేరు అని అనుకోకుండా మీరు కూడా వాటిని అవగాహన చేసుకోండి. మేము మీరెవరినీ వారి మతములోనికి మారమని చెప్పలేదు కదా! వారిని మీ మతములోకి రమ్మనమని చెప్పలేదు కదా! మతములో ఉన్న సారాంశాన్ని తెలుసుకోమంటున్నాము. ఏ మతములో ఉన్నవారు ఆ మతములోనే ఉండండి, మతమార్పిడి మంచిది కాదని ముందే మేము చెప్పుచున్నాము కదా! అంతమాత్రానికే ఉలికిపడటం ఎందుకు? ఇదేమీ దుష్టకార్యము కాదు కదా! మనమెన్నో పనికిమాలిన పనులు చేస్తున్నాము, దొంగతనాలు చేస్తున్నాము, ఎన్నో హీనమైన పనులు చేస్తున్నాము. పవిత్రమైన గ్రంథాలు గూర్చి తెలుసుకోవడం హీనమైన పని కాదు కదా! కొందరు మమ్మల్ని కూడా నిందించిన వారున్నారు. కానీ వారితో మాకేమీ పని లేదని, మా పని మేము చేయుచున్నాము. దేవుని జ్ఞానాన్ని ప్రచారం చేయదలచు కున్నాము, చేస్తున్నాము.

మా ప్రబోధ సంఘములో ఎందరో ముస్లీమ్‌లు ఉన్నారు, ఎందరో క్రైస్తవులున్నారు మా జ్ఞానాన్ని అర్థం చేసుకోవటం వలననే కదా! వారంతా ఇక్కడికి వచ్చినది. కానీ మతద్వేషం పెట్టుకుంటే ఎవరైనా వస్తారా ఇక్కడికి. మత ద్వేషాలు మీకు లేకుండా ఉండాలంటే మీకు మిగతా మతాలపైన అవగాహన ఉండాలి. ఇప్పుడు మీ అందరికీ **హదీసులు సాంప్రదాయములు, ఖురాన్ దేవుని జ్ఞానము** అని తెలిసిపోయింది. భగవద్గీత దైవజ్ఞానము, పంచెకట్టుకో, బొట్టు పెట్టుకో అనేవి దైవజ్ఞానము కాదు. కనుక మన సాంప్రదాయాలకంటే ముందు జ్ఞానము ముఖ్యం. ఒకవేళ సాంప్రదాయము లైన హదీసులే ముఖ్యమనుకుంటే 6 లక్షల నుండి 2 వేలకు ఎందుకు వచ్చాయి? తరువాత 1800 లకు ఎందుకు వచ్చారు? అంటే వాటిలో మనకు భంగం కలిగించే వాక్యాలు ఉండబట్టే కదా! వాటిని తీసివేసింది.

మేము హదీసు వాక్యాలను చిన్నబుచ్చి మాట్లాడటం లేదు. హదీసు పెద్దలే వాటిని తీసివేశారు. వారిని అనుసరించి, మనమేదైనా తప్పు చేస్తే, హదీసులను మనము వివరించుకోవలసిందే! వాటిని వదలిపెట్టి ఖురాన్ గ్రంథాన్ని చూడవలసిందే! ఎవరైనా ఒక ప్రశ్నవేస్తే జవాబు దొరికితే అది జ్ఞానము. మనకు మతము ముఖ్యము కాదు, దైవత్వం ముఖ్యము. ముందు దైవ గ్రంథాల్ని చూసుకోండి తరువాత హదీసు గ్రంథాల్ని చూసుకోండి. ముహమ్మద్ ప్రవక్తగారికి వారి గౌరవానికి లోటులేకుండా దేవుని శక్తికి ఏమాత్రము భంగం కలుగకుండా, అందరూ గుర్తించే విధానంగా, ఈ విషయంలో ఎవ్వరూ సిగ్గుపడాల్సిన అవసరము లేదు. ఒక హిందువు ముస్లీమ్ మాటలు చెప్పడమేమిటి అని అనుకోవటం కాదు, ఒక హిందువు ఖురాన్ గూర్చి చెప్పితే, సంతోషం వ్యక్తం చేయాలిగానీ బాధపడాల్సిన అవసరము లేదు. కనుక హదీస్ గ్రంథములకంటే ఖురాన్ గ్రంథము గొప్పదని ముందు తెలుసుకొంటే తర్వాత, హదీసులనూ అనుసరించవచ్చు. అదే విధంగా ఇందూ గ్రంథములో ముందు జ్ఞానము తెలుసుకుంటే, తర్వాత సాంప్రదాయములను తెలుసుకోవచ్చును. దాని ప్రకారము వాటిని అనుసరించ వచ్చును. కానీ దైవజ్ఞానానికి ఈ సాంప్రదాయాలు అడ్డు రాకూడదు, ఆ విధంగా ఉన్నాయనే 6 లక్షల హదీసులలో, 1800లకు వచ్చింది.

ఇప్పుడు ఒక ముస్లీమ్ పండితునికి ఇంకొక ముస్లీమ్ వ్యక్తి ఒక సందేహాన్ని అడుగుచున్నాడు. ఏమనంటే హదీసులలో ఒక వాక్యం వ్రాయబడి ఉంది. నాకు అర్థము కాలేదు చెప్తావా? అని అడిగాడు, హదీస్ పండితులు ఉండేది దాని కొరకే కనుక చెప్తాను అన్నాడు. అప్పుడు ఈయన ఏమని ప్రశ్నిస్తున్నాడంటే ముహమ్మద్ ప్రవక్తగారికి జ్ఞానాన్ని బోధించిన దైవ జ్ఞాని

www.thraithashakam.org

అయిన జిబ్రయేల్, కాబా గృహంలో ప్రార్థన చేస్తున్న ప్రవక్తగారితో కలిసి బయలుదేరిపోయి, ఆకాశము వరకు పోయిన తరువాత, జిబ్రయేల్ దూత ఆకాశాన్ని తెరచుకో అంటే ఆకాశము తెరుచుకున్నది. అప్పుడు అక్కడ అందరికీ తండ్రి అయిన ఆదాము ఉన్నాడు అని వ్రాసినారు. అప్పుడు ఆదాము ఈ ప్రవక్తగారిని దీవించినాడట. అప్పుడు దీవెన తీసుకున్న తర్వాత ప్రవక్తగారు, జిబ్రయేల్ దూత ఇంకా పైకి పోయినారట. అక్కడ రెండవ ఆకాశము ఉన్నదట, అక్కడ ఆ ఆకాశము కూడా తెరచుకున్నదట. అక్కడ ఈసా మరియు ఇంకొకరు గొప్ప వ్యక్తులు ఇద్దరున్నారు. అప్పుడు ఆ గొప్ప వ్యక్తులు వీరిద్దరినీ దీవించటం జరిగింది. తరువాత మూడవ ఆకాశము దగ్గర కూడా ఇంకొక జ్ఞాని వీరిని దీవించటం జరిగింది. ఈ విధముగా ఆరు ఆకాశములు వీరు చేరటం, అక్కడున్నవారు వీరిని దీవించటం జరిగింది. ఆరవ ఆకాశములో మూసా అనే వ్యక్తి ఏడ్చినాడంట ప్రవక్తగారిని చూసి, ఎందుకు ఏడ్చాడు? మూసా జ్ఞానము చెప్పినప్పుడు ఎవరూ స్వర్గమునకు పోలేదు, కానీ ప్రవక్త జ్ఞానము చెప్తుంటే చాలామంది ఇప్పుడు స్వర్గానికి పోతున్నారని ఏడ్చినాడట. అయితే ఈ ఏడుపు సంతోషముతో ఏడ్చినాడా, అసూయతో ఏడ్చినాడా అనేది నాకర్థము కాలేదు. తరువాత ఏడవ ఆకాశము తెరచుకుంది. అక్కడ ఎవరున్నారంటే దేవుడున్నాడు.

బాగా జ్ఞాపకం పెట్టుకోండి ఆకాశములో ఇంద్రధనస్సులో ఏడు రంగులు ఎందుకుంటాయని? ఇంతకుమునుపు ఒకరు ప్రశ్న అడిగారు. అలాగే ఇక్కడ కూడా ఏడు ఆకాశాలు అని ఏడింటి గురించే ఉంది. ఈ ఏడు అనే సంఖ్యకు మనకు ఏదో తెలియని సంబంధముంది. ఈ విషయము ముస్లీమ్‌లకు కూడా తెలియదు. మరలా విషయానికి వస్తే వారు ఏడవ

ఆకాశములో ఉన్న దేవున్ని నమస్కరించారు. అప్పుడు దేవుడు, వీరికి ఒక విధి విధానాన్ని గురించి చెప్పాడు. ఏమి చెప్పెనంటే, రోజుకి 50 సార్లు నమాజ్ చేసుకోమన్నాడట. సరే! అని ఒప్పుకుని వచ్చారట. ముహమ్మద్ ప్రవక్తగారు, అక్కడనుండి క్రిందికి వచ్చారు. ఆరవ ఆకాశములో ఉన్న మూసా ఏమైనదని అడుగగా అల్లాహ్ 50 మార్లు నమాజ్ చేయమన్నారని చెప్పగా, అందుకు మూసా 50 మార్లు రోజుకి ఏ విధముగా చేస్తారు? మరలా వెళ్ళి కొంత సంఖ్యను తగ్గించుకుని రమ్మని చెప్పాడట. అప్పుడు ముహమ్మద్ ప్రవక్తగారు ఎట్లాగో చేస్తాములే అంటే, వద్దు వద్దు మీరు అన్నిసార్లు చేయలేరు, ఉదయం నుండి రాత్రి వరకు నమాజ్ చేస్తే, మిగతా పనులు ఎప్పుడు చేసుకుంటారు? అని చెప్పగానే, సరేనని చెప్పి ప్రవక్తగారు, జిబ్రయేల్ దూత మరలా ఏడవ ఆకాశానికి వెళ్ళారట, అప్పుడు దేవుడైన అల్లా అక్కడే ఉన్నాడట అప్పుడు వారు మరలా అడిగినారట కొద్దిగా నమాజ్ సంఖ్యను తగ్గించుకోమన్నారట. సరేలే! తగ్గించుకుంటానులే అని 25 నమాజ్‌లు చేయమని దేవుడన్నాడట. ప్రవక్త క్రిందికి రాగానే మరలా మూసా అడిగినాడట, 25 చేయవలెనని చెప్పితే ఇంకా కొన్ని తగ్గించుకోమని మరలా అడగండి అని చెప్పి, మరలా పంపించినాడట. ఈ విధంగా ఏడు, ఎనిమిదిసార్లు తిరిగినారట. చివరికి దేవుడు ఐదుసార్లు నమాజ్ చేసుకోండి అని పంపించినారంటూ అంటే 50 సార్లు కాస్తా 5 సార్లు సరిపోతుంది అని చెప్పారట. అయినా మూసా 5 సార్లు అయినా ఎట్లా చేస్తారు? మరలా అడగండి అంటే, ప్రవక్తగారు మరలా వెళ్ళి అడగాలంటే నాకు సిగ్గు అవుతూ ఉంది. ఎలాగో ఐదుసార్లు చేసుకుంటాములే అని ఈయన మాటను లెక్క పెట్టలేదట. అప్పుడు వీరు క్రిందికి వచ్చినారట. వస్తూ వస్తూ మధ్యలో ఆకాశాలలో పాపము చేసినవారు మరియు పుణ్యం చేసినవారు నరకంలో శిక్షలు కనిపిస్తున్నాయట. వ్యభిచారం చేసినవారికి

నోట్లో అగ్ని పోసినారంట. ఈ విధముగా నరకం అనుభవించే వారు, స్వర్గాన్ని అనుభవించేవారిని ఎందరినో చూసినారట. ఇదంతా జరిగినదా? అంటే ఒక మంచి పని చేయుటకు ఎన్నో అబద్దాలు చెప్పవలసి వచ్చింది. దేవునికి నమాజ్ చేయటం మంచిపనే, కానీ ఈ విధంగా ఈ కథ చెప్పు కోకుండా చెప్తే సరిపోయేది. హిందూమతములో పురాణాలు జనులలో భక్తి కలుగజేయుటకు చెప్పినారు. భక్తిని కలుగజేసేందుకు అన్ని అబద్ధాలు చెప్పాల్సి వచ్చింది. తెలివైనవాడు ఇదంతా ఒట్టిదే అని మొదటికే కొట్టివేసే అవకాశము ఉంది. హదీస్ గ్రంథములో ఒక వ్యాకం ఈ విధముగ ఉంటే, దీనిలో తప్పు ఒప్పులను గమనించినట్లైన, ఈ వాక్యాలు ప్రవక్తగారికి, ఖురాన్‌కి భంగం కలిగించే వాక్యాలుగా ఉన్నాయి. కనుక వీటిని సవరించుకుని ఈ కథను విడిచిపెట్టి, ప్రార్థన చేయడమే ముఖ్యమని, రోజుకి ఐదుమార్లు నమాజ్ చేయడమే ముఖ్యమని ముస్లీమ్ సోదరులకు తెలియ జేస్తున్నాము. కానీ ఈ కథను అనుసరించి మాత్రము ప్రార్థన చేయవద్దు. నీవు భక్తితో చేయి. ఈ కథను తీసుకుంటే మొదటి ఆకాశములో అందరికీ తండ్రి అయిన ఆదాము ఉన్నాడు అన్నారు. ఇక్కడ ఏమి అంతరాయం కలుగుతున్నదంటే, **అందరికీ తండ్రి దేవుడే మరి మధ్యలో ఆదాము ఎట్లు వచ్చాడు?** అనే సందేహమును ఆ ముస్లీమ్ వ్యక్తి వెలిబుచ్చాడు. ఖురాన్ గ్రంథముగానీ, ప్రవక్తగారుగానీ ఎక్కడా అలా చెప్పలేదు. కానీ 'మనందరికీ తండ్రి దేవుడే' అన్నారు. 33వ సూరాలో 40వ ఆయత్‌లో **"ప్రవక్త ఎవరికీ తండ్రి కాడు"** అని ఉన్నది. మరి అలాంటప్పుడు ఆదాము కూడా ఎవరికీ తండ్రి కాడు. ఈ విధముగా ఆదామే తండ్రి అనుకుంటే దేవున్ని ప్రక్కకు పెట్టినట్లవుతుంది. వేరే మతస్థులు దీనిని విమర్శించేందుకు అవకాశము ఉంది. అల్లా అందరికీ తండ్రి. ఆయన అందరినీ సృష్ఠించిన సృష్ఠికర్త. మరి మధ్యలో ఆదామును చెప్పకూడదు. కాబట్టి ఈ మాటను ప్రక్కకు

పెట్టవలెను. దేవుడు ఏ మాట చెప్పినా దానిని ఆచరించేటట్టు ఉండాలిగానీ, మాటమాటకి మార్చాలి అని అడిగితే ఎలా? దేవున్ని తిరిగి ప్రశ్నించేందుకు అవకాశము ఉండకూడదు. ముస్లీమ్ మతస్థులు చాలా బద్ధకస్తులు అనే అవకాశము ఉంది. కనుక ఈ విషయాన్ని కూడా వదలి వేద్దాము.

బైబిల్‌లో ఒక విషయము తెలియజేశారు. **"జ్ఞానమార్గములో నీకు నీ చేయి అడ్డమైతే, చేయినైనా నరికి వేయమన్నాడు."** అక్కడ దేనికైనా సంసిద్ధంగానే ఉండాలి. దేవుని విషయంలో తరువాత క్రిందికి దిగి వస్తూ ఉంటే నరకాన్ని స్వర్గాన్ని అనుభవిస్తున్నవారిని చూశామన్నారు. అక్కడ ప్రవక్తగారున్నారు, మిగతా మనుషులున్నారు. ప్రళయం రాలేదు. ప్రళయాంతంలో, చివరి దినంలో సమాధుల నుండి దేవుడు మనల్ని లేపుతాడు. తరువాత స్వర్గమో, నరకమో తీర్పు తీర్చి అప్పుడు పంపును. అంటే ముందే వీరంతా పోయి అక్కడ ఎట్లు ఉన్నారు అని ప్రశ్నించేందుకు అవకాశము ఉంది. మన దగ్గర జవాబు లేదు. కాబట్టి మీరంతా ఖురాన్‌లో ఉండే జ్ఞానంపైనే దృష్టి పెట్టుకోండి. ఖురాన్ అని మీరు మాకెందుకు చెప్తున్నారు? అని మీరంటే, చేతనైతే చదవండి అంటున్నాము. మాకు చేతనైంది కనుక భగవద్గీత, ఖురాన్, బైబిల్ మూడు చదివాము. మూడింట్లో ఉన్న వాక్యాల గూర్చి చెప్పగలుగుచున్నాము.

ఇంతకుముందు ఉపన్యాసములలో చెప్పి ఉంటాము. మమ్మల్ని కొందరు ముస్లీమ్‌లు వచ్చి మీరు మా మతములో కలిసిపోండి అనిఅడిగారు. నేను వారికి ఏమి చెప్పానంటే, "మీ ఖురాన్‌లో ఉన్న జ్ఞానము నాకు అర్థమయితే కదా! నేను ఎవరికైనా జ్ఞానము చెప్పేది లేకపోతే నేను చెప్పలేను కదా! అని అంటే "ఏమర్థము కాలేదు చెప్పండి" అన్నారు. నేను అప్పుడు వేసిన ప్రశ్నకు జవాబు చెప్పలేక తికమక పడి ఇంటర్నెట్‌లో చూచి చెప్తాము

అన్నారు. మీరే ఇంటర్నెట్ అంటే ఎట్లా అవుతుంది. మత పెద్దలే చెప్పలేక పోతే ఎలాగ? కనుక మనము అట్లా కాకుండా పూర్తి జ్ఞానాన్ని తెలుసుకొని, ఎవరు ఏమి అడిగినా జవాబు చెప్పవచ్చు. కనుక ప్రతీ ముస్లీమ్, ప్రతీ ఆయత్‌లో ఉన్న విషయాలను తెలుసుకునేటట్లు ఉండాలి. అర్థము కాకపోతే అడగండి, చెప్పటానికి మేము సిద్ధంగా ఉన్నాము. దేవుని జ్ఞానము తెలుసుకునేందుకు చెప్పే వ్యక్తి ఎవరైతే మీకేమి? మీక్కావలసినది దేవుని జ్ఞానము, మాకు కావలసిందీ అదే దానికి భయమెందుకు? సందేహ మెందుకు? కనుక మేము **"అంతిమ దైవ గ్రంథములో జ్ఞాన వాక్యములు"** అనే పేరుతో ఒక గ్రంథము వ్రాశాము. "ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ" వారికి అందజేశాము. దానితో వారు ముందుకు వెళ్తారు.

అయితే ఇప్పుడు మేము చెప్పేది ఏమంటే ఖురాన్ వేరు, హదీస్‌లు వేరు. ఖురాన్‌ను గొప్పగా చూడండి. హదీస్‌లలో ఏమైనా పొరపాట్లు ఉంటే విడిచి పెట్టండి. ఖురాన్‌లో మాత్రము ఒక్క వాక్యాన్ని కూడా విడిచి పెట్టవద్దు. ప్రవక్తగారు బ్రతికి ఉన్నప్పుడే మీరు తప్పు చేస్తున్నారని, హదీస్‌లలో ఉన్న లోపాలను ప్రవక్తగారి భార్య ఆయేషాగారు ఆ రోజుల్లో ఖండించారు. ప్రవక్తగారు పోయిన తరువాత కొన్ని సంవత్సరాలకు వ్రాసిన విషయాలను సత్యమంటే కొన్ని ఇబ్బందులు పడాల్సి వచ్చును. కనుక హదీస్‌లలో అన్నీ పనికి రానివి అని చెప్పలేదు. కొన్ని పనికి రానివి ఉన్నాయి కానీ ఖురాన్‌లో మాత్రము ఏ వాక్యము పనికి రానిది కాదు. అన్నీ సరైనవే! అయితే అన్నింటికీ మనము అర్థము చెప్పలేము. మన చేత కాదు. కనుక కొన్ని వాక్యాలకే మేము **"అంతిమ దైవ గ్రంథములో జ్ఞాన వాక్యములు"** గ్రంథాన్ని వ్రాశాము. కనుక ప్రతీ ముస్లీమ్ ఖురాన్‌లో విషయాలను అర్థము చేసుకుని, సారాంశాన్ని గ్రహించి అల్లావద్దకు చేరుకుంటారని చెప్తూ ముగిస్తున్నాము.

# 51. గోరు - గురు

<u>తేది : 08-03-2012</u>

సృష్టి ఆదిలో ఇందూ జ్ఞానమంతయూ వివరించబడింది. కొన్నాళ్ళు అలా గడిచిన తరువాత అది లేకుండా పోయింది. తిరిగి మరలా చెప్పబడింది. అలా చెప్పినప్పుడు ఆయన దేవున్ని చేరే మార్గాన్ని చెప్తే, విన్నవారు తమ ఇష్టాన్ని ఎంచుకున్నారు. తద్వారా నాది ఫలానా మతము అని పేర్లు చెప్పుకోవటం జరిగింది. కాని ప్రపంచంలో ఎన్ని మతాలు ఉన్నప్పటికీ, దేవుడు మాత్రం ఒక్కడే. ఏ మతమైనా దైవాన్నే సూచిస్తున్నప్పుడు, ఒక మతములో ఉన్నవారు, రెండవ మతంలో ఉన్నవారిని దూషించవలసిన అవసరమేమొచ్చిందంటే, కేవలం అజ్ఞానం వలనే ఆ విధంగా జరుగుతూ ఉంది. తద్వారా మా దేవుడు, మీ దేవుడు అనే వ్యత్యాసం వస్తున్నది.

పుట్టినప్పుడు మనిషి ఏదో ఒక మతంలో పుట్టే ఉంటాడు. పెరిగిన తరువాత నేను ఫలానా మతం అని తెలుస్తుంది. ఆ విధంగా వాడు ఏ మతములో ఉన్నాడో అది తెలిసిన తరువాత వాడిలో ఉండే గుణాలలో మోహగుణము ఒకటుంది 'నా వారు' అనేదంతా ఆ గుణం నా వారు, నా ఇల్లు, నాధనము అనేలాగానే నా మతము అనేది కూడా ఉంటుంది. ఆ విధంగా ప్రతీవాడిలోనూ (ఆడైనా, మగైనా) ఆ మోహగుణం ఉంటుంది. కావున, నా మతము అనే భావన వలన, ఇతర మతములవారనే బేధాభిప్రాయములు వస్తున్నవి.

భగవద్గీతను మనం చూసినట్లైన అర్జునుడు మిగతా సైన్యాన్ని చూసి ఏడవలేదు. కానీ నావారు, నా బంధువులు అని తన వారిని గురించి బాధ పడినాడు కేవలం అతనిలో "మోహగుణం" అనే దానివలన, ఆ విధంగా బాధ పొందాడని తెలుస్తున్నది. అంటే ఇతరులైన సేనాధిపతులు,

సైనికులు, చనిపోతారని బాధకలిగించలేదు గానీ, తన బంధువులు చనిపోతారనే బాధే ఎక్కువ. అర్జునుడికి మోహగుణం ఇక్కడ కలిగిందని మాత్రం మనం అర్థం చేసుకోవలెను. ఈ విధంగా భూమి మీద ఎన్ని మతములున్ననూ, తనమతం మినహా ఏ ఇతర మతములను గొప్పగా చూడటం లేదు. హిందువులు ఏమనుకుంటున్నారంటే క్రైస్తవులను దూషించాలనుకుంటారు. క్రైస్థవులు ఏమనుకుంటున్నారంటే హిందువులను దూషించాలనుకుంటారు. అదే విధంగా తన మతం గొప్పని చెప్పుకుంటారు గానీ, ఇంకొక మతం ఏమయినా పరవాలేదనుకుంటాడు. ఆ విధంగా అనుకోవటం మనుషులకుండే సమాజ గుణము అంటాము. ఆ గుణము పాపాన్ని హెచ్చిస్తూ పోతుంటుంది. చిన్న సమస్యను పెద్దది చేసి, పెద్ద పాపాన్ని అంటగడుతున్నది. కనుక నాది అనేది ఎంత పాపమునైనా తెచ్చిపెడుతుంది. నీ మతము కొరకు ఎంత పాపాన్నైనా చేస్తావు. ఒకరోజు వాల్మీకి ఇతరులను కొట్టి, చంపి వారి వద్ద ఉన్న ధనాన్ని నా భార్యా పిల్లలకు ఇస్తున్నాను, ఇది పాపమే అని తెలిసినప్పటికీ, నా భార్యా పిల్లలకొరకే కదా, పాపం వస్తే, అందరికీ వస్తుంది కానీ నాకొక్కరికే రాదు కదా! అనుకున్నాడు. కానీ తరువాత ఎవరు చేసిన పాపం వారిదే అని తెలిసిపోయింది. తనే ఆ పాపాన్ని అనుభవించాలని తెలిసిపోయింది వాల్మీకీకి. మరి నేను చేసిన పాపం పర్వతాలంత పెరిగిపోయింది. ఈ పాపాన్నంతటినీ పోగొట్టుకోవాలంటే నేను మహర్షిగా మారిపోవాలను కున్నాడు వాల్మీకి.

ఈ విధంగా తెలుసుకుంటే ఫరవాలేదుగానీ, లేకపోతే పెద్ద పాపంలో ఇరుక్కోవలసి వస్తుంది. నేను మతం కొరకు పాపం చేశాను, నా కొరకు కాదు కదా, దేవుని కొరకు చేశాను కదా అని కొందరు అనుకోవచ్చు. మా

రాముని కొరకు నేను ఏమైనా చేస్తాను, నాకేమి పాపం రాదు కదా! అనుకుంటున్నారు. ఆ విధంగానే ఇతర మతస్థులు అనుకుంటున్నారు. మా అల్లాహ్ కొరకు ఇతరులను చంపేస్తాను అనుకుంటున్నారు. మా ప్రభువు కొరకు వేరే వాళ్ళను చంపేస్తాను అనుకుంటున్నాడు. మతం బాగుపడాలంటే, నీవు ఏమి చేసినా మతం కొరకు పాటుపడుతున్నట్లు లెక్క. దేవున్ని గురించి కాదు. ఆ పనులన్నీ ప్రపంచవరమైన పనులుగానే లెక్కించవచ్చు. నీ భార్యాపిల్లలకొరకే నీవు పనిచేసినట్లగును. తద్వారా నీకు పాపం వస్తున్నది. కనుక మతము అని చెప్పుకునేవారు చాలా జాగ్రత్తగా ఉండవలెను. నాదొక మతం నీదొక మతం అని అనుకోరాదు. మరి భగవద్గీతలో ఎక్కడైనా నీవు ఇట్లా ఉండు అని ఏమైనా చెప్పినాడా? హిందువులు పాటించాల్సినవి ఏవైనా అందులో చెప్పబడ్డాయా అంటే ఏమీ ఆ విధంగా చెప్పలేదు గానీ ధర్మాలు మాత్రమే చెప్పబడ్డాయి. అదే విధంగా ప్రతీ మత గ్రంథములోనూ ధర్మములే చెప్పబడ్డాయి. మనుషులు తర్వాత సాంప్రదాయాలను సృష్ఠించుకున్నారు.

ఆ విధంగా సాంప్రదాయములకు విలువ ఇవ్వకుండా ధర్మములకు మాత్రమే విలువ ఇవ్వబడుతున్నది. ప్రతీ మత గ్రంథములోనూ "సర్వ మానవాళికి" అని ఉంది. అంటే అన్నింటికి సంబంధించిన విషయం అని తెలుస్తా ఉంది. ఒక మతానికి ఒక కులానికి అని లేదు. ఒక్కొక్క సమయంలో చెప్పిన దేవుని జ్ఞానం ఆ విధంగా అర్థంకాక, మతముగా అర్థమయింది. కానీ అది దేవుని జ్ఞానంగా తెలియబడితే, దేవుడు ఒక్కడే కనుక ఏ మతబేధాలు రావు. ఇవి రావటానికి కారణం మనిషిలో ఉండే గుణములే. ఈ గుణములే పాపము అనే కర్మను తెచ్చిపెడుచున్నవి. జ్ఞానం మాత్రం కర్మను ప్రక్కకు నెట్టేసి, దేవుని మార్గమునకు పంపిస్తున్నది.

www.thraithashakam.org

భగవద్గీతలో **"గుణములే మాయ"** అని చెప్పబడినది. ఈ మాయ అనేది ప్రతీ మతములోనూ ఉన్నది. ఒకరు సాతాన్ అంటారు. ఇంకొకరు దానినే సైతాన్ అంటారు. ఇంకొకరు మాయ అంటున్నారు. దేవునికి వ్యతిరేఖమైన భావాన్ని కలుగజేసేది మాయ. మరి ఈ మాయ దేవునిచేత సృష్ఠించబడి, దేవునిచేత పోషించబడి, జీవనాన్ని సాగిస్తున్నది, మాయ దేవుని ద్వారానే బ్రతుకుచున్నది తప్ప, స్వంతంగా బ్రతకలేదు. దేవుని ఆజ్ఞలోనే ఉంది, దేవుడు చెప్పిన విధానాన్ని ఆచరిస్తూ ఉంది. దేవుడు ఏది చెపితే అదే నడుచుకుంటుంటే, దేవునికి వ్యతిరేకంగా ఎందుకు నడుస్తూంది? దేవునికి అనుకూలంగా నడుచుకోవాలిగాని, వ్యతిరేఖంగా ఎందుకు నడుస్తున్నది? అని అడుగవచ్చును. దేవుని మాటకు ఎక్కడ వ్యతిరేఖంగా నడవటంలేదుగానీ, అనుకూలంగా నడుస్తూ ఉన్నది. ఇది ఏ విధంగా అని అడిగితే, దేవుని ఆజ్ఞ ఏమంటే నాకు ఎవరైతే ఇష్ఠులు కారో, వారిని నా నుండి దూరంగా పంపించు, నా దగ్గరకు రానివ్వద్దు అని మాయతో దేవుడు చెప్పటం జరిగింది. ఆ విధంగా మాయ పరమాత్మకు ఇష్టం కానివాళ్ళను అతని జ్ఞానం అర్థం కాకుండా చేయగలదు. అటువంటి వారిని మనం చూస్తూనే ఉంటాము. వారికి రోజంతా జ్ఞానం చెప్పినా గానీ, వారికి ఒక్క రవ్వంతైనా అర్థంకాకుండా మాయ చేయగలదు.

ఇంకోవిధంగా కూడా మాయ చేయగలదు. అది ఏ విధంగా అంటే, కొందరికి దేవుని జ్ఞానం బాగా అర్థమయినట్లు చేస్తుంది. ఆ జ్ఞానాన్ని పదిమందికి చెప్పేటట్లు చేస్తుంది. కానీ వారు దేవునికి ఇష్టులు కానందువలన, వారి దారిని కూడా తప్పిస్తుంది. జ్ఞానవరముగా పెళ్ళికార్యక్రమాన్ని చేసే వ్యక్తి ఒకడున్నాడు. ఈ రోజు రెండు పెళ్ళిల్లు ఉన్నాయి ఆయనను రమ్మనమంటే, రాలేదు సరికాదా ఫోన్ స్విచ్ ఆఫ్ చేశాడు. ఇంటికి వెళ్ళి

పిలిస్తే, వస్తానన్నాడు కానీ మరి రాలేదు. ఎందుకతను ఆ విధంగా చేశాడంటే నా విలువ వీరందరికీ తెలియాలని చేశాడు. కానీ దేవుడు వ్యక్తి యొక్క విలువల్ని చూడడు గానీ జ్ఞానాన్ని, ఆచరించే విధానాన్ని చూస్తాడు. కనుక అతను నేను, నాది అనే మోహగుణంలో తగుల్కొని జ్ఞానాన్ని ఆచరించే విధానంలో తప్పుచేసి, దారి తప్పిపోయాడు. కానీ వానికి నా దారే సత్యమైనది అని అనిపిస్తూనే వారిని దేవుని నుండి దూరం చేస్తుంది మాయ. కనుక ఎప్పుడైనా ఏ వ్యక్తైనా నా దారి తప్పిపోయానేమో అని అనుకుంటేనే సక్రమమైన దారిలోకి వస్తాడు. ఆ విధంగా అజ్ఞానులను, తనకిష్టములేని వారికి జ్ఞానం అర్థంకాకుండా దేవునికి వ్యతిరేఖంగా ఉండేటట్లు చేస్తున్నది మాయే, ఆ విధంగా చేయమని చెప్పింది మూలకారకుడైన, దేవుడే. అతనికి తెలియని రహస్యం అంటూ ఏమీలేదు. నీవు బయటకు జ్ఞానానికి ఇష్టుడుగా ఉన్నట్లు నటించినా, నీవు లోపల ఏమనుకుంటున్నావో కూడా దేవునికి తెలుసు. ఆ విధంగా తెలుసుకున్న దేవుడు, తనకి దూరంగా నిన్ను ఉంచాలనుకున్న అరక్షణంలో మాయ దానిని కార్యరూపానికి తెచ్చి, నిన్ను దేవునికి దూరంగా పంపించే కార్యం పూర్తిచేసేస్తుంది. కనుక మనం చేస్తున్న ప్రతీ కార్యం దేవుని ధర్మములతో పోల్చి చూసినట్లైన, మన త్రోవ సక్రమమైనదా కాదా అని మనకి తెలుస్తుంది.

ప్రతీ నెల మేము ఏది చెప్పినా క్రొత్త విషయమే చెప్తుంటాము. మేము వ్రాసిన ప్రతీ గ్రంథములో కూడా, క్రొత్తగానే ఉంటుంది. దైవమును చేరేందుకు ధర్మములను సంతృప్తిగా తెలియజేసేది అని నేను ధర్మప్రదాతయని పేరు పెట్టుకున్నాను కదా! అంటే నేను పెట్టుకోలేదు. నా వెనుక ఉన్నవాడైన ఆత్మయే ఆ పేరును పెట్టించాడు. నా శరీరంలో అన్నీ ఆత్మయే నడిపిస్తున్నది. ఆ మాటను నేను చెప్పినది కాదు.

www.thraithashakam.org

ఆ విధంగా మేము చెప్పే జ్ఞానం గొప్పదని ఇతరులకు తెలియబడు చున్నది కావున ఆసక్తిగా వారు వినగల్గుతున్నారు. కొందరికి అర్థంకాక ఏమంటున్నారంటే, వీరు పరమతాన్ని బోధిస్తున్నారు అని అంటున్నారు. నాకు పరమతమన్న ధ్యాసేలేదు. మూడు మతములు నాకు సమానమే. అందువలన కొందరు నన్ను **త్రిమత ఏకైక గురువు** అని అంటున్నారు. అర్జునుడు కురుక్షేత్ర యుద్ధంలో మిగతా సైన్యమునంతటిగురించి ఆలోచించకుండా, కేవలం తన అన్నదమ్ములు, బావలు, మరుదులు, చనిపోతారనే ఆలోచించాడంటే మిగతా సైనికులు అంతా పరాయివాళ్ళనే ఉద్ధేశ్యం అర్జునుడికి ఉన్నట్లే కదా. అదే విధంగా నా మతము నేనంటేకదా మిగతా మతములన్నీ నాకు పరాయి అనే అర్థం వస్తుంది, కానీ నేను అన్ని మతముల గురించి ఆలోచిస్తున్నాను, ప్రసంగిస్తున్నాము. కనుకనే అన్ని మతముల విషయములను ఏకధాటిగా వివరిస్తున్నాము. నీవు ఈ మతాన్ని విడిచిపెట్టి, వేరే మతంలోకి పో అంటే ఒక మతాన్ని తక్కువ చూసినట్లు అదే విధంగా నా మతం గురించి గొప్పగా చెప్పుకుంటున్నట్లు తన, మన అనే భేదాలు మాకు లేవు. కావున మాకు మతము అనే దృష్టిలేదు. (హి)ఇందువులలో తప్పులున్నా మేము చెప్తున్నాము, ఇస్లామ్‌లో తప్పులున్నా మేము వివరిస్తున్నాము, క్రైస్తవులలో తప్పులున్నా వివరిస్తున్నాము.

ఎవరి శరీరాల్లో వారు జీవాత్మలై నివసిస్తున్నారు. స్త్రీ,పురుషుడు అనేది శరీరాలనుసరించి చెప్పవచ్చుగాని లోపలుండే వారు మాత్రం ఆత్మ, జీవాత్మ, పరమాత్మ అంశలే. నేను ఇప్పుడు ఏమి చెప్తున్నానంటే, నేను నా శరీరంలో ఉంటున్నాను. కొన్నాళ్ళ తరువాత నేను ఈ శరీరాన్ని విడిచిపెట్టి వేరే శరీరంలోకి ప్రవేశించగలను. ఆ విధంగా ఆశ్రయిస్తున్నట్టు ఎవరికీ జ్ఞాపకము లేదు. ప్రస్తుతం మాత్రం ఒక శరీరాన్ని ఆశ్రయించి ఉన్నాము.

ఇదంతా ఎవ్వరికీ కనిపించని విషయం. భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్యా యోగంలో, **ఇది రహస్యమైన జ్ఞానము, ఉత్తమమైన జ్ఞానము** అని శ్రీ కృష్ణుడు చెప్పటం జరిగింది. నిగూఢమైన విషయాలు ఉంటాయి. అవి తరువాత తెలియజేయబడతాయి అని బైబిల్‌లో యోహాన్ సువార్తలో 14 వ అధ్యాయంలో 27 వ వచనములో చెప్పబడింది. మరల ఈ విధంగా చెప్తే మేము పరమతము గురించి చెప్తున్నామంటారు. ఖురాన్ గ్రంథములో 3వ సూరా ఆలీఇమ్రాన్ అనే దాంట్లో 7వ ఆయత్‌లో కూడా ఈ విషయాన్నే చెప్పినాడు. **(3-7) "ఈ గ్రంథములో స్పష్టమైన విషయములు, అస్పష్టమైన విషయములు రెండు ఉన్నవి."** స్పష్టమైన విషయాలంటే స్థూలంగా ఉండే విషయాలు, అస్పష్టమైన విషయాలంటే సూక్ష్మంగా ఉండే విషయాలు, అవి దేవునికి తప్ప ఇంకెవరికీ తెలియవు. ఎవరైనా చెప్పగల్గినా వక్రబుద్ధితో అనుకూలంగా చెప్పే విషయాలే కాని సత్యములు కావు. ఎందుకంటే తన ఉద్ధేశాన్నే వక్రబుద్ధితో చెప్పుచున్నాడు అన్నారు. ఆ విషయాలు దేవునికే తెలుసు కాని మనుషులకు ఎవ్వరికీ తెలియదు.

మనమందరమూ ఇంతకముందు ఉంటిమి, తరువాత ఉండెదము అనే మాటలు కూడా సూక్ష్మమైన విషయాలుగా ఉన్నవి. ఆ విషయమంతా దేవునికే తెలుసు. ఆ విధంగా కాకుండా ఏ మనిషైనా నేనిక్కడ పుడతాను, అంతకు ముందు నాదీ జన్మ అని చెప్పితే అవి వక్రబుద్ధితో చెప్పినవే కానీ సత్యంకాదు. మరి మీరు కొన్ని గ్రంథాల్లో ఆ విధంగా మనుషులు చెప్పినట్లు వ్రాసారు కదా! అంటే దేవుడే ఆ మనుష్యులకు కావాలని జ్ఞాపకం తెప్పించి తరువాత మరి జ్ఞాపకం లేకుండా చేసేస్తాడు. ఆ విధంగా దేవుడు అతని శరీరమునుండి తన పూర్వ జన్మను చెప్పించాడు. తరువాత మిగతా విషయాలు జ్ఞాపకం లేకుండా చేసాడు.

www.thraithashakam.org

ఒకవేళ దేవుడు చెప్పలేదు అని ఎవరైనా వాదించినా తరువాత ఆ వ్యక్తి తన జీవితంలో మిగతా విషయాలు ఎందుకు చెప్పలేకపోవుచున్నాడు? అదే విధంగా భగవద్గీతలోగాని, బైబిల్‌లోగాని,ఖురాన్‌లో గాని కొన్ని విషయములే మనిషికి తెలుసు, కొన్ని విషయాలు ఎవ్వరికీ తెలియవు. గ్రంథములోనే చెప్పాడు అవి ఎవ్వరికీ తెలియవని, మరి ఎవ్వరికీ ఆ విషయాలు తెలియవు అన్నప్పుడు మరి మనమెందుకు చదువుకోవాలి? అని అనుకుంటే నీవు పొరపాటుపడినట్లే. ఎందుకు? అంటే, ఎవరైతే జ్ఞానములో పరిపక్వత చెందుతారో, ఎవరైతే జ్ఞానం తెలియాలని ఆసక్తి కల్గిఉన్నారో వాడు మాత్రం గ్రహించుకోగలడు. వాడు మాత్రం అర్థం చేసుకుంటాడు అని ఈ ఆయత్‌లో చెప్పబడింది. ఏ విధంగా అర్థం చేసుకుంటాడు. వింటే అర్థం చేసుకుంటాడు. ఎవరైనా చెప్తే కదా అర్థం చేసుకుంటాడు, భూమి మీద ఏ మనిషికి తెలియదు. మరి ఎవరు చెప్పాలి. దేవుడు చెప్పాలి. పోని దేవుడు చెప్పినట్లు ఏమైనా దాఖలాలు ఉన్నాయా అంటే ఇదొక పెద్ద సమస్య. కనుక దేవుడు ఈ విషయాలను చెప్పడానికి ఈ భూమి మీదకు వచ్చినా గానీ, మనమెవ్వరం నమ్మే స్థితిలో లేము కనుక మనకు దేవుడెవరో తెలియదు.

అందుకే మేము **"గురువు"** అనే గ్రంథములో గురువు అనేవాడు భూమి మీద కొన్ని వేల, లక్షల సంవత్సరాలకో వస్తాడు అని చెప్పాము కానీ భూమి మీద ఎవ్వరూ గురువును తెలుసుకోలేరు, గుర్తుపట్టలేరు. ఎవరికీ భూమి మీద గురువు తెలియబడడు. మరి భూమి మీద ఎవరికైనా జ్ఞానం తెలియాలంటే గురువు ద్వారా మాత్రమే తెలియాలి.

అయితే గురువుంటే శిష్యులుంటారు కదా, శిష్యులుండే వాడు గురువే కదా, అంటే గురువుకెవరూ శిష్యులుండరు అనేది సూత్రం. మరి

ప్రపంచంలో చాలామంది గురువులుగా పేరుపొందినారు. జగద్గురువులుగా ఉన్నారు కానీ "గురువు" అనుటకు అర్హత లేదు. సూత్రం ప్రకారం జ్ఞానం అనుసరించి గురువు ఉంటాడు గాని శిష్యులను అనుసరించి గురువు ఉండడు. గురువు అంటే గుహ్యంగా ఉండేవాడు, రహస్యంగా ఉండేవాడు. దేవుడు అంటే దేవులాడబడేవాడు. లేదా వెతకబడేవాడు. అదే విధంగా గురువు అనేవాడు గుహ్యంగా ఉండేవాడు, ఎవ్వరికీ తెలియబడేవాడు కాదు. ఈ సమాచారం ప్రకారం ఇద్దరూ ఒక్కరే, ఇద్దరూ దొరకరు. ఏదిఏమైనప్పటికీ దేవుని విషయములు తెలియజేయాలంటే గురువే చెప్పాలి. గురువు అంటే ఎవ్వరికీ తెలియబడడు కాని ఆ విధంగా చెప్పినప్పుడు బుద్ధి ఉన్నవాడు ఆ విషయములను గ్రహించుకోగలడు. దేవుడే గురువై భూమి మీదకు వస్తాడు అనే నమ్మకం ఉంటే, ఆ దేవుడే గురువై వచ్చి, జ్ఞానాన్ని చెప్పిపోయాడన్న విషయం మనకు అర్థమగును. దేవుడే భూమి మీదకు వచ్చినప్పుడు మనమెవరమూ గ్రహించుకోలేము గానీ, అతను చెప్పే ప్రత్యేకమైన జ్ఞానం ద్వారా, ధర్మముల ప్రసంగముల ద్వారా, దైవాంశ గురువుగా వచ్చిందని తెలుసుకునేందుకు ఒక ఆధారం మాత్రమే ఉంది కాని, అతనే గురువు అని తెలుసుకునేందుకు, ఎవ్వరికీ తెలియనివ్వకుండా చేస్తాడు ఆ గురువే! అదే విధంగా ఇందూజ్ఞానం చెప్తూ ఉంటే అది క్రైస్థవుల జ్ఞానం తెలియ జేస్తున్నాడు అని అనుకునేటట్లు చేసే మాయ గురువును నమ్మేటట్లు చేస్తుందా?

అందుకే గురువు భూమి మీదకు వచ్చేముందు తన మాయను ముందే హెచ్చరిస్తాడు. అందుకే ఈయన గురువే అని ఎవరికైనా అనుమానం వస్తే చాలు ఆ వ్యక్తిని ఈయన గురువు కాదు అని నమ్మించేటట్లు చేస్తుంది మాయ. ఆ విధంగా మాయా ప్రభావం వలన ఆయన గురువు కాదు అనేది నిశ్చయించుకుంటాడు ఆ వ్యక్తి.

# 52. కర్మ మర్మము

తేది : 04-05-2012

'కర్మ' అనే పదమును ఆధ్యాత్మిక విద్యలో చాలాసార్లు వాడుతూ ఉంటారు. ఈ కర్మ అనే పదం ఒక్క (హి) ఇందూ మతములోనే కాకుండా అన్ని మతములలోనూ ఈ పదం వాడబడి ఉన్నది. ఖురాన్ గ్రంథములో కూడా **"ప్రతీ మనిషి యొక్క కర్మ తలలో వ్రేలాడదీయబడి ఉంది"** అని వాక్యం ఉన్నది. భగవద్గీతలో కూడా కర్మ వలనే మనిషి పుట్టించబడుచున్నాడు. కష్టసుఖాలు అనుభవిస్తున్నాడు. అని చెప్పటం జరిగింది. "కర్మ" అనే పదం అందరికీ ఒకే విధంగా ఉన్ననూ, వాటి అనుభవం మాత్రం ఒక్కొక్కరికి ఒక్కొక్క విధానంగా ఉన్నది. అయితే ఇప్పుడు ఒక నీటి ప్రమాదంలో బస్సు మునిగిపోయి ప్రమాదంలో అందరూ చనిపోయరనుకుందాము. అప్పుడు అందరూ ఒకే రకమైన కర్మ చేసారు కదా! అందుకే ఒకే రకంగా చనిపోయారు కదా! అని అనటానికి అవకాశం ఉంది. ఒక మనిషికి ఉన్న కర్మ ఇంకొక మనిషికి ఉండదు అని కూడా చెప్పుకుంటున్నాము. ఇప్పుడు మనం చెప్పుకునేది ఒకటి, ప్రత్యక్షంగా జరిగేది ఇంకొకటిగా ఉన్నది. కర్మ విధానాన్ని ఇంకా తెలుసుకుంటూ పోతే, కర్మ అనే పదం గూర్చి చెప్పబడింది గానీ కర్మ రహస్యము మాత్రం ఎక్కడా చెప్పబడలేదు అని మాత్రం చెప్పవచ్చును. కర్మ అనేది సాక్ష్యంగా ఉంది కానీ, ఏ కర్మ చేస్తే ఏ పాపం వస్తుంది ఏ పుణ్యం వస్తుంది. ఏ కర్మ ఏ కష్టాన్ని అందిస్తుంది, ఏ సుఖాన్ని అందిస్తుంది ఎక్కడా ప్రపంచంలో ఏ గ్రంథములలో కూడా లేదు. ఈ తప్పుకు ఈ శిక్ష అనేది లేదు. ఇండియన్ పీనల్ కోడ్‌లో ఈ తప్పుకు ఈ శిక్ష ఉంటుంది. అని వ్రాసినట్లు ఎవ్వరూ ఏ గ్రంథములోనూ వ్రాయలేదు. ఈ తెలియబరచబడని విధానాన్ని తెలుసుకోవటమే ఇప్పుడు మనం

చేయాల్సింది. కర్మ అనేది ప్రతీ మనిషికీ ఉంది. కర్మ లేని వారు భూమిమీద లేరు. అయితే ఈ కర్మ మనిషి పుట్టుకనుండి మొదలవుతుంది. మనిషి పుట్టినప్పుడే సంచిత కర్మ ప్రారబ్ధకర్మగా మార్చబడుతుంది. ఈ విషయము **"కలియుగము"** అనే గ్రంథములో వ్రాయటం జరిగింది. ఒక జీవితానికి సరిపోయే కర్మను ప్రారబ్దము అంటాము. ఈ ప్రారబ్దకర్మ ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క విధంగా ఉంటుంది. ప్రారబ్దకర్మను అనుసరించే శరీరాలు తయారవుతాయి, కష్టసుఖాలు కూడా కలుగుతాయి. ఇద్దరి చేతులలో నిప్పురవ్వను వేసినప్పటికీ బాధను అనుభవించేది ఒక్కొక్కరికి ఒక్కొక్క రకంగా ఉంటుంది. దీనికి ప్రత్యక్ష ఉదాహరణ తీసుకుందాం. ప్రతీ వ్యక్తికి హస్తముంది. హస్తములో ఐదు వ్రేళ్ళు ప్రకృతికి గుర్తు. మూడు గెనుపులు ప్రతీ వ్రేలిలో మూడు గుణాలకు ప్రతీక. మూడు రేఖలు ముగ్గురి పురుషులకు గుర్తని, హస్తములోనే జీవాత్మ, ఆత్మ, పరమాత్మలకు గుర్తులని, పూర్వం నిద్రలేస్తూనే ఈ హస్తాన్ని చూసుకుని, అందులో ఉన్న రేఖల్ని చూసుకునే వారని, మూడు ఆత్మలను జ్ఞాపకం చేసుకొనేవారని, చివరికి నిద్రపోయేంత వరకు ఆ జ్ఞాపకంతోనే బ్రతికేవారని మనం ముందే చెప్పుకొన్నాము. కాలక్రమేనా ఆ అలవాటంతా పోయింది. ఆ మూడు రేఖల విషయం తెలియకుండా పోయింది. అప్పుడు పెద్దగా ఉన్న మూడురేఖలనే కాకుండా అరచేతిలో ఉన్న చిన్నచిన్న గీతలు కూడా చూసుకునేవారు. తరువాత వ్రేళ్ళను చూసినా సరే చిన్న చిన్న గీతలు ఉన్నాయి. బ్రొటన వేలితో మనం ఈ రోజు వేలిముద్ర అని వేస్తున్నాము. సంతకాలకంటే కూడా వేలి ముద్రకు ఎక్కువ ప్రాముఖ్యత ఉన్నదని చెప్పవచ్చును. ఈ వేలి ముద్రలు ఒక్కొక్క మనిషికి ఒక్కొక్కలాగా ఉంటాయి తప్ప ఏ ఒక్కరి వేలిముద్ర ఇంకొక వేలిముద్రతో అసలు పోలికలు ఉండవు. ఎందుకు ఇంత తేడాలున్నవి అని

ఆలోచిస్తే, పెద్ద రేఖలైన జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు, చిన్నచిన్న గీతలుగా ఉన్న కర్మలు కలిగి ఉన్న మనిషి శరీరంలో ఉన్నాయి. అని తెలియజేసేందుకు గాను, హస్తములో ఆ గీతలు ముద్రించబడినాయి. ఒక మనిషికి ఉన్న కర్మలు ఇంకొక మనిషికి ఉండవు అని తెలిపే నిమిత్తం ఏ ఒక్కరి అరచేయిలో ఉన్న గీతలు, ఇంకొకరి అరచేతిలో ఉన్న గీతలకు పోలికలు అస్సలు ఉండవు. వ్రేలిముద్రలు అందుకే ప్రతీవిషయంలో, నేరపరిశోధనలో గానీ, బ్యాంకు అకౌంట్ విషయంలో గానీ  వ్రేలిముద్రలు తీసుకుంటారు. ఎందుకంటే ఇంత జనాభాలో ప్రపంచంలో ఏ ఒక్కరి వ్రేలిముద్ర నీ వ్రేలిముద్రతో అసలు పోలికలు ఉండవు కనుక. వ్రేలిముద్రే కాదు, మెత్తం అరచేయిలో ఉన్న చిన్న గీతలు కూడా ఏ ఒక్కరితోను ఏ ఒక్కరి అరచేయి ముద్రలు పోలికలు ఉండవు. అదే విధంగా ముఖాలలో కూడా పోలికలు ఉండవు. ఒకవేళ పోలికలు ఉన్నట్లు కనిపించినా ఒక్కంతైనా ముఖ వర్చస్సులో గానీ, ముఖపరిమాణంలో గానీ తేడా ఉంటుంది. ఈ విధంగా తేడాలు ఎందుకు పెట్టబడినాయి?  అంటే కర్మలు అనేక విధాలుగా ఉన్నాయి. ఒక మనిషిని పోలు కర్మలు ఇంకొక మనిషికి ఉండవు అని తెలుసుకునేందుకు ఈ విధంగా పెట్టబడినాయి. ఈ విధంగా వేరువేరు విధములుగా మనుషులు కర్మలను అనుభవిస్తున్నారని తెలియాలి. ఒక మనిషి అనుభవించు కర్మలు ఇంకొక మనిషి అనుభవించలేడు.

ఇంతకు ముందు ఆగామికర్మ, సంచితకర్మ మరియు ప్రారబ్ద కర్మలున్నాయని మనం తెలుసుకున్నాము. ఒక మనిషి తన జీవితంలో సంపాదించుకున్న కర్మను ఆగామికర్మ అంటారు. ఈ ఆగామి కర్మ సంచితకర్మ అనే నిలువలోకి చేరిపోతుంది. ఈ సంచితం నుండి ప్రారబ్ధం అనేది నిర్ణయించబడుతుంది. ఈ సంచిత కర్మ నుండి ప్రారబ్దం నిర్ణయం

అవుతుంది కదా ఆ ప్రారబ్ద కర్మ నిర్ణయమైనప్పుడు ఆ కర్మ అట్లానే వస్తుందా లేక మార్పు చెంది వస్తుందా అనే విషయం ఏ మానవునికీ తెలియదు. ఏ గ్రంథములోనూ వ్రాయబడలేదు. మీరు పెద్దపెద్ద పాపాలు చేస్తుంటారు అవి కొంత గుర్తింపుగా ఉంటాయి. చిన్నపాపాలు ఉంటాయి. చిన్నపాపాలు పెద్దపాపాలు అన్నీ కలసిపోయి సంచితం అనే కర్మలో చేరిపోతాయి. మరి ప్రారబ్దము అనే కర్మలో ఎట్లా చేరుతున్నది అని తెలుసుకుందాం. ఒక ఉదాహరణ తీసుకుందాం సాంబారు మనం తయారు చేస్తున్నాం. సాంబారు తయారు చేసినప్పుడు ఉప్పు, కారం, చింతపండు, పప్పు, కాయకూరలు వేస్తూ ఉంటాము. టమాటాలు, వంకాయలు వేస్తాము. ఈ సాంబారులో చింతపండు కనిపించదు, కారం కనిపించదు, ఉప్పు కనిపించదు. ఎక్కడైనా వంకాయ ముక్కలు, టమోటా తోల్లు మాత్రం కనిపిస్తాయి. నీవు చేసుకునే కర్మలు ఎట్లు ఉంటాయంటే, ఒక జీవితంలో రకరకములైన కర్మలు చేసుకుంటుంటారు. రకరకములైన కర్మలు అంటే చింతపండు, కారం, ఉప్పు, కాయకూరలు లాంటివిగా ఉంటాయి. ఈ తప్పుకు ఈ శిక్ష అని తెలుసుకునేందుకు అవకాశం లేకుండా ఉన్నది అనేందుకు ఉదాహరణగా ఈ ఉప్పు, కారం, పులుపులు కనిపించకుండా ఉన్నట్లు చెప్పుకుంటే ఒకే రకమైన కర్మ చేసారు, ఒకే రకంగా మరణించారు అని అడిగితే, అందరూ ఒకే రకమైన కర్మలు చేయనేలేదు, వేరువేరు కర్మలే చేసారు. కానీ సాంబారులో అన్నీ కలిసి పోయినట్లు, రుచి ఏర్పడినట్లు ఒక సంఘటనలో అన్ని కర్మలు కలిసి పోతున్నవి. ఈ విషయం క్రొత్తది. నీ కర్మలన్నీ కలిసిపోయి, ఈ తప్పుకు ఈ శిక్షే అనుకోకుండా కర్మలన్నీ కలిసిపోయి, అనుభవాలు మీ జీవితంలో జరుగుచున్నాయి. అదే ప్రారబ్దంలో జరిగే సంఘటనలు. ఈ ప్రారబ్దం తయారయ్యేటప్పుడు ప్రత్యేకంగా తయారవుతున్నది. ఎప్పుడు

పదికుండలలో తయారు చేసిన సాంబారులో ఉప్పు కనిపించదు, కారం కనిపించదు. అంటే ఒక బస్ ప్రమాదం జరిగింది అనుకోండి, అందరూ ఒకే రకంగా చనిపోయారనుకోండి అంటే వారు చేసుకున్న కర్మలన్నీ కలసిపోయి, మిళితకర్మ అంతా కలిసి పని అమలుజరుగుతుంది. దాని అనుభవాన్ని మాత్రం మనం అనుభవిస్తున్నాము. ఆ విధంగా సంచితంగా ఉన్నది ప్రారబ్ధంగా మారుతుంది. కానీ జీవితంలో కొన్ని ప్రత్యేకమైన పాపాలు మాత్రం మనం అనుభవిస్తున్నాము. ఆ విధంగా సంచితంగా ఉన్నది ప్రారబ్ధంగా మారుతుంది. కానీ జీవితంలో కొన్ని ప్రత్యేకమైన పాపాలు మాత్రం అనుభవంలోకి వచ్చేటప్పుడు ప్రత్యేక శిక్షలు అమలు జరుగుతాయి. కొన్ని కర్మలకు ప్రత్యేక శిక్షలు లేకున్నా కలసిపోయి సామూహికంగా జరిగితే శిక్షలలో కలసిపోతాయి. కొన్ని పాపాలు మాత్రం ప్రత్యేకంగా తెలిసేటట్లు శిక్షలు ఉంటాయి. ఫలానా కేన్సర్ రోగానికి ఈ పాపమే కారణం అని ముందు చెప్పాము. అంటే ఇది ప్రత్యేక పాపం. ఏ విధంగా ఇంత సాంబారులో వంకాయ ముక్కలు గుర్తించగలిగామో, ఈ విధంగా ఈ పాపానికి ఈ విధమైన శిక్ష అని ప్రత్యేకపాపానికి శిక్షగా గుర్తించవచ్చు. ఈ విధంగా కొన్ని సంఘటలు మీ జీవితంలో గుర్తించబడుతున్నాయి. కొన్ని అసలుకు గుర్తింపు ఉండవు. ఈ విధంగా కర్మ విధానం జరుగుతూ ఉన్నది. ప్రతీమనిషి యొక్క కర్మ ఉండి, వాడు అనుభవించే కష్టసుఖాలకు ఆధారమై ఉంటున్నది. ఆ కర్మలు అనుసరించే ఆత్మ వాడిని ప్రేరేపించి కష్టసుఖాలను అందిస్తూ ఉంది. ఈ విధంగా మనిషి చేసుకునే ప్రత్యేకమైన పాపానికి ప్రత్యేకమైన శిక్షలుగా వస్తున్నవి కానీ అన్ని పాపాలకు ప్రత్యేకమైన శిక్షలుగా రావటం లేదు. ప్రపంచపరమైన కర్మలవిధానంలో పాపాలకు శిక్షలు ఈ విధంగా ఉంటాయి. కానీ దేవుని యెడల చేసిన పాపాలు

క్షమించబడని పాపాలుగా పరిగణింపబడతాయి. ఆ పాపాలను చెడిపోయిన సాంబారుతో పోల్చవచ్చు. మంచి సాంబారు అయితే రుచి ఉంటుంది కనుక ఉప్పు, పులుపు, కారం గుర్తించవచ్చు కానీ చెడిపోయిన సాంబారు మాత్రము గుర్తించడానికి మాత్రం ఏ అవకాశం ఉండదు. ఆ విధంగా ఆయన జీవితము పూర్తి వేరుగా ఉంటుంది. అటువంటి వాని కర్మలు ప్రత్యేకంగా ఉంటాయి. ప్రపంచవరమైన పాపాన్ని అనుభవిస్తే సరిపోతుంది కానీ దేవునికి సంబంధించిన పాపం మామూలుగా పోదు. చెడిపోయిన సాంబారు అలాగ అట్టిపెట్టుకొని నీవే తినాల్సిఉంటుంది కనుక భగవద్గీతలో గానీ, బైబిల్ గానీ, ఖురాన్ గానీ గ్రంథములలో **"దేవునికి సంబంధించిన పాపాలు క్షమించబడవు"** అని వ్రాయబడి ఉన్నవి, అవి తప్పకుండా అనుభవించాల్సిందే. మరి దీనికి కొద్దిగా అయినా క్షమాపణ లేదా? అని ప్రశ్న వస్తే ఏ మాత్రము క్షమాపణ లేదు. దైవజ్ఞానము దీనిని క్షమించదు. దైవజ్ఞానము ప్రపంచవరమైన పాపాలను క్షమిస్తుంది గానీ, దేవుని యెడల చేసిన పాపాన్ని మాత్రం క్షమించదు. ఈ జన్మలో చేసుకున్న పాపం వచ్చే జన్మలో అనుభవించడానికి ప్రపంచవరమైన కర్మలలో ఉంటుంది కానీ, దేవుని యెడల ఒకసారి పాపం చేస్తే, అది రెండు యుగాల పర్యంతం అనుభవించాల్సిన పరిస్థితి వస్తుంది. లక్షలజన్మలు ఎత్తుతూ, చస్తూ అనేక జన్మల కాలం ఆ పాపాన్ని అనుభవించాల్సి వస్తుంది.

దేవుని జ్ఞానాన్ని కొంత తెలుసుకున్నంత మాత్రాన నాకు దేవుని జ్ఞానం అంతా తెలిసిపోయింది అని అనుకొని పూర్తిగా ఆ సమాచారం తెలియక ముందే, దేవుని సమాచారాన్ని మనం వక్రంగా చెప్పుకోవటానికి అవకాశం ఉంది. ఆధ్యాత్మిక విద్యరీత్యా దేవుడున్నాడు. దేవుని విషయం గురువు చెప్పాలి. గురువు చెప్తే మనిషి వినాలి అని ఒక సూత్రము ఉంది.

ఒకడు సంపాదించేవాడు ఇంకొకడు తినేవాడున్నడనుకుందాం. సంపాదించే వాడికి గవర్నమెంట్ వారు జీతం ఇస్తూ ఉన్నాడు. వీడు పనిచేస్తూ ఉన్నాడు, ఎవర్ని సాకుతున్నాడు? ఇంట్లోవారిని సాకుతున్నాడు. ఇంట్లోవారు లేకపోతే వారిని సాకవలసిన అవసరం లేదు. ఉద్యోగమే లేకపోతే జీతం ఇచ్చే అవకాశమే లేదు. వీడు బ్రతికే అవకాశమే లేదు. ఈ విధంగా ఒకదానికొకటి సంబంధం ఉంటుంది.

దీనిని వివరంగా చెప్పుకుంటే, గురువు, దేవుడు అనే వారిలో దేవుని విషయాన్ని గురువు చెప్పాలి. గురువు చెప్తే ప్రజలు వినాలి. ప్రజలే లేకపోతే గురువే అవసరం లేదు. అంటే మనిషి అనేవాడు లేకపోతే దేవుడు, గురువు అనేవారే అవసరం లేదు. ఆ విధంగా కాకుండా గురువే లేకపోతే దేవుడు మనిషికి నేరుగా జ్ఞానాన్ని చెప్పలేడు. గురువు లేకపోతే దేవుడికి, మనిషికి మధ్య సంబంధం లేదు. ఈ విధంగా చూస్తే ముగ్గురూ ఉండాలి. గురువు లేకుండా మనిషి, మనిషి లేకుండా దేవుడు, గురువు లేకుండా దేవుడు ఉండడు. ఒకదానిని తీసివేస్తే అది ఆధ్యాత్మిక విద్యలో సరైన పద్ధతి కాదు. కొందరు గురువు అవసరం లేదు. దేవుడున్నాడు అనే విషయం తెలిసి పోయింది కదా, కనుక ఆ దేవున్నే పూజిస్తే సరిపోతుంది కదా, మరి గురువుతో మనకింకేమి పని? అని అనుకుంటున్నారు. అప్పుడు దేవుడు ఒక్కడే అగును. దేవుడు మాత్రం నేరుగా మనిషికి జ్ఞానం చెప్పడు. మనిషి నేరుగా దేవుని నుండి ఏమీ తెలుసుకోలేడు. మధ్యవ్యక్తి ఒకరు కావాలి, అతనే గురువు. కుమారునికి తల్లి ఉంటేనే తండ్రి విషయం తెలుస్తుంది. తండ్రి విషయం తల్లి ద్వారా కొడుకుకు తెలుస్తుంది. అదే విధంగా ఫలానావాడు దేవుడు అని తెలియాలంటే గురువు కావాలి. నీకు ఫలానావాడు గురువు అనే విషయం తెలియాల్సిన అవసరం లేదు. నీకు తెలుసుకోవాలి

అనే శ్రద్ధ ఉంటే తెలియజెప్పేవాడు గురువు. చాలామంది గురువులలో ఆ గురువు కూడా కలిసిపోయి ఉంటాడు. వారంతా చెప్పని విధానాన్ని తెలియజెప్పి పోతాడు. వాడు గురువే. గురువు నీకు తెలియబడడు గానీ, నీవు మాత్రం గురువుకు తెలియబడతావు. నీకేది అవసరమో గురువు నీకు అందిస్తాడు. నీవు మాత్రం గురువును తెలుసుకునేందుకు అవకాశం లేదు. ఈ విధంగా **'గురువు ద్వారానే దేవుని జ్ఞానం లభ్యమవుతుంది'** అనే సూత్రానికి విరుద్ధంగా పోతే క్షమింపరాని పాపమవుతుంది. అది రెండుయుగాల పర్యంతం ఆ పాపాన్ని అనుభవించాల్సి ఉంటుంది. రెండు యుగాల పర్యంతం ఆ పాపాన్ని అనుభవించే దానికంటే మనం జాగ్రత్త కల్గి మసలుకోవటం చాలా మంచిది.

ఇప్పుడు భగవద్గీత, బైబిల్, ఖురాన్ గ్రంథములు, దేవుని ధర్మాలను గురువు చెప్పగా మనకు తెలియబడే గ్రంథములవి. దేవుడు నేరుగా ఈ విషయాలను అందించలేదు. ప్రత్యక్షంగా కాకుండా పరోక్షంగా అందిస్తున్నాడు. ఆ గ్రంథములలో ఉన్న విషయాలను వక్రీకరించి తెలియజేసుకుంటే అది విన్న పదిమందికీ వక్రమార్గమయి పోతుంది. కావున తద్వారా పాపం వచ్చే అవకాశం ఉంది. ఈ విషయంలో దేవున్ని ఎంత వేడుకున్నా క్షమించబడదు అని గ్రంథములలో వ్రాయబడి ఉంది. దేవుని జ్ఞానం వద్ద, దేవుని జ్ఞానం తెలియజేసేవారి వద్ద, జాగ్రత్తగా మెలగాలి కానీ, దూషించడం కానీ, చిన్నగా, చులకనగా మాట్లాడటం గానీ చేయకూడదు. కర్మలేని మనిషి ప్రపంచంలో ఉన్నాడా అంటే లేడనే చెప్పాలి. కర్మలలో చాలా తేడాలున్నాయి. కావున ఒకడు రాజుగా ఉన్నాడు, ఇంకొకడు మంత్రిగా ఉన్నాడు, మరొకరు గుమస్తాగా ఉన్నాడు. ఒకడు సుఖంగా, ఇంకొకడు కష్టంగా బ్రతుకుచున్నాడు. ఈ విధంగా సంపాదించుకున్న కర్మను

www.thraithashakam.org

మన శరీరంలో ఉండే ఆత్మ అనుభవింపజేస్తూ ఉంది. కొన్ని కర్మలను అనుభవానికి రానివ్వకుండా తప్పించేది కూడా ఆత్మయే. ఆత్మ ప్రపంచ వరమైన కర్మలను వాటి అనుభవాలను తప్పించగలదు. కానీ దేవుని యెడల చేసిన పాప కర్మ అనుభవాన్ని మాత్రం తప్పించలేదు. ప్రపంచవరమైన పాపకర్మలలో కూడా ప్రత్యేకంగా కనిపిస్తూ, వాటి అనుభవాలు కూడా ప్రత్యేకంగా ఉండును. అంగవైకల్యం వచ్చిందనుకోండి ప్రత్యేకమైన కర్మ, కాలు లోపం వస్తే అది ప్రత్యేకమైన కర్మ. అన్ని కర్మలు కలసిపోయి అందరితో పాటు అనుభవించే శిక్షలులాంటివి కాకుండా అందరికీ లేనిది నీకు జరుగుతుంది. ఈ విధంగా ప్రతీకర్మ అనుభవానికి వస్తుంది. అయితే కర్మలను పోగొట్టుకునే విధానం మనం నేర్చుకోవాలి అంటే ఏమి చేయాలి? **"దేవుడు నీ కర్మలను క్షమించేవాడు"** అని ఒక గ్రంథములో వ్రాస్తే, దేవుడు ఏమి చెప్పినాడంటే, నీ కర్మలను నేరుగా నేను క్షమించను, నా జ్ఞానం నీ కర్మలను క్షమిస్తుంది అని చెప్పాడు. దేవుడు క్షమించును అని అనినా గానీ **"దేవుని జ్ఞానమే పాపకర్మను క్షమించగలదు."** ఏ మనిషైనా దేవుని జ్ఞానం తెలియకుండా కర్మలు పోగొట్టుకోవడానికి అవకాశం లేదు.

ఒకనికి ఒక రోగం వచ్చింది. వైద్యం తెలిసిన వాని వద్దకు పోయి అడిగితే, నీవు ఆంజనేయస్వామికి గుడిచుట్టూ 40 రోజులు ప్రదక్షిణ చేస్తే నీకు ఈ రోగం పోతుంది అని చెప్పినాడనుకోండి. మరి ఆ విధంగా చేస్తే పోతుందా అంటే అనుభవించకుండా తప్పిచుకునేందుకు అవకాశం లేదు. ఒకవేళ పోతే జ్ఞానం వలన పోవాలి గానీ భక్తి వలన పోదు. మనిషి కర్మల నుండి తప్పించుకోవాలంటే బాహ్య ఆచరణలకంటే అంతర్ముఖ ఆచరణలు ముఖ్యంగా పెట్టుకోవాలి. దేవుడు మన కర్మలను ఏ విధంగా క్షమించ గలుగుతాడంటే భగవద్గీతలో భక్తియోగంలో ఒకమాట చెప్పాడు. **"నా పనులు**

**చేయండి, నా సేవచేయండి కర్మలు మీరు పోగొట్టుకోవచ్చు ముక్తిని పొందవచ్చు"** అని చెప్పాడు. నీవు యోగము చేయుటకు అసమర్థుడవు అయినా గానీ, "అభ్యాసో అసమర్థోపి" నీవు అభ్యాసం చేయటానికి అసమర్థునివైనా గానీ, నా కొరకు పనులు చేస్తే "మత్కర్మపరమో భవ" కర్మలుపోయి మోక్షం రాగలదు. 'నా కొరకు పనులు చేయి అన్నాడు' గానీ 'నాకు పూజలు చేయి' అని చెప్పలేదు. యోగము చేస్తే కర్మలు పోతాయి అని భగవద్గీతలో చెప్పారు. నీవు దేవున్ని పూజిస్తే దేవున్ని కాకా పట్టినట్లు అగును. నేను నా జ్ఞానం తెలుసుకోండి అని మూడు గ్రంథములు భగవద్గీత, బైబిల్, ఖురాన్ ఇస్తే నీవు పొట్టివాడివి, పొడుగువాడివి అని నన్ను పొగిడితే మన కర్మలు ఎక్కడ తొలుగుతాయి? మేము ఇప్పుడు ఏమి చెప్తున్నామంటే దేవున్ని పూజించవద్దండి, పని చేసుకోండి అని అంటే, కొందరేమంటు న్నారంటే తన పనిని చేయించుకునేందుకే పూజ చేయవద్దంటున్నారు అని అనుకుంటున్నారు. మేము ఏమి అంటున్నామంటే పూజ ఎగరగొట్టినా పరవాలేదు గానీ దేవుని (సేవ) పని చేయండి అంటున్నాము. నీవు పూజచేస్తే నీకేమీ లాభం రాదు, ఆయనకు అసలుకు లాభం రాదు. నేను ఎలాగూ గొప్పవాడినే దానిని నీవెందుకు చెప్పాలి? ఒకరోజు నీవు గొప్ప అంటే పరవాలేదు గానీ ప్రతీరోజూ గొప్పగొప్ప అంటే ఏమి బాగుంటుంది? నన్ను పొగిడేదానికంటే, నా జ్ఞానం తెలుసుకోండి. తద్వారా మీ కర్మలు పోతాయి అని ఆయన చెప్పాడుగానీ, నన్ను పొగిడితే కర్మలు పోతాయి అని ఏ గ్రంథములో అయినా చెప్పాడా? ఈ విధంగా పరోక్షంగానైనా, ప్రత్యక్షంగా నైనా కొన్ని పనులుచేస్తే దేవుని జ్ఞానాన్ని అభివృద్ధికే తప్ప ఇంకొకటి కాదు. అందువలన మీరు చేసే పూజలు రద్దు చేయించి దేవుని పనులు చేయండి అని చెప్తున్నాం.

"మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి" 'నా కొరకు మీరు పనులు చేస్తే మీకు సిద్ధి (మోక్షం) అభిస్తుంది.' అయితే నా కొరకు పనులు చేస్తే అంటే ఏమి పనులు అని చూస్తే ఆయన భూమి మీదకు వచ్చి ఏమి పని చేశాడో అవే ఆయన పనులు. ఆయన వచ్చి తన జ్ఞానాన్ని తెలియ జేస్తాడు. కనుక ఆయన తెలియజేసిన జ్ఞానాన్ని మరికొందరికి తెలియబరిస్తే ఆయన పని అవుతుంది. అంతేగానీ ఆయనను పొగిడితే ఏమవుతుంది. అతను చెప్పినదానికి విరుద్ధమవుతుంది. రోజుకు నీవు పదిసార్లు పొగిడితే ఆయనేమైనా లావవుతాడా, అంతకంటే తక్కువ పొగిడితే సన్నబడతాడా? ఆయన ఎట్లాగుండాలో అట్లే ఉంటాడు. నీ కర్మలు పోగొట్టుకోవాలంటే నేను చెప్పిన జ్ఞానాన్ని అందరికీ చెప్తే నీ కర్మలు పోతాయి. నీవు ఒకవేళ నా జ్ఞానాన్ని తెలుసుకుని నీవు దానిని ఆచరించడానికి అసమర్థుడవైతే నేను తెలియజేసిన జ్ఞానాన్ని పదిమందికీ తెలియజేయుము. జ్ఞానం తెలుసుకోకుండా ప్రార్థన చేస్తాను, పూజచేస్తాను అంటే ప్రయోజనము లేదు. నాకు పూజ చేయకు గానీ పూజలో అర్థం తెలుసుకో.

ఒకరోజు ఒక పని నిమిత్తం అందరినీ పూజ ఎగురగొట్టి రమ్మన్నాము. దేవుని పూజ కూడా ఎగరగొట్టి కూడా రమ్మంటున్నారు, ఈయనకి ఎంత అహంకారము, అధర్మంగా ప్రవర్తిస్తున్నాడు అంటే మేమేమీ అధర్మంగా ప్రవర్తించడం లేదు. దేవుడు చెప్పిన ప్రకారం నేను ధర్మంగానే నడుస్తున్నాను. దేవునికి పొగడ్తలు ముఖ్యం కాదు. ఆయన పనిచేసే దానికే మనము పూనుకోవాలి, ప్రార్థనలు చేసేందుకు పూనుకోకూడదు. మేము ఈ మధ్య పంటి డాక్టర్ దగ్గరకు వెళ్ళాము ఆయన నాకు పరిచయమైన వ్యక్తే. ఆయన ఏమంటున్నాడంటే "దేశమంతా సోమరిపోతులు అయి పోతున్నారు" అంటున్నాడు. అంటే ఆయన నన్నే అంటున్నాడు. పని

పాటా లేకుండా జ్ఞానం, అదీ అంటూ అని నన్నే అంటున్నాడు, నాకర్థమయి పోతుంది నన్నే అంటున్నాడని. వారంతా ఏమి చేస్తున్నారంటే కొన్ని గంటల కాలం పనిచేసి నిద్రపోతున్నారు. మేము నిద్రపోము అనే విషయం ఆయనకు తెలియటం కోసం నేనేమి అన్నానంటే "రోజు ఎక్కువగా మేలుకొని ఉండటం వలన నా పళ్ళు ఏమైనా అల్లాడుతాయా?" అని అడిగాను. "మీరు నిద్రపోరా" అని నన్ను అడిగాడు. నేను రోజుకి ఒక గంట కాలమే నిద్ర పోయేది అని చెప్పాను. మాకంటే సోమరిపోతులు ఎక్కువ నిద్రపోతారు. మేము అలా నిద్రపోము అని చెప్పాను. ఈ విధంగా కొందరు జ్ఞానం విలువ తెలియక చులకన స్వభావంతో మాట్లాడుతుంటారు, అది పద్ధతి కాదు. దేవుని జ్ఞానాన్ని కించపరచినట్లు అవుతుంది. నిజంగా ఎవరైనా మంత్రములు, మహిమలు చేసి డబ్బులు సంపాదిస్తే మీరలా అనవచ్చును కానీ యోగుల వద్ద జ్ఞానం వద్ద అట్లా అనకూడదు.

మూల గ్రంథములలో ఏమి చెప్పబడిందంటే ఈ గ్రంథములలో ఉన్న కొన్ని విషయములు 'దేవునికి తప్ప మరెవరికీ తెలియవు' అని ఉన్నది. మొట్టమొదట చెప్పిన వ్యక్తులు ఆ గ్రంథాలలో మీకు వాటి వివరం తరువాత తెలియబడుతుంది అని చెప్పినాడు గానీ మనుషులకు ఎవ్వరికీ తెలియబడదు. ఖురాన్ గ్రంథంలో ప్రవక్తగారు కొన్ని మాటలు చెప్పి, ఈ మాటల పరమార్థము తరువాత వారు మీకు వివరిస్తారు అని చెప్పి ఆయన పోయెను. అటువంటి విషయాలు తెలిసే చోట హేళనగా మాట్లాడినా, ఇబ్బంది కలుగుతుంది. దానివలన కర్మను మనం సంపాదించుకోకూడదు. కర్మ అనే విధానం ఎవరు చూసారులే అని అనుకోకండి. కర్మ ఫలితాలు బయటకు కనిపించినప్పుడు దాని బాధ తెలుస్తుంది. కానీ అది ముందు కనిపించదు. కనిపించనంత మాత్రాన అది లేదు అనటానికి అవకాశమే

www.thraithashakam.org

లేదు. ఒక్క క్షణం చేసిన పాపం కొన్ని సంవత్సరాలపాటు అనుభవానికి సరిపోతుంది. కనుక కర్మల యెడల చాలా జాగ్రత్తగా ఉండాలి. జ్ఞానాన్ని తెలుసుకొని కర్మలు లేకుండా చేసుకోండి. జ్ఞానం ఎక్కడ తెలుస్తుంది? అని ఒక హిందువు అడిగితే భగవద్గీతలో అని చెప్తాను. ఒక క్రైస్తవుడు అడిగితే బైబిల్ అని చెప్పవచ్చును. అలాగే ఒక ముస్లిమ్ అడిగితే ఖురాన్ చదువుకోండి అని చెప్తాను. ప్రతీ గ్రంథంలో కర్మలు పోయే విధానం ఉంది. శ్రద్ధ పెట్టి చదివితే తెలుస్తుంది. మా దేవుడు చెప్పలేదే అంటే, మా దేవుడు మీ దేవుడు అనే ప్రసక్తే లేదు. అందరం మనుషులమే అందరికీ దేవుడొక్కడే. అందరికీ ఒకే తలకాయ, ఒకే ముక్కు, రెండు కళ్లు, ఒక నోరు ఉన్నాయి. శరీరములు ఒకే నిర్మాణంలో ఉంది. కనుక దేవుడు ఒక్కడే ఉన్నాడు. అదే కాకుండా స్త్రీలకొకమాట, పురుషులకొకమాట ఎక్కడా చెప్పలేదు. ఏది చెప్పినా **సర్వజీవరాసులకు** అని చెప్పినాడు. కనుక మనం ఏ జ్ఞానమైతే చెప్పుకున్నామో అది సర్వజీవరాసులకు శాస్త్రబద్ధమైనదిగా ఉంది అని తెలుసుకుని మన కర్మలు పోగొట్టుకునేందుకు ప్రయత్నించవలెను.

# 53. పుట్టుట - గిట్టుట

తేది : 04-05-2012

ప్రతీవ్యక్తి తను మరణించిన క్షణములోనే మరల జన్మిస్తున్నాడు. గతజన్మలో చనిపోయిన రోజునే ఈ జన్మలో పుట్టిన రోజుగా తెలియబడు చున్నది. ఒక వ్యక్తిని నువ్వు ఎప్పుడు పుట్టావు? అని అడిగితే, నేను ఫలానా దినము పుట్టాను అంటాడు. అంటే అతను స్వయంగా పుట్టెనా? ఆ విధంగా చెప్పుటకు ఏ అర్హత, అధికారము లేకపోయినా ఆ విధంగానే చెప్పుచున్నాడు. ఏ జీవుడు తాను స్వయముగా పుట్టడం లేదు. జీవుడు తనకు తానే ఏమైనా

ఆలోచించగలుగుచున్నాడా? తన వృత్తిలో ఉండే నైపుణ్యం ఎవరిదని ఆలోచించగలుగుచున్నాడా? ఇవన్నీ ప్రశ్నించుకుంటే జీవునికి ఏమాత్రము సంబంధము లేకుండానే జరుగుచున్నవి. నీవు నీ శరీరములో నువ్వు ఒక్కడివి కాకుండా, ఇంకొకడు కూడా ఉన్నాడు. నీవు కేవలం జీవాత్మవే. నీతోపాటు, నిన్ను తీసుకువచ్చువాడు కూడా ఒకడున్నాడు. ఒక శరీరములో ఉన్న నిన్ను మరొక శరీరంలోకి తీసుకు వెళ్ళేవాడు ఒకడున్నాడు. వాడెవ్వడో మీకు తెలియదు. జీవుడు స్వయముగా తానే వచ్చాననుకుంటున్నాడు. లోపలనున్న ఆ ఒక్కని గురించి ఎవరూ ఆలోచించటం లేదు. నువ్వు ఎరుకతో ఉన్నప్పుడు అన్ని పనులు నువ్వే చేస్తున్నావు అని అనుకోవచ్చు. నీ మీద నీకు జ్ఞాపకము లేని సమయాలలో చేసే పనులు కూడా నీవే చేశాను అని అనుకోవటం పొరపాటు కాదా!

ఒక శరీరమునుండి నువ్వు చేసుకున్న పాపపుణ్యములను, నిన్ను, నీతోపాటు ఉన్న గుణములను అన్నింటినీ రెండవ శరీరమునకు తెచ్చినవాడు ఒకడున్నాడు వాడే ఆత్మ, నువ్వు జీవాత్మవు. ప్రతీ జీవరాశిలోనూ, ప్రతీ జీవాత్మకు ఆత్మతోడై ఉన్నది. అదియే కాకుండా నీ శరీరములోనే కాకుండా, శరీరము బయటకూడా వ్యాపించువాడు ఒకడు గలడు. అతనే దేవుడు, అతనే పరమాత్మ. చివరికి అతనిలో ఐక్యం అయ్యేదానికి మనము ఈ రోజు జ్ఞానము తెలుసుకుంటున్నాము.

మన శరీరములో ఉండే రెండవ ఆత్మను తెలుసుకోకుండా శరీరం బయటా, లోపల ఉండే పరమాత్మను తెలుసుకునేందుకు అవకాశము లేదు. కానీ మనిషి తనలో ఇంకా ఇద్దరు ఉన్నారన్న విషయాన్ని పూర్తిగా మరచి పోయాడు. దేవుడు ఒకడున్నాడు అంటున్నారు తప్ప తన శరీరములో రెండవవాడైన ఆత్మను గురించి ఎవ్వరూ తెలుసుకోవటం లేదు. ప్రతీ

www.thraithashakam.org

మతంలోనూ ఈ రెండవ పురుషున్ని గూర్చి చాలా స్పష్టముగా చెప్పబడింది కానీ మనము దానిని మరచి ప్రవర్తిస్తున్నాము. ప్రతీ మత గ్రంథములోనూ ఈ ముగ్గురు పురుషులను గురించి ముఖ్యముగా చెప్పియున్నారు. **"నీ వెంట వచ్చువాడు ఒకడు, నీకు సాక్ష్యమిచ్చువాడు ఇంకొకరు"** ఉన్నారని ఇస్లామ్ గ్రంథములో (50–21) ఆయత్‌లో చెప్పబడి ఉన్నది. **"నీ వెంట వచ్చువాడు ఆత్మ, నీకు సాక్ష్యము ఇచ్చువాడు పరమాత్మ, నీవు జీవాత్మ"** అని చెప్పబడింది. భగవద్గీతలో కూడా పురుషోత్తమ ప్రాప్తి యోగము అనే అధ్యాయములో 16, 17 శ్లోకాలలో త్రైత సిద్ధాంతమునకు నాంది పలికింది. కానీ ఏ భగవద్గీతలోనూ, ఈ త్రైత సిద్ధాంతాన్ని విడమరచి ఆ శ్లోకాలలో చెప్పుకోలేదు. కేవలం ఇక్కడ మాత్రమే చెప్పబడింది. దానిని సిద్ధాంత రూపంగా చెప్పాము. బైబిలులో తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయని చెప్పారు.

జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను మూడు ఆత్మల గురించిన దానినే మనము త్రైత సిద్ధాంతము అని చెప్పాము. ఈ **"త్రైత సిద్ధాంతము"** అనేది ఎవరికీ అర్థము కావటం లేదు సరికదా ఈ త్రైత సిద్ధాంతమునే క్రైస్తవ మతములో త్రిత్వం అని చెప్పినారు. కనుక వీరు క్రైస్థవ మతమును గూర్చే చెప్పుచున్నారని అనే భ్రమలో హిందువులు పడిపోయారు. భగవద్గీత ఇ(హి)ందూ మతములో ఐదువేల సంవత్సరాలకు పూర్వము ఈ ముగ్గురు పురుషుల గురించి చెప్పబడితే, రెండువేల సంవత్సరాలకు పూర్వము బైబిల్ గ్రంథములో త్రిత్వముగా చెప్పబడుచున్న దానితో ముగ్గురు పురుషుల వివరము గుర్తింపనట్లు కలదు. **తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ** ఈ మూడింటిని త్రిత్వం అంటున్నారు కనుక త్రైతమును వారు త్రిత్వముగా చెప్పుకొన్నారు. అంతేగానీ త్రిత్వమును త్రైతముగా మనము చెప్పలేదు.

త్రైతము ముందు వచ్చినది తర్వాత రెండు వేల సంవత్సరములప్పుడు బైబిలులో వచ్చినది. ముందు భగవద్గీతలో చెప్పినదే తర్వాత బైబిలులో త్రిత్వము అని చెప్పారు. హిందువుల దానినే క్రైస్థవులు చెప్పారు. ఆ తర్వాత త్రిత్వమునే ఖురాన్ గ్రంథములో కూడా దానినే **"త్రోలబడేవాడు, త్రోలేవాడు, సాక్షిగాయున్న వాడు"** అని చెప్పారు. మూడు గ్రంథములలోనూ ఒకదానితో ఒకటి గుర్తింపబడనట్లు త్రైత సిద్ధాంతము చెప్పబడినది. అదే మూడు ఆత్మల సిద్ధాంతము.

ఈ విధంగా త్రైత సిద్ధాంతము 5000 సంవత్సరాలకు పూర్వమే భగవద్గీతలో కృష్ణుని చేత చెప్పబడింది. మరి 5000 సంవత్సరములకు పూర్వమే చెప్పబడి ఉంటే, ఈ పెద్దలు మనకి ఎందుకు తెలియజేయలేదు? నేడు మనము త్రైతము అని అంటుంటే ఈ పెద్దలంతా క్రైస్థవం అని ఎందుకు పేరు పెడుచున్నారు అంటే, ఈ విషయం వాళ్ళకు అర్థము కాలేదు. ఎందుకంటే ఈ జ్ఞానమనేది అందరికీ అర్థమయ్యే అవకాశము లేదు. కొన్ని విషయాలు ఏ మానవునికీ తెలియనటువంటివి ఉంటాయి అని ఒక దైవ గ్రంథములో చెప్పబడి ఉన్నది. చాలా విషయాలు దేవుడు చెప్పినవి మనుషులకు అర్థము కాలేదు. అవి తిరిగి చెప్పబడితేగానీ అవి అర్థముకావు, ఇంకొక ప్రవక్త ఏమన్నాడంటే **"నేను చెప్పిన వాక్యములు మీరు విన్నారుగానీ, మీరు పరమార్థాన్ని గ్రహించలేదు, రాబోయే కాలంలో ఈ విషయాలన్నీ వివరంగా చెప్ప బడతాయి. రాబోయే కాలంలో వచ్చేవారు ఈ విషయాల్ని మీకు వివరంగా చెప్పుదురు"** అని చెప్పాడు.

ఈ వివరం భగవద్గీతలో కూడా చెప్పబడింది ఏమనగా! **"క్షర, అక్షర, పురుషోత్తమ"** అనే విషయము ఎవరికీ అర్థముకాక, క్షర, అక్షర, పురుషోత్తమ' అని మూడు ఆత్మలున్నాయని అర్థముకాక, మనము చెప్పేదాన్ని

www.thraithashakam.org

తప్పుగా భావిస్తున్నారు. ఏ విధంగా అంటే త్రైతం అనేమాట ఇక్కడుంది, అదే త్రిత్వం అనే మాట అక్కడుంది. కనుక ఈ రెండు ఒక్కటే అని చెప్పేదాకా అర్థము కాలేదు. త్రైతమన్నా, త్రిత్వమన్నా అర్థములో ఒకటేగానీ, వారు చెప్పే దానిలో మూడు అనే భావము లేదు. మనము చెప్పేటటువంటిది వాస్తవమైన త్రైతము కానీ మన పెద్దలందరూ మూడింటి గురించి ఎక్కడా చెప్పలేదు. మన పెద్దలు రెండింటి గురించే చెప్పుకుంటున్నారు. ఏమి చెప్తున్నారంటే జీవుడు, దేవుడు అంటున్నారు. మధ్యలో 'ఆత్మను' గాలికి వదిలేశారు. పెద్దపెద్ద స్వామీజీలు కూడా ఆత్మ అనే దాని గురించి చెప్పటం లేదుగానీ జీవుడు, దేవుడు గురించి చెప్పుకున్నారు. సర్వసాధారణంగా ఆత్మ అనే పదాన్ని వాడినాగానీ ప్రత్యేకంగా గుర్తింపు లేకుండా పోయింది. రెండవవాడని, మధ్యవాడను భావము లేదు.

భగవద్గీతలో క్షర పురుషుడు, అక్షర పురుషుడు వీరిద్దరికంటే వేరుగా ఉన్న మూడవ పురుషుడు పురుషోత్తముడు ఒకరున్నారని చెపుతూ ఉత్తమ పురుషుడు అని చెప్పారు. అంటే పురుషోత్తముడు అని అందులో వివరముంటే, దేవుడు ఆ విధముగా వివరంగా చెపితే, వీరు ఏమి చేశారంటే, ఒకటి ప్రకృతి అంటే శరీరము, ఒకటి జీవుడు, ఇంకొకటి దేవుడు. క్షరుడు అంటే నాశనమయ్యేది శరీరము, శరీరము నాశనమవుతుంది కదా! కనుక క్షరుడు, అక్షరుడు అంటే నాశనంగానివాడు జీవుడు, పురుషోత్తముడు అంటే దేవుడు అని చెప్పినారు. అంటే వారు ప్రకృతి శరీరాన్ని కలుపుకున్నారు. వారు ముగ్గురునీ పురుషులుగా వివరించుకోలేదు. ఇప్పుడు జీవాత్మ, పరమాత్మ వారి వివరణలో పురుషులైనారు తప్ప, ముగ్గురు ఎక్కడైనారు? మొట్టమొదట చెప్పుకున్నా శరీరము ఏమవుతున్నదంటే, అది ప్రకృతిలో తయారు అవుతున్నది కనుక, ప్రకృతి సంబంధమైనటువంటిది. ప్రకృతి

స్త్రీతో సమానము అని భగవద్గీతలో 14వ అధ్యాయములో మూడవ శ్లోకములోనే వివరణ ఇవ్వబడింది. కనుక స్త్రీ తత్త్వంతో ఉన్న ప్రకృతిని తీసుకుని పురుషునిగా లెక్కించుకుంటున్నారు. అది తప్పని చెప్పవచ్చును. ఇద్దరి పురుషుల గురించే చెప్పి ఒక స్త్రీని చెప్పితే ముగ్గురు పురుషులు కాదు కదా! పురుషోత్తమ ప్రాప్తి యోగమను అధ్యాయము 16వ శ్లోకములో ఏమి చెప్పారో చూద్దాము.

శ్లో॥ (16) ద్వావిమౌ పురుషౌలోకే క్షర, శ్చాక్షర ఏవచ ।
క్షర స్సర్వాణి భూతాని, కూటస్థోక్షర ఉచ్యతే ॥

ఇద్దరు పురుషులన్నారు, క్షరుడు, అక్షరుడు అనేవారు అని అక్కడ చెప్పినారు. క్షరుడు అనే పురుషుడు సర్వజీవరాశుల్లో ఉన్నాడు. జీవరాశిగా ఎవ్వరైతే ఉన్నారో వారంతా క్షరులే "కూటస్థో అక్షర ఉచ్యతే" అక్షరుడు అనే పురుషుడు కూటస్థుడిగా ఉన్నాడు. ఎవ్వరితో కూటస్థుడిగా ఉన్నాడు? అంటే జీవాత్మతో కూడుకుని ఆత్మ ఉన్నాడు. వీరిద్దరూ పురుషులే. క్షరుడు, అక్షరుడు అంటే నాశనమయ్యేవాడు, నాశనం కానివాడు జీవాత్మ నాశనమవుతాడా అంటే, తప్పనిసరిగా నాశనమవుతాడు. ఏదో రోజు జీవాత్మ అనేది పేరు పోతుంది అంటే ముగ్గురి పురుషుల విభజనను చెప్పుకుంటే, జీవాత్మ, ఆత్మ, పరమాత్మ నాశనమయ్యే పురుషుడు, నాశనం కాని పురుషుడు, ఈ ఇద్దరికంటే ఉత్తమపురుషుడు ఉన్నాడు. ఫలానావాడు అని మాత్రము తెలియదు. వారినే దేవుడు అంటున్నాము. ఎవరైతే తెలియబడడో వాడే దేవుడు. వీరు తెలియబడతారు, ఎవరు? అంటే నాశనమయ్యేవాడు, నాశనం కానివాడు తెలుసుకుంటే తెలియబడతారు కానీ మూడోవాడైన దేవుడు అయినవాడు తెలియదు. ఈ రెండు ఆత్మలకు

www.thraithashakam.org

వేరుగా (పరముగా) ఉన్నాడు కావున పరమాత్మ అంటున్నాము. అతనిని మనము ఎలాగైనా చెప్పుకొనవచ్చుగానీ అతను మాత్రము తెలియబడడు. ఈ ముగ్గురు పురుషుల వివరము మన త్రైత సిద్ధాంతములో వివరించబడింది. అందరికీ జీవుడు, దేవుడు అనే పదాలు తెలుసుగానీ మధ్యలో ఉన్న రెండవ ఆత్మ అయిన అక్షరుని గురించి తెలియదు. ఈ ఆత్మ అన్నింటినీ కదిలింప జేస్తుంది. జీవన విధానాన్నంతా సాగిస్తూ ఉంది. నీవు చేయి పైకి ఎత్తాలి అంటే ఆ పనిని ఆత్మ చేస్తూ ఉంది. నీవు మాట్లాడాలి అంటే ఆ పనిని ఆత్మయే చేస్తూ మాట్లాడిస్తూ ఉంది. పైకి కనిపించే పనులేగాక శరీరము లోపల కనిపించక జరిగే పనులు కూడా ఆత్మయే జరిపిస్తున్నది. ఒకవేళ పొరపాటున శరీరము బయట జరిగే పనులు నీవే చేస్తున్నాను అని అన్నప్పటికీ, లోపల జరిగే పనులు ఎవరు చేస్తున్నారు? అని యోచన చేస్తే తెలుస్తుంది.

నీవు తినే ఆహారాన్ని జీర్ణింపజేస్తున్నావా? చేయటం లేదు. గుండెను పరిమితంగా కొట్టేటట్లు చేస్తున్నావా? లేదు. శరీరములో ఏ అవయవం ఆ పనిని చేసుకునేటట్లు నువ్వు చేయగలుగుచున్నావా? లేదు. రోగం వచ్చేటప్పుడు దానిని నీవు తగ్గించగలవా? లేదా, నీవు ఆ రోగాన్ని రాకుండా చేసుకోగలవా? లేదు. కనుక శరీరంలో సర్వఅధికారము ఎవరికున్నది? అంటే ఆత్మకున్నది. జీవాత్మకు ఏ అధికారము లేదు. శరీరములో రోగం బయట నుండి వస్తున్నది అంటున్నారు. బయట నుండే వస్తే లోపలికి ఎవరి అనుమతి తీసుకుని వస్తూ ఉన్నది. లోపల ఆత్మయొక్క అనుమతి తీసుకుని వస్తూ ఉన్నది. మరలా ఆత్మ అనుమతితోనే బయటకు పోవాలి. అదే విధంగా ఆ రోగంతోనే ఆ వ్యక్తిని మరణస్థితికి తీసుకువస్తున్నది, ఎవరంటే ఆత్మయే. అంటే ఈ చేయి నేను ఎత్తాలి అనుకుంటే ఎత్తుచున్నాను,

దించాలి అంటే దించుచున్నాను. నేను అనుకున్నట్లే జరుగుతుంది అంటే, అది నీ భ్రమ. ఎత్తేది అదే, చేయిని దించేది అదే "నేనే అన్నీ" అని నీవు అనుకునేటట్లు భ్రమిపంజేసేది ఆత్మే. **"దేవుడు అనుకుంటే నిన్ను ఏ మార్గములోనైనా పంపించగలడు"** అని ఒక దైవ గ్రంథములో వ్రాయబడి ఉన్నది. కనుక నిన్ను ఏ విధంగానైనా తీర్చిదిద్దేది ఆత్మే. ఒక మనిషి కష్టపడాలంటే, ఆ కష్టాన్ని తెచ్చి పెట్టిందెవరు, ఆత్మే. ఒక వ్యక్తికి అన్నీ లాభాలు వచ్చేటట్లు చేసి, ధనికులుగా చేయగలిగేది ఎవరు, ఆత్మే. శరీరములో మూల సూత్రధారి ఆత్మ ఉంది. అది ఏ విధంగానైనా, నీకు యోచన కల్గించి నిన్ను నడిపించ వచ్చు. అటువంటి ఆత్మను మనము మరచిపోయాము.

ఒక వ్యక్తి మరణించిన తరువాత, ఆ జీవుని వెనుక కర్మనంతటినీ మూటగట్టి ఇంకొక శరీరములోకి తీసుకువెళ్ళేది ఏది అంటే ఆ ఆత్మయే. స్వయంగా ఏ మనిషీ మరణించలేదు. ఏ మనిషీ పుట్టలేదు కూడా! స్వయంగా ఏ మనిషీ చనిపోలేదు అని ఎట్లా చెప్పుచున్నానంటే, ఏ మనిషీ ముందుకూడా చనిపోవాలని ఎవ్వరూ కోరుకోరు. చనిపోకుండా ఒక గంట కాలమైనా బ్రతికే ఉందామనుకుంటారుగానీ, ఎవ్వరూ చనిపోవాలనుకోరు. ఎవరు ఏమనుకున్నాగానీ బలవంతముగా చంపిందెవరు? అంటే ఆత్మ. కాబట్టి అప్పుడు నీ అధికారము ఏమీ లేదు, నీవు స్వయంగా ఏమీ చేయలేదు పుట్టేటప్పుడు గానీ, చచ్చేటప్పుడుగానీ నీకు అధికారము లేదు. నేను ఈ రోజు పుట్టాను అంటే, ఈ భాషలో మీరు పుట్టాను అని చెప్పవచ్చుగానీ, నేను పుట్టలేదు మొట్టమొదట నీ శరీరము వచ్చిన తరువాత దాంట్లోకి వెళ్ళిందెవరు ఆత్మ, దానివెనుక నీవు ఆ శరీరములోకి తేబడ్డావు. ఒక ఆవునో, బర్రెనో ఒక తాడుతో లాక్కొని వచ్చినట్లు ఆత్మ, జీవాత్మను

www.thraithashakam.org

లాక్కుంటూ వచ్చి ఇంకొక శరీరములోకి నిన్ను పెట్టుచున్నది. ఆ విధంగా పుట్టేందుకుగానీ, చచ్చేందుకుగానీ నీకు హక్కు లేదు. ఆత్మయే ఈ పని చేస్తున్నది. అనే విషయాన్ని మరచిపోయారు. నీ కర్మానుసారం ఏ శరీరములో నిన్ను వేయాలో అదే శరీరములో ఆత్మ వేస్తుంది. ఇది ఎవరు చేస్తున్నారు? ఆత్మే చేయిస్తున్నది. పుట్టేటప్పుడు స్వతంత్ర్యం లేదు, చనిపోయేటప్పుడు కూడా స్వతంత్ర్యము లేదు. మధ్యలో బ్రతికే దాంట్లో కూడా స్వతంత్ర్యత లేదు. కర్మలో ఏ విధంగా ఉంటే ఆ విధంగా జరుగుతుంది. కర్మలో వ్యతిరేఖంగా ఉంటే నీ బ్రతుకు కూడా వ్యతిరేఖంగానే జరుగుతుందిగానీ నీవు అనుకున్న ప్రకారము మాత్రము జరగదు. ఎందుకు అలా జరగదంటే? ఆత్మ ఆ విధంగానే జరిపిస్తూ ఉంది. మరి ఆత్మ ఎందుకు అలా జరిపిస్తున్నదంటే? నీ కర్మలో ఎట్లా ఉంటే అట్లా జరిపిస్తూ ఉంది. శరీరములో ముఖ్యపాత్ర ఆత్మ పోషిస్తూ ఉంది. ప్రపంచములో అందరూ ఈ ఆత్మను మరచిపోయారు.

నేను సంపాదిస్తున్నాను, నేనే మాట్లాడుచున్నాను అని నీవు అనుకున్నాగానీ వాస్తవంగా అన్నింటినీ ఆత్మయే చేస్తున్నది. ఏ రోగమూ నీకు చెప్పిరాదు, చెప్పిపోదు. ఆత్మకు అనుకూలమైతే, ఈ రోగంతో నీవు చనిపోతావని డాక్టరు చెప్పినా సరే, ఆత్మ ఏమి చేస్తుందంటే, చంపకుండా బ్రతికించగలదు. ఆ శక్తి ఆత్మకు ఉన్నది. భయంకరమైన రోగాలున్నాయి, ఈ రోగం వస్తే చనిపోవటం ఖచ్చితమని చెప్పే రోగాలున్నాయి. మరి ఆ రోగాల ద్వారా తప్పక చనిపోతావని చెప్పిన తరువాత కూడా జ్ఞాన విధానము ద్వారా మరలా బ్రతికిన సంఘటనలు చాలా ఉన్నాయి. ఇవన్నీ ఎవరు చేస్తూ ఉన్నారంటే, ఆత్మ చేస్తూ ఉంది అని చెప్పుచున్నాము. ఒక వ్యక్తి నాకీ రోగము పోలేదు అంటే ఎవరికి చెపుతావు, నీ ఆత్మకు నీవు చెప్పుకో.

www.thraithashakam.org

నీ రోగం పోయే విధానాన్ని నేను చెపుతాను ఎట్లా పోతుందో. రోగం మందుల వలన పోదు. నీవు మందు వాడితే ఈ రోగం తగ్గింది అని అనుకుంటున్నావు. కానీ అదే రోగానికి ఆ మందు వాడితే మనిషిని చంపే సంఘటనలు చాలా ఉన్నాయి. వాస్తవముగా శరీరములోనే రోగం ఉంది. నీ శరీరములోనే మందు ఉన్నది. నీవు ఆత్మకు అనుకూలముగా మారిపోతే, ఆత్మను మన శరీరములో ఉందని గుర్తించగల్గితే, ఆ రోగం యొక్క లక్షణాలు ఏమాత్రం కూడా కనిపించకుండా పోవుచున్నవి. ఇప్పుడు ఇక్కడే క్యాన్సర్ రోగంతో బాధపడుతూ కోలుకున్న వ్యక్తి ఒకరున్నారు. మరి ఆ వ్యక్తికి క్యాన్సర్ కణముల సముదాయం ఎలా తగ్గిపోయింది? ఎందుకంటే ఆత్మ అనుకుంటే ఏదైనా చేయగలదు. అందువలన ఈ వ్యాధే కాదు ఎయిడ్స్ రోగులు చివరిస్థాయిలో ఉన్నవారు కూడా ఒకే ఒక ఆత్మజ్ఞానము ద్వారా ఆ రోగాల్ని పోగొట్టుకున్న సంఘటనలు చాలా ఉన్నవి. ఆత్మజ్ఞానాన్ని తెలుసుకోగలిగితే రోగాలు పోతాయి అనే సూత్రమును మేము ముందే చెప్పియున్నాము. ఆత్మకు మీరు చెప్పుకుంటే దానికి క్షమించే గుణం ఉంది. ఆ విధంగా రోగాల్ని తగ్గించుకోండి, అంతేగానీ స్వామి దగ్గరకు వస్తే, ఆయన చెప్తే ఏ రోగమైనా పోతుంది అని అనుకోవద్దండి. నేను శాసిస్తే రోగాలు పోతాయి అని నేను చెప్పలేదండి. ఎంత పెద్ద రోగమైనాగానీ అది పోయే ఉపాయాన్ని చెప్పుచున్నాను గానీ ఆ రోగాన్ని మేము పోగొట్టగలమని చెప్పటం లేదు.

నీవు నీ ఆత్మకు అనుకూలముగా మారిపో, ఏ విధముగా మారేది డబ్బులిచ్చా, కానుకలు ఇచ్చా అంటే డబ్బు సంపాదించేదీ ఆత్మే, కానుకలిచ్చేదీ ఆత్మే. కనుక ఆత్మయే సర్వాధికారం కలిగివుంది. నన్ను ఈ శరీరములో వేసింది ఆత్మే కనుక ఈ శరీరములో నేను ఉన్నాను కానీ ఈ శరీరమే

నేను అనుకుని పొరపడితే ఏమవుతుంది. అజ్ఞానము అవుతుంది. కనుక ఈ శరీరములో నేను ఒక భాగం మాత్రమే కానీ, నేను ఈ శరీరము కాదు. నేను ఉన్నట్లే ఈ శరీరములో చాలా భాగములున్నాయి. బుద్ధి, చిత్తము, అహం, మనస్సు ఎన్నో ఉన్నాయి. కనిపించని, కనిపించే భాగాలు మన శరీరములో చాలా ఉన్నాయి. కానీ ఈ శరీరమంతటికీ ఆత్మయే అధిపతిగా ఉండి శరీరములో ఉన్న భాగాలన్నిటినీ నడిపిస్తూ ఉంది. శరీరములో 24 భాగములున్నాయి. నువ్వు కలిస్తే 25 భాగములు అవుతాయి. 25 భాగాలను నడిపించే వాడే ఆత్మ కనుక ఈ శరీరములోకి నా ఆత్మ తెచ్చి, నన్ను వేసింది కాబట్టి ఎప్పుడు వేసింది, అంటే వికృతి నామ సంవత్సరములో వేసింది. కృతి అంటే చేయబడేది, వికృతి అంటే విశేషంగా తయారు చేయబడ్డది. వికృతి నామ సంవత్సరము మరలా వచ్చింది కనుక 60 సంవత్సరాలు దాటిపోయి వికృతి నామ సంవత్సరము అయిపోయి, ఖర నామ సంవత్సరము పూర్తయి నందననామ సంవత్సరము వచ్చింది. అంటే 62 సంవత్సరాలు దాటి మేము 63వ సంవత్సరములోకి ప్రవేశించాము.

ఇప్పుడు ఈ 63 సంవత్సరములు ఈ శరీరములో గడిపినదెవరు? నేను గడిపానా? నా ఆత్మ గడిపిందా? అంటే నా ఆత్మ గడిపింది? నేను గడిపినాను అనుకుంటే అజ్ఞానము అయిపోతుంది. ఈ విషయం తెలియక మనమే అన్ని పనులు చేస్తున్నామనుకుంటున్నాము. మరి మీరు చెప్పిన విధానము ఎవ్వరూ చెప్పలేదే అంటే? పెద్దపెద్ద స్వామీజీలు కూడా పొరపాటు పడుచున్నారు. ఈ పూజ చేస్తే ఈ ఫలితము వస్తుంది, ఈ పని చేస్తే ఆ ఫలితము వస్తోంది అని చెప్పుకుంటున్నారు. కానీ ఏ పని చేసినా, ఏ పూజలు చేసినా ఫలితం ఇచ్చేవాడు ఒకడున్నాడు. పూజలు చేస్తే రోగాలు

పోయినాయా? చనిపోయేవాడు ఎట్లాగయినా చనిపోతాడు? కానీ జ్ఞాన విధానము తెలుసుకుంటే నీ శరీరములో రోగాన్ని పోగొట్టుకోవచ్చు. నీ శరీరంలో ఉండే బాధ నివారింపబడవచ్చు. ఇటువంటి సంఘటనలు జరిగినవి ప్రత్యక్షంగా చూపించాము. ఒక వ్యక్తి శరీరము మంచముపై పడి లేవలేక అవస్థలు పడుతుంటే ఆ పరిస్థితి ఆ శరీరమునకు తెచ్చినది ఎవరంటే వారి శరీరములో ఉండే ఆత్మయే. మరి మీ అందరికీ నిరూపణ నిమిత్తము ఈ రోజు ఆరుగంటలనుండి రేపటి ఆరుగంటలవరకు అన్ని బలములతో నీ శరీరమును అన్ని పనులు చేసే విధంగా బలాన్నిచ్చి రోగము నుండి తప్పిస్తుంది. తరువాత అంటే 12 లేదా 24 గంటల తర్వాత మరలా నిన్ను రోగగ్రస్తుడిగా చేస్తుంది. ఆ విధముగా చేసే పనులు కూడా కలవు. లోపల ఆత్మగా ఉన్న నేనే అన్నీ చేస్తున్నాను అనే గుర్తింపు నిమిత్తము ఆ విధంగా రోగాన్ని తగ్గించి మరలా రోగము వచ్చేటట్లు చేయుచున్నది. ఆ విధంగా ఆత్మ మనలను ఆడించుచున్నది. ఈ విధముగా ఆత్మను జ్ఞాపకము పెట్టుకుంటే ఏమవుతుంది అంటే ఆత్మ జ్ఞానమవుతుంది.

ఆత్మజ్ఞానము తెలియనిది ఎవ్వరూ ముందుకు పోయేందుకు అవకాశమే లేదు. జీవితములో ఎన్ని వేషాలు వేసినాగానీ అన్నింటినీ చేసేది ఆ ఆత్మయే. ఇంతకు ముందే మేము చెప్పాము. బాలసుబ్రమణ్యం గారు బాగా పాడుచున్నారంటే ఎవరు కారణం అంటే, అతనిలో ఉండే ఆత్మయే కారణము. అదే విధంగా ప్రపంచములో ఎవరికీ తెలియని, ఏ స్వామీజీ చెప్పని జ్ఞానాన్ని విశేషంగా ఈ శరీరమునుండి చెప్పిస్తూ ఉంది. కనుక మేము చెప్పుచున్నాము అంటే ఇద్దరు చెప్పుచున్నట్టు, ఆ ఇద్దరు ఎవరు? నేను మరియు నా ఆత్మ. నేను ఒక్కడినైతే ఈ జ్ఞానాన్ని చెప్పలేను, నేను మరియు నా ఆత్మ కలిసి మాత్రము చెప్పగలము. నేనైతే మీ లెక్కలో

మాట్లాడినట్లైనప్పటికీ అసలు విషయం బయటకు రాదు. నా వెనుక ఉన్నవాడు ఒకడున్నాడు, అతనికి అన్ని జ్ఞానాలు తెలుసును కనుక అతను ఏ జ్ఞానాన్ని అయిన సులభంగా చెప్పగలడు. ఆత్మకు అన్నీ తెలుసు, తెలియనిదంటూ ఏదీ లేదు, కనుక ఆత్మ చెప్తే ఏదైనా తెలియబడుతుంది. ఆత్మ ఏ రహస్యమునైనా బయటకు చెప్పును. అందుకే ప్రతీ గ్రంథములోనూ మేము చెప్పునది ఏమనగా! 'మేము' అని వ్రాస్తూ ఉంటాము. అది చూసి కొందరు బహువచనం వ్రాసుకున్నారు? మేము అంటే ఎందరని అంటున్నారు. మేము ఎందరని అంటే ఇద్దరమే ఉండేది. ఈ ఇద్దరము అనే పదము నీకు గుర్తుకుంటే 'మేము' అనే పదము వాడుదువు తెలియకపోతే 'నేను' అనే వాడుదువు. ఒకవేళ ఎవరైనా భాషను వాడుకలో నేను అనే పదమును వాడినా ఫరవాలేదు గానీ భావములో మాత్రము మేము అనే జ్ఞాపకము మాత్రము పెట్టుకోవలెను.

ఈ విధముగా నా శరీరములో ఉండే ఆత్మే, అందరి శరీరములో ఉన్నది. వేరువేరు శరీరములలో వేరు వేరుగా ఆత్మ ఉన్నది, కానీ మొత్తంగా చూసినట్లైన ఆత్మ అంతా ఒక్కటే. ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క ఆలోచనను, సిద్ధాంతాలను అతని ద్వారా బయటకు వచ్చేటట్లు చేసేది లోపల ఉన్న ఆత్మయే. అప్పుడు ఆ వ్యక్తి ఏమంటాడంటే నేను ఈ సిద్ధాంతాన్ని కనుక్కున్నాను అంటాడు. ఒక వ్యక్తి కూర్చుని ఉంటే ఆపిల్‌పండు క్రిందకు పడింది. అప్పుడు వీడి తలలో ఒక యోచన వచ్చిందన్న మాట. ఈ పండు క్రిందకే ఎందుకు పడాలి? పైకి ఎందుకు పోకూడదు? అని ఆలోచింపజేసి భూమికి ఆకర్షణ శక్తి ఉంది అని న్యూటన్ అనే వ్యక్తి కనుగొన్నాడు. ఈ విధంగా సూత్రాన్ని కనుగొని ఒక సిద్ధాంతాన్ని తయారు చేసినాడు అన్నమాట. దానినే న్యూటన్ సిద్ధాంతం అంటారు. అతను

కనుక్కున్నాడు కనుక అతను పేరుమీదగా న్యూటన్ సిద్ధాంతము అని పేరు పెట్టాడు. నిజంగా ఆ సిద్ధాంతాన్ని ఎవరు కనిపెట్టారు? న్యూటన్‌లో ఉండే ఆత్మయే ఆ విషయాన్ని తెలియజెప్పింది. ఇందరు జనాభా ఉండగా, నీలోనే ఆ ఆలోచన వచ్చినట్లు చేసినది ఎవరు? ఆత్మయే చేసింది. నేను కాదు నాలో ఉండే ఆత్మే చేసింది అనే భావన ఎవరికైనా కలదా? కానీ ఈ విషయం తెలియక రకరకాల పేర్లు సిద్ధాంతాలకు పెట్టారు. డార్విన్ సిద్ధాంతము అంటారు. వాస్తవంగా సిద్ధాంతాలు వారివా? అంటే వారి శరీరములో ఉండే ఆత్మ చెప్పినవే గానీ వారివి కానే కావు. కాని ఈ సత్యం పూర్తిగా మరచిపోయారు. పెద్దపెద్ద స్వామీజీలు కూడా మరచిపోయి, అంతా మనమే కదా! చేస్తున్నాము అంటారు. మరి ఏదైనా ప్రతికూలముగా జరిగితే విధివ్రాత అంటారు. పోనీ విధి వ్రాతే, వ్రాత ప్రకారము నిన్ను నడిపించేదెవరు? నీ శరీరములో ఉండే ఆత్మే, ఈ జ్ఞాపకాన్ని మనమందరము మరచిపోయాము.

దీనివలన ఆత్మజ్ఞానము తెలియకుండా పోయింది. తద్వారా నీకు నీవు సంపాదించుకున్న కర్మను నీవు అనుభవించాల్సివచ్చింది. నీవు షావుకారిగా బ్రతకాలని కర్మలో ఉంటే అదే జరుగుతుంది. బీదవాడిగా ఉండే కర్మను నీవు సంపాదించుకుంటే అదే జరుగుతుంది. అంగలోపంగా బ్రతికే కర్మ ఉంటే అంగలోపముతోనే బ్రతికే అవకాశము ఉంటుంది. ఈ విధముగా నీ కర్మ ప్రకారమే నీ శరీరములో నీ ఆత్మ నడిపిస్తూ ఉంది.

నేను నా ఆత్మను జ్ఞాపకములో పెట్టుకున్నాను. కనుక నా ఆత్మ నాకు అనుకూలముగా కొన్ని పనులు జరిగేటట్లు చేస్తున్నది. నేను నా ఆత్మను ప్రపంచ కోరికలు ఏవీ కోరలేదు. నాకు జ్ఞానము కావాలి అని

www.thraithashakam.org

అనుకున్నాను, కనుక నా ఆత్మ నాకు బాగా జ్ఞానాన్ని అందిస్తూ ఉంది. నేను ఏ రహస్యానైనా చెప్పగలను అని నేను ధైర్యంగా చెప్పగలగుచున్నానంటే, నాలో ఉన్న ఆత్మ అంత ధైర్యాన్ని ఇవ్వగలిగింది. నా ఆత్మ నాకు చాలా జ్ఞానాన్ని చెప్పుచున్నది. మీ ఆత్మకూడా మీకు జ్ఞానాన్ని అందిస్తుంది. కానీ ఆ విధంగా మీరెవ్వరూ కోరుకోలేదు. కానీ నేను కోరుకున్నాను కావున ఎంతటి జ్ఞానాన్ని అయినా అందిస్తున్నది. ఈ రోజు ఇస్లామ్ గ్రంథములో ఉండే జ్ఞానాన్ని సులభముగా నాకు అవగాహనకు వచ్చేటట్లు చేస్తూ ఉంది. అదే విధముగా బైబిల్‌లో ఉండే విషయాల్ని, ఇంతవరకూ క్రైస్తవులకు కూడా అర్థముకాని సూత్రాలన్నీ అవగాహనకు వచ్చేటట్లు చేసి బయటకు చెప్పిస్తూ ఉంది. అదే విధంగా హిందూమతములో ఉండే సూత్రాలు కూడా వివరముగా చెప్పిస్తూ ఉంది.

ఇంతకముందు మీరు చదివిన భగవద్గీతలకు మేము వ్రాసిన భగవద్గీతలకు చాలా తేడా ఉంది కదా? త్రైత సిద్ధాంత భగవద్గీత సాంఖ్యయోగము నుండి, 11వ శ్లోకం నుండి ప్రారంభమవుతుంది. మిగతా అన్ని భగవద్గీతలలో అర్జున విషాదయోగమునుండి ప్రారంభిస్తారు. కానీ మేము అర్జున విషాద యోగమునుండి కాకుండా, భగవంతుడు చెప్పిన జ్ఞానాన్ని మాత్రమే మేము ప్రారంభించాము. భగవంతుడు చెప్పినదే భగవద్గీత అనే సూత్రము ప్రకారము సాంఖ్యయోగమునందు 11వ శ్లోకమునుండి ప్రారంభమవుతున్నది. సాంఖ్యయోగములో 11వ శ్లోకమును, ఇప్పటి వరకు 300 మంది భాష్యకారులు ఆ శ్లోకానికి వివరము వ్రాసినప్పటికీ వారందరికంటే విభిన్నముగా మేము సరైన భావాన్ని ఆ శ్లోకానికి వ్రాయటం జరిగింది. ఇంకా ముందుకు వెళ్తే **“వాసాంసి జీర్ణాని”** అనే శ్లోకం దగ్గర **‘జనన సిద్ధాంతము’** అనేది ఎవ్వరికీ ఇంతకుముందు తెలియని సిద్ధాంతముగా

www.thraithashakam.org

బయటకు వచ్చింది. అక్కడ సూత్రము చెప్పబడింది. ఇక్కడ వివరము చెప్పబడింది. ఎవరు చెప్పారు? అంటే ప్రబోధానంద స్వామి కాదు కానీ ప్రబోధానందస్వామినైన నాలో ఉండే ఆత్మ చెప్పింది. ఆత్మకు అన్ని రహస్యములు తెలుసు. అతడు అక్షరుడు మరియు అంతము లేనటువంటి వాడు. కనుక అనంతుడు కనుక పుట్టుక ఎక్కడ జరిగింది? అంటే అనంతలో జరిగింది, అన్ని జ్ఞానాలు తెలుసు కాబట్టి పేరు పెద్దే. ఈ రెండూ అంటే అనంత మరియు పెద్ద అనే పేర్లు కనపడకుండా ప్రబోధానందగా మార్చు కున్నాము. ఆ విధంగా బోధ కూడా ప్రబోధ అయిపోయింది.

ఈ రోజు నా జన్మదిన వేడుకలలో చెప్పేది ఏమంటే, మనందరం అనంతులం కాదుగానీ అంతులం. అనంతుడుగా శరీరములో ఆత్మ అనేవాడు ఉన్నాడు కాబట్టి వాడు అంటే ఆత్మ, అనంత ఎక్కడ ఉందో అక్కడకు వచ్చి పుట్టాడు. జీవుడైన నేను అతను ముందు పుడితే ఆయన వెనుక నేను వచ్చాను. మనమందరం ఆ విధంగా వచ్చినవారమే. తరువాత ఏమి చేశాడు పెద్ద అని పేరు పెట్టుకున్నాడు. మనము పుట్టినప్పుడు ఎందుకు తెలియలేదంటే ఆలోచిస్తే తెలియును.

ఇప్పుడు ఇక్కడ కృష్ణపరమాత్మ ప్రతిమ లోపలుంది. బయటకు వస్తే ఒక ఫోటో ఉంది, అదెవరు అంటే ప్రబోధానందస్వామి. అంటే విశిష్టమైన బోధ చేసేవాడు, అంటే ఎవరు? ఆత్మ. అతను చెప్పే విషయాలను బయటకు చెప్పేవాడినైన నేను జీవాత్మను ఇక్కడ కూర్చున్నాను. లోపలున్న వాడు పరమాత్మ, మధ్యలో ఉన్నది ఆత్మ. ఇప్పుడు ఇక్కడ ఉన్నవాడు జీవాత్మ కనుక ఇక్కడ మూడు ఆత్మల వివరము కావాలంటే, మందిరము పైన కూడా మూడు కలశములు ఉన్నాయి. ఒకటి పెద్ద కలశము దానికంటే కొద్దిగా చిన్నకలశము, ఇంకా దానికంటే చిన్న కలశములు కలవు. వీటి

www.thraithashakam.org

వివరము ఏమనగా పురుషోత్తముడు పెద్ద, తరువాత అక్షరుడు, ఆ తరువాత క్షరుడు. శరీరములో ఉండే ఆత్మ ఏద్దైనా చేయగలదు. ప్రపంచములో ఒక్కసారి హార్ట్ఎటాక్ వస్తే చనిపోయేవారున్నారు. ఒకవేళ మొదటిసారి తప్పించుకుంటే రెండవసారి వస్తే చనిపోవుదురు. కానీ నాకు గుండెపోటు నాలుగుమార్లు వచ్చి, నాలుగవమారు నాలుగుగంటల కాలము గుండెను పిండేసింది, కానీ నేను కదలకూడదని తెలిసినప్పటికీ నేనే కారును నడుపు కుంటూ వెళ్ళాము. అంటే ఆత్మ అనుకుంటే ఏద్దైనా చేయగలదు. మాకు షుగర్వ్యాధి గలదు దానిని వ్యాధి అనము గానీ జాఢ్యము అనాలి. అది ఉన్నవారు స్వీట్స్ తినకూడదు, కాఫీ త్రాగకూడదు అని అంటారు, చప్పని కాఫీ త్రాగాలి, అన్నము తినకూడదు. గోధుమ చపాతీ తినాలి అనే నియమాలు ఉన్నాయి కదా! కానీ నేను ఏమాత్రము నియమాల్ని పాటించను ఏ సమయానికి ఏది దొరికితే అది తింటాము. ఈ జాఢ్యము వచ్చి 18 సంవత్సరాలు అయినప్పటికీ, మీరు ఇప్పుడు మమ్మల్ని చూస్తే షుగర్ ఉన్నట్లు ఏమైనా కనిపిస్తూ ఉన్నామా? అది నన్నేమి చేయలేదు. అంటే, లోపలున్న ఆత్మవలన నాలుగుసార్లు హార్ట్ఎటాక్ వచ్చినా ఏమీ చేయలేదంటే, ఎవరివల్ల అంటే ఆత్మవలననే సాధ్యమయింది. ఒకసారి కారు మేమే నడుపుతూ పోతూవుంటే రాత్రి ఒంటిగంటప్పుడు రోడ్డుపై అడ్డంగా ఉన్న లారీని గ్రుద్దాము. గ్రుద్దిన తరువాత మా కారును చూస్తే అందులో ఎవ్వరూ బ్రతకటానికి అవకాశము ఉండదు. ఆ ప్రమాదములో చిన్న గాయంకూడా పడకుండా బయటపడినామంటే అది లోపలుండే ఆత్మవలననే అది సాధ్యపడింది. ఇవన్నీ జీవుని యొక్క చాకచక్యము వలన జరిగే పని అనుకుంటే తప్పు అగును.

ఆత్మ నన్ను ఈ శరీరములో వేసింది. తరువాత ఏ శరీరములోనికి తీసుకువెళ్తుందో తెలియదు. మనకు తెలిసి ఎవ్వరమూ పుట్టలేదు. నేను తెల్లగా ఉన్నాను అని వ్యక్తి అనుకుంటున్నాడు కానీ వాడి శరీరము తెల్లగా ఉంటోందిగానీ వాడు కాదు అనే విషయం వాడికి తెలియదు. **'ప్రబోధ'** అనే గ్రంథములో **"శరీరము ఒక అద్దె ఇల్లు"** అనే అంశంలో కథలాగ వ్రాశాము. అందులో ఒక వ్యక్తి తెలివితక్కువవాడు అని అంటూ ఉంటాడు. చివరికి తెలివితక్కువ వాడు ఎవడు అంటే నీవే అని తెలుస్తుంది. మన శరీరములో తలయందు కర్మ అంటగట్టబడి ఉన్నది. నీ తలలో నీ కర్మలు వ్రేలాడగట్టబడినవి అని ఖురాన్ గ్రంథంలో కూడా చెప్పబడి ఉన్నది. చూడండి మనము చెప్పే వాక్యాన్నే అక్కడ కూడా చెప్పబడింది. మరి ఆ కర్మ ప్రకారము జరిగేటట్లు చేస్తున్నదెవరు? అంటే నీ శరీరములో ఉండే ఆత్మయే చేయిస్తున్నది. అటువంటి కర్మలనుండి తప్పించుకోవాలంటే ఏమి చేయాలి? నడిపేవాడైన ఆత్మతో నీవు స్నేహం చేస్తే ఏమవుతుంది? ఆత్మ కర్మను తప్పించగలుగుతాడు. ఒక రోగం నాకు వచ్చింది. జ్ఞాన మార్గంలో వెళ్ళేందుకు నాకు ఇది అడ్డువస్తున్నది అని ఆత్మను కోరితే ఆ రోగం మటుమాయమగును. మందు లేకుండా రోగం పోతుందా అంటే, మందుకంటే శక్తివంతంగా పనిచేసేది ఆత్మ ఒకటి ఉంది.

**"దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు"** అనే గ్రంథంలో వ్రాశాము. మేము ప్రత్యక్షంగా చూసిన విషయం ఏమంటే ఒక ఊర్లో గాలికుంటు వ్యాధి వచ్చింది. మేము చెప్పినట్లు చేయండి అని మమ్మల్ని ఉపాయం అడిగిన వారికి చెప్తే వారు అలాగే చేశారు. ఊర్లో అన్ని పశు వులకు ఆ వ్యాధి వచ్చినప్పటికీ ఆ ఇంటిగల పశువులకు మాత్రము ఆ రోగం రాలేదు. ఆ విధంగా చేసిందెవరు ఆత్మయే. ఆత్మజ్ఞానము తెలుసుకోండి అన్ని రోగాలు పోవును.

www.thraithashakam.org

# 54. ఆత్మ

తేది : 06-05-2012

ఒక మనిషి శరీరములో ఏమి జరుగుచున్నది అనే దానిని గురించి మనము చెప్పుకుంటూ ఉంటాము. ఇక్కడ యజ్ఞాల గురించి, యాగాల గురించి చెప్పము. దైవత్వానికి చేరుకునేందుకు ఉపాయాన్ని ఎక్కువగా మనము చెప్పుకుంటున్నాము. ఎందుకంటే మనము నివసించేది, కష్ట సుఖాలను అనుభవించేది శరీరములోనే, శరీరములోనే జీవితాన్ని మొత్తము సాగిస్తున్నాము. కనుక శరీరము లోపల ఉండే విధానాన్ని గురించే మనము చెప్పుకుంటున్నాము.

మన శరీరములో మనతోపాటు దేవుడు కూడా ఉన్నాడని కొందరికి తెలుసు. కొందరు ఏమంటున్నారంటే దేవుడూ లేడూ ఎవడూ లేడు అవన్నీ మూఢనమ్మకపు మాటలు, ఉన్నది మనమే, మనమే అన్ని పనులు చేయుచున్నాము, మనమే క్రొత్త విషయాలు తెలుసుకుంటున్నాము, క్రొత్త సుఖాలు అనుభవిస్తున్నాము అని మనిషి అనుకుంటున్నాడు. కానీ వాస్తవముగా శరీరములో ఏ పనీ నీవు చేయలేదు. ఏ పనే కాకుండా, ఏ యోచనా నీవు చేయటం లేదు. జీవుడు ఏదీ వినేవాడు కాదు, ఏదీ చూచేవాడూ కాదు. దేనికీ చేతకానివాడు జీవుడు. చూచేది కన్ను, వినేది చెవి. శరీరములో 24 భాగములలో జీవుడైన నీవు కూడా భాగానివే. కానీ నీవు నీ శరీరంలో 24 భాగములు చేసే పనిని నీవే చేస్తున్నాను అని అనుకుంటున్నావు. నీ శరీరములో 24 భాగాలను విడిగా నీవు చూడలేదు. నా కళ్ళు, నా చెవులు, నా ముక్కు, నా నోరు అన్నింటినీ నీ అనే దానిక్రిందే లెక్కవేస్తున్నావుగానీ 24 భాగాలే ఉన్నాయన్న విషయం ఎవరికీ తెలియవు. వాస్తవముగా 24 భాగాలే 24 రకాల పనులు చేయుచున్నారు. ఒక్కొక్కటి

ఒక్కొక్క కార్యము చేయుచున్నాయి. నీవు కూడా ఒక భాగమై ఒక పనిని చేయుచున్నావు. ఏ పనీ చేయనివాడివని చెప్పి, ఒక పని చేసినవాడు అంటున్నారేమిటి? అని మీరు అనుకోవద్దండి. కానీ వాస్తవంగా ఏ పనినీ చేయనివాడు. కానీ చేసే పని ఏమిటి అంటే, అనుభవించేది, అంటే గింజలు నానబెట్టేది, ఉడకబెట్టేది, రుబ్బేది అనేక పనులను చేసి దోసెపోసి పెడితే దానిని ఆరగించేది మాత్రము జీవుడు. ఒక శరీరములో 24 భాగములు చేసిన పని ఏదైతే ఉందో, ఆ కార్యం ద్వారా వచ్చే సుఖాన్ని దుఃఖాన్ని అనుభవించే కొరకే శరీరములో జీవుడున్నాడు. కార్యాలు చేసేవాడు మాత్రము జీవుడు కాదు. కార్యాలు చేసేందుకు 24 భాగములు కలవు. వాటికి శక్తిని ఇచ్చి చేయించే వాడు ఆత్మ. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియాలు కనిపించే విధంగా ఉన్నాయి. స్థూలంగా కనిపించే దేహంలో, స్థూలంగా కనిపించే జ్ఞానేంద్రియాలు ఐదు కర్మేంద్రియాలు ఐదు కలవు. మిగతా 14 సూక్ష్మంగా కనిపించకుండా ఉన్నవి, వాటిని అభౌతికము అంటాము. కనిపించే భాగాలు పది, కనిపించని భాగాలు పద్నాలుగు ఒక పనిని చేస్తే ఆ పనిలో ఉండే సుఖాన్ని, దుఃఖాన్ని జీవుడు (నీవు) ఆరగిస్తున్నావు.

అయితే 24 భాగాలు ఎందుకు ఆ విధంగా కార్యాలు చేస్తున్నాయి. ఆ విధంగా చేయకపోతే ఏమవుతుంది? కొన్నిసార్లు 24 భాగాలలో కొన్ని భాగాలు పని చేయకుండా మొండికేస్తాయి. ఏ విధంగా మొండికేస్తాయి అంటే వీటన్నింటికీ ఆదికర్త ఒకడున్నాడు. 24 భాగాలకు అధిపతి ఒకడున్నాడు. 24 భాగాలు మరియు జీవుడు కలిపి మొత్తము 25 భాగములు అయితే 26వ వాడు ఒకడున్నాడు, వాడే ఆత్మ. 27వ వాడు ఉన్నాడు కానీ వాడిని లెక్కలోకి తీసుకోకూడదు. ఎందుకంటే అందరి శరీరములో

అధిపతి ఒకడున్నాడు వాడే ఆత్మ. అందరి శరీరములలో ఆత్మ ఉండి, జీవుని కర్మానుసారము పనులను ఆత్మ చేయిస్తూ ఉంది. ఎవరితో చేయిస్తూ ఉంది? 24 భాగములతో చేయిస్తూ, ఆ పనియొక్క ఫలితము అయిన కష్టమును, సుఖమును మాత్రము జీవునికి ఇస్తూ ఉంది. దానిని తప్పక జీవుడు అనుభవించాల్సి వస్తున్నది. శరీరములో నీవు ఉన్నావు. బయట ఉన్న వ్యవహారం కొరకు ఒక పేరు పెట్టుకున్నాము కానీ, మన శరీరములో 24 భాగాలున్నాయి. శక్తితో అవి పని చేయుచున్నవి. దాని ఫలితాన్ని జీవుడయిన మనము అనుభవిస్తున్నాము అని అనుకోకుండా, మనమే చేస్తున్నాము అంటున్నాము. వాస్తవంగా జీవుడు శరీరములో ఏ పనినీ చేయటం లేదు.

గొప్ప శాస్త్రజ్ఞుడిగా పేరుగాంచిన వ్యక్తి ఉన్నాడనుకోండి, గొప్ప పరిశోధన ఆయన శరీరములో సాగింది అనుకోండి, గొప్ప సిద్ధాంతాన్ని కనుక్కున్నాడనుకోండి, ఆ సిద్ధాంతము సమాజానికి ఎన్నో సుఖాలు పొందేటట్లు చేసింది అనుకోండి. అంత గొప్ప రహస్యాన్ని కనుక్కొని, ప్రయోజనం వచ్చినట్లు అందరూ అంటూ ఉంటే ఈయన ఏమనుకుంటు న్నాడు? "నేను నా పరిశోధన ద్వారా ఫలానా దానిని కనుకొన్నాను", అని దాని ముందర అతని పేరుని ఇరికించి ఫలానా సిద్ధాంతము అని వ్రాసుకుంటాడు. కానీ దీని వెనుక అంతా చూస్తే నేను కనిపెట్టాను అని చెప్పే జీవునికి ఎటువంటి సంబంధము లేదు. కానీ లోపలున్న ఆత్మకు మాత్రము అన్నీ తెలుసును. అన్నీ చేసినది ఆత్మే ఎప్పుడు ఏది అందించాలో దానిని అది అందజేయును. యోచనను బుద్ధికి అందించేది ఆత్మే, ఆ యోచనను మనస్సుకు అందించి జ్ఞాపకం చేసిందీ ఆత్మే. అదే విధముగా శరీరములో ఉండే మనస్సును, బుద్ధిని పని చేసేటట్లు చేసి, వాటిద్వారా ఒక విషయాన్ని బయల్పపరచి, ఒక పరిశోధన జరిగింది. ఆ పరిశోధన

www.thraithashakam.org

వెనుక ఆత్మయే ఉంది. కానీ జీవుడు మాత్రము నేనే చేశాను అని అనుకుంటున్నాడు.

ప్రతీ శరీరములోను ఉండే జీవుడు ఒక్క క్షణం కూడా విచక్షణ లేకుండా, నేనే అన్ని పనులకు కారణం అంటున్నాడు. అతనికి, పనికి ఏమాత్రము సంబంధము లేదు. కానీ శరీరానికంతటికీ అదికర్తగా ఉండే ఆత్మకే సంబంధము. ఆత్మ ఎక్కడుంది? అని ప్రశ్నవేస్తే, శరీరమంతా వ్యాపించి ఉంది అని చెప్పవచ్చును. జీవుడు శరీరములో తలయందు ఒక్క దగ్గర రవ్వంత, గుణచక్రములో సాత్త్విక భాగము, రాజస భాగము, తామసిక భాగములో ఏదో ఒక భాగములో ఉంటాడు. ఒక్కొక్క జీవుడు ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క భాగములో ఉండును. కానీ ఆత్మమాత్రము శరీరమంతా వ్యాపించి ఉన్నది. అన్ని పనులను చేయిస్తూ ఉంది. జీవాత్మ అనుభవిస్తూ ఉంది. ఈ పనులన్నిటినీ లోపల ఆత్మ కర్మానుసారము శరీరములో చేయిస్తూ ఉంటే, జీవాత్మ అదే శరీరములో అనుభవిస్తూ ఉంటే, ఆ ఇద్దరినీ సాక్షిగా చూస్తున్నవాడు పరమాత్మ. ఆ పరమాత్మ శరీరం లోపలే కాకుండా శరీరం బయటకూడా ఉన్నాడు. అణువణువునా విశ్వమంతా వ్యాపించి ఉన్నాడు ఆయననే మనము దేవుడని అంటున్నాము. ఎవరికీ తెలియబడనటువంటి వాడు. ఆత్మ శరీరము బయట మాత్రము ఎక్కడా లేదు కానీ శరీరము లోపల మాత్రమే ఉన్నది. శరీరములో అంతటా లేకుండా, శరీరములో ఒక్కచోట మాత్రమే జీవుడు వున్నాడు. అంటే శరీరములో మాత్రము మూడు ఆత్మలే కలవు. ఈ మూడు ఆత్మల గురించే మూడు దైవ గ్రంథములలో చెప్పారు. అయినా మూడు ఆత్మల విషయం ఉన్నట్లు ఎవరూ గుర్తించి చెప్పుకోలేదు.

భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగములో క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు అని పేర్లు పెట్టి భగవంతుడు చెప్పటము జరిగింది. ఆ మూడు ఆత్మల గురించి ఎవరూ వ్రాసుకోలేదు, అర్థము కాలేదు. మూడు ఆత్మల బదులు ఒకటి శరీరము, ఒకటి జీవుడు, ఇంకొకటి దేవుడు అని వ్రాసుకున్నారు. శరీరము ప్రకృతితో తయారు చేయబడినది. ప్రకృతి స్త్రీ సంబంధమైనది, ఆత్మ పురుష సంబంధమైనది ముగ్గురు పురుషులున్నారు కాబట్టి పురుషులుగానే లెక్కించి చెప్పాలిగానీ, ప్రకృతి లేదా స్త్రీ సంబంధమైన దానితో ఆత్మను లెక్కించరాదు. శరీరమంతా ప్రకృతి సంబంధమైనదే. మనము ఇప్పుడు ఒక క్రొత్త విషయం గూర్చి, భగవద్గీతలో ఉండే రహస్యాన్ని పురుషోత్తమ ప్రాప్తి యోగము అనే అధ్యాయంలో ముగ్గురు పురుషుల విషయాన్ని గూర్చి చెప్పుకున్నాము. దానినే త్రైత సిద్ధాంతంగా చెప్పుకున్నాము. త్రైత సిద్ధాంతములో మూడు ఆత్మలు ఉన్నాయని ఎవరికీ తెలియదు.

జీవాత్మ, ఆత్మ, పరమాత్మ ఈ మూడు ఆత్మలు ప్రతీ శరీరంలోనూ ఉన్నాయి. కానీ కర్మలు మాత్రము వేరువేరుగా ఉన్నాయి. కర్మల ప్రకారము పనులు జరుగుతూ ఉన్నాయి. కొన్ని రకాల శరీరాలలో జీవులు కష్టాలు అనుభవిస్తూ ఉంటారు. కొన్ని రకాల శరీరాలలో జీవులు సుఖాలు అనుభవిస్తూ ఉంటారు. కొన్ని శరీరాలలో జీవులు ఒక ప్రత్యేకమైన హోదాలో ఉంటారు. ఇంకొంక శరీరంలో జీవుడు బీదవానిగా ఉంటాడు. ఏది జరగాలన్నా శరీరంలోనే జరగాలి మనిషికి. ఈ రకంగా మనము ఎన్నో రకాల కర్మలను అనుభవిస్తున్నాము. ఆరోగ్యవంతమైన శరీరాలున్నాయి. కొన్ని రోగాలు కలిగిన శరీరాలున్నాయి. రోగాలే కాకుండా ఈ దయ్యాలు, సూక్ష్మశరీరాలు కలిగి అవి బాధిస్తూవుంటే, వాటిని అనుభవించే వారూ ఉన్నారు. ఈ అనుభవాలు సహజంగా ప్రతీ మానవునికి ఉన్నాయి. కొద్దిపాటి హెచ్చుతగ్గులుగా, కొంతకాలానికి ఆ మనిషి చనిపోవటం

జరుగుచున్నది. అయితే చనిపోయిన తరువాత ఏమి జరుగుచున్నది అంటే ఎవరికీ తెలియదు. ఇంతకుముందు ఏమి జరిగిందో కూడా తెలియదు. ప్రపంచం ఇప్పుడు ఉంది, ఇంతకముందూ ఉంది, తరువాత కూడా ఉంటుంది. ఫలానా పేరుపెట్టుకున్న వ్యక్తి మరణం తరువాత ఉంటాడా, ఉండడా? మరణము తరువాత ఉంటాడు, జాగామరితే మారవచ్చుగానీ ఎక్కడికీ పోడు, మరలా జన్మ తీసుకుంటాడు.

మరలా జన్మ తీసుకుంటాడు అనే నమ్మకం ఒక్క ఇందూ (హిందూ) మతములోనే ఉన్నది. మిగతా మతముల వారు మాత్రము చెప్పుకోవటం లేదుగానీ, వారివారి మత గ్రంథాలలో మాత్రము పునర్జన్మలు ఉంటాయనే చెప్పటం జరిగింది. కానీ వాటిని గ్రహించుకోలేక జన్మలు మరలా ఉండవని చెప్పుకుంటున్నారు. వాస్తవంగా అన్ని మతాల సారాంశము ఒక్కటేగానీ ఒక్కొక్కరికి ఒక్కొక్కలాగ అర్థమయింది. అయితే జననం మరియు మరణం ఈ విధంగా సాగటమేనా? ఎక్కడైనా దీనికి అంతము ఉందా? అంటే ఉందనే చెప్పాలి. కర్మలనుండి బయటపడి మరలా జన్మలు లేకుండా చేసుకోవాలంటే ఈ విధంగా ఇప్పుడు మనము నేర్చుకుంటున్న జ్ఞానమే శరణ్యం. అంటే దైవగ్రంథములలో జ్ఞానము తెలుసుకుంటే, జీవుడవైన నీకు పెద్దగా నీ శరీరంలోనే ఉండేవాడు ఆత్మ అని తెలుస్తుంది. ప్రపంచములో ప్రతి అణువణువునా ఉండేవాడు పరమాత్మ. ఆ పరమాత్మ భూమండలమే కాదు, సూర్యమండలం ఇతర గ్రహాలలో కూడా ఉండే దేవుడే, నీ శరీరములో కూడా ఉన్నాడు అని తెలుస్తుంది. కనుక నీవు ఆ దైవత్వాన్ని గూర్చి తెలుసుకుంటే, అంటే నీ శరీరము లోపలనే ముందు తెలుసుకుంటే, ప్రపంచములో విశ్వంలో ఉన్నవాడు పరమాత్మ అనే విషయం తెలుస్తుంది. ఈ వాస్తవాన్ని ఎప్పుడైతే తెలుసుకోగలుగుతావో అప్పుడు ఈ జన్మలకు అంతం ఏర్పడుతుంది. తిరిగి నీవు పుట్టవలసిన పని ఉండదు.

www.thraithashakam.org

ప్రతీ మనిషి దైవజ్ఞానము తెలుసుకుంటే, కర్మలనుండి ముక్తి పొందవచ్చు అనే విధానాన్ని దేవుడు చెప్పడం జరిగింది. మూడు దైవ గ్రంథములలో కూడా ఈ విషయం చెప్పబడినది. పెద్దలందరూ ఈ మోక్షాన్ని గురించి చెప్పుకోలేదు గానీ, స్వర్గము మరియు నరకము గురించి మాత్రము చెప్పుకుంటున్నారు. వీటిలో అందరికీ స్వర్గమే కావాలి, నరకాన్ని ఎవరూ కోరుకొనరు. నీవు కోరుకున్నా కోరుకోపోయినా నీవు చేసుకునే కర్మ ఫలితాన్ని అనుసరించి అవి రావటం జరుగుతుంది. కానీ అవి వేరుగా ఉన్నాయా? అంటే అలా లేవుగానీ, వాటిని ఎక్కడో ఉండే వేరే లోకాలుగా అందరూ చెప్పుకుంటున్నారు. కానీ అవి మన జీవితములో భాగాలుగానే ఉన్నాయి. ఆ స్వర్గ, నరకలోకాలు ప్రత్యేకంగా ఎక్కడా లేవు. అన్నీ భూమిమీదే మిళితమై ఉన్నాయి. ఏ సుఖాలైతే ఈ భూమిమీద అనుభవిస్తున్నారో అదే స్వర్గము. ఏ కష్టాలైతే ఈ భూమిమీద అనుభవిస్తున్నారో అదే నరకము. మరి దీనికి అంతములేదా అంటే అంతము ఉంది.

దైవత్వం గూర్చి ఎప్పుడైతే తెలుసుకుంటామో అప్పుడు ఈ కర్మల నుండి బయటపడేందుకు అవకాశము ఉంది. కొద్దిపాటి జ్ఞానము తెలుసుకుంటే కొద్దిపాటి కర్మలు మీకు జరగకుండా పోతాయి. పూర్తి జ్ఞానాన్ని తెలుసుకుంటే పూర్తి జన్మరాహిత్యం అయిపోతుంది. కర్మలు పూర్తిగా లేకుండా పోతాయి. మరి ఈ జ్ఞానము ఏ విధముగా తెలుస్తుంది? ఇక్కడే మొదలయింది ఎగువవారు మరియు దిగువవారు అనే విషయం. ఇప్పుడు నేను ఎగువవాడిని వినే మీరంతా దిగువవారు. ఇది పూర్వము నుండి వచ్చిన పద్ధతి. మిమ్మల్ని మేము మా దిగువవారు అని అనేవారిమి, మా దిగువ అనేది చివరికి 'మాదిగ' అనే కులంగా మారి పోయింది. అయితే ఈ జ్ఞానాన్ని వినేవారు గ్రహించుకోగలగాలి. కర్మలు లేకుండా మోక్షాన్ని పొందాలి అని అనుకునేవారు ఈ జ్ఞానాన్ని వినాలి. మరి దేవునికి

సంబంధించిన జ్ఞానము ఎవరికీ తెలుసు? అంటే దేవునికే తెలుసు, ఏ మనిషికి తెలియదు.

దేవుని జ్ఞానము దేవునికే తెలుసు అనే విషయం మూడు దైవ గ్రంథములలోనూ కలదు. దేవుని జ్ఞానాన్ని ఏ మనిషి చెప్పలేడు అని కూడా ఉంది. ఏ మనిషైనా గ్రహించుకోవచ్చు కానీ ఏ మనిషీ దేవుని జ్ఞానాన్ని మాత్రము చెప్పలేడు. మరి మనిషి చెప్పలేకపోతే దేవుడు ఎట్లా చెప్పును? దేవుడు ఏ పనినీ చేయనివాడు. ఆయనకు పనిలేదు, క్రియా రహితుడు కానీ మనకు దైవజ్ఞానము కావాలి. అంటే దైవజ్ఞానము దేవుని దగ్గరే ఉంది, అది దేవునికే తెలుసు. మరి మనకు ఏ విధముగా తెలుస్తుంది జ్ఞానము? అంటే దానికొక విధానాన్ని ఏర్పాటు చేశాడు దేవుడు. కానీ ఒక మనిషి జ్ఞానాన్ని చెప్పుచున్నాడంటే అతనిది దైవజ్ఞానము కాదు. వానిది సొంత జ్ఞానము అవుతుంది తప్ప దైవజ్ఞానము కానేకాదు. ఎందుకంటే ఏ మనిషికీ దైవజ్ఞానము తెలియదు. మరి మీరు చెప్తున్నారు కదా! అని ప్రశ్నిస్తే మేము మాత్రము దైవజ్ఞానము అని పేరు పెట్టి చెప్తున్నాము. అది అవునా కాదా అనేది మీరు నిర్ణయించుకోవాలి.

నేను బంగారం అని మెరుగుపెట్టి అమ్ముతున్నాను అది నిజంగా బంగారమా కాదా అనేది మీరే పరీక్షించుకోవలెను. అమ్మేవారంతా మోసం చేసే అమ్ముతారు. కొనేవారు మాత్రము అన్నింటినీ పరిశీలించి కొనవలెను. వినేది నిజమైన జ్ఞానమా కాదా! అనే విషయం గ్రహించుకోగలిగే శక్తి ఉంది మనిషికి కానీ చెప్పే శక్తి లేదు. నేను ఇప్పుడు చెప్పే స్థానంలో ఉన్నాను, మీరు వినే స్థానంలో ఉన్నారు. మీ పద్ధతి కరెక్ట్, నాది మాత్రము యదార్థం కాకపోవచ్చు. ఎందుకంటే దేవుని జ్ఞానము దేవునికే తెలుసు, ఏ మనిషికీ తెలియదు. నేను ఇప్పుడు చెప్పేది దైవజ్ఞానమే అని నేను

www.thraithashakam.org

చెప్పినా సరే, మీరు మాత్రము అవునో కాదో చూసి తెలుసుకొనటం మంచిది. ఇదేమిటి? ఇలా జ్ఞానము చెప్తాడు అని అంటే, పద్ధతి ప్రకారము అలాగే చెప్పాలి, కనుక నేను కూడా అలాగే చెప్పుచున్నాను. అందుకే ఒక దైవ గ్రంథములో దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఏ మనిషికీ తెలియదు. జ్ఞానము వినేవారు పరిపక్వత చెందితే చెప్పే దానిని గ్రహించవచ్చును. కనుక బోధించేది విడిచిపెట్టి గ్రహించుకునేది చూడు. చెప్తేకదా! గ్రహించుకునేది, చెప్పేవాడేమో అబద్ధం చెప్తున్నాడు. వినేవాడేమో మంచివాడు మరి దేవుని జ్ఞానము ఏ విధముగా తెలుస్తుంది? మేము చెప్పేది వాస్తవమా కాదా! చూచుకోండి. మీరు ఏమనుకోవాలి? "మాకు శ్రద్ధ ఉంటే నేర్చుకోగలము" అని అనుకోవాలి. మరి శ్రద్ధ ఉన్నంత మాత్రాన ఏ విధంగా జ్ఞానము తెలియబడుతుంది? అంటే ఏ విధముగా తెలియ బడుతుందో నీకెందుకు, మొత్తానికి శ్రద్ధ ఉంటే ఎలాగో జ్ఞానము తెలియబడుతుంది.

గతంలో శ్రీకృష్ణుడు అనే వ్యక్తి ఉండేవాడు. ఆయన ఒక మనిషే, మరి మనిషి ఎవ్వరైనా సరే దేవుని జ్ఞానము చెప్పరనే సూత్రము ప్రకారము శ్రీకృష్ణుడు చెప్పినది కూడా అబద్ధమే అయి ఉంటుంది అని ప్రశ్న వస్తుందని ఆయన 'నేనే దేవున్ని' అని చెప్పినాడు. నేను మనిషిగా మీ అందరికీ కనిపిస్తే కనిపించియుండవచ్చు, మనుషులు జ్ఞానము చెప్పలేరు అనేదీ వాస్తవమే కానీ మనిషిలో దూరినవాడు చెప్పవచ్చు కదా. దూరుకునే దేవుడు ఉంటాడా అని అంటే, అందరిలోనూ దేవుడుంటాడనే మనం పాఠము నేర్చుకొన్నాము. ఒక శరీరములో నుండే చెప్పబడితేనే జ్ఞానము తెలిసేది. మాటల ద్వారా వింటేనే తెలియబడేది. మరి మాటలు ఎక్కడనుండి రావాలి? ఒక శరీరమునుండే రావాలి. మరి మనిషి

శరీరములో జీవుడు అనేవాడు ఒక్కడేనా ఉండేది. మొత్తము ముగ్గురు ఉంటారని చెప్పుకున్నాము. దేవుడు ఎలాగూ ఏ పనీ చేయడు, మరి జీవుడు ఏమీ చేసేవాడు కాదు, కనుక దేవుడు ఆత్మతోనే అన్నింటినీ చెప్పించును. దేవుడు ఆత్మకు తనశక్తిని అందిస్తే అప్పుడు ఈ ఆత్మ దేవునిగా మారుతుంది, దేవునిలా మాట్లాడుతుంది, దేవుని లక్షణాలన్నీ దీనికి వస్తాయి. కనుక దేవుని జ్ఞానమంతా అది చెప్పగలుగుతుంది. మరి ఇప్పుడు శరీరము నుండి మనిషి చెప్పినట్లా? మరి దేవుడు చెప్పినట్లా? దేవుడూ చెప్పలేదు. ఒక శరీరములో శ్రీకృష్ణుడు చెప్పినట్లు మనకు కనిపించినాగానీ, శ్రీకృష్ణుని శరీరములో ఉండే ఆత్మ చెప్పింది. మరి దేవుడు చెప్పినట్లు కాదా అంటే దేవుడే ఆత్మద్వారా చెప్పించాడు. ఆత్మలో తన భాగాన్ని, అంశను కలిపి చెప్పాడు. మరి మనిషీ చెప్పక, దేవుడూ చెప్పక, మధ్యలో ఉన్న ఆత్మయే చెప్పినప్పటికీ దేవుడే చెప్పినట్లు అగును. కనుక నేను ఏదో విధంగా ఇబ్బంది పడి చెప్తాను, ఎందుకంటే మేము ముగ్గురున్నాము. ఆ ముగ్గురులో ఒక్కరే చెపుతాడు అని పొరపాటు పడవద్దు. ఆ ముగ్గురులో అంటే జీవాత్మ, ఆత్మ, పరమాత్మలలో ఎవరైనా చెప్పవచ్చును. ఎవరు చెప్తున్నదీ మీకు తెలియదు కానీ మీరు ఆ విషయాన్ని మాత్రము గ్రహించుకోగలరు.

జ్ఞానం మీద శ్రద్ధ ఉంటే, ఆసక్తి ఉంటే ఆ జ్ఞానాన్ని గ్రహించు కోగలరు. గ్రహించుకోలేకపోవటం అనేది ఎవరిది తప్పు, వినేవారిదే. దేవుడు చెప్పినప్పటికీ అర్థము కాలేదు అంటే, అది ఎవరి తప్పు? వినేవారిదే అవుతుంది. భగవద్గీతను దేవుడు చెప్పిపోయినా అది మనందరి ముందు ఉంది కాని, అందులో ఉండే వాస్తవజ్ఞానము తెలియలేదంటే ఏమని అర్థము. అంటే అది మనలో ఉండే లోపమే. దేవుడు కృష్ణుని శరీరము నుండి

www.thraithashakam.org

చెప్పించాడు. ఒకరకంగా కనిపించే మనిషిగా కనపరాని దేవునిగా ఉన్న కృష్ణుని ద్వారా చెప్పించాడు. ఆ రెండింటికీ సంబంధించిన ఆత్మ చెప్పింది. అటువంటి శరీరములో దేవుడు అప్పుడప్పుడు చెప్తే ఆ వ్యక్తిని మనము భగవంతుడు అని అంటున్నాము కనుక శ్రీకృష్ణుడు భగవంతుడు. మరి భగవంతుడు ఎవరు? అంటే దేవుడు. ఈ తికమక ఎవరికీ అర్థము కాదు. మరి అన్ని శరీరాలను భగవంతుడు అనే దానికి అవకాశము లేదు. కొన్ని శరీరాలను మాత్రమే భగవంతుడు అని అనాలి. దైవాంశ కలిగిన ఆత్మ ఏ శరీరంలోనైతే ఉందో ఆ శరీరాన్ని భగవంతుడు అని అంటాము. భగవంతుడు అంటే తల్లి గర్భమునుండి నేరుగా పుట్టినటువంటివాడు. మరి మనమంతా తల్లిగర్భమునుండే వచ్చాము కదా అంటే వాస్తవముగా మీరు తల్లిగర్భమునుండి పుట్టలేదు, శరీరమును ధరించలేదు ఇంత పచ్చి అబద్ధమా అని అనుకోవద్దండి. వాస్తవంగా నూటికి నూరుపాళ్ళు సత్యము.

నేను ఈ కోటువేసుకున్నాను కావున కోటును నేను ధరించాను అని అంటాము. లేదు ఈ కోటుకు ఒక చీమ చిక్కుకుని ఉంది అనుకోండి అప్పుడు ఆ చీమ ఏమైనా కోటువేసుకుందా అంటే లేదు కాని కోటులో అది ఇరుక్కుంది. అలాగే జీవుడు శరీరాన్ని ధరించినాడా అంటే లేదు కానీ శరీరములో ఇరుక్కున్నాడు. మరి శరీరాన్ని ధరించింది ఎవరు ఆత్మ. నఖ, శిఖ పర్యంతము శరీరాన్ని ధరించినవాడు అంటే గోరు నుండి వెంట్రుకల వరకు శరీరాన్ని ధరించినవాడు ఆత్మ. కనుక శరీరమంతా జీవుడు లేడు, కనుక జీవుడు శరీరమంతా ఉన్నాడు అని అనుకోవటం పొరపాటు. మరి తల్లిగర్భములో మనము పుట్టలేదా అంటే పుట్టలేదు. నువ్వు పుట్టలేదు గానీ నీ శరీరము పుట్టింది. పుట్టిన తరువాత అంటే శరీరము బయటకు వచ్చిన తరువాత అందులోకి నీవు వచ్చి చేరావు.

ఆత్మ శరీరాన్ని ధరించినది, దానితోపాటు ఉన్న నీవు ఆ శరీరంలో ఇరుక్కున్నావు. కనుక నిన్ను భగవంతుడు అని అనేదానికి అవకాశము లేదు. తల్లిగర్భమునుండి పుట్టిన వానినే భగవంతుడు అని అనాలి. దైవాంశ కలిగినటువంటి వాడు భగవంతుడు. దైవాంశ ఒక దగ్గర మరణించటము మరియు జన్మించటము జరిగేది కాదు కనుక ఎప్పటికీ ఉండేదే. తల్లిగర్భములో కూడా సజీవముగా ఉంది కనుక భగమునుండి పుట్టినటు వంటి వాడిని భగవంతుడు అని అందురు. అటువంటి శరీరమునుండి దేవుడు జ్ఞానాన్ని చెప్పగలుగుచున్నాడు. ఆ విధముగా చెప్పగలిగిన జ్ఞానమే వాస్తవమైన దైవజ్ఞానము. మనము ఆ విధముగా గ్రహించుకునేందుకు వీలుగా **నేనే దేవున్ని** అని చెప్పెను. మూడవ పురుషుడైన ఉత్తమ పురుషుణ్ణి నేనే అని చెప్పినాడు. ముగ్గురు పురుషులున్నారు. క్షర, అక్షర, పురుషోత్తములుగా అందులో క్షర, అక్షరులకంటే ఉత్తమ పురుషునిగా ఉన్నవాడిని నేనే అని చెప్పెను.

ఇప్పుడు మనకి ఒక ప్రశ్న వచ్చింది. శ్రీకృష్ణుడు ద్వాపరయుగములో పుట్టాడు, ఆయన చెప్పినది జ్ఞానమే అని మనము అనుకుంటున్నాము. మరి కృష్ణుడు పుట్టకముందే వేదాలున్నాయి, ఉపనిషత్తులున్నాయి. అవన్నీ గొప్పవే అని మనము అనుకుంటున్నాము కదా! మరి వాటిని చెప్పినటువంటి వారిని భగవంతుడు అని అనాలా? శ్రీకృష్ణుణ్ణి భగవంతుడనాలా? అంటే ఎక్కడైతే దైవాంశ ఏ శరీరములోనైతే ఉండి జ్ఞానము చెప్పబడిందో దానినే భగవంతుడనాలి. దైవాంశ లేకుండా ఏ శరీరము నుండి జ్ఞానము చెప్పినా అది దైవజ్ఞానము కాదు. ఆ విధముగా చెప్పేవాడు భగవంతుడూ కాదు. కనుక ఈ అబద్ధాలన్నీ ప్రచారములోకి వచ్చేసినాయి, దేవుని జ్ఞానము తెలియకుండా పోయింది. అధర్మాలన్నీ చెలరేగిపోయినాయి. కనుక నిజమైన

దైవజ్ఞానము గూర్చి తెలియాలంటే ఏం చేయాలని యోచించి అదే పనిగా దేవుడు భగవంతుడిగా పుట్టాల్సిన అవసరము వచ్చింది ద్వాపరయుగము చివరిలో. ఆ విధముగా చెప్పిన జ్ఞానమే గీత రూపంలో వెలువడింది. అంతకముందు వ్యాసుడు ఉపనిషత్తులు, వేదాలు వ్రాసి బయటికి పంపించాడు, బాగా ప్రచారము అయినాయి.

ఆ సమయంలో శ్రీకృష్ణుడు ఏమి చెప్పాడంటే అధర్మాలు చెలరేగి పోయాయి కనుకనే నేను వచ్చాను అని చెప్పినాడు. యజ్ఞాలు సంతృప్తిగా జరుగుతున్న సమయంలో వచ్చి చెప్పినాడు పై మాటను. అంటే యజ్ఞములు అధర్మాలని అర్థము అవుతున్నది కదా! అందుకే కృష్ణుడు **"యజ్ఞాల వలనగానీ, వేదాధ్యయనం వలనగానీ, దానాల వలనగానీ, తపస్సుల వలనగానీ నేను ఏమాత్రము తెలియబడను"** అని భగవద్గీతలో విశ్వరూపసందర్శన యోగము అనే అధ్యాయములో 48, 53వ శ్లోకములలో చెప్పెను. అదే విధముగా అక్షర పరబ్రహ్మ యోగములో 28వ శ్లోకములో కూడా అదే విషయం తెలియ జేయబడింది. వేదాలను, యజ్ఞాలను అతిక్రమించినది దైవజ్ఞానము అని చెప్పబడింది. ఇప్పుడు నేను చెప్తున్నది జ్ఞానము కాదు. ఆయన చెప్పినది జ్ఞానము. ఆయన చెప్పినదే నేను చెప్తున్నాను కావున అది జ్ఞానమే. మీకు ఏ విధంగా అర్థమైనా అది వాస్తవమే. భగవంతుని శరీరములో ఉన్న ఆత్మ అన్ని పనులు చేస్తున్నది. ఏ పనులు చేసినా వచ్చే కర్మ మాత్రము నాకు రాదు అని చెప్పినాడు. నేను చేస్తున్నానని జీవాత్మగా అనుకోలేదు. ఆత్మగా చేస్తున్నాను కనుక నాకు ఏ కర్మ రాదు. అంటే భగవంతుని శరీరములో కూడా మూడు ఆత్మలుంటాయి. ఆయన శరీరములో ఉన్న జీవాత్మ ఏమనుకుంటాడు నేనేమీ చేయటం లేదుగానీ ఆత్మయే అన్నీ చేస్తూ ఉంది అని అనుకుంటాడు. కనుక నాకు ఏ కర్మ

www.thraithashakam.org

అంటలేదు అని అక్కడ చెప్పబడింది. అది వాస్తవమే. కృష్ణుడు భగవంతుడిగా ఉన్నప్పుడు ఏ కర్మా అంటకుండా పని చేశాడు. భగవంతుని శరీరములో ఉండే ఆత్మ ఏమనుకుంటున్నదంటే ఈయన శరీరములో అన్ని పనులు నేనే చేస్తున్నప్పటికీ దైవజ్ఞానము మాత్రము దేవుని అంశ ద్వారా చెప్పగలుగు చున్నాను, కనుక నేను చెప్పేది సత్యమైన జ్ఞానము అని ఆత్మ అనుకుంటున్నది. కానీ ఆయన శరీరములో ఉండే పరమాత్మ మాత్రము ఏమీ అనుకోడు. ఈ విధముగా భగవంతుని శరీరము ఉంటుంది. అది అరుదుగా భూమి మీదకి వస్తుంది.

ఎప్పుడైతే అధర్మాలు చెలరేగిపోయి ధర్మాలకు గ్లాని ఏర్పడిందో అప్పుడు దేవుడు మనిషిగానే వస్తాడు, జ్ఞానము చెప్తాడు. మనిషిమాదిరే పోతాడు కనుక ఆయన ఎవరో చెప్పేందుకు మనకు ఏమీ తెలియదు. ఫలానా మనిషి భగవంతుడు అని తెలిస్తే కదా, మనము నమ్మేది. కానీ ఏ వ్యక్తి భగవంతుడో మనము గుర్తుపట్టలేము ఒకవేళ వాస్తవమైన దైవజ్ఞానము ఎక్కడైనా ఎవరినుండైనా చెప్పబడితే అది మామూలు జ్ఞానమేలే అని మోసపోయేందుకు అవకాశము ఉంది. ఒకవేళ మనిషి చెప్పిన జ్ఞానాన్ని అది దైవజ్ఞానమే అని అనుకొని అప్పుడు మోసపోయేందుకు అవకాశము కూడా కలదు. ఆ విధముగా కాకుండా వాస్తవముగా గ్రహించేశక్తి మీ అందరికీ ఉంది, మీరు గ్రహించుకోవచ్చు అని దేవుడు మనకు అవకాశాన్ని ఇచ్చినాడు, కనుక వినేవారు మాత్రము ఇది సత్యమా, కాదా! అని తెలుసుకుని వినవలెను. అందరినీ స్వాములు అనుకోవద్దండీ. అందరు చెప్పిందీ జ్ఞానమే అని అనుకోవద్దండి. కనుక పొరపాటు పడకుండా అసలైన దైవజ్ఞానాన్ని గ్రహించుకోగలరు.

# 55. తాత

తేది : 04-06-2012

ప్రతీ నెలా క్రొత్త విషయం అందుతూ ఉంది. దానినే మీకు మేము చెప్తూ ఉన్నాము. ఈ రోజు కూడా ఒక క్రొత్త విషయం లోపలివాడు అందిస్తాడని ఆశిస్తూ ఈ విషయాన్ని చెప్పుకుందాము. 'బ్రాహ్మణ' అనే పదమును తీసుకుందాము. బ్రాహ్మణుడు అనే పదములో విలువైన శబ్దము 'బ్రాహ్మణ' అనే పదము మాత్రమే. అలాగే 'శబ్ద' అనేది ఒక పదము శబ్దము అనేది అనగా 'ము' అనే అక్షరము ఒక పదాన్ని ముగించేందుకు వాడే అక్షరము. ఇటువంటి ముగింపు అక్షరములు చాలా ఉన్నవి. 'బ్రహ్మము' అనే పదములో కూడా 'ము' అనే అక్షరము ముగింపు కోసము వాడే అక్షరము మాత్రమే. 'బ్రహ్మ' అనేదే అసలైన పదము. బ్రహ్మ అంటే గొప్పది, పెద్దది అని అర్థము. బ్రాహ్మణ అంటే పెద్దరికము కలవాడు అని అర్థము వస్తుంది. పెద్దతనము ఏదైతే ఉందో, గొప్పతనము ఏదైతే ఉందో అటువంటివాడిని మనము "బ్రాహ్మణ" అని అంటాము. ఇది ఈ 'బ్రాహ్మణ' అనే పదములో ఉండేటటువంటి అసలైన అర్థము. బ్రహ్మజ్ఞానము అనే పదములో ఉండేటటువంటి అసలైన అర్థము. బ్రహ్మజ్ఞానము అనే పెద్దరికము కల్గినవాడు బ్రాహ్మణుడు అని పెద్దలు చెప్పటం జరిగింది. ఎవరికీ తెలియనటువంటి విద్య, బ్రహ్మవిద్య ఏదైతే ఉందో దానిని తెలిసినటువంటి వాడు బ్రాహ్మణుడు.

ఇటువంటి జ్ఞానము ఎవరికి తెలిసి ఉన్ననూ, వారినందరినీ బ్రాహ్మణులే అనవలెను. పూర్వము సృష్టిలో మనుషులు రెండు రకములుగా విభజింపబడినారు అని చెప్పవచ్చును. ఎగువవారు, దిగువవారు అని రెండు రకముల మనుషులు కలరు. మీరంతా మాకు దిగువవారు కనుక

మాదిగువవారు. అంటే జ్ఞానము తెలిసినవారిని గౌరవిస్తూ, వారిని ఉన్నత ఆసనంపైన కూర్చుండబెట్టేవారు. క్రింద కూర్చుని వినేవారంతా ఒక గుంపుగా ఉండేవారు. ఇది సాంప్రదాయంగా ఉండేది ఒక విధంగా ఏ కులస్థుడైనాగానీ బ్రహ్మజ్ఞానము తెలిసిన తరువాత వాడు బ్రాహ్మణుడే అగును. అప్పుడు వారంతా ఎగువవారే అగుదురు. ఏ కులస్థుడైనగానీ బ్రహ్మజ్ఞానము లేకపోతే వాడు దిగువవాడే, మా దిగువవారు అని అనవచ్చు. మా దిగువవారు అనేది కులము కాదు. అది ఒక వర్గానికి ఒక గుంపుకు పేరు. మొత్తంగా జ్ఞానవరముగా చెప్పే పేరది అలా కాకుండా బ్రహ్మజ్ఞానము మీరు తెలుసుకున్నారనుకోండి. మిమ్మల్ని మేము బ్రాహ్మణులే అనవలెను. ఈ విధంగా బ్రాహ్మణ, బ్రాహ్మణేతరులు జ్ఞానవరముగా విభజింపబడినారు. ఇక నీవు దేవుని జ్ఞానము తెలిసిన గుంపులోకైనా చేరిపోవచ్చు. తెలియని గుంపులోకైనా చేరిపోవచ్చు.

అందుకు పూర్వపు పెద్దలందరూ బ్రహ్మజ్ఞానము తెలిసినవారందరూ బ్రాహ్మణులే అని అన్నారు. అందరినీ బ్రాహ్మణులు అనండి అని చెప్పినారు. ఆ విధంగా బ్రహ్మజ్ఞానము సంపాదించుకున్న అందరూ బ్రాహ్మణులైనారు. ఈ విధంగా కొంతకాలము అనగా పదో, పదిహేనో సంవత్సరాల తరువాత, చెడు ప్రవర్తనను మరలా మొదలుపెట్టినారు. ఈ మాయా ప్రపంచములో పూర్తిగా జ్ఞానవరంగా ఉండటం కష్టమనేనేమో, గుణముల ప్రేరేపణ వలన, బ్రహ్మజ్ఞానము తెలుసుగానీ కొంత చెడ్డవారుగా తయారయినారు అని చెప్పాల్సిన పని వచ్చింది. కాబట్టి మంచి ప్రవర్తనతో, ఏ చెడు గుణాలు లేకుండా ఉన్నవారు కొందరుగలరు, వారిని సద్బ్రాహ్మణులు అన్నారు. అంటే సద్బ్రాహ్మణులు అని అన్నారంటే, అనగా మంచి బ్రాహ్మణుడు అని అన్నారంటే చెడ్డ బ్రాహ్మణుడు ఉన్నాడని లెక్కే! చెడ్డ బ్రాహ్మణుడు ఉంటేనే

సద్బ్రాహ్మణుడు అని చెప్పేది. అందుకే దుష్బ్రాహ్మణుడు ఉన్నట్లే లెక్క సద్బ్రాహ్మణుడు కూడా ఉన్నట్లే లెక్క.

జ్ఞానమున్న వారు ఎదురుపడితే, జ్ఞానము లేనివారు నమస్కరించ వలెను. అంటే ఒక సద్బ్రాహ్మణున్ని నమస్కరించు అంటే అర్థమేమిటి? జ్ఞానాన్ని గౌరవించినట్లు. ఆ విధంగా సత్బ్రాహ్మణున్ని నమస్కరిస్తే మంచి జరుగుతుందిగానీ, దుష్బ్రాహ్మణునికి నమస్కరిస్తే ఏమవుతుంది. నీకు కూడా చెడ్డ అలవాట్లు వస్తాయి. నీవు అతనిని నమస్కరించడము వలన అనుకూలము అనుకుంటాడు, చేరదీస్తాడు. అతని గుణాలు నీకు వస్తాయి. కనుక దుష్బ్రాహ్మణుల సహవాసం చేయవద్దండి. అలాగే జ్ఞానము కల్గిన సద్బ్రాహ్మణునితో సహవాసం చేస్తే నీకు జ్ఞానము లభ్యమవుతుంది. అయితే సద్బ్రాహ్మణున్ని, దుష్బ్రాహ్మణున్ని ఎలా పోల్చుకోవచ్చును అంటే ఏ విధంగానైనా పోల్చుకొనుటకు వీళ్ళేదు, కానీ ఒకే ఒక జ్ఞానముతో కనుగొనవచ్చును.

సత్బ్రాహ్మణుని వద్దకు పోతే మనకేమి తెలుస్తుంది. అంటే మంచి జ్ఞానము తెలుస్తుంది. అంటే జ్ఞానాల్లో మంచిది, చెడ్డది అని రెండు ఉంటాయా? అని ప్రశ్నరావచ్చును. మరి గురువుల దగ్గరకు పోతున్నది జ్ఞానము కోసమే కదా! జ్ఞానము ఉంటే కదా వారివద్దకు వెళ్ళేది. మరి మీ అందరు మంచిది, మంచిది అని పోతూ, పోతూ ఈ రోజుకి త్రైత సిద్ధాంత జ్ఞానము తెలిసిన తరువాత, ఇదివరకు తెలుసుకున్న జ్ఞానము మంచిది కాదు అని తెలిసిపోయింది అంటే అదీ జ్ఞానమే. దానికంటే గొప్ప జ్ఞానమని తరువాత తెలిసింది.

అందుకే మేము కూడా ఈ సమావేశము ప్రారంభించకముందు దేవున్ని ఏమని ప్రార్థించాము. మంచి జ్ఞానాన్ని ఇవ్వమని ప్రార్థించాము.

ఆ విధంగా ఎవరు ప్రార్థించినా మంచి జ్ఞానమే లభ్యమగును. ఏది మంచి జ్ఞానమంటే ఒకటే సూత్రము కలదు. అదేమంటే, జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అని మూడు భాగములుగా చెప్పేటటువంటిదే మంచి జ్ఞానము, ఆత్మజ్ఞానము. ఈ మూడు ఆత్మలు కాకుండా ఉన్న జ్ఞానము ఏదైతే ఉందో అది జ్ఞానమైనా గానీ ఉన్నతమైన జ్ఞానము కాదు. ఏది ఉన్నతమైన జ్ఞానము, తగ్గు జ్ఞానము అని మనకు ఎట్లు తెలుస్తుంది? అంటే భగవంతుడు మనకు ఒక సూత్రాన్ని చెప్పినాడు. భగవద్గీతను అంతటినీ మనము పిండి వడగట్టి త్రాగినామను కోండి, ధర్మాలు అధర్మాలు తెలుస్తాయి. మూడు ధర్మములతో కూడిన జ్ఞానాన్ని అనుసరిస్తున్నామా? నాలుగు అధర్మములతో కూడిన జ్ఞానాన్ని అనుసరిస్తున్నామా? అని చూస్తే మనకు తెలిసిపోగలదు. అటువంటిది తెలుసుకోవాలంటే భగవద్గీతను ఆధారముగా తీసుకోగలిగితే తెలుస్తుంది. దేవున్ని తెలుసుకోవటానికి ఉపయోగపడేది దేవుని జ్ఞానము, చెప్పేది జ్ఞానము. అనుసరించేది ధర్మము. నాగుపామూ పామే, వానపామూ పామే కానీ వానపామును జేబులో వేయవచ్చు. నాగుపామును వేసుకోలేము. నాగుపాముకూ, వానపాముకూ ఉన్నంత తేడా ధర్మమునకు అధర్మమునకు ఉన్నది అని చెప్పవచ్చు. తెలియకపోతే రెండూ పాములే కదా అన్నట్లు ఉంటుంది. తెలియకపోతే ధర్మము అధర్మము రెండూ ఒకేలాగ ఉంటాయి.

ధర్మాలు, అధర్మాలు రెండూ ఉన్నాయి కానీ వాటిని గుర్తించి తెలుసుకోవటం ముఖ్యము. దేవుడు ధర్మములను తెలియచెప్పటం కోసము 'భగవంతుడు' అనే వేషం వేసుకొని వచ్చి చెప్పినాడు. వచ్చినతను మూడు ధర్మములను తెలియజేసి ఊరుకోకుండా, నాలుగు అధర్మముల వలన తెలియబడును అని చెప్పినాడు. కనుక వాటిని మనము అనుసరించ రాదు. ధర్మముల ప్రకారము దేవుడు ఎన్ని భాగములుగా ఉన్నాడు. మూడు

భాగములుగా ఉన్నాడు. దేవుడు సృష్టిలో ఎన్ని భాగములైనాడు అనగా నాలుగు భాగములైనాడు. ప్రకృతి మరియు మూడు ఆత్మ భాగములులైనాడు. ప్రకృతి మరియు మూడు ఆత్మ భాగములు అనగా జీవాత్మ, ఆత్మ, పరమాత్మ ఈ వరుస క్రమాన్ని తప్పితే ఏమవుతుంది. అధర్మమవుతుంది. అదే మాయ అవుతుంది. దేవునికి ప్రతిపక్షము మాయ. ప్రకృతి జనితమైన మాయను తన ప్రత్యర్థిగా పెట్టుకున్నాడు. దేవుడు కాబట్టి అధర్మమునకు లోనైతే నీకు మాయ తెలియబడుతుంది. ధర్మమునకులోనైతే నీకు దేవుడు తెలియబడుతాడు. ద్వాపరయుగములో వ్యాసుడు ఏమి చేసాడంటే 18 పురాణములను వ్రాశాడు. నాలుగు వేదాలను వ్రాశాడు. అందులో కూడా దేవుడు, జ్ఞానము అనే పదాలుంటాయి. కానీ దేవునికి దూరంగా తీసుకు పోయే మాయ ఉన్నది అందులో. దేవునికి ప్రతిపక్షంగా తీసుకువెళ్ళే మాయ ఉంది. వ్యాసుడు అతనికి తెలిసిన జ్ఞానాన్ని సమాజానికి మంచి చేయాలని ఉద్దేశ్యముతో నాలుగు వేదాలు, పద్దెనిమిది పురాణాలు వ్రాశాడు. ప్రజలు దేవునికి దగ్గరవుతారనుకున్నాడు. తరువాత అదే కాలములోనే శ్రీకృష్ణుడు భగవంతునిగా రావాల్సిన పని వచ్చింది. ఎందుకంటే ఎప్పుడైతే ధర్మములకు గ్లాని కలుగుతుందో, అధర్మములు పెరిగిపోతాయో, ధర్మములు మనుషులకు ఎప్పుడైతే తెలియకుండా పోతాయో, అప్పుడు నేనొచ్చి ఇవి ధర్మాలు, అవి అధర్మాలు అని చిక్కుతీసి వెళ్తాను అని చెప్పాడాయన.

ఆ కాలంలో బ్రహ్మజ్ఞానిగా పేరుపొందిన వ్యాసుడు, సద్ బ్రాహ్మణుడిగా పేరుపొందిన వ్యాసుడు నాలుగు వేదాలను, పద్దెనిమిది పురాణములను రచించెను. ఆ సమయంలోనే కృష్ణుడు పుట్టి ధర్మాలను గురించి చెప్పాల్సిన పని వచ్చింది. ఎందరో మహర్షులుండే సమయంలో ఎన్నో యజ్ఞాలు, యాగాలు చేస్తున్న సమయంలో, తపస్సులు ఆరాధనలు

www.thraithashakam.org

దండిగా చేస్తున్న సమయంలోనే, వేదాలను వ్యాసుడు వ్రాసిన సమయంలోనే ధర్మములు అడుగంటిపోయినాయి అని తెలిసిపోయి, అప్పుడు భగవంతుడు పుట్టి, ధర్మములివి అని తెలియజేసి పోయినాడు.

అప్పుడు ఆయన చెప్పిన ధర్మములు, అధర్మములకు అలవాటు పడిన వారికి వ్యతిరేఖముగా కనపబడుతాయి. కానీ ధర్మములను గుర్తించిన వారికి అవి అధర్మములని తెలియగలవు. అప్పుడు వారు సద్బ్రాహ్మణలుగా మారుటకు అవకాశము ఉంది. మూడు ఆత్మల విషయములు తెలియబడి, మాయ ఒకటి ఉంది అని తెలియబడిన తరువాత జ్ఞానము, ధర్మములు తెలియబడతాయి. భగవంతునిగా వచ్చినవాడు కొన్ని సూత్రాలను చెప్పి వెళ్ళెను. మనము నిత్యంవాడే పదాలలోనే అంటుకొని ఉండేటట్లు సూత్రాలను చెప్పినాడు. ఆ పదాలను మనము మరిచిపోయాము. అటువంటి పదాలను మనము కొన్నింటిని జ్ఞాపకము చేసుకుందాము.

మనం మన తండ్రిని నాన్న అని పిలుస్తుంటాము. 'నాన్న' అనేది తప్పు. 'నాన' అనేదే ఒప్పు. ఇంకొకరిని 'మామ' అని పిలుస్తాము. ఇంకొకరిని 'తాత' అని పిలుస్తాము. నాన, మామ, తాత ఇవన్నీ రెండు అక్షరములు గలవి. దీర్ఘమున్న అక్షరము తర్వాత ధీర్ఘము లేకుండా ఉండే అక్షరమొకటి కలదు. ఇదేమి వీటిలో జ్ఞానమేముంది అంటే 'త్రైత సిద్ధాంతమే' ఉంది. 'నాన' ను విడిచిపెడితే ఇంట్లో అమ్మ ఉంటుంది. 'మామ'ను విడిచిపెడితే అత్త ఉంటుంది. తాతను విడిచిపెడితే అవ్వ ఉంటుంది. వీటిలో 'మ' కు 'మ' ఒత్తే, 'త' కు 'త' ఒత్తే, 'వ' కు 'వ' ఒత్తే. మొదటి నాన, మామ, తాతలో వరుస క్రమము ఉంది 'అమ్మ అత్త అవ్వ' లో వరుస క్రమం లేదు కానీ మాయ ఉంది. ఇదేమి పుట్టుగోచికి, మొలత్రాడుకి జ్ఞానము చెప్పినాడు, ఇప్పుడేమి, అత్త, అమ్మ, అవ్వలకు

www.thraithashakam.org

జ్ఞానము చెప్తున్నాడు అంటే, దేవుడు మనము జ్ఞానానికి దగ్గరగా ఉండాలని అలాంటి అర్థము వచ్చే పదాలనే మన వాడుకలో ఉండేటట్లు చెప్పినారు, పదాలను పెట్టినారు. ఉదాహరణకు 'తాత' అనే పదము తీసుకుందాము.

**త+అ+త=తాత అగును.**

**మ+అ+మ=మామ**

న+అ+న=నాన అగును. "మంత్రము-మహిమ" అనే గ్రంథము మీవద్దకు వచ్చింది. ప్రతీ మంత్రములోను త్రైతము ఉంది అని చెప్పాము. అందులో తేలుమంత్రము గురించి చెప్పాము. 'ఓం ఛహ్ ఫట్ స్వాహా', 'చహ్' అంటే 'విషం' ఫట్ అంటే పగిలిపోవటం. అంటే విషము నాశనం అవటం అని అర్థము. ఇక్కడ పని ఏమిటి జరగాలి విషము పని చేయకుండా పోవటమే పని అదే ఉద్దేశ్యము. ముందు ఓం అని చెప్పినాము. చివరిలో స్వాహా అని చెప్పినాము. మాంత్రికులు తేలు మంత్రాన్ని సృష్ఠించలేరు గానీ, సృష్ఠించిన దానిని జపించుకోగలరు. ఒక యంత్రాన్ని నడిపేవాన్ని యాంత్రికుడు అంటారు. యంత్రాన్ని తయారు చేసినవాడిని, యాంత్రికుడు అనరు. ఏ మంత్రాన్ని కూర్చినా సరే. పరమాత్మ, ఆత్మ, జీవాత్మలుగా కూర్చి, ముందర పరమాత్మకు గుర్తుగా 'ఓం'ను చేర్చి, మధ్యలో ఆత్మకు గుర్తుగా వుంచుతారు. చివరిలో స్వాహా అని జీవాత్మకు గుర్తుగా పనిచేసే దానికి గుర్తుగా ఉంచుతాము. ఇటువంటి మంత్రాలను యోగులు తప్ప ఎవ్వరూ ఈ మంత్రాలను సృష్ఠించలేరు. ఈ తేలు మంత్రాన్ని కూడా ఎలా సృష్టించారు. ఓం.... స్వాహా మధ్యలో 'చహ్ఫట్'. ఓం అనేది దేవునికి గుర్తు, 'స్వాహా' అంటే అయిపోయేది. అంటే ఎప్పటికైనా అయిపోవలసింది జీవుడే. అంటే క్షరుడు నాశనమయ్యేవాడు. మధ్యలో ఆత్మకు గుర్తు పని చేసేది ఆత్మే. సకల జీవరాశుల శరీరాలలో పనిచేసేది ఎవరు? ఆత్మయే.

www.thraithashakam.org

ఇక్కడ ఏ పనైతే జరగాలో దానికి 'చహ్ఫట్' అనేదానిని మధ్యలో పెట్టాము. ఏ మంత్రమైనా ఇట్లాగే ఉంటుంది. మంత్రానికి శక్తి అక్షరాలను కూర్చే దానినిబట్టి ఉంటుంది. ఈ విషయం జ్ఞానులకు మాత్రమే తెలుసు ప్రతీ మంత్రానికి పనిచేసే శక్తులుంటాయి. ఆ శక్తులు యోగుల మాటలే వింటాయి. అందరి శరీరాలలో దేవుడూ ఉన్నాడు. జీవుడూ ఉన్నాడు ఈ రెండూ ఉన్నాయని అందరూ చెప్పుకుంటున్నారు. గానీ మధ్యలో అంతా చేసే 'ఆత్మ' గురించి చెప్పుకోవటం లేదు. మనమే దానిని గురించి చెప్పుకుంటున్నాము. ఈ శరీరములో జీవుడూ పనిచేయడు, దేవుడూ పని చేయడు. దేవుడు ఏ పనైనా చేయగలడు కానీ చేయడు, జీవుడు అన్నీ చేయగలను అనుకుంటాడుగానీ ఏదీ చేయలేడు. మరి చేసేదంతా ఎవరు? 'ఆత్మ'. ఎవ్వరికీ కనపడకుండా మన వెనకుండి నడిపిస్తున్నదన్న విషయం ఎవ్వరికీ తెలియదు. నేను మాట్లాడుచున్నాను అంటే దీనినంతటినీ చేస్తున్నది ఎవరు? ఆత్మయే. మనల్ని కనబడేటట్లు చేస్తున్నాడు. నేను బాగా చెప్తున్నాను, చేతులు బాగా ఊపుకుంటూ చెప్తున్నాను అని అనుకుంటాను. కానీ వెనుక ఊపేవాడు, చెప్పేవాడు ఇంకొకడు. నేను స్వాహా వాన్నే అనుకోవాలి. అంటే చేతకానివాడినే అని అనుకోవాలి. పరమాత్మ అనేది సాక్షిగా ఉంటుంది, బ్యాండ్ మేళములో శృతి ఒకటి ఉంటుంది చూడండి. అది ఎప్పుడూ మ్రోగుతూ ఉంటుంది. అందులోనుండి అదేమి పాటరాదు అలా ఉండేదే కానీ ఏ పాటరాదు. లేదు అనుకోకుండా ఉంటుంది, అదీ పరమాత్మ స్థితి. ఆ విధంగా జీవుడూ పని చేయడు, దేవుడూ పనిచేయడు. చేసేదంతా మధ్యలోని ఆత్మే. నాన అనే పదములో న+అ+న=నాన అవుతుంది. మొదట 'న' ఉంది, చివర 'న' ఉంది. ముందు ఉన్నవాడు పనిచేయడు, చివర ఉన్నవాడు పనిచేయడు, ఇద్దరూ 'న' లే. నాన అనే పదములో అర్థము

కనిపించేటట్లు పెట్టినారు మధ్యన 'అ' అనేది పనిచేసేది కనుక ప్రత్యేకంగా ఉన్నది. అది మారదు. ఆత్మకు పేరు మారదు దాని పేరు 'ఆత్మే' మొదటి దానిని, దేవుడు అంటాము, పరమాత్మ అంటాము. చివరివాన్ని నాశనమయ్యే వాడు క్షరుడు అంటాము. అ విధంగా దేవున్ని, జీవున్ని రెండు మూడు పేర్లతో మొదటి, చివరవారిని పిలువవచ్చు. కానీ మధ్యలో ఉండే ఆత్మను ఆత్మే అనాలి తప్ప, మరేం అనటానికి లేదు. నీ శరీరానికి వయస్సు పెరిగి, తాత అయినావు అనుకో, అప్పుడు కూడా అంతే త+అ+త=తాత అయినావు. మామ స్థితిలో ఉన్నావు అనుకో మ+అ+మ=మామ. జీవాత్మ పనిచేయదు, పరమాత్మ పని చేయదు కనుక ఇద్దరినీ ఒకే అక్షరములో పోల్చి చూపించాము. పెద్దల్లో ఆ రోజు ఆత్మే ఈ పదాలు విడతీసుకుంటే ఈ అర్థాలు ఉంటాయని ముందే మన పెద్దల ద్వారా చెప్పించింది. ఇది వరుస క్రమం. పనిచేయనివాడు పనిచేసేవాడు+పని చేయనివాడు. ఇది ధర్మము మరియు త్రైత సిద్ధాంతము. ఇది దేవుని జ్ఞానము. నీవు మాయా జ్ఞానమునకు పోతే ఎట్లా అగును. మాయా జ్ఞానము ఎటువంటిది, వరుస క్రమం లేనిది ప్రక్కనే ఉంది. దాని ప్రక్కనే ఉంది అమ్మ (అ+మ+మ), అత్త (అ+త+త) అవ్వ (అ+వ+వ) అంటే ఇక్కడ వరుస తప్పింది. మధ్యలో పనిచేయాల్సిన ఆత్మ గుర్తు 'అ' ముందే వచ్చింది. తరువాత పరమాత్మ, జీవాత్మ వచ్చేశాయి. ఇక్కడ వరుస క్రమం తప్పిపోయింది. మూడు ఉన్నాయి కానీ వరుస క్రమంలేదు. 'తాత' అనే పదంలో వరుసక్రమంలో ఉంది, 'అవ్వ'లో వరుసక్రమము లేదు. 'నాన' లో వరుస క్రమం ఉంది, 'అమ్మ'లో వరుస క్రమం లేదు. 'మామ' లో వరుస క్రమం ఉంది, 'అత్త'లో వరుస క్రమం లేదు.

ముందుగా చెప్పితే పరమాత్మ, ఆత్మ, జీవాత్మ, లేదా అటునుండి చెప్పాలంటే జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అని చెప్పాలి. అలా కాకుండా

ఆత్మ, పరమాత్మ, జీవాత్మ అని చెప్పినా తప్పే లేదా ఆత్మ, జీవాత్మ, పరమాత్మ అని చెప్పినా తప్పే అగును. మధ్యలో ఆత్మ లేకపోతే సక్రమమైన పద్ధతి కాదు. మాయపద్ధతి అగును. మాయకు గుర్తుగా స్త్రీ స్వరూపమైన అమ్మ, అవ్వ, అత్త అనే పదాలలో వరుసక్రమం తప్పినట్లుగా ఉన్నది. దేవుని గుర్తుగా నాన, తాత, మామ అనే పదాలు తెలుగు భాషలో, మనము మాట్లాడే భాషలోనే ఇమిడ్చి పెట్టినారు పెద్దలు. నాన అని నీ కొడుకు పిలిస్తే ఆ పదానికి అర్థము తెలిసే విధంగా ఉన్నామా! లేమా! అని చూసుకోవాలి. అలాగే మామ, తాత అని పిలిపించుకోవడమే కాకుండా నిజంగా ఆ యోగ్యతను పొందటానికి ప్రయత్నం చేయవలెను. అలాగే స్త్రీలుగా ఉన్న మీరు కూడా ప్రకృతికి మారు పేర్లుగా మీ పేర్లున్నాయి. అమ్మ, అత్త, అవ్వగా ఉన్నాయి. ఇది వరుస తప్పిన విధానము. శరీరాలు స్త్రీస్వరూపమైనా, వరుస క్రమ జ్ఞానములో మేము పోవాలని ప్రయత్నం చేయండి. తద్వారా అందరూ జ్ఞానమార్గములోకి వస్తారు. కనుక దేవుడు తన జ్ఞానాన్ని ప్రతీ మాటలోనూ అందించాడు. ఆ విధముగా నీవు తెలుసుకోగల్గితే బ్రహ్మజ్ఞానివి అవుతావు. బ్రహ్మజ్ఞానివైతే నీవు బ్రాహ్మణునివి అనిపించు కుంటావు. అంటే సద్బ్రాహ్మణునిని అనిపించుకుంటావు. నీవు సద్బ్రాహ్మణుని వైతే నీకు విలువొస్తుంది. నీకు కనపడని విలువొస్తుంది. నీకు గ్రహాలు, ఉపగ్రహాలు, భూతములు, ఉపభూతములు, మహాభూతములు నిన్ను గౌరవిస్తాయి. మానవులలో ఎలాగైతే 90% జ్ఞానులు కాకుండా ఉన్నారో గ్రహాలు, ఉపగ్రహాలు, భూతాలు, ఉపభూతాలు ఏవైతే కంటికి కనిపించకుండా ఉన్నాయో వారిలో 90% జ్ఞానులున్నారు. మనుషుల గ్రహములు (సూక్ష్మములు) 10% అజ్ఞానులుగా యున్నారు. వారు నిన్ను గుర్తించ గల్గితే, నీకు విలువనిస్తారు. వారు ఎక్కడైతే పాపపరిహారము

www.thraithashakam.org

చేస్తూ, శిక్షిస్తూ ఉన్నారో, అక్కడ నిన్ను లేకుండా చేస్తారు. నిన్ను చిక్కుల్లో చిక్కుకోనివ్వరు, నిన్ను ఇబ్బంది పెట్టరు. పెద్ద ప్రమాదం జరిగినా అందరికీ కర్మానుసారము దెబ్బలు తగిలినా, నీకు మాత్రము ఎలాంటి దెబ్బలు తగులనివ్వరు.

ఒక ప్రమాదం జరిగితే, ఎలా జరిగిందో తెలియదు. ఒక మంత్రంతో ఒక పని జరిగితే ఆ పని ఎలా జరిగింది? అని ఆ మాంత్రికునికి కూడా తెలియదు. తేలుమంత్రం వేస్తే, తేలు విషం ఎలా తగ్గిందో తెలియదు. ఈ విధంగా తెలియని విధానాలు ఎన్నో ఉన్నాయి. ఈ తెలియని విషయాలన్నీ తెలుసుకోగల్గితే సంపూర్ణమైన జ్ఞానులమవుతాము. సంపూర్ణమైన జ్ఞానులు కావాలంటే ధర్మయుక్తమైన జ్ఞానము తెలియాలి. ధర్మయుక్తమైన జ్ఞానము తెలియాలంటే 'మూడు' సంఖ్యతో కూడిన జ్ఞానమే తెలియాలి. **"త్రైత సిద్ధాంత జ్ఞానము తెలుసుకోండి"** ఇప్పుడు మీకు **'మంత్రము-మహిమ'** అనే గ్రంథము ఇస్తున్నాము. అందులో నమూనాగా తేలు మంత్రము ఇవ్వబడింది. అందులో చెప్పినట్టుగా 10,000 సార్లు జపిస్తే అది సిద్ధిస్తుంది. కానీ మంత్రములు జపించటము మన ఉద్దేశ్యము కాదు. మంత్రము వెనుక ఉన్న శక్తి ఏమిటో తెలుసుకోవటమే ముఖ్యం. ఎంత మంత్రశక్తి అయినా యోగుల దగ్గర వినయ విధేయతలతో ఉంటాయి. వారు మంత్రాల్ని జపించాల్సిన అవరము లేదు. కానీ మాంత్రికులు మాత్రము యధావిధిగా నియమాలు పాటిస్తూ, జపించాల్సి ఉంటుంది. ఆ మంత్రానికి కట్టుబడిన గ్రహమో, ఉపగ్రహమో, శరీరములోకి వెళ్ళి విషాన్ని తీసివేస్తుంది, లేదా పనిచేయకుండా నిర్వీర్యం చేస్తుంది. యోగి అనేవాడి దగ్గర మంత్రము అనే తాడు అవసరము లేదు కానీ తన వెనుక ఆ శక్తులన్నీ ఉంటాయి కనుక యోగి చెప్పితే వింటాయి. యోగి మాటతో

చెప్తాడు, మాంత్రికుడు మంత్రంతో చెప్తాడు. ఏది ఏమైనప్పటికీ జ్ఞానమునకు ఏదైనా తక్కువే, అని గ్రంథములో వ్రాయటం జరిగింది. తరువాత గ్రంథము **"ధర్మము-అధర్మము"** అందులో ఉన్నది ఉన్నట్లు చెప్పటం జరిగింది. దానివలన అధర్మాలు ఆచరించేవారికి కొంత ఇబ్బందిగా ఉంటుంది. ఇబ్బందైనా సరే సత్యమే చెప్పాలి కావున మేము చెప్పాల్సిన పని వచ్చింది. ఇబ్బంది పెట్టాలని ఉద్దేశ్యముతో చెప్పలేదు. కావున మొట్టమొదట శ్రీకృష్ణుడు ధర్మాలన్నీ అర్జునునికి ఒక్కసారే చెప్పిపోయినాడు. నువ్వే చెప్పావా కదా! అంటే లేదు కృష్ణుడు అని పేరు పెట్టి వ్యాసుడు వ్రాశాడు అంటాడు. ఎవరూ వినలేదు. ఒక్క అర్జునుడు తప్ప. ఈ ప్రజలంతా మూర్ఖులు వీరికి చెప్తే ఇబ్బంది అని ఎవరితోనూ వివాదము పెట్టుకోకుండా చెప్పినాడాయన. ఇప్పుడు మనము మాత్రము ఇరుక్కున్నాము. అయినా సరే ఉన్నది ఉన్నట్లు చెప్పడమే మా పని అది దేవుని సేవ. కనుక ముఖ్యమైన దేవుని సేవ ఏమిటంటే, మనకు తెలిసిన నిజమైన దైవజ్ఞానాన్ని ఇతరులకు తెలియజేయుట ముఖ్యమైన సేవ. ఆ సేవ నిమిత్తమై మేము వ్రాసిన గ్రంథాన్ని అసూయతో కాకుండా చదివితే జ్ఞానము తెలుస్తుంది. అర్థము చేసుకోకుండా చదివితే శత్రువుగా కనిపిస్తుంది. అర్థము చేసుకొని చదివితే మిత్రునిగా కనిపిస్తుంది. కనుక ఒక్కరితో అయితే శత్రుత్వం చేయవచ్చు, దేశంలో ఇంతమందితో శత్రుత్వం చేయాలంటే ఎలా సాధ్యపడుతుంది? అందుకే సద్బ్రాహ్మణులుగా ఉన్న వారు ఎంతో విలువ కల్గినవారై ఉన్నారు. నా యెడల భక్తి కల్గివున్నారు, నాకు నమస్కరిస్తున్నారు. అటువంటి బ్రాహ్మణులు ఇంతకాలము నేను కృష్ణుని పూజిస్తున్నా కృష్ణుని గురించి వివరము పూర్తిగా ఇప్పుడు తెలిసింది.

వ్యాసుడు తన తప్పును తెలుసుకుని, భగవద్గీతనే వ్రాశాడు. తాను వ్రాసిన వేదాలకు వ్యతిరేఖంగా వ్రాశాడు. తాను వ్రాసిన పురాణాలకు వ్యతిరేఖంగా వ్రాశాడు. ఆ విధంగా వ్యాసుడు సద్బ్రాహ్మణుడు అనిపించు కున్నాడు. ఈ రోజు మనమందరము బ్రాహ్మణులుగా మారేందుకు ప్రయత్నిద్దాము. ఆ పదములో కూడా సద్బ్రాహ్మణునిగా మారుదాం. అందులో భాగంగా మీరింటికి వెళ్ళగానే నీ కొడుకు నిన్ను 'నాన' అని పిలిస్తే, అందులో నేను 'నాన' అనే పదానికి అర్హుడినా అని లెక్కవేసుకో, ఆలోచించుకో. పేపరుపైన వాటి వివరము వ్రాసుకోండి, తెలుసుకోండి అని చెప్తూ ఈ సమావేశాన్ని ముగిస్తున్నాము.

## 56. ఇందువు - హిందువు

తేది : 02-08-2012

పూర్వం హిందువు అనే పదము 'ఇందువు'గా ఉండేది. చరిత్ర తెలియనటువంటివారు, రాజకీయంగా పార్టీలు పెట్టినటువంటివారు, జ్ఞానమంటే ఏమీ తెలియని వారంతా మేము చెప్పేమాటను వ్యతిరేఖిస్తూ వచ్చారు. వాళ్ళంతా ఖండించినా మేమంతా వ్యతిరేఖిస్తూనే అసలైన సత్యాన్ని చెప్తూవచ్చాం. మేము చెప్పిన మాట నిజమే అనే విషయాన్ని, పుష్పగిరి పీఠాధిపతి, చిన్నజీయర్స్వామి కూడా హిందూ అనే పదం చాలా తప్పు అర్థం ఇచ్చే పదమని, ఆ పేరుతో మనం పిలిపించుకుంటే మనతలను మన చేతితో తీసుకున్నట్లే అని వారు చెప్పినారు ఇప్పుడు. కాని ఈ మాటను మేము 40 సంవత్సరముల క్రితమే చెప్పాము.

www.thraithashakam.org

ఈ విధంగా ఒక విషయాన్ని పరిశోధనాత్మకంగా చెప్పే వ్యక్తికి గౌరవమిచ్చి ముందు వినవలెను. ఏ పరిశోధనా లేకుండా జ్ఞానము లేకుండా ఇది ఇట్లే ఉండాలి అంటే ఏ ఆధారం లేకుండా ఏ విధముగా అది సత్యం అనుకోగలం. ఈ విషయం ఆధ్యాత్మికతకు సంబంధించింది కావున, జ్ఞాన విషయం కావున శాస్త్రబద్ధంగా ఉండాలి అని మేము చెప్పుచున్నాము. మేము మొదటినుండి ఏమి చెప్పుచున్నామంటే, 'హిందూ' అనే శబ్దానికి ఏ అర్థము లేదు. దీనిని అనవసరంగా మీరు పెట్టుకున్నారు. మా ప్రచార రథం మీద ఇందూ ధర్మప్రచారము అంటే మా బండిని ఆపి ఇదేమి హిందూ కదా, ఇందూ అని వ్రాసారేమిటి అని అడుగుచున్నారు. అంటే వాడికేమీ తెలియదు, పైగా 'అంతమట్టుకు తెలియదా?' అని మమ్మల్ని ప్రశ్నిస్తున్నాడు.

ఈ విధంగా తప్పొప్పుల గురించి ఎవరు చెప్పాలి? పరిశోధన చేసినవారు చెప్పాలిగానీ, ఏదో పదిమంది అంటున్నారు కదా అని నేను చెప్పుచున్నానంతే, అంటే అందరూ అబద్దాలు చెప్పుతూ ఉంటే నిజమౌతుందా. కనుక సత్యమేది అని పరిశోధించాలని ముందు నుండి చెప్పుచున్నాము. ఈ పౌర్ణమికి ముందురోజున హైదరాబాద్‌లో Ntv వారి ఆధ్వర్యములో 'ధార్మిక సమ్మేళనం' అనే పేరుతో ఒక చర్చావేదిక జరిగింది. ఐదుగంటలకాలం ఆ సమావేశం జరిగితే, పెద్దపెద్ద స్వామీజీలందరూ అంతసేపు జరిగిన చర్చలో పాల్గొన్నారు. పుష్పగిరి పీఠాధిపతి ఒకరు **'హిందువు'** అనే పదం తప్పు అని చెప్పినారు. ఆ పదానికి అర్థం తెలివితక్కువ వారు. ఆ పదానికి అర్థం మనం తెలుసుకోకుండా అదే పదాన్ని ఓపికగా చెప్పుకుంటున్నాం. మనం భారతీయులము అది మంచి పద్ధతి కాదు" అని అన్నారు. మరి 70 సంవత్సరాల వయస్సున్న వ్యక్తి ఒకరు చెప్పినారు కదా. ఈ పదాన్ని చిన్న జీయర్ స్వామివారు కూడా వివరించారు.

'తలకాయలేనివాడే హిందువు' అనే పదాన్ని చెప్పుకుంటారని చెప్పినారు. సింధూనుండి ఆ పదం వస్తే, అంతకముందు మనకి నాగరికత లేదా అప్పుడు మనల్ని ఏమని పిల్చేవారు అని ఆయన అడిగాడు.

ఇప్పుడు మనము ఏమి చెప్పుచున్నామంటే హిందూపదం అనేది వాడకూడదనే చెప్తూ, మనం జ్ఞానులము, మనమందరమూ కృతయుగము నుండి ఉన్నాం, అప్పుడు ఏమని పిలిచేవారో మేము చెప్తూ వచ్చాం. ఆ విధంగా ఎక్కువ దేవుని జ్ఞానం తెలియటం వలన దక్షిణంవైపు ఉన్న దేశాలన్నింటికీ జ్ఞానుల దేశం అని పేరు వచ్చింది. కనుక ఈ జ్ఞానం అనే పేరు చెప్పేందుకు, అర్థం వచ్చే విధంగా "ఇందూ" అనే పదం వచ్చింది. కనుక మనమందరము అప్పటినుండి "ఇందువులు" చెలామణి అయినాము. కనుక ఏ అర్థము లేనటువంటి "హిందూ" అని పేరు పెట్టుకోవటమేమిటి? ఈ రోజు మతాధిపతులు, పీఠాధిపతులంతా హిందువులం అని చెప్పు కుంటున్నారు గానీ వారికి ఆ పదమునకు అర్థం ఏ మాత్రం తెలియదు. దీనిలో మీరు వ్రేలుబెట్టారు. మీరు సర్వనాశనమవుతారు. ఆ విధంగా ఆ పాపాన్ని మూటగా పెట్టి మీకు పంపిస్తాడు. దానిని తప్పకుండా అనుభవించాల్సిందే. అందుకొరకు దేవుని విషయంలో మనం శాస్త్రబద్ధంగా అనుసరించాలి. ఈ విధంగా పరిశోధన చేసినవ్యక్తులు పూర్వం ఎవరైనా ఉన్నారా అంటే ఉన్నారనే చెప్పాలి. వారు కొన్ని సిద్ధాంతాలను కనుగొన్నారు. కనుక వాటిపైన మనం పరిశోధన చేయవచ్చు. ఆ విధంగా సిద్ధాంతములను కనుకున్నవారు ముగ్గురున్నారు. అద్వైతసిద్ధాంతము, కేరళ రాష్ట్రం నుండి వచ్చిన ఆదిశంకరాచార్యులు అద్వైతసిద్ధాంతాన్ని కనుకున్నాడు. ఆ విధంగా ఆయన ఆధ్యాత్మికాన్ని తన సిద్ధాంతానికి అనుగుణంగా బోధించాడు. తరువాత విశిష్టాద్వైతం వచ్చింది. వారుకూడా ఆధ్యాత్మికాన్ని వివరించారు

www.thraithashakam.org

గాని వారికి, వీరికి వ్యతిరిక్తం వచ్చింది. సంపూర్ణమైన జ్ఞానం లేక పోవటం వలన ఇద్దరూ పోట్లాడుకోవటం జరిగింది. ఆ సిద్ధాంతాన్ని అనుసరించి, ఏది సత్యం, ఏది అసత్యం అని తెలియలేకుండా ఉన్న సమయంలోనే, కొందరికి విశిష్టాద్వైతం నచ్చింది, మరికొందరికి అద్వైతం నచ్చింది. తరువాత ద్వైత సిద్ధాంతం వచ్చింది. మధ్వాచార్యులు వచ్చి, కర్ణాటక, ఉడిపి ప్రాంతం నుండి అతను ద్వైతసిద్ధాంతాన్ని ప్రతిపాదించినారు. ఇప్పుడు మూడు సిద్ధాంతముల వారు ఉన్నారు. వీరిని ఏ విధంగా కనుగొనేది అంటే విభూధి రేఖలు పెట్టేవారంతా అద్వైతులు, నిలువ నామాలు పెట్టేవారంతా వైష్ణవులు లేదా విశిష్టాదైతులు పొక్కిడిలు లేకుండా నామాల్ని పెట్టేవారంతా ద్వైతులు. వీరంతా అనగా శంకరాచార్యులుగాని, రామానుజచార్యులుగాని మధ్వాచార్యులుగాని దక్షిణ దేశం నుండి వచ్చినవారే. ఇన్ని రాష్ట్రాలు ఉన్నప్పటికీ దక్షిణ రాష్ట్రములనుండే ముగ్గురు సిద్ధాంతకర్తలు వచ్చారు. వీరిని అనుసరించినవారెవ్వరైనా వారు చెప్పిన సిద్ధాంతాన్ని అనుసరించి చెప్పేవాళ్ళేగానీ, అది దాటి చెప్పరు. ఎందుకంటే వారి సిద్ధాంతం మారిపోతుంది కావున.

మేము ఒక వ్యక్తి చెప్పగా విన్నాము. హిందూ అనే పదమే తప్పని మేము చెప్తే, అతను హిందూ అనే పదంలో "హిం" అంటే "హింస", "దూ" దూరంగా ఉండేదట. హింసను దూరం చేసేవాడు హిందువువట. అయితే హిందు అని పేరు పెట్టుకున్నవారు హింసలే చేయటం లేదా? ఒకవేళ చేస్తే హిందువులు ఏ విధంగా అగుదురు? 'దు' దూరం అనుకుంటే 'ద' అంటే దగ్గర అనుకోవచ్చా అయితే, అ అంటే అమ్మ, 'ఇ' అంటే ఇల్లు అని చెప్పుకునేందుకు, ఇది ఆధ్యాత్మిక విద్య, జ్ఞానము, ఈ విధంగా చెప్పుకోవచ్చునా? అని మేము ప్రశ్నిస్తున్నాము. ఆధ్యాత్మికములో ప్రతీ

www.thraithashakam.org

పదమునకు స్థూల, సూక్ష్మములు రెండూ ఉంటాయి. జీవమున్నదానికే స్థూలము, సూక్ష్మము ఉంటాయని అనుకోవద్దండి. జీవమున్న, జీవములేని ప్రతీది స్థూల, సూక్ష్మములు రెండూ ఉంటాయి. ఇది చాలా పెద్ద పరిశోధనా ఫలితము. ఇది వెయ్యి సంవత్సరములు శ్రమించినా కనుక్కోలేని పెద్ద పరిశోధనిది. ఉదాహరణకు ఒక గుడ్డ ఉంది. గుడ్డకు ప్రాణంలేదు కానీ అది ఒక పదార్థము. దీనిలో కూడా స్థూల, సూక్ష్మములు రెండూ ఉన్నవి. మనం పండుగరోజు పెద్దలకు క్రొత్త గుడ్డలు పెడతాము. వారు కట్టుకోరుకదా మరెందుకు పెడుతున్నట్టు అంటే పూర్వం మన పెద్దలు చెప్పారు. ఆ విధంగా మనం చేస్తున్నామంతే. దీనిని లోతుగా చూసినట్లైన గుడ్డలలో కూడా స్థూల, సూక్ష్మములు రెండూ ఉంటాయి మనం చూస్తున్న స్థూలంగా ఉన్న గుడ్డల్లో సూక్ష్మాన్ని వారు తీసుకుని వారు కట్టుకోవటం జరుగుతుంది. ఆ విధంగా పెట్టకపోతే, కొందరు పెద్దలు ఎవరిమీదనైనా వారు పూని మాకు గుడ్డలు ఎందుకు పెట్టలేదని కూడా అడుగుదురు. శబ్దములో కూడా స్థూల, సూక్ష్మములు గలవు. "హిందూ" అనే శబ్దములో ఒక సూక్ష్మశక్తి ఉంది. 'ఇందు' అనే దాంట్లో కూడా ఒక సూక్ష్మశక్తి ఉంది. ఒక శబ్దంలో కూడా తక్కువ శక్తి కలిగిన సూక్ష్మము, ఎక్కువ శక్తి కలిగిన సూక్ష్మము రెండు రకములు ఉంటాయి. మంత్రంలో శక్తిలేదా? అంటే మంత్రంలో శక్తి ఉంది. కనుకనే మంత్రముల వలన పనులు జరుగుచున్నాయి. అయితే ఇప్పుడు హేతువాదులమని పేరుపెట్టుకున్నవారంతా, సూక్ష్మములు లేవు ఉంటే చూపించండి అని అంటున్నారు. దానిపేరే సూక్ష్మము "కనిపించనిది" అని దాని అర్థం. ఇంకే విధంగా చూపించగలం. వారు చూడగలరు వాటిని కేవలం బుద్ధి ద్వారా మాత్రమే గ్రహించుకోగలం. కనుకనే మేము చెప్పేదేమంటే శబ్దములో కూడా స్థూల, సూక్ష్మ శక్తులున్నాయి. వాటి యొక్క

శక్తి కేవలం ఆధ్యాత్మికవేత్తలకే తెలుసును. యోగులకు మాత్రమే తెలుసును. ఇది ఈ విధంగానే ఉండాలి, అది ఆ విధంగానే ఉండాలి. అది అంతే అని జవాబులు చెప్పేవారంతా తలకాయలేని వారు మాట్లాడుతున్నట్టుగా ఉంటుంది. ఈ విధంగా మాట్లాడేవారంతా వారు చెప్పినమాట అసత్యమని తేలిన సందర్భములో, మరలా వెటకారంగా, మేము అజ్ఞానములములేండి, మీరంతా తెలిసినవారులేండి అంటుంటారు. మేము ముందునుండి అదే చెప్పుచున్నాం మీకు తెలియని విషయములు మేము చెప్పుచున్నాం అంటే జవాబు ఉండదు. తెలియనివారికి, తెలియజేసేటట్లు చేయటానికి, దేవుడు బోధకులను తయారుచేసాడు. మనమేప్పుడూ తెలుసుకునే వాళ్ళుగానే ఉండాలిగానీ బోధకులుగా మారాలని అనుకోకూడదు. మేము వ్రాసిన గ్రంథములలో ఒక దగ్గర "అయితే నీవు లక్షాధికారివైనా అయి ఉండు లేదా బిక్షాధికారివైనా అయివుండాలి" అని వ్రాసాము. దానికి వివరము కూడా వ్రాసాము. నేను బిక్షాధికారిని అవుతాను, నేను లక్షాధికారి అవుతాను అనుకోవటానికి వీళ్ళేదు. మీరే వాక్యాన్ని వ్రాసి మీరే వీళ్ళేదు అంటున్నారేమిటి? అని ప్రశ్నించవచ్చును. వాస్తవమే, మన వెనుక కర్మ ఒకటుంది. అదే అంతటినీ నడిపిస్తూ ఉంది. పుట్టినప్పటినుండి, చచ్చినంత వరకు నడిచి తీరాల్సిందే తప్పించుకొనుటకు అవకాశం లేదు. విధి అనేది ఏ గీత పెడితే ఆ గీత ప్రకారం నడవాల్సిందే. దాన్ని దాటిపోవుటకు ఇంకొక మార్గం లేదు.

నువ్వు పుట్టినప్పుడే ప్రారబ్ధకర్మ వచ్చింది. దాని ప్రకారం నీవు ఇట్లే బ్రతకాలి, అని ఉందనుకో. అప్పుడు నువ్వు లక్షాధికారివి కావాలంటే అవుతావా? భిక్షాధికారిగానే బ్రతకాల్సి ఉందనుకో అలాగే బ్రతకాల్సిందే. మీ వెనుక కర్మప్రకారము నడిపించే ఆత్మ ఒకటుంది. కనుక, స్వయంగా

www.thraithashakam.org

నడిచేందుకు అస్సలు అవకాశం లేదు. శ్రీకృష్ణుడు మోక్షసన్యాసయోగంలో చెప్పాడు. మీ అందరినీ నేను బొమ్మలను ఆడించినట్లు ఆడిస్తున్నాను. మీరు ఆడుతున్నారంతే, మీ అందరూ బొమ్మలతో సమానమే. మరి ఈ విధంగా తేల్చి చెప్పేసిన తరువాత, "నీవు బిక్షాధికారివైనా అవవచ్చు లేదా లక్షాధికారివైనా కావచ్చు" అని మీరు అంటున్నారే? అని ప్రశ్నిస్తే, నీవు ప్రపంచవరముగా నీవు బిక్షాధికారివైనా, లక్షాధికారివైనా నీ కర్మానుసారమే నీవు అవుతావు. అయితే నీవు స్వయంగా అయ్యేది మాత్రం ఒకటుంది, అదే జ్ఞానవిషయంలో. అదంతా కర్మాతీతమైనది, కర్మాధీనములో లేనటువంటిది. నీవైన జీవుడు జ్ఞానం ఎంత సంపాదించాలంటే అంత సంపాదించగలిగేది. కనుక ప్రపంచములో ఎలాగైతే ధనం ఉందో, అలాగే జ్ఞానమనే దానిని ఎంత కావాలంటే అంత సంపాదిచుకో, లేదు అంటావా జ్ఞానం కొరకు జ్ఞాన బిక్షాందేహి, జ్ఞానంకావాలి అని అడుక్కోవలెను. ఎక్కడో ఒకచోట ఎవరో ఒకరు చెప్తూ ఉంటారు, నేర్చుకో. అంటే జ్ఞానాన్ని అడుక్కునే వారిని మనం బిక్షాధికారి అంటున్నాము. అంటే జ్ఞానబిక్ష అడుక్కునేది. ఆ విధంగా జ్ఞానం సంపాదించిన తరువాత దానం చేయటానికి మొదలుపెట్టు. అదే విధంగా నీవు ఆత్మజ్ఞానాన్ని నీవు సంపాదించుకోవచ్చు, దానమూ చేయవచ్చు.

కొందరున్నారు వారు జ్ఞానమార్గాన్నే ప్రశ్నిస్తారు. ఇది ఎట్లా? అది ఎట్లా? అని ప్రశ్నిస్తారు. "ఇందూ ధర్మ ప్రచారము" అని వ్రాస్తే మీరు తప్పు వ్రాసినారు అని విమర్శిస్తారు. అంటే వారికి ఓనమాలు కూడా తెలియవు. వారు మనల్ని ప్రశ్నిస్తారు. దానికి మనవారు, "ఇది మేము వ్రాసినది కాదు పెద్ద యోగీశ్వరుడు వ్రాసినది" అంటే "ఆయనకు మరొక్కసారి చదువు కోమనండి" అన్నారట. అంటే అక్షరాలు, పదములు రాకుండానే

పెద్దపెద్ద గ్రంథాలు వ్రాసి మేము బయటకు పంపిస్తున్నామా మేమేదీ శ్లోకాలు దండకాలు వంటివి వ్రాయలేదు. మా గ్రంథాలలో స్వచ్ఛమైన జ్ఞానం ప్రతీ పేజీలోనూ క్రొత్తదనం ఉంటుంది.

"మనిషికి రాకుండా కష్టాలు మానుకు (వృక్షమునకు) వస్తాయా" అనే మాటను ఎందుకన్నారని ఆలోచిస్తే, పాపం చేసుకునేవాడు మనిషేకదా కనుక చెట్టుకెందుకు వస్తాయి? అదేంపాపం చేయలేదు కదా! ఇంతకుముందే మేము చెప్పాము. ఎక్కువ గుణాలలో తగుల్కొని పాపం చేసే జన్మ మనిషే కనుక వాడికే కష్టాలు వస్తాయని, ఒక మనిషికి వ్రేలు తెగితే అతను పడే బాధ చాలా ఉంటుంది. అదే పరిస్థితి ఒక జంతువుకు కలిగితే అది అనుభవించే బాధ మనిషి అనుభవించే బాధలో పదిశాతం మాత్రమే ఉంటుంది. అంటే చాలా తక్కువ బాధని అనుభవిస్తూ ఉంది. అనగా జంతువులకంటే మనము తొంభైవంతులు ఎక్కువ బాధను అనుభవిస్తున్నాం. దీనిప్రకారం ఎవరెక్కువ పాపం చేసుకుంటున్నట్టు? చూసేందుకు మనం చాలా బుద్ధిమంతులం. ఎందుకంటే మనం జంతువులను మన చేతుల్లో పెట్టుకుని వాటిని నియంత్రిచవచ్చు లేదా బంధించవచ్చు. కానీ దాని వలన ఏమి ప్రయోజనం? నీవు అనుభవించేదే ముఖ్యమైనప్పుడు.

నీకు వాటికంటే బుద్ధి ఉన్నంతమాత్రాన నీవు కర్మలనుండి తప్పించుకునేది ఏమైనా ఉందా? ఒక గాడిద పిల్ల బస్సు క్రిందపడితే, తల్లిగాడిద ఒక నిమిషం దాని దగ్గర ఉండి వెళ్ళిపోతుంది. మరి మన పిల్లవాడు బస్సు క్రింద పడితే మనం ఎన్ని రోజులు ఏడుస్తాము? మరి అనుభవంలో ఎవరెక్కువ అనుభవించారు? మరి జంతువుకు, మనకీ అంత తేడా ఉందే. ఇక చెట్టును చూస్తే జంతువు అనుభవిచే దానిలో 10వ వంతుమాత్రమే అనుభవిస్తూ ఉన్నది. అంటే 99వంతులు మనిషి ఎక్కువ

www.thraithashakam.org

అనుభవిస్తున్నాడు. **"అందుకే కష్టాలు మనుషలకు రాకపోతే మానులకు వస్తాయా"** అన్నారు. చూడండి ఎంత చక్కగా మన పెద్దలు ఈ మాటను చెప్పారో. అంటే పాపం, పుణ్యం ఎక్కువ చేసేవాడు మనిషే కావున కష్టాలు సుఖాలు వీడికికాకుండా వాటికెందుకు వస్తాయి.

పుష్పగిరి పీఠాధిపతి అయిన నృశింహ భారతీస్వామి ధర్మ సమ్మేళనములో హిందూ అంటే బేకూబ్ అని చెప్పడమని చెప్పాడు. దానికి ఇంకరు చెప్పుచున్నాడు ఏమంటే, "హిందూ అనే పదం వేరే వారి భాషలో ఈడియట్ అనో ఇంకేదో అర్థం ఉంటే ఉండనివ్వండి కానీ, మన భాషలో మంచి గౌరవము ఉన్న అర్థంలోనే ఉంది కదా!" అన్నాడు, ఏముంది అర్థం. వాడి భాషలోనే అర్థం నేను చెప్పేది, నీ భాషలో కాదు. ఒక వ్యక్తి తెలుగు భాషలో ఒకరిని "రండి, రండి" అన్నాడట. హిందీ వాళ్ళ మధ్యలో అలా పిలిచేసరికి వాళ్ళందరూ అదోలా చూసారట, ఎందుకంటే "రండి" అంటే హిందీలో "వేశ్య" అని అర్థం. మన భాషలో ఉన్న పదాన్ని వారి భాషలో వాడితే ఏమయింది? మళయాలంలో ఒక పదముంది ఏమంటే "మైరా" అనే పదం ఆ పదం మన తెలుగు భాషలో లేదు. మరి అటువంటప్పుడు మైరా అనే పద అర్థం వారి భాషలో ఉన్నదానినే తీసుకోవలెను.

వాహనాన్ని నడుపుతున్న డ్రైవర్ నిద్రపోతూ బండి తోలుతున్నాడట, ప్రక్కనున్న అతను గమనించి డ్రైవర్‌ను ఉద్దేశించి "సువ్వర్" అన్నాడట. ఆ డ్రైవర్‌కు ఆ పదానికి సరైన అర్థం తెలియక పొగిడాడు అనుకున్నాడట. తరువాత అతను ఇంకొక వ్యక్తికి చెప్తే, అదేమీ గొప్ప పదం కాదు, పొగడ్త కాదు అతని భాషలో నిన్ను "పంది" అన్నాడు అని చెప్పాడట. పందన్నాడా! అన్నాడట. అదే అన్నాడు. సువ్వర్ అంటే పందే, నీభాషలో ఆ పదంలేదు కనుక వాడి భాషలోని అర్థమునే నీవు తీసుకోవాలి. అదే విధంగా "హిందూ"

అనే పదం వారి భాషలో అన్న అర్థాన్నే తీసుకోవలెను. చాకచక్యంగా ఏదో మాట్లాడినా, తెలిసి మాట్లాడాలి గానీ తెలియకుండా మాట్లాడితే ఎన్నో అనర్థాలకు దారి తీయును. దీనివలన నీవు చెడిపోవటమే కాక నీ వెనుకున్న వారు కూడా చెడిపోతారు. 120 సంవత్సరముల ముందు ఇందూ పదమే ఉండేది. తర్వాత హిందూగా మారినది. సిద్ధాంతకర్త ప్రకారం జ్ఞానం ఉంటుంది. ఇది ఆధ్యాత్మిక సిద్ధాంతం. బయట సిద్ధాంతాలు చాలా ఉన్నాయి. ఆధ్యాత్మిక విద్యలో సిద్ధాంత కర్తలుగా వచ్చిన ముగ్గురు చనిపోయారు. ఇప్పుడు ఆంధ్రరాష్ట్రంలో ఒక సిద్ధాంతము వచ్చింది, అదే త్రైత సిద్ధాంతము. ఈ సిద్ధాంతాన్ని, మూడు సిద్ధాంతాలకంటే గొప్పదిగా చెప్పాము. కావున ఈ సిద్ధాంతాన్ని తెలియగలిగారో, చదవగలిగారో వాళ్ళంతా, ఏమంటున్నారంటే, "ఇంతకాలం మూడు సిద్ధాంతములను నమ్ముకుని ఉంటిమి ఇవే బాగున్నాయి అనుకుంటిమి. ఈ మూడు సిద్ధాంతాలకంటే, ఈ త్రైత సిద్ధాంతము చాలా బాగుంది. మనకు బాగా జ్ఞానం తెలుస్తూ ఉంది. కనుక మనం ఈ సిద్ధాంతము తెలుసుకోవటం మంచిది" అని చెప్పి ఈ సిద్ధాంతాన్ని అనుసరిస్తున్నారు.

మేము పొడుపుకథల జ్ఞానం అనే గ్రంథములో ఒక పొడుపు కథను గూర్చి వివరించాం. అదేమంటే **"మనసుకు నచ్చినోడు మొగుడుకాని, మంగళసూత్రం కట్టినవాడు మొగుడెట్లా అగును"** అని. ఈ పొడుపు కథను ప్రపంచంలో మీరు ఏ విధంగా అన్వయించుకున్నా ఫరవాలేదు కానీ జ్ఞానసంబంధముగా వివరించుకుంటే, జ్ఞాన విషయంలో నీకు ఏ సిద్ధాంతం నచ్చితే ఆ సిద్ధాంతంలోకి వెళ్ళు అని చెప్పాం. ఒక మంత్రం చెప్పినారు అనుకో ఆ మంత్రం జపించి, జపించి నోరు నొప్పి వచ్చినా ఏమీ ఫలితం లేకపోతే, దానికంటే మంచిదైన జ్ఞానమునకు వెళ్ళు. కనుక క్రొత్తగా మేము

www.thraithashakam.org

నాలుగో సిద్ధాంతమును అనగా త్రైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించినాము. మరి అందరూ ఇందులోకి రావాలంటే పాత గురువులను, సిద్ధాంతాలను విడిచిపెట్టి రావలెను. అలాగే చాలామంది రావటం జరిగింది. ఎక్కడికి అంటే త్రైతసిద్ధాంతం అనే జ్ఞానం లోపలికి. నీకు ఉండే శ్రద్ధను అనుసరించి జ్ఞానం ఉంటుంది. మరి ఈ త్రైతసిద్ధాంత జ్ఞానములో "ఇందూ" అనే పదాన్ని తీసుకుని మేము నిజమైన అర్థాన్ని చెప్పుచున్నాము. **ఇందూ అంటే జ్ఞానము** అని అర్థం. ఇందువు అనగా జ్ఞానము కల్గిన వారు. ఏ మతములో నైనా జ్ఞానం ఉండవచ్చును అందరూ జ్ఞానులే (ఇందువులే). మరి ఈ విధంగా మారిన ఇందువులు చనిపోతే కర్మలేకపోతే మరి జన్మింపరు, మోక్షం పొందుదురు. అలాకాకుండా కర్మమిగిలి ఉంటే, మరలా జన్మిస్తారు కానీ "చాంద్రమాసం జ్యోతిర్యోగి ప్రాప్యనివర్తతే" అని భగవద్గీతలో చెప్పబడింది. అనగా చంద్రతేజస్సు కలిగి జన్మిస్తాడు. చంద్రతేజస్సు అనగా జ్ఞాన తేజస్సుతో పుట్టును. చంద్రున్ని జ్యోతిష్య శాస్త్రరీత్యా జ్ఞానానికి గుర్తు అని చెప్పెదరు. ఆ చంద్రున్నే ఇందు అన్నాము. జ్ఞానాన్ని కల్గిన వారందరినీ ఇందువులు అన్నాము, కనుక ఈ దేశానికి ఇందూ దేశము అని పేరు ఉన్నది.

పూర్వం ఒక పెద్ద జ్ఞాని ఉండేవాడు. అతన్ని అనుసరించి ఉండేవారినందరినీ ఇందువులు అనేవారు. వారిని అనుసరించేవారు ఉండే దేశానికి ఇందూదేశమని పేరు వచ్చినది. అంటే మనకు నిజంగా ఇప్పుడు వారికున్న జ్ఞానం లేకపోయినా వారిపేరు చెప్పుకుని మనం బ్రతుకుతున్నట్లు లెక్క. కొందరు ఏమి చెప్పినారు అంటే వారి పేరుతో మనకేమి పని హిదువులు అన్నారు. పోనీ మనకు జ్ఞానం ఎలాగూలేదు. కనీసం ఆ అర్థము వచ్చే పేరైనా ఏదో ఉంది అంటే అది కూడా లేకుండా "ఇందూ" ను కాస్తా "హిందూ" చేసేసారు. ఒక పెద్ద స్వామీజీ నిన్నగాక

మొన్న హిందూ అనే పదమునకు బేవకూఫ్, ఈడియట్, పనికి మాలిన వాడు అనే అర్థం ఉంది. ఆ పదాన్ని మనం వాడితే మన పీకను మనమే కోసుకున్నట్లు అని చెప్తే, మరి ఆ పదమును మనమెందుకు వాడవలెను. ఈ చర్చ జరిగిన మరుసటి రోజున ఎ.బి.ఎన్. ఛానల్ వారు ఒక చర్చ పెట్టారు. అందులో చాలా మంది పాల్గొన్నారు. అందులో "హిందూ" అనే పదం తప్పు అన్నారు కదా! ఏది కరెక్టు అని అడిగితే, ఆ పదాన్ని తీసేసి మనం ఆర్యులు కనుక ఆర్యమతం అని పెట్టేద్దాం అన్నాడు. అదీ వీరి తెలివి. మేమిప్పుడు ఏమి చెప్తున్నామంటే ఆర్యుల వలననే ఇంత మోసం జరిగింది. వారి వలననే మనం అజ్ఞానంలోకి రావలసి వచ్చింది. వారు చెప్పితే మనం ఒప్పుకుంటామా, ఒప్పుకోం. ఇప్పటికే ఆర్యులు సర్వనాశనం చేసారు. మనవైపు ఉన్న బ్రాహ్మణులను కూడా చెడగొట్టి, ద్రావిడ బ్రాహ్మణులలో ఆర్యుల లక్షణాలు వచ్చేటట్లు చేసారు. అయినప్పటికీ చిన్నజీయర్‌స్వామి, పుష్పగిరి పీఠాధిపతి వారికి కొంతైనా ద్రావిడ లక్షణాలు జన్యువులను అనుసరించి ఉండటం వలన కొంతైనా తెలిసింది, "హిందూ" అనే పదం తప్పని.

"హిందూ" అనే పదం తప్పని చెప్తే మేము మీకు కనపడలేదు. మరి ఇంత పెద్ద స్వామీజీలు చెప్పారే మరి ఇప్పుడేమంటారు? అయినా గాని వారికంటే ఇంకా దాని గురించి చెప్పిన మా సిద్ధాంతం గొప్పది. ఎందుకంటే కొంతైనా చెప్పినవారు మఠాధిపతులు, మరియు పీఠాధిపతులే కాని సిద్ధాంతకర్త ఎవరు చెప్పినా అది అనుసరణీయం అగును. కనుక సిద్ధాంతకర్తలు చెప్పినవే చెప్పగలరు కానీ, సొంతంగా చెప్పేందుకు అవకాశం లేదు. ముగ్గురు సిద్ధాంతకర్తలు వచ్చారు, పోయారు. తరువాత మరెవ్వరూ సిద్ధాంతకర్తలు రాలేదు. ఇప్పుడు ఇక్కడ మనం వచ్చినాము. ఇదేంటి పెద్ద

స్వామీజీలు వచ్చి ముసుగేసి సిద్ధాంతకర్తలు అని చెప్తే ఈయన కిరీటం పెట్టినాడు అనుకుంటారు. మాకు ముసుగులు లేవు, వారంతా సన్యాసులు, మేము సంసారులం. అయితే "సంసారం" అనే పదానికి ఉండే అర్థం ఎవరికీ తెలియలేదు. ఒక క్రొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవాడు సిద్ధాంతకర్త అగును. అది సిద్ధాంతమా కాదా అని చూడండి, మరి ఇది సిద్ధాంతం కాకపోతే మీ అందరూ ఎందుకు ఇక్కడకు వస్తున్నారు? నా సిద్ధాంతం గట్టిది కావున మీరంతా వస్తున్నారు. నా మాటలో శక్తి ఉండి కనుకనే వస్తున్నారు. నేను వ్రాసిన గ్రంథాలలో శక్తి ఉంది, జీవం ఉన్నది. మీరు చదవండి మారకపోతే చెప్పడి. ఎవరైనా సరే మమ్మల్ని వ్యతిరేకించే వారెవరైనా కానివ్వండి. చదవండి మారకపోతే మమ్మల్ని అడగండి. అంటే చదివితే మరిపోతామేమో అని దూరంగా మా గ్రంథాలను పెట్టేవారుంటారు కొందరు. అదే విధంగా మీరు ఏది చెప్పినా వింటాంగానీ జ్ఞానం మాత్రం మాకొద్దు చెప్పొద్దు అంటారు. మీరు ఎవరైనా మన గ్రంథాన్ని ఎవరికైనా ఇవ్వండి చదవమనండి, వాడికిష్టం లేకపోతే వాడు చదవడు, చదివితే వారిలాగే మనం మారుతామేమో అనే భయం వారికి ఉంది.

ఈ విధంగా కొందరు మూర్ఖముగా వారు చెప్పిందే నిజమనుకొని, సత్యాన్ని తెలుసుకోలేరు. మనం ఇంతవరకు నమ్మిన సిద్ధాంతాన్ని విడిచి పెడితే, చిన్నవారము అయిపోతామేమోనని అసత్యం మాట్లాడకూడదు. అదే విధంగా "హిందూ మతము కాదు, ఇందూ పథము" అని మేము చెప్పాం ఇంతకు ముందు ఒక గ్రంథం వ్రాసాము. అది **"మతము-పథము"** అందులో మతము అనేది ఒక గుంపుకు పేరు. మన భారతదేశంలో ముస్లీమ్‌లు అందరూ ఒక గుంపు, హిందువులంతా ఒక గుంపు, క్రిస్టియన్స్ అంతా గుంపు. ఈ విధంగా చాలా గుంపులున్నాయి. మార్గము అనేది

అందరికీ ఒక్కటే. అలాగే పథం అనేది అందరికీ ఒక్కటే. పథము అంటే మార్గం అని అర్థం. మతం వేరు వేరు, కానీ పథము మాత్రం ఒక్కటే. కనుక నీవు పథాన్ని అనుసరించు మతాన్ని అనుసరించవద్దు. అందుకు నీవు ఇందూ పథము అని పేరు పెట్టుకో. ఇందూధర్మము అనగా జ్ఞానధర్మము అంటే జ్ఞానమును అనుసరించటమే నా మార్గం అని చెప్పుకో. మతం వలన మనుషులు విడిపోతారు గానీ ఒకరినొకరు కలుసుకోవటానికి లేదు. తమిళనాడు దగ్గర కొందరు ముస్లీమ్‌లు మా వద్దకు వచ్చి, మీ పుస్తకాలు దేవుని మార్గమునకు దగ్గరగా ఉన్నయి అని చెప్పి మన పుస్తకాలన్నీ తీసుకుని వెళ్ళారంటే మనందరికీ సంతోషమే కదా!

కనుక మన గ్రంథాలలో ఎక్కడా మతము అనే ప్రసక్తేలేదు. జ్ఞానము అనే విధానం ఉంటుంది. ప్రతీ గ్రంథములోను సంపూర్ణమైన జ్ఞానం ఉంటుంది. ప్రతీ గ్రంథం కొత్త జ్ఞానాన్ని అందిస్తుంది. మరి ఇంతకు ముందు మేము చెప్పాము. చెట్లకు కర్మ అనుభవం చాలా తక్కువ అని. ఎందుకంటే చెట్టుకున్న కొమ్మలన్నింటినీ నరికేసినా, మళ్ళీ చిగురు వస్తుంది. కానీ మనిషి యొక్క కాళ్ళు, చేతులూ నరికేస్తే ఒక గంటకూడా బ్రతకలేడు. ఈ విధంగా వాటి అనుభవాల్లో మనకి తెలుస్తున్నది కదా! అంటే నీకు తెలియని విధానమంతా తెలియబడును ఇక్కడ.

అందుకే పొడుపు కథలలో పూర్వము అందరినీ ఆకర్షించేందుకు ప్రపంచ అర్థాన్ని పైన ఉంచారు. అది విప్పి చూస్తే పరమాత్మ సంబంధమైన అర్థం అందులో ఉండును. అంటే పట్టుగుడ్డలో ధనం ముడివేసి పెట్టబడి ఉంది. ఎందుకంటే పట్టుగుడ్డలో పెడితే అందులో ఏదో ఉందని ఆకర్షించ బడతారు. కానీ లోపలున్నది ధనమే అయినా గానీ ముడిపెట్టి ఉంచారు. ఆ ముడులు విప్పితే తెలుస్తుంది విప్పకపోతే ఏమగును, అట్లే ఉండిపోతుంది.

www.thraithashakam.org

ఇటువంటి పొడుపుకథలలోను, సామెతలలోను చాలా జ్ఞానం ఇమిడి ఉంది కానీ పైకి ప్రపంచవరమైన అర్థం ఉండేటట్లు చెప్పారు. ఉదాహరణకు "నీ దున్నటంలో ఏముంది, అంతా నా చల్లటంలోనే ఉంది" అన్నాడట. ఈ సామెత జ్ఞానవరముగా ఎంతో అర్థం ఉన్నది. అదే విధంగా "ఇంటికి కాపలా ఉంటుంది కానీ కుక్క కాదు" అంటే ఇల్లు అంటే మనందరము ఉండే ఇళ్ళు అని ఎందుకనాలి. జీవుడివైన నీ స్థానం అని అనుకోవచ్చును కదా! ఈ విధంగా ఎన్నో జ్ఞాన విషయాలు ఎన్నో గ్రంథాలు మీ వద్ద ఉన్నాయి. వాటిని తెలుసుకోండి. అందరూ ఇప్పుడు గర్వంగా ఇందువులు అని చెప్పుకోండి. మమ్మల్ని లెక్కబెట్టకపోయినా, స్వామీజీలను మీరిప్పుడు చూసారు కదా! చినజీయర్ స్వామి, పుష్పగిరి పీఠము స్వామి కూడా చెప్పాడు అని చెప్పండి. మీరు జ్ఞానులై అందరినీ జ్ఞానులను చేయుటకు ప్రయత్నం చేయండి.

# 57. ఆత్మ పని

తేది : 31-08-2012

పూర్వము ఇందూ జ్ఞానము, ఇంగిత జ్ఞానమని రెండు పదములు ఉన్నవి. వాటిలో ఇంగిత జ్ఞానమును ప్రపంచ సంబంధమైన జ్ఞానముకు అర్థముగా, ఇందూ జ్ఞానాన్ని పరమాత్మకు లేదా దేవున్ని తెలుసుకునేందుకు ఉపయోగబడే జ్ఞానంగా చెప్పుకునేవారు. ఇక్కడ ఇందూ అంటే చంద్రుడు. చంద్రుడు జ్ఞానమునకు గుర్తు. జ్ఞానము తెలిస్తే దేవుడు తెలియును కనుక ఆ విధంగా ఇందూ జ్ఞానము అనేవారు. తరువాత రోజుల్లో ఈ ఇందూ అనే పదము హిందూ అనే మతము పేరుతో క్రిందకు లాగబడింది. అది పెద్ద పొరపాటు.

www.thraithashakam.org

ప్రపంచ జ్ఞానములో మనము లాభాల్ని చూస్తాము. లాభం ఉంటే ఆ పనిని చేయాలని చూస్తాము. పరమాత్మ జ్ఞానములో కూడా ఏ లాభము వస్తుంది అని చూసేవారున్నారు. ప్రపంచ లాభంతో పోల్చుకుంటే ఎన్నోరెట్లు పరమాత్మ జ్ఞానములో ఉంది కానీ ఇది కనిపించే లాభము కాదు. ప్రపంచం కనిపిస్తుంది. ప్రపంచములో ఉండే లాభము కూడా కనిపిస్తుంది, దేవుడు కనిపించనటువంటివాడు. కనుక లాభము కూడా కనిపించదు. దేవుడు ఉన్నాడు, లాభము ఉంది. దేవుడు కనిపించడు, లాభము కూడా కనిపించదు. ఈ విధముగా కనిపించకపోవటం వలన లాభము ఏమీ లేదనుకొనుచున్నారు. మరి ఈ లాభం ఉంది అని ఎందుకు తెలియబడటము లేదు. ఇప్పుడు మనము సృష్ఠి ఆదిలోకి వెళ్తే, ఈ సృష్ఠిఅంతా ఎప్పుడు ప్రారంభమయిందో ఖచ్చితంగా చెప్పలేము. ఈ సృష్ఠి ప్రారంభం కాకముందు దేవుడున్నాడు. అప్పుడు సృష్ఠి లేదు, ఏమీ లేదు. అటువంటి సమయములో దేవుడు గాలి, అగ్ని, నీరు, భూమి, ఆకాశములను సృష్ఠించాడు. వీటినే ప్రకృతి అంటాము. ఈ విధముగా ప్రకృతి కనిపిస్తూ వుంది, ప్రకృతి తర్వాత దేవుడు మూడు భాగములుగా తాను విడిపోయాడు. అంటే ఒక భాగము తననుండి ప్రకృతిగా తయారయిన తరువాత మూడు భాగములుగా విడిపోయినాడు. దేవుడు దేవునిగానే ఉంటూ, తనునండి ఆత్మను, తననుండి జీవాత్మను విభజించాడు. మొత్తం మూడు ఆత్మలయి నాయి. దేవుడు కనిపించడు కనుక ఆత్మ, జీవాత్మ తెలియబడవు. విశ్వము మూడు భాగములు సూక్ష్మముగా, ఒక్క భాగము స్థూలంగా ఉన్నది. ఇప్పుడు బయట ప్రపంచాన్ని ఉదాహరణగా కాకుండా ముందు నిన్ను నీవు ఉదాహరణగా తీసుకొంటే, నీ శరీరము ప్రకృతితో తయారయింది. శరీరములో పంచభూతాలున్నాయి. ఈ ప్రకృతి కనిపిస్తూ ఉంది. ఈ కనిపించే

www.thraithashakam.org

శరీరములో కనిపించని మూడు ఆత్మలున్నాయి. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ. ఈ సూక్ష్మమైన మూడు ఆత్మలు స్థూలమైన శరీరములో ఉన్నాయి.

ఇప్పుడు ప్రకృతిలో వచ్చే లాభం నీకు ఒక్కటే అంటే ఒక్క రూపాయి లాభం వస్తే, దైవం పరంగా లాభం వస్తే మూడు రూపాయిలు (మూడింతలు) వస్తున్నది. ఇప్పుడు పావలా లాభంగా ఉన్న ప్రకృతి కనిపిస్నుది ముప్పావలా లాభం ఉన్న ఆత్మలు కనిపించటం లేదు. ఈ విధముగా ఎక్కువ చదువుకున్న వారంతా స్థూలంగానే చూస్తున్నారు. కనుక ప్రపంచవరంగా ఆకర్షింప బడుచున్నారు. కానీ దైవవరంగా ఆకర్షింపబడటంలేదు. తద్వారా ప్రపంచ సంబంధవరమైన లాభం చూసి, దానికి మూడింతలు వచ్చే దైవజ్ఞాన లాభాన్ని పోగొట్టుకుంటున్నారు. ప్రకృతంతా ఎంత ఉన్నా సరే నీ శరీరమే ప్రకృతి. ఎందువలన అంటే నీ శరీరములో పంచ మహాభూతాలు భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం ఉన్నాయి. అగ్ని, నీరు రెండూ ఒక దగ్గరే ఉన్నాయి చూడండి ఎంత విచిత్రమో. ఇప్పుడు ఒక శరీరములో మూడు ఆత్మలున్నాయి అంటున్నాము కదా! అందులో ఒక ఆత్మవు నీవే (జీవాత్మ) అందులో నీవు ఒక్కడివి అన్న సంగతి నీకు తెలుసునా? జీవాత్మ అని అనబడేవానికి నీవైతే అదే నీవైనట్లు నీకు తెలుసునా అంటే, ఎందుకు తెలియదు నేను నేనే అంటారు. కానీ నీవు నీకు తెలుసునా? ఇంతకు ముందు మేము ఒక వాక్యము వ్రాశాము. **"నీ అడ్రస్ నీకు తెలుసా"** ఫలానా జిల్లా, ఫలానా మండలం అని చెప్పితే అది నీ శరీర అడ్రస్. నీ శరీరములో నీ అడ్రస్ తెలుసునా? మరి ఇంత శరీరములో నీవు ఎక్కడున్నావు. కడుపులోనా, తలలోనా, కాళ్ళలోనా ఎక్కడంటే మొత్తంగా నేనే అంటున్నాడు. మరి ఇంత మొత్తంగా నేనే అనేవాడు, ఇది నా చేయి అంటున్నాడు, అంటే దానర్థము నేను వేరు నా చేయి వేరు. నా తలకాయ

అంటున్నావంటే నీవు వేరేగా ఉంటున్నట్లే కదా! అదే విధముగా నీ శరీరములో నీవు ఎక్కడున్నట్లు? బయట ప్రపంచవరంగా చూసుకుంటే నీకు హోదా ఉంది, పలుకుబడి ఉంది, ధనికులము, బీదవారము అన్నీ ఉన్నాయి. ఈ శరీరాన్నే ప్రకృతిగా లెక్కవేసుకుని మూడు ఆత్మలలో నీవొక జీవాత్మగా లెక్కవేసి చూస్తే నీవు ఎక్కడున్నావు? ఆత్మ, పరమాత్మల గూర్చి వదిలేయి, ముందు నువ్వు చూసుకో, నీ విషయము నీకే తెలియదు. కానీ నాకంతా తెలుసు అంటాడు. ఈ విషయము అందరికీ వర్తించేది. ఎవరికైనా శరీరమే ఉన్నది. ప్రకృతితో తయారయిన శరీరమే అందరికీ ఉంది. ఏ మతము వారైనా సరే. "నేల విడిచి సాము చేసినట్లు" అంటారు. భూమిమీద చేస్తే నీవు పల్టీలు కొట్టచ్చు ఇంకా ఏమైనా చేయవచ్చు. నేల విడిస్తే పల్టీలు ఎట్లా కొడతావు? ఆ విధముగా నీ అడ్రస్ నీకు తెలియనప్పుడు మిగతా ఏమీ తెలియబడదు. కనుక నీవు, నన్ను తెలియాలంటే నీకొక గ్రంథము ఇచ్చాను, బోధను ఇచ్చాను. నేను జ్ఞానాన్ని చెప్పాను అది గ్రంథరూపములో ఉంది. ఒక్క హిందువులకే కాదు అన్ని మతాల వారికీ గ్రంథాలున్నాయి, కానీ ఆ గ్రంథాలలో ఏమున్నాయో తెలుసునా? అంటే అందులో కూడా ప్రకృతి గూర్చి, ఆత్మల గూర్చే చెప్పబడిందికానీ ప్రకృతి గూర్చి మీకు తెలియవచ్చునుగానీ మూడు ఆత్మల వివరము మీకు తెలియదు మరి. ఆ వివరము ఎట్లు తెలుస్తుంది? అంటే దేవుడే తెలియజేస్తాడు. దేవుని విషయాలు దేవుడే చెప్పగలడు. మనుషులెవ్వరూ చెప్పలేరు. మీరేమైనా చెప్పగలిగితే వక్రబుద్ధితో వక్రమార్గముతో చెప్పుచుదురు, తద్వారా కలతలు రేగి మత ద్వేషాలు వస్తాయి. మరి దేవుడు చెప్తాడా అంటే ఆయనే చెప్పెదను అని అన్నాడు కదా! దేవుడు మనిషిగా రాడు ఆయన ఏమీ చెప్పడు అని మనము ఒక సిద్ధాంతము పెట్టకున్నామనుకోండి, అప్పుడు ఆయన చెప్పిన

విషయాలు కూడా ఏటికి వదలిపెట్టాల్సిందే. వినక్కర్లేదు అని అర్థము. దేవుడు మరి మనకి జ్ఞానము చెప్పాలంటే మాత్రము మనిషై రావాల్సిందే కదా! ఆయన చెప్తే కదా నీవు వినేది. కానీ మనిషి మాత్రము ఎవడైనా మనిషి లెక్కలో ఉన్నాడు. మనము మనింటికి దొంగలు రాకుండా ఒక వ్యక్తిని కాపలాపెట్టుకుంటే అతను దొంగను కొడితే ఫరవాలేదుగానీ, ఇంట్లో వారు వచ్చినా కొడితే ఎట్లాగవుతుంది? ఆ విధముగా ఉంది మన పని. జ్ఞానము తెలియనప్పుడు నీకు నేను జ్ఞానము గూర్చి తెలియజేస్తాను అని ఆయన చెప్పాడు. అప్పుడు నీవు నా కాలమంతా ఇంతవరకు వృథా అయిపోయింది అని నీవు అనుకుంటావు అని ఖురాన్ గ్రంథములో చెప్పబడింది. దేవుడు మనిషిగా రాడు అని చెప్పే మతంలో ఆ మాట ఉంది. 89వ సూరా 22 ఆయత్‌లో ఈ వాక్యం ఖురాన్ గ్రంథములోనే ఉంది. **"దేవుడు దూతలు బారులు తీరి ఉండగా అవతరిస్తాడు"** అప్పుడు ఆయన జ్ఞానము చెప్తే ఇంతకాలము వృథా అయిందే, ముందే ఈ జ్ఞానము తెలిస్తే ఎంత బాగుండు అని బాధపడతారు. అన్ని గ్రంథాలలోను నేను వస్తాననే చెప్పాడు. భగవద్గీతలో జ్ఞానయోగములో 6,7,8 శ్లోకాలలో నేను సర్వ జీవరాశులకు మహేశ్వరుడనై ఉండి కూడా మానవునిగా పుట్టాల్సిన అవసరము వస్తున్నది. ఎందుకంటే అధర్మాలు చెలరేగినప్పుడు, ధర్మానికి ముప్పు వాటిల్లినప్పుడు తిరిగి ధర్మాలను తెలియజేప్పే నిమత్తము నేను మనిషిగా పుట్టుచున్నాను. అప్పుడు నేను అధర్మాలను వెలికితీసి ధర్మాలను మాత్రమే ఉండేటట్లు చేస్తాను. ఇప్పుడు మనిషి నేను దేవుని జ్ఞానము తెలుసుకోవాలి అని అనుకుంటే అప్పుడు దేవుడు చెప్పేందుకు సంసిద్ధముగా ఉన్నాడు అని తెలియజెప్పాడు. ఎప్పుడైతే తనమీద తనకు ప్రశ్న వచ్చినప్పుడు తనను గూర్చి ఆలోచిస్తే, చింతిస్తే, నీవెవరో దేవుడు అప్పుడు తెలియజేస్తాడు.

నీ శరీరములో నీ వెక్కడున్నావో తెలియదు. ఇంత కాలమైనా గానీ అదే శరీరములో నీతో పాటు ఇంకా రెండు ఆత్మలున్న విషయం కూడా తెలియాలి. ఒకటి జీవాత్మవైన నీవు, రెండవది ఆత్మయే. దానికి ఏ పేరులేదు, మూడవది పరమాత్మ అంటే ఆత్మకంటే పరంగా వేరుగా ఉండేది. అంతేగాని అది పేరు కాదు, దానినే దేవుడు అంటున్నాము. దేవుడు అనేది కూడా పేరుగాదు. దేవుడు అంటే వెతకబడేవాడు అని అర్థము. దేవుడు ఎప్పుడూ ఎవరికీ కనిపించడు దేవుడు రూప నామ క్రియలు లేనటువంటివాడు. చాలామంది దేవుడెంత అన్యాయము చేశాడు అంటారు. ఆయనకేమి పని నీకు అన్యాయం చేసేందుకు. ఆయనకు పనేలేదు ఆయన ఎట్లా నీకు అన్యాయము చేస్తాడు. దేవుడు న్యాయము చేయడు, అన్యాయము చేయడు మీ చావు మీరు చావండి అని మీకే విడిచిపెడతాడు. ఒకవేళ నీవు జ్ఞానము తెలుసుకుని జీవాత్మలైన నీవు గుణచక్రములో ఉంటావని తెలిసినా, ప్రయోజము లేదుగానీ నిన్ను నడిపించేవాడు అయిన ఆత్మను తెలుసుకోవలెను. మాట్లాడేవాడెవడు, కోట్లాడేవాడు ఎవడు, నాట్యం చేసేవాడెవడు, తబలా కొట్టేవాడు ఎవడు. నీవు లేచిన దగ్గరనుండి జరిగే పనులన్నీ ఆత్మే చేయిస్తూ ఉంది. నేను మొత్తము శరీరం అని అనుకోవటం వలన పెద్ద చిక్కే వచ్చింది. ప్రతీ పని నేనే చేస్తున్నాను అని అనుకుంటున్నాడు మనిషి. కానీ అన్నీ ఆత్మే చేస్తూ ఉంటే జీవాత్మ ఏమి చేస్తూ ఉన్నది, సుఖఖదుఃఖాలను అనుభవిస్తున్నాడు. బ్రష్ చేసుకున్నప్పుడు పేస్ట్ వేసుకుంటే సురసురా అనేది ఎవరికి జీవాత్మకు, పేస్ట్ పెట్టిందెవరు ఆత్మయే. నిద్రలో నిన్ను ప్రక్కకు త్రిప్పింది ఆత్మే. నిద్రలో నీకు ఊపిరి తీస్తున్నదేది! ఆత్మయే. జీవాత్మ శరీరములోకి ఎప్పుడైతే ప్రవేశిస్తున్నదో అప్పటినుండే పనులన్నీ ఆత్మయే చేస్తున్నది. **"నహికశ్చత్ క్షణమపి"** ఒక్క సెకండ్ ఊపిరి లేకపోతే చనిపోయినట్లే గుండె ఒక్క క్షణమైనా

www.thraithashakam.org

ఆగడానికి అవకాశము ఉందా? గుండెను కదిలించేదెవరు? ఈ ఆత్మ శరీరమంతా వ్యాపించివుంది. తల వెంట్రుకలు మొదలుకొని, కాలిగోర్ల వరకు ఆత్మ వ్యాపించి ఉంది. నేను నా భార్యతో బాగా కాపురం చేస్తున్నాను అంటే ఎవరు చేస్తున్నది? అనుభవము మాత్రమే నీది. నేను ఒకర్ని కొట్టాను అంటే కొట్టిందెవరు? నేను కొట్టలేదు అని అనుకొని కొడితే పాపము వస్తుందా. ఎవరినైనా చంపి నేను చంపలేదు నా ఆత్మే చంపించింది అని అనుకుంటే పాపము వస్తుందా? రాదా అని అంటున్నాడు. ఎందుకు రాదు వస్తుంది. జీవాత్మగా నీకు సుఖదుఃఖాలు అనుభవించటమే పని తప్ప మరే పనీ లేదు. ఇప్పుడు ఒకర్ని నీ శరీరములో ఉండే ఆత్మ చంపిందనుకో ఆత్మజ్ఞానము తెలుసుకున్న వ్యక్తి ఏమనుకుంటాడు. నాలో ఉన్న ఆత్మయే ఆ పని చేసింది. నేను కేవలము ఆ పనిలో ఉండే కష్ట సుఖాలను అనుభవించటమే అని తెలుసుకుంటాడు. అప్పుడు నీకు కర్మరాదు. మరి ఆత్మకు కర్మ వస్తుందా అంటే రాదు. ఎందుకు రాదు? మనము చేసినాము అనుకుంటేనే పాపము వస్తే, చేసిన ఆత్మకు ఎందుకు పాపము రాదు అని అడుగవచ్చును. ఆత్మకు తెలుసు వీడు చేసుకున్న పాపానికి ఈ పని జరగాలని ఉంది కనుక నేను జరిపిస్తున్నాను. వీడికి చచ్చే కర్మ ఉంది. వీడికి కొట్టే కర్మ ఉంది. ఇద్దర్నీ నిలబెట్టి ఒకర్ని కొట్టించింది. ఒకర్ని కొట్టినట్లు చేసింది. ఈ విషయమంతా లెక్కాచారము ప్రకారము జరిగింది కదా! బ్యాంకులో డబ్బులిచ్చేవాడున్నాడు వాడేమైనా షావుకారా? లక్షలుంటాయి వాడివద్ద. నీ కర్మప్రకారము నీ కెంత ఇవ్వవలెనో అంత ఇస్తున్నాడు. అదే విధముగా ఎవరి ఖాతా ప్రకారము ఆ పనిని చేయించడమే ఆత్మపని. నాకేమి పట్టింది కర్మలేకపోతే నేనేమి చేయను. బ్యాంకులో క్యాషియర్ ధనికుడు కానట్లు ఆత్మ నీ కర్మప్రకారము పనిని జరిపించటమే

కానీ తాను లాభము పొందాలని చేసేవాడు కాదు. కర్మలేకుండా చంపాలంటే చంపడు, లేదు వాడికి ఎంత దెబ్బ తగలాలంటే అంతే తగులుతుంది. లెక్కాచారము ప్రకారము ఎంత కార్యము జరగాలో అంతే జరుగుతుంది. అదే విధముగా ప్రమాదాలు చూడండి. ఏ దెబ్బ లేకపోయినా చనిపోయే వారుంటారు. ఎన్ని దెబ్బలు తగిలినా బ్రతికే వారున్నారు. లెక్కాచారము ప్రకారము జరిపించేవాడే ఆత్మ. అదంతా జీవాత్మ చేసుకొన్న కర్మలు, వారు అనుభవించేందుకే ఈయన ఈ పనులు చేయిస్తున్నాడు. జీవుడు శరీరములో తలలో ఒక్క దగ్గర ఉంటే, ఆత్మ శరీరమంతా ఉంటే, మూడవ వాడైన పరమాత్మ సాక్షిభూతుడై చూస్తున్నాడు. నీ శరీరంలోనే కాక శరీరము బయటా ఉన్నాడు. అణువణువునా వ్యాపించి ఉన్నాడు. ఈ లెక్కాచారాలన్నీ మా గ్రంథములలో ఎక్కడా లేవు అంటారు కొందరు. ఖురాన్ గ్రంథములో ఏముందంటే **"నీ వెంట వచ్చు వాడొకడు, సాక్ష్యము చెప్పువాడు ఒకడుతో నీవు వచ్చెదవు"** అంటే నువ్వు, నిన్ను తోలేవాడు అంటే పని చేయించేవాడు, నిన్ను చూసేవాడొకడు లేదా సాక్ష్యము చెప్పేవాడు. మొత్తము ముగ్గురయ్యారు కదా! కనుక అన్ని మత గ్రంథములలో మూడు ఆత్మల వివరము ఉంది. ఈ మూడు ఆత్మలు కనిపించేవి కావు. కనిపించేది మాత్రము నీ శరీరమే, నీవు ఈ శరీరముతో పనిచేస్తే లాభం కూడా ఒక భాగమే కనిపించని లాభం మూడు భాగాలు. అయితే ఈ మూడు ఆత్మలున్నవి నిజమేనా? అని ప్రశ్నిస్తే. దానికి ఏమి చెప్పామంటే ఇప్పుడు ఒకసారి జ్వరం వచ్చింది. అప్పుడు నీకు వంద రూపాయలు ఖర్చు అవుతున్నాయి. అదే దేవుని విషయంలో నీవు పాల్గొని ఉంటే నీకు జ్వరము రాదు, ఖర్చు లేదు అప్పుడు వచ్చిందో, రాదో తెలీదు కదా! జ్వరము వచ్చి డబ్బులు ఖర్చు అవకుండా జ్వరం పోతే మాకు నమ్మకము ఏమి? అని అంటున్నారు. సరే జ్వరం

www.thraithashakam.org

వచ్చింది డబ్బులెన్ని ఖర్చు పెట్టినా జ్వరం పోలేదు మలేరియా అంటారు, తరువాత టైఫాయిడ్ అంటారు, మరల వైరల్ ఫీవర్ అంటారు. మనకు ఈ జబ్బు ఖర్చు అయ్యేటప్పుడు నయం అవచ్చు. జీవితాంతం పీడించేవి కొన్ని రోగాలున్నాయి. హెచ్.ఐ.వి లాంటివైతే మందులు లేకుండానే చంపేస్తున్నాయి. మరి ఇటువంటి రోగాలలో కూడా దేవుని జ్ఞానము విలువ ఇస్తే కనిపించే లాభంకంటే, కనిపించని లాభం గొప్పదని అటువంటి రోగాలు కూడా నయమయి పోతాయి. అది మీకు అక్కడ రూఢి అవుతుంది. మనిషికి నమ్మకం కలగటం కొరకు దేవుని జ్ఞానానికి ఇంతశక్తి ఉంది అని నిరూపించే నిమిత్తం ఎందరో చేసి చూపించారు. ఒక వ్యక్తికి రోగం వచ్చింది. నీకు రోగం లేదు పో అంటే పోయింది. కొందరు అనగా ఏసుప్రభువులాంటివారు ముట్టుకుంటే రోగం పోయింది. మరి జ్ఞానానికి శక్తి ఉన్నట్లే కదా! ఒక డాక్టర్ ధర్మలింగా చారి అని విజయనగరం అతను చెప్తున్నాడు ఒకామె చనిపోయింది తనే సర్టిఫై చేశాడు. శవయాత్ర (జాగరం) చేశారు. వారి సాంప్రదాయము ప్రకారము ఆమె మూడవ రోజున లేచి కూర్చుంది. ఆ డాక్టరుకు ఏమీ అర్థము కాలేదు. ఎట్లా బ్రతికింది ఆమె! అంటే అనీ ఇది తాత్కాలిక మరణం అని గ్రంథంలో వ్రాసిబెట్టినాం కదా అని నేను అన్నాను. మరి సైంటిస్ట్‌లెవరూ చెప్పలేదే అంటే వారింకా వెదుకుచున్నారు, ఎప్పుడో తెలుస్తుంది. అప్పుడు వారు కనిపెట్టినట్లు. ముత్తు స్వామి తమిళనాడులో ముందురోజు చనిపోతే, ఆయనను కట్టెలు పెట్టి దహనం చేయటానికి సిద్ధపడగా అతని చెల్లి రోదనతో ఆయన లేచి కూర్చున్నాడు. మరి ఈ సైంటిస్ట్‌లు అంతా ఎప్పుడో ఈ విషయాలు తెలుసుకుంటారు. ఈ మధ్య క్రొత్తరకం బ్లాక్‌హోల్ కనిపించిదంట. మరి ఇన్నాళ్ళు అది లేనట్లా. మీరు కనిపెట్టిన రోజు ఉన్నట్లా. ఈ విధముగా

మరణాలలో మూడు రకములు గలవు అని తెలియక పోవటం వలన తాత్కాలిక మరణాన్ని వింతగా చెప్పుకుంటున్నారు కానీ వింతే కాదు. మూడు ఆత్మల విషయం తెలియని దానివలన జీవుని యొక్క మరణమే అర్థం కాకుండా పోయింది. తద్వారా ఏసుప్రభువు శిలువమీద చనిపోలేదని కొందరు, చనిపోయాడని కొందరు వాదిస్తున్నారు. చనిపోయాడా, చనిపోలేదా అనే సమాధానం ఎవరివద్ద ఉంది? మన దగ్గర తప్ప మరెక్కడా లేదు. మరి ఈ విషయం గూర్చి తెలిసే అదృష్టం, యోగ్యత ఉండాలి కదా! మాకు అన్నీ తెలుసు అనే అహంభావం ఉండేదానివల్ల మనము చెప్పేవన్నీ నమ్మలేకున్నారు. గ్రంథం ఇచ్చినా చదువలేక పోవుచున్నారు. మేము మనుషులు వ్రాసిన గ్రంథాలు చదవము అని అంటున్నారు. దేవుని గ్రంథమే చదువుతాము అంటున్నారు. దేవుడు ఏ పనీ చేయడు అంటే దేవుడు వ్రాసిన గ్రంథమే చదువుతాము అంటే ఎట్లా అగును? దేవుడు బైబిల్ వ్రాసినాడా, ఖురాన్ వ్రాసినాడా, లేదా భగవద్గీత వ్రాసినాడా? అన్నీ మనుషులు వ్రాసినవే, దేవుడు చెప్పిన విషయాలు అందులో ఉన్నాయి. ఇప్పుడు మేము వ్రాసినవి కూడా దేవుని విషయాలే కదా! మూర్ఖంగా మాట్లాడేవారు కొందరున్నారు. వారికి సత్యము తెలియబడదు.

ఇంతపెద్ద శరీరములో నేను ఒక సూదిమొన మోపినంత మాత్రమే ఉన్నాను. పకపక నవ్వేది నేను కాదు, సంతోషపడేది నేను ఏడ్చేవాడిని నేను కాదు, బాధపడేది మాత్రము నేను. అంటే బాధను అనుభవించేది మాత్రమే జీవాత్మ చేయగలదు. శరీరములో, శరీరంతో చేసే ఏ కార్యక్రమం నీవు చేయలేదు. ఆ విధంగా నీవు అనుకున్నప్పుడు లోపలున్న ఆత్మజ్ఞానము తెలుస్తుంది, లేదా అన్నీ నేనే అనుకుంటే నువ్వు అజ్ఞానములో పడిపోయినట్లే. నువ్వు ఎన్ని రోజులు బ్రతికినా ఇదే విధానంగా ఉంటాము. ఎప్పుడైతే నీ

www.thraithashakam.org

విషయం నీకు తెలియబడుతుందో, ఆత్మ విషయం నీకు తెలియబడుతుందో, అప్పుడు పరమాత్మ లేదా దేవుని విషయం తెలియబడుతుంది. అప్పుడు నీలో ఒక శక్తి (జ్ఞానశక్తి) ఏర్పడుతుంది. ఆ శక్తిని చూస్తే పెద్దపెద్ద దేవతలు, దయ్యములు అందరూ భయపడతారు. ఈ రోజు మన గ్రంథాలలో ఎంతో శక్తి ఉంది. కొన్ని రోగాలు పోతున్నాయి. అందువలన దైవికమైన శక్తి మనకు కావాలి అంటే ఇప్పటినుండి నిన్ను నీవు తెలుసుకో, నీ శరీరము అంతా ఉండే ఆత్మను తెలుసుకో. పరమాత్మను తెలుసుకునేందుకు ప్రయత్నం చెయ్యి అప్పుడు నీ జన్మ సార్థకమవుతుంది.

## 58. త్రైత సిద్ధాంతము

తేది : 30-09-2012

త్రైతసిద్ధాంతములో తెలియబడే విషయాలన్నీ సర్వమానవాళికీ సంబంధించినవి. సృష్టి ఆదిలో నేను చెప్పే బోధలు సర్వజీవులకు సంబంధించినవని దేవుడు చెప్పాడు. కానీ ఇది ఫలానా మతమునకు సంబంధించినదని ఎక్కడా చెప్పలేదు. భగవద్గీత, బైబిల్, ఖురాన్ గ్రంథములలో ఎక్కడా మతము అనే ప్రసక్తే లేకుండా ఈ జ్ఞానము సర్వ జీవులకు సంబంధించినదనే చెప్పాడు. ఇప్పుడు మేము చెప్తున్నది కూడా సర్వమానవులకూ సంబంధించినదే కానీ ఏ మతమునకూ సంబంధించినది కాదు. ఇప్పుడు ఎక్కడ చూచినా మతములకు సంబంధించిన బోధలే ఉన్నవి. ఏ మనిషి పుట్టినా మూడు ఆత్మలతోనే వారు జీవిస్తున్నారు. ఈ విధానము మనిషికే కాకుండా ఏ ప్రాణికైనా ఇదే వర్తిస్తుంది. త్రైత సిద్ధాంత జ్ఞానాన్ని తెలుసుకుంటేగానీ ఎవ్వరూ సంపూర్ణ జ్ఞానులు కాలేరు. ఇప్పుడు

ఎవరైనా మేము చాలా జ్ఞానము తెలుసుకున్నాము. కానీ మీరు చెప్పిన త్రైత సిద్ధాంతము ఎక్కడా లేదే, మరి మీరు త్రైత సిద్ధాంత జ్ఞానము తెలియకపోతే సంపూర్ణ జ్ఞానులు కాలేరు, అని మీరు తేల్చి చెప్తున్నారు అని అడిగితే, మీరు పై పైన జ్ఞానము తెలుసుకున్నారు తప్ప లోతుగా జ్ఞానము తెలుసుకోలేదు. శరీరము బయట జ్ఞానము తెలుసుకున్నారు? శరీరం లోపల జ్ఞానము తెలుసుకోలేదు. భగవద్గీతలో ఆత్మ సంయమ యోగము అనే అధ్యాయములో మొదటి శ్లోకము...

శ్లో॥ అనాశ్రితః కర్మఫలము కార్యం కర్మ కరోతియః ।
ససన్యాసీచ యోగీచ న నిరగ్ని ర్నచా క్రియః ॥

నిజమైన సన్యాసి పనులు చేస్తూ, కార్యంలో వచ్చే ఫలితాన్ని అంటించుకోకుండా ఎవరైతే ఉన్నారో వాడు నిజమైన సన్యాసి అని చెప్పడం జరిగింది. కానీ ఏమి చేస్తున్నాము. పనులు మానుకుని, నేను ఈ పని చేయకూడదు. ఈ పనిని చేయనివాడే సన్యాసి అని అంటున్నారు. వీరంతా సన్యాసులా అని మనము లెక్కవేసుకుంటే, భగవద్గీతలో చెప్పిన మాటకు వీరంతా వ్యతిరేఖముగా ప్రవర్తిస్తున్నారు. "నీవు నీటిలో దిగినా నీ శరీరము తేమ కాకుండా ఉండగల్గితే" అని ఒక వాక్యము ఉందనుకోండి. నీటిలోకి దిగకుండానే, నాకు తేమ అంటలేదు నేను స్వచ్ఛమైనవాడిని అని అంటే ఎలాగుంటుంది? పని చేస్తే కర్మవచ్చిందీ లేనిదీ తెలుస్తుంది. పని చేసినాగానీ ఎవరైతే కర్మను అంటుకోకుండా ఉంటారో, పాపాన్ని, పుణ్యాన్ని పొందకుండా ఉంటారో వాడే నిజమైన సన్యాసి అని ఈ శ్లోకములో చెప్పితే పని చేయకుండా ఉంటే సన్యాసి అగును అంటే దేవునికి వ్యతిరేఖం కాదా? అని మనము ప్రశ్నిస్తున్నాము.

అదే విధముగా శరీరము లోపల ఏ విధానము ఉన్నదో చూడకుండానే, శరీరములో తనను, తాను ఎవరో అని గమనించకుండానే, తన వెనుక నడిపించేవాడు ఎవరో అని తెలియకుండానే, ప్రపంచానికంతటికీ అధిపతి ఎవరో తెలియకుండానే, నేను జ్ఞానిని అంటే ఎట్లా ఉంటుంది? ఆ విధంగా చూస్తే అతను వాస్తవముగా జ్ఞాని కాడు అని మనము చెప్తున్నాము. తనను, తనను నడిపించువాడు, ఇద్దరినీ సాక్షిగా చూస్తున్న వాడు, ఈ ముగ్గురినీ ఎవరైతే ధ్యాసలో పెట్టుకొని తెలుసుకోగల్గుతారో వాడు నిజమైన జ్ఞాని. ఈ ముగ్గురి గురించి ఏ పుస్తకాలలో ఉంది? అని మీరు ప్రశ్నించవచ్చును. నువ్వేదో క్రొత్త సిద్ధాంతాన్ని చెప్పి, త్రైత సిద్ధాంతము అని పేరు పెట్టుకుని, నాకు గుర్తింపు ఉండాలని, మూడు ఆత్మలున్నాయని చెప్పుకుంటున్నావు. మూడు ఆత్మలు ఉంటున్నట్టు ఎక్కడా చెప్పలేదే! పెద్దపెద్ద వారంతా దేవుడు, జీవుడు అని రెండు చెప్పినారుగానీ మూడు ఎక్కడా చెప్పలేదే! మరి మీరు ప్రత్యేకంగా చెప్తున్నారే అని ఒక హిందూ పౌరుడు అడిగినాడు అనకుందాము. ఒక ముస్లీమ్ మాదాంట్లో ఒక్క "అల్లా" గురించే చెప్పారయ్యా! నీవు లేనిపోనివన్నీ చెప్తున్నావు, మా అల్లా ఏమి చెప్పినాడు ప్రార్థన చేయమన్నాడు, రోజుకి ఐదుసార్లు, అదే నిజమైన భక్తి అని అంటారు. మరి వారి వాదన వాస్తవమా, మన వాదన వాస్తవమా అంటే, దేవుడు ఎక్కడ చెప్పినా ఒకే విధానమే చెప్పి ఉంటాడు గానీ, ఒక్కొక్కరికి ఒక్కో విధానము ఎక్కడా చెప్పలేదు. మతాలు మనము కల్పించుకున్నాము. మతాలు వేరైనా దేవుడు ఒక్కడే కదా! దేవుడు ఒక్కడే అయినప్పుడు చెప్పిన జ్ఞానము ఒక్కటే ఉంటుంది కదా! అయితే నీవు చెప్తున్నది మరి దానిలో ఉండాలి కదా! అని ప్రశ్నవేస్తే మీరు గ్రుడ్డివారై, మాయ తెరలు అడ్డువచ్చి మీకు కనిపించలేదు. ప్రతి దైవ గ్రంథములోనూ, త్రైత సిద్ధాంతము చెప్పబడి

www.thraithashakam.org

ఉంది. కానీ మీరు దానిని గమనించలేదు. నీవు ఉన్నావు, నిన్ను నడిపేవాడు ఒకడున్నాడు. నీకు, నిన్ను నడిపేవాడికి సాక్షిగా ఒకడున్నాడు మొత్తము ముగ్గురున్నారు అని చెప్పితే మా గ్రంథాలలో లేవు అంటున్నారు. గీతలో భగవద్గీతలో **క్షర, అక్షర, పురుషోత్తమ** అని ముగ్గురు పురుషులున్నారు అని పురుషోత్తమ ప్రాప్తి యోగములో 16, 17వ శ్లోకాలలో చెప్పితే, చూడలేనివారు ఇదంతా ఎక్కడుంది? అంటున్నారు. అంత బాహాటంగా ఆయన చెప్తే, ఎక్కడుంది? అంటున్నారు. గీతలో 15వ అధ్యాయమునకు వచ్చినంత వరకూ ఎక్కడ జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అని విభజించకుండా 'ఆత్మ' అని మాత్రము చెప్పినాడు. నీవు ఏ ఆత్మ అనుకున్నా పేరు ఒక్కటే పెట్టి చెప్పినారు. అది ఎవరికి పోల్చుకుని చెప్పుకోవాలో తెలియక భావములు వ్రాసు కోవటంలో ఆత్మకు చెప్పినచోట జీవాత్మకు చెప్పారు, జీవాత్మకు చెప్పిన దగ్గర ఆత్మకు చెప్పుకున్నారు, ఏమీ సంబంధములేని పరమాత్మకు కూడా సంబంధాన్ని అంటగట్టారు. పరమాత్మ సాక్షీభూతుడు మాత్రమే. ఇంకా దేవునికి, భగవంతునికీ తేడా లేకుండా చేశారు. సాక్షిగా దేవుడుంటే, భగవంతుడైన శ్రీకృష్ణుడు భగవద్గీతను చెప్పాడు. కానీ దేవునికి, భగవంతునికీ తేడా తెలియకుండా పోయింది.

భగవద్గీతలో జ్ఞానయోగములో **"అజోపి"** అని అంటాడు. నేను పుట్టేవాడిని కాదు అంటాడు. **"సమ్భవా"** పుట్టేవాడిని అంటాడు. అంటే ఒకే శ్లోకములో...

శ్లో॥ అజోపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరో పిసన్।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా మ్యాత్మ మాయయా॥

"నాకు పుట్టుకలేదు చావులేదు" సర్వజీవరాసులకూ నేనే దేవున్ని ఇదే విషయాన్ని ఖురాన్‌లో 112వ సూరా, అల్ ఇఖ్లాస్ అనే సూరాలో

"దేవుడు పుట్టేవాడు కాదు" అని ఉంది. భగవద్గీతలో కూడా అదే ఉంది. మరి మీ మతములో దేవుడొచ్చి జ్ఞానము చెప్తాడట కదా! అంటే కాదు దేవుడు పుట్టడు అని అంటున్నాము గానీ మీరు అర్థము చేసుకోవటంలో పొరపాటు ఉన్నది. భగవద్గీతలో మరోచోట 'అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్" మానవ జన్మ ఎత్తిన నన్ను మూఢులు అవమానిస్తున్నారు" అని చెప్పినాడు. "పరంభావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్". నేనే దేవున్ని అని తెలియక నన్ను అవమానిస్తున్నారు అని అన్నాడు. మరి ఇక్కడ దేవుడు పుడతాను అని చెప్పినట్లే కదా! ఆ శ్లోకములో పుట్టరంటున్నారు, ఈ శ్లోకములో పుడతారంటున్నారు. అంటే మీరు అర్థము చేసుకోవటంలో పొరబడ్డారు. దేవుడు పుట్టడు, భగవంతుడు పుడతాడు. **"ఏకాంశేన స్థితో జగత్"** అని చెప్పినట్లు, దేవుని అంశలో కొంత భగవంతుడిగా వచ్చి పుడుతుంది. కనుక జన్మలు తీసుకున్నది భగవంతుడు, జన్మలు తీసుకోనివాడు దేవుడు. పుట్టేవాడు భగవంతుడు, పుట్టనివాడు దేవుడు. భగవంతుడు ఎందుకు పుట్టాలి? అంటే, దేవుని విషయం దేవునికే తెలియును ఏ మానవునికీ తెలియదు. మరి ఆయన చెప్పే జ్ఞానము మనకెట్లు అర్థమవుతుంది? ఆయన ఫలానావాడు అని తెలియనప్పుడు ఆయనవద్దకు మనము ఏ విధముగా పోగలము. మరి దేవుని విషయము ఎవరు చెప్పాలి? భగవంతుడు చెప్పాలి. భగవంతుడు ఏ విధముగా చెప్పగలడు? అంటే దేవుడు భగవంతునిగా పుట్టును, దేవుడు పుట్టడుగానీ వేషం మార్చుకుని పుట్టగలడు. ఆ విధముగా పుట్టిన భగవంతుడు తనను గురించి జ్ఞానాన్ని చెప్పెను. భగవద్గీతలో **"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత" ఎప్పుడైతే ధర్మాలకు ముప్పుగల్గుతుందో అప్పుడు నేను భూమిమీద అవతరించి ధర్మములు తెలియజేస్తాను** అని చెప్పాడు. ఈ విధానమే

www.thraithashakam.org

పవిత్ర ఖురాన్ గ్రంథములో 3వ సూరా అలీ ఇమ్రాన్‌లో 7వ ఆయత్‌లో ఏముందంటే "ఈ గ్రంథములో ఉన్న విషయములు రెండు రకములుగా ఉన్నాయి. సూక్ష్మమైనటువంటివి, స్థూలమైనటువంటివి ఉన్నవి. స్థూలమైన విషయములను మీరు చెప్పగలరు. సూక్ష్మమైన వాటిని మీరు చెప్పలేరు అని ఉంది. సూక్ష్మమైన విషయములు దేవునికి తప్ప మరెవరికీ తెలియవు. ఏ మనిషికైనా చెప్పితే వక్రబుద్ధితో చెప్పి, కలతలు రేపి, అజ్ఞానమార్గములో కొట్టుకుపోతారు. తద్వారా నా మతము వేరు, నా వర్గము వేరు. వేరువేరుగా విభజించుకుని పోట్లాడుకుంటారు గానీ వాస్తవమైన జ్ఞానము కాదు. ఈ విధముగా రేగిన కలతలు, మతాలను తయారు చేశాయి. కానీ దేవుడు చెప్పింది ఒకే జ్ఞానమే. మనుషులు చెప్పితే కలతలు రేపుతుంది, మరి ఎట్లా తెలుస్తుంది అంటే ఖురాన్‌లో ఏమి వ్రాసి ఉందంటే **"బుద్ధి శ్రద్ధ ఉన్నవాడు సూక్ష్మంగా ఉన్న విషయాలను బాగా అర్థము చేసుకుంటాడు"** అని ఉంది. చెప్పేవాడే లేకపోతే ఏ విధంగా గ్రహించుకుంటాడు? ఎవరైనా చెప్తే కదా గ్రహించు కునేది. వింటేనే కదా గ్రహించుకునేది, మరి మనిషి ఎవరైనా చెప్తే తప్పవు తుందని ఖురాన్ గ్రంథమే చెప్తున్నది, మరి ఎవరు చెప్పాలి దేవుడే చెప్పాలి. దేవుడు పుట్టడు కదా! పుట్టడు కానీ భగవంతుడు పుట్టును. దేవుడు భగవంతుడుగా పుట్టి చెప్తే అర్థమవుతుంది. 5000 సంవత్సరాల పూర్వము చెప్పిన భగవద్గీతను చదివి మనకి ఏమర్థమయిందంటే, దేవున్ని సాకారంగా ఉండేవాడు అని చెప్పి ఎల్లప్పుడూ సాకారాన్నే మ్రొక్కుతున్నాము. దేవుడు ఆకారంగా ఉంటాడు అని ఏదో ఒక ఆకారాన్ని పెట్టుకుని ఇతనే దేవుడు అని అంటున్నాము.

ముస్లీమ్స్, దేవునికి సమానంగా ఎవ్వరూ లేరు, దేవునితో సమానంగా ఎవ్వరినీ పోల్చకూడదు కనుక దేవుడు నిరాకారుడు అని

www.thraithashakam.org

అంటున్నారు. దేవుడు నిరాకారుడైనదీ వాస్తవమే కనుక వారిమాట నిజమే కానీ దేవుడు సాకారంగా ఉంటాడు అని హిందువులు అంటూ ఎల్లప్పుడూ సాకారాన్నే మ్రొక్కుచున్నారు. ఒక విధంగా దేవుడు భగవంతుడిగా వస్తే సాకారంగా ఉన్నట్లే కానీ ఎల్లప్పుడూ కాదు. ఈ భగవంతునికి, దేవునికి వ్యత్యాసము తెలియక పోవటం వలన భగవంతుడు అనవలసిన చోట దేవుడంటున్నాము. దేవుడు అని అనవలసిన చోట భగవంతుడు అంటున్నాము. అది పురీయో, చపాతీయో తెలియకుండా పోయింది. చపాతి అంటే పెనము మీద కాల్చేది, పూరీ అయితే నూనెలో ముంచి కాల్చేది. ఏ విధముగా పూరీకి, చపాతీకి తేడా ఉన్నా రెండింటికీ గోధుమ పిండే కలదు. పూరీ, చపాతీ రెండు ఒకే పరిమాణంలో ఉన్నా అది పూరియే, ఇది చపాతీయే. అలాగే దేవుడు నిరాకారుడు, భగవంతుడు సాకారుడు. ఈయన పుట్టడు ఆయన పుట్టును. వేమన పద్యంలో నాకిష్టమైనదని ఒక పద్యమును మీకు ఎప్పుడూ చెప్తూ ఉంటాను. **"పతి యొప్పిన సతి యొప్పును"** భగవద్గీతలో కూడా ఒక శ్లోకాన్ని చెప్తూ ఉంటాను. "నేను పుట్టేవాడిని చచ్చేవాడిని కాను. కానీ పుట్టి చెప్తాను అంటాడు" అజోపి సన్నవ్యయాత్మా భూతానాం ఈశ్వరో పిసన్" ఈ శ్లోకము కూడా నాకిష్టమైనదే ఎందుకంటే సర్వప్రాణులకు నేను ఈశ్వరుణ్ణి, నాకు పుట్టుకలేదు, కానీ జ్ఞానము చెప్పేందుకు మాత్రము పుట్టుచున్నాను. దేవునిగా పుట్టలేదు కానీ భగవంతునిగా మాత్రము పుట్టుచున్నాను. దేవుని విషయాలను మనిషిగా చెప్తే కదా! గ్రహించుకునేది. ఖురాన్ గ్రంథములో సూక్ష్మమైన విషయాలను దేవుడు తప్ప ఎవరూ చెప్పలేరు అని ఉంది. అయితే ఎట్లా చెప్తాడు భగవంతునిగా వచ్చి చెప్తాడు. ఖురాన్ గ్రంథములో 89వ సూరాలో **"దేవుడు అవతరిస్తాడు"** అని ఉంది. దేవుడు అవతరించి

జ్ఞానము చెప్తే, అప్పుడు మనిషి ఇంతకుముందే జ్ఞానము తెలిస్తే ఎంత బాగున్ను అనుకుంటాడట. అందుకు జ్ఞానాన్ని చెప్పటం కొరకు దేవుడు భగవంతుడై పుట్టి మనిషి ఆకారంలోనే వచ్చి జ్ఞానాన్ని బోధిస్తాడు. మనిషి ఆకారములో దేవుడొస్తే మరి మనము ఏ విధముగా గుర్తించగలము మనిషి దేవుడు కాదు అంటున్నాము కదా! మరి ఎట్లా పోల్చుకోగలము? పూరియే, చపాతియే రెండూ గోధుమపిండితోనే తయారవుతాయి అని తెలుసు కోకుండా, మనిషిగా వచ్చిన భగవంతున్ని కూడా మనిషిగానే పరిగణించి ప్రక్కకు తోసేస్తున్నారు జనులు. ఈ ప్రపంచములో జ్ఞానము 99 మంది చెప్తున్నారనుకుందాము. అప్పుడు భగవంతుడు వచ్చినాడనుకో అప్పుడు వారిలో ఈయన కూడా ఒక్కడు అని ప్రక్కకు తోసేస్తున్నారు. ఈ విధముగా ఉంటుందనే కృష్ణునిగా వచ్చిన ఈ మొండివారితో నాకేమి? వీరికి జ్ఞానము చెప్పినా అర్థము కాదు అని తనకు అనుకూలమైన మనిషైన అర్జునున్ని ప్రక్కకు పిలిచి జ్ఞానాన్ని చెప్పాడు. మరి రెండోసారి ఎక్కడా చెప్పలేదు. అది జరిగి 3000 సంవత్సరాలైనా ఆ జ్ఞానము ప్రాకలేదు, ఆ విషయం ఇంకొక విధంగా అర్థమయిపోయింది. మరలా వచ్చి చెప్పవలెను అనుకొని వచ్చి బాహాటంగా చెప్పాడు. ఇట్లా చెప్పుదువా అని ఆయనను చంపేద్దాము అని అనుకున్నారు. కానీ ఆయన చావలేదు, మరలా ఆయన బ్రతికాడు. ఉపమానముగా చెప్పితే కుక్కలను చంపాలనుకొని కొట్టినారనుకోండి అవి చచ్చినట్లే ఉంటాయి. చచ్చాయి అనుకుంటాము కానీ అవి ఒక గంటో అర్థగంటో తరువాత మరలా లేస్తాయి. మీకు తెలుసో లేదో గానీ కుక్కలు తాత్కాలిక మరణాన్ని పొందుతాయి. ఆ విధంగా ఏసు ప్రభువు తాత్కాలిక మరణాన్ని పొంది మరలా లేచినాడు. తరువాత కొంతకాలము ఉండి ఆయన చనిపోయాడు. బాహాటంగా చెప్తే కొట్టినారు. చాటుగా చెప్తే వినలేదు,

www.thraithashakam.org

మూడోమారు వస్తే బాగుండదని ఆయన దూతను ఒకర్ని పంపినాడు. దేవుని జ్ఞానము తెలిసిన దూతలు కోట్లానుకోట్లమంది ఉన్నారు. వారిలో ఒకర్ని ఎన్నుకొని "జిబ్రయేల్" అనే గ్రహాన్ని నువ్వైనా చెప్పు, నేను చెప్తే కుదరలేదు. నువ్వైనా కనిపించకుండా చెప్పు అని పంపిస్తే ఆయన కనపడకుండా జ్ఞానాన్ని చెప్పాడు, కానీ వినిన ముహమ్మద్ ప్రవక్తగారికి విన్న మూడు రోజుల్లో భయంవేసి జ్వరం వచ్చింది. తరువాత ఆయన కోలుకున్నాడు. అప్పుడు జిబ్రయేల్ ఆ దూత నేను ప్రమాదం చేసేవాడిని కాను. నీకు జ్ఞానము చెప్పి, మేలు చేయాలని వచ్చినాను అని చెప్పాడు. అంతేగాని నీకు ప్రమాదం చేయటానికి రాలేదు అని చెప్పాడు. చూడండి కనిపించి చెప్పితే ఒక ఇబ్బంది, కనపడకుండా చెప్తే ఇంకొక ఇబ్బంది అని కనిపించకుండా ఆ జిబ్రయేల్ 23 సంవత్సరాలు జ్ఞానము చెప్పినాడు. ఆ తరువాత ఆయన ప్రక్కనున్న వారికి చెప్పి, అది ఇప్పుడు ఒక గ్రంథముగా వచ్చింది అదే 'ఖురాన్' భగవంతుడు రెండుసార్లు చెప్పినాడు. దూత ఒకసారి చెప్పినాడు. దూత చెప్పినా సూర్యుడు మొట్టమొదట విని చెప్పిన జ్ఞానము కనుక పొల్లుపోకుండా దేవుడెట్లు చెప్పితే అట్లే చెప్పినాడు పొల్లు పోకుండా. మరి అప్పుడు భగవద్గీతలో ఏది ఉంటే అదే ఉంటుంది కదా! కాబట్టి భగవద్గీతలో ఏ జ్ఞానము ఉందో అదే జ్ఞానము ఈ ఖురాన్ గ్రంథములోనూ ఉన్నది. పుట్టను అని భగవద్గీతలో ఉంటే పుట్టననే ఖురాన్ గ్రంథములోనూ ఉంది. పుడతాను అని భగవద్గీతలో కూడా ఉంది అదే విషయం ఖురాన్‌లో కూడా ఉంది. ఎక్కడా ఏ మార్పు లేదు. అర్థము చేసుకోవటంలో పొరపాటుపడి చివరకు భేదాలు కల్పించుకుని మతములను సృష్టించుకున్నారు. నువ్వు వేరు, నేను వేరు అని అను కుంటున్నారు. నీ మతము వేరు, నా మతము వేరు అని అనుకుంటున్నారు. ఇప్పుడు త్రైత

www.thraithashakam.org

సిద్ధాంతము అనే చిన్న మొక్క పుట్టింది అది ప్రాకుతుంది. మతము అనేది లేకుండా పోతుంది. ఇప్పుడు త్రైత సిద్ధాంతము చదివిన ఎవరైనా ఇది మతము అని అనుకోకుండా ఒకే భావంలోకి వస్తారు. మనము పొరపాటున మతము అని పేరు పెట్టుకున్నాము. ఇది మతము కాదు పథము. మూడు మతముల వారు ఇది నా జ్ఞానము అని త్రైత సిద్ధాంతాన్ని చెప్పుకుంటారు.

ఈ త్రైత సిద్ధాంతంలో దేవుడు అనేవాడు ప్రత్యేకంగా ఉన్నాడు అని అంటాము. ఆ విషయాన్ని మన చేతిలో ఒక గీత అదే సూచిస్తున్నది. అదే విధముగా చేతులలో రెండు గీతలు మాత్రము కలిసి ఉన్నాయి. అదే విధముగా ముగ్గురు పురుషులున్నారని చెప్పటానికి అది సూచిక. మేము వ్రాసిన **"త్రైత సిద్ధాంతము"** అనే గ్రంథములో ముగ్గురి మతస్థుల విషయములు ఏకమై ఉంటాయి. మీరు చెప్పిన పై విషయములలో నాకొక పద్యము ఇష్టము అని, నాకొక శ్లోకము ఇష్టమని చెప్తున్నారు మీరు హిందువులు కనుక అట్లా చెప్పారు అని మిగతావారు ప్రశ్నిస్తే ఖురాన్‌లో 114 సూరాలున్నాయి. వీటిలో "ప్రత్యేకం" అని పేరుగల్గి ప్రత్యేకమైన సూరా ఉంది. "అల్‌ఖ్లాస్" అని ఆ సూరా నాకిష్టం అని చెప్తున్నాను. అది 112వ సూరా. ఆ సంఖ్య కూడా ప్రత్యేకమే 1+1=2 అంటే నీవు, నీ ఆత్మ కలిస్తే అప్పుడు రెండు అవుతావు అలా నీవు రెండుగా మారితే మూడవ వానిగా అయ్యేది అనే సూచన అందులో ఉన్నది. ఆ సూరాలో 4 వాక్యములు గలవు. అందులో "ప్రపంచములో అందరికీ దేవుడొక్కడే ఉన్నాడు" ఇదే విషయము భగవద్గీతలో "నన్ను మించి ఏదీ గొప్పది ఈ ప్రపంచములో లేదు" అని చెప్పలేదా. "దేవుడు పుట్టేవాడు కాదు అనే రెండో వాక్యము భగవద్గీతలో కూడా ఉంది. ఇక నాల్గవ వాక్యము దేవున్ని ఎవరితోనూ సమానముగా పోల్చకూడదు. "నహి జ్ఞానేన సదృశ్యం" జ్ఞానానికే

www.thraithashakam.org

సమానమైనది ఏమీ లేప్పుడు ఇక దేవునికి ఇంకా సమానము ఏముంటుంది? మరి ఇంత స్పష్టముగా రెండు గ్రంథములలో పోలికలు ఉంటే నా మతము వేరు, నీ మతమువేరు అని అనుకోవటం తెలివితక్కువతనము కాదా!

దేవుడు ఒకే జ్ఞానము చెప్పినప్పుడు ఆయన లుంగీకట్టుకుంటే, ఈయన అంగీకట్టుకుంటాడు. ఒక్కొ మతములో నియమ, నిబంధనలు పెట్టుకున్నారు. దేవునిమార్గము ఇటువంటిది అని అనుకుంటున్నారు. దేవుని మార్గము ఒకటే అయితే ఈ నియమాలెందుకు? ఈ విధముగా మనకి మనము పరిశీలన చేసుకోవచ్చును కదా! అదే విధంగా సన్యాసమని దేవుడు ఏ విధంగా అయితే చెప్పినాడో దానికి వ్యతిరేఖంగా మనము నడచుకుంటూ మేము సన్యాసులము అని అంటున్నారు. నేటి సన్యాసులంతా ఎట్లు ఉన్నారంటే పెళ్ళి చేసుకోరు. పెళ్ళి చేసుకుంటే సన్యాసి కాడట. ఈ విధంగా భగవద్గీతలో చెప్పినాడా? అన్ని పనులు చేసేవాడు సన్యాసి అని చెప్పెనుగానీ నీవు పెళ్ళి చేసుకోవద్దు, కాపురం చేయద్దు అని చెప్పలేదు కదా! కానీ మేము ఇప్పుడు ఒక పని చేయాల్సి వచ్చింది. మామూలుగా అయితే జ్ఞానము వినరు, సన్యాసి వేషము వేసుకుని, ఇద్దరు స్వాములను జ్ఞానము చెప్పమని బయటకు పంపించాము. నా కిష్టములేదుకానీ ప్రజల కోసము వేషము వేసి పంపించాము. మామూలుగా జ్ఞానము చెప్తే వినరు కనుక నేను కూడా వేషము వేసుకుని జ్ఞానము చెప్పక తప్పలేదు. సన్యాసి అనినా సంసారి అనినా ఒకే అర్థము వస్తుంది.

ఇప్పుడు అందరూ వేరువేరుగా మతాలు ఏర్పరచుకొని మేము జ్ఞానులము అనుకుంటున్నారు ఇది పూర్తి తప్పు. ఇదంతా ఎందుకు వచ్చిందంటే దేవుడు చెప్పిన జ్ఞానము మనకు అర్థము కాకపోవటం వలన, దేవునికి వ్యతిరేఖముగా చెప్పటం వలన పెద్ద పాపము వస్తుంది. దేవుడు

www.thraithashakam.org

ఎక్కడా చెప్పని విషయాలను కల్పించి అదే పనిగా చెప్తే అది తప్పవుతుంది. ఈ విధంగా దేవుని జ్ఞానము మనము అర్థము చేసుకోకుండా చెప్తే నాకైనా, మీకైనా, ఎవరికైనా పాపము వస్తుంది. ఎక్కడైతే పొరపాటు జరుగుచున్నదో అక్కడ సవరించే పని నాది. నాకు అన్ని మతములలో ఉన్న విషయములు సమానము కనుక వక్రమార్గము పట్టించే విధానము మా వద్దలేదు. అంతా ఒకే జ్ఞానము కనుక నేను ఇందువునైనప్పటికీ అన్ని మతాల గ్రంథాల సారాంశము నేను చెప్పగలను. ఇక్కడ ఇందూ అంటే దేవుని ధర్మము. ఇందూ అంటే జ్ఞానము, దేవుడు అని అర్థము. ప్రతీ మతములోను ఇందూ ధర్మమే. అందువలన నీవు త్రైత సిద్ధాంతాన్ని తెలుసుకోగల్గితే, నీవు ఇందూ ధర్మాలను ఆచరించినట్లు అవుతుంది. మరి అది ఎట్లా తెలుస్తుంది? మరి జ్ఞానాన్ని చెప్పిన వాడిని ఏమి అనాలి? మనిషి అనాలా, భగవంతుడనాలా అంటే ఏమి అనకు చెప్పేవాడు ఎవరైతే నీకేం? నీవు జ్ఞానమును చూసు కోవలెను. అదేదో చలనచిత్రంలో "ఎవరు కొడితే దిమ్మతిరిగి క్రిందపడతాడో వాడే పండు" అలాగే ఏది జ్ఞానమో అది నీకు అవసరముగానీ ఎవరు చెప్పారు? ఎట్లా చెప్పారు? అనేది నీకు అనవసరము. అందుకే మీరేమైనా నేను జ్ఞానము చెప్తున్నాను కదా! అని నన్ను ఇంకొక దృష్టితో చూసి, నన్ను పెద్దగా చేసి నమస్కరిస్తారేమోనని, మేము ముందే చెప్తున్నాము మాకెవరూ నమస్కరించవద్దని. అందుకే బయట ఒక బోర్డు పెట్టలేదా! మేము మీలాంటి మనుషులమే మాకు నమస్కరించ వద్దండి. మా ధ్యాసంతా జ్ఞానంపైన ఉంది కనుక చెప్పగలుగుచున్నాము. మేము రాత్రులు కూడా పెద్దగా నిద్ర పోకుండా మేల్కొని ఉండి జ్ఞానం పైన ధ్యాస పెట్టుకోగలుగుచున్నాము. కాబట్టి చెప్పగలుగుచున్నాము. అంతే తప్ప మమ్మల్ని పెద్దగా పోల్చుకోవటం పొరపాటు. ఆ విధముగా మమ్మల్ని గొప్పగా పోల్చుకుంటే మీదే పొరపాటు,

మేము చెప్తున్న జ్ఞానములో కూడా తప్పులుంటాయి. మేము మాట్లాడే మాటలు కూడా స్వచ్ఛంగా ఉండవు. అదే విధముగా మాకు జ్ఞాపకశక్తి చాలా తక్కువ. కనుక మేము చెప్పే జ్ఞానము గూర్చి ముందు తెలుసుకోండి. త్రైత సిద్ధాంత భగవద్గీత ఉంది. అందులో సిద్ధాంతము అంటే ఏమిటో చెప్పాము. ఈ విషయాలన్నీ మీకు తెలుసు. ఉదాహరణకు ఇంగిత జ్ఞానము, ఇందూ జ్ఞానము గూర్చి చెప్తూ ఇంగిత జ్ఞానము అంటే ప్రపంచ జ్ఞానము, ఇందూ జ్ఞానము అంటే పరమాత్మ జ్ఞానము అని మీకు తెలుసు అని చెప్పాము. ఆ విషయాలన్నీ మీకు మేము గుర్తు తెస్తున్నాము తప్ప ఇంకొకటి ఏమీలేదు. ఈ విధముగా ఈ జ్ఞానాన్ని మీరు తలకెక్కించుకుంటే పెద్ద స్వామీలకంటే ఎక్కువవుతారు. వారు చెప్పే మాటల్లో ఇది తప్పు, ఇది ఒప్పు అని చెప్పే స్థోమతకు వెళ్తారు.

## 59. స్త్రీలింగం-పుంలింగము

తేది : 28-12-2012

మనం పురాణ, ఇతిహాసాల వైపుకు వెళ్ళకుండా కేవలం శాస్త్రబద్ధమైన దేవుని మార్గాన్నే జ్ఞానం ద్వారా వివరిస్తూ ఉన్నాము. జ్ఞానం అనేది సముద్రంవంటిది, ఎంత చెప్పుకున్నా ఇంకా మిగిలే ఉంటుంది. కనుక మనకు తెలిసినంత జ్ఞానాన్ని అందులోనుండి మనం తెలుసు కుంటున్నాము. అయితే ఈ జ్ఞానం తెలుసుకుంటున్న మీలో కొందరు ఈ జ్ఞానం ప్రపంచంలో ఎక్కడా తెలియబడని జ్ఞానం మనకు తెలుస్తున్నది అనే భావన ఉండటం లేదు. అక్కడకు పోతే ఏదో ఒక జ్ఞానం చెప్తారులే అని అనుకుంటున్నారు. అలా కాకుండా మీ అందరూ ఈ జ్ఞానాన్ని శ్రద్ధగా తెలుసుకుని పదిమందికీ దానిని తెలియజెప్పాలి.

మనం చిన్నప్పుడు పురుషుణ్ణి, స్త్రీని ఉద్దేశించి చెప్పేటప్పుడు స్త్రీలింగము, పులింగము అంటాం. దీనిని ఆంగ్లంలో కూడా మేల్ మరియు ఫిమేల్ అని మగ, ఆడవారిని ఉద్దేశించి వ్రాస్తుంటారు. ఇక్కడ లింగము అనే మాటను ఈశ్వర అనే దానితో కలుపుకుని "ఈశ్వరలింగము" అని మనం వింటున్నాం. లింగము అంటే ఆత్మ అని అర్థం. ఈశ్వరలింగము అంటే ఆత్మకు అధిపతిగా ఉన్నవాడు దేవుడు అనే అర్థం వచ్చినట్లుగా ఈశ్వరలింగం అని అన్నారు. ఇప్పుడు పులింగము, స్త్రీలింగము అని అంటున్నాం. పులింగము అంటే పురుషాత్మ అని స్త్రీలింగము అంటే స్త్రీ ఆత్మ అని అర్థం. అయితే ఆత్మ ఒక్కటే కదా అందులో ఆడఆత్మ, మగ ఆత్మ రెండు ఉన్నాయా? అని ప్రశ్న వస్తుంది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఏమి చెప్పెనంటే **"ద్వావిమౌ పురుషౌలోకే క్షర అక్షర యేవచ"** ఇద్దరు పురుషులున్నారు క్షరుడు, అక్షరుడు అని చెప్పినారు. జీవాత్మ, ఆత్మ అనేవారు పురుషులే. మరి అటువంటప్పుడు ప్రత్యేకంగా పులింగము అని అనాల్సిన పని ఏమి వచ్చింది? ఆత్మ అనేవాడు ఎప్పుడూ పురుషుడే కదా అని ప్రశ్నించుకుంటే, జ్ఞానరీత్యా ఇద్దరూ పురుషులే అయినా ఇద్దరు కంటే పురుషోత్తముడు ఇంకా ఒకడున్నాడు. జ్ఞానం అర్థమయ్యే దాని కొరకు, మనం అందరమూ ఏ స్థాయిలో, ఏ స్థితిలో ఉన్నామో తెలుసుకునేందుకు ఈ స్త్రీలింగము, పులింగము అనే పేర్లు పెట్టుకోవలసి వచ్చింది. పైన ఉన్న శరీరములను అనుసరించి స్త్రీజాతి, పురుషజాతులుగా విభజించినాము. అదే కాకుండా నపుంషక లింగము అని కూడా ఇంకొకటి ఉంది. అంటే పురుషత్వము లేనిది అని అర్థం.

www.thraithashakam.org

ఇప్పుడు ప్రపంచంలో నీవు ఎవరినైనా స్త్రీలింగం, నీవు పులింగము అని వేరు చేసి చెప్పుకున్నా గానీ జ్ఞానరీత్యా మాత్రము, దేవున్ని తెలుసుకున్న వాడు, ఏదైతే ప్రపంచంలో మగతనం ఉందో దానిని తెలుసుకోగల్గినాడో వాడు పులింగమే. అలా కాకుండా జ్ఞానం తెలియనివాడు శరీరం ప్రకారం పురుషుడైనా, వాడు స్త్రీలింగమే అగును. స్త్రీలు జ్ఞానం తెలుసుకుంటే వారందరినీ పులింగమే అని అనాలి. లింగము అంటే ఆత్మ, ఆత్మ అందరిలోనూ ఉంది. అయితే జ్ఞానం తెలిసిన ఆత్మ, జ్ఞానం తెలియని ఆత్మగా గుర్తుంచుకొనేందుకు ఈ విధంగా స్త్రీలింగం, పులింగము అని పెట్టాం.

మొత్తం సృష్ఠిని విభజించుకుంటే ప్రకృతి వేరు దేవుడు వేరు. అజ్ఞానంతో కూడుకున్నటువంటిది ప్రకృతి. జ్ఞానంతో కూడుకున్నటువంటి వాడు దేవుడు అని మనం చెప్పుకుంటున్నాం. దైవజ్ఞానంతో నీవు (జీవాత్మ) కూడుకున్న వాడివైతే నీవు పులింగమవుతావు. దైవజ్ఞానం తెలుసుకోకపోతే నీవు మగవాడిగా పుట్టినా, శరీరం మగదిగా ఉన్నాగానీ నిన్ను స్త్రీలింగము గానే గుర్తించాలి. అలాగే స్త్రీలలో వారిది స్త్రీ శరీరమైనా, దైవజ్ఞానం తెలుసుకుంటే వారిని జ్ఞానరీత్యా పులింగమే అనాలి. స్త్రీలలో దైవజ్ఞానం లేనటువంటి వారిని ఎట్లాగూ స్త్రీలింగమే అనాలి. అలా కాకుండా దైవజ్ఞానం కొంత తెలుసుకుని అజ్ఞానంగా ప్రవర్తిస్తారు. సృష్ఠిలో నీవు మొదటపుట్టావు. సృష్ఠి అంతా ఆదిలో పుట్టింది. నీవు ఆదిగా (మొదటిగా) పుట్టావు. దానినే ఆదివారము అంటాము కనుక ఆ ఒక్కరోజును నీవు పవిత్రంగా పెట్టుకో. ఇక సోమవారం సోమ అనగా చంద్రుడు. చంద్రుడు జ్ఞానానికి గుర్తు. పుట్టినందులకు జ్ఞానం తెలుసుకొనమని ఆ పేరు సోమవారం అని పెట్టారు మన పెద్దలు. మంగళవారం అనగా మంగళ అంటే మోక్షం పొందే రోజు

అంటే పుట్టటం (ఆది), జ్ఞానం తెలుసుకోవటం (సోమ), మోక్షం పొందటం (మంగళ) ఇదే జీవితం యొక్క ఉద్దేశ్యం అని ఆది, సోమ, మంగళ అని పేర్లు పెట్టారు. ఆదివారం పవిత్రమైన దినమని ఆ రోజు మాంసం తినవద్దండి. అంటే ఆ రోజే ప్రత్యేకంగా మాంసం తింటారు. ఇంకో రోజు (శనివారం) తినండి ఫరవాలేదు. భగవద్గీతలో నాలుగు అధర్మాలు, మూడు ధర్మాలు గురించి చెప్పారు. మూడు ధర్మాలకు ప్రతీకగా ఆది, సోమ, మంగళ వారముల పేర్లు నాలుగు అధర్మాలకు ప్రతీకగా బుధ, గురు, శుక్ర, శని వారముల పేర్లు గలవు. మాంసం తినడం ఒకరోజు ముందు శనివారము తినండి అంటే మీరంతా ఏమి చేస్తారంటే ఆదివారం సెలవు దినము కదా అంటారు. ఆదివారం సృష్టి మొదటనే ప్రపంచమంతా సెలవు దినంగా ప్రకటించారు. సృష్టిలో మొదటిదినం కావున, దానిని గుర్తుపెట్టుకునేందుకు గాను, ప్రపంచ పనులన్నీ ప్రక్కకు పెట్టి ఆరోజు దైవ జ్ఞానాన్ని తెలుసుకోండి అని ఆ రోజు ఆదివారంను సెలవు దినంగా పెద్దలు పెట్టితే, ఈ రోజు ఇవన్నీ విడిచిపెట్టి, కేవలం తినేదానికే ప్రత్యేకంగా ఆదివారాన్ని పెట్టుకున్నా రంటే ఎంత అజ్ఞానంగా ప్రవర్తిస్తునారో చూడండి.

నేను ఇప్పుడు ఈ విషయాన్ని చెప్తే విని కూడా జ్ఞానం ప్రకారం నడచుకోకుండా ఆ రోజే (ఆదివారం) మాంసం తింటుంటే ఏమనాలి. మేము దేవుని మార్గంలోనే ఉన్నాం కదా! అని వారు అంటే ఎట్లు ఉన్నట్లు? దేవుని జ్ఞానం ప్రకారం నడచుకొనే వారు మాత్రమే దేవుని మార్గంలో ఉన్నట్లు లెక్క. వీరంతా జ్ఞానం తెలిసి అజ్ఞానంలో నడచుకొంటున్నారు కనుక వీరందరినీ చూపాకారానికే మగశరీరమే కానీ లోపల ఆడతనము ఉంది కావున వీరంతా నపుంషకులే. నపుంషకులెట్లుంటారు? కనిపించేందుకు మగశరీరమే కానీ వారిలో ఆడతనం ఉంటుంది. కావున

www.thraithashakam.org

వారిని నపుంషకులు అంటాం. కనుక పూర్తిగా జ్ఞానం తెలియకపోతే ఎవరినైనా స్త్రీలు అని అనవచ్చును. పూర్తిగా జ్ఞానం తెలిస్తే పురుషులు అనవచ్చును. అలా కాకుండా జ్ఞానం తెలుసుకుని కూడా అజ్ఞానంగా ప్రవర్తించేవారిని నపుంషకులే అనాలి. ఈ విధంగా ఈశ్వరలింగము అంటే ఆత్మకు అధిపతి అని చెప్పుకుంటే, జ్ఞానంతో ఉన్న ప్రజలందరినీ పురుషులతోను, అజ్ఞానంతో ఉన్న ప్రజలందరినీ స్త్రీలతోనూ పోల్చవలసి ఉంటుంది. మేము ముందే చెప్పాం మీరు మగశరీరం ధరించినంత మాత్రాన పురుషులు అనుకోవద్దండి, ప్రకృతి లక్షణాలు మీకున్నాయి కనుక మీరు ఆడవారి క్రిందకే లెక్క.

దేవుడు కూడా కొన్ని విషయాలు నిగూఢంగా పెట్టాడు. ఉదాహరణకు ఒక పిల్లాడు తన తల్లిని అడుగుచున్నాడు అమ్మా! మనం పెంచుకుంటున్న పిల్లి ఆడపిల్లా? మగపిల్లా? అని. ప్రపంచరీత్యానే ఆ పిల్లిని గురించి చెప్పుకుంటే, మగది అని వాళ్ళ అమ్మ చెప్పిందంట. మగది అని ఎట్లా చెప్పగలవు? అని పిల్లాడు అడిగితే మీసాలున్నాయి కావున అది మగదే అని చెప్పిందట. మరి ఆడపిల్లికి కూడా మీసాలున్నాయి కదా! అని అడిగాడంట. మీసాలుండటమే మగతనమంటే ఆ మగతనము ఆడవారు లోనూ ఉంది అని బాగా గుర్తుపెట్టినట్లుయింది. అప్పుడు ప్రక్కన జ్ఞానం తెలిసిన వ్యక్తి ఆ పిల్లాడితో ఏమి చెప్పినాడంటే వెంట్రుకలు ఆత్మకు గుర్తు, ఆత్మలు ఆడవారిలోనూ ఉన్నాయి మగ వారిలోనూ ఉన్నాయి కనుక ఆడపిల్లికి మగపిల్లికి ఆత్మ గుర్తు అయిన వెంట్రుకలు వాటి మూతులమీద మీసాలుగా ఉన్నాయి అని చెప్పినాడట. ఆత్మ అన్ని జంతువులలోను ఉన్నది అని చెప్పేందుకు గాను జంతువులలో మగ, ఆడజంతువుల రెండింటిలో మీసాలుంచాడు. మనుషులలో కూడా ఆడ, మగ అని ఏ విధంగా

పోల్చుకోవాలి, శరీరములు అనుసరించా, వేషాలు అనుసరించా, ఎదమీద ఉన్న ముద్రలను అనుసరించా, ఎందుకంటే మగ, ఆడ వారిలో ఇద్దరికీ ఛాతిపైన ఎదలున్నాయి, వాటిపైన ప్రకృతి, పరమాత్మల గుర్తులు ఉన్నాయి. దానినే ఎదమీద తల్లితండ్రి గుర్తులున్నాయని మనం ఇంతకు ముందే చెప్పాము. కనుక ఆడ, మగవారిలో స్త్రీతత్త్వము మరియు పురుషతత్వము రెండూ వారి శరీరములలో ఉన్నాయి. కనుక జ్ఞానం కలిగి ఉంటే మీరంతా పురుషులౌతారు. జ్ఞానం లేకపోతే అందరూ స్త్రీలే అగుదురు. పూర్వం దీనినే స్త్రీలింగం, పులింగం అని జ్ఞానరీత్యా చెప్పుకునేవారు. అదే విధంగా నపుంషకలింగము అని కూడా చెప్పుకునేవారు.

అసలు విషయానికి వస్తే, ప్రపంచంలో ఎవరు దేవుడు? ఎవర్ని మొక్కాలి? అంటే బయట చాలా గుడులున్నాయి. చాలామంది దేవుళ్ళు ఉన్నారు. భగవద్గీతలో జ్ఞానరీత్యా చూస్తే మన శరీరాలలో రెండు ఆత్మల కంటే మూడవ ఆత్మ అయిన పురుషోత్తముడు ఒకడున్నాడు వాడే పరమాత్మ. పరమాత్మనే దేవుడుగా లెక్కించాలి. వాడినే మనం ఆరాధించాలి, గొప్పగా చూడాలి. దేవునిలోకి ఐక్యం అవ్వడానికి ప్రయత్నం చేయాలి. అయితే ఆత్మను కనుక్కోవటమే చాలాకష్టం అంటే మన శరీరంలో ఉండే మన ఆత్మనే తెలుసుకోలేకపోవుచున్నాము. మరి అతనికి పరంగా ఉన్న పరమాత్మను తెలుసుకోవటం చాలా కష్టం. మరి అటువంటి ఆత్మ వద్దకు ఏ విధంగా చేరాలి అంటే మొదట నిన్ను నువ్వెవరో తెలుసుకో (జీవాత్మగా తెలుసుకో). తర్వాత ఆత్మను తెలుసుకోవాలి. ఆ తరువాత రెండింటిపైన పరమాత్మను చేరేందుకు త్రోవ తెలుస్తుంది.

ఇప్పుడు చిన్న విషయాన్ని గూర్చి చర్చించుకుందాము. ఈ మధ్య యాత్రకు పోతున్న బస్ ప్రమాదానికి గురయింది. దానిలో చాలామంది చనిపోయారు. ఆ బస్‌లో ఒక పెద్ద దేవుని ఫోటో ఉంది. అది కూడా పగిలిపోయింది. మరి ఈ విధంగా భక్తులకు ఎందుకు జరిగిందంటే సమాధానం లేదు. మరి అసలైన దేవుడు ఎవరు? దీనిని తెలుసుకోవటమే జ్ఞానం అంటారు. జ్ఞానం ధర్మముల రూపంలో ఉంటుంది. దానిని తెలియగలిగితే బస్సు ప్రమాదము ఎందుకు జరిగిందో సమాధానం దొరుకుతుంది. కానీ వీటిని తెలుసుకోవాలంటే మాత్రం విధి విధానాలు ఉంటాయి. ఈ విధంగా ఈ విషయాలన్నీ తెలియటం కొరకు మన పెద్దలు పుస్తకరూపంలో వాటిని ఉంచారు కానీ దానిని సరిగ్గా మనం అర్థం చేసుకోలేదు. ముస్లీమ్‌లకు ఖురాన్ రూపంలో ఉంది. క్రైస్తవులకు బైబిల్ రూపములో ఉంది. హిందువులకు భగవద్గీత దూపంలో ఉంది కానీ ఎవ్వరికీ ఏదీ అర్థం కాకుండా పోయింది. ఇప్పుడు నన్ను ప్రశ్నించవచ్చు ఏమనంటే, నేను పుట్టి 30 సంవత్సరాలే అయింది. మరి మీరు జ్ఞానం అంతా గ్రంథాలరూపంలో ఎప్పుడో ఉంది అంటున్నారు కదా! మరి ఆ విషయాలన్నీ మాకెట్లు తెలుస్తుంది? అంటే నీవు పుట్టింది ఈ రోజు కాదు. గ్రంథాలు పుట్టక ముందునుండి ఉన్నావు, తరువాత కూడా ఉన్నావు. కానీ దానిపైన ధ్యాస లేనిదానివలన అలా జరిగింది. అయితే ముందు జన్మలో కొంత జ్ఞానం తెలుసుకున్ననూ ఇప్పుడు ఈ జన్మలో దానిని మరచిపోయామా అంటే అట్లా జరగదు. గత జన్మలో తెలుసుకుంటే ఆ జ్ఞానం (పరమాత్మ) మరలా జ్ఞప్తికి వస్తుంది. ఎన్ని జన్మలు మారినా జ్ఞానం నీ వెంటనే వస్తుంది. కావున కొన్ని జన్మలకైనా నీవు జ్ఞానిగా మారేందుకు అవకాశం ఉంటున్నది. ఇప్పుడు చూడండి పుట్టిన వెంటనే జ్ఞానులయ్యేవారున్నారు. పుట్టి 90

సంవత్సరాలైనా జ్ఞానులుగా మారనటువంటి వారిని కూడా మనం చూస్తున్నాము. అందుకే భగవద్గీతలో భగవంతుడు **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"** అన్నాడు. అంటే నీవు శ్రద్ధ ఎంత పెట్టుకుంటే అంత జ్ఞానం నీకు లభ్యమవుతుంది. కానీ మనిషి శ్రద్ధ దేనిపైన ఉన్నది? అనే దానికి పెద్దలు ఒక మాట చెప్పారు ఏమంటే **"కోటి విద్యలు కూటి కొరకే"** అని అన్నారు. మనిషి ఎన్ని విద్యలు నేర్చుకున్నా, ఆహారం సంపాదించటం కొరకు, బ్రతుకు తెరువు కొరకే ధ్యాస అంతా ఉంచి దేవునిపైన శ్రద్ధ లేనిదానివలన నీకు దైవ జ్ఞానము తెలియకుండా పోయింది. మరి అలాలేకపోతే బ్రతికేది ఎట్లాగ అంటే, దాని గురించి ఆలోచించాల్సిన అవసరంలేదు. నీవు పుట్టినప్పుడే నీ కర్మానుసారం నీవు ఎట్లా బ్రతకాలో నిర్ణయం జరిగిపోయింది. ఆ విధానం తెలియకపోవటం వలన, ధ్యాసంతా ధన సంపాదన మీద పెట్టడం వలన దేవుని మీద ధ్యాస లేకుండా పోయింది. మరి నీవు అతిగా కష్టపడటం వలన నీవు ధనికునిగా అవగలగుతున్నావా అంటే అదీ నీ కర్మలో ధనికునిగా అయ్యేకర్మ ఉంటే కష్టపడినా అలా అయ్యే అవకాశం ఉంటుంది కానీ కర్మలో నీవు ధనికునిగా అయ్యే కర్మ నీ ప్రారబ్ధకర్మలో లేకపోతే నీవు ఎంత కష్టపడినా ధనికునిగా అయ్యే అవకాశం లేదు. కానీ మనిషి పుట్టగానే అరుస్తాడు ఆకలికి. అప్పుడే మొదలవుతుంది ఆహారపు అవసరం. అక్కడ నుండి చనిపోయేంతవరకు దానికొరకే ప్రాకులాడటం జరుగుచున్నది. ఆకలి అనే పదమును తీసుకుంటే "కలి" అంటే నాశనం. "ఆకలి" ఎప్పటికీ నాశనం అయ్యేది (ఎప్పటికీ నాశనం అవుతూనే ఉంటుంది). అంటే ఎంత తినినా మరల కొంత సమయానికి మరల ఆకలి అవుతుంది. కనుక నాశనంలేనిదైన "ఆకలి" అనే దానిని దేవుడు మనిషికి పెట్టాడు. పోనీ మనిషి కడుపు నింపుకునేందుకు ఏదో ఒకటి తింటున్నాడా అంటే మరల

అందులో రుచులు కావాలి. కడుపు ఆకలికి చూస్తే, నాలుక రుచులు చూస్తుంది. రుచి తెలిసేది ఎక్కడ నాలుక మీద. కడుపులో ఆకలి ఉంటే నాలుకపైన రుచి ఉంది. నాలుక అనే గేట్ దాటితే కడుపులోకి వెళ్ళి ఆకలి తీరినా నాలుక మాత్రం ఇంకా రుచికొరకే ఎదురుచూస్తుంటుంది. దేవుడు ఇక్కడ మనిషికి ఏమి చేసాడంటే, వీడు జ్ఞానంలోకి పోతాడా? అజ్ఞానంలోకి పోతాడా? అని పరీక్షించేందుకు మనిషికి మాత్రం ఆకలితో పాటు రుచిని కూడా పెట్టాడు. నాలుకమీద మనకు చిన్నచిన్న బొడిపెలు పెట్టాడు. మూడువేల రుచిబొడిపెలున్నాయి మన నాలుక మీద. అవి రుచులను గ్రహిస్తాయి. రుచులమీద శ్రద్ధ ఉన్న వ్యక్తులకు ఆ రుచులమీదకే వారి మనస్సు పోతుంది. ఇంకొందరు రుచి అనేది ఉంది కానీ అది నాలుకవరకే కదా తరువాత ఆ ఆహారం పొట్టలోకి వెళ్ళిన తరువాత రుచితో సంబంధం ఉండదు కదా అనుకుంటారు. కానీ రుచికి అలవాటుపడిన వాడు మత్తును సేవించి పడిపోయిన వానికంటే, దురభ్యాసం కల్గిన వాడుగా మనం గుర్తించవచ్చును. అయితే కూటికొరకే కోటి విద్యలంటే కూటికొరకు మాత్రమే కాదు రుచికొరకు కూడా కాబట్టి, ఇంకొక కోటి రుచులు కొరకు నేర్చుతాను అంటాడు రుచులకు అలవాటుబడిన మనిషి.

ఈ విధంగా సుఖం కొరకు మనిషి ప్రాకులాడటం మొదలుపెట్టాడు. అందులో రుచికొరకు ప్రాకులాడేవారు కూడా ఉన్నారు. ఇంకా ఈ రుచి అనే దానిని అతిక్రమించిన వారు కూడా ఉన్నారు. ఆకలి దేనికొరకు ఉన్నది. ఆత్మ కొరకు ఉన్నది. ఆత్మ పోషక పదార్థాలన్నింటినీ గ్రహించుకుని శరీరాన్ని నడిపించేందుకు శక్తి అవసరం అనుకుంటారు. అటువంటి వారు **రుచులమీద ధ్యాసపెట్టుకోరు.** బల్లి, కప్ప, మొసలి వీటికీ నాలుకలు లేవు. రుచులు ఎంచుకునేది లేదు అవి ఆహారాన్ని నేరుగా మింగివేస్తాయి.

వాటికి రుచులు అవసరం లేదు. మనవుడు మాత్రం రుచికి అలవాటు పడిపోయి శ్రద్ధ దేవుని జ్ఞానం మీద పెట్టలేకపోతున్నాడు. అందువలన మన గ్రంథములలో ఉండే జ్ఞానం తెలియకుండా పోయింది. మనం ఆహారాన్ని ఎక్కువగా తింటున్న వ్యక్తిని పందితో పోల్చి, పందిలాగ తింటున్నాడు అని మనం ఉదహరిస్తుంటాం. దానికి కారణం ఏమిటంటే, పందులకు రుచి బొడిపులు 5500 నాలుక మీద ఉన్నాయట. పందులకు మనకు తెలియని రుచులు దానికి తెలుస్తాయట. అందుకే పంది దాని కడుపు ఆహారంతో నిండినా సరే రుచులకొరకు ఇంకా ఎప్పుడూ వెతుకులాడుతూనే ఉంటుంది. కనుక మనం ప్రపంచవరమైన విషయాలలో గానీ, శరీరసంబంధమైన విషయాలపైన శ్రద్ధను తగ్గించుకోవాలి. అందుకే మన పెద్దలు జ్ఞానేంద్రియముల పనుల యందు ధ్యాస ఉంచుకోకుండా నీ శరీరం లోపల ధ్యాసను పెంచుకోమన్నాము. జీవాత్మవైన నువ్వు, నిన్ను నడిపే ఆత్మను, మీ ఇద్దరినీ చూస్తున్న పరమాత్మను తెలుసుకునే నిమిత్తం త్రైత సిద్ధాంత జ్ఞానాన్ని మన శరీరాలలోనే ఉండేటట్లు దేవుడు శరీర నిర్మాణం చేసాడు. మనం ఎవరినైనా దండం (నమస్కారం) పెట్టాలంటే కాళ్ళకైనా మ్రొక్కుతాం లేదా తలనైనా మ్రొక్కుతాం. ఒకడు ఒక స్వామి వద్దకు వెళ్ళి అతని కాళ్ళకు మ్రొక్కినాడు, ఇంకొకడు తలకు మ్రొక్కినాడు మరియొకడు కాళ్ళకు, తలకి రెండింటికీ మ్రొక్కినాడు. ఇప్పుడు కాళ్ళకు మ్రొక్కడంలో అంతరార్థమేమంటే, కాళ్ళకు రెండింటికీ కలిపి పది వ్రేళ్ళు ఉన్నాయి. పది వ్రేళ్ళు ఐదు కర్మేంద్రియాలకు ఐదు జ్ఞానేంద్రియాలకు సంకేతంగా ఉన్నాయి. జీవాత్మ అనేవాడు కూడా ఉన్నాడు కానీ వాడు గొప్పజ్ఞానియైన జీవాత్మగా ఉన్నాడు కావున నీకు మ్రొక్కుతున్నాను అనే భావంతో మ్రొక్కుదురు. కాళ్ళు జీవాత్మకు గుర్తు అని, తల పరమాత్మకు గుర్తు అని తలకు మ్రొక్కువారు

కొందరు గలరు. ఈ విధంగా చెప్తున్నా ఆత్మ అనే దానిని మాత్రం అందరూ మరచిపోయారు. జీవాత్మ, పరమాత్మ అని అందరూ చెప్తున్నా మధ్యలో ఉన్న ఆత్మను మాత్రం ఎవ్వరూ తెలుసుకోవటం లేదు. అదియొకటి ఉన్నట్లు కూడా తెలియదు. మధ్యలో ఆత్మ ఉన్నది అని చెప్తున్న ఒకే ఒక సిద్ధాంతము త్రైతసిద్ధాంతము. ప్రతీపని నీ శరీరంలో జరగడానికి ఆ ఆత్మే కారణం అని చెప్తున్నాము. ఇప్పుడు ఒక ప్రశ్న ఒక వ్యకి అడిగాడు అనుకుందాం, అది ఏమంటే జ్ఞానంతో కూడుకున్న పనులు చేస్తున్నాను, కానీ కొన్ని పనులు అజ్ఞానంతో చేయాల్సిన పని వస్తున్నది దానికి కారణం ఏమిటి? అని అడిగాడు అనుకుందాం. అప్పుడు దానికి సమాధానం ఏమంటే పాపపు పనులు నీ శరీరం ద్వారా జరిగినా. పుణ్యపు పనులు నీ శరీరం ద్వారా జరిగినా రెండింటినీ నీ ఆత్మే చేయిస్తున్నది. ఉదాహరణకు శరీరంలో ఒక రోగమొచ్చింది అది తగ్గేందుకు మందును వాడుచున్నాము. కానీ ఇంకా మంచి మందు అది తగ్గేందుకు ఉందా అంటే, అప్పుడు జ్ఞానం తెలిసిన వ్యక్తి ఏమి చెప్తున్నాడంటే, శరీరంలో అధిపతి ఒకడున్నాడు. నీవు ఆ రోగం తగ్గేందుకు మందు వాడినా లోపలున్న అధిపతియైన ఆత్మ ఒప్పుకుంటేనే తగ్గేది లేకపోతే నీవు మందులు వాడినా తగ్గే అవకాశం లేదు. లోపలున్న ఆ ఆత్మనే నీవు వేడుకుంటే ఆ జబ్బుతగ్గే అవకాశం ఉంది. లేకపోతే నీవు తప్పక అనుభవించాల్సిందే అయితే నీ లోపలున్న ఆత్మ ఒప్పుకోకపోవటం వలన ఆ బాధను అనుభవించాల్సిందే.

ఇప్పుడు మరి ఆత్మే పాప, పుణ్య కర్మలను చేయిస్తున్నప్పుడు వాటి ఫలితాలైన పాప, పుణ్యాలు మనిషికి ఎందుకు వస్తున్నాయి? అని ప్రశ్నించుకుంటే, ఆత్మ చేస్తున్నది అని తెలుసుకొని ఊరక ఉంటే ఆ పనులు జరిగినా ఆ పాపపుణ్యాలు నీకు అంటవు. అలా కాకుండా చేస్తున్న పనులన్నీ

నేనే చేస్తున్నాను అని ఎవరైతే అనుకుంటారో వారికి పాప, పుణ్యాలు వస్తున్నాయి, దానిని అనుభవించాల్సిన పని కొరకు మరల మరల జన్మించాల్సిన పని వస్తున్నది. లోపలున్న ఆత్మ ఏపని చేసినా పాప, పుణ్యాలు వాడికి మాత్రం అంటవు. శరీరంలో ముగ్గురున్నారు. పని చేసినవాడు ఒకడున్నాడు, పని చేయనివారు ఇద్దరున్నారు. ఏ పనీ చేయని వారు జీవాత్మ, పరమాత్మ, పనులన్నింటినీ చేసినవారు మాత్రం ఒక్కరే ఆత్మయే. అలా అయితే పని చేయని వారైన జీవాత్మ, పరమాత్మ ఒక్కటే అని అనుకోవద్దండి. జీవాత్మ ఎప్పటికీ చిన్నవాడే. తక్కెడ ఎప్పుడూ ఒకలా ఉండదు. ఒక ప్రక్క తక్కువ, రెండవ ప్రక్క ఎక్కువగా త్రాసులు ఉంటాయి. అదే విధంగా జీవాత్మ, పరమాత్మలు ఉన్నవని గుర్తుంచుకోవలెను. ఎంత జ్ఞానం తెలుసుకున్నా మనుషులు కర్మలను నిరోధించుకోలేకున్నారు. సిగ్గు అనే పదాన్ని తీసుకుంటే దానర్థం ఆటంకం అని అర్థం. అన్నం తినేటప్పుడు సిగ్గులేకుండా తిను అంటారు. ఆటంకం లేకుండా తిను అని దాని అర్థం. అందుకే ఒక తెలిసిన వ్యక్తి ఏమన్నాడంటే "నాకు సిగ్గులేదు నీకు మానం లేదు". అన్నాడట. ఇది ఒక ఊతపదంగా వాడినా సరే అసలైన అర్థం ఏమంటే, జీవాత్మగా ఉన్న నేను ఏ పని జరుగుచున్నా దాని కర్మను నేను నిరోధించుకోలేకపోతున్నాను కనుక నాకు సిగ్గులేదు, నీకు మాత్రం గౌరవం లేదు, మానము లేదు. నీవు ఎవరికీ తెలియవు కనుక నిన్ను ఎవరు గౌరవించరు. అన్నింటికీ అతీతంగా ఉన్నవాడివి అని అత్మను ఉద్దేశించి అన్నమాటలివి. ఆత్మకు ఏమీ అంటదు కనుక ఆ మాట ఆత్మకు సరిపోయింది. అందుకే మేము ఆదివారం మాంసం తినవద్దండి అని చెప్తే సిగ్గు (ఆటంకం) లేకుండా, నిరోధించకుండా తింటున్నారు కనుక ఇప్పటినుండైనా ఒక హద్దును ఏర్పరుచుకుని అంటే, దేవుడు అనే హద్దు ఏర్పరచుకుని, దేవతలయందు భయం కాకుండా,

దేవునియందు భయంపెట్టుకుని, నీ లోపలున్న ఆత్మయందే భయపడి, జ్ఞానరీత్యా ఏమి చెప్పినారో దాని రీత్యా నడచుకునేందుకు ప్రయత్నం చేయాలి. అలా కాకుండా మనం సిగ్గులేకుండా ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తే ఏమవుతుంది? నీవు ఈజన్మలో చేసుకున్నదాంతా (పాప, పుణ్యాలు) మరు జన్మలో అనుభవించాల్సిన పని వస్తుంది. అప్పుడు ఒక రోగం వచ్చిందనుకో, ఈ రోగం ఏ కర్మ చేయటం వలన వచ్చిందో తెలియక, ప్రక్క వానితో పోల్చుకుని నేనేమి తప్పుచేసానని ఈ శిక్షనాకు. వాడెన్ని తప్పుడు పనులు చేస్తున్నాడు, వాడికి ఏ రోగమూ రాలేదు, నేను మంచిగా ఉన్నాను, కానీ నాకు ఈ రోగం వచ్చింది. దేవుని దగ్గర న్యాయంలేదు, నీతిలేదు అంటారు. దేవుడెప్పుడైనా నీతి, న్యాయం తనదగ్గర ఉన్నాయని చెప్పినాడా? జ్ఞానం, ధర్మం ఉన్నాయని చెప్పినాడు. నీవు చేసుకున్నావు, నీవు అనుభవిస్తున్నావు.

కోర్టులో ఒక ముద్దాయి జడ్జి పిలవగానే పలుకుతున్నాడు. ప్రతీవాయిదాకు వెళ్తున్నాడు. కానీ చివరిలో ఆ జడ్జి అతనికి ఎనిమిది సంవత్సరాల క్రితం చేసిన పనికి (తప్పుకు) శిక్ష ఈ రోజు విధించాడు అనుకుందాం. అప్పుడు ప్రతీవాయిదాకు క్రమం తప్పకుండా వెళ్ళినాడు, జడ్జి పిలవగనే పలికినాడు ఎంత మంచివాడు, అతనికి ఆ జడ్జి శిక్ష వేసినాడు అంటే ఎట్లా అగును. ఎనిమిది సంవత్సరాల క్రితం చేసిన తప్పుకు ఈ రోజు శిక్ష అనుభవిస్తున్నట్లు, గత జన్మలో చేసిన పాపానికి శిక్ష ఈ జన్మలో అనుభవించాల్సిన పని వచ్చింది. అంతే గానీ దేవుని దగ్గర న్యాయంలేదు అంటే ఎలా? ఆయన దగ్గర న్యాయం ఎట్లాగూ లేదు, నీ దగ్గర మాత్రం దైవజ్ఞానం ఎంత ఉందో చూసుకో. బ్రహ్మంగారు తన కాలజ్ఞానంలో ఆనందనామ సంవత్సరంలో జ్ఞానం లేని వ్యక్తులలో కొన్ని శక్తులు విజృంభించి వారిలో క్రొత్తరోగాలు వచ్చేటట్లు చేసి జనసంఖ్య తగ్గిపోయేటట్లు

చేస్తాయి అన్నారు. ఇప్పుడు నిజంగా అదే జరిగింది. ఈ సంవత్సరం ఏ హాస్పిటల్ ఖాళీ లేకుండా రోగులతో నిండిపోయాయి. ఇవన్నీ మనుషులలో జ్ఞానంలేకుండా పోవటం వలన ఈ విధంగా జరుగుచున్నాయి. కనుక జ్ఞానులుమాత్రమే మిగులుతారు. అజ్ఞానులు అంతా మరణిస్తారు అని చెప్పారు బ్రహ్మంగారు. పోనీ ఆ భయమైనా పెట్టుకుని దైవజ్ఞానం తెలుసుకుని, స్త్రీలైనా, నపుంసకులైనా పులింగాలుగా మారాలని, మారుతారని ఆశిస్తూ ముగిస్తున్నాం.

## ౬౦. దేశం మోసం - దేహం మోహం

తేది : 28-11-2012

లింగము అనే పదాన్ని తీసుకుంటే లి+అంగము అని విడదీయ వచ్చును. "లి" అంటే నిక్షిప్తమయినటువంటిది, లీనమైనటువంటిది. శరీరములో లీనమైనటువంటిది. అంగము అంటే శరీరము. శరీరములో లీనమైనటువంటిది లింగము. అది ఏది అంటే ఆత్మ అని అర్థం. శరీరమంతా ఆత్మ వ్యాపించి ఉన్ననూ కనిపించకుండా ఉన్నది. ఆత్మకంటే అధిపతిగా ఇంకొకటి ఉన్నది అని చెప్పేందుకు లింగము అనే పదానికి ముందు ఈశ్వర అని చేర్చితే ఈశ్వరలింగము అగును. దానినే పరమాత్మ అని అనవచ్చును. జ్ఞానాన్ని అంతటినీ సూక్ష్మంగానే అర్థం చేసుకోవాలి గానీ స్థూలంగా అర్థం చేసుకోరాదు.

భగవద్గీత, బైబిల్, ఖురాన్ అనే మూడు దైవగ్రంథములలో కూడా జ్ఞానము సూక్ష్మంగానే ఉంటుంది. మూడు భాగములు సూక్ష్మంగా ఉంటే ఒక్క భాగం మాత్రమే స్థూలంగా ఉంటుంది. ఆ విధంగా సూక్ష్మంగా కనిపించే

www.thraithashakam.org

మూడు భాగములలో స్థూలంగా నీవు జ్ఞానాన్ని వెతికితే అందులో ఉన్న అసలైన జ్ఞానం అర్థం కాదు. ఇప్పుడు భగవద్గీత అనే గ్రంథం గురించి చర్చిస్తే, భగవద్గీత దైవజ్ఞానం సంపూర్ణంగా ఉన్న గొప్ప గ్రంథం. అది 5,000 సంవత్సరాల క్రితం గ్రంథంగా వ్రాయబడింది అని మనం తెలుసుకున్నాం. ఇది 5,000 సంవత్సరాల పూర్వం వ్రాయబడిన గ్రంథమా లేక అంతకు ముందే ఉన్నదా అని అంటే ప్రపంచం పుట్టినప్పుడే ఇది ఉంది. కానీ ఆ విషయం మనం మరచిపోవటం వలన మరల చెప్పాల్సిన పనిబడింది. ఆ విధంగా భగవద్గీత అనే పేరుతో 5,000 సంవత్సరాల పూర్వం వ్రాయబడివుంది. అటువంటి గ్రంథాన్ని సరైన మార్గంలో అర్థం చేసుకోకపోతే పీఠాధిపతియైనా, మఠాధిపతి అయినా ప్రక్క త్రోవలోకి పోతాడు. తప్పు త్రోవలోకి పెద్దలు పోవుదురు అనేదానికి నిరూపణ ఏమి అంటే ఈ పౌర్ణమికి, దీపాలుపెట్టాలి కార్తీక పౌర్ణమికి, హైదరాబాద్‌లో అష్టలక్ష్మిగుడిలో దీపాలుపెడుతుంటే చీరకు నిప్పు అంటుకొని నిలువునా ఒకామె కాలిపోయింది. గుడిలోనే, దీపారాధన సమయంలోనే చీరకు నిప్పు అంటుకుని కాలిపోతుంటే మనుషులు ఎలాగూ ఏమీ చేయలేకపోయినారు. గుడిలో దేవత కూడా ఏమీ చేయలేక పోయింది. మేము ఇప్పుడు నాస్తికత్వం గూర్చి చెప్తున్నాం అని మీరు పొరపాటు పడవద్దండి. భక్తికి మీరు వ్యతిరేఖంగా చెప్తున్నారే అని మీరు అనుకోవచ్చు గానీ, నేను భక్తికి వ్యతిరేఖంగా చెప్పటం లేదు భగవద్గీతను అనుసరించి చెప్తున్నాను. భగవద్గీతలో ఎక్కడైనా దీపారాధన చేయమని చెప్పినాడా? లేదు. మరి మీరంతా ఎందుకు చేస్తున్నారు? అజ్ఞానంతో చేస్తున్నారు. ఈ భగవద్గీతను చదివితే సరైన మార్గంలోకి జనాలు వెళ్తారేమోనని, భగవద్గీతను ఇంట్లో పెట్టవద్దు, ఏటిలో పారవేయండి అని కొందరు చెప్పినారు. లేకపోతే గుడిలో ఎక్కడైనా పెట్టేయండి ఇంట్లో ఉంటే

కొట్లాటలు వస్తాయని చెప్పినారు. ఈ విధముగా భయపెట్టినారు. ఈ రోజు 70టన్నుల నెయ్యిని దీపారాధనకు వినియోగిస్తున్నారు. మొత్తం లక్షదీపాలు పెట్టారు. పెద్దస్వామీజీ సమక్షంలో జరిపినారట. అంత నెయ్యి కాలిపోయి వృథా అయింది. అదే నెయ్యిని ఒక జిల్లా అంతటా పంచితే ఒక నెలరోజులు హాయిగా తింటారు. ఇక్కడ భక్తి అనే దానిని అడ్డం పెట్టుకుని అనవసరపు పనులు చేస్తున్నారు. ఎవరు ఇదంతా చేయించారు, పెద్ద స్వామీజీలు కాదా! మరి వారికి ఈ విషయాలు తెలియవా? అని మీరు ప్రశ్నిస్తే భగవద్గీత ప్రకారం ఏ మాత్రము వారికి దైవజ్ఞానం తెలియదు అని చెప్పవచ్చును. వారిని పూర్తి అజ్ఞానులు అనే చెప్పాలి. భగవద్గీతలో ఇతర దేవతలను ఆరాధించమని ఉందా? లేదు. కానీ మరి మనం ఎందుకు దేవతలను పూజిస్తున్నాం? ముస్లీమ్‌లు ఉన్నారు, క్రైస్తవులు ఉన్నారు. వారివారి పండుగలలో వీరు మసీదులలోను, వారు చర్చిలలోనూ ప్రార్థన చేసి వస్తారు. ఎవ్వరికీ ఏ ప్రమాదము ఉండదు. కానీ మనం పండుగ చేస్తాము, ఎందరో ప్రమాదానికి గురవుతున్నారు, చనిపోతున్నారు. వినాయకచవితిలో ఎంత మంది చనిపోవటం లేదు. ఇది మూర్ఖపు పద్ధతి కాదా చెప్పండి. ఇటువంటి భక్తిని భగవద్గీతలో "తామస భక్తి" అని తేల్చి చెప్పటం జరిగింది. ఈ భక్తి నన్ను చేరేందుకు పనికిరాదు అని చెప్పటం జరిగింది. ఇటువంటి పనులు చేసినవారిని చిన్న అయినా, పెద్ద అయినా, ఏమీ తెలియనివారే అనే అనవలెను. భగవద్గీత ఎంత పెద్దవాడినైనా తూకము వేసి చెప్పగలదు. భగవద్గీతలో స్వచ్ఛమైన జ్ఞానం తెలుస్తూ ఉంది. మరింత అజ్ఞానంతో ఇన్ని దీపాలు వెలిగిస్తున్నారంటే వారికి జ్ఞానం తెలిస్తే వారు అటువంటి పనులు చేయరు. భగవద్గీత అనేది వీరంతా చేస్తున్న పనులకు అతిక్రమించి చెప్పింది.

కొందరేమంటున్నారంటే పురాణాలలో చెప్పారు, వేదాలలో చెప్పారు ఇట్లా చేయమని. అంటే, ఈ వేదాలకు పురాణాలకు అతిక్రమించిన జ్ఞానం భగవద్గీతలో ఉంది. వేదాల వలన నీకు దేవుడు తెలియబడడు అని చెప్పింది. విశ్వరూప సందర్శన యోగం అనే అధ్యాయంలో 48, 53, శోకాలలో యజ్ఞాలవలన గానీ, వేదాలవలన గానీ, దానముల వలన గానీ, తపస్సుల వలనగానీ నీకు ఏమీ ప్రయోజనం లేదు. అసలైన భగవద్గీతా జ్ఞానాన్ని తెలుసుకుంటే ఇలాంటి కష్టమైన విధానాల నుండి తప్పించుకోవచ్చును. మీరు దేవుని మార్గంలోకి వెళ్ళాలనుకొని భగవద్గీతా జ్ఞానాన్ని కాకుండా ఏదో స్వామీజీల వద్దకు వెళ్తే, నీకు లాభం వస్తుంది అని చెప్పి, లక్షదీపాలు పెట్టు, సకల భోగాలు సిద్ధిస్తాయి అని ప్రలోభ పెడితే అందరూ అటే పోతున్నారు. సుఖాలు కష్టాలు అనేవి నీవు గతజన్మలలో చేసుకున్న కర్మల వలన వస్తాయి అని భగవద్గీత చెప్తున్నది. ఇప్పుడు పూజలు, వ్రతములు చేయటం వలన అవి పోవు. ఏమి జరగాలో అవి జరిగితీరుతాయి అని భగవద్గీత చెప్తూ ఉంటే పెద్ద స్వామీజీలు అందరూ దీనికి వ్యతిరేఖంగా చెప్తున్నారంటే అర్థం ఏమిటి? వీరంతా మిమ్మల్ని మోసం చేస్తున్నారు అని అర్థం. వేషం వేసుకుని మోసం చేస్తున్నారు. వీరిని మోసం చేసేవారు అని అనకపోతే ఇంకేం అనాలి. దీపావళి పండుగ అని పెట్టారు. దానివలన డబ్బుఖర్చు, ధ్వనికాలుష్యం, చిన్నపిల్లలు ఆ భయంకరమైన శబ్దాలకు ఉలిక్కిపడి లేస్తున్నారు. మరి అంత కష్టంతో టపాకాయల పెట్టుకుని దీపావళి పండుగ అని కాలుస్తున్నాం. దానివలన చిన్న పిల్లలకు, కొందరి పెద్దలకు కళ్ళుపోయినాయి. ఈ విధంగా ప్రేరేపించినది ఎవరు? అంటే మనల్ని నడిపించే పెద్దలు. ఈ పనులు వద్దు అంటే మేము చెడ్డగా కనిపిస్తాము ఇలాంటి పనులు చేయటం వలన ఇతర మతముల ముందర చిన్నచూపు

అవుతుంది. దీపావళి రోజున నీ కన్ను కాలిపోతే వారు అనుకుంటారు మీ దేవుడు ఏమి చేస్తున్నాడని. ఈ విధంగా అనర్థమైన పనులు చేసుకోవటం కంటే జ్ఞానం ప్రకారం నడుచుకుంటే మంచిదవుతుంది. మీలో ఎవరైనా తప్పుద్రోవలో నడుస్తుంటే చెప్పండి ఇది మంచి పద్దతి కాదు అని చెప్పండి.

ముస్లీమ్‌లలో ఒక పద్ధతి ఉంది. ముస్లీమ్‌లలో వారిలో ఎవరైనా సక్రమంగా నడచుకోకపోతే ఇది పద్ధతి కాదు. ఈ విధంగా నీవు చేసుకోకూడదు అని ఒకసారే చెప్తారు. వినకపోతే వాడిని వదలివేస్తారు. అంతేగానీ రెండవసారి మరి చెప్పరు. ఒక్కసారే చెప్పాలి అనేది వారి పద్ధతి. కానీ మనలో స్వామీజీలు ఇది పద్ధతి అని చెప్పి, నానా తిప్పలు పడి మనల్ని చిక్కుల్లో పెట్టి మోసం చేస్తుంటే దీనినుండి బయటపడటం మంచిది అని తప్పిచుకోవటం కొరకు చెప్పటం మంచిది. వినకపోతే వదిలివేయండి. వివరంగా చెప్పండి వినగలిగితే, ఈ విధంగా చేస్తే, ఒకరికి జ్ఞానాన్ని అందించినట్లవుతుంది, లేకపోతే సమాజాన్ని ఉద్ధరించినట్లు కాదు. జ్ఞాన విధానంలో ఉద్ధరిస్తే మంచిపని అవుతుంది.

ఈ విధంగా శరీరమంతా వ్యాపించి ఉన్నది లింగము. శరీరము తలనుండి కాలు వరకు ఉంది. ఆ శరీరంలో లీనమై ఉండే దానిని లింగము అంటాము. లింగము లేకుండా పోతే ఏమవుతుంది అంగము ఒక్కటే మిగులును. అనగా మృత శరీరం మాత్రమే మిగులుతుంది. దానిని చనిపోయిన శరీరం అంటాం, అప్పుడు ఆ శరీరంలో ఆత్మ ఉండదు. ఆత్మ అనే పదాన్ని చాలామంది వాడుకుంటున్నారు. కానీ ఫలానాఉంది అని తెలియదు. జీవుడు దేవుడు ఇద్దరున్నారు అని తెలుసుగానీ మధ్యలో ఆత్మ ఉన్నది అని మాత్రం తెలియదు. దేవుడు అంటే అణువణువుగా వ్యాపించినవాడు, శరీరం లోపలా ఉన్నాడు, శరీరం బయటా ఉన్నాడు.

www.thraithashakam.org

జీవుడు అంటే ఒకేచోట శరీరంలో ఉండేటటువంటివాడు. శరీరమంతా ఉండేవాడు లింగము (ఆత్మ). ఇప్పుడు మనం చెప్పే బోధ దేనిపైన ఆధారపడి ఉంది, ఆత్మ అనే దానిపైనే ఆధారపడి ఉంది. ప్రపంచంలో ఈ విషయాన్ని తీసుకోవటం లేదు. ఆత్మ అనే పదాన్ని అందరూ వాడుకుంటున్నారు కానీ, అది ఉందనికానీ, ఎట్లా ఉందని కానీ తెలియదు. ఆత్మ అనే పదాన్ని వాడితే ఇటు జీవాత్మకైనా వాడుచున్నారు అటు పరమాత్మకైనా వాడుచున్నారు. అటు ఇటు కాకుండా ఒక ఆత్మ ఉంది. అన్నింటినీ నడిపిస్తూ ఉంది అని మనం అనుకోవటం లేదు. ఆత్మను బట్టే ఆరోగ్యం అనారోగ్యాలు ఉంటాయి. నీవు నవ్వాలి, ఏడ్వాలి అంటే ఆ విధంగా చేసిందెవరు అంటే ఆత్మయే. ఆత్మ అనుకుంటే రోగం లోపలకు రాగలదు, ఆత్మ అనుకుంటే రోగం బయటకు పోగలదు. నందన నామ సంవత్సరంలో (2012) చాలా రోగాలు బయటపడతాయి అని కాలజ్ఞానంలో బ్రహ్మగారు వ్రాసారు. మేము కూడా అట్లే జరుగుతుంది అని అనుకున్నాము. అలాగే ఈ సంవత్సరం చాలా రోగాలు విజృంభించాయి. అవి ఏ రోగమో అర్థం కాకుండా వస్తున్నవి. ఎవరి ఆధీనం నుండి ఈ వ్యాధులు వస్తున్నాయి? ఆత్మ ఆధీనం నుండి వస్తున్నవి. ఒక ఔషధం తీసుకుంటే ఆ ఔషధం పనిచేసేటట్లు చేసేది ఆత్మయే. ఆత్మ అనుకుంటే ఆ ఔషధం పనిచేయకుండా చేయగలదు. ఒకే రకమైన మందును నలుగురికి ఇస్తే ఒకరికి ఒకే రోజులో రోగము తగ్గుతుంది. ఇంకొకరికి 5 రోజులలో తగ్గుతుంది. ఇంకొకరికి నెలరోజులు వరకు పోదు. వీడికి ఒకరోజులో ఆ రోగం తగ్గటమేమి? ఇంకొకరికి నెల రోజులైనా తగ్గకపోవటానికి కారణం ఏమి? అని అంటే ఈ శరీరంలో కర్మ ఎంత అనుభవించాలో దానినే ఆత్మ అనుభవింప జేస్తుంది. ఎందుకంటే నీ కర్మలో ఎంత అనుభవించాలని ఉంటే అంతా అనుభవించవలసిందే.

ఎంత బాధపడాలో అంత బాధపడాలి. నేనేమి తప్పుచేసాను అంటే నువ్వేమీ ఇప్పుడు తప్పు చేయలేదు.  ఇంతకు ముందు జన్మలలో చేశావేమో. దేవుడు కనిపిస్తే కొడతాను అనేవారున్నారు. ఇవన్నీ తప్పులేకదా! ఆత్మ అన్నీ చూస్తుంటుంది కదా! ఇంతకు ముందు జన్మలలో నీతో ఉండేది ఆ ఆత్మయే. ఇప్పుడు ఈ జన్మలో ఉండేది కూడా ఈ ఆత్మయే. కనుక నీవు చేసినవన్నీ అది నమోదు చేస్తున్నది. ఖురాన్ గ్రంథంలో ఈ విషయాన్నే "నీ సహచరుడు అన్నిటినీ లిఖించు కుంటున్నాడు" అంటే నీలో ఉండే ఆత్మ అన్ని పనులను వ్రాసిపెట్టుకుంటూ ఉన్నది. ఆ గ్రంథంలో సహచరుడు అన్నారు. మనం ఆత్మ అంటున్నాము. కొంత భాషలో తేడా కనిపిస్తున్నది సహచరుడు అంటే నీతోపాటు ఉండేవాడు అని అర్థం. బైబిల్‌లో ఏమి చెప్పాడు? నీ పొరుగువాడు అని చెప్పాడు. ఈ విధంగా నీ ఆత్మ అన్నీ చేస్తుంటే ఆ పనులలో సుఖ దుఃఖాలను మాత్రం నీవు అనుభవిస్తున్నావు. ఇప్పుడు నిన్ను, నీ ఆత్మను, సాక్షి పరమాత్మ. అతను రూప, నామ, క్రియా రహితుడు. జీవుడువైన నీవు ఈ విధంగా కర్మానుసారము ఆత్మ చేత నడిపింపబడుచున్నావు.  నాది, నా వారు అనే మోహగుణంలో పడిపోయి అజ్ఞానంలో ఉండిపోతున్నాడు. అందుకే ఒక మాట ఉంది అదేమంటే "దేశం మోసం–దేహం మోహం". ఎప్పుడైతే ఈ శరీరంలోకి వచ్చావో అప్పుడే మోహగుణం మొదలగునవి తగులుకుంటున్నాయి. ఎందుకంటే ఆ గుణాలు నీ తలలోనే ఉన్నవి. మరి ఆ గుణాలనే మాయ నుండి తప్పించుకోవాలంటే ఏమి చెయ్యాలి? నీ లోపలుండే ఆత్మను వేడుకుంటే,  అది ఒప్పుకుంటే నీ లోపలుండే గుణములవలన కలిగిన బాధలు పోతాయి. ఏమని వేడుకోవాలి? నేనేదో తప్పు చేసాను అందుకు ఇప్పుడు శిక్షను అనుభవిస్తున్నాను. ఈ శిక్షను తప్పిపోయే ఏర్పాటు చేయండి, నేను ఇప్పటి నుండి జ్ఞానమార్గంలోనే

www.thraithashakam.org

నడిచెదను, అజ్ఞాన మార్గంలో నడవను. నా ధ్యాసంతా ఆత్మయైన నీ మీదే ఉంటుంది. నేనేమీ చేసేవాడిని కాను. నీవు అనుకుంటే ఈ రోగం పోతుంది. లేకపోతే లేదు. నన్ను సక్రమమైన జ్ఞానమార్గంలో నడిచే శక్తిని ఇవ్వవలెను అని వేడుకుంటే, నీ కర్మలను కాల్చివేసి, నిన్ను ఆ రోగాల బారినుండి విడిపించే బాధ్యత ఆత్మదే. నా వద్దకు ఒక వ్యక్తి వచ్చినాడు. ఆయన, నేను జ్ఞానము ప్రకారం సక్రమమైన మార్గంలో నడుస్తున్నానండి అయిననూ నాకు చాలా రోగాలు వస్తున్నాయి, కష్టాలు వస్తున్నాయి అని అన్నాడు. అయితే నేను అన్నాను ఈ మధ్య కొత్త గ్రంథాలు వ్రాసినాము "త్రైతసిద్ధాంతము" అని దాని పేరు, ఆ గ్రంథం తీసుకున్నావా, చదివావా అంటే తీసుకోలేదట, చదవలేదట చూడండి ఎట్లాగుందో. గ్రంథం నెలరోజులముందే బయటకు వస్తే, నెల అయినా నీవు ఆ గ్రంథం చదవలేదంటే నీది సక్రమమైన మార్గం ఎట్లా అవుతుంది? అంటే లోపలుండే ఆత్మను కూడా మోసం చేస్తారు. నీవు సక్రమమైన మార్గంలో లేకపోవటం వలనే నీకు రోగం వచ్చింది. నీవు బయట ఎవరికైనా మోసం చేయవచ్చు. లోపల ఆత్మకు మోసం చేయటం కుదరదు. అది నీకు కాపలా ఉండేదది. నీవు మోసం చేయుటకు కుదరదు. నీవు సక్రమంగా లేవని చెప్పుకో, ఒప్పుకో అప్పుడు ఆ రోగం పోతుంది. కనుక నువ్వు ఆత్మకే చెప్పుకో. నేనేమీ చేయను. నేను ఉపాయం చెప్పేవాడినే, మార్గం చెప్పేవాడినే. ఒకవేళ ఆ రోగం పోయేందుకు మందు వేసుకున్నా అది చూపాకారానికి వేసుకున్నదే. లోపల ఆత్మ ఆ మందును ఒప్పుకుంటే తద్వారా రోగం పోయే అవకాశం ఉంది. నాకు షుగర్ శాతం ఎప్పుడూ 250-300 పాయింట్లు పైనే ఉంటుంది. కానీ నేను ఎప్పుడూ పథ్యం పాటించలేదు. చప్పటి కాఫీ తాగాలి, వరి అన్నం తినకూడదు, అరటిపండు తినకూడదు అలాంటివి ఏవీ నేను పాటించలేదు. ఎందుకని

అంటే లోపలున్నవాడు ఏమి చేయాలన్నా చేయగలడు అనే నమ్మకం మాకు ఉన్నది. షుగర్ లెవల్స్ పెరిగిన ఒక వ్యక్తిని ఒక సంవత్సరంలో చంపివేసాడు లోపలున్నవాడు. ఒక వ్యక్తి నేను జ్ఞానమార్గంలో ఉండాలనుకున్నాను, నా రోగాన్ని తగ్గించు అని వేడుకుంటే మందు వేయక పోయినా తగ్గిపోయింది. అలా కాకుండా జ్ఞానం ఎంతో కొంత తెలుసుకున్న తరువాత నాకు చాలా జ్ఞానం వచ్చింది. సంపూర్ణజ్ఞానిని అని నీవు అహంతో అనుకుంటే మళ్ళీ నిన్ను ప్రక్కకు పంపిస్తుంది లోపలున్న ఆత్మ. అన్నింటికీ మూలకారణం ఆత్మ. దానినే మనం లింగము అంటాము. లింగము అంటే బయట అర్థాలకు వెళ్ళకండి. అంగమలో లీనమైనటువంటిది లింగము. ఈ శరీరం నుండి ఆత్మ జీవాత్మ వెళ్ళిపోతే ఏమవుతుంది ఉత్త శరీరం మిగిలిపోతుంది. ఉత్త అంగమే అది లింగము కాదు. ఈ లింగము అనేది సూక్ష్మంగా ఉంటుంది. సూక్ష్మంగా అంటే ఏమైనా చేస్తూ ఉంటుంది.

నేను ఏ రోజూ వ్యాయామం లాంటివి చేయను. వ్యాయామం చేస్తున్నాను అంటే నా శరీరాన్ని కాపాడుకోవాలని నా ఉద్దేశ్యం. నేను కూడా కాపాడుకోగలను అని అనుకుంటే వ్యాయమం చేయాలి. ఈ శరీరమంతటికీ అధిపతి ఒకడున్నాడు అని మరచిపోయి, నా శరీరాన్ని నేనే చక్కబెట్టుకుంటాను అని నేను అనుకుంటే తప్పు. కానీ, నేను ఏమనుకుంటున్నానంటే, లోపల శరీరంలో ఒక పెద్ద ఉన్నాడు వాడు ఈ శరీరాన్ని చూసుకుంటాడు, ఇబ్బంది పెట్టేవాడూ వాడే, సంతోషపెట్టేవాడూ వాడే. కాబట్టి నాకు షుగర్ వ్యాధి ఉంది ఉంటే ఉండనీ మనికి లోపల ఆత్మ ఇబ్బంది పెడుతూఉంటే ఆత్మనే అడగాలి. కానీ ఆత్మ నన్ను ఏ మాత్రం ఇబ్బంది పెట్టదు. నేను ఆత్మను అడగనూ అడగను. ఇదేంటి ఆత్మను అడగండి అని మీరు చెప్పారు కదా! అంటే అదొక కారణం కానీ మీరు

మాత్రం అడిగి తీరాల్సిందే. మీ శరీరాల నుండి మీ ఆత్మలను అడిగి తీరాల్సిందే, మీ శరీరాలలో ఉండే ఆత్మ మిమ్మల్ని ఏమైనా చేస్తుంది కాబట్టి మీరు దానిని ధ్యాసలో పెట్టుకుని ఏ పని చేస్తున్నా నేను చేయలేదు నా కాళ్ళను, చేయిని కదల్చుచున్నది నువ్వే. శరీరంలో ప్రతీ భాగంలో లీనమై ఉండి నడిపించేది నువ్వే అని ఎప్పుడైతే అనుకుంటావో, అప్పుడు నీకు ఆత్మ గురించి తెలిసినట్లే. అప్పుడు నీవు వేడుకున్నా ఆత్మకు తెలుస్తుంది అది సక్రమమైన మార్గము. లోపలున్న ఆత్మ ధ్యాస లేకుండా బయట పూజలు చేస్తే కష్ట సుఖాలు, పాప పుణ్యాలు తప్ప ఏమీ రావు.

ఒక స్వామీజీ వారం పదిరోజులు భగవద్గీతను ఈ అధ్యాయం, ఆ అధ్యాయం అని బ్రహ్మాండంగా బోధించినారు. శ్లోకాలన్నీ విడదీసి విడమర్చి చెప్పినాడు. అప్పుడు అతని మాటల్లోనే దేవతలకంటే దేవుడే గొప్పవాడు అని ఉంది. భగవద్గీత ఉపన్యాసం అంతా అయిపోయాక మళ్ళీ అదెక్కడో ఒక దేవతకు మంగళహారతి ఇవ్వాలి అని చెప్పి గబగబా వెళ్ళాడు. దేవుడు తప్ప ఎవ్వరూ గొప్పకారని చెప్పినటువంటివాడే భాగ్యలక్ష్మి గుడిలో పూజకు పోతే భగవద్గీత ఏమి అర్థమయినట్లు? ఏదో నాటకంలో వేషధారుడు యొక్క పోర్షన్‌ను కంఠస్తం చేసినట్లు, ఆ పోర్షన్ చెప్పేది అయిపోగానే ఆ మేకప్ అంతా తీసేసి మామూలుగా అయిపోయి మాట్లాడినట్లు ఉంది. అంటే వీరికి దేవుని మీద ధ్యాసలేదు. భగవద్గీతలో ఏమి చెప్పాడు నాకంటే గొప్పవాడు ఈ విశ్వములో లేడు. మీరు దేవతలకు పూజలు చేస్తే దేవతలలోకే పోతారు. నా వద్దకు మాత్రం రాలేరు అని చెప్పాడు. నన్ను తెలుసుకోవాలంటే నన్నే ఆరాధించాలి. నన్ను చేరేందుకు కొన్ని మార్గాలు ఉన్నాయి. కర్మ, జ్ఞాన, భక్తి యోగాలు. కానీ నీవు యజ్ఞ, దాన వేద, తపములు చేస్తావు అవి

పనికి రావు అని, భగవద్గీత ఉపన్యాసములో ఆ స్వామీజీనే చెప్పి మరలా మంగళహారతులు ఇవ్వటానికి ఇంకో దేవత వద్దకు పోతే ఏమనాలి? ఆ వ్యక్తి మోసపు వ్యక్తి అనాలి. మరి చాలా పెద్దపెద్ద ఇంజనీర్లు, డాక్టర్లు అందరూ విన్నారు కదా! ఆ ఉపన్యాసాలు మరి దేవుడు గొప్పని చెప్పి, మరో దేవతకు మ్రొక్కుచున్న స్వామీజీని ఎందుకు ప్రశ్నించలేదు? అంటే వినేవారికి ఏమీ అర్థం కాలేదు. సరిగ్గా వారి తలకి ఎక్కలేదు. చెప్పే వాడికి ఏమీ తెలియదు. అందుకే మేము **"దేశము మోసము"** అని అన్నాము. మేము అట్లా అంటే మీరు మొత్తంగా నిజమేనా అని చూసుకోవాలి, అంటే నన్ను కూడా మీరు ఈయన మమ్మల్ని మోసం చేస్తున్నాడేమో అని చూసుకోవాలి. మేము మీకొకటి చెప్పి మేము ఇంకొకలాగా నడిస్తే ఏమవుతుంది మోసం అవుతుంది. కొద్ది రోజులే ఉండే ఈ జన్మలో జ్ఞానం తెలుసుకునే విషయంలో మోసపోతే జీవితం వృథా అవుతుంది. సరి అయిన జ్ఞానం భగవద్గీత అని తెలుసు. భగవద్గీతను తెలిసి కూడా ప్రక్కత్రోవ పడితే ఏమవుతుంది, మోసపోవుట అంటాము. అందువలన అందరినీ పరీక్షించుకో, ఎవర్నీ నమ్మవద్దు అందుకే కుక్క ఒక చర్య ద్వారా ఒక జ్ఞాన విషయాన్ని తెలుపుతూ ఉంది. అదేమంటే కుక్క మన దగ్గరకు వస్తే, ఏదైనా తినుటకు వేస్తే ముందు నోటితో కుయ్ కుమ్మని అరుస్తూ ఉంటుంది. దానిని చూసి మనం ఈ కుక్క విశ్వాసం కలిగిన జంతువు అని అనుకుంటాము. కుక్క అలా అనుకుంటూనే వెనుక ఉన్న తోకతో నమ్మవద్దు, నమ్మవద్దు అన్నట్లుగా తోకను ఊపుతుంటుంది. ఎందుకంటే తోకలో ఉన్న వెంట్రుకలు ఆత్మకు గుర్తు కనుక అందుకు ఆ తోకద్వారా నమ్మద్దు నమ్మద్దు దేనినైనా అని చెప్తున్నట్లు తోకను అడ్డముగా ఊపుతుంది.

www.thraithashakam.org

ఈ మధ్య పెద్ద స్వామీజీ నెలరోజులపాటు భగవద్గీత చెప్తే అది విని కరిగిపోయిన ఒక వ్యక్తి 50 ఎకరాల భూమిని ఇచ్చేసాడు స్వామీజీకి. సరే బాగుంది తీసుకున్న స్వామీజీ ఇది నా కొరకు కాదు మీ భక్తులకొరకే వినియోగిస్తాం అని చెప్పి ఆ భూమిని పూజించటానికి వేరే గుడికి పోయి ఆ భూమికి అందరితో పూజలు చేయించాడట. భగవద్గీత అంతా చదివి మరల ఇంకో దేవత గుడికి పోతే అది మనము మోసపోయినట్లు, ఆయన మోసం చేస్తున్నట్లు కాదా! మీకు భగవద్గీత అర్థం కాలేదు. మిగతా వారిని కూడా అర్థంకానట్లు చేస్తున్నారు. ఈ రోజు మనం ఏది చెప్తే పది సంవత్సరాలకు అదే ఉండాలి. పది సంవత్సరాల ముందూ అదే నేను చెప్పి ఉండాలి. ఒక వ్యక్తి వచ్చాడు నా దగ్గరకు అతనికి రోగాలున్నాయని. నేను చెప్పాను నీ రోగాలను నువ్వే లేకుండా చేసుకోవాలి. అది ఎట్లా పోవాలో ఉపాయం నేను చెప్తాను. జ్ఞానం ద్వారానే పోతుంది, లేకపోతే పోదు. మందులు వలన పోతుందని నమ్మకం మాత్రం లేదు. కర్మ పోతే మందుల వలన పోయినట్లు ఆత్మ ఆ పని చేస్తుంది. నీవు జ్ఞానం తెలుసుకుంటే మందు వేసినా, వేయకపోయినా తగ్గుతుంది. మేము ఎప్పుడూ అదే మాట చెప్తున్నాము. పది సంవత్సరాల ముందు అదే చెప్పాము. ఇప్పుడూ అదే చెప్పున్నాము. ఇంకా పది సంవత్సరాల తరువాత కూడా అదే చెప్తాము. అంతేగానీ నేను బాగుచేస్తాను నా వద్దకు రండి  అని చెప్పానా లేదు. నాలోపలున్న రోగాల్నే నేను నా ఆత్మకు విడిచిపెట్టాను. ఏదీ పథ్యం పాటించను. పథ్యం నేను ఎందుకుండాలి? ఆత్మ చేయదు అని అనుకుంటే నేను పథ్యంగా ఉండాల్సిందే. ఆత్మ అధిపతిగా ఉన్నది.  ఆత్మ అన్నీ చూసుకుంటుంది అని మీరు అనుకుంటే మీరైనా పథ్యం లేకుండా ఉండవచ్చు. మీకా నమ్మకం లేదు కావున పథ్యం పాటించాల్సిందే అంటే

మీపైన మీకే నమ్మకం లేదు, మీ ప్రక్కనున్న వాడిపైన ఏముంటుంది? కాబట్టి మీరు జ్ఞానాన్ని ముఖ్యంగా తెలుసుకుంటే ఇది సక్రమమైన మార్గం అని తెలుస్తుంది తద్వారా మీ కర్మలు తెగిపోతాయి. భగవద్గీతలో కర్మలను కట్టెలుగా పోల్చాడు. జ్ఞానాన్ని అగ్నితో పోల్చాడు. కట్టెలు మెత్తనివి, గట్టివి, పచ్చివి ఏవి గానీ కాలిపోతాయి అని చెప్పాడు కదా! మరి ఆ త్రోవలో ఎందుకు నడవకూడదు. జ్ఞానం అంత శక్తివంతమైనదని మీరెట్లు చెప్పగలుగుతారు? అని అడుగవచ్చును. మేము చెప్పటం కాదు మీరే చూసుకోండి. **"మంత్రము-మహిమ"** అనే గ్రంథం ఉంది అందులో మంత్రములు లేవు. ఆ గ్రంథంలో మంత్రములకంటే జ్ఞానం గొప్పది అని చెప్పాము. కర్మానుసారము ఒక వ్యక్తికి తేలు కుడితే కుట్టినచోట ఆ గ్రంథం పెడితే ఆ బాధ లేకుండా చేయగలిగింది. అంటే అనుభవించే కర్మను కాల్చినేస్తూ ఉంది. గ్రంథము నుండి అంతశక్తి వస్తూ ఉంటే, జ్ఞానం అర్థం చేసుకుంటే మనకు ఎంత శక్తి వస్తుందో అర్థం చేసుకోండి. అందుకు మీరు జ్ఞానం తెలుసుకోవటానికి ప్రయత్నం చేయండి.

మిమ్మల్ని పరిపాలించే భూతములు, గ్రహములు చాలా ఉన్నాయి. పెళ్లి అనే క్రియ చాలా పవిత్రమైనది. జీవితంలో జ్ఞానంలోకి అడుగువేయడమే పెళ్ళిలో చేసే ప్రతీపనికి అర్థముంది. ఆ పనులను అర్థంలేకుండా చేసినా, హేళనగా చేసినా అజ్ఞానంతో చేసినా భూతాలకు కోపం వచ్చి పెళ్ళిళ్ళకు వెళ్తున్న వారిని ఎంతో మందిని చంపేస్తున్నాయి. ఈ మధ్య తెలుగుదేశం నాయకుడు ఒకాయనను పెళ్ళికి వెళ్ళి వస్తూ ఉంటే ఇంటికి చేరక ముందే భూతము చంపేసింది. లోపలున్న ఆత్మ కాకుండా బయటున్న గ్రహాలు, భూతాలు ఉపభూతాలు ఎన్నో దేవుని పరిపాలన చేస్తున్నాయి. జ్ఞానప్రకారం ఉంటే నిన్ను వారు ఏమైనా రక్షించగలరు లేకపోతే శిక్షించగలరు కాబట్టి

రోగాలు, కష్టాలనుండి ప్రమాదాలనుండి నీవు బయటపడాలంటే ముఖ్యంగా ఆత్మ జ్ఞానం తెలుసుకోవాల్సిందే. ఆత్మ జ్ఞానం మినహా శిక్షలు తప్పవు. దీనిని మీరు రూఢిగా పెట్టుకోండి.

# 61. జీర్ణ + ఆశయము

తేది : 28-12-2013

మన శరీరంలో జీర్ణ ప్రక్రియ ఒకటున్నది. ఆ క్రియ మన జీర్ణాశయములో జరుగుచున్నది. జీర్ణము అంటే నాశనము అని అర్థం. జీర్ణాశయము అంటే జీర్ణమే ఆశయముగా కలిగినది అని అర్థం. జీర్ణము చేయటమే ఉద్దేశ్యం కలిగినది. జీర్ణాశయములోనికి ఏదైతే పోతున్నదో అదంతా నాశనం అయిపోవాల్సిందే మా చిన్నప్పుడు ఎవరికైనా ఆరోగ్యం బాగాలేకపోతే ఒక వైద్యుని దగ్గరకు వెళ్లమనేవారు. అక్కడ ఆయన చేతిలో నీరు పోసి అందులో ఆముదము చుక్కను వేసి మునిగిందా లేదా అని చూసి, మునిగితే నీకు ఎవరో మందుపెట్టినారు శరీరంలోకి అది రోగము అయింది అని చెప్పేవారు. ఆ నూనె తేలితే మందు లేదని చెప్పేవారు. అది ఎలాగూ తేలదు ఎందుకంటే చేతిలో నీరుపోసి అందులో ఆముదపు చుక్కవేస్తే అది ఎలాగూ మునుగుతుంది. కాబట్టి నీ శరీరంలో పెట్టుడు మందు ఉంది అందువలననే నీకు మతిస్థిమితంగా లేదు అని చెప్తారు. ముందే ఈ రోగికి ఆ అనుమానం ఉంటుంది, దానికి తగ్గట్టు అదే చెప్తాడు. అప్పుడు ఆ వైద్యుడు ఆ మందును మేము కక్కించేటట్లు చేస్తాము అంటారు. ఏదో విధంగా కక్కించి ఇది నీలో ఉన్న మందు అని చూపిస్తారు కూడా, ఈ మందు బయటకు వచ్చేసింది కనుక ఇకనుండి నీ ఆరోగ్యం బాగుంటుంది

అని చెప్తారు. అప్పటి నుండి ఇతని ఆరోగ్యం నిజంగానే మెరుగుపడుతుంది. అయితే ఇప్పుడు మనం ఏమి చెప్తున్నాము, జీర్ణాశయములో ఏది పడినా అది నాశనం అయిపోతుంది అని చెప్పాం కదా! మరి పెట్టిన మందు ఆ వ్యక్తిలో మరి ఎట్లు ఉంది. వారు చెప్పే మాట వాస్తవమా? వారు చూపించేది వాస్తవమా ఏది సత్యం? అని చూస్తే వారు చూపించేది, నీ శరీరంలో ఎవరో మందు పెట్టారు అని చెప్పేది పూర్తి అసత్యం ఎందుకంటే మన జీర్ణాశయములో ఏది పడినా మూడు గంటలలో జీర్ణము కాక తప్పదు. కొందరైతే మరీ విచిత్రంగా నీకు మందు వడలో పెట్టి పెట్టినారు అని చెప్పేవారున్నారు. అలాగే ఉప్మాలో పెట్టారంటారు కొందరు. ఇదెట్లా సాధ్యం. కనుక వాస్తవంగా మందులు పెట్టడం అనేదే లేదు. అదేమి నాకిప్పటి వరకు ఆరోగ్యం బాగాలేదు కదా! అక్కడకు పోయిన తరువాత కక్కించిన తరువాత నా ఆరోగ్యం కుదుటపడింది కదా అంటే, బాగుంటుంది, ఎందుకంటే నీకు కక్కినప్పుడు జీర్ణాశయము అంతా ఎప్పుడైతే మొత్తం కదిలిందో  అక్కడ నుండి నీ ఆరోగ్యం బాగుపడింది అంతే గానీ మందు బయటకు పోవడము వలన నీ  ఆరోగ్యం బాగుపడలేదు. ఒకసారి జీర్ణాశయము అంతా కదిలి ఖాళీ అవటం వలన ఆరోగ్యం బాగుపడేందుకు అవకాశం ఉంది. ఈ రహస్యం తెలియనిదాని వలన, అక్కడ నుండి శరీర ఆరోగ్యం బాగుండటం వలన, పెట్టుడు మందులు ఉన్నాయి అనే నమ్మకం కలుగుచున్నది.

మనం జీర్ణాశయములోకి ఆహారం తీసుకుంటున్నాం. అది తీసుకునే ముందు మనకి ఆకలి అగుచున్నది. ఆకలి అంటే ఎప్పటికీ నాశనం అవుతూనే ఉండేది అని అర్థం. కలి అంటే నాశనం ఆకలి అంటే ఎప్పటికీ నాశనం పుల్‌స్టాప్ లేకుండా ఉండేది అని అర్థం. అయితే ఆహారం ఎన్ని రకములని

భగవద్గీతలో చెప్పుకున్నాము. శ్లోకంలో "పచామ్యన్నం చతుర్విధమ్" అని చెప్పారు. ఆహారం నాలుగు రకాలు అని అర్థం. అదేమి ఆహారాన్ని చాలా రకాలు చేసుకోవచ్చు కదా మరి మీరు నాలుగు రకాలు అంటారు ఏమిటి అని నన్ను ప్రశ్నించవచ్చును. మన త్రైత సిద్ధాంత భగవద్గీతలో పిండి పదార్థములు, కొవ్వు పదార్థములు, మాంసకృత్తులు మరియు లవణములు అని నాలుగు రకములుగా చెప్పుకున్నాము. ఇవన్నీ జీర్ణము వేయబడతాయి. తరువాత ఆకలి తగ్గి "ఏవ్" అని త్రేన్పు వస్తుంది. ఈ నాలుగు ఏవతే ఉన్నాయో అని మేమున్నాము అని చెప్పినట్లు మేమున్నంతవరకు భయంలేదు అని చెప్పటం ఒక మూడు గంటల కాలం వరకే. మరల అవి జీర్ణమయి పోతాయి, మళ్ళీ ఆకలి వేస్తుంది. ఇది సహజంగా జరిగే పనే ఇది. తరువాత మరల ఆహారం తీసుకుంటాము. మరల "పచామ్యన్నం" అంటే జీర్ణం అయిపోతుంది. ఈ నాలుగు ఆహారాలు నాలుగు అధర్మాలకు గుర్తుగా ఉన్నాయి. ఈ నాలుగే ఎందుకు పెట్టినారంటే భగవద్గీతలో నాలుగు అధర్మాలు, మూడు ధర్మముల గూర్చి చెప్పారు. ఈ దేశంలో ఈ విధంగా నాలుగు అధర్మాలు మూడు ధర్మములు అని చెప్పేది మనం ఒక్కరమే. ఆ విధంగా చెప్పుకోవటం మన వంతు. నాలుగు అధర్మాలు నాలుగు ఆహారాలతో పోలికగా ఉన్నాయి. ఎప్పుడైతే నాలుగు అధర్మాలతో మనిషి నిండుకున్నాడో అప్పుడు ఆ మనిషి "ఏవ్... ఏవ్..." అని అహంకారానికి గుర్తుగా త్రేన్పులు త్రేనుస్తున్నాడు. ఎవరైనా త్రేన్పితే వింటే మనం త్రేన్పినప్పుడూ విన్నా ఆ త్రేన్పు అహంకారపూరితంగా 'నేనే' అన్నట్లు ఆ శబ్దము ఉంటుంది. అయితే నాలుగు అధర్మాలకు నాశనం ఉంది. ఏ విధంగా అంటే ధర్మములతో నాశనం అవుతున్నాయి. ఎన్ని ధర్మములతో నాశనం అవుతున్నాయంటే? మూడు ధర్మములతో నాశనం అవుతున్నాయి.

అదే గుర్తుగా మన శరీరంలో మూడు రసములతో, నాలుగు పోషక పదార్థాలు జీర్ణమయ్యేటట్లుగా దేవుడు చేసి చూపించాడు. ఆ రసాలలో వరుసగా లాలాజలము, పైత్యరసము, మరియు క్లోమరసం ఈ మూడింటిలో మరలా రెండు రసములు అనే పేర్లతో ఉన్నాయి. ఇంకొకటి "లాలాజలము" ఇది రసం కాదు. ఈ మూడూ నీ శరీరంలోనే ఉద్భవిస్తున్నాయి. ఉద్భవించి నాలుగు అధర్మములకు గుర్తుగా ఉన్న నాలుగు ఆహారపదార్థములు జీర్ణము చేసేస్తున్నాయి. ఈ విధంగా ఎప్పటికైనా అధర్మాలు, ధర్మముల వలన లేకుండా పోతాయి అనే గుర్తును దేవుడు నీ శరీరంలో పెట్టి చూపించాడు. ఈ విషయాలు నీవు తెలుసుకునేటట్లే పెట్టాడు. అయితే నాలుగు అధర్మాలు మళ్ళీ చెలరేగవా అంటే చెలరేగుతాయి. మరలా ఆహార పదార్థాలను వేస్తావు. మళ్ళీ నేనే అనే గుర్తుగా "ఏవ్..." అని త్రేన్పుతావు. మరలా అవన్నీ నాశనం అవుతాయి. ఈ ప్రక్రియ జరుగుతూనే ఉంటుంది. ఎప్పుడైతే అధర్మాలు చెలరేగుతాయో అప్పుడు నేను వచ్చి నా ధర్మముల ద్వారా వాటిని అణచివేస్తాను అని చెప్పెను కదా! దానికి గుర్తుగా మన శరీరములో జీర్ణప్రక్రియ ఉంది.

దేవుడు మూడు భాగములుగా ఉన్నాడు. మూడు ధర్మములు కూడా ఉన్నాయి. శరీరములో కాలేయము, క్లోమం రెండు గ్రంథులు రెండు రసములైన పైత్యరసం, క్లోమరసం రెండింటిని ఉత్పత్తి చేస్తున్నాయి అని చెప్పుకున్నాము కదా! ఈ రెండు కాలేయము మరియు క్లోమము బయటకు ఆకారం కనిపించే విధంగా ఉన్నాయి. వాటినుండి ఊటలు వస్తున్నవి కొందరికి ఇదంతా విని ఇదేమి జ్ఞానం? అని సందేహం వస్తుంది. కానీ దేవుడు నీ దేహంలో గ్రంథులను జ్ఞానానికి గుర్తుగా పెట్టెను అని చెప్తున్నాము. లాలాజల గ్రంథులు కూడా ఉన్నాయి కానీ అవి బయటకు

కనిపించవు. కనిపించక పోయినా లాలాజలం నోటిలో ప్రతీవారికి ఉంటుంది. పైత్యరసం, క్లోమరసం మరియు లాలాజలం మూడు కలిసి వైశ్వానరుడు అనగా అగ్ని అవుతుంది. అగ్ని అంటే కాల్చివేసేది లేకుండా చేసేది అని అర్థం. ఏ విధంగా మూడు ధర్మముల చేత నాలుగు అధర్మములు నాశనం అవుతాన్నాయో, ఆ విధంగా నాలుగు పోషక పదార్థములు మూడు రసముల ద్వారా జీర్ణమై లేకుండా పోవుచున్నవి. అదే విధముగా మూడు ధర్మములు భూమిమీదకి వచ్చినప్పుడు, ఎంత అహంకారపూరితంగా 'మాలోనే అందరూ చిక్కుకున్నారు' అని అధర్మములు అనుకున్నా, మూడు ధర్మములు వాటిని నాశనం చేస్తున్నాయి.

అయితే ధర్మముల వలన అధర్మములు లేకుండాపోతే ఏమి జరుగు తుంది? శరీరములు పోయి జీవుడు మోక్షాన్ని పొందుతాడు. జీవాత్మ అనేది శరీరంలో ఇరుక్కుని ఉంది. కనుక జీవాత్మ మోక్షాన్ని పొందుతుంది. ఆహారం తీసుకున్నప్పుడు పోషక పదార్థములు కనిపించవు, జీర్ణాశయములో ఆహారం మొత్తం కాల్చివేయబడును అందులో పోషక పదార్థములు శరీరానికి వినియోగపడతాయి. అవి కనిపించకుండా పోతాయి. ఏ విధముగా వినియోగపడుతున్నాయి అనే విషయాన్ని **"త్రైతాకార రహస్యము"** అనే గ్రంథములో వివరించటం జరిగింది. **"ఆహారం తినని మనిషి"** అను శీర్షికలో 74 సంవత్సరములుగా ఆహారం ఆ మనిషి తినలేదు. తినకుండా ఏ విధంగా బ్రతుకగలిగినాడు అని చాలామంది ఆయనను పరీక్షించినారు. కానీ, అది పెద్ద మిస్టరీగా మారిపోయింది. ఆ విషయాన్ని మనము సులభంగా చెప్పుకున్నాము.

మన శరీరములో 72 వేల కోట్ల ధాతు కణములు ఉన్నాయి. పోషక పదార్థాలన్నీ ధాతుకణములలో కాలిపోతున్నాయి కనుకనే నీ

శరీరము వేడి కల్గి ఉంటున్నది. అది అంతా జరగటం జీర్ణాశయంతో మొదలయి గ్లూకోజ్‌గా మారి కణాలలో శ్వాస ద్వారా తీసుకున్న ఆక్సిజన్‌తో కలిసి గ్లూకోజ్ కాలిపోయి శక్తిని ఇస్తూ ఉంది. అయితే మనం ఎంత వరకు తెలుసుకోవాలాంటే మన శరీరములో జీర్ణాశయం ఉంది. దానిని గురించి చెప్పుకొంటే ఒకసారి అర్జునుడు భగవద్గీతలో శ్రీకృష్ణున్ని ఏమని అడిగెను "నువ్వెవరు?" అని అడిగాడు. అప్పుడు శ్రీకృష్ణుడు పరమాత్మగా మాట్లాడినప్పుడు **"నాశనం చేసే కాలాన్ని నేను" "కాలోస్మి లోకక్షయో"** అని అన్నాడు. నిన్ను లేకుండా చేస్తాను అని అన్నట్లు అర్థము అప్పుడు నీవు నా వలె మారెదవు. ఈ విధముగా నాశనం అనే పదానికి దగ్గర సూచనగా జీర్ణాశయం అనే పేరుతో నీ శరీరములోనే ఉంది. నాశనం చేసేది ఎన్ని భాగములుగా ఉంది? మూడు రసముల రూపంలో ఉంది. నాశనం అయ్యేది నాలుగు రకములుగా ఉంది. జఠరాగ్నియే ఆహార పదార్థములను నాశనం (కాల్చి) వేస్తూ ఉంది. అయితే అగ్ని ఎన్ని రకములుగా ఉంది? మూడు రకములు కట్టెలు కాలితే వచ్చే అగ్ని మనకు కనిపిస్తూ ఉన్నది. రసాయనాలలో వేస్తే కొన్ని వస్తువులు కాలిపోయి లేకుండా పోయినవి కూడా ఉన్నాయి. దానిని రసాయనాగ్ని అంటాము. సల్ఫ్యూరిక్ ఆమ్లంలో ఏ వస్తువు వేసినా అది కాలిపోతున్నది. ఒక్క బంగారం తప్ప. ఇక కనిపించని అగ్ని ఒకటుంది అది జ్ఞానాగ్ని. ఈ మూడు రకముల అగ్నిలు ఉన్నట్లు తెలుస్తున్నది. అదే విధంగా మూడు రసములైన రసాయనాలలో ఒక అగ్ని కనిపించకుండా మన శరీరములో ఏర్పడుతున్నది. తద్వారా నాలుగు పోషక పదార్థములు కాలిపోయి నాశనమవుతున్నదని మనకు తెలుస్తున్నవి. సున్నపురాతి మీద నీరు పోస్తే సున్నపురాయి మెత్తగా విడిపోయినట్లు ఆహార పదార్థాలు ఆ రసాయనాల అగ్ని ద్వారా

మెత్తగా విడిపోతున్నాయి, చూర్ణం అయిపోతున్నవి. ఈ విధంగా రసాయనక ప్రక్రియ ఏర్పడి జీర్ణమవుతున్నది.

అదే విధంగా కర్మలు కాలే అగ్ని ఒకటుంది అది జ్ఞానాగ్ని. ఆ అగ్నిని నీవు సంపాదించుకోగలిగితే, నాలుగు అధర్మాలను లేకుండా చేసుకొని, మూడు ధర్మముల చేత నీవు ముందుకు పోగలవు. మూడు ధర్మములు తెలియాలంటే అది పరమాత్మ జ్ఞానం నీకు కావాలి. మనిషికి ఈ జ్ఞానం తెలియక పోవటం వలన ధర్మములు మూడు అని తెలియకుండా పోయాయి. ఇప్పుడు దేశంలో చాలామంది జ్ఞానం చెప్తున్నారు కదా! వారెవరూ మీరు చెప్పినట్లు ధర్మములు మూడు రకములని చెప్పలేదే? అని ప్రశ్నించవచ్చును. మనం భగవద్గీతను ప్రమాణంగా తీసుకుంటున్నాము. అక్కడ దేవుడు చెప్పిన విషయాన్నే చెప్పుకుంటున్నాము తప్ప మనుషులు చెప్పిన విషయాలు మనము తీసుకోలేదు. దేవుడు తన విషయాలను తానే చెప్పాల్సి వస్తుంది. ఎందుకంటే దేవుని విషయాలు దేవునికే తెలుసును. ఏ మనిషికీ తెలియదు. అప్పుడు దేవుడే తన జ్ఞానాన్ని చెప్పగలిగితే అప్పుడు ఆ జ్ఞానాన్ని మనము తెలుసుకోగలుగుతాము. మరి దేవుడు ప్రత్యక్షంగా చెప్తాడా అంటే దేవునికి రూపం లేదు, పేరు లేదు, పనీ లేదు. పని లేదు కనుక చెప్పే పని చేయడు. కనుక దేవుడు ప్రత్యక్షంగా ఎక్కడా జ్ఞానాన్ని చెప్పడు. మరి మనకు జ్ఞానం ఎట్లా తెలుస్తుంది? మనుషులు చెప్పిన జ్ఞానాగ్ని నీవు నమ్మద్దు అని చెప్పినప్పుడు చెప్పేది ఎవరు? దేవుడు దేవునిగా చెప్పడుగానీ భగవంతునిగా చెప్పును. ఆ విధంగా దేవుడు భగవంతునిగా తెలియజేసినదే భగవద్గీత. భగవద్గీతలో తన ధర్మముల గురించి తెలియ జేశాడు. అది తెలుసుకుని మనిషి తన కర్మలను కాల్చివేసుకుని దేవునిలోకి ఐక్యమయ్యే విధానాన్ని పూర్తిగా తెలియజెప్పాడు. అది అనుసరిస్తే జ్ఞానము

www.thraithashakam.org

అనే అగ్ని నీకు లభ్యమవుతుంది. కర్మలు అనేవి పోతాయి తద్వారా నీవు అనుభవించేవి ఉండవు కనుక నీకు శరీరము అవసరం లేదు. శరీరం ఎందుకు? నీవు కర్మలు అనుభవించేందుకే శరీరముకావలెను. సుఖ దుఃఖాలు అనుభవించేందుకే శరీరం ఉన్నది. ఈ విషయాలన్నీ ఎక్కడ తెలుస్తాయి? బ్రహ్మవిద్యా శాస్త్రములో తెలుస్తాయి. ప్రత్యేకంగా బ్రహ్మవిద్యా శాస్త్రం అనే పేరుతో లేదుగానీ, భగవద్గీతను మాత్రము బ్రహ్మవిద్యా శాస్త్రం అనవచ్చును. గణిత శాస్త్రం ఎక్కడ ఉన్నది? చిన్న పిల్లల లెక్కలు కూడా గణిత శాస్త్రమే. భవిష్యత్తు చెప్పుకునే వారుంటారు దానిని జ్యోతిష్య శాస్త్రం అంటాము. భగవంతుడు ఎక్కడైతే చెప్పినాడో అదే బ్రహ్మవిద్యా శాస్త్రం అని అంటాము. మిగతా శాస్త్రాలన్నీ మనిషి చేత చెప్పబడతాయి కానీ ఒకే ఒక్క బ్రహ్మవిద్యా శాస్త్రం దేవునిచేత భగవంతుని ద్వారా చెప్పబడతాయి. అవే నిజమైన ధర్మములు వాటిని అనుసరిస్తే జ్ఞానం లభ్యమవుతుంది. కనుక దేవుడు చెప్పిన దానినే మీరు అనుసరించండి, ఆచరించండి... దేవుడు చెప్పిన మూడు ధర్మముల మినహా భక్తి అని చెప్పి నీవు ఏవైతే అనుసరిస్తు న్నావో అవి అధర్మముల లిస్ట్‌లోకి వెళ్తాయి. అధర్మములు ఆచరిస్తూ నేను ధర్మములు ఆచరిస్తున్నాను అంటే అది పొరపాటు అవుతుంది. దానివలన జ్ఞానాగ్ని రాదు, కర్మలు పోవు.

మనిషి చెప్పిన జ్ఞానం దేవుని జ్ఞానం కాదు. ఈ మధ్య కలియుగం అంతమయిపోతుంది అని చాలామంది చెప్పారు. టీవీలలో, పేపర్లలో అవే అంశాలు వ్రాశారు. కానీ మనము ఏమి చెప్పాము **"కలియుగము ఎప్పటికీ యుగాంతం కాదు"** అని గ్రంథమును వ్రాశాము. ఇలా జరగడం అసంభవం అని వ్రాశాము. మేము ధ్యానం చేయటం వలన అలా జరగకుండా పోయింది అని కొందరు అంటున్నారు. ఎవరు ధ్యానం

చేస్తే వారికేదో మేలు కలుగుతుంది అంటే నమ్ముతాముగానీ, అదీ కూడా నీ కర్మలు కాలేందుకే అవకాశం లేదు. మరి మిగతా వారి కర్మలు ఎట్లా మీరు కాలుస్తారు? ఈ విధంగా కొందరు అడ్డదిడ్డంగా జ్ఞానం గురించి చెప్పుకుంటున్నారు తద్వారా చెప్పేవారు, వినేవారూ వారివారి కాలాలను వ్యర్థం చేసుకుంటున్నారు. అలా కాకుండా సరైన జ్ఞానం తెలుసుకుంటే నీకు జ్ఞానాగ్ని లభించి నీ కర్మలు లేకుండా పోతాయి. బయట అగ్నిలో కట్టెలు, వస్తువులు కాలిపోయినట్లు, జ్ఞానమనే అగ్ని వలన నీ కర్మలు కాలిపోతాయి **"యథైధాంసి స్సమద్ధోగ్ని భస్మసాత్ కురుతేర్జున, జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా"** జ్ఞానము వలన సర్వకర్మలు భస్మీపటలం అయిపోతాయి ఆ విధంగా మీరు కర్మలు భస్మీపటలం చేసుకోవటానికే మీ అందరూ ఇక్కడ చేరారు. ప్రతీ జన్మలో పుడుతూ, మరలా చస్తూ, ఇంకా అనేక కష్టాలు, సుఖాలు అనుభవిస్తూ, మళ్ళీ కర్మలు సంపాదిస్తూ, వాటిని అనుభవించడానికి మళ్ళీ జన్మిస్తూ ఉండేకంటే ఈ కర్మలు అసలు లేకుండా పోయి దేవునిలో ఐక్యమయ్యే పద్ధతిలో భాగంగా మనం ఆధ్యాత్మిక విద్యను నేర్చుకుంటున్నాము. అందరూ ఇక్కడకు చేరింది ఆ ఆధ్యాత్మిక విద్య ద్వారా మన కర్మలు నాశనం చేసుకునేందుకే అవకాశం ఉంది. ఈ విషయాలన్నీ చూపించేందుకే జీర్ణాశయము, జీర్ణప్రక్రియ కలదు. జ్ఞానము చాలా గొప్పది, శక్తివంతమైనది, దేవుని జ్ఞానాన్ని మనుషులు చెప్పలేరు. మనుషులు చెప్పిన జ్ఞానాన్ని అనుసరించవద్దు, మనుషులు చెప్పే జ్ఞానాన్ని ఇది తప్పు అని అంటే వారు చెప్పిన జ్ఞానమును మేము విమర్శించి నట్లవుతుంది. దేవుని జ్ఞానాన్ని చెప్పవలసి వచ్చినప్పుడు ఇది తప్పు అని చెప్పవలసిన పని వస్తుంది. అవి తప్పు అని చెప్తేనే వాటి జోలికి మీరు

పోకుండా ఉంటారు. అది అసూయతో చెప్పిన జ్ఞానం కాదు. మరి వాటిని ఉదాహరణతో చెప్పాలంటే మనుషులు చెప్పిన జ్ఞానాన్ని విమర్శించవలసిందే.

కొందరు ఒక గదిని చక్రం ఆకారంగా కట్టుకుని, దానిక్రింద కూర్చుని ధ్యానం చేస్తే పూర్తి కర్మలన్నీ పోతాయి, మోక్షం పొందుతావు, దేవుడు తెలియబడతాడు అని చెప్పారు అనుకోండి. అట్లాగ చేసేవారు చాలామంది ఉన్నారు. మరి ఈ విషయం తప్పా? ఒప్పా అని తెలుసుకుంటే భగవద్గీతలో ఇటువంటి చక్రం కట్టుకొని ధ్యానం చేయండి మీ కర్మలు పోతాయి అని ఎక్కడైనా చెప్పాడా? బైబిల్‌లోగానీ, ఖురాన్‌లోగానీ ఎక్కడైనా ఉందా అంటే ఎక్కడా లేదు. భగవద్గీతలో లేని విషయాలు మనుషులు చెప్పితే ప్రపంచములో ఉన్న తెలివైన వారందరూ దానినే నమ్మి మీరు ఎందుకు అనుసరిస్తున్నారు? అది బ్రహ్మవిద్యా శాస్త్రమేనా? ధ్యానం వలనగాని, తపముల వలనగాని, యజ్ఞముల వలన గాని, దానముల వలనగాని దేవుడు తెలియబడనని చెప్పలేదా? మరి దానిని అధర్మమార్గం అనాలా ధర్మమార్గం అనాలా అంటే, అధర్మమార్గమే అనాలి. వాటిని బ్రహ్మ విద్యాశాస్త్రములో లేవు అని తెలిసి నీవు అనుసరిస్తే అది నీ పొరపాటు అవుతుంది. సృష్ఠి ఆదిలోనే ఈ జ్ఞానాన్ని నీకు చెప్తే అది నీవు మరచిపోయి మరలా జ్ఞానం కాని దానిని అనుసరిస్తే జీర్ణప్రక్రియలో నీవు త్రేన్చినట్లుగా, తల పైకెత్తినట్లుగా ఉన్ననూ, లోపలున్న మూడు రసముల ద్వారా జీర్ణా శయములో ఆహారపదార్థములు జీర్ణమయిపోతాయి. ఆ విధంగా అధర్మాలు ఎంత చెలరేగి పోయినాగాని, ధర్మముల వలన అవి లేకుండా పోతాయి. దేవుడు మరలా ధర్మములు తెలియజేస్తాడు. ఒక వ్యక్తి చక్రం కట్టుకొని ధ్యానం చేసి, మన జ్ఞానం తెలుసుకున్న తరువాత, "ఇది చాలా పొరపాటు, దేవుడు చెప్పిన జ్ఞానములో ఈ పద్ధతులు ఏమీ లేవు, ఇవన్నీ ధ్యానాలు

www.thraithashakam.org

మనుషులు చెప్పినవి అవి వాటినన్నిటినీ విడిచిపెట్టి ఈ జ్ఞానమార్గములోకి వచ్చాను" అని అన్నాడు. ఆ విషయాన్ని తెలుసుకున్న కొందరు ఇదేమి ఈ వ్యక్తి పది సంవత్సరములనుండి చక్రంలో ధ్యానం చేస్తూ ఒక నెల రోజులు ఆ గ్రంథాలు చదివిన తరువాత వీటనన్నింటినీ విడిచిపెట్టి ఎట్లా అందులోకి పోయాడు? ఆ గ్రంథాలు వ్రాసిన వ్యక్తి ఏమైనా మందు పెట్టాడా? మాయ చేశాడా? అని అనుకుంటున్నారట. సత్యం తెలిసిన తరువాత ఇట్లాగే ఉంటుంది. ఈ విధముగా అధర్మాలతో కూడుకొన్న బోధలు ఏవైతే ఉన్నాయో వాటిని అందరూ వదలివేస్తారు. తప్పనిసరిగా వదలివేయాల్సిన పరిస్థితి వస్తుంది. ఎందుకంటే వారు ముందు విన్నవి ఏవీ సత్యముకావు, తృప్తిని ఇవ్వవు. కనుక బ్రహ్మ విద్యాశాస్త్రములో ఉన్న ధర్మములు తెలియటం వలన అధర్మములన్నీ అణిగిపోతాయి. అధర్మములు ఆచరించే వారు ఇక లేకుండా పోతారు. అంటే అందరూ ధర్మాలనే ఆచరిస్తారు. కొంతకాలానికి ఈ మార్పు జరుగుతుంది. అసలైన ఈ జ్ఞానాన్ని విని చాలామంది ఇతర మతస్థులు కూడా ఈ మార్గములోకి వస్తున్నారు. సరే ఇక్కడకు మా వద్దకు వచ్చి మమ్మల్ని గురువుగా లెక్కిస్తున్నారు. అయితే ఒక వ్యక్తే ఉంటాడుగాని గురువు అనేవాడు ఉండడు. మేము గురువులము కాదు. ఏ శాస్త్రములోనైనా ప్రపంచవరంగా గురువులు ఉండవచ్చుగాని బ్రహ్మ విద్యా శాస్త్రంలో మాత్రం గురువు ఉండడు. అలాగే శ్రీకృష్ణునికి సాందీపుడు గురువే కదా! అంటే ఆయన ప్రపంచవరమైన విద్యలో గురువు. మెకానిక్ పనులకు ఒక గురువు, ఇంకో విద్యకు అనేక గురువులు ఉండవచ్చు. బ్రహ్మవిద్యా శాస్త్రాన్ని చెప్పటానికి మాత్రము దేవుడే గురువై వచ్చును. ఆయనొక్కడే అప్పుడు గురువు. ఆయన కొన్ని లక్షల సంవత్సరాలకో, కొన్ని వేల సంవత్సరాలకో ఆ గురువు వస్తాడు. ఎప్పుడైతే

www.thraithashakam.org

నీ కడుపునిండా ఆహారం ఉన్నట్లు అధర్మాలు నిండుకుని ఉంటాయో అప్పుడు గురువు వస్తాడు. అప్పుడు అధర్మాలు లేకుండా ధర్మాలను వాటి స్థానంలో చెప్పుటకువచ్చును. మరి మీరు అదే జ్ఞానాన్ని చెప్తున్నారు కదా! అని అడుగవచ్చు. అవును మేము చెప్తున్నాము, చెప్తే ఏమవుతాం? బోధకులవుతాము, గురువులము కాము. నన్ను ఇప్పుడు మీ అందరూ బోధకుడు అనాలి. "అదేమి? మీరు ఎవ్వరూ చెప్పని జనన, మరణ రహస్యాలు, బ్రహ్మ, కాల, కర్మ, గుణ చక్రాలు గురించి చెప్పారు కదా! మరి ఇవన్నీ ఏ స్వామీజీ చెప్పని విషయాలు మీరు చెప్పినట్లే కదా!" అని అంటే "నేను చెప్పానని, నేను చెప్పలేదు, నా ప్రక్కనున్న వాడు చెప్పాడు, మీరు ఈ విషయంలో పొరపడ్డారు" అని చెప్పాను. మేము చెప్పేవి క్రొత్త విషయాలేగానీ నా లోపల ఆత్మ అందిస్తేనే వ్రాసేవిగానీ నేను స్వంతంగా చెప్పినవి మాత్రము కావు. కాబట్టి నేను ఏమాత్రము గురువును కాను. మరి గురువులు ఎట్లు ఉంటారు? అంటే ఎవరికి తెలుసు గురువు ఎట్లు ఉంటాడో? ఇంతవరకూ గురువును ఎవరూ చూడలేదు. మరి గురువునే చూడకపోతే శిష్యుడెట్లు ఉంటారంటే, గురువుకు ఎప్పుడూ శిష్యులు ఉండరు. ఎందుకంటే ఫలానావాడు గురువు అని ఎవరికీ తెలియదు కనుక. ఎప్పుడైతే దేవుడు భగవంతుడిగా వస్తాడో అతడే గురువు. అందుకే మేము మీకు క్రొత్త విషయం చెప్పేందుకు ముందుగా కూర్చుంటూనే బ్రహ్మకు, విష్ణువుకు, మహేశ్వరునికి గురువైన సాక్ష్యాత్ పరబ్రహ్మకు నా నమస్కారములు అని ప్రార్థించాము. దానితోపాటు లోపలున్న మా ఆత్మ చెప్పే విషయాలు మీలో ఉన్న ఆత్మ గ్రహించాలని కోరుతూ ఉపన్యాసాన్ని ప్రారంభించాము. ఇదంతా వాస్తవ విషయం. స్వయంగా నీవు ఏ విషయం తెలుసుకోలేవు గానీ నీ లోపలున్న ఆత్మ అందిస్తే తెలుసుకోగలవు. నీకు

శ్రద్ధ ఎంత ఉంటే నీ ఆత్మ అంతే జ్ఞానాన్ని అందజేయగలదు. శ్రద్ధలేకపోతే రవ్వంత జ్ఞానము కూడా తెలియబడదు.

ప్రస్తుత విషయానికి వస్తే మన జీర్ణాశయములో రెండు రసములు (క్లోమరసం, పైత్యరసం) అని చెప్తూ ఒక జలం (లాలాజలం) అని కూడా చెప్పాము. రెండు రసములు ఒకటి జీవాత్మకు, రెండవ రసం ఆత్మకు సంకేతంగా ఉన్నట్లు ఊహించవచ్చు. కానీ పరమాత్మ లోపల, బయట అంతటా ఉన్ననూ ఏ పనీ చేసేది కాదు కనుక లాలాజలము అనే పేరు పరమాత్మకు వర్తిస్తుంది. నీ శరీరములో ముగ్గురు ఉన్నారనేందుకు చిన్న గుర్తు నీ జీర్ణాశయములో రెండు రసములు, ఒక జలము అనే పేరుతో ఉన్నట్లు గుర్తుంచుకోవలెను. "పరమాత్మ లోపల ఎట్లు ఉందో, బయటా అట్లే ఉంది అని చెప్పేందుకు "లాలా" రెండు 'ల' ల కు దీర్ఘము ఉంది. "నోటిలో ఎట్లా ఊరుతుందో తెలియదు. నీవు మాట్లాడుతుంటే బయటకు కూడా పోతున్నది. నేను బయట కూడా ఉన్నానన్నట్లు ఉమ్ముతుంప్పర్లు రూపంలో బయట మాట్లాడినప్పుడు పడుతుంటుంది. రసాలు మాత్రము లోపలే ఉండాలి, బయటకు వచ్చేందుకు అవకాశము లేదు. కానీ ఈ లాలా జలం మాత్రము లోపల ఉంటుంది, బయటకు వస్తుంది. అందుకే తెలుగు భాష చాలా గొప్ప భాష, అందులో గొప్ప భావం కలిగిన పదజాలం ఉన్నది అని మనము ముందే చెప్పుకున్నాము కదా! అందుకే మిగతా రెండింటికి రసం అని దీనికి జలం అని అనుటకు గల కారణాన్ని తెలుసుకుని, మూడు ఆత్మల సూచనగానే, మూడు ధర్మముల సూచనగానే ఇవి ఉన్నవని తెలుసుకుని, ఈ జీర్ణాశయ ప్రక్రియను తలచుకొని, ఈ మూడు రసముల వలన నాలుగు ఆహార పదార్థములు జీర్ణమైపోయినట్లు తద్వారా నీవు అహంకారమునకు గుర్తుగా ఉన్న త్రేన్పులు ఎంతసేపూ

ఉండవను కొన్ని గంటలో నాలుగు ఆహార పదార్థములు జీర్ణమైనట్లు నాలుగు అధర్మాలు మూడు ఆత్మ ధర్మముల ద్వారా నాశనం అవుతాయని తెలుసుకొని వాస్తవమైన ఈ ఆత్మజ్ఞానాన్ని అర్థము చేసుకుంటారని ఆశిస్తున్నాము...

## 62. దేవునికి మతమున్నదా?

తేది : 27-01-2013

భగవద్గీత, బైబిల్, ఖురాన్ గ్రంథములలో ఉన్న సమాచార మంతయూ ఒక్క దేవుని గురించే ఉన్నది. అన్ని గ్రంథములలో మతముల గురించి ఎక్కడా చెప్పలేదు. హిందువులు బైబిల్ చదువవచ్చు, క్రైస్తవులు భగవద్గీత చదువవచ్చు, హిందువులు ఖురాన్ చదువవచ్చు, ముస్లీమ్‌లు బైబిల్, భగవద్గీత చదువవచ్చు. ఇవి చదివి తప్పుగా అర్థము చేసుకుంటే ఇది తప్పు అని చెప్పే హక్కు ప్రతీ ఒక్కరికి ఉంది. మమ్మల్ని ఉద్దేశించి ఎవరైనా ఈయన హిందూ గురువు ఖురాన్ గ్రంథము గురించి చెప్పడమేమి? అనే ప్రశ్న ముస్లీమ్ నుండి రాలేదుగానీ హిందువుల నుండే వస్తున్నది. ఎందుకంటే హిందువులకి జ్ఞానములేక అనే మాటలివి. ఎక్కువమంది హిందూమతములో ఉన్నవారు వేరే మతాలలోకి వెళ్ళిపోతున్నారని హిందూ మతము క్షీణించిపోతుంది అని చెప్పి, హిందూమతాన్ని రక్షిస్తున్నామని చెప్పి, ఒక విధంగా హిందూమతాన్ని భక్షిస్తున్నారు. ఖురాన్ గ్రంథం సర్వ మానవాళికి సంబంధించిన గ్రంథము అదే విషయము 81వ సూరాలో 27వ ఆయత్‌లో **"ఈ గ్రంథం సర్వలోక వాసులకు సంబంధించినది"** అని ఉన్నది. ఇక్కడ ఈ గ్రంథము ఒక్క ముస్లీమ్‌లకే అని ఉన్నదా? లేదే. మరి అటువంటప్పుడు ఖురాన్ ముస్లీమ్‌ల గ్రంథం అని ఎందుకు అంటున్నారు?

www.thraithashakam.org

దేవుడు అందరివాడు కాబట్టి ఆ గ్రంథము అందరిదీ. ఈ విషయం అతిక్రమించి ఏ ముస్లీమ్ మాట్లాడడు. ఈ విషయాన్ని ద్వేషిస్తే 81వ సూరా 27వ ఆయత్‌ను గౌరవించినట్లే ఖురాన్ గ్రంథాన్ని ముస్లీమ్‌లు క్రింద కూడా పెట్టకుండా ఉన్నత స్థానంలో ఉంచుతారు. కానీ మేము వ్రాసిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** అనే గ్రంథాన్ని చూసిన కొందరు హిందువులు పూర్తిగా చదవకుండా ఆ గ్రంథాన్ని పబ్లిక్‌గా చించివేశారు. తమ ప్రామాణిక గ్రంథాన్ని చించేసారంటే మీరేమి హిందువులు? అని ఇతర మతముల వారు అడుగవచ్చును. హిందువులు అని అనుకున్న కొందరు, హిందూ మతాన్ని రక్షిస్తున్నామని అనుకున్న కొందరు, మా సంస్థలపైన దాడిచేసి, ఏదో విధంగా కొట్టాలనుకుని క్రైస్తవ కరపత్రాన్ని ఒక దానిని వారివెంట తీసుకుని వచ్చి మా ముద్రణా కార్యాలయంలో దానిని మేము ప్రింట్ తీసినట్లు చిత్రీకరించి మా సంస్థలో ఉన్న ఒక వ్యక్తిని కొట్టారు. ఈ విషయాన్ని అక్కడున్న హిందువులే ఖండించారు. ఈ విధంగానా మీరు హిందూమతాన్ని రక్షిస్తున్నారు.

మేము ఇప్పటికి 82 గ్రంథాలను వ్రాసి బయటకు పంపిస్తే చదివిన ప్రతీవారు చాలా సంతోషించి దేవుని విషయాలు ఎక్కడా, ఎవరూ చెప్పనివి మాకు తెలుస్తున్నాయి అని మా గ్రంథములకు విలువనిస్తూ వాటిని చదువుతుంటే మీరేమో రక్షకులమని చెప్పుకుంటూ హిందూమతాన్ని భక్షిస్తున్నారు. "శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా" అనే గ్రంథాన్ని మేము వ్రాస్తే దానిని చూసిన కొందరు ఒక పేజీ చదివి ఆ పేజీలో వేరే మతస్థులు మరియు కొందరు శ్రీకృష్ణున్ని, జారునిగా, చోరునిగా చిత్రీకరించారు అని మేము వ్రాసిన దానిని చూసి, పూర్తిగా చదువకుండానే కృష్ణున్ని గురించి తప్పుగా వ్రాశారు అని చెప్పి దాడి చేయడానికి కొందరు వచ్చారు. అయితే

మీ అందరూ మ్రొక్కుతున్నట్లే మేము కూడా కృష్ణున్ని ప్రతిమగా పెట్టి, గుడి కట్టి పూజిస్తున్నాము. అలాగే నరసింహస్వామి, కాళికాదేవిలాంటి వారిని కూడా మా గుడి దగ్గర పెట్టాము. కానీ ఎవరిని ఏ స్థాయిలో మ్రొక్కాలో అలాగే మ్రొక్కుతున్నాము. అదే మేము చెప్పే విషయాలు అర్థము చేసుకోకుండా ముందే దాడిచేస్తాను అని అనటం, ఇది హిందూమత రక్షణ అవుతుందా? భక్షణ అవుతుందా? మీరే అర్థము చేసుకోండి. మేము వ్రాసిన **"శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా"** అనే గ్రంథములో "శ్రీకృష్ణుని గురించి ఒక క్రైస్తవ ఫాదర్ హేళనంగా ఇట్లు మాట్లాడాడు అని మేము వ్రాస్తే ఆ వాక్యం ఎవరన్నారని మేము అన్నామా? ఆ వాక్యం పూర్తిగా చదువకుండా 'ఒక్క వాక్యాన్ని అండర్‌లైన్ చేసి ఒక వ్యక్తి కృష్ణుని గురించి మీరు హేళనగా వ్రాశారు అని అన్నాడు. కృష్ణుని గుడికట్టి పూజిస్తున్న మేము ఎట్లు అట్లా వ్రాస్తాము.

"ఋజుదర్శిని" అనే పుస్తకములో పరవస్తు సూర్య నారాయణ అనే బ్రాహ్మణుడు క్రైస్తవ మతంలోకి మారిపోయి ఆయన కృష్ణున్ని వ్యతిరికిస్తూ వ్రాసిన వాక్యాలకు కౌంటర్‌గా మేము వ్రాసినాము. ఆ విధంగా వ్రాయటం తప్పు అని వారికి మేము చెప్పాము. మీరెందుకు ఆ పనిని చేయలేక పోయారు? మీరు హిందూమత రక్షకులము అని చెప్పిన మీరు ఎందుకు అలా కృష్ణున్ని విమర్శించి వ్రాస్తే, ఏమి చేశారు మీరంతా. హైదరాబాద్ నగరంలో ప్రతీ గోడమీద క్రైస్తవులు "సృష్టికర్త కోడ్-666" అని వ్రాశారు. హిందూమత రక్షకులమని గొంతు చించుకునే వారందరికీ ఈ విషయం కనిపించలేదా. అలా వ్రాసిన గోడమీద దాని ప్రక్కనే "సృష్టికర్త కోడ్ 963" అని మేము వ్రాశాము. ఏ దేవునికీ విరుద్ధంగా మేము గ్రంథములు వ్రాయలేదు. హిందువులుగా మేము హిందువులను విమర్శిస్తూ వ్రాసిన

గ్రంథాలను చూస్తూ మీవలె మేము ఓర్చుకోకుండా ఈ విధంగా వ్రాయటం తప్పు అని మేము తిరిగి గ్రంథరూపంలో చెప్పటం జరిగింది. మేము చెప్పిన విషయాలను మూడు గంటల కాలమైనా ముస్లీమ్ వింటాడు, క్రైస్తవులు వింటాడు, హిందూ వింటాడు. మీరు 10 గంటల కాలమైనా చెప్పినా ఏ ముస్లీమ్ అయినా వింటాడేమో చూడండి. మీరంతా మేము ఎవరినైనా చంపేస్తాము, కొట్టేస్తాము హిందూమతాన్ని రక్షిస్తామంటూన్నారు కదా! మరి ఎందుకు క్రైస్తవులుగా చాలామంది మారిపోతున్నారు? ఎందుకంటే ఇందుత్వం అంటే ఏమిటో అర్థము కాలేదు. అటువంటి వారందరూ క్రైస్తవ మతములోకి వెళ్ళి పోయారు. మీరంతా అర్థములేని "హిందూ" అనే పదమును పెట్టుకున్నారు. మీరు అర్థమున్న "ఇందూ" అనే పదాన్ని పెట్టుకొండి 'ఇందూ' అనే పదాన్ని ఎవరూ వ్యతిరేఖించరు.

మా గ్రంథాలను ఎందరో వేలమంది చదివి మమ్మల్ని ఎంతో ప్రశంసిస్తూ, ఈ గ్రంథములు చదివితే మతము అనే విధానమే అక్కరలేదు అని అంటున్న వారంతా హి(ఇందువులు) కారా? మీరే స్వచ్ఛమైన హిందువులా? పోనీ మీకు హిందూ జ్ఞానం అంటే ఏదో తెలుసునా? ప్రతీ వ్యక్తి మాట్లాడుతూ ఉంటాడు. ఏ మాట మాట్లాడినా ఈ శాస్త్రం ఇట్లా చెపుతోంది అంటున్నారు. ఏ శాస్త్రం దాని పేరు ఏమిటి? అని మేము అడుగుచున్నాము. ఉండేవి షట్ శాస్త్రములు (ఆరు). ఆ ఆరింటిలో 4 శాస్త్రములు పూర్తిగా ప్రపంచమునకు సంబంచినవి. జ్యోతిష్య శాస్త్రము అనే ఐదవది ఇటు ప్రపంచమునకు, అటు ఆధ్యాత్మికతకు సంబంధించినది. ఇక ఆరవది మాత్రము స్వచ్ఛమైన దేవుని శాస్త్రము. మరి ఈ శాస్త్రము పేరు "బ్రహ్మవిద్యా శాస్త్రము". ఇదెక్కడ ఉన్నది భగవద్గీతలో ఉన్నది. బైబిల్‌లో ఉన్నది మరియు ఖురాన్‌లో ఉన్నది. మొదట ఐదు వేల సంవత్సరాల పూర్వం పుట్టింది భగవద్గీత.

ఈ రోజు మతమార్పిడి డబ్బుల కొరకు, పంచలు, చీరల కొరకే ప్రజలు ఇతర మతములలోనికి వెళ్తున్నారు. ఇంకొక మతస్థుడు తులం బంగారం ఇస్తే ఆ మతములోకి అంతా మారిపోతారు. లక్ష రూపాయల నగదు ఇస్తామని ఇంకొకడంటే అందులోకి పోతారు. వ్యక్తికి జ్ఞానము చెప్పి జ్ఞానిగా మార్చండి. అప్పుడు వాడు అన్ని మతాల్లోనూ ఒక్కటే జ్ఞానము ఉన్నది అని తెలుసుకుంటాడు. ఆ విధంగా తెలుసుకున్న వాడు ఇంకొక మతములోకి పోవాలి అని అనుకోడు. మీరు ఆ విధంగా చేయటం లేదు. మీకు ధర్మములు ఎన్నో తెలుసునా? అన్నింటిని మీరు ధర్మములనే అంటారు. యజ్ఞం చేస్తే ధర్మం అంటారు. తపం చేస్తే ధర్మము అంటారు. వేదం చదివితే ధర్మం అంటారు. దానం చేస్తే ధర్మం అంటారు. అసలు ధర్మములేవో తెలియదు. ఇవన్నీ చెప్తే మమ్మల్ని పర మతస్థులు అని అంటారు. ఇతర మతాలను వెనుక వేసుకుని వస్తున్నారు అని అంటారు. ఇప్పుడు ఎంతో మంది ముస్లీమ్‌లు మా దగ్గర ఉన్నారు. “ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ” వారు ఉన్నారు. ఏ ముస్లీమ్‌లు అయినా మేము చెప్పిన జ్ఞానాన్ని వ్యతిరేఖించాలంటే, దానికంటే ముందు వారి గ్రంథమైన ‘పవిత్ర ఖురాన్’ను వ్యతిరేఖించి రావలెను. ఎందుకంటే ఖురాన్‌లోనున్న అసలైన జ్ఞానాన్నే మేము చెప్తున్నాము.

దేవుని జ్ఞానమైన ఖురాన్ గ్రంథములో పొరపాట్లు లేవుగానీ మీరు అర్థము చేసుకునే దాంట్లో లోపము, పొరపాటు ఉంటే దానిని నేను సవరించి చెప్తాము. 81వ సూరాలో 27 ఆయత్‌లో ఏముంది, “సర్వ మానవులకు సంబంధించిన గ్రంథమిది” దీనిని ఎవరైనా తెలుసుకోవచ్చు. ఇది ఒక మతమునకు సంబంధించిన గ్రంథము కాదు, ఇస్లామ్ అనేది మతము కాదు. ఇస్లామ్ అనేది విశ్వంలో ఉన్న జ్ఞానము అని అర్థము. ఇందూ

అంటే జ్ఞానం అని అర్థము. ఇస్లామ్ అన్నా అదే అర్థము. దేవుని జ్ఞానము తెలుసుకున్న వాడు ఎవడైనా 'ఇందువే'. నేను ఇందువుని కాను అని ఏ ముస్లీమ్ అయినా అనగలడా అంటే 'ఇందూ' అనే పదమునకు అర్థము తెలియకపోతే అట్లే అనగలడు. మేము కాదు చాలామంది స్వామీజీలు 'హిందూ' అనే పదము అర్థము లేనిది అని ఒప్పుకున్నారు. కనుక జ్ఞానం తెలుసుకున్నవాడు ఎవడైనా 'ఇందువే' కనుక ముస్లీమ్ ఎవరైనా ఈ జ్ఞానము తెలుసుకుంటే ఆ ముస్లీమ్ నేను ఇందువునే అంటాడు. అలాగే నేను దేవుని మీద విశ్వాసం కలిగిన వ్యక్తినైతే, నేను విశ్వాసం కలిగిన అనే దానికి అర్థము తెలిసిన 'ముస్లీమ్' ను అని నేను చెప్పుకుంటాను. నేనూ ముస్లీమ్ అర్థము ప్రకారం ముస్లీమ్‌నే. నేను ఫలానా ముస్లీమ్ మతస్థుడిని అని చెప్పుకునేందుకు నేను ముస్లీమ్‌ను కాను. దేవుని జ్ఞానాన్ని అర్థము చేసుకున్నాను కనుక ఇందువును. దేవుని మీద ఎవరికైతే విశ్వాసం ఉందో వాడిని ముస్లీమ్ అనాలి కనుక నేను సంపూర్ణమైన ముస్లీమ్‌ని. దీనినిబట్టి ఇందువు ముస్లీమ్, ముస్లీమ్ ఇందువే. కనుక మీకు మేము ఇందువుగా కనిపిస్తాము, ముస్లీమ్‌గా కూడా కనిపిస్తాము.

మేము ఒకసారి వియజనగరం జిల్లాలో ప్రసంగించాము. అప్పుడు అక్కడకు కొందరు ముస్లీమ్ సోదరులు మమల్ని ముస్లీమ్ మతములోనికి రమ్మన్నారు. అప్పుడు నేను ఏమన్నానంటే మాకు రెండూ ఒకటేలాగ కనిపిస్తున్నవి. నాకు పూర్తిగా ఖురాన్ అవగాహన వచ్చిన తరువాత వస్తాను కానీ, నాకు చాలా సందేహాలు ఉన్నాయి. వాటిని మీరు నివృత్తి చేస్తే వస్తానన్నాను. అప్పుడు ఖురాన్ గ్రంథములో ఒక వాక్యాన్ని అడిగాము దానికి వివరణ అడిగాము. అప్పుడు వారు దానికి వివరం ఇవ్వలేదు. అందుకు ఆ ముస్లీమ్ పెద్ద అయినా రబ్బానీగారు ఒప్పుకున్నారు. తరువాత

www.thraithashakam.org

వాటికి ఇంటర్నెట్‌లో సమాధానం ఉందేమో చూసి చెప్తాము అన్నారు. సరే అని మేము అన్నాము. తరువాత మేము రెండు గంటల పాటు "మతాతీతం' గూర్చి ప్రసంగించాము. అందులో మేము ఏమి చెప్పామంటే ఎవరి మతములో వారు ఉండండి, జ్ఞానము తెలుసుకోండి. అన్ని మతాలు ఒకటై పోతాయి అని చెప్పాము. ఈ త్రైత సిద్ధాంతము బయటకు వచ్చిన తరువాత ఈ విషయాలన్నీ తెలుసుకోగల్గినారు. వాళ్ళందరికీ మతము కనిపించటం లేదు దేవుని మార్గం కనిపిస్తూ ఉంది. మతము కనిపించలేదు గానీ పథం కనిపిస్తూ ఉంది, కొందరు ముస్లీమ్ సోదరులు కూడా ఈ బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రాలను వారి వారి నుదుటిపైన ధరిస్తున్నారు. ఈ విధముగా అంతా ఐకమత్యంగా ఉండేందుకు ప్రయత్నిస్తున్నారు. భవిష్యత్తు అంధకారం అని ప్రపంచ సంబంధముగా చెప్పవచ్చును. కానీ జ్ఞానరీత్యా చెప్పుకుంటే, వేయి సంవత్సరాలకు అన్ని మతములు కలిసిపోతాయి. ఇప్పుడు మా మతము, మా మతము అని గొంతు చించుకున్న వారంతా ప్రజలచేతనే అణచివేయ బడతారు.

ఇప్పుడు ఖురాన్ గ్రంథములో ఒక వాక్యాన్ని గూర్చి వివరించు కుందాము. జిబ్రయేల్ దూత మనకు జ్ఞానాన్ని అందజేశాడు. 3వ సూరా ఆలీఇమ్రాన్‌లో 7వ ఆయత్‌లో ఒక వాక్యముంది. "మీ గురించి ఈ గ్రంథాన్ని అవతరింపజేసినవాడు అతడే. ఈ గ్రంథములో రెండు రకముల ఆయత్‌లు కలవు. మొదటివి, ముహ్కమాత్ అవి గ్రంథానికి పునాదులు వంటివి, రెండోది ముతషాబిహాత్ (అస్పష్టమైనవి) వక్ర మనస్కులు కలతలను రేపేందుకు ఎల్లప్పుడూ ముతషాబిహాత్ వెంటబడి వాటికి అర్థాలు తొడిగే ప్రయత్నం చేస్తారు. కానీ వాటి అసలు అర్థాలను అల్లాహ్ తప్ప మరెవ్వరూ ఎరుగరు" అయితే మరి ఈ విషయాలు ఎట్లు తెలుస్తాయి? అని ప్రశ్న

వేస్తే శ్రద్ధ, భక్తి ఉంటే అటువంటి వారు ఈ ముతషాబిహాత్ వాక్యాలకు అర్థములను గ్రహిస్తారు గ్రహించగల్గుతారు. అంటే ఒక విషయాన్ని చెప్తే అది మీ మెదడుకి ఎక్కితే అది గ్రహించడం అగును. మరి చెప్తే కదా! గ్రహించేది అని ప్రశ్నవేయవచ్చు. దేవుని విషయాలు దేవునికే తెలుసు అంటున్నారు. దేవుడు మాట్లాడడు అంటున్నారు మరి గ్రహించుకునేది ఎట్లా? అని ప్రశ్న వేయవచ్చును. దానికి సమాధానంగా ఖురాన్‌లోనే 42వ సూరా 51వ ఆయత్‌లో ఏమని చెప్పాడంటే "అల్లాహ్ ముఖాముఖిగా ఏ మానవునితోనూ మాట్లాడడు" అని ఉంది. నువ్వు 20 సంవత్సరాలు దీక్షగా ఉన్నా, ఖురాన్‌ను నేను చాలా విశ్వసిస్తున్నాను అని అన్నా గానీ, దేవుడు ఏ మానవునితోనూ ప్రత్యక్షంగా మాట్లాడడు. అయితే దేవుడు తెలియజేసే విధానాలు మూడున్నాయి.

ఒకటి వహీ ద్వారా (శబ్దం ద్వారా) అంటే ఎక్కడనుండో మాటలు వినిపిస్తాయి గానీ ఆ మాట్లాడేవాడు కనిపించడు. మొట్టమొదట ఈ వహీ ద్వారానే ఆయన (దేవుడు) జ్ఞానాన్ని తెలియజేశాడు. ఇక రెండవ విధానం తెరవెనుక నుండి అయినా చెప్పగలడు. అంటే ఒకడు తప్పక ఉంటాడు గానీ తెర ఒకటి అడ్డగా పెట్టి విషయాలను తెలియజేస్తాడు. వహీ (శబ్ద) విషయంలో ఆకాశము నుండి మాటలు వినిపిస్తాయి. అక్కడ వ్యక్తి ఉండడు. మాటే ఉంటుంది అది మొదటిది ఇప్పుడు రెండవది తెరవెనుకలో వ్యక్తి తప్పక ఉంటాడు కానీ తెర అడ్డు వలన కనిపించడు అని అర్థము చేసుకోవాలి ఇక మూడవ పద్ధతి తన ప్రతినిధిని పంపడం ద్వారా అల్లా తన సందేశాన్ని తెలియజేస్తాడు. ఈ మూడు విధానాల ప్రకారము దేవుడు తన జ్ఞానమును తెలియజేస్తాడు. అప్పుడు ఆ విషయాలలో ఎటువంటి బేధము ఉండదు. ఇప్పుడు శ్రద్ధ ఉన్నవాడు గ్రహించుకోగలడు అని

అన్నాము. ఎవరైనా ప్రత్యక్షంగా వచ్చి చెప్తే గ్రహించుకోగలం, ఏ మనిషీ చెప్పలేడు అని కూడా చెప్పుచున్నాము. ఇక్కడ తాను పంపిన వ్యక్తియే చెప్పగలడు. అప్పుడు నీవు శ్రద్ధకల్గితే గ్రహించగలవు. అలా కాకుండా మనుషులు మాత్రము చెప్పలేరు ఎందుకంటే అవి వారికి తెలియవు. తెరవెనుకనుండి చెప్తే అందరూ వినగలరా, వినలేరు. వహీ (శబ్దం) ఎక్కడో ఆకాశము నుండి చెప్పినా అందరూ వినలేరు. కానీ ఎదురుగా దేవుడు పంపిన దూత వచ్చి చెప్తే మాత్రము వినగలరందరూ. అయితే ముస్లీమ్‌లందరి అభిప్రాయం ఏమంటే ముహమ్మద్ ప్రవక్తే దూత అయితే కొందరు ముస్లీమ్‌లు మాత్రము దానిని ఒప్పుకోవటం లేదు. ఖురాన్‌లో దేవుడేమి చెప్పాడు? నేను పంపిన దూత మహోన్నతుడు. ఆయన చెప్పిన జ్ఞానాన్ని మీరు గ్రహించుకోవచ్చును అని చెప్పాడు. కానీ ముస్లీమ్‌లలో కొన్ని తెగలు దేవుడే గొప్పవాడు అని అంటున్నారు. వాస్తవమే దేవుడు గొప్పవాడే కానీ ఈ పై వాక్యం దేవుని దూత వస్తాడు. ఆయన మహోన్నతుడు, వివేకవంతుడు అంటే దేవుడు పంపిన దూతగా లెక్కించ వలెను. ఎందుకంటే దేవుడు వివేకవంతుడు అంటే దేవునికి గుణములున్నట్లు చెప్పినట్లు అవుతుంది. వివేకం, అవివేకం, తెలివి తక్కువ తనం, తెలివి ఎక్కువతనం అనేవి మనుషులకు ఉంటాయి గానీ దేవునికి కాదు కదా! అలా అయితే పైన మహోన్నతుడు, వివేకవంతుడు అనే మాటలు దేవుడు పంపిన దూతకు తగును. ఈ విధంగా ముహమ్మద్ ప్రవక్తగారు ముఖ్యులు అని చెప్పవచ్చును. దేవునికంటే ఉన్నతుడు ఎవరూ లేరుగానీ, మనకంటే ఉన్నతుడు మాత్రము ఉన్నాడు.

ఈ విధముగా ఒక తెగ ముస్లీమ్‌లు ప్రవక్తగారు ముఖ్యులే అని దర్గాలో ప్రార్థనలు చేస్తే, మరొక తెగ దేవుడు (అల్లా) తప్ప ఎవరూ గొప్ప

కాదని ఒక మినార్ కట్టి ప్రార్థన చేస్తున్నారు. ఈ చీలికలు దేవుడు ఒక్కడే అని చెప్పిన ముస్లీమ్ మతమే కాదు. అన్ని మతములలోనూ ఈ చీలికలు కలవు. అన్ని మతములలోనూ మాయ ప్రభావము కలదు. దేవుడు చెప్పిన భావము ఒకటైతే అది ఇంకొకరి దగ్గరనుండి మరి యొకని దగ్గరకు వచ్చినప్పుడు ఆ భావం మార్పు జరిగిపోయింది. బైబిల్‌లో ప్రేమ, దయ అనే పదములు లేవుగానీ ప్రేమ, దయ అనే పదములను ఎక్కువగా వాడుచున్నారు. దేవుడు లేదా ప్రభువు దయామయుడు మరియు ప్రేమమయుడు అని వ్రాసుకున్నారు. అక్కడ అసలైన పదం ఇష్టత, శ్రద్ధ అనే పదాలకు బదులు బైబిల్‌లో ప్రేమ, దయ అనే పదములు ఎక్కువగా వాడుచున్నారు. శ్రద్ధను ఇష్టము అని చెప్పవచ్చును. కానీ ఇష్టాన్ని వీరంతా ఏమన్నారు? ప్రేమ అన్నారు, కానీ ప్రేమ వేరు ఇష్టం వేరు ప్రేమ అనేది తలలో ఒక గుణము. దేవుడు ప్రేమమయుడు అని వ్రాస్తారు అది చాలా తప్పు. ఎందుకంటే ప్రేమ అనేది తలలో ఒక గుణము. ఆ గుణము దేవునికి ఉండదు. అజ్ఞానులు పై విధంగా దేవుడు ప్రేమమయుడు అని చెప్తారు అది తప్పు.

జ్ఞానం తెలుసుకున్న ఏ మతస్థుడైనా ఇందువే అగును. అప్పుడు అందరిదీ దేవుని మతమే అగును. కనుక ఖురాన్ గ్రంథము కూడా ఆ దేవుని గురించే చెప్పింది మరియు ఈ గ్రంథము సర్వమానవాళికి సంబంధించినది అని తెలుసుకొనవలెను. కనుక ఖురాన్ గ్రంథాన్ని అర్థము చేసుకోవటంలో తప్పులుంటే సరిదిద్దుకోవాలి. ఎక్కడైనా దేవుని జ్ఞానంలో ప్రశ్న ఉండదు. ఒకవేళ ప్రశ్న ఉన్నా జవాబు లేకపోతే మాత్రము అది దేవుని జ్ఞానము మాత్రము కాదు. ముతషాబిహాత్ వాక్యాలు మీకు అర్థము కావాలంటే దేవుడే చెప్పాలి. మరి దేవుడు ఎవ్వరితోనూ ముఖాముఖి

మాట్లాడడు అని అంటే తప్పకుండా ఆయన జ్ఞానం మూడు రకములుగా తెలియబడుతుంది అని అన్నాడు. ఒకటి వహీ, రెండు తెరవెనుక, మూడు దూత ద్వారా మరి మహమ్మద్ ప్రవక్తగారికి జ్ఞానం తెరవెనుక అనే పద్ధతి ద్వారా తెలిసింది. మహమ్మద్ ప్రవక్తగారికి ఈ జ్ఞానమంతా 23 సంవత్సరాలు తెరవెనుక నుండే వారమునకు ఒకసారో, నెలకొకసారో వినగలిగాడు. ఎవరు చెప్తుంటే వినగలిగినాడో కానీ ఆ వ్యక్తి కనిపించలేదు. ఎందుకంటే తెర అడ్డుగా ఉన్నది. అగోచరంగా ఉండి చెప్పాడు. ఆ వ్యక్తి ఎవరు అంటే జిబ్రయేల్ 'ఓ ప్రవక్తా వినుము' అని చెప్తూ వచ్చాడు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు 'ఓ అర్జునా వినము' అన్నట్లు ఇక్కడ జిబ్రేయల్‌కు దేవుడు వహీ ద్వారా తెల్పిన జ్ఞానం సంపూర్ణంగా తెలుసు. ఆ విధంగా జిబ్రయేల్ చెప్పిన జ్ఞానం తేడా లేకుండా మహమ్మద్ ప్రవక్తకు అందజేశాడు. అయితే ఆయన చెప్పిన జ్ఞానాన్ని అర్థము చేసుకోవటంలోనూ, అనువాదం చేసుకోవటంలోనూ రకరకములైన భావములు మారిపోయి అర్థము లోపం వస్తే మాత్రము దేవుడు ప్రత్యక్షంగా రాడుగానీ పరోక్షంగా వస్తాడు. దూతగా వచ్చి చెప్తే అప్పుడు అర్థమవుతుంది. దేవుని జ్ఞానం, సర్వదా నీకు అందుతూనే ఉంటుంది. మహమ్మద్ ప్రవక్తగారు ఇప్పుడు లేడు కదా! మరి ఎట్లు తెలుస్తుంది? అని అనుకోవద్దండి. నీకు విశ్వాసం ఉంటే నీకు ప్రక్కనే ఉండి చెప్తాడు. ఎట్లు చెప్తాడు మూడు రకములుగా ఎట్లైనా చెప్పగలడు. ఫలానా విధంగా నాకు తెలియజేస్తాడు అని మాత్రము నీకు తెలియదు. కనుక నీవు జ్ఞానం పైన శ్రద్ధ పెట్టుకో తప్పకుండా నీకు జ్ఞానం తెలుస్తుంది. దేవుని అంశ, దేవుని శక్తి జన్మ తీసుకుని కూడా మీకు జ్ఞానం తెలియజేయగలదు. మీతో మాట్లాడగలదు. కనుక ఇప్పటికైనా జ్ఞానము తెలుసుకోవటానికి శ్రద్ధ వహించండి.

# 63. ఏది ధర్మం?

తేది : 27-01-2013

దేవుడు చెప్పిన విషయాలు ఎప్పుడైనా శాస్త్రబద్ధముగా ఉంటాయి. ఎందుకనగా! అవి బ్రహ్మవిద్యాశాస్త్రానుసారం ఉంటాయి. ఇక్కడ బ్రహ్మ అంటే 'గొప్ప' అనే అర్థము తీసుకోవలెను. బ్రహ్మ అంటే నాలుగు తలకాయలుండే బ్రహ్మ అని మాత్రము అనుకోవద్దండి. మిగతా శాస్త్రముల కంటే ఈ శాస్త్రము పెద్దదైనది. గణిత, ఖగోళ, రసాయన, భౌతిక, జ్యోతిష్య మరియు బ్రహ్మవిద్యా శాస్త్రములు మొత్తము ఆరింటిలో మనము ఇప్పుడు మాట్లాడుచున్నది బ్రహ్మ విద్యాశాస్త్రం. మిగతా ఐదు శాస్త్రములు ప్రపంచ వరమముగా, స్థూలంగా సంబంధించిన విషయములను తెలియజేస్తాయి. వీటిని విద్యాలయములలో నేర్పుతారు. కానీ ఇవన్నీ చిన్న విద్యలు కొంత ప్రపంచం గురించి, మరికొంత దేవుని గురించి నేర్పే శాస్త్రము ఉంది దానిని జ్యోతిష్య శాస్త్రం అంటారు. కొందరు దీనిని శాస్త్రం అంటే మరికొందరు శాస్త్రము కాదంటారు. అర్థము చేసుకోగలిగితే అది శాస్త్రమే. బ్రహ్మవిద్యా శాస్త్రం ఒకటుంది అది పూర్తిగా దేవుని గురించి నేర్పే శాస్త్రం. జ్యోతిష్య శాస్త్రమే అర్థము కానప్పుడు బ్రహ్మవిద్యా శాస్త్రము ఇంకేమి అర్థమవుతుంది? పెద్దపెద్ద గడ్డాలు పెంచుకుని, జడలు పెంచుకుని, ఎన్నెన్నో తిప్పలు పడుతున్నారు కానీ బ్రహ్మవిద్యా శాస్త్రము మాత్రము ఏమీ అర్థము కావటం లేదు. మీరు స్వామీజీలందరినీ అవమానపరుస్తున్నారంటే, నేను స్వామీజీనే నేను మిమ్మల్ని ప్రశ్నిస్తున్నాను. శాస్త్రబద్ధముగా సమాధానం చెప్పండి. అశాస్త్రీయ పద్ధతిలో మీరు చెప్పవద్దండి. పురాణాలు తీసుకుని మీరు శాస్త్రమంటారు. అది ఎట్లాగ శాస్త్రమవుతుంది? ఉదాహరణకు కలెక్టర్ ఉద్యోగం ఉంది, జిల్లా పోలీస్ అధికారి ఉన్నారు. బిల్ కలెక్టర్ ఉద్యోగి

ఉన్నాడు అదే విధముగా పారిశుద్య కార్మికులు ఉన్నారు వారికి కూడా మున్సిపాలిటీలలో ఉద్యోగాలు ఉన్నాయి. ఇప్పుడు కలెక్టర్ ఉద్యోగం చేసేవాడు బిల్‌కలెక్టర్ ఉద్యోగం చేయడు. ఈ విధంగా ఎవరి ఉద్యోగం వారు చేస్తారు. ఎవరి హోదా వారికే ఉంటుంది అట్లాగే పురాణాలు, శాస్త్రాలు కలవు. అట్లాగే మనిషికి ఒక్కొక్కరికి ఒక్కొక్క దైవశక్తి కలదు. కొద్దిగా జ్ఞానశక్తి ఉన్నవారిని మహర్షి అన్నారు. ఇంకొద్దిగా శక్తి ఉన్నవారిని రాజర్షి అన్నారు. దానికంటే గొప్పశక్తి ఉన్నవారిని దేవర్షి అని ఇంకా గొప్ప దైవ శక్తి ఉన్నవారిని బ్రహ్మర్షి అన్నారు. ఏ శక్తి లేనటువంటి వారిని బేవర్షి అన్నారు. బ్రహ్మవిద్యా శాస్త్రము అయిన భగవద్గీతను నేర్చుకున్న తరువాత ఏ శాస్త్రమూ ఇక రుచించదు. దాని హోదా దానికి ఉంది. బ్రహ్మవిద్యా శాస్త్రములో సారాంశం గ్రహించిన తరువాత దానిని అనుసరించే ఏ మనిషైనా ఉంటాడు, దానిని అతిక్రమించి ఉండలేడు. జిల్లా పోలీస్ అధికారి వెళ్ళి పారిశుద్యము పనిచేసి నేను జిల్లా పోలీస్ అధికారిని అని అనుకోగలడా!

అదే విధముగా భగవద్గీత సారాంశం బాగా తెలుసు అనుకొని, పది పదిహేను రోజులు సాగదీసి ఉపన్యాసం చెప్పేవారున్నారు. వినేవారికి ఆనందముగా వినేటట్లు చెప్పేవారున్నారు. ఈ విధముగా చెప్పిచెప్పి పది హేను రోజుల తరువాత మరలా ఆంజనేయస్వామి గుడికి పోతే ఏమయినట్లు? కలెక్టర్ వెళ్ళి రోడ్డుమీద కసు ఊడ్చినట్లు ఉంటుంది అని చెపాల్సి వస్తుంది. "యాన్తి దేవవ్రతాన్ దేవాన్" నీవు ఏ దేవతను కొలిస్తే ఆ దేవతల లోపలికే పోతావు అని చెప్పాడు. పితృదేవతలను పూచించేవాడు పితృ దేవతలలోకే చేరుతాడు. భూత, పిశాచాలను పూజ చేసేవాడు వారిలోకే పోతాడుగానీ నావద్దకు చేరలేడు అని చెప్పినాడు. **"నన్ను ఆరాధించేవాడు**

www.thraithashakam.org

**మాత్రమే నా వద్దకు చేరును"** అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పలేదా? ఈ విషయాలన్నీ మీ ఉపన్యాసాలలో చెప్పి మరలా మరో దేవతను ఆరాధిస్తే, దేవుని హోదాకు భంగం కలిగించినట్లు అగును. ఈ రోజు స్వామీజీలని పేరుపొందిన వారు అందరూ అధర్మయుక్తంగా నడుస్తున్నారు. ఇందూ ధర్మములకు వ్యతిరేఖముగా నడుస్తున్నారు అని వారి పైన దావా వేయవచ్చు. చెప్పేదొకటి చేసేదొకటి, భగవద్గీత గొప్పది దాని గొప్పతనాన్ని చాటి చెప్పిన తరువాత మరల మరొక పని చేస్తే వినేవారు కూడా అదే పనిని చేస్తారు. మనము పురాణాలకు, ఇతిహాసాలకు విలువనిస్తునాము. ఎంత వరకు విలువ ఇవ్వాలి? అనే విషయానికి ఉదాహరణ చెప్పుకుంటే, చిన్నపిల్లాడికి గేటుదాటి వెళ్ళకు అని చెప్పేందుకు అసత్యము ఒకటి చెప్తాము, అదేమంటే "నీవు గేట్ దాటి వెళ్ళావంటే అక్కడ బయట ఒక బూచాడు ఉన్నాడు వాడికి చాలా పొడవు గోర్లు ఉన్నాయి. వాడు నిన్ను ఎత్తుకు పోతాడు, నిన్ను మింగేస్తాడు" అని చెప్తాము. అప్పుడు ఆ చిన్నపిల్లాడు బయటకు వెళ్తే నన్నెవడో ఎత్తుకు పోతాడు, నన్ను మింగేస్తాడు అనే భయముతో బయటకు వెళ్ళకుండా ఉంటాడు. నిజంగా ప్రమాదం జరిగే అవకాశము గేటు దాటి వెళ్తే ఉన్ననూ, వాడికి దాని గురించి అట్లాగే చెప్తే అర్థము కాదు కనుక వాడికి ఏ విధముగా అర్థమవుతుందో ఆ విధంగా బూచోడు అని చెప్తాము. నిజంగా బూచోడు అనేవాడు లేడు.

అదే విధముగా ఏమాత్రము దైవజ్ఞానము గూర్చి తెలియని వారికి పురాణాలు చెప్పాలి, కథలు చెప్పాలి తరువాత జ్ఞానమార్గంలోకి తీసుకుని రావాలి అప్పుడు భగవద్గీతను బోధించాలి ఉన్నత స్థాయిలో ఉన్నది ఆ భగవద్గీత, ఆ స్థాయికి వెళ్ళిన తరువాత తక్కువ స్థాయికి మరి రాకూడదు.

కానీ మాకు తెలిసినది మీకేమీ తెలియదని చెప్పి, పైది కిందకి, క్రిందది పైకి చెప్పి, నేయిని ఎక్కువగా తిని మెదడు బాగా వికసించినట్లుగా చేసుకొని, మాకంటే మీ అందరూ తక్కువ అని మాట్లాడుచున్నారు. మీరంతా భగవద్గీతను పూర్తిగా చదివిన తరువాత ఏ విధముగా మీరు ఇంకొక దేవతను ఎట్లా పూజిస్తున్నారు? భగవద్గీతలో ఇంకో దేవతను పూజించమని చెప్పాడా? నేను గొప్పవాడ్ని అని దేవుడు చెప్పుకున్నాడు... నాకంటే గొప్ప ఎవరూ లేరు అని చెప్పినాడు. ఈ విషయాన్ని నీవు చదువక ముందు ఏమైనా చేసుకో ఫరవాలేదు. కానీ నీవు చదివి ఇతరులకు చెప్పిన తరువాత నీవు ఏమి చేస్తున్నావు? నేను కలెక్టర్‌ని, నా హెూదా ఇది అని చెప్పుకున్న తరువాత బజారులో చెత్త ఊడ్చితే ఏమంటారు? ఈయన కలెక్టర్ కాదు కనీసము బిల్‌కలెక్టర్ కూడా కాదు అంటారు.

స్వామీజీలు వారు ఏది చెప్తే అది జరుగుతుందని తమ్ముతాము మరచిపోయి భగవద్గీతను చిన్నబరుస్తున్నారు. నేనొక హిందువుగా ఏమి చెప్తున్నానంటే మీరంతా ఇందూ ధర్మాలను మీరు కాపాడటం లేదు. ఇందూ ధర్మాలను కించ బరుస్తున్నారు. కొందరికి సిద్ధాంతకర్తలంటే తెలియదు, గురువులు అంటే తెలియదు. యోగులు అంటే తెలియదు. ఇక బ్రహ్మర్షులు, దేవర్షులు, రాజర్షులు వాటి అర్థాలే తెలియవు. కానీ హిందువులం, హిందూమతాన్ని కాపాడుతాము అంటారు. హిందుత్వము అంటే ఏదో తెలిస్తే కదా! నీవు దానిని కాపాడేది. హిందూ ధర్మాలు ఏవో నీకు తెలిస్తే కదా! కాపాడేది. ఈ విధముగా చెప్తూ ఉంటే అసూయతో చెప్తున్నారంటారు. అయితే భగవద్గీతను ఆధారంగా శ్లోకములను అనుసరించి చెప్పాము జ్ఞానయోగము 7, 8 శ్లోకాలలో...

www.thraithashakam.org

శ్లో॥ యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥

**"ఎప్పుడైతే ధర్మాలకు ముప్పు కలుగుతుందో, అధర్మాలు ఎప్పుడు చెలరేగుతాయో అప్పుడు నన్ను నేను సృజించుకుని భూమిమీదకు వస్తానన్నాడు."** అందుకే దేవుడు ఎవ్వరికీ కొడుకు కాదుగానీ అందరికీ తండ్రి. అందుకే ఆయనే నన్ను నేను సృజించుకుంటాను "సృజామ్యహమ్" అని అన్నాడు. ఆయన తనను సృజించుకుని ఏమి చేస్తాడు అంటే...

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతాం।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥

సాధు జనులను సంరక్షించి దుష్టజనులను లేకుండా చేస్తానన్నాడు. ఇది మంచి పాయింట్. అయితే సాధుజనులెవరు, దుష్టజనులెవరు. భగవద్గీతలో ఇంకా ఏమి చెప్పాడంటే జనులు వారివారి పాపపుణ్యములను అనుసరించి వారు పుడుచున్నారు. కర్మానుసారం గుణాలు ఉన్నాయి, గుణాలను గురించి వాడు ప్రవర్తిస్తుంటాడు వారి గత జన్మలలో చేసుకున్న కర్మప్రకారము వారు దుర్మార్గుడుగానో, సన్మార్గుడుగానో ఉంటాడు దానిని ఎవరూ రూపుమాపలేరు. కర్మప్రకారం వారు నడుస్తున్నారు. కావున ఎవరినీ మంచివారు అనను, చెడ్డవారు అనీ అనను అని దేవుడంటున్నాడు. వాడు చేసే పనులను ఏమీ అనకూడదుగానీ వాడి కర్మను మాత్రము ఏదైనా చేయాలి. వాడి కర్మను వాడే పోగుట్టుకోవాలి. వాడి కర్మ (పాప, పుణ్య) ఎట్లా పోతుంది? అంటే ఒక జ్ఞానం వలన మాత్రమే పోతుంది అని దేవుడు చెప్పాడు. ఇప్పుడు మంచివారిని కాపాడి చెడ్డవారిని చంపేస్తానని అని చెప్పాడు కదా! అంటే అట్లా చెప్పలేదు. అట్లా చెప్పాడు అంటే విరుద్ధముగా

చెప్పినట్లే కానీ దేవునికి తెలుసు మరియు ఆయనే చెప్పాడు ఎవరి కర్మానుసారం చెడ్డవాడిగానైనా, మంచివాడినైనా ఉంటాడు అని ఆ కర్మానుసారం నీ లోపలున్న ఆత్మ నడిపిస్తూ ఉంది. దేవుడు సాక్షీభూతుడై చూస్తున్నాడు.

ఒక హత్యను మనము చూసాం అనుకుందాము. అందులో హత్య చేసేవాడు చేస్తున్నది చెడ్డపనే, వాడు చెడ్డవాడే గానీ అదే హత్య చేయబడే వాడు చేసుకున్న గత జన్మల కర్మ (పాప) ప్రకారము వాడు హత్య కావింపబడ వలసిందే. మనకు హత్య కనిపిస్తున్నది కానీ, హత్యకు కారణమైన హత్య చేయబడే వాని కర్మ కనిపించటం లేదు. హత్య చేసేవాడు కనిపిస్తున్నాడు గానీ, హత్య చేయటానికి గల కర్మమాత్రము కనిపించటం లేదు. కర్మ ప్రకారమే ప్రతీ పనీ జరుపబడుచున్నది. జ్ఞానరీత్యా ఇది మంచిది, ఇది చెడ్డ అని చెప్పలేము. నీవు ఎంత దుర్మార్గుడివైనా నా జ్ఞానాన్ని నువ్వు తెలుసుకుంటే నీ కర్మ నాశనమవుతుంది. ఇక్కడ భగవద్గీతలో కూడా ఆ పాపాన్ని నేను తీసేస్తాను అని చెప్పలేదు కానీ ఈ జ్ఞానాన్ని తెలుసుకో అప్పుడు నీ దుర్మార్గానికి కారణమైన కర్మపోతుంది అని చెప్పాడు. భగవద్గీతలో ఎవరు ఏ గుణంతో చెడ్డవాడిగా చనిపోతే చెడ్డవాని గానే మళ్ళీ జన్మలో పుట్టును అని చెప్పాడు భగవద్గీతలో, కారణం వాడు సంపాదించుకున్న కర్మయే. మరి అట్లాంటప్పుడు దేవుడు పుట్టగానే వాడి కర్మను లేకుండా చేయవచ్చును కదా! అంటే, భగవద్గీతలో ఎవ్వరి పాపాన్ని గానీ, పుణ్యాన్నిగాని నేను తీయను, తీసివేయబడదు అని చెప్పెను. కానీ నీ కర్మను నీవే తీసుకువేయగలవు. ఎట్లా అంటే జ్ఞానమార్గంలోకి వస్తే నీవు తీసివేసుకోగలవు. భయంకరమైన రోగాలున్నవారు నా వద్దకు వచ్చారు. రోగం ఉంది, ఉంటుంది. నీవు చేసుకున్న కార్య ఫలితం అది.

మరి కర్మను ఇప్పుడు అనుభవిస్తున్నావు. మందులు తినినా ఆ రోగం పోవటం లేదు అని కొందరంటారు. మందులు తీసుకున్న పోతుందని నమ్మకం ఏమీ లేదు. మరి ఇదే రోగం మరియొకనికి మందు తింటే పోయింది అంటే నీ కర్మ తినినా పోకుండా ఆ రోగంతో బాధపడేది ఉంది మరి నా సమస్యకు పరిష్కారం ఏమిటి? అంటే ఒక్కడే పరిష్కారం

శ్లో॥ యథైధాంసి సృమిద్ధోగ్ని భస్మాత్ కురుతేర్జున ।
జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా॥

అగ్నిలో కట్టెలు కాలిపోయినట్లు జ్ఞానాగ్నిలో సర్వకర్మలు భస్మం అయిపోతాయి అని దేవుడు చెప్పినాడుగానీ తను కర్మలను తీసివేస్తానని ఎక్కడా చెప్పలేదు. ఇక్కడ దుష్టులను చంపేస్తాను, శిష్టులను రక్షిస్తాను అని ఎందుకు చెప్తాడు? ఎవ్వరి కర్మ ప్రకారం వారలా దుష్టునిగానే ఉంటారు అని ఆయనే చెప్పి వారిని మరలా ఎందుకు చంపుతాడు? కానీ దేవుని అసలైన భావము అది కాదు అని తెలియుచున్నది. మీరంతా మంచివారు, చెడ్డవారు అని శ్లోకార్థం చెప్పుకుంటున్నారు. కాని ఆయన ఏమి చెప్పాడు ఎప్పుడైతే ధర్మములకు హాని కలుగుతుందో, అధర్మములు ఎప్పుడు చెలరేగుతాయో, ఎప్పుడు అధర్మవరుల సంఖ్య పెరిగిపోతుందో, ధర్మవరులు ఎప్పుడైతే తక్కువయిపోతారో, అప్పుడు నేను "ధర్మ సంస్థాప నార్థాయ" ధర్మములను స్థాపించి అధర్మవరులను లేకుండా చేస్తాను అన్నాడు. అంటే ధర్మములు ఉపదేశించి, స్థాపించితే తద్వారా అధర్మవరులు ధర్మవరులుగా మారుతారు. అప్పుడు అధర్మవరులు లేకుండా పోయినట్లే కదా! చెడ్డవారిని చంపేస్తా మంచి వారిని కాపాడుతా అని ఎక్కడైనా చెప్పాడా. ఒక మతములో చెప్తారు రక్తము చేత పాపము కడిగి

వేయబడుతుంది అని అది పొరపాటు. నా నిబంధన రక్తము చేత పాపము తొలిగించబడుతుంది” నా నిబంధన అనే బంధన లేనటువంటి జ్ఞానము అనే (రక్తముతో) దానితో నీ పాపం తొలిగివేయబడుతుంది అన్నాడు. కానీ అందరూ శరీర రక్తం అని అనుకుంటున్నారు. ఈ సూక్ష్మజ్ఞానం క్రైస్తవులకు అర్థము కాలేదు, హిందువులకు అర్థము కాలేదు.

ఇక్కడ ధర్మాలు, అధర్మాలు అనే అంశాన్ని తీసుకోగలిగితే, మంచి వారిని రక్షించటం, దుష్టులను శిక్షించటం అనే అర్థము ఆ శ్లోకములో (భగవద్గీత) లేదు. ధర్మములు మంచివి, అధర్మములు చెడ్డవి కాబట్టి అధర్మముల స్థానంలో ధర్మములు సంస్థాపన చేయుటకు వస్తాను అని చెప్పాడు. అయితే ఇప్పుడు ఎవరిని లేకుండా చేస్తానన్నాడు దేవుడు? అధర్మములను, అధర్మములు అనగా ఏవి? అంటే అందరూ ఏమనుకున్నా రంటే హత్యలు, ఖూనీలు, దొంగతనాలు చేసేవారిని అధర్మవరులు అని అనుకుంటున్నారు. కానీ ఇవన్నీ ప్రపంచవరమైన చెడ్డపనులవి. కాని అధర్మములు అంటే ఏవి. ధర్మములు అంటే ఏవి అనే విషయాలు ఎవ్వరికీ తెలియకుండా పోయాయి. అధర్మములు ఏవో మీకు తెలియనక్కర లేదు కానీ దేవుడు చెప్పిన ధర్మములైనా తెలుసునా మీకు? అవి భగవద్గీతలో ఉన్నాయి అవి తెలుసునా? అవి తెలియదు. మరి ధర్మములేవో, అధర్మము లేవో తెలియకుండానే భగవద్గీతను బోధిస్తున్నారా? 74వ గీతాయజ్ఞం, 108వ భగవద్గీతా యజ్ఞము అని చెప్పి గీతలను కాల్చేస్తున్నట్లు చెప్తున్నారు. ఎందుకంటే యజ్ఞము అంటే నాశనం అని అర్థము అని వీరికి తెలియదు. ఇప్పుడు మేము చెప్తే నిజమే అని అనుకుని కొందరు ఇప్పుడు ఆ యజ్ఞం అనే పదం వదలి గీతా ప్రవచనం అని వ్రాసుకుంటున్నారు. ఇటువంటి మార్పు రావడం సంతోషమే కానీ మన తండ్రి అయిన దేవుడు ధర్మములు

సంస్థాపన చేయడానికి వస్తానని అంటే కొడుకులుగా మనం దాని కొరకు కష్టపడాలి కదా! ధర్మములు అంటే ఏవో తెలుసుకోవాలి కదా! అవేవో మనకు తెలియకపోతే మిగతా వారికి ఏమి చెప్పగలము? కాబట్టి భగవద్గీతలో ధర్మములు ఏవో మనము తెలుసుకోగలిగితే దేవుడు వాటిని ఏ విధముగా సంరక్షణ చేస్తాడు? అధర్మాలను ఎలా లేకుండా చేస్తాడో అర్థమవుతుంది. ఇప్పుడు ఇందూ ధర్మపరిరక్షణ అని చెప్పి దేనిని మీరు రక్షిస్తున్నారు? ధర్మములు ఫలానా అని తెలిస్తే కదా! వాటిని రక్షించేది. నా భార్యను నేను కాపాడుకుంటాను అన్నట్లు ఉంది. మొదటికి నీకు పెళ్ళే కాలేదు, నీ భార్య ఎవరో తెలియదు. మరెట్లు రక్షిస్తావు నీ భార్యను? మొదట నీకు జ్ఞానం తెలిసియుంటే, ధర్మములు ఇట్లా ఉంటాయని తెలిస్తే అప్పుడు ధర్మములను ఆచరిస్తావు. ధర్మములేవో తెలియనప్పుడు ఎట్లు ఆచరిస్తావు? నేలవిడిచి సాము చేసినట్లు ఉంటుంది. నేల విడిచి సాము ఎవరూ చేయలేరు అది అసత్యము. మరి బాబాలని, స్వామీజీలని, బ్రహ్మర్షులని పేర్లు పెట్టుకున్న వారందరూ ఇట్లా చెప్తా ఉంటే, ఇవి ధర్మములు కావు అని ఎందుకు ప్రశ్నించలేక పోవుచున్నారు? మంచి పనులు చెడ్డపనులు అని చెప్తే అశాస్త్రీయమవుతుంది. ధర్మములు అధర్మములు అని చెప్తే శాస్త్రీయమవుతుంది. వారు చెప్పినదంతా స్వచ్ఛమైన జ్ఞానం అని అనుకుంటున్నారు మీరంతా.

ఇప్పుడు మేము చెప్తున్న విషయాలు విన్న కొందరికి పచ్చికారం నోట్లో వేస్తే మంటలు లేచినట్లు ఉంటుంది. నేను చెప్పే మాటలు ఆ విధముగానే ఉంటాయి కానీ సత్యం. భగవద్గీతలో చెప్పిన ధర్మములను మరలా చెప్పే నిమిత్తము మేము అట్లే చెప్పాలి. సత్యమే చెప్పాలి. ఎందుకు

చెప్పాలంటే మనము పుట్టాం, ఎప్పటికైనా చస్తాం. చచ్చేముందు మంచి పనులు చేస్తే ప్రపంచవరమైన మంచి అవుతుంది. జ్ఞానరీత్యా ధర్మములు తెలియజేస్తే అది దైవధర్మం అవుతుంది. భయం పరధర్మము కనుక మేము ధర్మములను భయం లేకుండా బోధిస్తున్నాము. ఇప్పుడు మేము "యధాయధాహి ధర్మస్య" శ్లోకంలో చెప్పిన అర్థము వాస్తవమా, కాదా చెప్పండి. మంచి పనులు, చెడ్డ పనులు కర్మానుసారం జరుగును అని భగవద్గీతలో చెప్పారు. అందులోనే మరలా ఏమి చెప్పెను? ధర్మములకు ముప్పుగల్గినపుడు అధర్మములు చెలరేగినప్పుడు ధర్మసంస్థాపన నిమిత్తం వస్తాను అని చెప్పాడుగానీ మంచి పనులు చేసే నిమిత్తము వస్తాను అని చెప్పలేదు. ఇంకా ఏమి చెప్పెను? నన్ను మీరు గొప్పగా పెట్టుకోండి, ఎల్లప్పుడూ నన్నే స్మరించండి "స్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ" అన్నాడు. భగవద్గీతలో అర్జునునితో అక్షర పరబ్రహ్మ యోగము, ఒక శ్లోకములో ఇట్లా అంటాడు...

శ్లో॥ అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్।
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

అంత్యకాలములో నన్నే స్మరించుచూ దేహమును విడిచినవాడు నాలో ఐక్యమగును. ఈ విషయములో ఏ అనుమానము లేదు. అయితే దేవునిలోకి ఐక్యమవ్వాలంటే చనిపోయేముందు స్మరించుకుంటే సరిపోతుంది కదా! అని అనుకుంటారు. అందుకు అలా అనుకోకుండా ఇంకా ఏమి చెప్పుచున్నాడంటే...

శ్లో॥ యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్ ।
తం తమేవైతి కౌన్తేయ! సదా తద్భావ భావితః ॥

www.thraithashakam.org

ఎవరెవరు ఏయే భావంతో చనిపోతారో ఆ భావాన్నే తప్పక పొందుతాడు. ఎందుకంటే, వాడికి ముందునుండి ఏ అభ్యాసంగా ఉందో అదే పొందుతాడు. నీకు దేవుడు, భక్తి, జ్ఞానము అనే భావము ఉంటే అదే కలుగుతుంది. ప్రపంచవరమైన అభ్యాసాలు ఉంటే ఆ భావాలే కలుగుతాయి కాబట్టి...

"తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ"

అన్ని కాలములలోనూ ప్రతి క్షణము నన్నే స్మరించుము.

"మయ్యర్పిత మనోబుద్ధి ర్మామే వైష్యస్య సంశయః"

నీ బుద్ధిని నాయందే స్థిరముగా ఉంచుకో. ఎల్లప్పుడూ నన్నే స్మరించుకో. అప్పుడు చివరిలో (మరణం) నేనే జ్ఞాపకం వస్తాను. అంటే ధర్మములు స్మరణంలోకి ఎల్లప్పుడూ ఉంటే, ధర్మములతోనే మరలా జన్మిస్తావు. అధర్మములనే మనస్సులో స్మరిస్తుంటే అధర్మాలతోనే నీవు మరలా పుట్టెదవు. కనుక దేవుని ధ్యాస ధర్మములపైన ఆధారపడును. అయితే ధర్మములు ఏవి? అంటే ఏవైతే నావద్దకు మిమ్మల్ని చేరుస్తున్నవో అవే ధర్మములు. భగవద్గీతలో 5150 సంవత్సరాల పూర్వము భగవంతుడు అయిన కృష్ణుడు ఈ ధర్మములను తెలియజేశాడు. ధర్మములు మనుషులెవ్వరూ చెప్పలేరు అని దేవుడు చెప్పినాడు. మరి దేవుడు ఆ ధర్మాలను చెప్పాలంటే దూత ద్వారా తెలియజేయబడుతుంది. దేవుడు పంపిన దూత కృష్ణుడు, అంటే క్రైస్తవులు అందరికీ కడుపులో మంట. అలా కాకుండా కొద్దిగా ముందుకు వెళ్ళి ప్రభువు చెప్పినది వాస్తవమైన జ్ఞానము ఆయన దేవుడు పంపిన దూత అంటే హిందువులందరికీ గొప్ప కోపం వస్తుంది. మీరు పరమతం గురించి బోధిస్తున్నారు అంటారు. అంటే

భగవంతుడెవరో తెలియలేదు. దేవుడుగా ధర్మములను చెప్పాడు కనుక, (దూతగా) భగవంతునిగా వచ్చి ధర్మములను తెలియజేయును. ఇక్కడ దేవుడు వేరు భగవంతుడు వేరు అని గ్రహించవలెను.

భగవద్గీత హిందువులకు ప్రామాణిక గ్రంథము అని కొందరు చెప్తున్నారు అది వాస్తవమే. మరి ప్రామాణిక గ్రంథమైతే ఎందుకు మీరు వినటం లేదు? వినినా అందులో ధర్మములను ఎందుకు గ్రహించలేదు? ధర్మములను అధర్మములను ఒక డబ్బాలో వేసి అల్లాడించి ఏది వస్తే అది ధర్మమనడమేనా? భగవద్గీతలో అక్షర పరబ్రహ్మ యోగమను అధ్యాయములో చివరి శ్లోకాన్ని చూస్తే...

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥

భావము :- వేదముల వలనగానీ, యజ్ఞములవలనగానీ, తపస్సుల వలన గానీ, దానముల వలనగానీ వచ్చిన పుణ్యయ ఫలాన్ని అతిక్రమించి, జ్ఞానియై నా పరమపదమును చేరగలడు. ఇప్పుడు మా అందరినీ కించపరచేందుకు వేదాలు, యజ్ఞాలు, దానాలు, తపములు చేయవద్దని, తద్వారా దేవునివద్దకు చేరలేరని చెప్తున్నారు అంటే, నేనేమీ చెప్పలేదు భగవద్గీతలో కృష్ణుడు చెప్పినాడు. హిందూమతములో వేదాలు, యజ్ఞాలు, దానాలు, తపములు ముఖ్యము కదా! అంటే మీకు ముఖ్యమని ఎవరు చెప్పారు? దేవుడు భగవద్గీతలో అవి ముఖ్యమని చెప్పలేదు. దీనికింకా సాక్ష్యం కావాలంటే విశ్వరూప సందర్శన యోగములో విశ్వరూపం చూపించక ముందు కృష్ణుడు ఏమి చెప్పినాడంటే...

www.thraithashakam.org

శ్లో॥ న వేదయజ్ఞాధ్య యనైర్న దానైర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।
ఏవం రూపః శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥

**భావము :- వేదాల వలనగానీ, యజ్ఞాలవలనగానీ, దానాల వలనగానీ, ఉగ్రమైన తపములు వలనగానీ నేను తెలియబడను. నా రూపాన్ని చూచుటకు శక్యము కాదు."**

కొంత కాలానికి నేను వస్తాను అధర్మములివి అని చెప్పెదను. అప్పటికే మీరు వాటికి బాగా అలవాటుపడతారు. అప్పుడు ఇవన్నీ అధర్మములు అని చెప్పవలసిన పరిస్థితి వస్తుంది ఇంకా భగవద్గీతలో ఏమి చెప్పు చున్నాడంటే...

శ్లో॥ నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్యం ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥

**భావము :-** తపస్సుల చేతగానీ, దానముల చేతగానీ, వేదముల వలనగానీ, యజ్ఞముల వలనగానీ ఈ రూపము అవగతము కాదు. సరళంగా నాలుగు అధర్మములేవో తెలియజేశాడు. ధర్మములు తెలియాలంటే అధర్మములను తీసి ప్రక్కకు పెట్టవలసిందే, అప్పుడు భగవంతుడు వచ్చినట్లే. అలా వచ్చినట్లు ద్వాపరయుగములో తెలుస్తున్నది. ద్వాపరయుగములో ఇవన్నీ అనగా వేదాధ్యయనాలు, యజ్ఞాలు, దానాలు తపములు చేస్తున్నవారు చాలామంది ఉన్నారు, కనుకనే అప్పుడే భగవంతునిగా కృష్ణుడు వచ్చి ఇవి అధర్మములు అని తెలియజెప్పాడు. దానిని ఇప్పుడు మనము జ్ఞాపకం చేసుకుంటున్నాము. త్రేతాయుగము కాలములో రావణబ్రహ్మ కూడా ఈ వేదాలు, యజ్ఞాలు దానాలు, తపముల వలన దేవుడు తెలియబడడని చెప్తే ఎవరూ వినలేదు సరికదా! వీరందరినీ రాక్షసులు అన్నారు. ఇప్పుడు ఈ విధముగా చెప్తున్న మమ్మల్ని ఇప్పుడు పెద్ద రాక్షసుడు అంటారేమో!

సనాతన ధర్మములు అంటే ఏవో తెలుసునా? మీరు అనుకున్నవి కావు. సనాతన ధర్మములు అంటే భగవద్గీతలో చెప్పిన కర్మ, భక్తి, జ్ఞాన యోగములు. మీ అందరూ అధర్మములను సనాతనం అంటున్నారు. భగవద్గీతను ప్రామాణికంగా తీసుకుని సనాతన ధర్మములు ఏవో చెప్ప మనండి. మాకెందుకులే ఎవరి బ్రతుకు తెరువు వారిది అని మేము గొంతు విప్పలేదు కానీ, మీరు శృతిమించి పోతున్నారు. భగవద్గీతను ఇళ్ళలో పెట్టవద్దు అంటారు. తద్వారా పోట్లాటలు వస్తున్నాయి అంటున్నారు. ఆ విధముగా బయటపడేస్తుంటే వాటిని మేము తెచ్చుకున్నాము. ఇంట్లో పెట్టుకున్నాము. ఒక పెద్ద వ్యక్తి ఒక ఇంటికి వెళ్ళి భగవద్గీతను బోధిస్తున్న చిత్రాన్ని చాలా పనితనంతో చేసిన ఆ ఫోటోను చూపి, ఆ ఇంటి వారితో మీరు తెలియక ఆ ఫోటో ఇంటిలో పెట్టి ఉంటారు. ఇప్పటికైనా తప్పులేదు దానిని తీసుకుని ఏదైనా దేవాలయంలో పెట్టేయండి అన్నాడు. ఎందుకంటే ఎప్పటికైనా భగవద్గీతను చదివేస్తారేమోనని అసూయతో అలా అన్నాడు. ఇవన్నీ అధర్మాలు అని తెలిసి పోతాయేమోనని భగవద్గీతను చదవవద్దండి అని చెప్పారు. భగవద్గీతకు ఒకవేళ పూజచేస్తే చేసుకోండి కానీ చదవవద్దండి. ఒకవేళ చదివితే భగవద్గీత మహత్యం చదువుకోండి. ఈ విధంగా మభ్యపెట్టారు. కనుక ఇప్పటికి ధర్మములేవి అధర్మములేవి అనేది మీకు కొంత అవగాహన అయిందని భావిస్తున్నాము.

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

# ప్రసిద్ధి బోధ

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

